# విషయసూచిక

## ఆదిపర్వము

విషయము. పుట.

---

## సభాపర్వము

విషయము. పుట.





సకలఋషిగణశరణ్యంబును బుణ్యక్షేత్రంబును నగు నైమిశారణ్యమునఁ గులపతి యగు శౌనకమహాముని యనేకమహర్షులతోఁ గూడి పండ్రెండువత్సరములకు ముగియు సత్త్రయాగము సలుపుచుండ నచ్చోటికి రోమహర్షునిపుత్త్రుండును, సకలపురాణముల నెఱింగినవాఁడును, నుగ్రశ్రవసుం డను సూతుఁడు చనుదెంచెను. అప్పు డా సూతుం డచ్చోట నున్నవారలకును, నితిహాసములను వినఁగోరి యచ్చోటి కేతెంచి యున్న మఱికొందఱకును, సవినయముగఁ జేతులు జోడించి నమస్కరించి గౌరవింపఁగా, వా రందఱును సూతుని రాకకుఁ బరమానందమునఁ బొదలిరి. అంత నాతండు తపస్సు నిర్విఘ్నముగ సాగుచున్నదా యని వారిని బ్రశ్నించెను. పదంపడి వారందఱు నుచితాసనాసీనులు కాఁగా వారియనుమతిం గొని తానును గూర్చుండెను. అప్పుడు శౌనకమహామునిని ముం దిడుకొని యితరమహర్షులు సూతుని నిట్లు

---

మిత్యువాచ జనార్దనః. మమైవ త్వం తవైవాహం యే మదీయా స్తవైవ తే, యస్త్వాం ద్వేష్టి స మాం ద్వేష్టి యస్త్వామను స మామను. నరస్త్వమసి దుర్ధర్ష హరి ర్నారాయణో హ్యహమ్, కాలే లోక మిమం ప్రాప్తౌ నరనారాయణావృషీ." (అరణ్య పర్వము, అధ్యా. ౧౨, శ్లో. ౪౫,౪౬,౪౭). ఇట్లే ఉద్యోగపర్వము, అధ్యా. ౪౯, శ్లో. ౭,౮,౨౦,౨౨ నందును చెప్పఁబడియున్నది. ఈ నరనారాయణులే నిష్కామకర్మప్రధాన మగు నారాయణీయమును (భాగవతధర్మమును) లోకమునఁ బ్రవర్తింపఁ జేసిరి. కావున భాగవతధర్మములను బోధించునన్ని గ్రంథములలోను నారంభమున వీరినే నమస్కరింతురు. ఇంకను వీరికథయే ముఖ్యముగాఁ గలదైన భారతగ్రంథారంభమున వీరిని నమస్కరించుట ముఖ్యము. ఆవశ్యకము నని వేఱుగఁ జెప్పవలయునా? మహాభారతమును పూర్వులు జయ మని పేర్కొనిరి. శ్లో. "భ్రూణహత్యాకృతం చాపి పాపం జహ్యా దసంశయమ్, ఇతిహాసమిమం శ్రుత్వా పురుషోఽపి సుదారుణః. ముచ్యతే సర్వపాపేభ్యో రాహుణా చంద్రమా యథా, జయో నామేతిహాసోఽయం శ్రోతవ్యో విజిగీషుణా." అది పర్వము, అ. ౬౨, శ్లో. ౧౯,౨౦) భారత మను పేరుతోఁ బ్రఖ్యాతమైయుండు నీ ఇతిహాసము జయ మనుటకు శ్లో. "అష్టాదశపురాణాని రామస్య చరితం తథా, కార్ష్ణం వేదః పంచమశ్చ యం మహాభారతం విదుః. జయేతి నామ్నా త్యేతాంస్తు ప్రవదన్తి మనీషిణః" (భవిష్యత్పురాణవచనము) శ్లో. "చతుర్ణాం పురుషార్థానామపి హేతు ర్జయో మతః" (కోశము.)

చినయంతట సూతునకుఁ దీఱుటను తెలిసినవారై యాతనివలనఁ బుణ్యకథలు వినఁగోరి యాతనితో నిట్లు లనిరి. "ఓసూతనందనా! యెక్కడనుండి వచ్చుచున్నవాఁడవు? నీరాకచే మేము కృతార్థులమైతిమి. నీవలన నేవేని పుణ్యకథల వినఁగోరుచున్నవారము." అని యడుగ నాతం డిట్లనియె. "ఓమహాత్ములారా! భూలోకమునఁ బరీక్షిత్సుతుం డగు జనమేజయుఁడు సలిపిన సర్పయాగమున ఋషివర్యుండగు వేదవ్యాసుఁడు రచించినమహాభారతమునందలి కథలను నాతనిశిష్యుండగు వైశంపాయనుం డనుమునివర్యుండు వివరింప విని, పెక్కుతీర్థములు సేవించి, పాండవులకును ధార్తరాష్ట్రులకును సంగరంగం బగుశమంతకపంచకమను పుణ్యభూమిని దర్శించి మిమ్ముఁ గనుఁగొనఁ నిందుల కేతెంచితిని. ఈయాగశాలలో సూర్యాగ్నులతో నెన యగుతేజస్వులును, బరమపుణ్యమూర్తులును నగువా రందఱును దమతమ తపస్సులను నిర్విఘ్నముగ నాచరించుచు సుస్థితులుగ నున్నవారలు గాదె? నావలన నెద్ది వినఁగోరెదరు? ధర్మార్థములతోఁ గూడుకొనియుండు నేయితిహాసములను, నేరాజులయాఖ్యానంబులను, నేమహాత్ములమహిమలను జెప్పవాఁడ నానతిం" డనిన మును లిట్లనిరి.

"ఓసూతుఁడా! ఏయది జనమేజయుఁ డాచరించుచుండిన సర్పయాగకాలమునందు వేదవ్యాసానుమతింబడసి యాతని శిష్యుండగు వైశంపాయనునిచే వివరింపఁబడినదో; ఎద్ది వ్యాసమహర్షిప్రణీతమైనదో; ఎయ్యది యనేకవేదశాస్త్రములను నీతిసారములను దెల్పునో; దేనిని వినిన బాపములు శమించునో; ఏది యిహపరసాధకమో, దేనిని వినుటచే ధర్మములు సమకూడునో యట్టి శ్రీమహాభారతసత్కథను వినవలతు" మనిరి. అప్పుడు సూతుం డాదిపురుషుండును, నీశ్వరుండును, యజ్ఞభోక్తయును, నానావేదములచే స్తుతింపఁబడువాఁడును, సత్యుండును, నేకాక్షరుండును, వ్యాపకుండును, బ్రహ్మస్వరూపుండును, వ్యక్తావ్యక్తుండును, సనాతనుండును, విశ్వపరాత్పరుండును, సదసత్తులకుఁ బరుండును, సర్వమును సృష్టించినవాఁడును, పురాణుండును, పరుండును, నవ్యయుండును, మంగళములు సేయువాఁడును, మంగళస్వరూపుండును, యజ్ఞాత్మకుండును, వరేణ్యుండును, ననఘుండును, స్వభావశుద్ధుం

డును, జరాచరములకు గురుండును, సర్వే త్రిగుణనియామకుండును, జననమరణస్వరూపమైన సంసారము నివర్తింపఁ జేయువాఁడును నగు పురుషోత్తమునకు నమస్కరించి, భగవంతుఁడును, నిరతిశయతేజోవంతుఁడును, శ్రీమహాభారతసత్కథారచయితయునగు వేదవ్యాసునకుఁ బ్రణామిల్లి యామహనీయునికృపచే జగదీశ్వరుం డగు శ్రీమన్నారాయణుని కథను నిట్లని చెప్పందొడంగెను.

ఓమునిశ్రేష్ఠులారా! సావధానులరై వినుండు. సర్వపుణ్యభూముల మెట్టుటయు, సర్వపవిత్రతీర్థస్నానాచరణంబును శ్రీమన్నారాయణుని పుణ్యకథవినుటకు సరి గానేరవు. నారాయణునికథ వినుటవలనఁ గలుగుఫలము నితరమగు నెద్దానను నరుఁడు పొందలేఁడు. భగవత్కథ విన్న వర్తమానకాలములలో శ్రీమన్నారాయణునకు సమానుండు లేఁ డను సత్యవాక్యమును నుడువునంతమాత్రమున సర్వార్థంబులను మనుజుఁడు సాధింపఁగలఁడు. అట్టి లోకోత్తరపురుషునికథ శ్రీమహాభారతము నుడువుచున్నది. కావున నిప్పుడు మీ కిష్టమగు నామహాభారతపుణ్యకథను జెప్పెద. అయ్యది త్రికాలములయందును బ్రచారమునుబడసియుండును. మఱియు నీయితిహాసము నిఖిలజ్ఞానసాధకము; సకలవేదార్థసారము; సర్వలక్షణసమన్వితము; సకలార్థప్రదాయకము; సందర్భోచితములగు నవ సుశబ్దములతో నలంకరింపఁబడినది. విద్వాంసులకుఁ బ్రీతిం గల్గించు నానావిధఛందోవృత్తములతోఁ గూడి మిక్కిలి నుతి కెక్కియుండును.

( పూర్వకాలమునందు మహనీయుం డగుకృష్ణద్వైపాయనుండు వేదములను నాల్గుగ విభజించి కొండొకకాలమునకు, హిమవత్పర్వత ప్రాంతమున కేగి యామహాగిరిగుహాలయం బొక్కప్రదేశమున శుద్ధుండై దర్భాసనము వైచికొని దానిపైఁ గూర్చుండి పరమశాంతమూర్తియై, నియమముతోఁ దపం బాచరించుచుండ నాకాలమున నామహనీయుని సచ్చారిత్రవిశేషంబునం జేసి యాతనికి దివ్యదృష్టి గలిగెను. అప్పు డాదివ్యజ్ఞానంబున నాపుణ్యాత్మునకు సృష్టిమొదలు బ్రహ్మాండంబును, సమస్తమునకుఁ గారణభూతుం డగుపరబ్రహ్మయును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, వారియంశములయందుఁ బుట్టినవారును, మనువులును,

వసువులును, నేకాదశరుద్రులును, సూర్యచంద్రాదులును, సప్తర్షులును, రాజర్షులును, బంచమహాభూతములును, దదంశసంభూతము లైన సకలచరాచరవస్తుజాలములును, వేదములును, వేదాంతములును, సర్వోపనిషత్తులును, సకలేతిహాసములును, బురాణములును, ధర్మార్థకామశాస్త్రములును, బుణ్యాత్ములగు భూసురులును, ధర్మపరు లగుక్షత్రియులును, సంవత్సరములును, మాసములును, ఋతువులును, బక్షములును, నహోరాత్రములును, బ్రపంచలక్షణముగల సకలవిషయములును గోచరింపఁగాఁ దత్పూర్వము తనకుఁ బల్లి యగుసత్యవతియును, గాంగేయుండును ననుమతినేయ విచిత్రవీర్యునిభార్య లగుఅంబికాంబాలికలయందుఁ ద్రేతాగ్నులవలెఁ బుట్టించిన పుత్త్రులగు ధృతరాష్ట్రపాండురాజవిదురులు, వృద్ధులై మరణించినవెనుక సర్వవేదార్థముల సంక్షేపముగ నిమిడ్చి విద్వాంసులమనంబు లానందమునం దోలలాడ నీమహాభారతేతిహాసమును రచియించెను.

ఇట్టి మహాగ్రంథమును వెల్లడిపఱచి ప్రపంచమున నుండు జనులచే నెట్లు చదివించువాఁడ నను తలంపుతో నాలోచించుచుండ, లోకపితామహుఁడు బ్రహ్మదేవుండు బాదరాయణునికడ కేతెంచెను. అప్పు డామునివర్యుండు పరమేష్ఠిం గని లేచి నిలుచుండి యమ్మహానీయునకు సాష్టాంగనమస్కారము లాచరించి యాసనము నొసంగఁగాఁ బితామహుండు నాసనాసీనుండై తన చెంగటఁ గృష్ణద్వైపాయనునిఁ గూర్చుండుమని సెలవొసంగెను. అప్పుడు వేదవ్యాసుండు పరమేష్ఠితో సవినయముగా నిట్లని వచించె. "మహానుభావా! నేను సకలవేదవేదాంతపురాణేతిహాసములను సంగ్రహించి యిమ్మహాభారత మను నితిహాసమును రచించితిని. కాని, దీనిని లోకులు చదివి యానందించుటను వ్రాత వ్రాయువాఁ డొకఁడును నాకుఁ గానరాఁ" డని విన్నవించెను. అంత నా నలుమొగంబులవేల్పు "ఓసాత్యవతేయా! నీజ్ఞానంబు నే నేమని చెప్పువాఁడ! సప్తర్షులలో నొక్కండై యతులతపఃప్రభావంబునం జేసి పరిశుద్ధుండైన వసిష్ఠునికంటె సకల వేదవేదాంతరహస్యభావముల నెఱుంగుటలో నీవు శ్రేష్ఠుండవు. నీవు పుట్టినది మొదలు నీ వాడు మాట లన్నియును పరబ్రహ్మ యాథార్థ్యంబును నిరూపించు ననియు, సత్యము లనియు నే నెఱుంగుదు. అటులుండ నీవు రచించిన యీ మహా

భారతేతిహాసమును ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రమనియు, అధ్యాత్మవిదులు వేదాంతమనియు, నితిహాసవేత్త లితిహాసమనియుఁ, బౌరాణికులు బహుపురాణ సముచ్చయమనియు, కవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు లక్ష్యసంగ్రహమనియుఁ గొనియాడుట యొకయద్భుతంబె. ఇట్టి చతురవస్తునలచే నొప్పు నీగ్రంథరాజము మహాకావ్య మనబడెంగాక! ఆశ్రమధర్మములలో నితరములగు నాశ్రమధర్మములు గృహస్థాశ్రమము నతిక్రమింపఁజాలనట్లు లోకమున కవుల కావ్యములు నీకావ్యమును మించఁజాలవు. దీనిని వ్రాయుటకు విఘ్నేశ్వరుని బ్రార్థింపు మని పలికి పితామహుండు చనియెను. అంతఁ గృష్ణద్వైపాయనుండు గణపతిని ధ్యానింపఁగా నాదేవుం డాఋషిసన్నిధిఁ బ్రత్యక్షమయ్యెను. పారాశర్యుండు నావిఘ్నరాజుం బూజించి యాసనమిచ్చి సమాసీనుం జేసి యిట్లనియె. "లంబోదరా! నేను మనస్సునం దొకగ్రంథమును రచించి యున్నవాఁడ. నీవా గ్రంథమును నేను జెప్పుచుండఁగా లేఖినిఁ గొని పత్రములపై వ్రాయ వేఁడెద." అని ప్రార్థింపఁగా నాసురశ్రేష్ఠుం డమ్మునిశ్రేష్ఠున కిట్లనియె. "ఋషివర్యా! నీవుకోరినందులకు వ్రాయుదును, గాని నేను వ్రాయుచుండఁగా నా లేఖిని యొకక్షణమైనను నిలుపుటకు వీలుగాకుండ, నీ వాశుధారగా గ్రంథమును జెప్పుచుండవలయును. ఈయేర్పాటున కొడంబడియెద వేని నీప్రార్థన నంగీకరించెద" నని తెలిపెను. అది విని సాత్యవతేయుండు "నేను గావ్యమును జెప్పుచుండఁగా నీవు వ్రాయుచునే శ్లోకార్థమును బోధచేసికొనుచుండవలయును" అనిపలుక వినాయకుం డందులకొప్పుకొనెను. ఇట్లు గణపతి యొడంబడఁగా, వ్యాసుండు హర్షించి లక్షశ్లోకములతో నొప్పారు నీయితిహాసమును జెప్పుచు వ్రాయించెను. పిదప దీనిని నారదుఁడు దేవలోకమునను, అసితుండగు దేవలుండు పితృలోకమునను, శుకమహర్షి గంధర్వాదిలోకములయందును, వైశంపాయనుండు భూలోకమునందు జనమేజయుఁ డాచరించిన సర్పయాగకాలమునను జెప్పిరి. అట్లు వ్యాసప్రణీతమైన యీ పవిత్రమగు మహాభారతేతిహాసము సర్వలోకములయందుఁ బ్రశస్తిఁ జెందెను.

ఈగొప్పయితిహాసమునందుఁ గురువంశవిస్తారమును, గాంధారియొక్క ధర్మశీలత్వమును, విదురుని ప్రజ్ఞయు, గుంతీదేవి ధైర్యమును

వాసుదేవుని మాహాత్మ్యంబును, పాండుకుమారుల సత్యనిరతియును, దుర్యోధనాదుల దుర్వృత్తమును, వేదములు నాల్గింటియొక్కయు, ఉపనిషత్తులయొక్కయు పరమార్థరహస్యములును, నింకను ననేక పుణ్యతీర్థములయొక్కయు, మహాపర్వతములయొక్కయు వర్ణనలును విశేషంబుగ నిరూపింపఁబడెను.

ఈ గ్రంథరాజమున నెనిమిదివేల నెనమన్నూరుశ్లోకముల భావము వేదవ్యాసుఁడును నాతనిపుత్త్రుం డగు శుకమహర్షియుం దప్ప నితరుల కెవ్వరికిని దెలియదనియు, సంజయునకుఁ దెలియునో తెలియదో సందేహమనియును వేదవ్యాసులే చెప్పియున్నారు. మహానుభావుం డగు వినాయకుండు వ్రాయుచుండునపుడు ప్రతిశ్లోకార్థము నాలోచించి గ్రహించినఁగాని వ్రాయుట లేదఁట. లోకమంతయు జడాంధబధిరోన్మత్తతమోభూయిష్టంబై యున్నయది. ఆ తమము జ్ఞానాగ్నిచేఁ బ్రకాశింపఁజేయంబడి యావలికిఁ దనంతఁ దొలఁగుచున్నది. కావున జ్ఞానముచేఁ దెలివిని వికసింపఁజేసి యజ్ఞానమను చీఁకటిని నావలికి నెట్టవలయును. అంతియగాక యీమహాభారత మను భానుండు ధర్మార్థకామమోక్షములను సకలపురుషార్థముల తెఱం గెఱింగించి లోకుల తమోగుణ మను నంధకారమును దొలఁగఁద్రోలును. మఱియును భారత మను చంద్రుండు వేదార్థరహస్యములను వెన్నెలలచే వెలువఱిచి లోకుల బుద్ధులను వికసింపఁజేసెను. భారత మను దీపకళిక ప్రపంచ మను నంతర్గృహంబు సొచ్చి యచ్చోటు నావరించి యుండు మోహమును నావలికి నెట్టి దేదీప్యమానమై ప్రకాశించును. ఈపవిత్రగ్రంథమునకుఁ గొందఱు "నారాయణంనమస్కృత్య" యనుశ్లోకమును బఠింతురు. మఱికొందఱు "శౌనకః- కిమర్థం రాజశార్దూల స రాజా జనమేజయః, సర్పసత్రేణ సర్పాణాం గతోఽన్తం తద్వదస్వ మే" అను ఆస్తికపర్వాదిశ్లోకమును బఠింతురు. ఇంకను కొందఱు "వైశంపాయనః— రాజోపరిచరో నామ ధర్మనిత్యో మహీపతిః" అను నఱువదిమూఁడవయధ్యాయము ప్రారంభమున నుపరిచరవసుచరిత్రమును జదువుదురు. ఈవిధమున సర్వలక్షణములతోఁ గూడిన యీభారతేతిహాసగ్రంథరాజము సకలజనులచే నుతింపఁబడుచు దేవలోకమునందలి కల్పసాలంబుమాడ్కిఁ జెన్నారుచున్నది. ఈగ్రంథ

ములో వచ్చుపురుషులలో దుర్యోధనుండు క్రోధరూపవృక్షముగను, కర్ణుండు వృక్షముయొక్క మధ్యభాగముగను, శకుని యాచెట్టుకొమ్మగను, దుశ్శాసనుండు ఫలములు పుష్పములుగను, జీఁడు రాజు చెట్టువేళ్ళుగను నిరూపింపఁబడి యున్నారు. ధర్మపుత్త్రుండు ధర్మమయమగు పారిజాతవృక్షముగను, నర్జునుండా చెట్టునకు మధ్యముగను, భీమసేనుండు దాని కొమ్మగను, నకులసహదేవులు పుష్పఫలములుగను, శ్రీకృష్ణభగవానుఁడు వేదములును భూసురులును మూలముగను భావింపఁబడియున్నారు. తొలుత నీమహాభారతేతిహాసమును సంగ్రహముగా నుడివి పిదప విస్తరించి విపులముగాఁ జెప్పుటకుఁ బూనెనని చెప్పి సూతుం డిట్లనియె.

ఈ భారతగ్రంథము పుణ్యకర్ములచరిత్ర గలదై లక్షశ్లోకములతో నలరారుచున్నది. ఈలక్షశ్లోకములును ఉపాఖ్యానసమేతములు. ఉపాఖ్యానములు గాక భారతకథమాత్రము ఇరువదినాల్గువేలశ్లోకములతోఁ జెప్పఁబడి యున్నది. పర్వాంతపర్వముల ననుక్రమణికాధ్యాయపర్వమును బాదరాయణుఁడు రచించి మొదట గ్రంథము నంతను బుత్త్రుఁడగు శుకున కుపదేశించి చెప్పెను. ఈగ్రంథరాజ మపరిమితమైన శ్లోకములతో రచింపఁబడినది. అందు ముప్పదిలక్షల శ్లోకములతో విరాజిల్లు గ్రంథము దేవలోకమున నారదుండు ప్రచురపఱచెను. పితృలోకమునకుఁ జేసినభారతగ్రంథము పదునైదులక్షల శ్లోకములు గలదై యది యాలోకమున నసితుండైన దేవలునిచేఁ బ్రకటితమైనది. గంధర్వయక్షరాక్షసలోకమునకుఁగాను గావింపఁబడిన భారతగ్రంథము పదునాల్గులక్షల శ్లోకములతోఁ గూడి యాలోకములలో శుకమహర్షిచే వెలువరింపఁబడినది. మనుష్యలోకప్రచారమునకుగా నీమహాభారతము లక్షశ్లోకములలో నిమిడ్చి యద్దాని నీలోకంబున వైశంపాయనునిఁ బ్రకటింపుమని నిర్దేశింపఁగా నమ్మహర్షి దీనిని జనమేజయుఁడు గావించుచున్న సర్పయాగకాలములో వెలువఱింప నద్దానిని విని నే నిచ్చోటి కేతెంచితి. ఇట్లీగ్రంథరాజము నాల్గువిధములుగా నలువదిలక్షల శ్లోకములతో శ్రీకృష్ణద్వైపాయనుండు రచియించెను.

## భారతకథాసంగ్రహము

పాండురాజు నిజవీర్యముచేతను, బుద్ధిచేతను నానాదేశములను గెలిచి రాజ్యమును వృద్ధిపఱిచి, భూమండలమును ధర్మమార్గమునఁ బాలించుచుండెను. అంత నా రాజొక్కనాఁడు వేఁటనిమిత్త మరణ్యమునకుఁ బోయి యచట నొక ప్రదేశమున నొక మహర్షి మృగరూపధరుండై యొంటిగనుండి తనభార్యతో సంగమించుచుండ వానిని యథార్థమృగముగాఁ దలంచి బాణముతోఁ గొట్టెను. అంత నాముని యాయేటునకు మరణావస్థ నొంది "ఓ రాజా! నీవును స్త్రీతో సంగమింప నారంభింపఁగనే చచ్చెద" వని శపించెను. అంతఁ బాండురాజు శాపమునకు భీతుండై వనమునందే వసించుచుండెను. అప్పు డారాజుభార్యలగు కుంతి, మాద్రి యనువారలు నైత మాతనితో నాయరణ్యాశ్రమములలో వసించుచుండిరి. వారిలోఁ గుంతిదేవికి నామె చిఱుత ప్రాయంబునఁ బుట్టినింట నుండఁగా దుర్వాసుఁ డుపదేశించిన మంత్రప్రభావంబున ధర్మదేవతయనుగ్రహంబున యుధిష్ఠిరుఁడును, వాయుప్రసాదంబున భీమసేనుండును, నింద్రునివలన నర్జునుండును, దుర్వాసుండు తన కుపదేశించిన మంత్రమును గుంతి మాద్రికి నుపదేశించుటచే నాదేవియందు దేవవైద్యులగు నశ్వినీదేవతలవలన నకుల సహదేవులును బుట్టిరి. ఇట్లైదుగురు కొమారులును దల్లులచేతను నాశ్రమవాసు లగు తాపసులచేతను బోషింపఁబడుచుఁ గ్రమంబునఁ బెద్దవారగుచుండిరి. ఇట్లుండఁ బాండురాజు శతశృంగం బను ప్రదేశంబున మాద్రితో విహరించుచు నద్దేవి శృంగారలావణ్యంబుల కోడి యగ్గలంబైన మదనవికారంబునం బడి, యామెను గవిసి మునిశాపంబుచే కాలధర్మము నొందెను. పదంపడి యచ్చోటిమునులు యుధిష్ఠిరాదులగు నైదుగురుకొమాళ్లనుదోడ్కొని హస్తినాపురమునం దున్నధృతరాష్ట్రుసాలికి వచ్చి వారిం జూపి "వీరు పాండురాజపుత్త్రులు, బాలురు, సుందరాకారులు, జడలు దాల్చి బ్రాహ్మణవేషధారులై బ్రహ్మచర్యమును జలుపుచున్నవారు. నీవు వీరి యందుఁ బుత్త్రవాత్సల్యమును నెఱపుము. స్నేహమ్ముం జూపుము" అని చెప్పి వారంతర్హితులైరి. అంతఁ గౌరవులలోఁ గొందఱును బురజనులు

గొందఱును, నీ బాలురరాకకు సంతసించిరి. మఱికొందఱు వీరు పాండు
పుత్త్రులు కారనిరి. ఇంక కొందఱు పాండురాజునకుఁ బుత్త్రు లెందుఁ
గలరు? ఆతండు మృతుండై పెద్దకాలం బగు. ఈబాలు రెవ్వరో యని
సంశయించిరి. ఇవ్విధంబున నొకటికొక మాటగాఁ జెప్పుచుండ సర్వభూ
తంబులును నేరికిం గానరాక వీరు నిక్కువంబుగఁ బాండురాజపుత్త్రులే
యనియు, వీరి నవశ్యము గారవింపవలయుననియు నంతట వినఁబడినట్లు
చెప్పఁగా ధృతరాష్ట్రుండు వారిం జేఁదీసి పురజనుల కోలాహలమధ్యం
బున వివిధవాద్యశుభధ్వనులు నింగి ముట్టఁ గాఁ జనఁగఁ బ్రవేశింప
నియ్యకొనెను. అంత నారాజపుత్త్రులును క్రమంబుగ క్షత్త్రియోచిత
సంస్కారములను బొంది, వేదశాస్త్రాదివిద్యల నేర్చి ధనుర్విద్యయందుఁ
బ్రసిద్ధులై యెల్లవారికిఁ బ్రీతిపాత్త్రులై మెలఁగుచుండిరి. అప్పుడు
పురజనులును, నగరఁగల రాజబంధువులును యుధిష్ఠిరుని శీలము
నకు, భీమసేనుని ధైర్యసాహసంబులకు, నర్జునుని పరాక్రమమునకు
నకులసహదేవుల వినయగాంభీర్యములకుఁ, గుంతీదేవి శుశ్రూషాపరాయ
ణత్వమునకు మనంబుల నలరి వారియెడఁ బ్రీతులై యుండిరి. అంతఁ
బాంచాలరాజపుత్త్రి స్వయంవరము రాజలోకమునఁ జాటింపఁ
బడఁగా నాస్వయంవరకాలమున నర్జునుండు సకలరాజలోకమధ్య
మున మత్స్యయంత్రమును దన ధనుర్విద్యానైపుణ్యంబునఁ దెగనేసి
కన్యను బరిగ్రహించె. నాటంగోలె నర్జునుండు రాజులలో మేటిధాను
ష్కుండను ప్రఖ్యాతిఁ బొంది యాదిత్యులలో విష్ణువునట్లు
తేజస్వియై విరాజిల్లెను. విలువిద్యయం దితరులకు సాధ్యముకాని నైపు
ణ్యమును గాన్పించుచుండ నర్జునుండు రాజకుమారులలో వాసికెక్కి
యుండె. ఇట్లు భుజపరాక్రమదర్పవినయాదులం బ్రసిద్ధులైన భీమా
ర్జున నకుల సహదేవులు శీలమును సదాచారప్రవృత్తియును, ధర్మ
వేత్తృత్వమును గల జ్యేష్ఠుఁడగు యుధిష్ఠిరునకుఁ గూర్పువారై మెలం
గుచు సకలదేశముల రాజులం గెలిచి కానుకలం దెచ్చి యన్న
పాదంబుల సమర్పించుచుండ, నతఁడు రాజసూయయాగము నుపక్ర
మించి తమ్ము లోడించిన నానాదేశరాజులు కప్పములు కానుకలు గొని
రాఁగా మహావిభవంబుతో నారాజసూయంబు నన్నినాళ్లు ననేకభూసు

రులను మృష్టాన్నంబునను భూరిదక్షిణలం దనిపి, యాగసభకు వేదవ్యా
సుండు సభ్యుఁడుగా, శ్రీమన్నారాయణుని యపరావతారంబైన శ్రీవాసు
దేవుండు భర్తయును భోక్తయునుగా జన్నము సర్వలక్షణసమన్వితంబుగా
నాచరించెను. రాజసూయయాగము నుపక్రమించుటకుఁ బూర్వము
వాసుదేవుసహాయంబున భీమసేనుండు బలపరాక్రమశాలి యగు జరా
సంధుని మల్లయుద్ధమున నోడించి వధించెను. యాగకాలమున దుష్టుం
డగు శిశుపాలుని దేవకీనందనుండు స్వయముగాఁ గీటడంగించెను.
ఇంకను నర్జున నకుల సహదేవులు పెక్కుఱు రాజుల నోడించి వారిచే
మణికనకవస్తువాహనముల నసంఖ్యములుగాఁ గొని తెచ్చి యుధిష్ఠిరు
భాండాగారమును నింపిరి. ఇట్టి యుధిష్ఠిరుసంపద కోర్వలేక ధృతరాష్ట్ర
పుత్త్రులగు దుర్యోధన దుశ్శాసనాదులు వారియెడ నసూయాపరులై
వర్తింప నారంభించిరి. రాజసూయయాగకాలమునందు యుధిష్ఠిరు
మహావిభవమును జూడలేక యసహిష్ణులైరి. మఱియు నాయుధిష్ఠిరు
మహాసభయందు దుర్యోధనుండు పెక్కుబన్నములకుఁ బాల్పడెను. నానా
దేశాధిపతులు ఘనమాతంగతురంగములను, కాంచనాదిలోహములను,
నమూల్యంబులైన మణులను, సాగరజనితంబులగు దక్షిణావర్తశంఖ
ములను, చిత్రవిచిత్రములగు మేలైనకంబళములను, ననేక దాసదాసీ
జనంబులను ధర్మజునకుఁ గానుకలుగా నొసంగిరి. ఈవైభవము నంతను
జూచుచుండిన దుర్యోధనుండు యుధిష్ఠిరాదులపై నీర్ష్య జనింపఁ దండ్రి
యగు ధృతరాష్ట్రునితోఁ దనమనోవేదన నంతను నివేదించి వారిసంపద
నంతను దానపహరించికొనుట కొకయుపాయం బూహించి యంధునకుఁ
దండ్రిచే ననుమతిం బడసి ద్యూతంబున సకలమాయోపాయంబులఁ
బన్నువాఁడగు తనమేనమామ శకుని తనకు సాయపడ ధర్మరాజును
ద్యూతంబున నోడించి యాతని సర్వసంపదలను సకలమహీరాజ్యమును
నాచికొనితుదకుఁ దమ్ములును భార్యయును వెంటరా నతనిఁ బండ్రెండేండ్లు
వనవాసమును నొక్కయేఁ డజ్ఞాతవాసమును జేయుటకు సమయ మేర్ప
ఱచి పంపెను. పదంపడి వారు సమయవత్సరములఁ బూర్తిఁజేసి వాసు
దేవుని దుర్యోధనసభకు రాయబారిగాఁ బంపి తమమహీరాజ్యభాగము

నిమ్మనంగా నన్నాను దుర్యోధనుండు భగవంతుండగు వాసుదేవుమహిమను బ్రాకృతుండై తెలియక యావమానీయున కొగ్గొనరించెను. మఱియును నాసంధిసమయమున సుయోధనునకు రాజబంధువులగు భీష్మవిదురాది వృద్ధులును, కృపాచార్యద్రోణాచార్యాదిగురువులును, నారదాది మహాత్ములును నెన్నియేని హితవచనము లాడి వాసుదేవుసంధికార్యమునకు ననుకూలుండవు మనంగా నాదురాత్ముండు వారి సందటిం దూఱ నాడెను. అంత వాసుదేవుండు, కినుకం బూని పాండవుల సమాగమునకుం బురికొల్పి హాస్తినాపురిపై నెత్తి విడియుటకు సమకట్టింపం దొడఁగెఁ గురు క్షేత్రంబున ధార్తరాష్ట్రపాండవులకు మహాసమరము ప్రవర్తిల్లెను. ఆ సమరంబున నుభయపార్శ్వములయందును మేటివిలుకాండ్రును మహావీరులు నగుయోధులు ననేకులు మడిసిరి. కొనకుం బాండవులు రణరంగమున దుర్యోధనాదుల నోడించిరి. దుర్యోధనుండు తననూర్గురు తమ్ములతోను దనకుం దోడుతనుండియు నీసును బెంచిన కర్ణశకునులతోను వీరస్వర్గము నొందెను. అంత ధృతరాష్ట్రుండు, పాండవులవిజయమును, దనకొడుకుల పరాజయమును జావును విని దుర్జనులగు దుర్యోధన శకుని కర్ణుల దురాలోచనంబువలం గాదె యింత వుట్టె నని యాత్మగతంబునం జింతించి సూతుండును దన కార్యంబునను భృత్యుండును నగు సంజయుం జేరి వానితో నిట్లనియె.

సంజయా! వినుము. నీవు మేధావివి. పెద్దలచే మెప్పుఁబొందినవాఁడవు. నా కీయుద్ధము సమ్మతమైనది కానేరదు. ఈకులకలహమునకు నామనసొప్పుటలేదు. నాకు నాపుత్త్రులయెడ విశేషప్రీతియుం బాండుపుత్త్రులయెడఁ బ్రీతి లేమియును లేదు. అసూయాపరులును గ్రోధమూర్తులును నగునాపుత్త్రులు నన్నాదరించి వర్తించుచుండినను నే నంధుండనై యుండుటచేఁ బుత్త్రులయందుఁ దండ్రికుండు సహజప్రేమంబున వారియపరాధముల నోర్చియుండుదు. రాజసూయయాగకాలమునందుఁ బాండవుల సంపదను, వారి మహోన్నతిం జూచియుఁ దానాసభలో నవమానపడుట గాంచియు దుర్యోధనుండు కనలి పాండవులతో యుద్ధమునకుం బూని వారిని గెలువ నేరక శకుని కైతవంబున దుర్ద్యూతం బాడుట నింతటి హానిం జెందెను. మఱియు నీసందర్భములలో నాయభిప్రాయం

బెట్లుండెనో, వినుము. ఓసూతపుత్రా! వింటివేని నాకుఁ జర్మ
చక్షుస్సులు లేకున్నను బ్రజ్ఞాచక్షుస్సుఁ గలవానిగా గుర్తింతువు.
కవ్వడి మత్స్యయంత్రమును దెగనేసి పాంచాలిఁ దెచ్చుటయు,
నంతఁ బాండవులకుఁ బాంచాలురను శూరసేనులును బంధువులై
సాయపడుటకు సంసిద్ధు లగుటయు, మఱియును యాదవరాజుల
కుమార్తెయగు సుభద్ర నర్జునుండు పెండ్లియాడుటచే శ్రీకృష్ణుండును
సర్వయాదవులును సఖ్యసంబంధములచేఁ బాండవులయెడఁ బ్రీతి యధి
కముగాఁ జూప నారంభించుటయును, నర్జునుండు తన్ను మహేంద్రుండు
వారించినను సరకుసేయక ఖాండవవనంబును నగ్ని కాహుతిగా నొసఁగి
శౌర్యము లోకవిఖ్యాతిఁ జెందు నట్లొనర్చుటయును, లక్కయింటియం
దుండి కుంతీసమేతులై పంచపాండవులును వెలువడుటయును, వారికి
విదురుండు తోడగుటయును, మాగధులలో వరిష్ఠుండును బలపరాక్రమ
శాలియు నగు జరాసంధుఁడు భీమసేనునిచేఁ జీల్పఁబడి చంపఁబడుట
యును, పాండుపుత్త్రులకు లోకములోని రాజు లెల్లను వశ్యులై
యమూల్యకానుకలను నొసంగఁగా రాజసూయాధ్వరమును యుధిష్ఠిరుం
డోడ్డోలగంబునఁ గావించుటయును, నేకవస్త్రయును, రజస్వలయును,
గన్నీరు గార్చుచున్నదియు నగు ద్రౌపదిని సభలోనికి దుశ్శాసనుండు
తలవెండ్రుకలను బట్టి యాదేవినాథులు చూచుచుండ ననాథంగా నెంచి
యీడ్చి తెచ్చి చీర లొలుచుటయును, మాయాద్యూతంబున ధర్మజుండు
సౌబలునిచే నోడింపఁబడి యరణ్యవాసమునిమిత్తమై యేగుచుండ
నాతని తమ్ములందఱును నాతని వెంబడించి యరుగుటయును, నరణ్య
వాసంబు సలుపుచుండ నచ్చోట సైతము బహుబ్రాహ్మణులను నిత్య
సంతర్పణంబులఁ గావించుచు విధ్యుక్తధర్మము ననుష్ఠించుచుండు
టయును, నర్జునుండు కిరాతవేషధారి యగు త్రినేత్రుని యుద్ధమున
మెప్పించి యామహానుభావునియొద్దనుండి పాశుపతం బను మహనీయా
స్త్రంబును గొనుటయును, బదంపడి యాతండు స్వర్గంబునకు మనుష్య
శరీరముతో నేగి మహేంద్రుఁడు మున్నగు లోకపాలకుల యొద్దనుండి
దివ్యాస్త్రముల సంపాదించి పౌలోమకాలకేయులను హతులఁ గావించి
యందులకు బహుమానముగాఁ గిరీటమును గొని మఱలి తనసోదరులం

కలిసికొనుటయును, మనుష్యుల కగమ్యము లగు యక్షు లుండు ప్రదే
శములను బాండవులు సొచ్చి యచ్చోటఁ గుబేరునితో గంధమాదన
పర్వతంబున సమాగమముం బొందుటయును, సుయోధనుండు ఘోష
యాత్ర కరిగి గంధర్వులకుఁ జిక్కి నియంత్రలంబున వారు తనని నెత్తికొని
పోవుచుండ, వానిని భార్యలతో ధనంజయుండు విడిపించుటయును,
యక్షప్రశ్నంబులకు యుధిష్ఠిరుండు ధర్మయుతముగా దత్తోత్తరుం
డగుటయును, విరాటుని యాస్థానమునందు ద్రౌపదీసమేతులై పాండవులు
ప్రచ్ఛన్నరూపములం దాల్చి యెవరు తెలియంగకుండ నజ్ఞాతవాసంబు సలుపు
టయును, కౌరవులలో బలపరాక్రమవంతుల నెల్ల నొక్కయర్జునుండ
గోగ్రహణకాలంబున నోర్చి విజృంభించుటయును పాండవు లొక్క
సంవత్సరము ప్రచ్ఛన్నులై తన రాజ్యమునందుండి తనకు సేవ లొనర్పు
చుండినందులకు విరాటుఁడు దవరిపడి, వారితో సంబంధము గావించుకొను
నిమిత్త ముత్తర నర్జునున కీయ యత్నము సలుపఁగా నర్జునుండు తాను
తనకు శిష్యురాలు గాన దానిం బొందుట కిష్టపడక యాకన్యను
దనకొడు కభిమన్యున కిచ్చి వివాహము గావించికొనుటయును, ద్రవ్య
శూన్యులై స్వజనులు తన్ను విడువ సన్యాసిగనుండినను ధర్మరాజునకు
యుద్ధకాలమున నేడక్షౌహిణులబలంబు సమకూడుటయును, భగ
వంతుఁడే యగు దేవకీపుత్రుండు వారికెల్ల కాలములయందుఁ దోడ్పడుట
కియ్యకొనుటయును, వారిరువురు భగవదవతారరూపులగు నరనారా
యణులు కృష్ణార్జునులైరని పలుమారు నా కెఱింగించుటయును,
శ్రీకృష్ణుండు పాండవులకును నావారికిని సంధి గావింపఁబోఁగా నాఁడా
సభలో నమ్మహాత్ముని గర్ణసుయోధనులు మున్నగు నావారు నిగ్రహింపఁ
దలచుటయును, సంధి కేతెంచి విదురునింటఁ గుడిచి మఱలి యేగుచుండు
వాసుదేవునిఁ గుంతి దీనురాలై వెంబడింప రథస్థుండైన యమ్మహాత్ముండు
రథము డిగ్గి యద్దేవిని సాంత్వవచనంబుల నూఱడించుటయును,
యుద్ధారంభకాలమునందు మంత్రియగు వాసుదేవుండును,
శాంతనవుం డగు భీష్ముండును, భారద్వాజుం డగు ద్రోణాచార్యుండును,
పాండవులను విజయు లగునట్లు దీవించుటయును, కర్ణుండు భీష్మునితోఁ
దగవు లాడి "నీ వని సేయుచుండ నే నద్దెసకు రా ననియు, నీవు

గెల్చినచో నేను వనవాసి నయ్యెద" ననియు బంతమాడి భీష్ముఁడు యుద్ధ రంగంబున నుండునంతవఱ కనికి దొలంగి యుండుటయును, వాసు దేవార్జునులును నప్రమేయ మగుగాండీవమును మూఁడు గ్రవీర్యములు గవిసిరియొక్కటగుటయును,నర్జునుం డుభయ సేనలమధ్యమునకు రథంబును దోలి నిలుపునట్లు సారథియగు వాసుదేవున కాజ్ఞాపింప నాతం డట్లో నర్పఁగా నాసమయమున నిరువాగులలో నుండుబంధుమిత్రులు రణరంగం బున నిహతు లయ్యెద రని శోక మోహములతో నర్జునుఁడు రణవిము ఖుఁడు కాఁగా, భగవంతుం డగువాసుదేవుండు యోగమహిమచే విశ్వ రూపమును జూపి "జీవుండు నిత్యుండు, వానికిఁ జావు లేదు, వాఁడ చ్ఛేద్యుండు, అదాహ్యుండు, స్వయంప్రకాశుండు" అని గీతార్థంబుల నుపన్యసించి ప్రకృతి యెప్పు డైనను నశించునదే కావున శరీమునకు నాశ మెప్పుడైనను గల్గు నని బోధించి యర్జునునిచే నొప్పించి యత నిని రణోన్ముఖుం గావించుటయును, శిఖండిని ముం న్నిడికొని మహాశూ రుండును ననియం దోర్చుటకు వీలుకాని భీష్ముని నర్జునుఁడు గూలఁ ద్రోయఁగా నాతం డంపసెజ్జపైఁ బఱుండుటయును, నర్జునుం డట్లు శర తల్పంబున శయనించియుండు తాతకుఁ దనధనుర్విద్యావిలాసంబు నేర్పన భూమిని బగులఁగొట్టి పాతాళగంగ గొనిదెచ్చి యాతని దాహం బడఁపుటయును, పాండుపుత్రులసైన్యమునందు శుభశకున ములయొక్కయుఁ మనవారి సైన్యమునం దపశకునములయొక్కయును సూచనలు గాన్పించుటయును, ద్రోణాచార్యుఁడు మహావ్యూహములను బన్నుచుఁ దనయుస్త్రలాఘవమును జిత్రవిచిత్రముగాఁ బోరిసేమునందుఁ జూపుచుండినను వా రెవరును నాయుస్త్రములచే జావ కుండుటయును, నర్జునుండు ననపై నొక్కపెట్టునఁ దలఁపడిన సంశప్తకుల నందఱ మహా రథుల హతులఁ జేయుటయును, బద్మవ్యూహము నభిమన్యుండు భేదించి లోనికిఁ జొచ్చి యనేకశూరులఁ బిచ్చలించున ట్లొనర్చి, వీరానీకం బంతయు నాతనిఁ జుట్టుముట్టి యాతని వధింపఁగా నిందులకుఁ గారణభూతుఁ డైన సైంధవునిపై నర్జునుం డలిగి యాతనిని మఱునాఁ డస్తమింపుచులోపుగఁ బొలియింతునట్టు ప్రతిన వట్టి దానిని నెఱవేర్చుట కానాఁడు ఘోరయుద్ధము నొనర్చుచుండ నర్జునుని రథ్యంబులు

డయ్యుటయు వాని సేదదీర్చుట కర్ణుండు సేనాముఖ్యంబున
నభేద్యంబైన యంపకోట నొక్కదానిని దనరథరథ్యంబులఁ గావించి
సారథియైన శ్రీకృష్ణమూర్తి రథ్యంబుల దప్పిందీర్చి తెచ్చునంతకుఁ దాను
రథంబు డిగ్గి యొంటికాఁడై శత్రుసేనలపై విక్రమించి యుద్ధముం జేసి
వెనుక రథము నెక్కినంతలో భీమసాత్యకులు దుర్యోధనుని సైన్యము
నోహటించి నిలిపి చెల్లాచెదరగునట్లు గొట్టుచుఁ దనకు సాయపడు
చుండు సమయంబునఁ గర్ణుండు భీమసేనుం దలపడి యాతనితో ఘోర
సమరం బొనర్చి యాతఁ డేమరియుండఁ గర్ణుండు వాని నిరాయుధుం
జేసి క్రిందఁబడునట్లొనర్చి తనవింటికొప్పున భీమసేనుపొట్ట గంధ్రంబగున
ట్లొత్తుచు నతనిని నవమానించి యుబ్బుచు నవ్వుచుండ, వాఁడును
నితరులగు మనసైన్యములోనున్న శూరులను జూచుచుండఁగ యర్జు
నుండు సైంధవుని తల నఱికి దానిని గ్రిందఁబడునట్లొనర్చి తనయస్త్ర
మహిమ నేర్పునం జెండాడుచుఁ దన ప్రతిజ్ఞ దీర్చుకొనుటయును, కర్ణుఁడు
తన కింద్రదత్తంబైన మహాశక్తిని బ్రయోగించి యర్జునుని సంహరింపవలయు
నని తలంపుఁ గొని యుండ నద్దానిని ఘటోత్కచునిపైఁ బ్రయో
గించి వానిని జంపి వ్యర్థపఱుపవలసి వచ్చుటయును, నుభయసేనలలోని
విలుకాండ్రకెల్ల గురు వగు ద్రోణాచార్యుండు నిజరథంబుపై బ్రాయో
పవిష్టుండై యుండఁగా నామహానీయుని ధృష్టద్యుమ్నుండు శిరోజములఁ
బట్టికొని తల నఱుకుటయును, నశ్వత్థామ జగ మపాండవ మగునట్లు
ప్రయోగించిన నారాయణాస్త్రంబునఁ బాండవులలో నొక్కఁడైనను
జావకుండుటయును, భీమసేనుండు మనవారిలోఁ గలమానిసు లెల్లఁ
జూచుచుండ దుశ్శాసనునితోఁ బోరి వానిఁ గ్రిందఁ బడఁ ద్రొబ్బి
భీకరంబుగా ఱొమ్ముఁ బగిల్చి వృకంబువిధమున వాని నెత్తురు ద్రావుట
యును, గర్ణుం డర్జునునితో మచ్చరించి తుదకు యుద్ధమున వానిచేఁ
జచ్చుటయును, ధర్మజుండు విజృంభించి శల్యునిపై మహాశక్తి నొక్కదా
నిం బ్రయోగించి యద్దాన నామహానీయుని వధించుటయును దుర్ద్యూత
మునకు మూలం బగు శకునిని సహదేవుండు దెగ నేయుటయును, శత్రు
లకు వెఱచి ద్వైపాయనహ్రదంబున జలస్తంభం బొనర్చి డాగియున్న

నాపుత్త్రు సుయోధనుని ధర్మజుండు సపోటుమాటలాడి హ్రదంబు వెడలందీసి
భీమసేనునితో గదాయుద్ధమునకుం బురికొల్ప, శౌరిసన్నచే నధర్మం
బున నాభిక్రిందం దొడలపై భీముండు గదచేం గొట్టంగా నాపుత్త్రుండు
దొడలువిఱిగి ప్రాణంబులం బాసినటయును, నాంటిరాత్రి యశ్వత్థామ
పాండవశిబిరముం జొచ్చి సుప్తులైయున్న పాంచాలుర నెల్లరను ద్రౌపదేయు
లగునైదుగురను బొడిచి ఘోరమరణము నొందునట్లు చేయంగా దానిని
భీమసేనుండెఱింగి యశ్వత్థామను బట్టికొనం బఱువిడంగా నందులకు గురు
పుత్త్రుండు వెఱచి పాండవులపై నైషికాస్త్రప్రయోగంబు గావింప
సవ్యసాచి దానిని బ్రహ్మశిరోనామకాస్త్రంబున నుపశమించునట్లొనర్చి
యశ్వత్థామ శిరోరత్నమును గొనుటయును, బాలఘాతుకుం డగు
నశ్వత్థామను కేశవద్వైపాయనులు శపించుటయును, వాండు గ్రమ్మఱ
వారిని శపించుటయును నివి యెల్లయును నేను వినుచుండునప్పు డెల్లను
మనకు శుభంబు లొదవనేరవుగా యని స్వాధమనస్కుండనై యుంటిని.
గాంధారి ననసూగ్గలు పుత్త్రులను, పౌత్త్రులను, భ్రాతలను, సమీప
బంధువులను నీయుద్ధకారణంబునం గోల్పోయి దుఃఖసాగరంబున శరీర
ముండునందాక నీదవలసివచ్చెను. ఇట్టిదుష్కరమగు కార్యమును
బాండవు లొనర్చి నిష్కంటకమైన రాజ్యమును బొందిరి. ఈమహా
భయంకరమైన సంగ్రామమునందుం బదునెనిమిది యక్షౌహిణుల
సైన్యమును మడిసినది. మొత్తమున నుభయులలోను బదిమంది
బ్రతికియున్నవారు, మనసైనికులలో ముగ్గురును, వారిలో నేడుగురును
మిగిలియున్నవారు. దీని నంతయును దలపోయంగా నాగుండెలు జల్లు
మనుచు. మనస్సు కలంగ నొందును. బుద్ధి జెచ్చవడును. మొగంబు వెల
వెలపాఱును. అని యనేకప్రకారంబులం బలవించి మూర్ఛిల్లి కొండొక
సేపునకు సమాశ్వసిల్లి యాంబికేయుండు సంజయునిం జీరి "సూతపుత్త్రా!
నాప్రాణంబులు నిలువనోపవు. నేను జీవించుటలో ఫలమేమియుం గాన
రాకున్నది. జగదే తమోమయముగం గాన్పించుచున్నది" యని నిట్టూర్పు
పుచ్చుచు వేదనాభరంబు సహింపనోపకున్న నమ్మహీనాథునకు గావల్గణ
పుత్త్రుండగు సంజయుం డిట్లనియెను. పూర్వము రాజవంశములలో మహో
త్సాహపరులును, మహాశూరులును, గుణవంతులును, ముదితహృదయులును

లును ననేకయాగముల నాచరించినవారును నగు శైబ్యుఁడు, సృంజ
యుఁడు, సుహోత్రుఁడు, రంతిదేవుఁడు, మహాతేజస్వి యగు కాక్షీ
వంతుఁడు, బాహ్లికుఁడు, దమనుఁడు, శర్యాతి, యజితుఁ డగు నళుఁడు,
శత్రుఘాతకుఁడగు విశ్వామిత్రుఁడు, పరాక్రమశాలి యగు నంబరీషుఁడు,
మరుత్తుఁడు, మనువు, ఇక్ష్వాకువు, గయుఁడు, భరతుఁడు, దాశరథి యగు
శ్రీరాముఁడు, శశిబిందువు, భగీరథుఁడు, కార్తవీర్యుఁడు, మహాభాగుఁడు,
జనమేజయుఁడు, మహాభుజుఁడును పరాక్రమశాలియును, ననని యజ్ఞ
ములయందు దేవతలు స్వయముగా నేతెంచి స్వరూపధారులై హవి
ర్భాగములను గొనిపోవుచుండిరో యట్టి యయాతియును నను నిరువది
నలువురు మహారాజులు లోకమునందుఁ బెక్కుభోగముల ననుభవించి
కాలవశమును బొందిరని మహర్షియగు వేదవ్యాసుఁడును, దేవర్షి యగు
నారదుఁడును జెప్పఁగా వినియున్నారము. ఎట్టివారికిని విధి యుల్లంఘ
నీయము. ఇంకను ననేకులు పుత్రశోకార్తులై గతించినవారు గలరు.
వా రెల్లరు మహారథులు, మహాత్ములు, సుగుణవంతులు. ఇట్టివా రనే
కులు కాలగతిని దప్పించుకొనలేనివారైరి. మహాగుణసంపన్నులైన
వారును నిధనమును దప్పించుకొనలేరైరి. అట్టివారినే కాలపురుషుఁడు
నమలి మ్రింగుచుండఁగా దురాత్ములును, దుష్టచారిత్రులును నగు
నీపుత్రులు సత్పురుషులచే ఘోరరణనిహతు లగుటకు నీవేల వగవ
వలయును? నీవు సకల వేదశాస్త్రములఁ జదివినవాఁడవు. మిక్కిలి
ధీమంతుఁడవు. ప్రాజ్ఞసమ్మతుండవు. కాలవైపరీత్యమున సంభవించుదానికి
నీయట్టిబుద్ధిమంతుఁడు వగవఁదగునే? ఎట్టి బుద్ధిమంతుఁడేని విధి చేయు
వుల నాపుకొనఁజాలఁడు. విధివిహితము కాని కజ్జ మేదియును లేదు.
భావాభావములును సుఖాసుఖములును నగు నీసర్వమును గాలవశమై
ప్రవర్తిలుచుండును. భూతోత్పత్తికిఁ గాలమే మూలము. తన్నాశమున
కును గాలమే కారణము. ప్రజలను సంహరించు కాలునిసైతము కాలమే
శమింపఁజేయును. సర్వలోకములయందును శుభాశుభభావముల యుత్ప
త్తిని కాల మొనర్చును. కావున కాల మెవ్వఁడును దురతిక్రమము.
సర్వభూతములయందును సమముగా వర్తించును. జరిగినవియు, జరుగు
చుండునవియు, జరుగనున్నవియు నగు కార్యములన్నియుఁ గాలవశము

లని బుద్ధిమంతుఁ డెఱింగి వెలుపు దక్కియుండవలయును. ఇవ్విధముగా సంజయుండు పుత్త్రశోకముచే నడలుచున్న యాంబికేయుని సమాశ్వసింపఁజేసె. ఈసంగతినంతయు పుణ్యకథగాఁ గృష్ణద్వైపాయనుండు మహాభారతగ్రంథమున వచించెను. ఈభారతేతిహాసమునం దొక్కశ్లోకపాదమును జదివినను బుణ్యంబు సమకూరునని పురాణములు సెప్పెను. ప్రాతస్సాయంసమయములయందు భారతాధ్యాయపు క్షేపరూపంబైన యీయనుక్రమణిక నేపురుషుండు పఠించునో, వానికి మహాభారతేతిహాసగ్రంథమునంతను జదివినఫలము గల్గును. శ్రాద్ధకాలంబులయందు దీనిం పఠింపించినచో నాకస్యములు సుఫలముల నొసంగును. ఈమహాగ్రంథమును భక్తిశ్రద్ధలతో వినిన పుణ్యాత్ముండు పరలోకసుఖముల ననుభవించును. ఎల్లప్పుడును ధర్మాత్ముండగును. పెరుగున నవనీత మెట్టిదియో, మనుష్యులలో బ్రాహ్మణునిచంద మెట్టిదో, వేదములలో నారణ్యకం బెట్టిదో, ఓషధులలో నమృతం బెట్టిదో, జలాశయములలో సముద్ర మెట్లు శ్రేష్ఠమో, తిర్యగ్జంతువులలో గోవెట్లు లుత్తమమో యట్లులితిహాసములలో నిమ్మహాభారత మత్యుత్తమమై వెలయును. పూర్వకాలమున దేవతలు నాల్గు వేదములను దక్కెడయం దొకతట్టును, భారతమును వేఱొకతట్టును నుంచి తూఁచఁగా భారతమించినప్పురనే ముల్లు మొగ్గనూపెను. అట్లు ఆమహాత్త్వమును వేదార్థసారభావమును గలదగుట నీయితిహాసగ్రంథమును మహాభారతగ్రంథమని పెద్దలు వక్కాణించిరి. కావున నీగ్రంథము మహాభారత మని ప్రఖ్యాతిఁ గాంచె. మహాభారతశబ్దార్థమునుమాత్ర మెఱుంగువారు సర్వపాపవినిర్ముక్తు లగుదురని రోమహర్షణపుత్త్రుం డగు నుగ్రశ్రవసుం డను సూతనందనుండు శౌనకాదిమహామునులకుం జెప్పి వెండియు నిట్లనియె.

## భారతపర్వానుక్రమణిక

ఈమహాభారతమున నాదిపర్వమునందు — పౌష్యము ౧, పౌలోమము ౨, ఆస్తీకము ౩, ఆదివంశావతారము ౪, సంభవపర్వము ౫, జతుగృహదాహము ౬, హైడింబము ౭, బకవధము ౮, చైత్రరథము ౯, స్వయంవరపర్వము ౧౦, వైవాహికము ౧౧, విదురాగమనము ౧౨,

రాజ్యలాభము ౧౩, అర్జునవనవాసము ౧౪, సుభద్రాహరణము ౧౫, హరణహారికము ౧౬, ఖాండవవనదహనము ౧౭, మయదర్శనపర్వము ౧౮ అను నవాంతరపర్వములు పదునెనిమిదిపర్వములు గలవు.

రెండవదియగు సభాపర్వమున—మంత్రపర్వము ౧, జరాసంధవధపర్వము ౨, దిగ్విజయపర్వము ౩, రాజసూయము ౪, అర్ఘ్యాహరణము ౫, శిశుపాలవధ ౬, ద్యూతము ౭, అనుద్యూతము ౮ అను నవాంతరపర్వము లెనిమిది గలవు.

మూడవదియగు నారణ్యపర్వమున—కిమ్మీరవధ ౧, అర్జునాభిగమనము ౨, కైరాతము ౩, ఇంద్రలోకగమనము ౪, నలోపాఖ్యానము ౫, ధర్మరాజతీర్థయాత్ర ౬, జటాసురవధ ౭, యక్షయుద్ధము ౮, నివాతకవచవధ ౯, అజగరము ౧౦, మార్కండేయాగమనము ౧౧, సత్యాద్రౌపదీసంవాదము ౧౨, ఘోషయాత్ర ౧౩, మృగస్వప్నోద్భవపర్వము ౧౪, వ్రీహిద్రౌణికము ౧౫, ఐంద్రద్యుమ్నపర్వము ౧౬, ద్రౌపదీహరణము ౧౭, జయద్రథవిమోక్షణము ౧౮, రామోపాఖ్యానము ౧౯, పతివ్రతామాహాత్మ్యము ౨౦, కుండలాహరణము ౨౧, ఆరణేయము ౨౨ అను నవాంతరపర్వము లిరువదిరెండు గలవు.

నాల్గవది యగు విరాటపర్వమున—పాండవప్రవేశపర్వము ౧, కీచకవధ ౨, గోగ్రహణము ౩, అభిమన్యువివాహము ౪ అను నవాంతరపర్వములు నాలుగు గలవు.

అయిదవది యగు నుద్యోగపర్వమున—ఉద్యోగము ౧, సంజయయానము ౨, ప్రజాగరము ౩, సానత్సుజాతము ౪, యానసంధి ౫, భగవద్యానము ౬, సేనానిర్యాణము ౭, ఉలూకదూతాభిగమనము ౮, రథాతిరథసంఖ్యానము ౯, అంబోపాఖ్యానము ౧౦ అను నవాంతరపర్వములు పదిపర్వములు గలవు.

ఆఱవదియగు భీష్మపర్వమున—జంబూఖండనిర్మాణము ౧, భూమిపర్వము ౨, భగవద్గీత ౩, భీష్మవధ ౪ అను నాలుగుపర్వములు గలవు.

ఏడవది యగు ద్రోణపర్వమున—ద్రోణాభిషేకపర్వము ౧, సంశప్తకము ౨, అభిమన్యువధ ౩, ప్రతిజ్ఞాపర్వము ౪, జయద్రథవధ ౫, ఘటోత్కచవధ ౬, ద్రోణవధ ౭, నారాయణాస్త్రమోక్షపర్వము ౮ అను నవాంతరపర్వము లెనిమిది గలవు.

ఎనిమిదవది యగు కర్ణపర్వమున—కర్ణపర్వము ౧ యును గలదు.

తొమ్మిదవదియగు శల్యపర్వమున—హ్రదప్రవేశము ౧, గదాయుద్ధము ౨, సారస్వతము ౩, తీర్థవంశానుకీర్తనము ౪ నను నాల్గుపర్వములును గలవు.

పదవదియగు సౌప్తికపర్వమున—సౌప్తికము ౧, ఐషికము ౨ నను రెండుపర్వములు గలవు.

పదునొకండవది యగు స్త్రీపర్వమున — జలప్రదానము ౧, స్త్రీవిలాపపర్వము ౨, శ్రాద్ధపర్వము ౩ నను మూఁడుపర్వములున్నవి.

పండ్రెండవది యగు శాంతిపర్వమున—చార్వాకనిగ్రహము ౧, యుధిష్ఠిరపట్టాభిషేకము ౨, గృహవిభాగము ౩, రాజధర్మములు ౪, ఆపద్ధర్మములు ౫, మోక్షధర్మములు ౬ నను నాఱుపర్వములు గలవు.

పదమూఁడవదియగు ఆనుశాసనికపర్వమున—దానధర్మపర్వము ౧, భీష్మనిర్యాణము ౨ నను రెండుపర్వములు గలవు.

పదునాల్గవదియగు నశ్వమేధపర్వమున—అశ్వమేధారంభము ౧, అనుగీతలు ౨ నను రెండుపర్వములు గలవు.

పదునైదవదియగు నాశ్రమవాసపర్వమున—ఆశ్రమవాసము ౧, పుత్రదర్శనపర్వము ౨, నారదాగమనము ౩ నను మూఁడుపర్వములున్నవి.

పదునాఱవదియగు మౌసలపర్వమున—మౌసలము ౧ యును.

పదునేడవది యగు మహాప్రస్థానపర్వమున—నాపేరింటి పర్వము ౧ యును గలవు.

పదునెనిమిదియవది యగు స్వర్గారోహణ పర్వమున—నాపేరింటి పర్వము ౧ యును గలదు.

పిదప హరివంశము, విష్ణుపర్వము, భవిష్యత్పర్వము నను నూఱుపర్వములతో నీమహాభారతము వెలయుచుండును. *

---

* శాంతిపర్వమున, ౧ చార్వాకనిగ్రహము, ౨ యుధిష్ఠిరపట్టాభిషేకము, ౩ గృహవిభాగము అను మూఁడుపర్వములను పర్వానుక్రమణికయందు వేఱుగాఁ జేర్చియున్నను, శాంతిపర్వము రాజధర్మపర్వముతోఁ బ్రారంభింపఁబడుచున్నది. కావున హరివంశమునందలి పర్వములతోఁ జేర్చి యుపపర్వములు నూఱే యగును. వానిని మినహాయించిన భారతమునందలి పర్వసంఖ్య ౯౭. ఇవ్విషయమున నాంధ్రమహాభారతమునకును సంస్కృతభారతమునకును భేదము గనఁబడుచున్నది.

ఈమహాభారతేతిహాసము చతుర్విధపురుషార్థములగు ధర్మార్థకామమోక్షములను నిరూపించుటం జేసి దీనిని ధర్మశాస్త్ర మని కొందఱును, నర్థశాస్త్రం బని యొకకొందఱును, కామశాస్త్ర మని మఱికొందఱును, మోక్షశాస్త్ర మని పెక్కుకొందఱును జెప్పుదురు. చతుర్వేదములను సాంగముగాం జదివియు నీయితిహాసమును జదువనిపురుషుండు విద్వాంసుండు గానేరఁడు. మనోహరమగు మత్తకోకిలముల పంచమస్వరంబును విన్న వీనులకుం గాకులయసహ్యధ్వనులు రుచింప నట్లిమ్మహేతిహాసంబును జదివినవానికి నన్యమైనవేఱొక గ్రంథము రుచింపనేరదు. భూమి మున్నగు పంచమహాభూతములనుండి సర్వమును బుట్టినవిధంబున నీమహేతిహాసమును జదివిన కవివర్యునకుం దెలివి తేటపడి పలుతెఱంగులభావము లుత్పన్నములగుచుండును. సర్వేంద్రియ వ్యాపారములకును మనోవ్యాపార మెట్లు లాశ్రయములో యవ్విధంబున సర్వకావ్యగ్రంథములకు నీయితిహాసములోని వృత్తాంతంబు లాశ్రయంబులై యుండును. ఆహారము లేక శరీర మెట్లుండ నేరదో యట్లే భారతమహాఖ్యానంబును ననుసరింపని వృత్తాంతం బన్యం బుండ నేరదు. శుభములను నభివృద్ధిని గోరు సత్కులసేవకులు మేలైనదొర నాశ్రయించి జీవించుపగిది గవులెల్లను నీయితిహాసమునే తమకు నూతకట్టుగాం గొనియుందురు. శ్రీవేదవ్యాసునిముఖపద్మములనుండి వెలువడిన తేనెధారలవంటి యీమహాభారతము నెవ్వఁడు వినునో, వాఁడు సకలతీర్థములయందును గంగాదిపుణ్యనదులయందును బుష్కరకాలములలోను స్నానము చేసినఫలముకంటె నెక్కుడుఫలము ననుభవించును. మనస్సుచేతను వాక్కుచేతను శరీరముచేతను రాత్రికాలములయం దొనర్చిన పాపములు పగటియందును, నట్లే పగటియం దొనర్చిన పాపములు రాత్రియందును నిమ్మహాభారతము పారాయణముం జేసినవారు నశింపఁజేసికొందురు. ఈయితిహాసమును విను పుణ్యపురుషులకు బంగారుతొడవులతో నలంకరింపఁబడిన కొమ్ములుగల నూఱుగోవుల నుత్తమబ్రాహ్మణునకు దాన మొనర్చినవాని సుకృతముగలుగును. దాఁటుట కశక్యంబైన మహోదధిని నోడచే సుకరముగ దాఁటునట్లు, ఈ మహాభారతేతిహాససముద్రమును సర్వసంగ్రహ మను జ్ఞానబోధచేత

సులభముగ దాఁట శక్యం బగు నని పౌరాణికుం డగు సూతుండు శౌనకాది మహామునివర్యులతోఁ జెప్ప వార లక్కథకున కి ట్లనిరి.

### శమంతకపంచకమున కాపేరు కలిగినవిధము, అక్షౌహిణీపరిమాణము

సూతుఁడా! శమంతకపంచకమునఁ బాండవులకును గౌరవులకును యుద్ధము జరిగె ననియును, నాయుద్ధమునందుఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యము ప్రుండె ననియుఁ జెప్పియుంటివి. యుద్ధము జరిగిన యాప్రదేశమునకు శమంతకపంచక మనుపే రేల గలిగె? అక్షౌహిణికిఁ బరిమాణ మెయ్యది? వివరింపవే యని యడుగుటయు నందుల కాసూతుం డి ట్లనియె.

పూర్వకాలమునఁ ద్రేతాద్వాపరయుగముల సంధియందు రాజులు మదించి ధర్మమార్గముఁ దప్పి దుష్టులై వర్తించుచుండ, విష్ణునంశమునఁ బుట్టినపరశురాముఁ డిరువదియొక్కమారులు వెదకి వెదకి వారిని దునుమాడి వారినెత్తుట నైదుమడుగులొనర్చి యామడుగులందు పితృదేవతలకుఁ దుష్టిగాఁ దర్పణం బొనర్చెను. అంత, ఋచీకాదులగు పితరులు పరశురాముని కార్యముచే సంతుష్టులై యారామునియొద్దకు వచ్చి 'నీపితృభక్తికి సంతసించితిమి. వరంబడుగుము' అనిరి. అంత వారితోఁ బరశురాముండు తనకు బహుక్షత్రియవధమునఁ బ్రాప్తించిన పాతకంబు తన్నుఁ జెందకుండునట్లును, నానెత్తుటిమడుగు లైదును బుణ్యతీర్థము లగునట్లును బ్రసాదింపవేడెను. అంత నాపితరులు పరశురామునకు వరముల నిచ్చి యదృశ్యులైరి. ఆదిమొదలుకొని యామడుగులు పరమపవిత్రము లగుచుండెను. ఆమడుగులకు సమీపమునం దున్న దేశమంతయును శమంతకపంచక మని ప్రఖ్యాతిఁ జెందె నని చెప్పి యక్షౌహిణీ పరిమాణంబును నిట్లని చెప్పఁదొడంగె.

రథ మొక్కటి, గజ మొక్కటి, గుఱ్ఱములు మూఁడు, కాలుబంటు లేవురుఁ గలుగఁ బత్తి యనఁబడు. దాని మూఁడింతలు సేనాముఖ మనఁబడు. అట్టిది మూఁడైన నొక గుల్మ మగును. ఆగుల్మత్రయ మొక్క గణము. మూఁడుగణము లొక్క వాహిని. దానిమూఁడింత లొక్క పృతన. పృతనలు మూఁ డొకచమువు. ఆచమువు మూఁడగుచో నొక యనీకిని యగును. అట్టి యనీకినీదశక మొకయక్షౌహిణి యగును. ఇట్లు

లెక్కచేయఁగా నిరువదియొక్కవేలు నెనమన్నూటడెబ్బదిరథంబులు, నన్ని యేనుఁగులు, నఱువదియైదువేలునాఱునూటపదిగుఱ్ఱంబులు, లక్షయుం దొమ్మిదివేలమున్నూటయేఁబదిప్రవీరభటులును గల యది యొక్క యక్షౌ హిణి యని చెప్పఁగను.

# అక్షౌహిణీసంఖ్య

| సేనల పేళ్లు | తేరులు | ఏనుఁగులు | గుఱ్ఱములు | కాల్బంట్లు | మొత్తము |
|---|---|---|---|---|---|
| పత్తి | ౧ | ౧ | ౩ | ౫ | ౧౦ |
| సేనాముఖము | ౩ | ౩ | ౯ | ౧౫ | ౩౦ |
| గుల్మము | ౯ | ౯ | ౨౭ | ౪౫ | ౯౦ |
| గణము | ౨౭ | ౨౭ | ౮౧ | ౧౩౫ | ౨౭౦ |
| వాహిని | ౮౧ | ౮౧ | ౨౪౩ | ౪౦౫ | ౮౧౦ |
| పృతన | ౨౪౩ | ౨౪౩ | ౭౨౯ | ౧౨౧౫ | ౨౪౩౦ |
| చమువు | ౭౨౯ | ౭౨౯ | ౨౧౮౭ | ౩౬౪౫ | ౭౨౯౦ |
| అనీకిని | ౨౧౮౭ | ౨౧౮౭ | ౬౫౬౧ | ౧౦౯౩౫ | ౨౧౮౭౦ |
| అక్షౌహిణి | ౨౧౮౭౦ | ౨౧౮౭౦ | ౬౫౬౧౦ | ౧౦౯౩౫౦ | ౨౧౮౭౦౦ |

ఇట్టి యక్షౌహిణు లేడింటినిఁ గుంతీపుత్రులును, బదునొకంటింటిని గాంధారీతనయులును నిరువాగులవారును గలసి పదునెనిమిదింటిని జేర్చికొని యాశమంతకపంచకమున ఘోరయుద్ధమును జేసిరి. ఆయుద్ధమున గాంధారీసూనుల సైన్యాధిపతియై కురుపితామహుండగు భీష్ముండు పదిదినములు కుంతీసూనుల సైన్యముతోడ యుద్ధము సేసెను. పిదప ద్రోణాచార్యుండు కౌరవసేనానాయకుండై యైదునాళ్లు రణమొనర్చెను. పదంపడి కర్ణుండు రెండుదినములును, శల్యుండు దినమునందుఁ బగటి పూట సగంబును, రణంబు సేసి మడిసినపిదప దుర్యోధనుండు మిగత సగము పగటియందు భీమునితో గదాయుద్ధము చేసి కాలుపురికిఁ బోయెను. ఈశమంతకపంచక మను ప్రదేశమునఁ గౌరవులు యుద్ధము చేసిరి గావున నీప్రదేశము కురుక్షేత్రంబు నాఁబరఁగె.

అట్టికురుక్షేత్రంబునఁ బారిక్షితుండగు జనమేజయుండు తనతమ్ములు మువ్వురగు శ్రుతసేనోగ్రసేనభీమసేనులును సాయపడఁగా దీర్ఘసత్త్రము నాచరించె. అప్పుడచ్చోటికి దేవశుని యగుసరమకొడుకు సారమేయము క్రీడార్థ మరిగి యిటునటు దిరుగుచుండ జనమేజయుని తమ్ములు మువ్వురును దానిం గొట్టిరి. అది యఱచుచుఁ దనతల్లి సరమ యొద్ద కేగి రాజుతమ్ములు దన్నుఁ గొట్టి రని యేడ్చెను. అంత సరమ కొడుకును 'నీవు వారి కేదైన నెగ్గుఁ గావించితివా' యని యడుగఁగా సారమేయము దాను నిరపరాధి యనియుఁ, దా నాయజ్ఞవాటమున నూరక తిరుగుచుంటి ననియుం జెప్పె. అంత సరమ జనమేజయభూపాలుని కడ కేఁగి యిట్లనియె. "భూపాగ్రణీ! చూడుము. నాకొడుకు నీయజ్ఞవాటమునఁ దిరుగుచుండ నీతమ్ములు వానిం గొట్టిరి. కావున లోకమున దుర్వినీతులు సాధులకును, బేదవానికిని దగునిది తగ దిది యని విచారింపక యెగ్గులు గావించుట సర్వసామాన్యము. అట్టివారికి ననిమిత్తాగతము లగుభయములు గలుగును" అని చెప్పి నాకలోకమున కరిగె. అంత రాజు సత్త్రయాగమును బరిసమాప్తిఁ గావించి హస్తినాపురిం బ్రవేశించి సరమశాపమునకుఁ బ్రతీకారంబుగ శాంతిక పౌష్టిక కర్మముల నొనర్చుట కుద్దేశించి తగుపురోహితుం డెవఁడో యని విచారించుచుండె. ఇట్లుండ నొకనాఁడు వేఁటనిమిత్త మరణ్యము సొచ్చి పోవువాఁ డచ్చట నొకపుణ్యాశ్రమంబుఁ గని యది శ్రుతశ్రవుం డనుఋషివర్యునిదిగా నెఱింగి యామునిచెంత కేఁగి నమస్కరించి యిట్లనియె. తపోధనా! నీపుత్త్రుం డగు సోమశ్రవసుం డను నా కాచార్యుండై యుండ ననుగ్రహింపు మని వేడెను. అంత నాశ్రుతశ్రవుం డిట్లనియె. రాజాగ్రణీ! ఈ నాపుత్త్రుం డగుసోమశ్రవసుండు నావీర్యమును ద్రావినయొక నాగకన్యకకుఁ బుట్టినవాఁడు. పాపముల నెల్ల శమింపఁజేయ సమర్థుండు. మఱియును నెవ్వండేని విప్రుండు తన్ను దేని నడిగినను నిచ్చువాఁడై ప్రతిజ్ఞఁ బూనియున్నవాఁడు. ఈనియమమునకు లోపము వాటిల్లక జరుపుదేని, నాసుతుని నీకాచార్యునిఁగా గొనిపోవుట కాటంక ముండనేరదు. అనఁగా నాఋషిసత్తమునకు నృపాలుం డిట్లనియె. మునివర్యా! మీరానతిచ్చినతీరున నడిపెద నని

సోమశ్రవుని పురోహితుంగా హస్తిపురికిం గొనిపోయి యాతని
యార్త్విజ్యమున ననేకయజ్ఞములను గావించుచుండె. ఇట్లుండ జనమే
జయుండు తక్షశిలాదేశమునకు దండువెడలి యాదేశమును గెలిచి
హస్తిపురమునకు మఱలి యేతెంచి సుఖస్థితుండై యుండ నొక్కనాఁ
డాసి హాళికి నుదంకుం డను మహర్షి యేతెంచెను. ఆతనిచరిత్రమును
నుడివెద. సావధానులరై వినుం డని కులపతి యగుశౌనకుం నొప్పిన
మునివర్యులకు సూతుం డిట్లనియెను.

## ధౌమ్యుం డనుఋషి తనశిష్యులభక్తిం బరీక్షించుట

పూర్వకాలమున ధౌమ్యుం డను తపస్సంపన్నుం డగు యోగిసంఘముల
వాఁడు తనకు ఆరుణి, ఉపమన్యుండు, వేదుండు నను ముగ్గురు శిష్యులు
సకలోపచారములు సేయుచుండ వారలతో నొక సమస్తాంగంబున
నాశ్రమము నేర్పఱచుకొని మెలఁగుచుండెను. అమహర్షి యొక్కనాఁ
డారుణిం బిలిచి యిట్లనియెను. అయ్యా! నీవు కేదారక్షేత్రంబునకుం బొమ్ము.
అచ్చట నీళ్లు నిలుచునట్లు కట్ట నొకటిం గట్టి నీళ్లను నిలుపు మనఁగా
నాతండు గురునాజ్ఞ శిరసావహించి యచ్చోటి కేఁగి యెన్నిమారులు కట్ట
కట్టినను నీటివేగంబున నాకట్టలు తెగిపోవుచు నీరు నిలువక ప్రవాహ
ముగఁ బోవుచుండఁ, గొంతసేపటి కారుణి యాలోచించి తాన నీటి
ప్రవాహమున కడ్డముగఁ బరుండె. అంత నాయుదకంబు నారుణి గురు
భక్తికి మెచ్చి తామా సేతువుచే బంధింపఁబడి వానిగురుభక్తిమాహాత్మ్య
ఫలముగ నిలిచియుండె. ఇట్లుండ నొక్కనాఁడు ధౌమ్యుండు 'సేతు
బంధనంబున కని కేదారఖండంబునకుం బోయిన యారుణి యెన్నాళ్లకును
రాఁడయ్యె. మన మెల్లరము పోయి వానిపోకడ గుర్తించి వత్త' మని
మిగిలిన శిష్యులతోఁ గేదారఖండంబునకుం బోయి 'ఆరుణీ' యని పిలువ
నారుణి "ఇదె యరుదెంచుచున్నాఁడ" నని వెంటనే లేచి వచ్చి గురునకు
నమస్కరించి పొడసూపెను. అంత నాగురువర్యుం డారుణితో నిట్లనెను.
ఆరుణీ! నీవేల యిన్నాళ్లిచ్చోట మసలితివి? అని యడుగ నయ్యారుణి
"గురువర్యా! ఎన్నియుపాయములను బన్నినను నీయుదకంబు
లాగవయ్యె. కావున నీసలిలంబున కడ్డంబుగా నేన పరుండి యుంటి.

అంత నది బంధమునకు లోఁబడినది" అని చెప్పి "ఇంకను నాజ్ఞ యేమి", యని ప్రార్థింపఁగా, ధౌమ్యుండు వాని కిట్లనియె. "శిష్యవరా ! నీగురు భక్తికి మెచ్చితి." నీవు కేదారఖండముఁ బెకలించితివి గాన "నుద్దాలకుం డను నామముతో వెలయుము. సకలవిద్యలును దమంత మనమున నీకుఁ దోచుఁగాత" యని చెప్పి వాని కాజ్ఞ యొసంగి వాని యిచ్చమైఁ జరింప నంపెను. అంత నయ్యారుణి గురునియనుగ్రహంబు దనకు మహాప్రసాదంబునఁ గొని శుభముల నొందుచు నిష్టానుసారముగ వర్తించుచుండె.

పదంపడి ధౌమ్యుం డొకనాఁ డుపమన్యుఁ డను శిష్యుం బిలిచి తమయావుల మేపుటకుఁ బొమ్మనెను. గురునియాజ్ఞ నుపమన్యుండు దలం దాల్చి నిత్యము వేకువను లేచి యావులం దోలుకొని యరణ్యంబునఁ బచ్చికగల తావులయందు లెస్సగ మేపుచు, ననుదినము సాయంకాల మునకు నావులం దోలుకొని యాశ్రమమున కేతెంచి గట్టుచు వర్తించెను. అంత నొక్కనాఁడు ధౌమ్యుం డుపమన్యుం జీరి యిట్లనియె. "అయ్యా! నీవనుదినమును వఱునాత లేచి పశువులఁ దోడ్కొని సాయం కాలమునకు మఱలి యాశ్రమమునకు వచ్చుచున్నాఁడవు. ఆహార మెట్లు నీకు? నీవు ఎప్పటియట్లు దృఢకాయుఁడవై దయ్యకయున్నవాఁ డవు. ఇందులకుఁ గతం బేమి?" యని యడిగెను. అంత శిష్యుండగు నా యుపమన్యుం డిట్లనియె "గురువర్యా! మధ్యాహ్నంబున నాశ్రమంబు నకు వచ్చి భిక్షం గొని భిక్షాన్నంబును భుజించుచున్నవాఁడ" ననియె. అంత గురుండు 'ఇంక నీవు దెచ్చుభైక్ష్యమును నాయనుమతి లేక యాహా రింపకుము' అనఁగా మఱునాఁ డెప్పటియట్లు గోవులఁ దోలుకొని వనంబునకుఁ బోయి సాయంకాలమున నాశ్రమంబున కేతెంచి యావుల నన్నింటిని గోశాలలోఁ గట్టినైచి భైక్ష్యముం దెచ్చి గురుసన్నిధియం దుంచి దూరమున నిలుచుండియుండ నుపమన్యుం జూచి గురుండు భిక్షాన్నంబు నంతయును నేనుపయోగించెద ననఁగా, శిష్యుండు వల్లెయని పోయెను. ఇట్లు కొన్నాళ్లు జరిగెను. అంతనొక్కనాఁడు గురుండు శిష్యుం జూచి నీవు దెచ్చుచుండు భైక్ష్యమును నే నుపయోగించుచుండినను, నీవాహారంబు లేకుండినను జక్కని బలముగలవాఁడవై యున్నాఁడవు.

దీనికిఁ గారణం బేమి? యని యడుగ శిష్యుం డిట్లనియె. గురువర్యా! నేను మొదలుగా దెచ్చిన భైక్ష్యమును మీ కొసంగుదును. పిదప భైక్షాచరణనిమిత్తము రెండవసారి యేఁగుదును. అపుడు తెచ్చిన భైక్ష్యమును నే నారగింతును. కావున బలయుతుఁడ, నయ్యెద నని విన్నవింపఁగా నీ విట్లు రెండుపర్యాయములు భైక్ష్యమునకుఁ బోయి భిక్షను గొని తెచ్చుట యాశ్రమంబునుండి భిక్షకేఁగు నితరులకు బాధకర మగును. కావున నీవు రెండవసారి భిక్షకుఁ బోకుము. అని గురువు సెప్పఁగా నుపమన్యుండు వల్లె యని యథాప్రీతి నావుల మేపఁ బసులవనమునకు వాత లేచి పోవుచు, సాయంకాలమున కాశ్రమమునకు వచ్చుచుండెను. అంత నొక్కనాఁడు గురువు శిష్యుం జూచి 'ఉపమన్యూ! నీవు భిక్షను దెచ్చి యారగించుట లేదు. నీవు తెచ్చు భైక్ష్య మంతయును నా కొసంగుచున్నాఁడవు. మఱియును నాహార మేదియుం గొనకుండియును నీ విట్లు బలిష్ఠుండవై కానఁబడియున్నావు? వివరింపవే!' యని యడుగ గురువునకు శిష్యుం డిట్లనియె. 'ఓ గురుఁడా! వినుము. మధ్యాహ్నకాలమున నావుల మేపు నపుడు వాని క్షీరమును బితికి త్రాగుచుండును. ఆ కారణమున బలిష్ఠుండనై యున్నవాఁడ' ననియె. అంత గురుండు "దూడల కుపయుక్తమైన క్షీరము నీవు త్రావినచో నవి చిక్కిపోవును. వానినోటిసొమ్ము కష్టంబు పొందఁదగదు. కావున నింక నీ వాక్షీరము నుపయోగించుకొనకుము" అని యాజ్ఞాపించెను. శిష్యుండు గురువు నాజ్ఞను శిరసావహించి మునుపటివలెనే తన కార్యమును నిర్వర్తించుచుండె. అంత మఱియును గొన్నినాళ్ల కుపమన్యుని ధౌమ్యుండు సూచి యిట్లనియెను. ఉపమన్యూ! నీవు దెచ్చు భిక్షాన్నమును మా కొసంగుదువు. రెండవసారి భైక్ష్యముం గొనవు. ఆవులను మేపునప్పుడు వానిపాలను బితికి త్రాగవు. అట్లైనను నీవిందుకేని చిక్కక బలియుండవై యుండుటకుఁ గారణం బే మని మఱల నడిగెను. అప్పు డుపమన్యుం డిట్లనియెను. 'ఆచార్యవర్యా! అనుదినము దూడలు తమతల్లులైన యావులు మేయుచుండఁగాఁ బాలు గుడుచుచుండును. ఆసమయమున వానినోటినుండి నురుగు వాతోద్భూత మగును. ఆఫేనమును ద్రావి బలిష్ఠుండనై యున్నాఁడ' ననిపలికెను. అంత గురుండు 'ఫేనము నింకఁ ద్రావకు' మనెను. శిష్యుండును వల్లె యని

తరువాత నెప్పటియట్ల పసులం దోలుకొని మేపుట కేఁగును. ఇట్లుప
మన్యుండు గురూపదిష్టమార్గంబుచొప్పునఁ దోలుతఁ దెచ్చిన భిక్షాన్నం
బును గురువున కాహారముగ నొసఁగును. రెండవసారి భైక్ష్యమునకుఁ
బోఁడు. ఆవులమేపుటకుఁ బోయినతఱి వానిపాలను బిసికి త్రాగకుండును.
మఱియు దూడలు కుడుచుచుండఁగా వానినోటఁ గట్టునురుగు వాతో
ద్ధూతమైనను దానిం ద్రావకుండును. ఇట్లతఁ డన్నివిధంబుల నాహారంబు
గొనుటకు వీలులేక యాజ్ఞాబద్ధుండై చరించుచుండ నొక్కనాఁ డాఁకలి
కోర్వలేక వనమునం దున్న జిల్లేడాకులఁ దినుటంజేసి కన్నులు రెం
డును బోయి యంధుం డయ్యెను. అట్లావనంబునఁ గనులుగానక తిరు
గాడుచు నతఁ డొకబావిలోఁ బడియెను. సూర్యాస్తమయ మయ్యెను.
ఆవులు మాత్ర మాశ్రమంబు సేరెను. ఉపమన్యుం డాశ్రమంబునకు
రాత్రి యెంతకాలమునకును రాఁ డయ్యెను. అంత నుపాధ్యాయుండు
గొంతసేపు వానిరామికిం జింతిలి యాయపరరాత్రము వనంబునకుఁబోయి
వానిని నలుదెసల నెదుకుచు నొకచో నుపమన్యూ! యని పేరినోఁ
బిలువఁగా బావిలోనున్నవాఁ 'డో యుపాధ్యాయా! నే నంధుండనైతి.
ఆకారణంబున నీయడవిలోనుండి యాశ్రమంబునకు దారిఁ దెలియక
తడవుకొనుచు వచ్చుచుండ దారియందున్న యీబావిలోఁ బడితి. లేవ
లేక ప్రాణములతో నిం దున్నవాఁడ' నని శిష్యుండు గురువునకుఁ దన
వృత్తాంతంబు నంతయు నెఱింగింప, గురుఁడు కొంతప్రొద్దాలోచించి
వానిస్థితికిఁ బశ్చాత్తాపపడి యిట్లనియె. 'ఉపమన్యూ! దేవతలవైద్యు లగు
నశ్వినీదేవతల నుతింపుము. వారి యనుగ్రహమున నీకన్నులు తెలియఁ
గల' వనఁగా నుపమన్యుఁడు వారి నిట్లు స్తుతించె.

ఋచః—ప్రపూర్వగౌ పూర్వజౌ చిత్రభానూ
గిరా వాం శంసామి తపసా హ్యనంతౌ,
దివ్యా సుపర్ణౌ విరజౌ విమానా
నధిక్షియంతౌ భువనాని విశ్వా. ౧
హిరణ్మయౌ శకునీ సాంపరాయౌ
నాసత్యదస్రౌ సునసౌ వైజయంతౌ,

శుక్లం వయంతౌ తరసా సువేమా
వభివ్యయంతా వసితం వివస్వతః. ౨

గ్రస్తాం సుపర్ణస్య బలేన వర్తికా
మముంచతామశ్వినౌ సౌభగాయ,
తావత్సువృత్తా వనమంత మాయ
యావసత్తమా గా అరుణా ఉదావహత్. ౩

షష్టిశ్చ గావ స్త్రిశతాశ్చ ధేనవ
ఏకం వత్సం సువతే తం దుహంతి,
నానాగోష్ఠా విహితా ఏకదోహనా
స్తావశ్వినౌ దుహతో ఘర్మముక్థ్యమ్. ౪

ఏకాం నాభిం సప్తశతా అరా శ్రితాః
ప్రధిష్వన్యా వింశతి రర్పితా అరాః,
అనేమిచక్రం పరివర్తతే ఽజరం
మాయాఽశ్వినౌ సమనక్తి చర్షణీ. ౫

ఏకం చక్రం వర్తతే ద్వాదశారం
షణ్ణాభిమేకాక్ష మమృతస్య ధారణమ్,
యస్మిన్ దేవా అధి విశ్వే విషక్తా
స్తావశ్వినౌ ముంచతో మా విషీదతమ్. ౬

అశ్వినా విందు మమృతం వృత్తభూయౌ
తిరోధత్తా మశ్వినౌ దాసపత్నీ,
హిత్వా గిరిమశ్వినౌ గాముదాచరంతౌ
తద్వృష్టిమహ్నా ప్రస్థితౌ బలస్య. ౭

యువాం దిశో జనయథో దశాగ్రే
సమానం మూర్ధ్ని రథయానం వియంతి,
తాసాం యాత మృషయోఽనుప్రయాంతి
దేవా మనుష్యాః క్షితి మాచరంతి. ౮

యువాం వర్ణాన్ వికురుథో విశ్వరూపాం
స్తేఽధిక్షియంతే భువనాని విశ్వా,

తే భానవోఽప్యనుసృతా శ్చరంతి
దేవా మనుష్యాః క్షితి మాచరంతి. ౯

తౌ నాసత్యా వశ్వినౌ వాం మహేఽహం
స్రజం చ యాం బిభృథః పుష్కరస్య,
తౌ నాసత్యా వమృతా వృతా వృధా
వృతే దేవా స్తత్ప్రపదే న సూతే. ౧౦

ముఖేన గర్భం లభ తాం యువానౌ
గతాసు రేతత్ప్రపదేవ సూతే,
సద్యోజాతో మాతర మత్తి గర్భ
స్తావశ్వినౌ ముంచథో జీవసే గాః. ౧౧

ఇట్టిమహామహిమయు విశేషార్థములు గల ఋఙ్మంత్రములతో నశ్వినీదేవతలు స్తుతింపఁబడి యుపమన్యునకుఁ బ్రత్యక్షమై వారి కొక్క యతిరసము నిచ్చి దానిని భక్షించినచో నేత్రములకు దృష్టి వచ్చుననిరి. అంత నుపమన్యుండు తాను గురువునాజ్ఞ లేనిదే యాయపూపభక్షణ మును గావింప ననియె. అందుల కా దేవతలవెజ్జులు "నీగురువునకును మే మిదిగో వేఱొకయప్పమును దెచ్చియున్నాము. దానిని వారి కొసం గుము. ఈయప్పమును నీవు దినుము" అనిరి. ఉపమన్యుఁడు "దేవత లారా! నాకు గురువు తనయాజ్ఞ లేనిదే దేనిని భక్షింపఁగూడ దని కట్టడ యిడియె. కావున నాతనియాజ్ఞ కానిదే యీయపూపము తినుటవలన నానేత్రములకు పోయినదృష్టి వచ్చునదైనను నేను భక్షింపను" అని చెప్పెను. అంతనాయశ్వినీదేవతలు నీగురువుమున్ను మాకిట్లు స్తుతించుటం జేసి వారి కొకయపూపము నొసంగితిమి. ఆయపూపమును నీగురు విడి వఱకు భక్షించెను. కావున నీవు దీనిని నుపయోగింపఁ దగుదు అని పలు తెఱంగుల నుడివిరి. ఇట్లన్నివిధంబులఁ జెప్పినను తన గురునాజ్ఞ లేనిది తా నెద్దానిని భక్షింప నేర నని యుపమన్యుండు కంఠోక్తిగా నిర్ణయించి చెప్ప నాదేవత లుపమన్యునిగురుభక్తికి మెచ్చి వానితో ని ట్లనిరి. ఉప మన్యూ! నీ కుండుగురుభక్తి మాకు మింతఁ గలిగించుచున్నది. నీకు మేము ప్రసన్నుల మైతిమి. నీగురువున కుండు నయోమయనీలదంతము

బఠింపించుచుండె. అట్లుండ నొక్కనాఁడు పౌష్యజనమేజయులు వేదుని యాశ్రమంబున కేతెంచి వా రొనర్పఁగల యజ్ఞంబునకు వేదుని ఋత్విక్కునిగా వరించిరి. అందులకు వేదాచార్యుం డియ్యకొని యజ్ఞమునకుఁ బోవువాఁడై తనశిష్యులలో నుదంకుఁ డనువానిం బిలిచి యిట్లనియె. శిష్యా! నేను జన్నమునకు ఋత్విక్కుఁడుగా వరింపఁబడి పోవుచున్నవాఁడ. నేను యాగము పూర్తిగావించి వచ్చుదనుక నాయాశ్రమమం దేదానికిని హాని రానీయక యప్రమత్తుండవై మెలంగవలయు నని యాజ్ఞ నొసంగి యాగోపకరణంబులం గొని యేఁగెను. అంత నుదంకుండుపాధ్యాయుని యానతిమెయిఁ మెలంగుచుండ వేదునిభార్య ఋతుమతి యయ్యె. అప్పు డాశ్రమవాసు లగుస్త్రీలందఱు నుదంకునిం జేరి యిట్లనిరి. ఓయీ శిష్యవరా! నీగురుఁడు నిన్నాశ్రమంబున నెద్దానికి హాని వాటిల్లక యప్రమత్తుండవై మెలఁగుట కనుజ్ఞ నొసంగియున్నవాఁడు. ఇప్పుడు నీగురుభార్యకు ఋతుకాల మతిక్రమింప నీయక గర్భాధానంబు సేయుము. అనఁగా నుదంకుండు స్త్రీలమాటలయం దాదరంబు సేయక వారు సెప్పిన ట్లొనర్పక యూరకుండి గురునిరాక కెదురుచూచుచు గురునియింట జాగరూకుఁడై వర్తిల్లుచుండె. ఇట్లుండ వేదుండు యాగము పూర్తి గావించి పౌష్యజనమేజయులయనుమతిం గొని నిజాశ్రమమునకుం జేరి సకల వృత్తాంతంబులను నెఱింగి శిష్యుం బిలిచి యిట్లనియె. ఉదంకా! నీగురుభక్తికి మెచ్చితి. నీవు నీసర్వమనోరథములను బడయుము. ఇఁక బ్రహ్మచర్యము చాలును. తగుకన్యక నన్వేషించి వివాహమై గృహస్థాశ్రమధర్మములఁ జరింపుము. అనఁగా నయ్యుదంకుండయ్యా! గురుదక్షిణ నొసంగఁ బ్రీతిగా నున్నది. ఎయ్యది యొసంగువాఁడ. ఆనతీయుఁ డనుఁడు గురుఁడు బలువిడుతలు నిర్బంధించి పలుక, నాగురుపత్నిం బ్రశ్నించి యిష్టమొనరువిధము నాచరింపుమనెను. అంత నుదంకుఁడు గురుపత్నిని సమీపించి యిట్లనియె. దేవీ! నేను గురుదక్షిణ సమర్పింప వేడుకతో నున్నవాఁడ. గురువు నానతిం గొని యభీష్టము నిన్నడుగ వచ్చితిని. నీ వెయ్యది గోరెదవో దానిఁ దెచ్చి సమర్పింప సిద్ధుండను. నాయందుఁ గటాక్షించి యభీష్టమును దెలుపు మనఁగా నాదేవి యానాఁటికి నాలవనాఁడు తాను పుణ్యకం బను వ్రతము నాచరింప

నుద్యుక్తురాలుగా నుండుటను నప్పుడు కుండలంబుల ధరింప నుత్సుకురా లగుటను, నా కుండలంబులు పౌష్యుండను రాజు భార్య కుండలములుగా నుండవలయు ననుటను జెప్పి, శక్తి గలవాఁడవైతేని వానిం దెచ్చి గురుదక్షిణగ నొసంగుము. నీవు వానిఁ దెచ్చి నాకొసంగుచో వానిఁ దాల్చి నేను బుణ్యకమును నోమి బ్రాహ్మణుల నర్చించెద." అని తనయభీష్టంబుఁ దెలుపఁగా నుదంకుండు నట్లె యని పౌష్యరాజు దేవి యుండు చోటునకుఁ బ్రయాణ మయ్యెను.

అట్లు నుదంకుండు కుండలార్థంబు పౌష్యదేవి పాలికిం బోవుచుండ మార్గ మధ్యంబున నొక్క గొప్పయెద్దు నెక్కి మహాపురుషుం డొకండు నతనిఁ బ్రత్యక్షమై యోవి ప్రబ్రాహ్మణ! తొల్లి నీగురుం డీవృషభ గోమయభక్షణంబుఁ గావించి యుండె. నీవు నట్లె గావింపుము. నీకు సకలశ్రేయస్సు లొనఁగూడు ననెను. అంత నుదంకుండు నట్లె యని యట్లు చేసి యాచమించి కుండలార్థం బరిగి పౌష్యుం జూచి రాజా! నీ దేవి కుండలంబుల నర్థించి గురుదక్షిణ నొసంగువాఁడనై నీపాలి కేతెంచితి. వాని నాకొసఁగు మనఁగా నారాజు ఉదంకునకు మ్రొక్కి, నాదేవి యంతఃపురమున నున్నయది. నీ వచ్చోటికేఁగి యడిగి తీసికొమ్ము. అనఁగా నుదంకుం డంతఃపురమున కేఁగి పౌష్యదేవిం గానక మఱలి పౌష్యుపాలి కేతెంచి, రాజా! నీదేవి నీవు చెప్పిన ట్లంతఃపురంబున లేదు. అసత్యం బేల యాడితివి? అనెను. అంత పౌష్యుం డావిప్రవర్యు నితో నిట్లనియె. విప్రోత్తమా! నాదేవి పరమపతివ్రత గావున పరిశుద్ధు లగువారికిఁ దప్ప నొండొరులకుఁ గానరాదు. నీవు త్రిలోకములను సైతము పావనము సేయంగల మహానీయుఁడవు. నీ యశౌచిత్వమును నే నారోపణ సేయునంతవాఁడనే? అనఁగా నుదంకుండు తూర్పు దిక్కు మొగంబై పాదములను, చేతులను లెస్సగాఁ గడిగికొని యాచమించి మరల నంతఃపురమునకుఁ బోఁగా పౌష్యరాజుభార్య యుదంకున కెదు రేఁగి మ్రొక్కి యాసనం బిచ్చి యాగమనకారణం బడిగెను. అంత నుదం కుండు తాను గురువర్థముగాఁ గుండలంబులఁ దెచ్చి యిచ్చున ట్లొప్పికొనిన వృత్తాంతము నాదేవితో వక్కాణించి కుండలంబుల యాచించెను. అంతఁ బౌష్యరాజుదేవి తనకుండలంబుల నంతటనుతా

త్రంబున వినియోగింపఁగలందులకై తనభాగ్యము నభినందించుచు వెంటనే కుండలముల నుదంకున కొసంగుచు నిట్లనియె. "విప్రవరా! ఈకుండలములను గొనిపోవుటకుఁ దక్షకుండు సర్వదా వేచియుండు. కావున నప్రమత్తుండవై వానిబారిం బడక కొనిపొమ్ము" అని యుదంకుని వీడ్కొలిపె. పిదప నుదంకుండు మనోరథం బీడేరఁ బౌష్యుం జేరి, "రాజా! నాయభిమతంబు కొనసాగినది. సెలవిమ్ము. పోయివచ్చెద" ననుటయుఁ బౌష్యుం డుదంకునితో నిట్లనియె. "ఓవిప్రవరా! నీవంటి మహానుభావుం డగువాఁడు నాకతిథియగుట దుర్లభము. దైవికముగ నీవు నా కీనాఁడు లభించితివి. నే నిపుడు శ్రాద్ధంబుఁ జేసెదను. నా యాతిథ్యంబు బరిగ్రహించి నాయింట భుజించిపొమ్ము" అనెను. ఉదంకుండును సంతుష్టస్వాంతుండై రాజునింట భుజించుచుండఁగా నన్నంబు కేశదుష్టంబు కాఁగా నశుచిగ్రాన యాయన్నమును దనకుఁ బౌష్యుండు కుడువఁబెట్టె నని కినిసి వాని నంధుం డగునట్లు శపించె. అంతఁ బౌష్యుండు తాను విప్రునకు దుష్టంబు కాని యన్నము నిడినను విప్రుం డకారణంబుగ నలిగి తన్ను శపించె నని తలంచి దాను నుదంకుని ననపత్యుండ వగుమని ప్రతిశాపం బొసంగె. అంత నుదంకుండు పౌష్యునితో నిట్లనియె. "రాజా! నీవు కేశదుష్టం బైనయపరిశుద్ధాన్న మని నేను నిరూపించినను నానిరూపణయం దనాదరణ గావించి నీయిడిన యన్నమును శుద్ధ మని తలపోయుటయగాక, నాకుఁ బ్రతిశాపంబు నైత మిచ్చితి గాదె. నీయిడిన యన్నంబుఁ జూడు" మనఁగాఁ బౌష్యుం డన్నది కేశదుష్ట మగుట నపరిశుద్ధ మయిన దని యెఱిఁగి, "విప్రవర్యా! కేశదుష్ట మయినయన్న మశుచిగ్రానది. నాయజ్ఞానంబున నిది యిట్లయ్యె. నన్ను మన్నింపుము. నే నంధుండఁ గానోప. కరుణించి శాపమును గ్రహింపుము" అనివేడెను. అంత నుదంకుం డిట్లనియె. "రాజర్షి! నామాట యనృతంబు గానేరదు. కొంతకాలము నీ వంధుండవై యుండి పిదప దృష్టినొందుదు" వని ప్రసాదించెను. మఱియుఁ బౌష్యుని నాతండు తనకొసంగినశాపము గ్రహింపు మని యుదంకుం డడుగఁగాఁ బౌష్యుం డిట్లనియె. "బ్రాహ్మణోత్తమా! విప్రులకు మనస్సు గొప్పది. నవనీతమునకు సమానము. వారు పల్కుమాట దారుణాఖండలశస్త్ర

తుల్యము. క్షత్రియుల కిరెండును విపరీతము లగును. వారిమనస్సు వాడిగైన ఱంపమువంటిది. పల్కులు నవనీతసమానములు. నీశాపంబున నామన స్సింకను జల్లాఱదు; నేను శాపమును గ్రహింపఁగా నేరను. నీవు శాపమును మరల్ప శక్తుఁడ వైతివి గాన మరల్పితివి. విప్రులు నిగ్రహానుగ్రహశక్తులు అనిపలికెను. అదివిని యుదంకుండు కోపముడిగి యచ్చోటు వాసి చనెను. అటు లతఁ డచ్చోటు విడిచి గురునాశ్రమము వైపునఁ బోవు చుండ మార్గమధ్యమున నొక్కయరణ్యంబున నతఁ డప్పఁ డొక్కచో జలాశయంబుఁ గని దానియందు స్నానమాడు తలంపున దాఁచి య గట్టునఁ గుండలంబు లుంచి యాచమనముం జేయుచుండ నుదక మునంపుచోటి కేగఁగాఁ దత్పూర్వము మార్గమధ్యమునఁ గనిపించిన నగ్నుండై క్షపణకవేషముం దాల్చి మాయావాకారముతో వచ్చుచుచ్చట నుదంకునకుం గనఁబడుచు నప్పుడప్పుడు కనుపడుచున్నవాఁడు జలాశయం బునఁ గుండలంబుల నుదంకుండు పెట్టినవానిం జూచి వేవేగ నచ్చోటి కేతెంచి కుండలంబుల నపహరించుకొనిపోయెను. అంత నుదంకుండు వేగ ముగ నాచమించి వానివెంటం బరువిడి పట్టుకొనఁగా వాఁడానగ్న వేష ముతోనున్న క్షపణక శరీరమును వదలి నిజతక్షకరూపముం దాల్చి యచ్చో నొకబిల ముండఁగా నందుఁ జొచ్చి పాతాళమునం దున్న నిజగృహముం జేరెను. అప్పు డుదంకుండు పౌష్యదేవి వచనంబులం దలంచి యొకకఱ్ఱను గొని యాబిలమును ద్రవ్వఁ బూనియును సంపుల కాలంబు శక్తుఁడు కాక పోయెను. అంత నుదంకుని యాదురవస్థ కింద్రుండు కనికరించి తనవజ్రా యుధమును బంపఁగా నయ్యది యుదంకుండు బిలమును ద్రవ్వ చుండుకఱ్ఱయం దావహించి దానిచే బిలప్రదేశమంతయుఁ జెకలించి పాతాళంబున నాగలోకంబు నమ్ముని చేరినాగుల నందఱను మెప్పైనవాక్య ములతో నుతించియు గుండలమ్ములఁ బొందనేరక మనమున వగ గదుర నాలోచించుచుఁ దన ముంగల నల్లనిదియుఁ దెల్లనిదియు నగుపోఁగుల నోతప్రోతంబుగ నేయుచుండు స్త్రీల నిద్దఱను పండ్రెండు నేములు గలయొక్క చక్రమును ద్రిప్పుచున్న యాఱుగురుపిల్లవాం డ్రను, నుత్తమమైన యొకగుఱ్ఱమును, దానిపైఁ గూర్చుండియున్న

పురుషుం గాంచి వారి నెల్ల నర్థము గల మహామంత్రములతో నిట్లు స్తుతించెను.

శ్లో. త్రీణ్యర్పితాన్యత్ర శతాని మధ్యే
షష్టిశ్చ నిత్యం చరతిధ్రువేఽస్మిన్,
చక్రే చతుర్వింశతి పర్వయోగే
షడ్వై కుమారాః పరివర్తయన్తి. ౧

శ్లో. తంత్రం చేదం విశ్వరూపే యువత్యౌ
వయతస్తంతూన్ సతతం వర్తయన్త్యౌ,
కృష్ణాన్ సితాంశ్చైవ వివర్తయన్త్యౌ
భూతాన్యజస్రం భువనాని చైవ. ౨

శ్లో. వజ్రస్య భర్తా భువనస్య గోప్తా
వృత్రస్య హంతా నముచేర్నిహంతా,
కృష్ణే వసానో వసనే మహాత్మా
సత్యానృతే యో వివినక్తి లోకే. 3

శ్లో. యో వాజినం గర్భమపాం పురాణం
వైశ్వానరం వాహనమభ్యుపైతి,
నమోఽస్తు తస్మై జగదీశ్వరాయ
లోకత్రయేశాయ పురందరాయ. ౪

అట్లు నుతింపఁగా నా యశ్వారూఢుం డగుమహాపురుషుం డుదంకుం జూచి యిట్లనియె. ఓవిప్రవరా! నీస్తోత్రముచే సంతుష్టుండ నైతి. నీకెద్ది యిష్టమో వేఁడు మనెను. అంత నుదంకుం డామహాపురుషు నితోఁ దనకు నాగలోకనాగముల నెల్ల వశపఱుపు మని ప్రార్థించెను. వెంటనే యాపురుషుం డాయశ్వము నపానమున నుదంకు నూఁదు మనెను. అదివిని యుదంకుఁడు నట్లు చేయఁగనే యాయశ్వదేహమునుండి పొగ లగ్నికణంబులతో నెగయుచు నాగలోకం బంతయు నావరించెను. అంతఁ దక్షకుండును నాగలోకం బగ్నిచే దగ్ధ మగు నని వెఱచి వెంటనే కుండలములఁ దెచ్చి యుదంకున కొసంగెను. ఉదంకుఁడును వానిని గ్రహించి గురుపత్నికిఁ బుణ్యకవ్రతమునాఁడే యొసంగుటకు

వీలు లేదని వగతో నుండఁగా నాయశ్వారూఢుండైన పురుషుం డుదం
కునకుఁ దనయశ్వము నొసంగి, ఓయీ! దీని నారోహించి వేగంబ గురు
పత్ని సన్నిధానంబున కేగుదేని కాలవిళంబంబు కాకుండ నాదేవియభీ
ప్సితంబు నెఱవేర్చి యాడినమాట తప్పనివాఁడ వగుదు వని తెలిపెను.
ఉదంకుఁడును నాయశ్వము నెక్కి వచ్చి గురునాశ్రమంబు చేరి గురుపత్నికి
నమస్కరించి కుండలంబుల సమర్పింపఁగా నాదేవియును, 'నాయనా ఉదంకా!
సకాలంబున కరుదెంచితివి. ఇంకఁ గొంతయాలస్యంబు చేసిన నిన్ను
శపింతు. మే లగుఁగాక. ఈప్సితార్థంబులఁ బడయుదువు' అని చెప్పి సెల
వీయఁగా నుదంకుండు వేదుపాలికిఁబోయి నమస్కరించి వినయముతో నిలిచి
యుండ నాయాచార్యుం డుదంకుని నాలస్యమగుటకుఁ గారణ మడిగెను.
అంత నుదంకుం డిట్లనియె.

గురువర్యా! వినుము. పౌష్యదేవిసన్నిధికి నేఁ బోయి గురుపత్నికిఁ
కుండలంబులు యాచింప నద్దేవి నిరాటంకముగ వాని నా కొసంగెను.
వానిని నేఁ దెచ్చుచుండ మార్గమధ్యంబునఁ దక్షకుండను నాగుండు నగ్న
పురుషక్షపణకదేహుండై నావెంట వచ్చుచుఁ, గొంతవడి కదృశ్యుండగు
చుండి యాకుండలముల నపహరించి పాతాళమున నున్న నాగలోకం
బున కేగెను. నేను బదంపడినాగలోకముఁ బ్రవేశించి తక్షకు నోడించి
క్రమ్మఱఁ గుండలంబులఁ దెచ్చుట కింత తడ వయ్యెను. మఱియును నాగ
లోకంబునఁ దెల్లనినల్లనిదారముల నేయుచున్నస్త్రీల నిద్దఱను బొడగాం
చితి. పండ్రెండాకులతో నొక్కచక్రముం ద్రిప్పుచున్న వారి నార్వురు
కుమారులం గంటి. ఒకమహనీయాశ్వంబును దాని నారోహించిన
యొకమహాపురుషుం జూచితి. ఇంతేకాక పౌష్యనగరమునకుఁ బోవు
మార్గమున నొకవృషభమును, దానిపై నున్న మహనీయుం డగుపురుషు
నొక్కని వీక్షించితి. ఆపురుషుండు నన్నుఁ గాంచి ఓయీ తొల్లి యీ
వృషభగోమయము నీగురుఁడుభక్షించెను. కావున నీవును దీనిని
దినుమని నియోగించెను. మహనీయుం డగు నాపురుషుండు చెప్పినట్ల నే
నొనర్చితి. వీనిలో నాకొక్కటియును దెలియకున్నది. కాన సవిస్తరముగ
వానికలరూపుల నానతిం డనుటయు నాచార్యుం డగు వేదుం డుదంకున
కిట్లనియె. వత్సా! నీకుఁ గనఁబడిన సితాసితతంతువులను నేయుచుండిన

స్త్రీలిరువురును ధాతయు విధాతయు నాఁబడుదురు. నల్లనితంతువులు రేలనియుఁ, దెల్లనివి పగళ్లనియుఁ దెలియుము. ద్వాదశారంబగుచక్రము పండ్రెండుమాసములతో నుండు సంవత్సరకాల మనియు, దానిం ద్రిప్పుచుండు నార్గురు కుమారులు షడృతువు లనియుఁ బురుషుఁడు పర్జన్యుఁడనియు, నాయశ్వం బగ్నిదేవుం డనియు, నీవు గాంచినవృషభం బైరావతం బనియు, దాని నారోహించియుండిన మహాపురుషుం డింద్రుండనియు, నీవు భక్షించినగోమయం బమృత మనియు, నాయమృతము నుపయోగించుటంజేసికాదే నీకు నాగలోకమునందు సంచరించుటను వలను పడిన దనియు, నింద్రుఁడు నాసఖుఁ డగుటంజేసి నీయెడను బ్రసన్నుఁడయ్యె ననియు, వానిప్రసాదంబున నీవు గ్రమ్మఱ నాగలోకంబు నుండి తక్షకాపహృతకుండలములఁ దేఁ గల్గితి వనియు నెఱుంగుము. గురుదక్షిణ నొసంగితివి. నీయెడ సంతుష్టుండనైతి నని చెప్పి యుదంకునకు నిశ్శ్రేయస్సుల నొసంగి వేదుండు సెల విచ్చి పంపఁగా నయ్యుదంకుండు తక్షకుండు తన కొనర్చినమహాపకారమునకుఁ బ్రతీకారంబు సేయం దలంచి హాస్తినాపురమునకుఁ బోయి రాచనగరుఁ బ్రవేశించి, సామాత్యుండగు జనమేజయభూపాలుం గాంచి యాతండు తన్ను వినయపూర్వకంబుగ లేచి యాదరింప నారాజుం దీవించి యాతనితో నిట్లనియె.

### ఉదంకుండు జనమేజయుని సర్పయాగోన్ముఖుం జేయుట

రాజపుంగవా! ముఖ్యముగఁ జేయఁదగినకార్యమును జేయక యేల యాలస్యమును గావించుచున్నాఁడవు? అనఁగా నమ్మునీంద్రున కారాజేంద్రుం డిట్లనియె. భగవంతుఁడ వగు నుదంకమునీంద్రా! వంశక్రమాగతం బగు రాజ్యంబును ధర్మశాస్త్రధర్మములతోఁ బాలించుచు క్షత్రియకులాచారంబుల ననుసరించుచున్నవాఁడ. నే నిప్పు డవశ్యముగ నాచరింపవలసినకార్యము నానతిమ్ము. అనిపలుక నుదంకుఁ డిట్లనియె. రాజకులోత్తమా! నేను నాయాచార్యునకు గురుదక్షిణగా నిచ్చుటకై పౌష్యదేవికుండలంబులఁ గొని తెచ్చుచుండఁగా దురాత్ముం డైనతక్షకుం డను నాగుం డాకుండలంబుల నపహరించుకొనిపోయెను. దానిం

గ్రహ్మరం దెచ్చుటకు నాకెంతయేని శ్రమ కలిగె. నాగురుసఖుండైన మహేంద్రుని యనుగ్రహంబు నాకుఁ గలిగియుండుటం జేసి యతని నాకు తక్షకునియొద్దనుండి కుండల సంప్రాప్తము లయ్యె. కావున, నా తక్షకుండు బలదర్పములతోఁ గూడినవాఁ డగుచు. కావున గాదె రాజర్షి యగును, పరమధార్మికుండును మహేంద్రోపముండును నగు మీ తండ్రి పరీక్షిన్నృపకారణంబుగఁ గఱచి శరీరమును దగ్ధముఁ జేసె. మఱియు నా తక్షకుండు కఱచుచో వాని కాటునకౌషధం బొసఁగి మీ తండ్రి ప్రాణంబులను రక్షింప నేతెంచుచుండిన కాశ్యపుం డను ఋషిసత్తముని దారిలో సందర్శించి వానికి వలసిన యపరిమితధనంబు లొసంగి యాతనిని మీ తండ్రి కడకు రానీయక క్రమ్మరించె. ఇట్టి మహాపాపి యగు నా దురాత్ముఁడగు తక్షకునిం ద్వరితముగా నగ్నికాహుతిఁ గావింప నుద్యుక్తుండవై సర్పయాగంబొనర్పుము. అని చెప్పఁగా జనమేజయుండు తక్షకునిపైఁ గనలి హవిస్సుచే సుద్దీపితమై తేజోవంతమైన యగ్నియుంబోలె నుదంకుని వాక్యములచే గుండి పడి సర్పయాగమున నుపక్రమించె. అని చెప్పఁగా విని శౌనకుండు భృగువంశ చరిత్రమును జెప్పుమని సూతు నడిగెను. అంత సూతుం డిట్లనియె.

## భృగువంశచరిత్రము

పూర్వము వరుణుం డొకమహాయజ్ఞము గావించెను. ఆయజ్ఞము నందు బ్రహ్మ హోమము చేసెను. అప్పు డాయగ్నినుండి భృగువుదయించెను. భృగువు పులోమ యనుదానిని వివాహమాడెను. వారికి చ్యవనుండు పుట్టె. చ్యవనునకుఁ బ్రమతి జనించె. ప్రమతి ఘృతాచిని బెండ్లాడి రురుం గనెను. రురునకు బ్రమద్వర భార్యగా వేదపారగుఁడగు శునకుం గనియె. ఆశునకుఁడు ధర్మాత్ముండును, తపస్వియుఁ, గీర్తిమంతుండును, సత్యవాదియు, నియతాశనుండును, బ్రహ్మవేత్తయు నై వెలయుచుండె అని చెప్పుచుండఁగా శౌనకుఁడు సూతు నిట్లడిగెను. ఓ పౌరాణికశ్రేష్ఠుఁడా! భృగుకుమారుఁడైన చ్యవనునకు నాపే రెట్లు గలిగె? వివరించి చెప్పు మనఁగా సూతుం డిట్లని విన్నవించెను.

భృగువు పులోమ యనుపుణ్యాంగనను మంత్రపూర్వముగ వివాహమై యాసతీమణికి గర్భాధానం బొనర్చి యాదేవి గర్భిణిగా నుండు

నప్పు డొకనాఁడు భృగు వాసాధ్వి నాశ్రమరక్షణకొఱ కగ్ని గృహం
బున నుంచి యేటికి స్నానమునకుఁ బోయెను. అంతఁ బులోముం
డను రక్కసుం డాసమయమున నాశ్రమంబు సొచ్చి పులోమచే నతిథి
సత్కారంబుల నొందుచు నాసుందరాంగి యాకారంబునకు మోహించి,
తాను పూర్వ మాసతిని బెండ్లాడ నిశ్చయించి యుండ నాదేవి
జనకుండు భృగువున కొసంగి వివాహముం జేయుటయుం జింతించి యగ్ని
గృహంబునఁ బ్రజ్వలించుచుండు హుతవహుంగని 'యోహవ్యవాహనా!
నీముఖంబున దేవతలు హవిస్సుం గొందురు. 'తొల్లి నే నీమెను వరించి
యుండ దీనితండ్రి వేదవేదాంగముల నెఱింగినవాఁడని కాదే భృగువునకు
సమంత్రకంబుగ నొసంగి వివాహముఁ జేసెను. ఇది నీ వెఱింగినదియే
కదా?' అనఁగా నగ్నిదేవుం డసత్యమునకు వెఱచి యిట్లనియె. 'ఈయంగ
నను నీవు పూర్వము వరించియున్నను, దీనితండ్రిని భృగుమహర్షి తన కిచ్చి
వివాహము గావింపు మని వేడఁగా నాతం డియ్యకొని సమంత్రకంబుగ
భృగువున కొసంగి వివాహము గావించె నని చెప్పఁగా నారక్కసుం
డగ్నిమాటల నాదరింపక, వెంటనే వరాహరూపము నెత్తి యబల
యగు పులోమ నెత్తికొని పాఱెను. ఇట్లు రాక్షసాపహృతయైన పులోమ
యతిభీతురాలై కోసావేశమునసుండ గర్భమునసున్న మునికుమారుండు
గర్భమునుండి చ్యుతుండయ్యెను. గర్భము చ్యుతము కాఁగాఁ బుట్టిన
వాఁడు గాన నమ్మునికుమారుండు చ్యవనుండు నాఁబరఁగె. గర్భమునుండి
యాదిత్యుని తేజస్సుతోఁ బుట్టిన యామునికుమారుని దివ్యతేజస్సుచే
నారక్కసుండు దగ్ధుం డయ్యె. ఆపుత్త్రోదయమునను దుఃఖమునకు నోర్వ
లేక, యేడ్చుచున్న యనిందిత యగు పులోమకుఁ బితామహుం
డేతెంచి యామె నూరడింపఁ జేసి యామె కన్నీటి వెల్లువఁగాఁ బాఱఁ
జొచ్చిన భృగ్వాశ్రమప్రాంతపుఁ గాలువకు వధూసర యని పేరిడి పితా
మహుండు యథేచ్ఛం జనియె. పులోమయును శిశు వగు చ్యవను నెత్తి
కొని యథాక్రమంబుగ నిజాశ్రమమును జేరెను. అంత స్నానార్థమరిగిన
భృగువు నిజాశ్రమమున కేతెంచి సకలవృత్తాంతంబును నెఱింగి రక్కసు
బారినుండి తనభార్య నగ్నిహోత్రుండు తప్పింపకుండినందుల కలిగి

యగ్ని హోత్రుని సర్వభక్షకుండ వగుదు వని శపించె. అప్పుడు వీతి హోత్రుం డమ్మునికి ట్లనియె.

విప్రవరా! నేను సాక్షిని. నన్ను శపింప నీవెట్లు సాహసించితివి? సాక్ష్యమడుగఁబడినపుడు తనకుఁ దెలిసినదానిని జెప్పనివాఁడును, దెలిసినదాని వ్యత్యస్తముగఁ బల్కువాఁడును, దనకు ముందటి యేడుతరములను దనకు వెనుకటి యేడుతరములను నరకావాసంబునఁ గల్గించినవాఁ డగును. కావున నే నెఱింగినదానిం జెప్పితి. దానంజేసి నీవు శపింప నేఁ జేసిన దోషం బెయ్యది? నేను బ్రతిశాపం బీయ సమర్థుఁడ నైనను నాకు బ్రాహ్మణులయెడఁ గడుఁ బ్రీతి గావున నీకుఁ బ్రతిశాపం బీనోప. వారినిఁ బూజ్యులని నేఁ దలంతుఁ గావున నూరకుండెద. అయినను నాముఖంబున దేవతలు హవ్యంబును, పితరులు కవ్యంబును గొందురు. అట్టి నే నెట్లు సర్వభక్షకుండ నగుదును? అని పలికి యగ్ని దేవుండు తనమూర్తి నుపసంహరించికొనఁగా లోకంబున యాగాదు లగు నగ్ని నిర్వాహ్యంబులగు సర్వకార్యంబులును లోపించె. అమావాస్యాదిదిన ములయందుఁ బితరుల కార్యములును, పూర్ణిమయందు దేవతల కార్యము లును నగ్నిముఖంబునఁ గావింపఁబడు చుండినవి. అగ్ని లేకపోఁగా లోకకార్యంబు నిలిచె. మును లెల్ల రాహారవంబులతోను దేవత లాశ్చ ర్యముతోను పితామహునిపాలి కరిగిరి. అగ్నికి భృగుమహర్షి యొసంగిన శాపంబు కారణంబుగ నగ్ని తన తేజస్సు నుపసంహరించుకొనుటచేతఁ, దానంజేసి లోకయాత్ర సాగమింటుఁ, గ్రియాలోపములను, దేవతలును, మునులును బ్రహ్మకు విన్నవించిరి. అంతఁ బరమేష్ఠి యగ్ని దేవునిఁ దనకడకు రప్పించి సాంత్వవచనముల నిట్లనెను. ఓయగ్నిభట్టారకా! నీవు లోకములకుఁ గర్తవు. కర్మలు నీమూలమున లోకమునందుఁ బ్రవర్తిల్లుచుండుటచే నీవు ముల్లోకములను ధరించువాఁడవు. క్రియలకు లోపము వాటిల్లకుండ లోకయాత్ర నడుపుదుము. నీవు ముల్లోకములయం దెల్లప్పుడును బవిత్రుఁడవు. సర్వభూతములకును నీవ గతివి. భృగుశాపం బున నీకుఁ గల్గిన సర్వభక్షకత్వంబున నీకెట్టి యశుచియుఁ గలుగదు. నీవు సదా పరమశుచివి. నీవు జ్వాలామూర్తివి గావున నశుచిపదార్థము

లను నపానజ్వాలికలచేతను, గ్రవ్యాదమూర్తివై! యభోజ్యపదార్థము
లను భక్షించుచుందువుగాత!

ఎట్లు సూర్యకిరణములు సోఁకిన నశుచిపదార్థము లెల్లను శుచి
యగునో యట్లే యభోజ్యములును నపాయములును నీచే దగ్ధమై శుచి
త్వమునొందును. స్వభావము చేతనే నీవు పరమతేజోమూర్తివి. నీతేజస్సు
చేతనే ఋషిశాపమును సత్యగంతమైనదిగ నొనర్పుము. నీముఖమున
దేవతలకుఁగా హోమముచేయఁబడిన వానిలో నీభాగమును బరిగ్రహిం
పుము. అని బ్రహ్మ వేఁడుకొనఁగా నగ్ని దేవుం డియ్యకొని లోకకర్మముల
యథావిధిఁ బ్రవర్తింపనియ్యకొనియె. అట్టి భృగుమహర్షికిఁ బులోమ
యందుఁ జ్యవనుండును, నాచ్యవనునకు సుకన్యయను నంగనామణియందు
బ్రమతియుఁ బుట్టిరి. అతండుఘృతాచియనుదానిం బెండ్లిగొని యద్దేవియందు
రురునిఁగనెను. ఆరురునకు భార్యయైన ప్రమద్వరకు శునకుండు పుట్టెనని
ముందుఁ జెప్పితిం గాదె. ఆరురుచరిత్రము నో విప్రోత్తములారా! సవి
స్తరంబుగఁ జెప్పెద నాకర్ణింపుఁ డని వారలకు సూతుండు వెండియు
నిట్లనియె.

## రురుచరిత్రము

పూర్వ మొకప్పుడు మేనక యను దేవవేశ్య విశ్వావసుం
డనుగంధర్వుంబొంది యొకకన్యకంగనియె. ఆకన్యను మేనక స్థూలకేశుండను
స్నానార్థ మేటికిఁ బోయి యందు నిర్జనప్రదేశమున నొకబాలికం జూచి
కృపాళుండై యాశిశువును దనయాశ్రమంబునకుఁ జేర్చి దానిం బెంచెను.
అటులు పెనుచుచు నతఁ డాబాలికకు జాతకర్మాదులను విధ్యుక్తంబుగ
నొనర్చి యాశ్రమములోని ప్రమదాజనంబుల నన్నిటి నతిక్రమయగుటచే
వానికిఁ బ్రమద్వర యనుపేరిడెను. అంతఁ బ్రమద్వర మునియాశ్రమంబున
శుక్లపక్ష శీతకరరేఖవలె దినదినప్రవర్ధమానయై నిండుయౌవనంబుఁ దరిసె.
అప్పు డొకనాఁ డాయాశ్రమమునకు బ్రమతి ఘృతాచుల కుమా
రుండు రురుం డేతెంచి దానిసౌందర్యమునకును, యౌవనంబునకును నచ్చెరు
వందుచు దానియందుఁ దవిలినమనస్సుతోఁ దండ్రిపాలికిం బోయి తన
యభీష్టంబు దండ్రికిఁ జెలికాండ్రచేఁ దెలుపఁగాఁ బ్రమతి స్థూలకేశుని

యాశ్రమమున కరిగి యమ్మునితో నిట్లనియె. "మునివర్యా! నీయాశ్రమంబునఁ బెరుగుచున్న ప్రమద్వర యను సుందరాంగిని నాకుమారుండు వలచియున్నవాఁడు. ఆదేవిని నాకుమారుఁడగు రురున కొసంగి విధ్యుక్తవివాహముఁ గావింపవలయును. ఇదియును నావచ్చిన కార్యమ్ము" ముని చెప్పఁగా స్థూలకేశుండు మిక్కిలి సంతసిల్లి కన్యనిచ్చుటకొడంబడి యొక సుముహూర్తమునఁ బూర్వఫల్గునీనక్షత్రసమయమునందు విభవముతోఁ బ్రమద్వరారురులకు వివాహము గావింప నిశ్చయించెను. అంత నాశుభముహూర్తదినమునకుఁ గొన్నినాళ్లు ముందుగ ప్రమద్వర తన చెలికత్తెలతో నాశ్రమసమీపవనమునందు విలాసముగఁ గ్రీడించుచు నొకపామును హఠాత్తుగాఁ దనపదంబునఁ ద్రొక్కెను. నిద్రించుచుండిన యప్పాముదిరిపడి మేల్కొని రోషముతోఁ బ్రమద్వరం గఱచెను. ప్రమద్వరయు నప్పాముపిషము తలకెక్కి మూర్ఛిల్లి నేలఁగూలెను. అట్లు విగతప్రాణయగు తనకూఁతుఁ దండ్రి మున్నుగు నాశ్రమవాసు లెల్లరుం జూచిరి. కాని యెవ్వరును దాని విషనిర్ముక్తగాఁ జేయు లేనివారైరి. ఆముద్దులుగులుకు మండిన పూఁబోడి శరీరమును జూచుట కయ్యాశ్రమవాసులగు నాత్రేయ, మహాజాను, గౌతమ, కుశిక, శంఖ, మేఖల, ఉద్దాలక, కఠ, శ్వేత, భరద్వాజ, కౌణ, కుత్స్య, ఆర్ష్టిషేణాదిమునులును, బ్రమతియను నాతనికుమారుండగు రురువును వచ్చి ప్రమద్వరాకాకస్మికమరణమునకుఁ జింతిల్లుచుండిరి. రురువుమాత్ర మాసుందరాంగిని దా వివాహమాడుటకు విధి యాటంకపెట్టెనే యని బోరన నేడ్వఁజొచ్చెను; కాని, వాఁ డంత నచ్చో నిలువలేక యరణ్యంబున కేగి బహువిధంబుల నా కన్యకై పరిపరివిధములేడ్చి తుద కిట్లు ప్రతిజ్ఞ చేసెను. నేను దానములం జేసినవాఁడ నగుదునేని, తపంబుల ననుష్ఠించినవాఁడనైతి నేని, పెద్దలం బూజించినవాఁడ నైతినేని, గురువుల నారాధింతునేని, పుట్టినదిమొదలు నియతవ్రతాచరణపరాయణుండ నగుదు నేని, యీప్రమద్వర జీవితంతురాలగును గాక యని శపథములు పల్కుచుండఁగా దేవదూత యొక్కండాకసంబున వానికి నేత్రగోచరుండై యోమునికుమారా! నీవేల యిట్లాపూఁబోడికై వగచెదవు. అది జీవించుట కుపాయం బొండు

కలదు. దాన నాయబల పునర్జీవితురాలగును. నీయాయుస్సునం దర్ధ
మాసుందరికి ధారవోయుము. వెంటనే దానికిం జైతన్యంబు గలిగి జీవనం
తురా లగు నని దేవతలు నీతోఁ జెప్పుటకు నన్నంపిరి. అనిపల్క రురుం
డట్ల యగు గాక యనెను. అప్పుడు దేవలోకంబునం బ్రమద్వర తండ్రి
యగు విశ్వావసుండును దేవదూతయును వెంటనే యమునిపాలి
కరిగి ప్రమద్వరకు రురుం డనుమునికుమారుండు తనయాయుస్సునం
దర్ధం బొసంగె. ఇంక దాని భూలోకంబున కనుపు మని ధర్మదేవతతోఁ
జెప్పఁగా నాతం డట్లు చేసి యాకన్యకను బునర్జీవితురాలిగఁ జేసెను.
ఇటుఁ బ్రమద్వర వెంటనే చేతనముగలదై చేతులుం గాళ్లును గదలఁగా
గాఢనిద్రవోయి మేల్కాంచినదియుంబోలె లేచి యచ్చోట నున్నవారి
కానందంబును దండ్రికి హర్షాశ్రువులుం గలుగఁజేసెను. వెంటనే
రురుండేతెంచి తనకోరినయంగనామణి ప్రాణవంతురాలు కాఁగా తన యా
యుష్యంబునం దర్ధం బొసంగి దానిం బ్రతికించిన వాఁడగుట నొక్కసుము
హూర్తంబున నానెలఁతను బెండ్లాడెను. అప్పటినుండి రురుండు సర్ప
ములయెడ దీర్ఘక్రోధము గలిగి యెచ్చటఁ బాముం జూచిన నచ్చటనే
దాని నొక్కకఱ్ఱతో నిర్దయుండై చంపుచుండె. అంతనొక్కనాఁడు వన
మధ్యంబునఁ బోవుచున్న రురుండు డుండుభం బొక్కదానిం జూచి
సక్రోధుండై దానిం జంపఁ గఱ్ఱనెత్తఁగా నాడుండుభము రురున కిట్లనియె.
మునికుమారా! నన్నేల చంపఁబూనెదవు? నీకు నేమి యపకృతిం
గావించితి; నని యడుగఁగా రురుండు దాని కిట్లనియె. [illegible]
ఫుంబున నాప్రియురాలిని నదయుగ్రాహి కఱచె. నాఁటఁగోలె నేను
జూచుపాముల నెల్లఁ జంపుట నావ్రతం బనఁగా నతనికి డుండుభము
వెండియు నిట్లనియెను.

ఓ బ్రాహ్మణోత్తమా! విషోరగము లగు పాములు గఱచి జీవులఁ
జంపునట్టి సామాన్య [illegible] సర్పంబులు గలవు. [illegible]
పాము నీకు నే యపకారము గావించె నని పాముల నెల్లం జంపుట యేమి
ధర్మ మగును? కావున నీవిపాములను నెట్టి కారణమునఁ జంపుట
మానుము. అని చెప్పఁగా రురుండు తన కా డుండుభము హితవు చెప్పె నని
తలంచి దానిం జంపక విడిచిపుచ్చె. అంత నా డుండుభము తన సర్పశరీ

రమును వదలి మునీంద్రరూపము దాల్చిన, గుణగణ దేదీప్యమానంబంది నీవు డుండుభరూపము నెట్లు విసర్జించి ఋషిరూపంబుం దాల్చితివి! నీచరితంబు నాకత్యాశ్చర్యకరంబై యున్నయది. సకలము నెఱింగింపవే యన నామునీంద్రుండు ప్రమద్వరాభర్త కిట్లనియె.

ప్రమతిపుత్త్రుండా! ఋషీశ్వరుండా! సకలము నెఱింగించెద. సావధానుండవై వినుము. పూర్వ మొకప్పుడు నేను సహస్రపాదం డను పేరితో నొక ఖగముం డను చెలికాండును తోడ్త నగ్నిశాల క్రీడించు చుంటి. అప్పు డొక్కనాడు ఖగముండు దగ్నిహోత్రగృహంబున నుం డంగా నేను వినోదార్థ మాతనిపై గడ్డితో నొక్కసర్పాకారమును నిర్మించి యాతనిపై వైచితి. ఆసర్పాకారముతో నున్నగడ్డిపోచ నుం డంగా నాతండు దానిని యథార్థసర్ప మని భ్రమసి యపరితాపి మూర్ఛి ల్లెను. పిమ్మట ఖగముండు కొంతసేపటికి మూర్ఛదేఱి నన్ను క్రోధారు ణితలోచనుండై మమ్మునుం జూచి యచేతనంబగు సర్పాకారమును నాపై వైచి నన్ను వెఱపించితివి. కావున నిర్వీర్యంబైన డుండుభంబ వగుదు వని శపియించె. నే నాతని తపోమహాత్మ్యము నెఱింగినవాడ నగుటం జేసి శాపభీతుండనై వానికి కేల్మోడ్చి మ్రొక్కి యిట్లంటిని. మహాత్మా! నీవు నాకు చెలికాండ వని యాత్మవినోదంబునకు నీపై విలా సంబునకు వైచితిం గాని నాయెడ ద్రోహంబు లేదు. నా ప్రార్థన మంగీక రించి శాపంబును మరల్పవే? నన్ననుగ్రహింపవే? యని పలువేఱుగులం బ్రార్థించిన నతండును బ్రసాదంబునం జేసి యనుగ్రహించి నాకు శాప విముక్తి యిట్లని నుడివె. "నీవు భృగుకులసంజాతుండగు రురునితో సంభా షణంబును, నాతని దర్శనంబును నెన్నండు గల్గునో నాండు నీకు శాప మోక్షణం బగు నని చెప్పి నాతో వెండియు నిట్లనియె. ఓయీ! అహింస పరమధర్మము. భూసురు లెట్టి ప్రాణికిని హింసచేయరాదు. శ్రుతులు, భూ సురులు పరమశాంతులని నుడువును. వారు దయావంతులును. ఉగ్రమగు దండధారణము క్షత్రియధర్మము. మరియు భూసురులకు శాంతి, అహింస, వేదాధ్యయనము, సాధుశీలత్వము, సర్వభూతములకు నభయదానబుద్ధి సహజధర్మము. ఇట్లుండ నీవు బ్రాహ్మణుండవై పుట్టి క్షత్రియులకు నుచితం బైన దండధారణముం బూని యిట్లు పాములను వధించుట నిజకులోచిత

ధర్మము గానేరదు. ఇట్లే పూర్వకాలంబున జనమేజయుం డను రాజ చంద్రుండు సర్పయాగ మొనర్ప నందు సర్పకులమునకుఁ బ్రళయం బయ్యె. అప్పు డస్తీకుం డను ఋషివర్యుం డాసర్పయాగంబును నివారించె" నని చెప్పి తొల్లి డుంఢుభరూపంబుతో నున్న సహస్రపాదుం డను ఋషీశ్వరుండు రురుదర్శనంబునను సంభాషణంబునను శాపవిముక్తుం డై యదృశ్యుం డయ్యె. అంత రురుండును తండ్రి యగు ప్రమతి పాలికిం జని తనకును డుంఢుభమునకును జరిగినవృత్తాంతం బంతయును సవిస్తరంబుగాఁ జెప్పె ననిన శౌనకాదు లగు ఋషులు నాపౌరాణికునితో నిట్లనిరి.

రోమహర్షణీ! ఏకారణంబున జనమేజయుండు సర్పయాగమును నాచరించె? దాని నస్తీకుం డేల నివారించె? జనమేజయుని యాగాగ్ని యందు సర్పంబు లేమికారణంబునఁ బడి నశించె? ఇదియంతయును సవిస్తరంబుగా మాకుఁ జెప్పవలయు ననిన వారలకు నుగ్రశ్రవసుం డిట్లనియె.

తొల్లి కృతయుగంబునఁ గశ్యపప్రజాపతికిఁ గద్రువ, వినత యను భార్య లిరువు రుండిరి. వా రిరువురును మగనిమనస్సు సంతోషించునట్లు లెప్పగాఁ బరిచర్యలను సలుపఁగా నొక్కనాఁడు కశ్యపుండు వారిరువురి యిట్లనియె. ఓవనితలారా! మీశుశ్రూషం జేసి సంతుష్టుండ నైతి. మీ కెద్దియేని వరంబులు వలయునేని కోరుకొనుఁడు అని చెప్పఁగాఁ గద్రువ తనకు బలపరాక్రమవంతు లగు పుత్త్రుల వేవురను గ్రహింప వేఁడెను. వినతయుఁ గద్రువపుత్త్రులకన్నఁ దేజోబలపరాక్రమంబులం గలవారి నిద్దఱఁ బ్రసాదింప భర్తను బ్రార్థించెను. అంత, గశ్యపుండును వా రిరువురకోర్కెలు సమకూరునట్లు ననుగ్రహించి యుదరస్థములను గర్భంబుల యథావిధి రక్షించుకొనుఁడని, [illegible] జెప్పి తపంబునకుఁ జనియెను. అంతఁ గొంతకాలమునకుఁ గద్రువ వేయుగ్రుడ్లను, వినత రెంటిని గనిరి. వానిని పరిచారికలు నేతికుండలలోఁ బెట్టి కాపాడుచుండిరి. ఆగ్రుడ్లు జనించిన ఐదునూఱేండ్లకుఁ గద్రువకు జనించిన గ్రుడ్లన్నియుఁ బిల్లలై నాగకుమారులు వేవురు గల్గిరి. ఆనాగులలో శేష, వాసుకి, ఐరావత, తక్షక, కర్కోటక, ధనంజయ, కాళియ,

సంద్రమునుండి యమృతముతోఁ బుట్టి యాసముద్రతీరమునఁ దిరు
గాడుచు నమోఘబలము గలిగి లోకములోని యశ్వములలో మేలై
శ్రీమంతమైఅజరమై సర్వలక్షణములతోఁ గూడుకొనిన యుచ్చైశ్శ్రవ
మను పేరుగల యశ్వరాజముం గాంచిరి. అని సూతుండుచెప్పుచుండఁ
గనే శౌనకుండు దేవతలును దానవులును నిరువురుంగూడి క్షీరసము
ద్రము నేల ద్రచ్చిరి? ఆవృత్తాంతమును సవిస్తరముగఁ దెలుపు మని
యడుగఁగా నాసూతసుతుం డగుకథకుం డమ్మునిశ్రేష్ఠున కిట్లని చెప్పం
దొడఁగె.

## క్షీరసాగరమథనము

మునిశ్రేష్ఠా! వినుము. తనయపారమైన తేజముచే భువనముల
నన్నింటిని బ్రకాశింపఁజేయుచున్న సూర్యునికాంతికంటె నధికమై
స్వయంప్రకాశముతోను, బంగారుచాయతోను వెలుఁగుచుండు మేరు
పర్వతశిఖరమునందు నారాయణు డావిర్భవించియుండ నచ్చోటికి దేవత
లేఁగి తమ కమృతంబు గావలయునని కోరిరి. అంత నయ్యాదిదేవుండును
వారితో నిట్లనియె. మీరును దానవులును నొక్కటై పాలసముద్రము
నందు సకలౌషధులను వైచి మంథపర్వతమును గవ్వముగా నమర్చి
కొని చిలుకఁగా నమృతం బుత్పన్న మగును. అని చెప్పఁగా దేవత లంద
ఱును బదునొకండువేలయోజనంబులపొడవును, నంతియ లోతునుం
బాతుకొనియున్న మంథరనగముం జేరి దాని నున్నచోటునుండి పెకలింప
యత్నించిరి. కాని, యెంత ప్రయత్నముం జేసినను నాపర్వతము కదల
దయ్యె. అంత వారందఱుంగూడి మఱల మేరుశిఖరంబునఁ దేజోమయుం
డై స్వయంప్రకాశమూర్తియై వెలుఁగుచుండు నారాయణుం బొడఁగాంచి
యిట్లనిరి. దేవా! నీ యానతిచ్చిన పర్వతము మనుష్యులకు గనులచే
నావరింపఁబడినదియును, ననేకసిద్ధగంధర్వాదులకు నివాసమైనదియును,
దివ్యౌషధుల కాంతులతో జ్వలించుచున్నదియును, మేఘమండలము నతి
క్రమించి యున్నతమైనదియును, నానావిధజంతువులతో నిండియున్నదియును,
నానావిహంగమసేవితమైనదియును, సుగంధ కుసుమములు కిన్నరగంధర్వులవిహా
రమునకు యోగ్యమైనదియు నగు నమ్మంథనగము మే మెంతయత్నము
జేసినఁ గదలదయ్యె. మే మేమి చేయువలెను? మహానుభావా! అట

పురుషా! దీని కుపాయంబు నచ్యుతుని వేఁడఁగా నారాయణుండు సర్పశ్రేష్ఠుండగు ననంతునిం జేరి యిట్లానతిచ్చెను. ఓయనంతుఁడా! నీవు దేవహితార్థమరిగి మందరనగముం బెకలించి దానిని క్షీరసాగరమునందుఁ జేర్చి రమ్ము. అనఁగా నమ్మహానాగము సర్వాత్మునాజ్ఞను శిరసావహించి వెంటనే దేవతలు రాఁగా నమ్మందరనగము నవలీలఁ బెకలించి దానిని మోచికొని యశ్రమంబున బాలకడలిఁ జేర్చెను. అంత దేవతలు తాము మథింపఁగా నుత్పన్నమగు నమృతమునందుఁ గొంతభాగము సముద్రున కిచ్చునట్లొడంబఱిచి సముద్రమథనంబునకుఁ గడఁగువారు పర్వతము సముద్రమున మునుఁగకుండునట్లు [illegible] క్రమ్మఱ నారాయణునిఁ గూర్చి తపం బొనర్ప నప్పరమకారుణికుండగు భక్తజనపారిజాతంబు, వారికిం బొడసూపి తాను మంథరపర్వతపు టడుగుభాగమును మహాకూర్మమై తనవాలంబున నప్పర్వతమును ధరించి సముద్రమథనకాలమునను దానియడుగును పైకుబుకఁబెట్టినను, నంత నాపర్వతము చక్కఁగా కవ్వముంబోలె నమరి నిలుచుట కనువై [illegible] [illegible]. అంత నింద్రుండు తనవజ్రాయుధమున నాకూర్మరాజు పృష్ఠచిప్పను చీల్చి సవరింపఁగా దానిపైని మంథరనగంబును ననంతుని సాహాయ్యంబున దేవత లమర్చియుంచిరి. అంత వారందఱు నేకముఖులై కవ్వమునకుఁ జిలుకుటకుఁ ద్రాడుగా వాసుకిం బ్రార్థింప నావాసుకి యమ్మహాకార్యమునకుఁ దాను బద్ధుఁడై యుండుట కొప్పుకొనెను. అంత నవ్వాసుకి తలలను దానవులును, తోఁకను దేవతలును బట్టుకొని క్షీరసాగరమథనంబున కారంభించిరి. ఇట్లు చిలుకుచుండ ననంతుండును శ్రీమన్నారాయణుండును కూర్మరూపమున నున్నస్థలమును జేరి మథన సమయమున వాసుకి పడగలు పై కెగయునప్పుడెల్ల వాని నణఁచుచుండె. ఈప్రకారము మథన మాఁగబడక నిలువక కొనసాగుచుండె. అప్పుడును చిలుకుఁద్రాడైన వాసుకి వదనగహ్వరములనుండి పొగయు నగ్నియుం గూడిన నిట్టూర్పులు వెలువడెను. అవి యాకసంబున కెగసి తళతళ లాడుచుండు మెఱుపులై మేఘాకారములను దాల్చి, యలసిన దేవతలపై చల్లనివర్షమును గురియించి వారిశ్రమను బోఁద్రోలుచుండె. మఱియును మంథరపర్వతంబు కవ్వమై చిలుకుచుంటం జేసి యానగమంతయు నిటునటు చలించుచుండ

నాయదరుపాటునకుఁ బర్వతముపై నున్న చెట్లు పుష్పములను దేవతలపై రాల్చుచు వారికిఁ గొంత యుత్సాహంబు గలిగించె.

ఇట్లుపర్వతసంఘర్షణధ్వనిచే సముద్రములోని నానావిధజంతు సంతానమంతయు క్షోభమును జెంది యల్లకల్లోలమై "యిది యేమి ప్రళయకాల మయ్యెనే?" యని భ్రమాకులితమనంబులుగల దయ్యెను. ఆమహాధ్వనికి ననేక వృక్షములు గూలెను. ఆచెట్లరాఁపుడుచే నగ్ని కణంబు లుత్పన్నములై యామహానగమునందలి యనేకజీవరాసులను గాల్పఁదొడఁగుటయు నింద్రుండు పర్జన్యుం జేరి చల్లగా వర్షములఁ గురియుట కాజ్ఞనొసంగఁగా నావర్షముచే పర్వతమునందు వెలువడిన యగ్ని చల్లారి నగములోని భూతముల కన్నిటికి ముద మొదవించె. మఱియు నట్లు మథించుచుండ మందరాచలముపై నుండు నానావిధ వృక్షములనుండి యోషధు లెల్లను నధిఁబడినను దేవత లెంత కాలము ద్రచ్చినను నమృతంబు పుట్టదయ్యె. కాని మథనకార్యముచే దేవతలు డస్సిరి. అంత నిరాశులై మఱలి దేవతలు కొందఱు పితామహుం జేరి యెంతకాలమునకును నమృతంబు రాదయ్యె. మేము నిస్సారుల మైతిమి. అనఁగా నాపరమేష్ఠి శ్రీమన్నారాయణుని వేఁడి వారికి బలశౌర్యంబులఁ బ్రసాదించున ట్లనుగ్రహింపు మనెను. అంతట నయ్యాదిదేవుండు దేవతలకు దయాళుండై బలదర్పము లధికముగా నిచ్చి వారిని మథనంబునకు మఱలను సుత్సాహపూరితులుగఁ జేసెను. అంత వారు సంభ్రమంబునఁ ద్రచ్చుచుండఁగాఁ గలశోదధియందుండి చంద్రుండును, మహాలక్ష్మియు, సురాదేవియు, నుచ్చైశ్శ్రవంబును, కౌస్తుభమును బొడమెను. అంత మహాలక్ష్మియుఁ, గౌస్తుభమును శ్రీమన్నారాయణునిఁ జేరె. మిగిలిన వన్నియుఁ దేవలోకంబుఁ జేరె. అట్లు దేవదానవు లుత్సాహపూరితులై మథింపుచుండఁ దెల్లని కమండలములో నమృతమును సంపూర్ణంబుగాఁ గొని ధన్వంతరియు, నాల్గుకొమ్ములతోను వెలుఁగుచు దెల్లనై ఘనరాజసంబను గజరాజమును నుదయించెను. ఆగజరాజము నింద్రుఁడు గైకొనెను. మఱియు నుద్రేకముతో మథించుచుండఁగా దానినుండి పొగ లెగయుచును నతిభీషణంబై, లోకమును భయభ్రాంతముఁ జేయుచు, ముల్లోకములను

హతశేషులైన యసురులు నారాయణునిచక్రమునకు భీతిల్లి లవణసముద్రముం జొచ్చిరి. ఇవ్విధంబుగ దేవాసురయుద్ధం బత్యంతమహాఘోరంబై తొల్లి ప్రవర్తిల్లఁగా దేవతలు గెలిచిరి. అసురులోడిరి అని క్షీరసాగరమథనప్రకారం బంతయును శౌనకునకు నుగ్రశ్రవసుండు నిరూపించి వెండియు నిట్లనియె.

**సముద్రతీరంబునఁ గద్రూవినతలు పాలకడలియం దుత్పన్నమైన యుచ్చైశ్శ్రవంబును జూచుట**

అంతట నొక్కనాఁడు కద్రూవినతలు పరస్పరము వినోదార్థముగఁ బాలకడలితీరంబున కేఁగి ప్రసన్నగుచుండువా రచ్చోట సంచరించుచు, సముద్రమథనకాలంబున నాకడలియందు నుదయించి యున్నట్టిదియును, నచ్చునఁ బోసిన బ్రహ్మతేజమో యనఁ బరగుచున్నదియు, నిశ్వాసనిజజవంబులయం దుండు మిన్నేటియిసుకగొనుక్క మనోజ్ఞతగలదియును శ్వేతమును నగు నుచ్చైశ్శ్రవం బను దేవతలయశ్వరాజమును గనుఁగొనిరి. అయ్యశ్వరాజంబుం జూచి వినత శరీరమునం దెచ్చటను నొక్కనల్లనిమచ్చ యైనను లేక యిట్టి ధవళంబైన శరీరముతో నుండు నశ్వం బెందేని గలదే యనఁగా దానిమాటలం గైకొనక కద్రువ "నీకు దృష్టి తప్పినట్లున్నది. దానివాలంబు నల్లనై యున్నది" యనెను. అది విని వినత దానియంగం బంతయుఁ గలయం బరికించి, 'కాదే యక్కా! శరీరమున నెచ్చటను నల్లన లేదు. నీవు విలాసమునకు నాడినమాటయా యిది? లేక, యథార్థముగఁ జెప్పితివో? అదియునుంగాక నీకన్నులెట్లు గాన నయ్యెనో!' యని యడుగ, కద్రువ మునిముని నవ్వులు నగుచు 'నదియేటి మాట, అల్లదిగో నలుపు గోచరం బగుచున్నయది. తెల్లం బలుకవలసిన దేల?' యనిపలుక విని వినత మఱల నాయశ్వరాజంబును దేఱిచూచి, "నీలిమ యెంతమాత్ర మీయశ్వంబునఁ గానరాదు" అనెను. అంతఁ గద్రువ "వృథోక్తులఁ బ్రయోజనం బేమి? పందెము నీవు చెప్పిన ట్లంతటఁ దెలుపుండి నీలిమ లేనిచో నేను నీకు దాసి నగుదును. కాదేని యో వినతా! నీవు నాకు దాసురాలి వగు" మనెను. అట్లు కద్రువ పందెము చఱచఁగా సహజవినమ్రస్వభావ యగువినత తనపుత్త్రశాప కారణంబున నుద్రేకమడరఁ దెంపుసేసి యత్తెఱంగున కియ్యకొనియె.

లుండు ధర్మముతో భూపరిపాలనంబు సేయుచుండఁగా నామహానీయుండు సర్పయాగ మను సత్త్రమును గావించి సర్పప్రతతిక్షయము చేయును. ఆయాగాగ్ని యందు మీ రెల్లరు నుగ్రతాపాతురులై చొచ్చి మడియుదురు" అనెను. ఈశాపంబును సర్పసంఘంబులు విని తల్లి యొద్ద కేగి భీతులై అమ్మా! మేము నీకు గారాపుబిడ్డలము గాన వాలముం బోనివి నల్లనై తోఁచునట్లు చేసెదమని పలికి యంతట నుచ్చైశ్శ్రవము యొక్క తోఁక నొక్కనల్లని పాము మ్రింగి దానితోఁకను నలుపుగాఁ దోఁపించె.

కద్రువ తనపుత్రుల కిచ్చిన శాపమును సురలు బ్రహ్మ విని యిట్లనిరి. "ఈ క్రూరంపు బుద్ధులగు నాగులు తమ విషవేగంబున లోకముల కెల్ల మహాపకారంబు గావించుచున్నారు. వీరికిఁ గద్రువ యొసంగిన శాపం బుచితంబ. పరద్రోహచింతనులు నిరంతరంబు నగువారికి నిట్లే ప్రాణాంతకంబైన శిక్షను దైవ మేర్పాటు గావించు" అని కద్రువను గొనియాడి శాపంబును బ్రహ్మాదులు నామోదించిరి. మఱియును నీకద్రువ శాపంబునం జేసి యాదేవిభర్త యగు కశ్యపుండు చింతించునో యని తలంచి యాఋషివర్యుం బిలిచి బ్రహ్మదేవుం డిట్లనియె. కశ్యపా! కద్రువ నీపుత్రుల కొసంగిన శాపంబునకు మానసంబునఁ బుత్రస్నేహంబునం జేసి కలఁత నొందకుము. నాగులు లోకద్రోహులు. వారి విషమువలన మడియుట కద్దులు. మఱియును జనమేజయనృపాలుండు గావించుసర్పయాగమునందు నాగులకు వినాశంబు పూర్వమే నిర్ణీతమైయున్నది. అని చెప్పి విషహారంబగు విద్య నాతని కుపదేశంబు గావించి యతని నంతఁ బ్రసన్నుం జేసి బ్రహ్మ నిజలోకమున కరిగెను.

అంత నారాత్రి గడచి ప్రభాతం బగుటయును నాకద్రూవినతలు తమ తమ యాడినమాటలయాథార్థ్యం బొండొరులకుఁ దెలియఁజేయు తలంపులం గొని పన్నిదంబు గెలుచు నుద్యమంబునఁ, గరువలిచే నెగయఁ గొట్టంబడుచు నున్నతంబులైన కెరటములం గలదియు, సలిలవేగంబున మహాస్వనంబుతో సంక్షోభ్యమానమై యుండునదియును, తిమింగిలాదిమహామత్స్యములకును గొప్పమకరములకును నెలవై యుండునదియును, బాతాల

కిట్లనియె. "దేవతలారా! ఈవెలుంగుచున్న మహాపురుషుండు వినతా నందనుండగు గరుత్మంతుండు గాని, నేను గాను. ఇతండు కాంతిమంతుఁడు నాకు సహాయుండు. మిగులబలవంతుండు. కశ్యప సూనుండగు నీ మహానీయుండు సదా దేవతలకుఁ బ్రియుండును, దేవారాతుల కప్రియుం డును నై యుండ బ్రహ్మచే సృష్టింపఁబడియె. మిక్కిలి కాంతిమంతుండైన యీమహానీయునిం గాంచి మీరు భ్రమఁజెందితిరి. ఈయంగారమును మీరు భీతిఁ జెందవల" దనఁగా సురలా తేజోమూర్తిని గనుచుండ నాతండు వానికి దూరంబుగ నిలిచి యమ్మహానీయుని నిట్లు స్తుతించిరి. "ఓమహాత్మా! నీవు మహర్షివి. మహాశక్తిమంతుండవు, సకలమంత్రస్వరూపుండవు, ప్రజాపతి యగుపరమేష్ఠివి. నీవు యింద్రుండవు, నీవే జగత్పతివి. నీవే సమస్తవేద ములు. నీవే యగ్నివి. నీవే వాయువవు. నీవే ధాతవు. విధాతవు. లోక రక్షకుండవు. విశ్వవ్యాపకుండవును గుణిష్ఠుండవు. నీవ్యయముగ్ర కాంతిత్వ ముచే రెండవసూర్యునిబోలె జగంబులను గాంతిమంతంబుగఁ జేయు చున్నాడవు. ప్రళయాగ్నింబోలె నెల్లలోకంబుల నపహరించు నుగ్రస్వరూపుం డవు. ఈచరాచరము లగు సర్వభూతములలో నీవు శ్రేష్ఠుండవు. మహేంద్రుండవగు నిన్ను దేవతలమగు మేము సకల లోకహితార్థంబు శరణుజొచ్చుచున్నాము. నీగతికి భీతిల్లి యాకసమునఁ బయిగాడు సర్వజంతువు లును వొలంగి పోవుచున్నవి. పిడుగువంటి నీమహాధ్వని నాగులదేల వణికించుచున్నవి. కృపాళుండవై యీయుగ్రరూపము నుపసంహరించి శాంతింబొందుము. మమ్ము దీనుల ననుగ్రహింపుము. సురలమగు మమ్ము రక్షింపుము. రక్షింపుము." అని ప్రార్థించిరి. ఆ దేవతల మొఱల నాలించిన తేజము డాఁచి భయంకరంబైన తనరూపునకు దేవతలే భీతిల్లిరని తలంచి యాఘోరరూపంబును దివ్యతేజంబును నుపసంహరించి కశ్యపాశ్రమ మున నున్న తనపూర్వజుపాలికి నరిగి తేజోరాశి యగు వానిని తనవీ పెక్కించికొని వినతపాలికరిగియచ్చోటనుండి పారావారం బావలిగట్టుం జేరి పూర్వదిక్కునందు జగంబులఁగాల్ప యత్నించుచున్న సూర్యున కడ్డంబుగాఁ దనయన్న యగు నాయరుణునినిల్పి పదంపడి నిజనివాసమున నున్నతల్లియొద్ద కేతెంచి తెలిపెను. అదివిని శౌనకుండు సూర్యుండేలజగం

కంబులతో నుండు కొలంకులు గలదియు, సున్నితసౌధరాజంబులతోఁ జెన్ను మీఱి, యాత్రి దేశంబుల వాసంబుల నేర్పఱచుకొనినవారిపైఁబూల వానఁ గురియువిధంబునఁ బుష్పముల రాల్చుచు నప్పటప్పటికిఁ గొత్త నెత్తావులం దెసఁ జల్లనిపిల్లతెమ్మెరల మెల్ల మెల్లని సంచారంబున కునికిపట్టై నాగ గంధర్వ కిన్నర కింపురుషాంగనలకు విహారస్థానంబై, నిగుడ్పరైన పూలదండలంబోలెఁ దీగంబుల నప్పుడప్పు డతిమనోహరంబుగ నూఁగుచున్న కదలియాలలతో రమ్యంబైనయదియును, సర్వమానవ మానసోల్లాసకరమైనదియును, దేవశిల్పి యగు విశ్వకర్మ చే నిర్మింపఁబడినదియును, మహోన్నమధ్యంబున నుండునదియు నగు నాగాలయముం జేరిరి. అచ్చోటఁ గద్రువ తన సంతానముతోఁ గొన్ని నాళ్లు యథేష్టముగ సంచరించి గరుడుం జూచి మనోహరమ్యంబైన యే దేని మఱియొక ద్వీపంబునకుఁ గొనిపొమ్మని చెప్పఁగా గరుడుండు తల్లితో "అమ్మా! వీరికి నిటులను మన మేల యిట్లు వినయవిధేయులమై సేయుచుండవలయును. దీని కొక్క కాలమునకు నైన నంతముకాఁ రాదే" యనఁగా వినత మహాతేజస్వియును, బలపరాక్రమశాలియు నైన కుమారుఁడగు గరుడునితో నిట్లనెను. "కుమారా! నేను విధిప్రేరణంబునను గద్రువ మోసంపుఁ గృత్యంబునను సవతికి దాసురాల నైతి. కావున నీయాడిగ మనశ్యము మనకుఁ గర్తవ్యమైనది" యనఁగా గరుడుండు విన్నవోయిన మనస్సుతోను జిన్నబోయిన ముఖకాంతితోను గొంతసేపాలోచించి కద్రువను నాగకుమారులం జూచి యిట్లనెను. "అయ్యలారా! ఏమి ప్రత్యుపకార మాచరించినచో మేము మీ దాస్యమునుండి వదలెదము?" అనఁగా దానికి నాగులిట్లనిరి. "గరుడా! నీవును నీతల్లియు మాకుఁ జేయవలసిన పనిపడంపుఁ బనుల బాధ్యతను దొలంగించుకొనుట కిష్టమేని నీవు నాకంబున కరిగి యచ్చోట నుండు నమృతమును మాకుఁ దెచ్చి యిమ్ము." అనఁగా గరుడుండు వల్లె యని తల్లియైన వినతను సమీపించి "అమ్మా! నాగుల కమృతంబుఁ దెచ్చి యిచ్చి నీదాస్యవిమోచనమును జేయించుకొనున ట్లొడంబడితి. నే నిప్పుడ దివంబున కెగురవలయును, నాకుఁ దగిన యాహారంబుఁ జెప్పుము" అనఁగా వినత బలాఢ్యుఁడైన పుత్త్రున కిట్లనియె.

### గరుడుం డమృతమును దెచ్చుటకుఁ దల్లి యనుమతిఁగొనుట

"పుత్త్రా! సాగరమధ్యంబున బోయపల్లె యొండు గలదు. అందు బోయలు వేయిమంది గలరు. ఒక్క పెట్టున వారి నందఱను దినుము. వారలలో విప్రుం డెవండైన నుండెనేని ప్రమాదంబున నైన వానిం భక్షింపకుము. విప్రునితేజస్సు సూర్యాగ్నితేజస్సులకంటె మిక్కుటంబు. వాఁ డలిగెనేని వానికోపాగ్ని నీకు హానిఁ జేయు. విప్రుండు లోకములో నుండు సర్వభూతములకుఁ బూజనీయుండు. కావున నెవ్విధమునను వాఁడు చంపఁదగనివాఁడు. కావున సర్వకాలావస్థలయందును విప్రజాతి కెగ్గు సేయక వర్తించితివేని నీకు శుభంబు లొనఁగూడును" అని చెప్పఁగా గరుడుండు తల్లి కిట్లనియె. "అమ్మా! నిషాదులం గలిసి యుండు విప్రుని నే నెట్లు గుర్తింతు." ననఁగా వానికి వినత యిట్లనియె. "వత్సా! నీ వెవ్వని మ్రింగఁగా వాఁడు నీకంఠబిలముఁ జొరక జీర్ణము కాక, గొంతును దహించుచుండునో వాఁడు బ్రాహ్మణుఁ డని గుర్తింపుము." అని చెప్పి యమృతహరణార్థము పుత్త్రునిఁ బోవ ననుమతించి వాని నిట్లు దీవించెను.

"ప్రీతా పరమదుఃఖార్తా నాగైర్విప్రకృతా సతీ,
పక్షౌ తే మారుతః పాతు చన్ద్రసూర్యౌ చ పృష్ఠతః.
శిరశ్చ పాతు వహ్నిస్తే వసవః సర్వతస్తనుమ్,
అహం చ తే సదాపుత్త్ర శాంతి స్వస్తిపరాయణా.
ఇహాసీనా భవిష్యామి స్వస్తికార్యే రతా సదా,
అరిష్టం వ్రజ పంథానం పుత్త్ర కార్యార్థసిద్ధయే."

నాగులు గావించుచున్న పరాభవకారణముచే దుఃఖించినమనస్సు గల వినత తనపుత్త్రుండు దాస్యవిమోచనార్థ మమృతమును వారికిఁ దెచ్చి యిచ్చెద ననఁగా సంతసించి "తండ్రీ! నీవు కార్యార్థివైపోవు చోటను బోవుచుండునపుడును నీఱెక్కలను వాయుభట్టారకుండును, నీవీపును సూర్యచంద్రులును, శిరస్సు నగ్నిదేవుండును, సర్వావయవముల నష్టవసువులును రక్షింతురు గాక. నే నిచ్చోటనుండి నీకభ్యుదయము మొడఁగూడునట్లును, నీవు మార్గమున సుఖివై కార్యసాధనము

గావించికొని వచ్చునట్లును యత్నించెద.” అని చెప్పఁగా గరుడుండు వియత్తలంబున కెగసి వాయువేగంబున నిషాదాలయంబుఁ జొచ్చి మిక్కిలి గొప్పదైన తననోరుం దెఱచి వారి నొక్కపెట్టున మ్రింగుచుండె. అప్పు డొకవిప్రుండు వానికంఠబిలంబునం జేరి లోనికిఁ జొరక వానిని దహింపుచుండుట దెలిసి గరుడుం డాతఁడు విప్రుఁడు గానోపు నని గొణంగి, ‘భూసురవర్యా! మహాపాతకం బగు బ్రాహ్మణవధ నేఁ జేయలేను. నీవు నాదేహమునఁ జచ్చి నాకా మహాపాతకంబు నొడిగట్టకుము. ఎటులైనను వెలువడి ర’మ్మనఁగా నావిప్రుండు ‘నాకు నిషాది యొక్కతె భార్యయు నున్నది. దాని విడిచి నేనొక్కండ రాలే’ ననఁగా గరుడుండు భూసురునితో నానిషాదిని సైతము వెడల నంగీకరించెను. ఆవిప్రుం డంత నిషాదితో గుహావంటి నోటివెలుపలికి వచ్చి యథేచ్ఛగా సంచరించె. పిదప వినతాపుత్త్రుం డొకచోటఁ దపంబు గావించుచుండు తండ్రి యగుకశ్యపుపాలి కేగి తన్నెఱుకపఱచి ‘తల్లి దాస్యమును దొలఁగించుట కమృతమును దెచ్చుటకై నాకంబునకుఁ బోవుచున్నవాఁడ. సముద్రమధ్యమున నున్న వేయిమంది నిషాదులఁ గబళించి యాఁకలి దీర్చుకొనుటకు యత్నించితి. కాని, నాయాఁకలి యంతటితోఁ దనియదయ్యె. అమృతమును దేఁబోవు నాకు నిండుగ జవసత్త్వముల నొసంగు నాహార మెద్ది యేని యనుగ్రహింపు మని వినయపూర్వకముగఁ జెప్పుకొనఁగాఁ గశ్యపుండు ప్రతాపశాలియైన పుత్త్రు పూన్కికి మెచ్చి వాని కిట్లనియె.

పూర్వంబున నిరువు రన్నదమ్ము లేకీభవించి కాపురంబుఁ జేయుచుండిరి. వారిలోఁ దమ్ముండు సుప్రతీకుం డనువాఁ డన్న విభావసుతోఁ దన కుటుంబభాగమును బంచియిమ్మని పలుమాఱు లడుగుచుండ సుప్రతీకున కలిగి యన్న యిట్లనియె. విభజించుకొనుట యుత్తమంబు గాదు. ఒక్కటిగా నైకమత్యముతో నున్న కుటుంబములోని వానికిఁ బరస్పరము స్పర్ధలు వెట్టి దుష్టులు విభజించుకొనుట ధర్మ మందురు. విచారింప నయ్యది యయోగ్యంబు. కావున విభాగంబు వల దని పలు తెఱంగులఁ జెప్పినను దమ్ముండు సుప్రతీకుం డన్నమాట వినక విభజన కొకే పట్టును బట్టుచు నన్న కుపితుండై తమ్ముని మూఢమైన యేనుఁగు జన్మ మెత్తుమని

శపింపఁగాఁ దమ్ముం డన్నను దాఁబేలుకమ్మని ప్రతిశాపంబొసంగె. ఇట్లా యిరువు రన్యోన్య శాపములచే నొక్కండు మూఁడుయోజనంబులపొడవును, పదియోజనంబులవెడల్పును గలతాఁబేలుగను వేఱొకఁ డాఱుయోజనంబులపొడవును పండ్రెండుయోజనంబులనిడివియుం గల గజముగను నై యొక కాననంపు సరోవరసమీపమునఁ బూర్వద్వేషంబున మూఢాత్ములై పెనంగుచుండువారు. నీ వాసరస్సునకుఁ జని వాని రెంటినిం బట్టికొని నీ కాహారముం జేసికొనుము. ఆయాహారమున నీవు బల్లిదుండవై యమృతాహరణార్థము నాకంబున కేగుము. అచ్చోట నిర్జరులతో నీకు సమరం బైనను విజయంబు గల్గును. నీకు శుభప్రదమగు మంగళం బగుఁగాక! యని గరుడుని వీడ్కొలిపెను.

### గరుడుండు గజకచ్ఛపంబుల బట్టికొని కశ్యపునొద్ద కేగుట

అంత గరుడుండు పక్షవిక్షేపంబుఁ జేసి గజకచ్ఛపంబులు పోరాడుచుండు సరస్సును సమీపించి యారెంటిని మెలఁకువతోఁ దనవాడి గొప్పనఖంబులం దిరికించికొని వియత్తలంబున కెగిరి మహావేగంబునఁ బోవువాఁ డలంబసతీర్థంబను ప్రదేశంబున వాని రెంటి నదిమిపట్టుకొని వానిం బెట్టికొని భక్షించుటకుఁ దగుస్థలంబును నెమకుచుండ నచ్చో నూఱుయోజనంబులు పొడవు గలయొక మఱ్ఱిచెట్టు గరుడుం జూచి దీర్ఘంబగు తన కొమ్మపై వాని నుంచుకొని భక్షింపు మని చెప్పఁగా గరుడుం డందుల కియ్యకొని యావృక్షశాఖలలో మిక్కిలి లావెక్కినదియు బహుదీర్ఘమైనదియు నగు నొక్కకొమ్మపై నాగజకచ్ఛపముల రెంటినిం బెట్టుట కుద్యమించి తనపాదముల నాకొమ్మపై నూదఁగా నమ్మహావిటపి దీర్ఘశాఖ పెళపెళ మనుధ్వనితో విఱిగెను. ఆకొమ్మ నాధారముగఁ గొని సూర్యకిరణము లాహారముగాఁ గొందఱు వాలఖిల్యఋషులు తపంబుఁ జేయుచుండిరి. అప్పు డాకొమ్మ క్రిందఁ బడినచో నమ్మునులు తమతపస్సునకు భంగము గలుగుటం జేసి తన్ను శపింతు రను వెఱపున గరుడుం డాశాఖను ముక్కునం గఱచి యెత్తి, కాలిగోళ్లయం దాగజకచ్ఛపంబుల రెంటిని చిక్కఁబట్టుకొని యాకసంబునఁ బోవుచు నాశాఖను దగుస్థలంబున విడుచుట కనువు లేక యాలోచించుచుండ నాకొమ్మయందు వ్రేలాడుచుండు మహర్షు లితరుల కసాధ్యం

బైనయింతకార్యమును జేయుంగల గరుడుని మహోగ్రత్వమున కాశ్చర్య
పడి వానికిఁ బన్నగంబు లాహారం బగునట్లనుగ్రహింప, నాతం డతి
రయమున నాకొమ్మతోను, గజకచ్ఛపంబులతోను గంధమాదనపర్వత
ప్రాంతంబునఁ దపం బాచరించుచున్న తండ్రియగు కశ్యపుపాలి కేగి
యావృత్తాంతం బంతయును నామహర్షికి విన్నవించె. అంతఁ గశ్యపుండు
బల్లిదుండగు తనపుత్త్రుని భీమం బగు నాకారంబును వానిగోళ్లనిశితికి గొని
యతిభారంబు లగుగజకచ్ఛపంబులను, ముక్కున నుండు మహాదీర్ఘ విటపి
శాఖయును నందు వ్రేలాడుచుండు వాలఖిల్యులం జూచి విస్మితహృదయుం
డై వీఁడు సురలకైనం జేయరానిభీకరకార్యంబు నుద్దేశించి గండుమీఱి
యున్నవాఁడు; వీని కసాధ్యం బెద్దియును లేదు కాని, వీఁ డీతాపసులు
తన్నేమి శపింతురో యని వెఱచి నాయొద్దకే తెంచి కర్తవ్యము నడుగ వేచి
యున్నవాఁడని యూహించి వానితో నిట్లనియె. వత్సా! సాహసంబు
వలదు. మనోవ్యథ నుడుగుము. వాలఖిల్యులు నిన్ననుగ్రహించు
నట్లు వారిని నేను బ్రార్థించెద నని చెప్పి యామునులతో నిట్ల
నియె. మహర్షివర్యులారా! ఈగరుడుం డొక్క మహాకార్యముం బూని
దాన లోకహితమును జేయుటకు నిశ్చయించెను. కావున మీ
రీశాఖను వదలి వేఱొకస్థలము నాశ్రయించి యంతరాయంబులు లేక
మీతపంబుల నడుపుఁడు అనఁగా వారు కశ్యపుని ప్రార్థన మంగీకరించి
యాకొమ్మను వదలి హిమవత్ప్రాంతముల కేగిరి. అంత గరుడుండును
వారియాపదం దప్పించుకొని తండ్రితో నిట్లనియె. అయ్యా! ఈ
కొమ్మను వదలుటకు మనుష్యసంచారము లేని ప్రదేశమును నిర్దేశిం
పుము. అని కోరఁగాఁ గశ్యపుం డచ్చోటకి లక్షయోజనముల దూరా
మున మనుష్యసంచారమే లేని యొకపర్వతమును జెప్పి యాకొండ
మీఁద నాకొమ్మను వైచుట కుపాయంబు సెప్పెను. అంత నాపక్షిం
ద్రుండు విటపిశాఖ నచ్చోటికిఁ గొనిపోయి జాఱవిడిచి యందొక్క
యున్నతప్రదేశంబున గజకచ్ఛపంబుల నునిచి భక్షించి, తనివితీర
నాకలిం దీర్చి బల్లిదుండై మింటి కెగిరి నాకలోకంబుమార్గంబుపట్టి
పోవుచుండె. అప్పుడు దివంబున మబ్బులేని యాకాశంబున నుఱుములు
ధ్వనించుటయు, కొఱవులు పడుటయు, వడగండ్లవానయు నెత్తుటివాన
యును గురియుటయుఁ, జెట్లలో నుండు పుష్పము లకారణంబున వాడు

టయు, సాధ్యులు మరుత్తులు వసువులు మొదలగువారు పరస్పరముఁ
గొట్టుకొనుటయు మున్నగునుత్పాతంబులు గలిగెను. అయ్యవి మున్ను
దేవాసురులయుద్ధమునకుఁ బూర్వ మొకమారు సంభవించెను. అప్పుడు
మహేంద్రుం డాచార్యుండైన బృహస్పతిని దానికిఁ గారణం బడుగ
నాసురగురుం డిట్లనియె. మహేంద్రా! వినుము; నీవు తొల్లి ప్రమాదం
బున వాలఖిల్యుల కపకృతి గావించియుంటివి. వారు వోయి తమతపో
బలంబుచే నెల్లవారికంటె బల్లిదుండు ధైర్యశాలియు నగు నొకని విహం
గమస్వరూపముతోఁ గశ్యపునకు వినతయందుఁ బుత్త్రుంగాఁ బుట్టున
ట్లొనర్చిరి. వాఁడు గరుత్మంతుం డనుపేరఁ బరగువాఁడు. వాఁ డిచ్చోటి
కమృతహరణార్థమై యేతెంచుచున్నవాఁడు. వాఁ డెవ్విధముననైన నా
యమృతకలశమును గొనిపో వచ్చుచున్నవాఁ డనఁగా, నాపాకశాసనుం
డమృతరక్షకులం బిలిచి గరుడుం డమృతకలశమును గొనిపో వచ్చు
చున్నవాఁడు. మీరు సర్వాయుధసమేతులై వాని నమృత ముండు స్థల
మును జేరనీయక జాగరూకులయి మెలఁగవలయు నని వారికి హెచ్చ
రికచేసె నని సూతుండు శౌనకునకుం జెప్పఁగా నాసూతునితో శౌనకుం
డి ట్లనియె.

'సూతనందనా! నాకిప్పు డొండొకసంశయము గలిగెను. గరుడుం
డేకారణంబున నప్పటివారి నెల్ల మించిన బల్లిదుండై జనించె? వానికిఁ
గామగమనంబు యథేచ్ఛాసంచారము నెట్లయ్యె? వాలఖిల్యుల కెవ్విధ
మున సురపతి యపకృతి నొనరించె? వా రేల తమతపోమహిమలను
గరుడోత్పాదనమున నుపయోగించిరి?' అని యడుగ శౌనకునకు సూత
సుతుం డి ట్లని వచించెను.

మీ రడిగిన యీవిషయము పురాతనము. శౌనకమహర్షీ! ఆ
వృత్తాంతమును సంక్షేపముగ నుడివెదను వినుము. పూర్వము కశ్యపుఁడు
పుత్త్రకామేష్టి సేయుటకు యత్నించి తన్నిమిత్త మనేకదేవతలను ఋషు
లను గంధర్వులను సాయపడుఁ డనఁగా నందఱును నట్లే చేసిరి. అప్పు
డాయాగమున కింద్రుండును వాలఖిల్యులును వలసినన్నికట్టెలను దెచ్చి
యిచ్చుట కొప్పుకొనిరి. ఇంద్రుండు బలవీర్యసంపన్నుం డగుటచే విస్తా

రమై గొప్పదగు కట్టెలమోపును మోచి కొని త్వరితముగాఁ గొని
తెచ్చి యాగశాలఁ జేర్చెను. వాలఖిల్యులు శామంగుష్ఠ మాత్ర
ప్రమాణదేహులగుటచే నొక్కొక్క రొక్కొక్క సమిత్తును చేతఁ బూని
కొని మెల్లగా వచ్చుచుండుటను వేవేగ భారమును మోయుచు వచ్చు
చుండు నింద్రుండు చూచి నగియె. మహేంద్రుండు తమ్ముఁ బరిహసించు
టను దెలిసి వా రంత నొక్కటియై కశ్యపునియాగాగ్ని యందుఁ బాక
శాసనునికంటె బలవంతుఁడును, తేజశ్శాలియు, శౌర్యవంతుండును
నగునొక మహాపురుషుని సృజించువారై యాహుతులను మంత్రపురస్సర
ముగ వేల్వ దొరకొనిరి. ఇంద్రుం డంత నీవృత్తాంతము నంతయెఱిఁగి గాశ్య
పున కెఱిగింప నాతండు వాలఖిల్యులతో నిట్లనియె. మహేంద్రునకంటె
వీర్యవంతుఁడు, తేజోవంతుఁడును నగు నన్యుం డొక్క డుండఁడు.
బ్రహ్మచే నింద్రపదవి కీతఁడు నియమితుఁడై యుండఁగా మీరు పరమేష్ఠి
మాటలను దిరస్కరించి వేఱొక ప్రతాపవంతుని సృజించుట పాడిగాదు.
మీమంత్రములచేఁ బుట్టువాఁ డింద్రునకంటె నూఱంతలు గొప్పప్రభావ
మును, కామవీర్యమును, కామగమనమును గలవాఁడగును. మీ
మాటలును నసత్యములు గానేరవు. మీరు వేల్వఁగాఁ బుట్టువాఁడు
పక్షీంద్రుం డయ్యెడు. దేవరాజగు మహేంద్రుని శౌర్యమును మన్నించి
వానియం దనుగ్రహము చేయుఁడు. అని యమ్ముని వాలఖిల్యుల నూఱ
డించి ప్రార్థింపఁగా వారలు కశ్యపుమాటలయం దాదరము గొని యట్ల
యగుంగాక యనిరి. గరుడుని కన్నముందు పుట్టినవాఁ డనూరుఁ
డగుటం జేసి పక్షులకెల్ల నితం డింద్రుం డయ్యె నని యుగ్రశ్రవసుండు
చెప్పి శౌనకునకు మఱియు నిట్లనియె.

## గరుడుం డమృతమునకుఁగాను స్వర్గమునకుఁ బోవుట

అట్లు గరుడుం డాపర్వతాగ్రంబున గజకచ్ఛపముల రెంటిని దిని
యాకసంబున కెగిరి స్వర్గలోకముఁ బ్రవేశింపఁగా నచ్చోట నమృతరక్షకు
లగుభటులు మేఘవాహనుని యానతిచొప్పున నానాయుధపాణులై గరు
డునితో యుద్ధమునకు సన్నద్ధులై యుండిరి. వారిలో విశ్వకర్మ యనునొక
యమృతరక్షకభటుం డుద్దండం బైనపోరు సేయ గరుడుం డీరఁగా

వానిని దనముక్కుతోఁ బొడిచియు, ఱెక్కలతోఁ దాటించియు, గోళ్లతో గీఱియు మదం బడంగించి యుద్ధసన్నద్ధుండై తనపక్షవిక్షేపంబున నాకంబు నందంలేట దుమ్ములు రేగునట్లొనర్పఁగా దేవలోక మంతయు నల్లకల్లోలం బయ్యెను. ఇంకను నాశూరుం డెదుర్కొన్న దేవతల నందఱ ఱెక్కలతోఁ గొట్టియు, ముక్కునం బొడిచి చీల్చియు, నానావిధంబులఁ జిందరవందఱ లగునట్లు చేయుచుండ నింద్రుండు వాయుభట్టారకుఁ బ్రేరేపించి నలుదెసలఁ బక్షీంద్రుపక్షవిక్షేపమున గ్రమ్ముకొన్న ధూళిని పలాయనంబు గావించె. అంత దేవత లెల్లరును నానాయుధపాణులై యొక్కుమ్మడి గరుడునిపై సుపవడించి తాఁకుటయును నప్పక్షీంద్రుండును విక్రమంబునఁ జలింపక యాకసంబున కెగిరి మహానాదం బగు నట్టహాసం బొనర్చి వారలఁ దనచంచువునం జీల్చుచు గోళ్ల గీఱుచుఁ బక్షంబుల మూర్ఛిల్లఁగొట్టుచు స్వర్గసంతతిగాను నెత్తురు వఱదలం బఱపుచుండ వానిశౌర్యమునకు వెఱచి సాధ్యులును గంధర్వులును దూర్పుదెసకుఁ బాఱిపోఁదొడంగిరి. వసుగణంబులు దక్షిణదిక్కునకు జొచ్చెను. రుద్రాదిత్యులు పడమటకుం బాఱిరి. అశ్వినీదేవత లుత్తరమున బహుదూరముపోయి పఱిచూచిరి. పదంపడి నాకంబున నశ్వక్రంద, రేణుక, తపన, -ఉలూక, శ్వసన, నిమేష, ప్రరుజ, పులిను లను వారు ఖగేంద్రు నతిభీకరంబుగ నెదుర్కొని ఘోరయుద్ధమునకు సమకట్టఁగా వారిని గరుడుండును ప్రళయకాలపినాకపాణియుంబోలె మహారౌద్రమునఁ దాఁకి వారలఁ దనఱెక్కలం గొట్టియుఁ, దుండంబునను గోళ్లను జీల్చియు మద మడంచి యమృతముండుచోటి కరిగి దాని నట్టహాసంబునఁ గొని పోవువాఁడై దాని నావరించి వాయువు విజృంభించి నీఱుగా ప్రళయాగ్నివోలె మండుచున్న యగ్నిని ననేకనదీజలంబులను బుక్కిటఁ గొని తెచ్చి దానిపైఁ జల్లి చల్లార్చె. అంత నమృతకలశము చుట్టు నెవ్వరికిం జొచ్చుటకు వీలుగాకుండ నెల్లప్పు డతివేగంబునఁ దిరుగుచుండు చక్రము నొక్కదానిం గని తాను గామరూపియగుటచే సూక్ష్మతనువు బొంది యా తిరుగుడుచక్రముసందుపాయంబునఁ బ్రవేశించి యందు ఘోరాకారులగు నాగులిరువు రాకలశముం జుట్టికొనియుండ వారి నతఁడు చూచెను. ఆసర్పముల నెవ్వం డేని సమీపించినచో, విషజ్వాలామిళితమైన వాని వాయువు శరీరంబు సోఁకి వాఁడు వెంటనే మృతుం డగు. అట్టివానికి

గరుడుండు దృష్టిగోచరంబు గాకుండ సూక్ష్మశరీరము నెత్తి తానెంతయేని మెలఁకువతో వారినేత్రములయందు దుమ్ముఁగొట్టి వారికిఁ దాను గాన్పింపకయే యారెంటిపై నెక్కి తనముక్కునం బొడిచి చంపి వైచెను. అంతట నిమిషమేనియు నాగక తిరుగుచున్న యచ్చటి యంత్రమును జేతఁబట్టి విఱిచివైచి, యించుకే నాగక వేవేగ యమృతంపుఁగలశమును వశపఱచుకొని తాను మాత్ర మెంతయును దాని ద్రావక తటాలునఁ బైకెగరెను. అ ట్లెగిరిపోవుచుండ శ్రీమన్నారాయణుండు గరుడునకుఁ బ్రత్యక్షంబై యిట్లనియె. మహనీయా! నీసౌశీల్యంబునకు మెచ్చితి. వరము లడుగు మనఁగా గరుడుం డిట్లనియె. 'లోకరక్షకా నే నెల్లప్పుడును నీరథధ్వజమునం దుండునట్లును, నమృతమును ద్రావకయే నాకు ముసలితనము గాని చావు గాని లేకుండునట్లును, వరములనిమ్ము,' అనఁగా భగవంతుఁ డావరములను వానికిఁ బ్రసాదించెను. అంత గరుడుండు లోకరక్షకునితో నిట్లనియె. మహనీయా! నావలన నేవియేని పనులున్నచోఁ జెప్పుము. అచిరకాలమున నిర్వర్తించెద. అనఁగా విష్ణుదేవుండు గరుడుండు తన కెప్పుడును వాహనమై యుండునట్లు గోరెను. గరుడుం డాకోర్కి నిడీర్చెద ననెను. అట్లు వారు సంభాషించుచు నుండఁగా నింద్రుండు గరుడగమనము నడ్డగించుటకు వజ్రాయుధమును గరుడునిపై బ్రయోగింప గరుడుండు వజ్రమున కపమానము తనమూలమునఁ గలుగరామియు, నయ్యది దధీచిమునీంద్రు వెన్నెముకచేఁ బొడముటయుఁ, ద్రిలోకనాథుం డగు నింద్రుని యాయుధమగుటయుం గారణముగా దాని నవమానింపరా దని తనమనస్సును పాకశాసనునకుఁ దెల్పి తనఱెక్కలలోనుండు నీక నొకదాని నిచ్చి యావజ్రాయుధమును సగౌరవముగాఁ బనిచె అంత దేవత లాయీకం గొని దానికనకంపుఁగాంతికి నచ్చెరువోయిరి. దానిం జూచి సర్వభూతంబులును సంతసిల్లినవి. అంత గరుడునకు సుపర్ణుం డనుపేరు ప్రఖ్యాత మయ్యె. అమరేంద్రుండును గరుత్మంతుని బలపరాక్రమముల కాశ్చర్యము నొంది యాతనిబలపరాక్రమములఁ దెలుపు మనియు, వానిచెలిమినిఁ దా నెల్లప్పుడు గోరియుండు ననియు నుడువఁగా, నప్పు డింద్రునితో గరుడుం డిట్లనియె. "సత్పురుషులు పరుల నిందింపరు. ఆత్మగుణోత్కరపరికీర్తన

మనుచిత మని చేయరు. అయినను నాసఖ్యంబుఁ గోరి నీ వడుగుటం జేసి నాకలతెఱం గెఱింగించెద వినుము. సకలపర్వతకాననదీనదములతోను నపారంబైన పారావారంబుతో నుండు నీమహీతలమును, నిన్నును, నీనాకంబును మోయఁగలను. ఇంత యేల? స్థావరజంగమాత్మకంబైన యీసకలబ్రహ్మాండమును నాఱెక్కను ధరించి మోచికొని పోవంగల బలము నాకుఁగలదు. దాఁటఁగూడని సముద్రంపునీటి నంతయు సమస్తరత్నరాసులతో నాఱెక్క నొక్కదానిచేఁ జల్లుదును." అనిన నింద్రుం డిట్లనియె. గరుడుఁడా! నీజవసత్త్వసామర్థ్యంబులకు మెచ్చితి. సంతసిల్లితి. ఇట్టిబల్లిదుండ వగునీకు నీయమృతం బుపయోగపడదేని నీ వేల యింత సాహసించి దీనిని గొనిపోయెదవు? ఒరులు దీని నుపయోగింతు రేని వారికి జరామరణములు లేకపోవుటయే కాక దేవతల కగు మహాప్రభావంబును బాధింతురు. నీ వమరుఁడవు, అజరుఁడవు. అప్రమేయుఁడవు. కావున దేవతల కహితం బాచరింపకుము. దీనిని మగుడ నాకొసంగిపొమ్ము. అనిపలుక విని వాసవునకు సుపర్ణుం డిట్లనియె. ఓవాసవా! వినుము. ఏను మదీయమాతృదాస్యనిరాసార్థం బురగుల కమృతంబుఁ దెచ్చియిత్తు నని కాద్రవేయులతో బాసచేసి వచ్చినవాఁడ. ఈయమృతంబుఁ గొనిపోయి వారల కిచ్చి మదీయజననీదాస్యంబు వాపికొనినపిదప నురగు లీయమృతం బుపయోగింపకుండ ముందఱ నీవు గొని చనుమనిన సుపర్ణుమహానుభావంబునకు మెచ్చి దేవేంద్రుండు గరుడున కిట్లనియె. సుపర్ణా! నా కభిమత మొనరించితివి. నీ కిష్టమైన దానిని వేఁడుము. అనఁగా గరుడుండు దుస్మదుఁడై తన కహితమట్లుచేసిన కాద్రవేయులు తన కశనమగుట యుక్తమనియు, ముల్లోకములును దేవేంద్రునిచే రక్షింపఁబడుట నాలోకములలో సర్పములును వానిచే రక్షింపఁబడుచు భువనములయందుఁ ద్రిమ్మరుచున్నవగుటను మహాబలపరాక్రమవంతుఁడైనను రాజాజ్ఞ నుల్లంఘింపఁ గూడదు గావునను దివిజాధిపు నుత్తరువును ధర్మరీతిగాఁ బడయవలయు ననియు గరుడుండురగభోజనత్వంబు సురపతిచేతం బడసి మహేంద్రునిచే ననుగమ్యమానుండై యురగులయొద్ద కేతెంచి వారిముందఱ మరకత హారితంబైన దర్భలం బఱచి వానిపై నమృతకలశము నుంచి మీ రీయమృతమును

గలశముతో నుండుదానిం జూచితిరి గాదే. ఇయ్యది దేవేంద్రునిసదన మునందు మిక్కిలి రహస్యస్థలమున నతిశుచిగా రక్షింపఁబడుచుండినది. అట్టిదానిం దెచ్చి మీ కిచ్చితి. నాతల్లిదాస్యము వాసెనుగాదే? యని చెప్పి వారివలన మాతృదాస్యవిమోచనంబు గావించికొని సుఖ ముండె. మఱియు నురగులను గాంచి సుపర్ణుఁడు "ఓయీ! స్నానాలంకృతులై మీరలు శుచిత్వముతో నమృతము నారగింపుఁ డనుటచే వారెల్లరు పరిశుద్ధులై వచ్చుటకు స్నానార్థ మరిగిరి. అంతలోన నయ్యింద్రుం డయ్యమృతకలశముం గొని దేవలోకంబున కరిగె. నాగులును స్నానజపంబుల నెఱవేర్చుకొని శుభ చిహ్నములతో నమృతం బుంచినచోటికి వచ్చి దానిం గానక దానియున్న స్థానం బని దర్భలు నాఁకిన వానినాలుకలు రెండుగాఁ జీలుటంజేసి నాటం గోలె నురగులు ద్విజిహ్వులు నాఁ బరఁగిరి. వానిపై నమృతకలశం బుంచుటంజేసి దర్భలు పవిత్రములయ్యె. అంత వైనతేయుండు తల్లియగువినతతో సమీపారణ్యంబుల స్వతంత్రముగ సంచారము సలుపుచు వలసి నప్పుడు పాములం బట్టి మెసవుచు మహాసంతోషంబుతో సుఖమున నుండె. ఈసౌపర్ణోపాఖ్యానమును నెవఁడు బ్రాహ్మణసభలోఁ జదువునో, మఱి యాకర్ణించునో యాపుణ్యాత్ముండు విశేషసంపదలను బొంది యంత్యకాలమున నిస్సంశయముగ నపవర్గమును జెందును. సకలోరగ క్షోభములకు దూరుఁ డగును. అని యీసుపర్ణునిచరిత్రంబును సూతసూనుండు శౌనకునకుం దెల్లంబుగాఁ జెప్పిన శౌనకమునివరుఁ డు సూతసూనున కిట్లనియె.

### శేషుండు బ్రహ్మాయనుమతిం గొని భూభారమును వహించుట

సూతనందనా! కద్రువ పూర్వము నాగులకు శాపమొసఁగఁగా నవి యేమిచేసె ననియడుగ సూతుం డిట్లనియె. శౌనకమహామునివర్యా! వినుము. అవ్విధముగఁ దల్లిచే శపింపఁబడినపిదప నాగులలో నగ్రజుండైన శేషుం డితరము లగునాగులను వదలి తా నొక్కరుండ వెడలి శైలకాననద్వీపవిశాల మైన యివ్వసుమతీచక్రమునం దుండు గంధమాదన, బదరీ, గోకర్ణ, పుష్కరారణ్య హిమవదాదిపుణ్య తీర్థములం గ్రుమ్మరి,

యొక్క పవిత్ర ప్రదేశంబున నాశ్రమంబు గావించుకొని, తీవ్రతపంబు నకుం బూనెను. అప్పుడు పితామహుండు శేషుం డున్న పుణ్య దేశంబున కేతెంచి శేషుఁడా! యని పిలిచి, యేల నీవిట్టితీవ్రతపం బాచరించె దవు? భూతంబులకు మేలు గోరుము. నీకో ర్కెద్ది? చెప్పవే యని యడుగ శేషుం డిట్లనియె. సర్వలోకపితామహా! నాసోదరు లెప్పుడు తమలోఁ దాము కలహించుచుందురు. మఱియు మాతండ్రియగు కశ్యపునకమాహాత్మ్యంబున మహాబలుండైన సుపర్ణుని, వానితల్లియగు వినతనుం జూచి యసూయతో నుండుదురు. వీరు దురాత్ములు. వారి పొత్తొల్లక తపం బాచరించి శరీరమును గృశింపఁజేసి నశింపఁజేయ నిశ్చ యించితి నని చెప్పఁగా నాతనికిఁ బరమేష్ఠి యిట్లనియె. ఓనాగులఱేఁడా! నీతపంబునకు మెచ్చితి. నీసోదరుల దుర్వృత్తములును, వారికైన మాతృశాపమును, శాపపరిహారమును నే నెఱుంగుదు. వారలకై నీవు చింతింప నేల? నీవు సత్పురుషుండవు. నీసౌభాగ్యంబున నీబుద్ధి ధర్మంబు నందు సుప్రతిష్ఠితంబయ్యె. నీకు వలసినవరముం గోరుము. అనఁగా శేషుండు తనబుద్ధి నిశ్చలముగ ధర్మమునందును, శమదమాదుల యందును, దపస్సునందును నియతమై యుండవలయు నని వేఁడఁగాఁ బితామహుం డది యట్ల యగుఁగాక! యని శేషుని భూభారమును దనశిరస్సున మోచుచుండునట్లు నియమించి "ఓయీ! భూమియు నీకు మార్గ మొసఁగును. ఆదారిమూలమునఁ బాతాళముం జొచ్చి యచ్చోట భూమిక్రింద నీశరీరము నుంచి నిశ్చలుఁడవై మోయుము" అని చెప్పఁగా శేషుండు పితామహునాజ్ఞను దలయందుఁ దాల్చి యట్ల యుండె. అంతట నద్దానికిఁబరమేష్ఠి మెచ్చిగరుడుం బిలిచి నీవెప్పుడును శేషునితోఁ జెలిమి నెఱపుము అని చెప్పి తన యావాసమునకుం బోయెను.

ఇవ్విధంబున ననంతుండు బ్రహ్మ యానతిచొప్పున భూభారమును బూని సుఖినై యుండె. అంత మిగిలిన సర్పములలోఁ బెద్దవాఁడైన వాసుకి జననిశాపభీతుండై తమ్ముల నందఱం జేరం దీసి వారితో నిట్లాలోచించెను. నాసోదరులారా! తనయభీష్టమునకు మన మెదురా డుటంబట్టి తల్లియే మనకు శాపం బిచ్చె. ఇతరులశాపములకుఁ బ్రతీ కారము కలదు. తల్లి యొసఁగినశాపమున కెందును బ్రతీకారము లేదు.

ఇంతియగాక పరమేష్ఠియుఁ దీని ననుమతి చేసెను. కావున మన మెల్ల
రము లెస్సఁగా నాలోచించి కర్తవ్యమును దీర్మానించుకొందము. మన
మందఱ మట్లు కర్తవ్య మేర్పఱచికొని పిదప నేకవాక్యమున బ్రవర్తింప
వలయును ని చెప్పఁగా నంద ఱాలోచించుటకుఁ బూనుకొనిరి.
వారిలోఁ గొంద ఱి ట్లనిరి. నాగుల మగు మనము విప్రవేషధారులమై
జనమేజయునొద్దకుఁ బోయి యారాజును సర్పయాగవిముఖునిఁ గావింత
మనిరి. మఱికొందఱు దురభిమానులై యి ట్లనిరి. మన మారాజు
నకు మంత్రులమై వానితో సర్పయాగ ముభయలోకములకు హాని
దెచ్చు నని యందలిదోషముల ననేకముల నుగ్గడించి యాయాగ మని
ష్టపం బని నిరూపించి యెవ్విధమునైన నాతనిని యాగవిముఖుఁగావింత
మనిరి. వేఱొక కొంద ఱిట్లనిరి. సర్పయాగవిధాన మెఱింగినవారగు
ఋత్విజులను దెలిసి వారిని గఱచి మృతులం గావించినచో నయ్యాగ
మును జేయించువారు లేక రాజు యాగము నుడుగు ననిరి. ఇంకను
గొంద ఱిట్లనిరి. ఈకార్యము చే మనకు బ్రహ్మహత్యాదోషము వాటిల్లును.
తల్లిశాపమును దొలఁగించుటకు యత్నించి యింక నెవియో పాపముల
ననుభవింపవలసి వచ్చును. కావున నీయాలోచన తగ దనిరి. అంత
మఱియుఁ గొంద ఱిట్లనిరి. మన మెల్లరము కామరూపులము, కామ
గమనులము. కావున మన మందఱము మేఘరూపముల నెత్తి యజ్ఞ
కాలమున ఘోరముగ వర్షించి యగ్నులు చల్లారునట్లును, యజ్ఞమునకై
సేకరించిన పదార్థములు యాగశాలలోనుండి ప్రవాహమునఁ గొట్టికొని
పోవునట్లు చేయుద మనిరి. కొందఱు యాగమునందు హోమాదుల కవ
శ్యములైన స్రుక్స్రువముల నపహరింత మనియుఁ గాకున్న యాగము
నకు వచ్చిన వారి నెల్లరఁ గఱచెద మనియు, యజ్ఞాన్నమున మూత్ర
పురీషాదుల విసర్జించి దుష్టంబు సేయుద మనియుఁ బలికిరి. ఇవ్విధమున
నాచరించినచో, నాయాగమునకు విఘ్నము గలిగి యది నెఱవేర
కుండును. మనము సుఖుల మగుద మని కొంద ఱనిరి. మఱియుఁ
గొంద ఱిట్లనిరి. ఆయాగమునందు మనమే ఋత్విక్కులమై యాగ
దక్షిణగ యజ్ఞమును నిలుపుమని యపేక్షింతము. అంత నారాజు యాగ
విముఖుఁ డగు ననిరి. మఱికొందఱు దురాత్ములగు నాగులు జనమే

జయుండు స్త్రీలతో జలక్రీడలాడుటకు స్రవంతుల కేగునప్పుడు వానిం జిక్కఁబట్టి మనమందిరమునకుఁ దెచ్చి శరీరమంతయుఁ గఱచిన విషమెక్కి చచ్చుననియు దాన నీసర్పయాగము తనంతట నుడుగు ననియుఁ బలికిరి. ఇట్లొక్కొక్కరును దమతమ యభిప్రాయములను వాసుకికిం జెప్పఁగా నతఁడు వానియం దెద్దియును ధర్మయుక్తమైనది కాదనిన వారెల్లరు వాసుకియిష్టమును దెలిపినచో నావిధముగ నడచుటకు సంసిద్ధుల మనిరి. అంత వాసుకి మనతండ్రి యగు కశ్యపునియొద్ద కేగి శాపప్రతీకారమును బ్రార్థింత మనెను. వీని నన్నిటిని వినుచుండిన యేలాపుత్త్రుండను దండశూక మిట్లనియె. మీరంగలును జెప్పినవానిలో ధర్మయుతమగు ప్రతీకారమొక్కటియును లేదు. మనకు దైవవశమున నే దానికిఁ బ్రతీకారము సంభవించును. ఏలయనఁగా మనతల్లి కద్రువ మనకు శాపమిచ్చె నని దేవతలు బ్రహ్మతోఁ జెప్పఁగా బ్రహ్మ నాగులు దుష్టులై లోకమున కహితమును జేసెదరు. కావున కద్రువశాపమునకుఁ గొండొక ప్రతీకారము లేదు. అది యట్ల యగుంగాక యనెను. అప్పుడు దేవతలు బ్రహ్మతో మఱియు నిట్లనిరి. సర్పములు బలవంతములుగావే? కద్రువ శాపం బుచితంబె? దీని కెట్లు ప్రతీకారము లేదు? అనఁగా బ్రహ్మ వారి కిట్లనియె. వారి కాయాగమునెపంబున నాశము తప్పదు. కాని, జరత్కారుం డనుముని తనపేరే గల వాసుకిచెలియలి నాగకన్యను బెండ్లాడును. వారికి నస్తీకుఁడను మహానుభావుండు పుట్టును. ఆమహర్షి కారణంబుగ సర్పయాగము ధర్మమార్గమున నుడుపఁబడి సర్పముల ప్రళయము దొలఁగు ననియె. నేను మనతల్లియగు కద్రువయొడిలో నిదురపోయి నట్లుండి శాపసమయమున, దేవతలకును బ్రహ్మకును జరిగినసంభాషణమును వినియుంటిని. కావున నాజరత్కారుం డెవండో, యమ్మునీశ్వరుం డెక్కడి వాఁడో వెదకి యాతనికి మనజరత్కారువునిచ్చి సర్పయాగమువలన సర్ప ప్రళయమును నివారింపుద మనియె. అటుపిమ్మటఁ గొంతకాలమునకు సముద్రమథనమును దేవదానవు లొనర్చిరి. ఆసమయమున దేవతల ప్రేరణచే వాసుకి కవ్వమైన మంథరాద్రికిఁ బగ్గమయ్యె. దానికి దేవతలు వాసుకియెడఁ గరుణించి బ్రహ్మతో నిట్లనిరి. వాసుకి సర్పప్రళయము జనమేజయుండు గావించుసర్పయాగమునఁ గానున్నదని వెఱచి యున్నవాఁడు. దానికిఁ బ్రతీకారమును జేయవలయును. అనఁగా నాపద్మజుండు

వారి నారసి "ఏలాపుత్త్రుండు చెప్పిన పగిదిం జేసిన మేలుకలుగు ననఁగా వాసుకి యాదివము మొదలు జరత్కారుముని యెచ్చట నున్నవాఁడో యాతం డెప్పుడు వివాహమును జేసికొనునో విచారింపుఁడని నాగుల నియమించియుండె నవఁగా శౌనకుఁడు సూతసుతునితో నిట్లనియె. సూతనందనా! ఆమునికి *జరత్కారుండను పే రెట్లు కలిగె? వానికి జరత్కారు వెట్లు భార్యయయ్యె? వాని కస్తీకుం డనువాఁడు పుత్త్రుం డెట్లు జనించె" అని యడిగిన నమ్మునికి నక్కథకుం డిట్లనియె.

## జరత్కారుమునిచరిత్రము

శౌనకమహర్షీ! వినుము. ఆఋషిసత్తముఁడు తీవ్రతపం బాచరించుచుండుటచే శరీరము కృశించి యుండుటంబట్టి యాతని కాపేరు కలిగె. ఆకారణమునవే వాసుకిసోదరికి నాపేరు కలిగె. ఇఁక నస్తీకు జన్మప్రకారంబుఁ జెప్పెద. సావధానులరై వినుం డని యాపౌరాణికుం డిట్లని చెప్పందొడంగె. పరమతపోనిధియు, యాయావరవంశజాతుండును, నియమవంతుండును, లోకోత్తరుండును నగు జరత్కారుం డను మునివర్యుఁడు బ్రహ్మచర్యవ్రతనియమముతో నొప్పారుచుండెను. మఱియు నాతం డతికఠినమైన వ్రతములను సలుపుచు దారపరిగ్రహము నందు రోసి మోహపాశబంధములు లేనివాఁడై మెలఁగుచుండెను. తపస్సునను, వేదాధ్యయనమునను, నియతబ్రహ్మచర్యమునను, ఋషుల ఋణములఁ దీర్చుచు ననేకతీర్థయాత్రలం గావించుచు సంచరించువాఁ డొక్కచోట వనంబున నొకపచ్చికపడియం గని యందు వేళ్లన్నియు నెలుకలు గొఱుక నొక వేరుగలయవురుగంటను బట్టుకొని తలక్రిందుగ వేలాడుచుఁ గృశులై యున్నమునులం గొందఱం గాంచి వారిసజ్జకరిగి మీ రేల యిట్లు లధోముఖులై యున్నవారు? మఱియు దీనికిని నొక్కవేరు దక్క నన్నింటిని నెలుకలు గొఱికివైచెను. ఈ యొక్కటియుఁ ద్వరలోఁ దెగునట్లున్నది. మిమ్ముఁ జూడ మన స్సెగు లాడుచు విషాదము తోఁచుచున్నది. మీయాపదను తొలఁగింప నా

* "జరత్" అనఁగాఁ గృశుఁ డని యర్థము. "కారు" అనఁగా దారుణుఁ డని యర్థము.

కలవి యేని యుపాయంబుఁ జెప్పుఁడు. నాతపంబున నాలవపాలైనను గాకున్న మూఁడవభాగమైనను, సదియుం జాలకున్న సగ మేనియును, నంతయుం గాకున్న నాయొనర్చిన యుగ్రతపంబు నంతయును మీకు దారవోసి మీయిక్కట్టుఁ దీర్చెద ననఁగా నాతని కత్తాపసు లిట్లనిరి. అయ్యా! నీ వెవ్వండవో మేము గ్రామైకరాత్రముగా వసించుచు శరీర పోషణముం జేసికొనుచుండువారలము గాన మావంశమునకు యాయా వరవంశ మని పేరు. కావున మేము యాయావరుల మనుమునులము మాకు సంతతి నశించుచుండుటను స్వర్గలోకములనుండి పోవ నున్నారము. తపస్సును నీవు మాకు దారవోసినను మా కీయవస్థ తప్పదు. మా వంశజాతుం డొక్కండు జరత్కారుండను వాఁ డున్నవాఁడు. ఆపాప కర్ముండు మందభాగ్యుండైన మావంశమునందుఁ బుట్టి సకల వేదాంగంబులు దెలిసి తపస్సునందలియాస్థచే నియమముతోఁ గూడుకొని దారపరి గ్రహంబు సేయఁడు. సంతానంబు వడయ నొల్లఁడు. మే మాతనిపితృ పితామహులము. మాపట్టియుండునవ్వుసఁ గంటివే? ఇన్నిఁటిని కాలుఁడు మూషికవ్యాజంబునఁ గొఱికిన నన్నియుం దెగెను. ఒక్కటిమాత్రము మిగిలియున్నయది. జరత్కారుం డనపత్యుండైన నందఱము నిరయము నకుఁ జనువారము. ఆతండు సంతానవంతుం డగునేని మా కెల్లఁ గూర్ధ్వ గతులు సమకూరును. నీవు మాకుఁ జుట్టమునంటివాఁడవై ప్రీతితో శాంతమూర్తివై మామాటల నన్నింటిని నాదరించి వింటివి. నీ వాజర త్కారుని నెఱుంగుదువేని, వానితో మాపడునవస్థను జెప్పి పుణ్యమునఁ బొమ్మనఁగా విని జరత్కారుం డతికారుణ్యచిత్తుండై యపత్యార్థ మవ శ్యంబు వివాహము చేసికొనవలయు నని యొకకొంత చింతించి తనపితృ వర్గమున కిట్లనియె. ఆర్యులారా! మీరలు నాపితరులరు. నాకుఁ బూజ్యు లరు. నేను మీకుఁ బుత్త్రుండను. జరత్కారుండను వాఁడ. బ్రహ్మచర్య వ్రతంబున దేహంబు శుష్కింపఁజేసి పరలోకసుఖములఁ బొందవలయు నని యున్నవాఁడ. కావున వివాహేచ్ఛ నాకుఁ బుట్టదు. నాపితరులగు మీయవస్థ నిట్లు గాంచిన పిదప మీకు హితము నాచరించుటకై దారార్థము నాపేరుగలకన్యను ముమ్మారులు భైక్ష్యముగ నెవరినైన నడిగెద. అట్టికన్యక లభించినచో దానిని ధర్మయుక్తముగఁ బెండ్లాడెద. దానియందుఁ బుట్టుకుమారుండు మీకు నరకావాసము లేకుండఁ

జేయును. అని చెప్పిన, వారు సంతసిల్లి జరత్కారువున కిట్లనిరి. అయ్యా!
నీవు పెండ్లాడి తగినసుపుత్త్రులను బడసి, ధర్మువుఁ దప్పక నిన్ను నుత్తములు
పొగడఁగ మహాత్ములు వొందు సద్గతులను బొందుము. ఎంత ఘోర
మగు నియమముతో దీవ్రతపంబు లాచరించినను, భూరిదక్షిణల నపార
ముగనిచ్చి యనేక యాగము లొనరించినను నపుత్త్రకులైనచో వారికి
సద్గతులు లేవు. కావున నీవు తగుకన్యకను పెండ్లాడి సంతానవంతుఁడవై
మాకూర్ధ్వగతులం గలిగింపు మనిరి. అంత జరత్కారుండు వారికి నమ
స్కరించి సనామకన్యాన్వేషణపరుండై మర్త్యలోక మంతయుఁ దిరుగఁ
దొడంగెను. ఇట్లు నానాదేశంబులం దిరుగుచు నెచ్చోటను దనయుద్దే
శంబుచొప్పునఁ గన్యకఁ గానక, పితరులకు హితముఁ జేయం దలంచి
సంతానకాంక్షియై నాపేరు గలకన్యక యెందేని యుండిన నేను పెండ్లా
డెదను. దాని నుత్తరకాలంబున నేను భరింపనోపను. సర్వభూతములు
నామాట లాలించి నాకోర్కి సఫలముగాఁ జేయుదు రని తలంచెద. అని
యొక్కచోటఁ గూర్చుండి మున్మాఱు పలుకఁగా నాగకుమారు లా
వృత్తాంతమును వాసుకికిఁ దెలిపిరి. అంత వాసుకి తన చెలియలిం దోడ్కొని
వచ్చి, మునీశ్వరా! ఇది నీపేరుగలది. వలతువేని దీని నీకిచ్చి వివాహము
గావించెదము. అనఁగా వాసుకికి జరత్కారుం డిట్లనియె. వాసుకీ!
ఇక్కన్య నాకు సనామ. దీనిని సంతానార్థము పెండ్లాడెదను. ఎన్నండేని
యిది నా కప్రియంబుఁ జేసెనేని యానాఁడు దీని నేవిడుచువాఁడ. ఇది
సమయముగఁ గొనిపిదప దానిం బోషింప వాసుకి నొడంబఱచి వాసుకి
మందిరంబున మంత్త్రపూర్వకంబుగా జరత్కారువును జరత్కారుండు
పెండ్లాడెను. అంత నక్కోమలి కత్తిపై నడుచునట్లతిభయమున వడవడ
వడంకుచు నతినియమముతో నుండి పతి కుపచర్యలు గావించుచు రేపవలు
నప్రమత్తురాలై వర్తించుచుండె. ఇట్లతిభక్తితోఁ బతికిఁ బ్రియం బొన
ర్చుచు జరత్కారువు తూర్పుదిక్కు సూర్యునింబోలె గర్భముం దాల్చి
యొప్పుచుండ నొక్కనాఁ డమ్ముని సూర్యాస్తమయవేళయందు భార్య
తొడపై శిర ముంచి నిదురించుచుండఁగా నాశ్రమవాసు లగు
మునులు కాల్యకృత్యంబులం దీర్పఁ బోవుచుండిరి. జరత్కారువు దానిం

జూచి తనమనంబున ని ట్లాలోచించెను. నే నిపుడు నాభర్తను లేపి
నచో నిద్రాభంగ మయ్యె నని కోపించు. లేవ కున్నచో సకాలమునను
సంధ్యాకార్యములు చెడ నన్నేల మేల్కొలుప వైతి వని కోపించు.
ఎట్లైనను ధర్మక్రియలకు లోపంబగుట లెస్సగాదు. కావున మేల్కొల్పి
నందులకుఁ గోపించెనా తత్ఫలంబుఁ గుడిచెద. ధర్మలోపంబున కోర్వనని
భర్తను స్వామీ! సూర్యాస్తమయమగుచున్నది. మేల్కాని ధర్మక్రియ
లంజరుపుఁడు అని తెలిపెను. జరత్కారుండు కోపారుణితలోచనుండై
యేల నానిద్రాభంగముఁ గావించితివి? నేను మేల్కానునంతకు సూర్యుం
డేల యస్తమించు ? మున్ను నేఁ జేసినసమయము మేరకు నీవు నా కవ
మానంబు దలంచితి గావున నేను నిన్నొల్ల. తపోవనంబునకుఁ బోయి
తీవ్రతపశ్చరణము గావించెద. అని చెప్పఁగా జరత్కారువున కామా
టలు హృదయవిదారణంబులై యాదేవి గడగడ వడంకుచుఁ బతికిఁ
గేల్మోడ్చి పెదవు లదర, గన్నీరు గారనిట్లనియె. తపోధనా! ధర్మలోప
మునకు వెఱచి మేల్కొల్పితిం గాని నే నపరాధముఁ జేయనైతి.
దీన నే నవమానము జేయఁదలంపను. నీయొద్దఁ బ్రియనై నీకెల్లప్పుడును
బరిచర్యలకులోపము గాక చేయుచుండు నన్నేదో నెపమున నిట్లు త్యజిం
పంగునే? మాతృశాపమును బోఁద్రోచుటకు [illegible] నాసోదరుఁడును నీ
యందు నాకుఁ బుత్త్రసంపాదనమునకుఁ గాదె నీకు నన్నిచ్చి వివాహ
ము చేసిరి. కార్య మేమియు నెఱవేఱకుండె. అపరాధ మెంతయును
జేయని నన్ను నిష్కారణముగ విడువఁజనదు. అని పలువిధంబులఁ
బ్రార్థింపఁగా జరత్కారుండు జరత్కారువున కిట్లనియె. శుభాంగీ!
నామాట యసత్యంబు కాదు. పూర్వమున నే నిట్టు ప్రతిజ్ఞను
జేసితిం గాదే? నీగర్భంబున సూర్యాగ్నుల తేజస్సునకుఁ దుల
తూఁగుతేజముగలకుమారుం డున్నవాఁడు. వాఁ డుభయకులముల
నుద్ధరించు. నీవు వగవక నీయన్న వాసుకియింట సుఖంబుండుమని యూరార్చి
జరత్కారువుఁ బుట్టింటికి కంపి, తాను తప మనుష్ఠింపం దీర్మానించి తన
యిచ్ఛవచ్చినచోటికిఁ జనెను. అంత నానాగకాంత యన్నగారైన వాసుకి
యొద్దకు వచ్చి యావృత్తాంతంబంతయు నెఱింగింప వాసుకి మునిచర్యకు

వగచి సోదరి నూరార్చి తనయింట నామెను సకలోపచారంబులతో గారవించుచుండె.

అంతఁ గొన్నినాళ్లకు జరత్కారువునకుఁ గనుప్రొద్దు లగుటయు నొక్క సుముహూర్తంబునఁ దేజమున సూర్యసమానుఁడును, పుణ్యరాశి యును, నుభయకులముల నుద్ధరించువాఁడును నగు పుత్త్రుని జరత్కారువు కనెను. జరత్కారుముని తనభార్యగర్భంబున నుభయకులప్రదీపకుం డగు పుత్త్రుఁడు "అస్తి" ఉన్నాఁడు అని చెప్పిపోవుట నాపుత్త్రుఁ డస్తీకుఁ డనంబరఁగె.

ఆయస్తీకుండు నాగరాజును, మేనమామయును నగు వాసుకి యింట దినదినప్రవర్ధమానుండై పెరిగి పెద్దవాఁడై భృగుమహర్షి పుత్త్రుండగు చ్యవనునియొద్ద వేదవేదాంగముల నభ్యసించి యతిబాల్యంబుననే మహామతి యని పేరెన్నిక గనెను.

### జనమేజయునకుఁ బరీక్షితుశాపకారణంబు మంత్రులు సెప్పుట

అట జనమేజయుండును దక్షకవిషానలంబునం దనజనకుఁడగు పరీక్షిన్నరపతి మేను దొఱఁగె నని యుదంకునివలన నెఱింగి మంత్రులం జూచి, దీని కేమి నిమిత్తంబు? సవిస్తరంబుగాఁ జెప్పుం డనిన మంత్రు లిట్లనిరి. రాజేంద్రా! వినుము. మీతండ్రి పరీక్షిన్మహారాజు విరాటరాజ సుతయైన యుత్తరయం దభిమన్యునకుఁ బుట్టిన పుణ్యమూర్తి. అతండు కురు రాజులంద అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రంబునఁ బరిక్షీణులయిన పిదప శ్రీకృష్ణునిప్రసాదముచే నుత్తరాగర్భమున నుండి బ్రదుకుటంజేసి పరీక్షితుఁ డనుపేరితో వెలసెను. ఆమహారాజు బాల్యమున సర్వశాస్త్రముల నేర్చి, మఱియును గృపాచార్యునకు శిష్యుండై విలువిద్య నభ్యసించి పరాక్రమశాలియై సర్వజనులను ధర్మమార్గప్రవర్తకులనుగఁ జేసి తాను ధర్మము ననుష్ఠించుచు, నెవ్వరికిని విరోధి గాక యందఱయందును సమముగా వర్తించుచు దయాళుండై దీనులను ననాథులను బోషించుచు నఱువదియేడులు రాజ్యంబు సలుపుచుండె. ఆరాజచంద్రుండు నీప్రపితామహుం డగుపాండురాజుంబోలె వేటయం దాసక్తుండై మహారణ్యములయం దొక్కనాఁడు పెక్కుమృగముల నేసి, తనచేత నేటుపడి

పాటిననమృగంబువెంటం దగిలి మహాధనుర్ధరుండై యమ్మృగంబు పిఱుందం జను రుద్రుండు నా నొంటికాఁడై యామృగమును వెదకుచుఁ బోవువాఁడు ముందట నతిశాంతచిత్తుఁడును, మౌనమును ధరించిన మహాతపస్వియు, నావుదూడలు పాలు గుడుచునపుడు వాయువుచే వానినోటినుండి యెగిరినసురుగు నాహారంబుగాఁ గొని, యావులు సంచరించు ప్రదేశములయందుఁ దీవ్రతపం బాచరించువాఁడును నగు శమీకుం డను మునీంద్రుం గని, మునీంద్రా! మృగం బొక్కటి నాచే నేటువడి యమ్మూతోన యీమార్గమునఁ బఱతెంచె. అది యెక్కడం బాఱె? నీ వెఱుంగు దేని చెప్పు మనిన, నమ్ముని మౌనవ్రతుండు గావున పలుకకుండె. అంత నమ్మహీపాలుం డమ్మునికి నలిగి సమీపంబునఁ జచ్చిపడి యున్న యురగకళేబరమును దన వింటికొనను నెత్తి యమ్మునిమెడఁ దగిలించి క్రమ్మఱి హస్తిపురంబునకు వచ్చియుండె. మఱియు నమ్మునికిఁ దాఁ జేసినయపకారంబున కాతండు చలింపక యలుగకుండినది చూచి రాజు దా నొనర్చినపని యపరాధ మని సైతము తలంచి కొండొక చింతిల్లెను. ఆశమీకమునిపుత్త్రుఁడు శృంగి యనువాఁడు గురుగృహంబునకుఁ బోయి యుండి గురువు ననుమతిం గొని నిజాశ్రమంబునకు మరలువాఁడు మార్గమునఁ దనచెలికాఁ డగుకృశుఁ డనువానిం జూచి తండ్రి యోగక్షేమము లడుగఁగా, వాఁడు శమీకునిమెడలో నురగశవమును దగిలించి పరీక్షిన్మహారాజు జేఁగె నని చెప్పి పరిహాసంబొనర్ప నవంధ్యకోపుఁ డగు నామునికుమారుండు రాజునకు మిక్కిలి కోపించి శాపజలంబుల నెత్తికొని, విజనంబైన యమ్మహారణ్యమునందుఁ బరమశాంతి నవలంబించి మౌనమును ధరించి తపంబు చేయుచున్న మాతండ్రి ని ట్లవమానించిన దుష్టాత్ముం డగు పరీక్షితుండు నేఁటిమొదలుగా నేడుదినంబులలోనఁ దక్షకవిషానలదగ్ధశరీరుండై యమసదనమున కరిగెడు మని శాపం బిచ్చి పిదపఁ దండ్రిపాలికిం బోయి మూఁడ నురగకళేబర మంసాంతరమునఁ బడి వ్రేలుచుండుటను దెలియక యెంతమాత్రము చలింపని యోగవృత్తి నున్న శమీకుం గని, యాయురగకళేబరంబుఁ బాఱవైచి వెంటనే కనులు దెఱచి తన్నుఁ గాంచినతండ్రికి నమస్కరించి యావృత్తాంతం బంతయు సాంతంబుగాఁ దండ్రికి నుడివి, బాష్పపూరితనయనుండై శృంగి

తాను బరీక్షితు నుద్దేశించి యొసఁగిన శాపము చెప్పిన విని శమీకుం డదరిపడి పుత్త్రున కిట్లనియె. వత్సా! ఇది యేల యింత తొందరపడితివి? తెలియక రాజు నేలశపించితివి? ధర్మమునఁ బ్రజల నేలు ప్రభువునకుఁ గీడు దలంచుటధర్మంబె? రాజు లేకున్న రాజ్యము చెడును. మన మాతని ధర్మపరిపాలనమునం గాదె సుఖుల మయియున్నవారము. దానంగాదె మనతపస్సులు నిరాతంకముగ సాగుచున్నవి. మనతపస్సున నితనికి భాగము నైతముకలదని తెలియవే? రాజు మనుష్యసామాన్యుం డగునే? రాజు దండము నవలంబించి ప్రజలు దుష్టులు గాకుండ శిక్షించు. అందు ధర్మము లెస్సఁగాఁ బరిపాలితమగును. ధర్మమున స్వర్గము గలుగును. మఱియు రాజరక్షణంబునఁగాదె భూసురులు యజ్ఞములను సురక్షిత ముగ నొనర్తురు. యజ్ఞములవలన దేవతలు సంతసింతురు. వారు సంత సించిన, కాలవర్షములు గురియును. వర్షములచే నోషధులు పెంపుతోఁ బెరుగును. ఓషధులు లెస్సగఁ బెరిగిన మనుష్యులు సుఖులై జీవింతురు. కావున రాజు సమస్తమునకు మూలాధారంబై యుండు. సంతతవేదా ధ్యాయులగు పదుగురతోడ రాజొక్కండు ధర్మపరుం డగువాఁడు తుల్యుం డని మనువు నిర్ధారించి యుండె. అంతియ గాక పరీక్షితుండు తక్కుంగల రాజులవంటివాఁడు కాఁడు. ధర్మపుత్త్రునిమాడ్కి ధర్మమును బ్రజలలో సుప్రతిష్ఠితము గావించియున్నాఁడు. అట్టివాఁ డాఁకట దప్పి కోర్వలేక యెఱుకఁదప్పి యిట్లుచేసినను నేను సహించియుంటి. నీవు బాల్యదోషమున రాజు నిట్లు శపించితివి. మఱలింప సాధ్యమగు నేని మఱలింపుము. అని చెప్పఁగాఁ దండ్రికి సుతుం డిట్లనియె. నావచనం బమోఘుంబు. తండ్రీ! నాచేసినపని సాహసమైనను, దుష్కృతమైనను, బ్రియమైనను, నప్రియమైనను గావచ్చును. కాని నావలు కింతకు వృథపో నేరదు. అది యిదివఱ కెప్పుడో తక్షకునిఁ బ్రేరేపించి యుండు. అనఁగా శమీకుండు క్రోధియైనకుమారున కిట్లనియె. పుత్త్రా! నీవు మహాతపశ్శా లివి. కావున నీమాట లసత్యంబులు గానోపవు. అయినను నీవు శాంతిని బూనవలయును. ఇంతతీక్ష్ణ మగు క్రోధము తపమునకు హానిచేయును. క్రోధ మణిమాదు లగునుత్కృష్టసిద్ధులఁ బాపును. క్రోధమువలన ధర్మక్రియలకు బాధ గలుగును. శాంతి లేని తపస్వి తపమును, మదిం

చినవానిసంపదయును, ధర్మరహితుఁ డగురాజు రాజ్యమును నోటికుండ లోనినీటివలె నస్థిరమగును. కావున నిట్టిసాహసము లెన్నఁడు సేయకుము. మును లతికష్టమున నార్జించినధర్మ మెల్లఁ గ్రోధమునఁ జెడును. దానం జేసి సద్గతి కలుగనేరదు. శాంతి యుభయలోకములయందును మేలు దెచ్చు. కావున నోవత్సా! క్రోధ మడఁచి జితేంద్రియుఁడవు గమ్ము. అయ్యది వనగతఫలమూలాహారంబులఁ దినుటచేఁ గల్గును. తపోనియ తుండ వగుము. శాశ్వతమైన సుఖప్రాప్తికి యత్నింపుము అని కుమారుని తైక్ష్ణ్యమునకుఁ బశ్చాత్తాపపడుచు నాశ్రమముననున్న గౌరముఖుం డను శిష్యుం బిలిచి యిట్లనిగెు. నీవు హస్తిపురంబున కేగి పరీక్షిన్మహారాజు సన్నిధానంబుఁ జేరి మొదటఁ గుశల మడుగుము. పిదప శాపమునకుఁ గారణము దెలుపుము. అనంతరము శాపముఁ దెలియఁజేయుము. పదంపడి తక్షకునివలన భయముడుగు నుపాయమును జేసికొనుమని చెప్పి మఱలి రమ్ము. అనివానిం బనిపెను. అంత గౌరముఖుండు రాచనగరునకుఁ బోయి రాజునెదుట నిలిచి యిట్లనియె. రాజేంద్రా! అడవియం దొంట రిగా మౌననియమముతో ఘోరతప మాచరించుచుండిన మాగురువగు శమీకముని మెడలో సురగశవము నేలినవారు వైచుట యాగురువు కుమారుఁ డగు శృంగిచిని మీ కలిగి మీకుఁ గార్చిచ్చువంటి యీశాప మొసఁగెను:—“సప్తాహములలోన నీపరీక్షితుఁడు తక్షకవిషమున దగ్ధుఁ డయ్యెడు” మని—దీనికి మాగురువులు శమీకులు సంతాప మంది నన్ను మీయొద్ద కనిపి తక్షకునివలనఁ దమకుఁ గలుగనున్న యాపద దొలఁగున ట్లుపాయమును జూచుకొను మని చెప్పు మనఁగా, నే నిందు వచ్చితి. వారు చెప్పిపంపిన వృత్తాంతంబుఁ దెలిపితి. ఇంకను బోయి వచ్చెద నని చెప్పి గౌరముఖుం డరిగె. అంతఁ బరీక్షిన్నరపాలుండు పరిక్షీణహృదయుండై, తన చేసినయపరాధమునకు సంతాపమంది, శమీకు నుపశాంతికి మెచ్చి, శృంగిశాపంబునకు వెఱచి, మంత్రులమగు మాతో నాలోచించి, వాయుసంచారమునకు సైత మెడము లేనిదియు, విషహరములైన యౌషధములతో నమర్పఁబడినదియు, విషవైద్యులును మంత్రసిద్ధులును నగు విప్రవర్యు లంతటం గలదియు, సురక్షితమై నదియు నగు నొంటికంబపుమేడ నొక్క దానిని గట్టించి యామేడను

జేరి మే మెల్లరము గొల్చుచుండ రాజకార్యము లన్నియును నాప్రాసాదమునందే నిర్వహించు చుండెను.

## కశ్యపునకుఁ దక్షకుండు గోరినధనం బిచ్చి మరల్చుట

ఇవ్విధంబున నాఱుదినంబులు జరుగుచు సప్తమదివసమునఁ బరీక్షితుండు తక్షకునివిషముచే మృతుం డగు నని తెలిసి కశ్యపుఁ డను మునివర్యుండు విషచికిత్సం జేయ నచ్చుచుండె. తక్షకుండును విప్రవచనచోదితుండై పరీక్షితునొద్ద కెవ్విధంబునఁ బోవ నగునో యని చింతించుచుఁ గశ్యపుండు విషచికిత్సఁ జేయుట కేగుచున్నవాఁ డని యెఱింగి బ్రాహ్మణరూపముతో దారియం దాకాశ్యపునిం గని యాతని వృత్తాంతంబు నడుగఁగాఁ గాశ్యపుండు వాని కిట్లనియె. అయ్యా! భూలోకమునందలి భూతసంఘముల నురగంబులు గరవిషవహ్నిచే దహించి భస్మంబు గావించుచుండుటకు బ్రహ్మ తొల్లి యెఱింగి భూతములయెడఁ గరుణించి యఖిలలోకహితముగా నాకుఁ బాములవిషమునఁ జచ్చినవారిని బ్రతికించు మంత్రోపదేశమును జేసెను. నేనావిద్యాబలంబునఁ దక్షక దష్టుండైన పరీక్షిన్మహీపాలుని నవేతజీవు సంజీవితుం జేసి కీర్తిఁ జెందుదు. మఱియు నీధరణినిధర్మమార్గమున నేలుచుండు రాజును రక్షించి యతనిమూలమున విస్తార మగుధనము నార్జింతు. కావున నీసుకృతంబుం జేసి నాకుఁ గీర్తియు, ధనమును, ధర్మమును బడయ నగును. కావున హాస్తిపురంబున కేగుచున్నవాఁడను అని తెలిపెను. వానిమాటలకుఁ దక్షకుండు నగుచుఁ గశ్యపునితో నిట్లనియె. అయ్యా! నేను తక్షకుఁడను. పిడుగుపడిన బ్రదుకనగును గాని నావిషనిహతులు మఱియుం బ్రతుకఁగనలేరు. నీమందులు మంత్రంబులు నావిషము సోఁకినవారియం దేమాత్రమును బనికిరావు. మఱలి పొమ్ము. కా దేని, కాశ్యపా! నే నీవృక్షమూలంబును గఱచి భస్మంబు గావించెద. దానిం బ్రతికింపు మని యందు మఱ్ఱిచెట్టొకటి దీర్ఘశాఖలతో నాకాశం బంటుచు బహుపత్రఫలములతో నిండియుండఁగా వానిమూలంబు తక్షకుండు గఱచెను. అంత నామఱ్ఱి పిడుగుపడినదానివలె దగ్ధంబై భస్మీభూతం బయ్యె. అప్పుడు కశ్యపుండు తత్క్షణంబున నాభస్మసమూహము నొక్క

రాశిగాఁ ద్రోచి తనకు బ్రహ్మ యుపదేశించిన మంత్రము నుచ్చరించి యెప్పటియట్ల మహాశాఖలతో నొప్పారు నపూర్వంపు మఱ్ఱివృక్షముగాఁ జేయఁగాఁ, దక్షకుండు వానివిద్యాప్రభావంబునకు విస్మయం బంది కశ్యపునితో నిట్లనియె. "మునీంద్రా! ఈవిటపి నీవిద్యాబలంబున, బ్రతికినది కాని, మిక్కిలి యలిగిన బ్రాహ్మణశాపంబున గతాయువయిన యాపరిక్షితుఁడు నీమంత్రబలమువలన బ్రతుకనేరఁడు. వానియిచ్చుధనంబున కంటె నాయం దధికధనంబు గొనిపొమ్ము. అని చెప్పఁగాఁ గశ్యపుండు తనదివ్యజ్ఞానమునఁ బరీక్షితుని క్షీణాయువుంగా నెఱింగి తక్షకుచే ననంతం బైన ధనరాశిం గొని క్రమ్మఱి చనియె" అని తెలిపిరి. అది విని జనమేజయుండు మంత్రులతో "ఓయీ! విజనారణ్యంబునఁ దక్షక కాశ్యపులకు జరగినవృత్తాంతము మీ రెట్లెఱింగితిరనియడుగ వారిట్లనిరి. ఈయూరనున్న విప్రుం డొక్కరుండు కట్టియలకై వనంబునకుఁ బోయియుండి కశ్యప తక్షకులు రాకమున్నె యామఱ్ఱి నెక్కియుండి వారి యిరువురి సంభాషణంబులను విని యావృక్షముతోడఁ దక్షకవిషానలంబున దగ్ధుండై మఱల నావృక్షముతో లబ్ధజీవితుండై వచ్చి జనుల కీవృత్తాంతంబుఁ జెప్పె నని మఱియు నిట్లనిరి.

### తక్షకవిషాగ్నిచేఁ బరీక్షితుండు ప్రాసాదంబుతోడ దగ్ధుండగుట

అట్టియుపాయంబునఁ గాశ్యపుండు మఱలిపోఁగా తక్షకుండు కామరూపు లగునాగులఁ బిలిచి యిట్లనియె. సోదరులారా! మీరెల్లరు మునికుమారులవేషముం దాల్చి ఫలపుష్పాదులం గొని పరీక్షితుఁ బ్రాసాదంబుననున్నవానిఁ జేరియుండుఁడు. నేనును మీవెంబడి నదృశ్యుండనై వచ్చువాఁడ నని వారి కాజ్ఞాపించెను. అంత వా రెల్లర ట్లొనర్చి ఫలాదులఁ దెచ్చిన, వారిని నృపాలుండు బహూకరించి వారు దెచ్చినఫలముల నచ్చోట నున్నవారి కెల్లరకు నొసంగి తానును దైవచోదితుండై యాఫలములలో నొక్కటిం గైకొని వ్రచ్చెను. అంత నాఫలమునందు నల్లనికన్నులును నెఱ్ఱనిమేనును గలయొక చిన్నపురుగు కనఁబడఁగాఁ బరీక్షితుం డెల్లవారికి నప్పురుగుం జూపి యిట్లనియె. బ్రాహ్మణుఁడు నిర్దేశించిన దినసప్తకము నేటి సూర్యాస్తమయముతో నంత మగుచున్నది. ఈ

పురుగు పెద్దదై కఱచినఁ గఱచుంగాక. ఇఁక నాకు విషభయము లేదు. బ్రాహ్మణశాపము దీనఁ దీఱినఁ దీఱుఁగాక! అని చెప్పి యాపురుగును తన మెడయం దుంచుకొనెను. అచ్చోట నుండినవారు కాలప్రేరితులై రాజున కేమియుం జెప్పకుండిరి. అంత నాచిన్నపురువు తటాలున దక్షకరూపము నొంది రాజు ఫాలతలంబు భేదించి బైలువెడలి వచ్చి యాతనిం జుట్టుకొని గొప్పయెలుంగున నచ్చోట నున్నవారల కందఱకును ద న్నెఱింగించి పరీక్షితుం గఱచి చనియె. తత్పరిజనంబు లందఱుఁ బిసుగుపడఁగా బెదరి చెదరినట్లు యథాయథలై పాఱిరి. అప్పు డాయొంటికంబపు మేడయుఁ దత్క్షణమ మండె. అట్లు మీాతం డ్రి పరలోకగతుండైనం బురోహితపురస్సరానేకభూసురవరులు విధ్యుక్తప్రకారం బా రాజునకుఁ బరలోకక్రియలు నిర్వర్తించిరి.

అంతఁ గులక్రమాగతంబైనరాజ్యము బాల్యమునందే నిన్నోసం పన్నుఁడా! పొందుటం జేసి మే మందఱమును గూడి నీకు రాజ్యాభి షేకంబు చేసితిమి. కాశిరాజపుత్త్రిక యగు వపుష్టను నీకు రాణిగా నొన ర్చితిమి. అవ్విధమున నీవు రాజ్యలక్ష్మిని, రాణిమణినిం బొంది యాయు ష్మంతుండవై రాజ్యము నేలుచు ధరాప్రజలను ధర్మమార్గమునఁ బాలించు చున్నావు. భూరిదక్షిణల నొసంగి బహుయాగములను చేసితలకుఁ బ్రీతిగా భూదేవతల మున్నిడికొని చేసితివి. ఓపుణ్యాత్ముఁడా! సత్పురు షులు నీకీర్తిని నలుదెసలఁ జాటించుచున్నారు. నీకు సమానులగురాజు లీభూలోకమున నన్యు లెవ్వరును లేరు. కావున నీవిపుడ ననేకసహస్ర సంవత్సరములు రాజ్యపాలనమును గావింపుము. మీాతండ్రి యగుపరీ క్షితునకుఁ దక్షకుండు చేసినయపకారమును లెస్సఁగా దీర్ఘాలోచనము చేసి యీావచ్చియున్న మహర్షి యుదంకున కిప్పితంబుఁ జేయు మని మం త్రులు, పరీక్షితుమరణవృత్తాంతంబు తెఱం గంతయు నాతని సుమానుం డును, నధిగతరాజ్యసంపన్నుండును, సర్వగుణోపేతుండును నగుజనమే జయునకుఁ దెల్పిరి. మఱియు వార లా రాజుతో నిట్లనిరి. "ఓరాజపుంగవా! ఒక్కవిప్రుం డగుశృంగిమాటను గాదనక నీతండ్రికిఁ దక్షకుం డింతటి మహాపకార మొనర్చునే?" అని పలుక జనమేజయుం డంతయును విని సటలు వెఱికినసింగంబుపగిది వారల కిట్లనియె. మంత్రులారా! శృంగి

మాటకు సాకుపెట్టుకొని తక్షకుండు వచ్చి మాయయ్య కింతటియపకారము గావించెను. కాకున్న తనవిద్యాబలంబున విషచికిత్సఁజేసి ధనమార్జింపఁదలంచి వచ్చిన కాశ్యపుసుహిమును బరీక్షించి వానికిఁ దానయప్రమేయంబు లగుధనంబుల నిచ్చి త్రోవలోన వానిని వంచించి వెనుకను మరలించి పంపివేయునే? ఈతక్షకకృతాపకారమునకుఁ బ్రతీకారంబుఁ జేయకుందునే? ఉదంకమహామునికి సైతము సర్పములకు నేను బ్రతీకారముచేయుట యతిప్రియము. కావునఁ దక్షకాది కాకోదర సమూహామును సర్పయాగమునకు సంకల్పించి యాయగ్నియందు వ్రేల్చి భస్మముసేసెద నని నిశ్చయించి రాజపురోహితుని ఋత్విక్కులను బిలిపించి తనకుండు సర్పములపై నీసునకుఁ గారణంబుఁ దెలిపి యాలోకభయంకరులగువారి నిర్మూలమునిమిత్తము సర్పయాగవిధానమును దెల్పుఁడని ప్రార్థించె.

## జనమేజయుండు సర్పయాగం బొనర్చుట

అప్పు డాఋత్విజు లమ్మహారాజున కిట్లనిరి. అయ్యా! సర్పయాగం బనునియ్యది నీకుఁగాఁ బురాణంబుల విధింపఁబడియున్నది. ఇద్దానిని నీవ యొనర్చుట కర్హుండవు. దీని నొరు లెవ్వరును జేయరు. అని చెప్పఁగా జనమేజయుండు తక్షకుఁ డనువాఁడు నిశ్చయముగ యాగాగ్నియందు దహింపఁబడినవాఁ డని భావించి, యాగసంభారంబు లొడఁగూర్ప ననేకుల నియమించెను. అట్లు ఋత్విజులు యజ్ఞశాల నేర్పఱచుచుండ శిల్పశాస్త్రవేదియు, వాస్తువిద్యానిపుణుండును, ననేకపురాణముల నెఱింగినవాఁడును, సూతకులమునఁ బుట్టినవాఁడును, లోహితాక్షుం డనుపేరిటివాఁడు భావివిధము నెఱిఁగి యియ్యాగ మొకబ్రాహ్మణనిమిత్తముగఁ దుదముట్టనేర దనెను. అంత జనమేజయుండు వానిమాటయం దాదరము లేక, వానినియాగము జరుగునంతకాలము యాగశాలం బ్రవేశింపకుండ నాజ్ఞచేసి తాను యజ్ఞదీక్షితుండై వపుష్టమహాదేవి ధర్మపత్నిగా సర్పయాగదీక్షితుండై యజ్ఞశాలా ప్రవేశముం జేసెను. అంత న య్యాగశాల విధ్యుక్తప్రమాణ లక్షణనిపుణశిల్పాచార్యవినిర్మితంబును, యాగమున కుపకరించు నానావిధద్రవ్యసంభారములతోఁ గూడినదియును, విస్తారమైన ధనధాన్యము

లచే నిండినదియుఁ దమతమకార్యముల ప్రారంభసంభ్రమమున నిటునటుఁ దిరుగుచుండు బ్రాహ్మణనివహంబును గలదై మిక్కిలి సొంపుమీఱి యుండె. అంతఁ జ్యవనకులవిఖ్యాతుం డైనచండభార్గవుండు హోతగాఁ బింగళుం డధ్వర్యుండుగా శార్ఙ్గరవుండు బ్రహ్మగాఁ గౌత్సుం డుద్గాతగా, వ్యాస, వైశంపాయన, పైల, జైమిని, సుమంత, శుక, శ్వేతకేతు, మౌద్గల్య, ఉద్దాలక, మాండవ్య, కౌశిక, కౌండిన్య, శాండిల్య, క్రామఠక, కోహిల, అసితదేవల, నారద, పర్వత, మైత్రేయ, ఆత్రేయ, కుండజఠర, కాలఘట, వాత్స్య, శ్రుతశ్రవో, దేవశర్మ, శర్మద, రోమశ, ఉదంక, హారిత, రురు, పులోమ, సోమశ్రవు లాదిగాఁగల వేదపారగు లగుమహామునులు సదస్యులుగా, నీలవస్త్రధారులును, హోమధూమసంరక్తనయనులును నై ఋత్విజులు జ్వలించుచున్నయగ్నిముఖమున వేల్వ నుపక్రమింప నాభూసురుల మంత్రమహిమచేఁ బలుతావులయుం దుండిన సర్పము లీడ్వఁబడినవై పరవశంబులై యొకటినొకటిఁ బిలుచుచు నధిక భయముతో నయ్యాగాగ్నియందుఁ దొరఁగెను. మఱియు నప్పు డాయాగాగ్నికి బలులైన ముఖ్యనాగుల నోశౌనకా! పేర్కొనెదనని సూతసూనుం డిట్లు చెప్పందొడంగె. వారు కోటిశ, మానస, పూర్ణశల, పాల, హలీమక, పిచ్ఛిల, కౌణప, చక్ర, కాలవేగ, ప్రకాలన, హిరణ్యబాహు, శరణ, కక్షక, కాలదంతకులు మున్నగు వాసుకివంశమునఁ బుట్టినవారును; బుచ్ఛాండక, మండలక, పిండసేక్తృ, రభేణక, ఉచ్ఛిఖ, శరభ, భంగ, బిల్వతేజో, విరోహణ, శిలి, శరకర, మూగ, సుకుమార, ప్రవేపన, ముద్గర, శిశురోమ, సులోమ, మహాహనులు మున్నగు తక్షకవంశసంభవులును; భారావత, పారిజాత, పాండర, హరిణ, కుశ, విహంగ, శరభ, మోద, ప్రమోద, సంహతాపను లాదిగాఁగల యైరావతకులులును; నేరక, కుండల, వేణి, వేణీస్కంధ, కుమారక, బాహుక, ధూర్తక, ప్రాత, రాతకాదులగు కౌరవ్యకులసంభవులును; శంఖుకర్ణ, పిఠరక, కురార, సుఖసేచక, పూర్ణాంగద, పూర్ణముఖ, ప్రహాస, శకుని, దర్య, మాహఠ, కామఠక, సుషేణ, మానస, అవ్యయ, భైరవ, ముండ వేదాంగ, పిశంగ, చోద్రపారక, ఋషభ, వేగవత, పిండారక, మహాహనురక్తాంగ,

సర్వసారంగ, సమృద్ధ, పటవాసక, వరాహక, వీరణక, సుచిత్ర, చిత్ర
వేగిక,పరాశర, తరుణక, మణిస్కంధ,ములు మున్నగు ధృతరాష్ట్ర కులమునఁ
బుట్టినవారును; మఱియు ననేకులు, వేలు, పదివేలు, లక్షలు, పదిలక్షలు,
అర్బుదసంఖ్యలు గల యనేకముఖ్యపన్నగవంశోత్పన్ను లొక్కొక్క
మొగి ననేకశిరస్సులుగలవారును, సితాసితపీతారుణవర్ణ దేహులును,
మహాకాయులును నైన నాగేంద్రులు, బ్రాహ్మణులమంత్ర దండముచే
హతులై హాహారవంబులఁజేయుచు నయ్యాగాగ్ని యందుఁ దడఁబడి పడు
ధ్వానములును, బడినపిదపఁ గాలెడురవములును, గాలినపిదప వ్రయ్య
లగునప్పటిరవములును, దిక్కులయందుఁ బ్రతిధ్వానములఁ జేసెను.
అప్పుడు కొసెడునిడివిగల మహాసర్పంబులు వేగముగ గోకర్ణమాత్ర
ప్రమాణములై తోఁచుచుండె. ఇవ్విధంబున ననేకప్రాణిభయావహం
బైన ఘోరాశీవిషంబు లయ్యాగాగ్నిని విప్రమంత్రాహూతములై
పడుచుండ వానిదేహములలోనుండి వసయు, నెత్తురును, గాలువలు గట్టి
పాఱెను. మఱియు నాకాకోదరంబు లగ్నియందు మాడుచుండఁగా దాని
నుండి దుస్సహంబైన దుర్గంధంబును, శరీరములు పగులుచుండఁ గలుగు
మహాధ్వానంబులును, పలుదిక్కుల నావరించె. అప్పు డీయాగమునకుఁ
దక్షకుండు వెఱచి దేవేంద్రు శరణు వేఁడగా నప్పురందరుండు 'కొన్ని
మేటిపాములకు సర్పసత్త్రభయము లేదని పూర్వము బ్రహ్మ యాన
తిచ్చుటను నీ వీయాగమునకు వెఱవవల దని చెప్పి తక్షకునిఁ
దనయొద్ద నిర్భీతుండై యుండు మని యూఱడించెను. వాసుకి యా
జన్నమునం దనేకములైన సర్పములు చచ్చుటకు వెఱచి, చింతాక్రాంత
చేతస్కుండై సోదరి యగు జరత్కారువును సమీపించి, సోదరీ! జనమే
జయుసర్పయాగంబున నాగు లనేకులు మ్రందిరి. కాని, యాగము
ముగింపు లేదు. ఈయాపదను దొలఁగించునిమిత్తము గాదె ని న్నా జర
త్కారుమునికిచ్చి వివాహము చేసితిమి. మ మ్మిప్పుడు నీవు కాపాడ
వలసినసమయము ఆస్తీకుఁడు సర్పయాగమును నివారించు ననియు
మమ్మెల్లర రక్షించు ననియుఁ బూర్వము బ్రహ్మదేవుండు వాక్రుచ్చియున్న
వాఁడుగాదె. అందు నీ వెఱుంగనిది యేదియును లేదు. కావున
నీ విప్పుడు నీపుత్త్రుం బిలిచి సర్పయాగశాలకుం బంపుము. అనఁగా

నద్దేవి యస్తీకుం బిలిపించి యతని కిట్లనియె. తండ్రీ ! అస్తీకుఁడా ! వినుము. పూర్వము తల్లియైన కద్రువ నిర్దయురాలై నీమామ లగు నురగులకు జనమేజయుసర్పయాగమునందుఁ బడునట్లు శపించినది. కాని, యయ్యది నీమూలమున జనమేజయనృపాలుం డుడుగు నని బ్రహ్మ తొల్లి యానతిచ్చెను. కావున నీవిప్పు డాయాగము జరుగుచోటి కేగి జనమేజయుచే యాగం బుపసంహారింపఁజేసి నీమామల వెతఁ బుడుపుము. నాగర్భజనితుఁ డగుకుమారుండు యజ్ఞము నుపసంహారింపఁజేసి గతించిన పాములు పోఁగా మిగిలియుండువానినైన రక్షించు నని నీమామ వాసుకి నీతండ్రికి నన్నిచ్చి వివాహము గావించె. ఇఁక నీ వాలస్యము చేయక సర్పయాగాగ్ని కిప్పటి కాహుతులైనవి పోఁగా మిగిలినవాని నైన రక్షింపుము. అని చెప్పుచుండఁగనే యస్తీకుండు మామలయుఁ దల్లి దియు నైన మనోవేదన నుడిపి, అమ్మా! యింతకుమున్ను వహ్నియందుఁ బడినవి దప్ప నింకఁ గాద్రవేయులనునగ్ని కాహుతిఁ గానీయను. నీవును మామ యగువాసుకియు నామాటను నమ్ముఁడు. ఎవ్విధమున నైనను జనమేజయుసర్పయాగము నుడిగింతు నని వాసుకి ధృతరాష్ట్ర ప్రముఖుల నూఱడించి తనవెంట సకలవేదవేదాంగపారంగతు లగు విప్రులు రాఁగా జనమేజయసర్పసత్త్రసదనంబునకుం జనుదెంచి స్వశరీరకాంతిచే సభాప్రదేశం బెల్ల వెలుంగుచుండ స్వస్తివచనపూర్వకంబుగా రాజును, ఋత్విజులను, సదస్యులను, నగ్నిహోత్రుని నిట్లని స్తుతియించె.

**{ అస్తీకుండు జనమేజయుఁనియజ్ఞశాలలోని వారి నెల్లర స్తుతించి సర్పయాగము నివారింపఁజేయుట }**

జనమేజయనరేంద్రా! నీవు చంద్రవంశపురాజుల కాభరణాయమానుండవై పుట్టి రాజర్షి వని ప్రఖ్యాతిఁ జెంది బ్రహ్మోత్తరంబుగా ధర్మమునఁ బ్రజల నేలుచు, సద్గుణములఁ బూర్వపురాజు లగుయుధిష్ఠిర నాభాగ భగీరథ దశరథ మాంధాతృ రామ రఘునిజయులఁ బోలితివి. నీవు మహాత్ము లగు పాండవులకులంబునఁ బుట్టి మిక్కిలి విభవముతో నీయవనీరాజ్యమునకుఁ బట్టభద్రుండ వైననాటంగోలె ననేకభూరిదక్షిణలతో నానాధ్వరంబులఁ గావించుటంజేసి భూసురు లెల్లరు నీయజ్ఞము

నందు లెస్సఁగా నర్చింపఁబడిరి. నీయజ్ఞము సోమవరుణులయజ్ఞము లకును, బ్రహ్మ ప్రయాగయందుఁ జేసిన యజ్ఞమునకును, దేవేంద్రుఁడు గావించిన శతమఖములకును, యముని యజ్ఞమునకును, హరిమేధసుని యజ్ఞమునకును, రంతిదేవ, గయ, శశిబిందు, కుబేర, శ్రీకృష్ణయజ్ఞములకును దీటైనది. నీయజ్ఞమునందు నీవు వరించియుండు ఋత్విజులును సదస్యు లును నానావిధయజ్ఞప్రయోగదక్షులు, బుద్ధిమంతులు, మహాతపస్వు లు, నిగ్రహానుగ్రహాశక్తియుతులు, బ్రహ్మసదృశులునై శతమఖునిఋత్వి జులకంటె సర్వవిద్యలయందును దక్షులు. సకలమునివరేణ్యుండును, విద్వాంసుండును, ధర్మస్వరూపుండును, త్రిలోకప్రసిద్ధయశోవిరాజితుం డును నగు వేదవ్యాసుండు సుతశిష్యసంఘముతో సదస్యుండయి యుండ, మహామునులు ఋత్విజులై యుండు నీయాగంబున నాదిత్యు లలో విష్ణుండునుం బోలె నీ వెల్లరాజులలో విరాజిల్లుచున్నావు. అగ్ని హోత్రుఁడు ప్రదక్షిణంబుగఁ దేజరిల్లుచు మహనీయులైనవిప్రులదివ్య మంత్రములచే నిర్వర్తింపఁబడిన హవ్యములను గొని దేవతల కొసంగి వారిం దృప్తినొందించి నీకు సంపూర్ణమనోరథములను బుణ్యఫలములను నొసగుచు నున్నవాఁడు. ఇంద్రాగ్నియమనైరృతివరుణమరుత్కుబేరే శానులనులోకపాలురచందమున ధర్మమార్గమునఁ బ్రజల నేలుచు న్నవాఁడవు. అని జనమేజయుని, నాతనియజ్ఞమహిమమును, ఋత్విజు లను, సదస్యులను, నగ్నిభట్టారకునిఁ దగినమంగళవాక్యములతోఁ బ్రస్తు తించిన యాస్తీకువ కాసభాసదులైనవా రెల్లరును బ్రీతులైరి. అంత జనమే జయుం డాస్తీకుంజూపి సదస్యులతో నిట్లనియె. ఈమహనీయుండు కొం డిక యయ్యును జ్ఞానవృద్ధుండు. ఈతనివాక్కు రమణీయము. శ్రుతి సొం పైనది. భావము గంభీరము. మూర్తి మనోజ్ఞము. కావున నీతని కిష్టమగు వరము నిచ్చెద ననఁగా, సభాసదు లెల్లరును సంతసిల్లిరి. ఇంతలోన జనమే జయుఁడు ఋత్విజులం జూచి యీయాగ మింకను సంపూర్ణము గాదు. మాకు శత్రువగు తక్షకుండగ్నియందుఁ బడుటకు రాఁడయ్యె. వేగంబున మంత్రమహిమచే వానిని రప్పించి యీయగ్నిం ద్రోయుఁడు. అనఁగా ఋత్విజు లిట్లనిరి. నరేంద్రా! తక్షకుఁ డీలోకముల నెందును లేఁడు. వాఁడు నాకంబున కరిగి యింద్రు మరువుసొచ్చియున్నవాఁడు. యజ్ఞ శాల నిర్మించునాఁడు వాస్తువిద్యాదక్షుం డగు లోహితాక్షుండు పలికిన

మాట సత్య మయ్యెడి నని యూహించెదము. అనఁగా రాజు లోహి తాత్ముని మఱల సభలోనికి రప్పించి యడుగఁగా నతండు తొల్లింటి యట్ల పలికె. అంత భూపాలుండు కుపితుండై హోతతో నిట్లనియె. ఋషివర్యా! ఇంద్రుండు తక్షకుని యథార్థముగ రక్షించువాఁ డయ్యె నేని తక్షకుం డా సహేంద్రుఁడై యగ్నింబడునట్లు మంత్రమును జెప్పు మనఁగా హోత యట్ల కావించె. అంత నింద్రుండు విమానారూఢుండై యాగశాలను సమీపించి యజ్ఞ ముగ్రముగా జరుగుచుండు టను గాంచి భీతుండై తనయుత్తరీయమునఁ జుట్టచుట్టుకొనియుండు తక్షకు సగ్నిగుండమున కుపరిభాగమున విడిచి నిజలోకమునకు వేగ ముగఁ జనెను. భూసురమంత్రప్రభావమునఁ దక్షకుం డగ్నిని సమీపించి తల్లడిల్లుచున్నంత ఋత్విజులు సర్పయాజియగు జనమేజయుం జేరి వానికిఁ దక్షకుం జూపి నీకోరినమేరకుఁ దక్షకుఁ డిదెవచ్చి తల్లడిల్లుచున్నాఁడు. ఆస్తీకున కిష్టమయిన వర మొసంగెద నంటివి. వేగంబ యొసంగుము. అని హెచ్చరింపఁగా రాజు ఆస్తీకుమొగంబై భూసురవర్యా! వర మిచ్చెద. కోరు మనఁగా నస్తీకుండు దానిని దగినసమయముగాఁ దలంచి రాజుం జూచి, ఓ యభిమన్యుపౌత్త్రుఁడా! సత్యసంధుఁడా! అరులమదం బడఁచిన మేటిమొనకాఁడా! పరమకారుణికా! నాకు బంధువులయిన సర్ప ముల కులమునకు మనోవ్యథఁ జేయుచున్నదియు, నుగ్రకర్మమును నగు నీసర్పయాగమును నాకుఁ బ్రియంబుగాను, భూతతృప్తిగాను నుడుగు మనెను. అంత నామాటలు విని యస్తీకునితో జనమేజయుం డిట్లనియె. ఓమునిశ్రేష్ఠా! నీకు వలసినంత వెండి గాని, బంగారము గాని, గోవులఁ గాని, ప్రమదాజనంబులఁ గాని, గ్రామములఁగాని, దాసదాసీజనంబులఁ గాని గోరుము. అన్నియు నిచ్చెద. యాగమును నడువ నిమ్మని పలు తెఱంగులఁ బ్రార్థించి చెప్పినను నాగులయల్లుండు దేని నొల్లక యాగము నెవ్విధంబున నైన నుడుగుటను మాత్ర మపేక్షించుచుండఁగా సదస్యు లంతయు నిట్టిమహనీయుండును, మహాతపస్వియు, సత్పాత్రంబును నగు విప్రునకుఁ గోరినదాని నిచ్చినచోఁ దత్ఫలం బక్షయం బగును. విప్రుకోర్కి వృథసేయదగదు. అని భూనాథునకు బోధించిరి. ఇంతలో

నగ్నియందుఁ బడనున్న తక్షకు నస్తీకుండు చూచి "యోతక్షకా! ఆగు మాగుము. అగ్నిలోఁ బడకు" మని తనతపోబలంబున మఱల్చెను. ఇంతలో జనమేజయుండు సదస్యులతో నాలోచించి వా రనుమతింప నస్తీకుని యభీష్టసిద్ధిఁ జేయు నిమిత్తము సర్పయాగమును జాలించి సర్వ జనుల కానందమును గలిగించె. పిదప ఋత్విజులను సదస్యులను విస్తార మైనదక్షిణలతోఁ బూజించి యాగశాల నిర్మించుసమయమున నా సర్పయాగ మొకవిప్రుని నిమిత్తముగఁ దుదిముట్ట దనిన లోహి తాక్షుఁ డనుసూతసుతుని రావించి వానిచెప్పినభావికార్యఫలితము నిగన్న మైనవిధమున కుచితధనమును నిచ్చి యవభృథస్నాన మాచ రించి యస్తీకునిఁ జూచి, 'మునివర్యా! నీకుఁ దృప్తి యయ్యెం గాదె? నాకావించు నశ్వమేధయాగమునకు నిన్నిప్పుడ సదస్యునిగా నుండ వేఁడెద. విచ్చేయవలయు' నని ప్రార్థించి సన్మాన మొసంగి పంపెను. అప్పు డందలిసభ్యులు, సర్పరాజంబులు తల్లిశాపమునకు బహుకాలం బుగ వెఱచి యేమియుం జేయనేరక యిప్పుడు మృత్యువువాతఁ బడు టకు సంసిద్ధములై యుండినను, వారియల్లుండును, మహాత్ముండును, మహా తపస్వియు, బ్రహ్మతేజోవిరాజమానుండును నగు నీయస్తీకుండు వానిని దక్షవాక్యాత్తు క్షమునఁ గాచె ననీ, మిక్కిలిగా నమ్మహాత్ముని గీర్తించిరి.

అంత నస్తీకుండు నిజగృహంబుఁ జేరి తల్లికిని మామలకును నమస్కరించెను. అంత వాసుకిప్రభృతు లస్తీకునామ మెల్లరును నమ్ముని వర్యుం బరివేష్టించి 'యస్తీకా! నీమహిమంబున మామాపదం దొలం గించితివి. వరము వేడు' మనఁగా వారల కస్తీకుం డిట్లనియె. ఎవ్వఁడేని సాయంప్రాతఃకాలములయం దీయుపాఖ్యానమును జదువునో మఱియు నస్సునసు, నార్తిమంతుని, సునీథుని స్మరించునో యామానవునికి మీరు చెఱుపుఁ జేయకుఁడు. ఇంతేకాక యేపురుషుండైనను జనమేజయు సర్పయాగాంత కాలమున నస్తీకువచనములం దలంచి తొలఁగు మని చెప్పఁగా నేపా మైనను దొలఁగకుండునో దానిశిరస్సు నూఱువ్రక్కలై పగులుఁగాక! యని వరముల వేఁడఁగా నల్లురకు వాని నొసంగి వానిని సంతోషింపఁజేసిరి. ఇవ్విధంబున నస్తీకుండు సర్పకులప్రళయమును నివా

రించి కొన్నాళ్లకుఁ దగినకన్యకను పెండ్లియాడి కొడుకులను మనుమలను గని సుఖముండి యంతమున మోక్షలక్ష్మిని వరించె నని శౌనకునకు సూతసుతుఁడు మఱియు నిట్లనియె. పూర్వము ఓశౌనకా ! నీకులమునందు జనించిన ప్రమతి యను మునివర్యుండు తనపుత్త్రుండగు రురుం డడుగఁ జెప్పినవిధంబున డుండుభవృత్తాంతమును విని యడుగ నీయాఖ్యానంబును నీకుం జెప్పితి. ఈ యస్తీకోపాఖ్యానమును జదివినవారికి సర్పభయము లే దని సూతసూనుండు శౌనకునకుం జెప్పఁగా నమ్మహర్షి పరమానందంబునం దేలియాడె.



అక్కథకుండు శౌనకుఁడు మొదలగు మునీంద్రులకుం జెప్పె. అట్లు జనమేజయుం డుద్యమించిన సర్పయాగము నుపసంహరించి విధిచొప్పున ఋత్విజులకును సదస్యులకును సంపూర్ణదక్షిణలనొసంగి దీనులకును ననాథలకును గోరినధనంబుల నొసంగి తృప్తులం గావించి యనేక పుణ్యకథాశ్రవణకుతూహలకరుం డగుచు నొక్కనాఁ డచ్చోటికి శిష్యసహితుండై విచ్చేసియున్న వేదవ్యాసమునీంద్రు నతిభక్తినర్ఘ్యపాద్యాదివిధులం బూజించి మిక్కిలి వినయముతో నమస్కరించి జనమేజయభూపాలుం డిట్లనియె. వ్యాసభట్టారకా! మాపితామహు లగు పాండుపుత్త్రులకును ధృతరాష్ట్రసుతు లగు దుర్యోధనాదులకును భూమిపాలు విభజి చి మీరును, భీష్మాదికురువృద్ధులును నొసంగి యుండ వా రేల య ట్లన్యోన్యకలహకారులై ఘోరమును గోత్రవినాశకరమును నగు మహారణమును గురుక్షేత్రమునందుఁ జలిపిరి? ఆయుద్ధము నంతయు మీరు కన్నులారఁ జూచి యుంటిరి కాదే? అవృత్తాంతము సవిస్తరముగ నాకు వివరించి చెప్పవలయు నని యడుగుటయు బాదరాయణుండు సమీపవర్తియై కూర్చుండిన తనశిష్యుం డగువైశంపాయనుం జూచి యారాజడిగినప్రశ్నకు నుత్తరమును దనవలనఁ దొల్లి వినియుండినచొప్పునఁ దెలుపున ట్లాజ్ఞ నొసంగెను. అంత నావైశంపాయనుండు గురువైనవేదవ్యాసులకుఁ బ్రణమిల్లి సభలో నున్న విప్రుల యనుమతిం బడసి పాండవులకును ధార్తరాష్ట్రులకును నైన విభేదకారణంబును మొట్టమొదట సంగ్రహముగఁ జెప్పఁదలఁచి యిట్లనియె.

### పాండవధార్తరాష్ట్రుల భేదకారణసంగ్రహము

పాండురాజునకుఁ బిమ్మట నాతనిపుత్త్రు లేవురును హస్తినాపురముఁ జేరి కురువృద్ధరాజులయాదరణమునఁ బెద్దవారై బ్రాహ్మణుల యొద్ద వేదశాస్త్రములను, క్షత్త్రియోచితమైన విలువిద్యలను నేర్చి యందుఁ బ్రావీణ్యమును సంపాదించి నానాటికిఁ మహత్తరయశోవిశాలురైరి. అట్టి మహాబలపరాక్రమశాలు లగువారికిఁ గ్రమముగాఁ గలుగుచుండిన యశస్సునకు నోర్వలేక దుర్యోధనుం డసూయాపరుండై యత్యల్పం బైనకులింగపక్షి సింహముఖమాంసమును గ్రహింప సాహసించువిధమున దురా లగుకర్ణశకునులతో నాలోచించి వారికి ననేక విధము లగు

చెఱుపులను జేయుచుండె. పాండవులలో మిక్కిలి బలశాలియు సాహస కార్యములను జేయువాఁడు నగు భీమునెడల దుర్యోధనుండు ప్రప్రథమున మిక్కిలి యసూయఁజూపి వానిబలశౌర్యములకు సహింపనివాఁడై వానిం జంప యత్నించి వాఁడు తిను నన్నమున విషముఁ బెట్టెను. ఆతండు మహానీయుండు. కావున నావిషాన్నమును దనగాత్రమున నెట్లో జీర్ణింపఁజేసెను. పదంపడి యొక్కనాఁడు గంగానదియందుఁ బ్రమాణకోటిస్థలమున శరీరవ్యాయామమునకై యీఁది పరిశ్రమ గావించి బడలి యాతీరంబునఁ బరుండి నిదురించుచున్న భీమసేనుశరీరము నంతయు లావైన తీఁగెలచేఁ గట్టి వానిని గంగాప్రవాహమున దుర్యోధనుండు ద్రోయించె. అంత భీముండు మేల్కాంచి తనదేహబలంబునుఁ జూపి యొక్క నీల్గు నీల్గఁగా భవబంధములను ద్రెంపు యోగిచాడ్పునఁ దన్ను బంధించియుండు తీఁగె లన్నియుఁ దెగెను. అంత నాతండు ప్రవాహమున నీఁదిగట్టు చేరెను. ఇంతియకాక పిదప నొకనాఁడు వాని సర్వాంగములను వాఁడు నిదురించుచుండఁ గృష్ణసర్పములచేఁ గఱిపించెను. ఆతండు దివ్యమూర్తిగాన నానాగులవిష మాతని నేమియుఁ జేయదయ్యెను. ఇవ్విధంబున భీమసేనుంజంపుటకుఁ బన్నిన నానావిధోపాయములెల్ల విఫలములు కాఁగా దుర్యోధనుండు మరల శకుని కర్ణ దుశ్శాసనులతో నాలోచించి తండ్రి యగు ధృతరాష్ట్రునుమతంబున వారణావతంబున లక్కయిల్లు గట్టించి వారిని గుంతీసమేతముగ నాయింట వసింప నియమించి యొక్కనాఁడు వారెల్ల రాయింట నుండఁగా నాఁటి రాత్రి దానికి నిప్పంటించె. అంత వీనిదురుద్యోగమును బూర్వమే తెలిసిన విదురుండు పాండవులకు నెల్లప్పుడు హితుం డగుటఁ జేసి యీయిండ్లను గాల్చుటకు నియమింపఁబడిన పురోచనుం డనువాఁడు వానికి నిప్పు నంటించుటకుఁ బూర్వమే యావృత్తాంతంబును బాండవులకుఁ జెప్పి వా రాయిల్లువెడలిపోవుట కుపాయంబుగా నాయిల్లుమొదలుకొని సమీపమున నున్న యరణ్యమువఱకుఁ బూర్వమే సొరంగము నొకదానిని నొక్కఖనికునిచే విదురుండు త్రవ్వించియుండ దానిమూలమునఁ బాండవులేవురును దల్లితో నగ్నిజ్వాలలం బడక చావును దప్పించుకొని పురోచనుఁ డనువాఁ డాయింటియందుఁబరుండి యుండఁ నాలక్కయిండ్లకుఁ

దామే యగ్ని యిడి యంద ఱాయిండ్లను వదలి సొరంగపుమార్గ మున వెలుపట నున్నవనముం జేరిరి. ఆవన మొక్కరక్కసున కిక్కయై యుండె. వాఁడు హిడింబనామధేయుండు. అప్పుడు భీమునకు వానితో యుద్ధము బాహాబాహిగా జరిగెను. ఆఘోరమైన పెనఁకువలో హిడిం బుండు భీముచేఁ జచ్చెను. అంత వాని చెలియలు హిడింబ యనుదానికి భీమునియందుఁ దగులము కుదురఁగా దానిని భీముఁడు పెండ్లియాడెను. అంత వారియిరువుర సమాగమమున మహాబలుండును మాయావి యును నగు ఘటోత్కచుం డనుకుమారుండు పుట్టె. పిదపఁ బాండవు లేవురును గుంతితో నేకచక్రపురంబున బ్రాహ్మణవేషములతో బ్రహ్మ చారులుఁగ గొన్నినాళ్లుండిరి. అంత భీముం డచ్చోట బకాసురుం జంపె. అట్లు బకాసురుం జంపి భీముం డేకచక్రపురములోనివారికి భయంబుం బాపె. పిదప ద్రుపదుపట్టణముస బాంచాలికి స్వయంవరోత్సవము జరు గు నని విప్రులెల్ల వేడుకఁ జూచుటకుఁ బోవుచుండ బ్రాహ్మణవేషమున నున్న పాండవులును వారిసాహాయ్యమున నా ద్రుపదునిపురముఁ బ్రవేశించి యచ్చోట సకలరాజులు చూచుచుండ నర్జునుండు మత్స్యయంత్రము ను దెగనేసి ద్రౌపదిని గురువచనమున వారైదుగురును బెండ్లాడి యచ్చోట సంవత్సరకాలముం గడపిరి. అంత ధృతరాష్ట్రుండు పాండ వులవృత్తాంతంబును విని భీష్మాదికురువృద్ధులతో నాలోచించ వారల ద్రుపదుపురంబుననుండి రప్పించి వారికర్ధరాజ్యము నిచ్చి ఇంద్రప్రస్థ పురమున నుండ నియమించిన, వారందఱును నచ్చోటనుండి రాజ్యము నేలుచుండిరి. అంత వా రచ్చటఁ గొన్నినాళ్లు సుఖులై యుండ వారిలో నర్జునుండు తీర్థయాత్ర చేయవలసినది యవశ్యకమై యేర్పడఁగా నాతండు ప్రయాణమై య నేకతీర్థములను సేవించుచుఁ గొన్నినాళ్లకు ద్వారా వతి కేతెంచి శ్రీకృష్ణునిచెలియలు సుభద్రం బెండ్లాడెను. ఇట్లు శ్రీ కృష్ణుఁడును నర్జునుండును సఖులును సంబంధులును నై వెలయుచుండ నచ్చోటికి సమీపమున నున్న నుపేంద్రోద్యానవన మగు ఖాండవమును నగ్ని గాల్చుటకు సహాయ మర్జునుండు చేసెను. ఆవనమును దుదముట్ట నగ్ని నిర్మూలించి భస్మరాశి గావించెను. అంత నగ్నిదేవుం డర్జును నెడ సంతోషించి యాతనికి గాండీవ మను దివ్యధనుస్సును, నక్షయతూణీ

రంబులను గపిధ్వజరథమును బారితోషికంబుగా నొసంగెను. ఇంతే కాక ఖాండవమును గాల్చునప్పు డావనములోఁ గాపురమున్న మయదానవుని రక్షించుటం జేసి యామహానీయుండు దివ్యసభ నొక్కదాని నతిరమణీయంబైనదాని, దుర్యోధనాదిశత్రువులకు మఱింత నసూయను బుట్టించుదాని నిర్మించి ధర్మజునకు సమర్పించెను. అంత శ్రీకృష్ణుండు భీమునిచేత జరాసంధునిఁ జంపించి, వారు దిగ్విజయంబు సేయుటకుఁ దోడ్పడఁగా నంత ధర్మరాజు సార్వభౌముండై రాజసూయమహాయజ్ఞంబు గావించె. ఇవి మొదలుగాఁ గలపాండవులగుణసంపదలు సూచి సహింప నోపక దుర్యోధనుండు శకునికైతవంబున మాయాద్యూతంబున ధర్మరాజుం బరాజితుం జేసి పండ్రెండేండ్లు వనవాసంబును నొక్కయేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబును గాఁ బ్రతిజ్ఞ నేసి భూమి వెలువరించినం జని పాండవులు వనవాసంబున నుండ రాజశ్రేష్ఠుండగునర్జునుం డొకపుణ్యపురుషునియుపదేశంబున మహాతపంబు నొనర్చి భుజంగభూషణునిఁ బ్రసన్నుఁ గావించికొని యాతనియొద్ద నుండు మహాపాశుపతాస్త్రమును, నింక లోకపాలుర నెల్ల మెప్పించి వారిమూలమున దివ్యాస్త్రములను, ప్రయోగోపసంహారములతోఁ బడసెను. ఇవ్విధముగ వారు సత్యపరులు గానఁ బండ్రెండేండ్లు వనవాసమును నొక్కయేఁడు జనపదంబున నజ్ఞాతవాసమును జలిపివచ్చి తమరాజ్యముల నిమ్మనఁగా దుర్యోధనుం డిచ్చుట కిష్టపడనివాఁడయ్యెను. వానిలోభమువలన నతి దారుణంబుగ నప్పుడు కురుక్షేత్రమున భారతమహాయుద్ధము ప్రవర్తిల్లె. ఇది పాండవకౌరవులభేదమూలము. అంత నాయాజియందు సగర్వశత్రువులను నాశనంబు గావించి రాజ్యమెల్ల సాధించి ధర్మరాజు ధర్మమునఁ బ్రజాపాలనంబుఁ జేసి కొంతకాలమునకుఁ బిమ్మటదమ్ములును ద్రౌపదియుఁ దనవెంట రాఁగా మహాప్రస్థానం బాచరించి వారితోఁ బరమగతిం బ్రాపించెను. అని వైశంపాయనుండు చెప్పఁగా జనమేజయుం డమ్మునికిట్లనియె.

మునీంద్రా! భారతార్థమును సంగ్రహముగఁ జెప్పితివి. నాకు దానం దనివి గలుగదు. సవిస్తరంబుగ వినఁగోరుచున్నాను. పెద్దలపుణ్యకథలను వినుటకు మన స్సువ్విళ్లూరుచున్నది. పాండవులు ధర్మాత్ములు గదా? అట్టివారు చంపఁగూడనివారిని జంపియు, నెవ్విధంబున నందరచే

నుతింపఁబడిరి ? వా రాబాల్యముగఁ బరాక్రమవంతులే యయ్యును నాటంగోలె దుర్యోధనాదులదురుద్యోగంబుల నెట్లోర్చిరి? భీమసేనుం డందఱిలో నపరాధమును సుంత యేని సహింపనివాఁ డని వింటిమి. అట్టివాఁడును వారు చేయుచుండిన యపరాధముల నెట్లు సైఁచెను? ద్రౌపది పరమపవిత్రాంగన యని తెలియుచున్నది. ఆపుణ్యాంగనను దుర్యోధనుండు సామాన్యస్త్రీగఁ దలంచి యెన్నియో పాట్లఁ బఱచినను నా దేవి వానిని దనమహిమచే నేల శిక్షింప దయ్యె? ధర్మమును బరిపాలించునిమిత్తము ధర్మరాజు జూదమున నోడి యరణ్యవాసమునకుఁ బోవుచుండఁగా లోకముల జయింప సామర్థ్యమును, బలశౌర్యములును గల భీమార్జుననకులసహదేవులును ధర్మపుత్త్రుని వెంబడించి యెటు లరిగిరి? అతిసుకుమారుఁడును, సార్వభౌమపదవిని ననుభవించినవాఁడు నైన ధర్మరాజు వనవాసాయాసము నెట్లు సైఁచెను ? శ్రీకృష్ణుండనకు సారథిగఁ గైకొని యర్జునుండు యుద్ధసమయమునఁ బదునొకం డక్షౌహిణులశత్రుసైన్యము నెట్లు దునుమాడెను? ఇవి యే కాక! యింకను నావారెల్ల నాకాలంబున నే మేమి యద్భుతంబుల నొనర్చిరో, యేయే యాపదలఁ బాల్పడిరో, వాని నెట్లు దాఁటుకొనిరో వాని నెల్ల వివరింపు మని యడుగఁగా వైశంపాయనుండు జనమేజయభూకాంతున కిట్లనియె.

## భారతమహిమ

భరతవంశమునఁ బుట్టినవారిచరిత్రమును వివరించుటచే నీయితిహాసము మహాభారత మనఁబరఁగె. ఇమ్మహాభారతమును సర్వలోకపూజితుండును నమితతేజోవంతుండును సత్యపరాయత్తుండును నైన కృష్ణద్వైపాయనమునినప్పుడు లక్షశ్లోకములు గల గ్రంథముగా విరచించెను. అట్టిగ్రంథములలోని యితిహాసములను నీకు వినిపించుటకుఁ బూర్వమా గ్రంథకర్త యగు వేదవ్యాసునకు మహావినయభక్తులతో నమ్రుఁడనై నమస్కరించెదను. మహారాజ నాగ్రంథరాజము ధర్మార్థకామమోక్షము లను నాల్గువిధము లగు పురుషార్థములకు ముఖ్యసాధనము. ఆయితిహాసమును వినువారు లిష్టార్థసిద్ధులను బడయుదురు. మఱియు రాజులు విన్నచో భూరిభూరాజ్యసంపదఁ బడయుదురు. నిత్యాభ్య

దయములఁ జెందుదురు. మఱియు నా యితిహాసమును వినినవారు తాము బహుజన్మములనుండి కావించిన పాపములను నశింపఁజేసి కొందురు. ఆగ్రంథరాజము మహాపరాక్రమశాలురును, ధైర్యవంతులును, సత్యవాక్కులును, కీర్తివంతులును, కృతజ్ఞులును, సత్తములును, ధర్మాత్ములును, శరణాగతత్రాణ పరాయణులును నగు భారతవీరుల సద్గుణానుకీర్తనములు గల దగుటచే నట్టి యుత్తమచరిత్రను విను వారు దీర్ఘాయుష్మంతు లగుదురు. మహాసభలలో నాగ్రంథము పఠనీయము. అయ్యది వేదవేదాంతరహస్యములను దెల్పును. ఈగ్రంథమునఁ జెప్పఁబడినవి మఱియెందును లేవు. మహోదధియుఁ బర్వతరాజములును నానామణుల కాకరంబైన య ట్లీమహాభారతేతిహాసము సకలకథారత్నములకు నిధియై వాసికెక్కెను. కావుననే భారతగ్రంథము పంచమవేదము నాఁబరఁగె. రాజ్యము గోరి దీనిం బఠించు క్షత్రియులు రాజ్యమును బడసెద రని మున్నె చెప్పితి. సంతానార్థులై చదువువారు సత్సంతతిని బొందుదురు. దీనింజదువుటచే రోగార్తులు సర్వరోగములను, భ్రూణహత్యాదిమహాపాతకముల నొనర్చినవారు తమసర్వపాపములను నశింపఁజేసికొనఁగలరు. నీ సర్వమనోరథములును దీనిం జదువుటవలనఁ గలుగును. వానకాల మగు నాల్గుమాసములలో నీగ్రంథమును జదివినఁ గాని వినినఁగాని సర్వపాపములును నశించును. దైవభక్తిపరాయణులు శ్రద్ధగలవారు, దాతలు, సత్యవాక్కులు నగువారి కీభారతాఖ్యానమును వినిపించినచో మహాఫలములను బొందుదురు. ఈగ్రంథమును నామూలాగ్రముగ వ్రాసి దాన మొసఁగినవారిని సత్ఫలములు చెందును. ఇందు శ్రీమన్నారాయణదివ్యావతార మగు శ్రీకృష్ణమూర్తియొక్కయు సత్పురుషులగు పాండవులయొక్కయు గుణమాహాత్మ్యాదుల జ్యోత్స్న జనులకుఁజిత్తానందం బొనరించు. ఇట్టిమహాభారతాఖ్యానమును వేదవ్యాసమహర్షివర్యుండు హిమవత్పర్వతమహాగుహాలయం దొక్కచోఁ గూర్చుండి మూఁడుసంవత్సరములలోఁ జెప్పి ముగించెను. కావున నిట్టిమహిమగల గ్రంథరాజమునకుఁ గర్త యగు వేదవ్యాసమునీంద్రుని యవతారము సవిస్తరంబుగా మున్ను చెప్పెద. నియతమతివై నిశ్చలుండవై వినుము. అని వైశంపాయనముని యతనితో ని ట్లనియె.

### ఉపరిచరవసుమహారాజువృత్తాంతము

పూర్వకాలమున మహేంద్రతుల్యుండైన వసువనురాజు చేదిదేశ
మును శిష్టులు మెచ్చునట్లు పరిపాలించుచు విలాసమున వేటనెపంబున
వనమున కరిగి యందొక్క పుణ్యాశ్రమమునందుఁ జేరి వైరాగ్యమును
జెంది యస్త్రములను విడిచి మహానియమముతోఁ దపం బాచరించుచుం
డెను. అంత నతనిపాలికి దేవతాగణంబులతో మహేంద్రుఁడు వచ్చి యాత
నితో నిట్టులనియె. రాజా! నీవు సజ్జనుండవు. ధర్మమున ధరణీ ప్రజల నేలు
వాఁడవు; నీధర్మపరిపాలనంబున నీప్రజ లసత్యము నాడరు. చేదిదేశ మెల్ల
ప్పుడును కాలవర్షములు గురియుటం జేసి ధనధాన్యసమృద్ధంబై యుండును.
పచ్చికబయళ్ల గోవులకు సదా సంపూర్ణగ్రాసంబు గలిగియుండును. ధర్మ
పరు లగు నీప్రజ లెద్దులను దున్నుటకు నాగళ్లకుఁ గట్టరు. సర్వవర్ణ
ములవారును లోభబుద్ధిచేఁ దండ్రితోఁ గలహించి విభాగ మొనర్చుకొ
నరు. దీనులను, అనాథలను బోషింతురు. గురువుల నారాధింతురు. నీ
వర్ణధర్మపరిపాలనమునకును దపంబునకును మెచ్చితి. తొల్లింటివిధమునఁ
బ్రజాపాలనమును జేయుము. ఈతపంబు నీకు వలదు. చాలింపుము.
నీ వనేకదినములు కర్తవై బ్రజల నేలి పదంపడి పుణ్యలోకములఁ జేరి
యచటిశాశ్వతము లగు సుఖములఁ బడయవచ్చును. నీవు నాతోడం
జెలిమి సేయుము. నాయొద్దకు నాకంబున కీశరీరముతో వచ్చుచుఁ బోవు
చుండుము. మహీరాజ్యము నేలఁ బూనుకొనుము. అని చెప్పి వానికి
దేవత్వమును, గనకరత్నమయంబైన దివ్యవిమానమును, దేనిని గంఠం
బునఁ దాల్చియున్నచో నాయుధముల దెబ్బ తగులదో యట్టితామరపు
వ్వులతోఁ గట్టఁబడిన యింద్రమాల యను కమలమాలికను, దుష్టుల
నిగ్రహించుటకును శిష్టులఁ బరిపాలించుటకును సామర్థ్యంబు గల వెదురు
కోల నిచ్చి యింద్రుండు దేవలోకంబున కేగెను. అంత నావసురా
జవ్విధంబున నావిమానము నెక్కి సకలలోకముల సంచరించుచు నుపరి
లోకంబుల కేగుచు వచ్చుచుండుటం జేసి యుపరిచరవసు వనుపేరితోఁ
బిలువఁబడుచు, నింద్రుఁ డిచ్చిన వైజయంతి యను కమలమాలికను గంఠం
బునఁ దాల్చి దానిని గుర్తుగా వేణుయష్టికిమహావిభవంబున నేఁటేఁట
నింద్రోత్సవంబు సేయుచుఁ బరమేశ్వరునకును నింద్రాది దేవతలకును

ప్రీతిగాఁ జరించుచుండె. అదిమొదలు రాజులెల్లరుం బ్రతిసంవత్సర మింద్రోత్సవము సేయుచుండుదురు. ఇంద్రోత్సవమును జేయు రాజులాయుష్మంతులై యుందురు. వారికి సంతతి వృద్ధినొందును. వారిప్రజ లభివృద్ధులై యుందురు. అట్టియింద్రోత్సవమున మిగుల బ్రీతుండయిన యింద్రువరమున నుపరిచరుండు బృహద్రథ, మణివాహన, సౌబల, యదు, మావేల్ల రాజన్యులను పుత్రుల నేవురంబడసి వారిని నానాదేశాధీశులంజేసిన, వారు వేర్వేఱువంశములకు మూలపురుషులైరి. ఇవ్విధంబున నుపరిచరవసుమహారాజు కొడుకులను వంశకరులగువారిని బడసి రాజర్షియై రాజ్యంబు పరమానందంబునఁ జేయుచుండె. ఇట్లుండ నతని పట్టణసమీపమునఁ బాఱుచున్న శుక్తిమతి యనునదిని గోలాహలం బను పర్వతము చైతన్యముగలిగి కామించి యడ్డగింపఁగా నయ్యుపరిచరవసు గాజప్పర్వతంబును దనపాదంబునఁ జిమ్మెను. అంతలో శుక్తిమతికి గోలాహలునిసమాగమంబున వసుపదుఁ డనుకుమారుండును, గిరిక యను కూఁతురును బుట్టిరి. శుక్తిమతి తన్నుఁ బర్వతము మడ్డగింపఁగా దానినిఁ గాలం జిమ్మి తనపాయుదలకు సుఖము గల్గించిన వసురాజునకుఁ దన కొడుకును గూఁతును గానుకగా నొసంగెను. అంత నుపరిచరవసు మహారాజు గిరికను దనకుఁ బత్నిఁగను వసుపదుని సేనానాయకునిఁగను నియమించి వర్తించుచుండె. అంతఁ గొన్నినాళ్లకు గిరిక ఋతుమతి యైన నతని పితృదేవత లాలావణ్యవతికి మృగమాంసమును దెచ్చిపెట్టు మనిరి. రాజును వారిమాటల నాదరించి మృగమాంసార్థము వనమున కేగెను. అది వసంతర్తుకాలమగుటచే వనమునందలివృక్షములు సొంపుగఁ బూచియుండె. ఆకుసుమితఫలితచంపకరసాలాదితరుసమూహములం గని వసురాజు మన్మథునిపంచబాణములచేఁ గొట్టఁబడి ఋతుమతియైయుండు గిరికను దలంపఁగా వీర్యంబు స్ఖలిత మయ్యెను. అప్పు డారాజు నిజవీర్యం బమోఘం బని దాని న్యర్థపుచ్ఛక యొకపర్ణంబునం దిడి యభిమంత్రించి దాని నొకడేగమెడలోఁ గట్టి గిరికకుఁ గొనిపోయి యిమ్మనెను. అట్లాడేగ పత్రనిక్షిప్తవసువీర్యంబును దనకంఠంబునఁ బదిలముగాఁ గొని వేగంబ పఱచుచుఁ బోవుచుండ మఱియొకడేగ దాని మెడయం దామిష మున్నదనితలంచి దానిం గొట్టి యామిషంబులఁ గొని పోవరాఁగా రెంటికిని ఘోరంబైన పోరానఁగూడెను. అవి రెండు నట్లు

ఘోరంబుగఁ బోరాడుచుండఁ బత్రనిక్షిప్తవీర్యంబు చెదరి నేలఁ బడెను. ఆబిందువులలో రెండు క్రిందఁ బాఱుచున్న యమునానదీప్రవాహమున నీఁదుచుఁ బోవుచున్న యొకమీనంబు సమీపమునఁ బడఁగా నమ్మీనంబు వాని మ్రింగెను. తొల్లి బ్రహ్మచే శపింపఁబడిన యద్రిక యను నప్సరస యామీనాకారమును దాల్చియుండె. మీనాకారంబున నున్న యద్రిక యారేతోబిందువులం ద్రాగుటచే నయ్యది గర్భము ధరించియుండె. ఆ మీనమునకు మాసములు నిండి గర్భము వెలువడుదినములు కాఁగా నయ్యది జాలరులవలనం బట్టికొనఁబడెను. అప్పు డాజాలరులు గురువై యుండు నామీనముం బట్టి ఛేదింపఁగా నందొక్కపురుషశిశువును, స్త్రీశిశువును నుండిరి. మనుష్యుల నామీన మెప్పుడు ప్రసవించునో యయ్యది యద్రికకు శాపావసాన మని బ్రహ్మ తెలిపియుండె. కావున నామత్స్యము మీనాకారమును వదలి దివ్యాప్సరసరూపమును దాల్చి నాకలోకమున కేగెను. జాలరు లాసమాచారము నంతను వసురాజునకుఁ జెప్పిరి. అంత వసురా జాపురుషుని, స్త్రీని పెంచి పురుషుని మత్స్యదేశాధిపతిం గాఁ జేయ నాతండు ధర్మమార్గము నవలంబించి యాదేశమును బాలించుచుండెను. కావున నాతనికి మత్స్యరా జనునామము సుప్రసిద్ధం బయ్యెను. కన్యకను జాలరుల కధిపతి యగు దాశరాజున కియ్యఁగా నతం డాకన్యకను తాను గన్నకూఁతుంగాఁ జూచుచు సత్యవతి యనునామం బిడి ప్రీతితోఁ బెంచుచుండఁ బెరుఁగుచు నొక్కనాఁడు తండ్రి యనుమతిం గొని యమునానదియం దోడ నడుపుచుండె.

## శ్రీవేదవ్యాసమహర్షి యవతారము

ఆసమయమునందు మదమాత్సర్యంబులు లేనివాఁడును, ముల్లోకములయందును గీర్తి వెలసినవాఁడును నగువసిష్ఠపౌత్రుఁడు పరాశరమునీంద్రుండు తీర్థయాత్రాతత్పరుండై పోవువాఁ డయ్యమునానదిం దాఁటుట కాతీరంబున కేగి యచ్చోట నోడ నడుపుచుండు వనిత మత్స్యగంధి నేకవస్త్ర యగుదానిం జూచి యామునివరుండు తనదివ్యజ్ఞానంబున దాని వసురాజుపుత్త్రింగా నెఱింగి మదనపరవశుండై దానిం గవయ నపేక్షింప నప్పు డాసత్యవతి యమ్మునికి ట్లనియె. మునివర్యా! ఇందుఁ బలువు

రున్నవారు. వీరియెదుట సంగమం బుచితంబు కాదు. మఱియును, నేను కన్యను. నాకుఁ గన్యాత్వంబు దూషితంబు గాకుండ నీవనుగ్రహింపవలయును. కాకున్న నన్ను నాతలిదండ్రులును బంధువులును దూషింతురు. కావున నాయెడ ననుగ్రహించి నన్ను విడువుము. నాయింటి కేఁగెదను. అనఁగా శక్తిపుత్త్రుండు తన తపోమహిమంబున నచ్చోట నిరులు గావించి "యిందువలన నీకుఁ గన్యాత్వము చెడకుండును" అని చెప్పి, వెంటనే యాసత్యవతిని దాని కిష్టమైనవరమును వేడ మనఁగా నావనిత యిట్లనియె. నేను సదా జాలరులం గూడియుండుదును. నా మేను మీనొవ్వెల వచ్చును. కావున నన్ను సుగంధిగఁ జేయు మనఁగా నమ్మహర్షి యట్ల ప్రసాదించె. అంత నాసత్యవతి శరీరసుగంధము యోజనమాత్ర దూరము వ్యాపించుటంజేసి యోజనగంధి యనియు, గంధవతి యనియు నామంబులం బేర్కొనఁబడెను. పిదప నవ్వనిత యమ్మునిప్రసాదంబున దివ్యాంబరాభరణయై యమునానదీద్వీపంబున నోడ సేర్చి యామునియెల్లవారును జూడకుండున ట్లాప్రదేశంబు తన తపోమహిమచే నిరులు గావింపఁగా నమ్మునితో సంగమించె. పదంపడి సత్యవతి యమ్మునియనుగ్రహంబున సద్యోగర్భంబుఁ దాల్చి యాద్వీపమునందే సూర్యతేజస్సుతో తుల్యమగు తేజస్సుగలవాఁడును, వేదమయుఁడును, నఖిలమునీంద్రులకారాధ్యుండును, బుట్టినంతనే దివ్యజ్ఞానముగలవాఁడును నగుపుత్త్రునిఁ గనెను. ఆయమునాద్వీపంబున నమేయుఁ డగుకృష్ణుఁడు పుట్టి మహిలోఁ గృష్ణద్వైపాయనుఁ డని ప్రసిద్ధి కెక్కి, తపం బాచరింపఁ బోవువాఁడై, కృష్ణాజినపరిధానకపిలజటామండలదండకమండలుమండితుండై, తల్లిముందఱ నిలిచి చేతులు మోడ్చి "యవ్వా! నీకుఁ బనిగలయప్పుడు నన్నుం దలంపుము. ఆక్షణంబ నీకుఁ బ్రత్యక్షమై నీకోరినపనిఁ జేయువాఁడ. లోకహితార్థంబు తపం బాచరింపఁ జనుచున్నవాఁడ. నాకనుజ్ఞ యిమ్ము" అని సకలలోకపావనుండును, జన్మాంతరార్జితపుణ్యరాశియుఁ బరమేష్ఠియంశసంభూతుండును నగునతఁడు తపోనిష్ఠుండై త్రేతాదియుగంబులయందు ధర్మమునకుఁ గ్రమంబుగ నొక్కొక్కపాదంబు నశించుచుండుటయు, మానవు లల్పాయుష్కు లగుటయు నెఱింగి యపారంబులై యఖండంబులై యున్న వేదంబుల లోకానుగ్రహార్థంబు విభజించి వేదవ్యాసుఁ డనుపేరఁ బ్రసిద్ధుఁడై

పంచమవేదమై పరగు నిమ్మహాభారతసంహితను రచించి శిష్యులచే ముల్లోకంబులయందును బ్రచారంబుఁ గలిగించె.

## భీష్మాదివీరులు దేవదానవాదులయంశంబులఁ బుట్టుట

మఱియు దేవదైత్యదానవ ముని యక్ష పక్షి గంధర్వాదులయంశంబులయందు భీష్మాదివీరులు భారతయుద్ధంబు సేయ ననేకులు పుట్టిరి. వారల నెల్ల వివరింప ననేక సంవత్సరము లైనను జాల వనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. మునివరా! దేవరాక్షసముఖ్యుల యంశములయందు నిమ్మహిం బుట్టిన సకలరాజసమూహమును భారతరణరంగమున నేమికారణమున లయ మొందవలయును? అని యడుగఁగా జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

మహీపాలాగ్రణీ! వినుము. ఇది దేవరహస్యము. తొల్లి పరశురాముని తీవ్రమైనకోపాగ్నిచే మహిం గలరాజు లెల్ల నశించిరి. ఆతండు క్షత్రియుల నెల్ల నిరువదియొక్కమాఱు వెతకివెతకి వధించె. అంత శాంతించి మహేంద్రపర్వతప్రాంతంబునకుం బోయి తపంబాచరింపందొడంగె. దానంజేసి క్షత్రియాంగనలయుం దపత్యోత్పాదనంబునకుఁ బురుషులు లేకున్నవారు తమక్షేత్రంబులయందు సంతానములను బుట్టించుటకు విప్రులఁ గోరిరి. అంత భూసురులు వారల ననుగ్రహించి వారియందు సత్యక్షమాసహితులును, నిరంతరదానజపతపోహోమతత్పరులునునగు క్షత్రియులను బుట్టించినవారలగుటం జేసి యాసంతానంబుచేత భూమియందుఁ దపోహోమయజ్ఞక్రియలు విశేషంబుగా వర్తిల్లుచుండె. దేవతలు యజ్ఞకర్మములచేఁ బరితుష్టాత్ములై భూలోకమున బహుకాలము సకాలవర్షములను గురిపించిరి. అంత నోషధు లెల్ల విస్తారముగ ఫలించెను. మఱియును భూలోకప్రజలు ధర్మపరాయణులైరి. భూసురులు వేదవేదాంగములను లెస్సఁగాఁ జదువుచుండి వేదవిక్రయమును జేయక శూద్రసమీపమున వేదోచ్చారణమును నెంతమాత్రమును జేయక ధర్మమును బాగుగ నడుపుచుండిరి. మఱియును బాల్యమునందు స్త్రీసంగమాదుల నొనర్పక, సకాలమున దారపరిగ్రహం బొనర్చి దానికి ఋతుకాల మగుడు నక్కాలముననే సంగమించి గర్భాధానము నొనర్చుచుండిరి.

దానంజేసి భూసురులలో మహిమగలవారును, దపోనిరతులును, నిగ్రహానుగ్రహశక్తియుతులును బుట్టుచుండిరి. వైశ్యులు బలహీనములైన గోవులకుఁ బనులు పెట్టక పోషించుచు, బలిష్ఠములగు బలీవర్దముల చేతనే కృషిఁజేయించుచుండిరి. క్రయవిక్రయములయందుఁ గపటములేక న్యాయవర్తనులై యుండిరి. శూద్రు లుత్తమవర్ణములవారినిఁ బూజించుచుండిరి. ఈవిధమున జను లందఱును ధర్మప్రవర్తనులై వర్తించుచుండ జనులయాయుష్యము వృద్ధినొందెను. వ్యాధులు చేరకుండె. బాలమరణములు లేవు. ప్రజావృద్ధి యయ్యెను. సస్యములు సమృద్ధములయియుండెను. ఇట్లుండ దేవతలచే దైత్యులును దానవులును నోడింపఁబడి యైశ్వర్యములను గోల్పోయి సత్కర్మముల నాచరించి దేవత్వమును బడయఁగోరి రాజవంశములలోను నానాభూత సంతతిలోను బుట్టి ధర్మాత్ములగువారిని హింసింప నారంభించిరి. అట్టి కష్టాత్ముల భరింపలేక సకల దేవగణ పరివేష్టితుండై యున్న పరమేష్ఠి పాలికిం జని యాదుష్టులఁ దాను మోయఁజాల ననియు, భూభార మెక్కుడయ్యెన ననియు భూదేవి మొఱపెట్టుకొనఁగా నప్పుడు బ్రహ్మదేవుం డద్దేవి వచ్చినకార్యమును వేగంబ నెఱవేర్తు నని మాట చెప్పిపంపె. పదంపడి పరమేష్ఠి తన్ను పరివేష్టించియున్న దేవగంధర్వాదులతో నిట్లనియె. "మీరందఱును లోకహితార్థము భూభారము నుడుపువారై భూలోకమునఁ బ్రజలలో మీమీయంశంబులఁ బుట్టవలయును" అని చెప్పఁగా వారంద ఱందుల కంగీకరించి యెల్లవారును శ్రీమన్నారాయణుం డుండు వైకుంఠంబునకుఁ బోయి యావృత్తాంతం బంతయును సవిస్తరంబుగా విన్నవించిరి. పదంపడి భగవంతుని నైతము భూభారము నివారించునిమిత్తము తోడ్పడుటకు భూలోకమున నవతరింపు మని ప్రార్థించిరి. శ్రీమన్నారాయణుండును వారిమాటల నాదరించి తానును భూలోకమున నవతార మెత్తెద ననఁగా; నట్లందఱు దేవతలును వారివారి యంశములతో భూలోకమున మానవులై పుట్టి భూదేవిభారమును దీర్చుటకు దానవాంశజాతుల నందఱను వధించి రని చెప్పఁగా జనమేజయుండు వైశంపాయనుని సకలప్రాణుల సృష్టి తెఱంగు విన్నవింపు మని వేడఁగా నమ్ముని యారాజున కిట్లనియె.

## దేవదానవాదుల యుత్పత్తిక్రమము

రాజేంద్రా! వినుము. పూర్వము జగదుత్పత్తికి హేతుభూతుం డైన బ్రహ్మకు మానసపుత్త్రు లార్గురు పుట్టిరి. వారు మరీచియు, నంగిరసుండును, నత్త్రియును, బులస్త్యుండును, బులహుండును, గ్రతువును నను వారు. అందు మరీచికిఁ గశ్యపప్రజాపతి జనించె. కశ్యపునివలన సకలభూతరాశియు నుత్పన్నమయ్యె. ఎట్లనిన, బ్రహ్మదక్షిణాంగుష్ఠంబున దక్షుండును వామాంగుష్ఠంబున ధరణి యను స్త్రీయునుం బుట్టిన నయ్యిరువురకును వేవురు కుమారులు పుట్టిరి. వారు నారదు నను గ్రహంబున దివ్యజ్ఞాన తేజోవిరాజితులై యూర్ధ్వరేతస్కులై ముక్తులైరి. కావున వారు వంశకరులు గాకుండిరి. పదంపడి యేఁబండ్రు కూఁతులు దక్షునకుఁ బుట్టిన వారల నెల్లఁ దానపుత్త్రుండు గావున వారలఁ *బుత్త్రీకరణంబుఁ జేసి, బ్రహ్మకు దక్షిణస్తనంబునఁ బుట్టిన ధర్ముఁ డను మనువునకుఁ గీర్తి, లక్ష్మీ, ధృతి, మేధా, పుష్టి, శ్రద్ధా, క్రియా, బుద్ధి, లజ్జా, మతు లనుపదుగురను, జంద్రున కశ్విన్యాదులగు నిరువదియేడుగురను, గశ్యపునకు నదితి, దితి, దను, కాలా, దనాయు, సింహికా, క్రోధా, ప్రాధా, విశ్వా, వినతా, కపిలా, ముని, కద్రువ లనువారలను పదుమువ్గురను నిచ్చె. ఆకశ్యపునకు వారలలో నదితి యను దానికి ధాతృ, మిత్ర, అర్యమ, శక్ర, వరుణ, అంశు, భగ, వివస్వత్, పూష, సవితృ, త్వష్టృ, విష్ణులను ద్వాదశాదిత్యులు పుట్టిరి. సవితకుఁ బడబారూపముఁ దాల్చిన త్వాష్ట్రియం దశ్వినులు ఉద్భవిల్లిరి. దితి యనుదానికి హిరణ్యకశిపుండు జనించె. అతనికిఁ బ్రహ్లాద, సంహ్లాద, అనుహ్లాద, శిబి, బాష్కళు లన నేవురు కొడుకులు పుట్టిరి. ప్రహ్లాదునకు విరోచన, కుంభ, నికుంభు లను మువ్వురు సుతులు జనించిరి. విరోచనునకు బలి పుట్టెను. బలికి బాణాసురుఁడు పుట్టెను. దను యనుదానికి విప్రచిత్తి, శంబర, నముచి, పులోమ, అసిలోమ, కేశి, దుర్జయ, అయశ్శిరః, అశ్వశిరోఽయశ్శంకు, గగనమూర్ధ, వేగవత్, కేతుమత్, స్వర్భాను, అశ్వ, అశ్వపతి, వృష

* కన్యాదానసమయమునఁ దండ్రి సోదరరహిత యగు నీకన్యకను నీ కిచ్చెద. ఈమెయందుఁ బుట్టఁబోవువాఁడు మాకు వంశకరుఁ డగుఁ గాక యని సమయము నిర్ణయించుకొనుటకుఁ "బుత్త్రీకరణ" మని పేరు.

ప్వ, అజక, అశ్వగ్రీవ, సూక్ష్మ, తుహుండ, ఏకచక్ర, విరూపాక్ష, నిచంద్ర, నికుంభ, కుపథ, శరభ, శలభ, సూర్య, చంద్ర, ఏకాక్ష, మృతప, ప్రలంబ, నరక, వాతాపి, శత్రుతపన, శఠ, గవిష్ఠ, వనాయు, దీర్ఘజిహ్వ లనువేళ్ళతో నలువండ్రు పుట్టిరి. వీరిలో నుండు సూర్యచంద్రు లనఁబడువారు దానవులు. దేవత లగుసూర్యచంద్రులు వేఱని తెలియవలయు. ఈదానవులవంశ మపారమైవర్ధిల్లెను. దనాయువనుదానికి విక్షర, బల, వీర, వృత్రు లన నలుగురు జనించిరి. సింహిక యనుదానికి రాహువు పుట్టె. క్రోధ యనుదానికిఁ గ్రోధవశగణమును సుచంద్ర, చంద్రహంత్ర, చంద్రప్రవర్ధనాదులును బుట్టిరి. ప్రాధ యనుదానికి సిద్ధ, పూర్ణ, బర్హి, పూర్ణాయుః, బ్రహ్మచారి, రతిగుణ, సుపర్ణ, విశ్వావసు, భాను, సుచంద్రు లను పదుగురు గంధర్వులును; ననవద్యయు, మనువు, వంశయు, నసురయు, మార్గణప్రియయు, ననూపయు, సుభగయు, భాసియు ననుకూఁతులును; నలంబుసా, మిశ్రకేశీ, విద్యుత్పర్ణ, తిలోత్తమా, అరుణా, రక్షితా, రంభా, మనోరమా, కేశిని, సుబాహు, సురత, సురజా, సుప్రియా, అతిబాహువు లను నప్సరసలును; హాహా, హూహూ తుంబురులును బుట్టిరి. వినత యనుదానికి ననూరుండును, గరుడుండును బుట్టిరి. అనూరునకు శ్యేనియనుదానియందు సంపాతి, జటాయువులు పుట్టిరి. కపిల యనుదానికి గోవులు, అమృతము, బ్రాహ్మణులును, మఱికొందఱు గంధర్వులును, నప్సరసలును బుట్టిరి. ముని యనుదానికి భీమసేన, ఉగ్రసేన, వరుణ, గోపతి, ధృతరాష్ట్ర, సూర్యవర్చసీ, సత్యవాక్, అర్కపర్ణ, ప్రయుత, విశ్రుత, భీమ, చిత్రరథ, శాలిశిరః, పర్జన్య, కలి, నారదులను పదునార్గురు గంధర్వులు పుట్టిరి. కద్రువ యను దానికి శేష, వాసుకి, తక్షక, పురోగమానేక నాగకుమారులు పుట్టిరి.

బ్రహ్మమానసపుత్త్రులలో రెండవవాఁ డగునంగిరసునకు బృహస్పతి, ఉతథ్యుఁడు, సంవర్తుఁ డను ముగ్గురు జనించిరి. అత్రి యనుబ్రహ్మయొక్క మూఁడవమానసపుత్త్రున కనేకులు పుట్టి మిగులఁ దపస్సులఁ జేసి ముక్తులైరి. నాలవమానసపుత్త్రుఁ డగు పులస్త్యున కనేకులు యక్షులును, రాక్షసులును నుత్పన్నులైరి. ఐదవమానసపుత్త్రుఁ డగు పులహునకు సింహవ్యాఘ్రాదు లగు క్రూరమృగములు పుట్టినవి. ఆఱవ

వాఁడగు క్రతువునకుఁ దపోనిరతులగు వాలఖిల్యమునులు పుట్టిరి. మఱియు స్థాణువనువాఁ డొకండు ముందుచెప్పిన యాఱ్వురలోఁ జేరని బ్రహ్మమానసపుత్త్రుఁ డొకండు గలఁడు. వానికి మృగవ్యాధ, శర్వ, నిర్ఋతి, అజప్, కపాతీ, అహిర్బుధ్న్య, పినాకి, దహన, ఈశ్వర, కపాలి, భర్గు లను నేకాదశరుద్రులు గలిగిరి. బ్రహ్మపుత్త్రుం డగు ధర్మునకు ముందు చెప్పిన కీర్తి, లక్ష్మీ, ధృతి, మేధాదులగు పదుండ్రు భార్యలు గాక ధూమ్రా, బ్రహ్మవిద్యా, మనస్వినీ, శ్వాసా, రతా, శాండిల్యా, ప్రభాత లను నేడ్వురు ప్రత్యేకముగ భార్యలైరి. వీరలకు నసు వనియు సమూహనామము గలదు. వీరిలో ధూమ్రకు ధరుండును, బ్రహ్మవిద్యకు ధ్రువుండును, మనస్వికి సోముఁడును, శ్వాసకు శ్వసనుఁడును, రతకహస్సనువాఁడును, శాండిల్య కగ్నియు, ప్రభాతకుఁ బ్రత్యూషుఁడును, బ్రభాసుఁడు నన నెనమండ్రు వసువులు పుట్టిరి. అందు ధరునకు ద్రవిణుఁడును, హుతహవ్యవహుఁడు నని యిద్దఱుపుట్టిరి. ధ్రువునకుఁ గాలుఁడు పుట్టె; సోమునకు మనోహరయందు వర్చసుఁడును, శిశిరుఁడును, బ్రాణుఁడును, రమణుఁడు నని నలువురు పుట్టిరి. అహస్సనువానికి జ్యోతిస్సును, శమనుండును నను నిరువురు పుట్టిరి. అగ్నికిఁ గుమారుఁడు పుట్టెను. అతనికి శాఖ, విశాఖ, నైగమేయులు పుట్టిరి. అనిలునకు శివయను భార్యయందు మనోజవుఁడు నవిజ్ఞాతగతియునన నిరువురు జనించిరి. ప్రత్యూషునకు దేవలుఁ డను ఋషిపుత్త్రుండు పుట్టె; ప్రభాసుఁడు బృహస్పతిచెలియ లైన యోగసిద్ధిని బెండ్లాడి విశ్వకర్మను బుత్త్రుఁ గాఁబడసెను. ఈవిశ్వకర్మ సకలశిల్పాచార్యుండై వాసికెక్కె. మఱియు ధర్మునకు శమ, కామ, హర్ష లనువారు ప్రత్యేకముగ మువ్వురు జనించిరి. శమునకుఁ బ్రాప్తియు, గామునకు రతియు, హర్షునకు నందయును భార్యలైరి. బ్రహ్మ తనమనస్సున భృగునిఁ గల్గించె. భృగునకుఁ గవి జనించెను. కవికి కావ్యుం డయిన శుక్రుండు పుట్టి బ్రహ్మయాజ్ఞానుసారియై లోకములో వర్షావర్షములు, భయాభయములు గలుగునట్లు సంచరించుచు రక్కసుల కాచార్యుండై యుండె. శుక్రునకు: జండుఁడు, అమర్కుఁడు, త్వష్టఁ, ధరుఁడు, అత్రి యనువారు పుట్టి యసురులకు బురోహితులై వరిల్లిరి. మఱియును భృగునకు చ్యవనుండు పుట్టె. చ్యవ

సున కారుషి యనుమనుపుత్త్రి భార్య యయ్యె. ఆరుషియొక్క తొడను భేదించికొని యౌర్వుండు పుట్టె. ఔర్వునకు ఋచీకుఁడు జమదగ్ని మున్నగువారు నూఱుగురు పుట్టిరి. జమదగ్నికిఁ బుత్త్రులు నలుగురు గలిగిరి. వారిలోఁ గడఁగొట్టువాఁడు పరశురాముఁడు. ఈతఁడు సమస్తాయుధప్రయోగోపసంహార విద్యలయందు నేర్పరియై క్షత్రియులఁ బెక్కండ్రను వధించె. మఱియు బ్రహ్మకు ధాత, విధాత యనువారలు మనువునకు సహాయులై పుట్టిరి. వారితో లక్ష్మి పుట్టె. లక్ష్మికి మానస పుత్త్రులనేకులు గలిగిరి. సుర యనుదానియందధర్ముఁడు పుట్టె. అధర్మునకు నిరృతి భార్య గాఁగా భయ, మహాభయ, మృత్యువులనువారు మువ్వురు పుట్టిరి. మఱియుఁ దామ్ర యను దానికిఁ గాకియు, శ్యేనియు, భాసియు, ధృతరాష్ట్రియు, శుకియు నన నైదుగురు పుట్టిరి. అందుఁ గాకికి గూబలు మొదలగునవి జనించినవి. శ్యేనికి డేగలు గలిగినవి. భాసికి గ్రద్దలును, ధృతరాష్ట్రికి హంసచక్రవాకములును, శుకికిఁ జిలుకలును బుట్టినవి. మఱియు మృగీ, మృగమందా, హరీ, భద్రమనో, మాతంగీ, శార్దూలీ, శ్వేతా, సురభి, సురస లనువారు బ్రహ్మదేవుని క్రోధమునఁ బుట్టిరి. అందు మృగికి మృగములు, మృగమంద కెలుఁగుగొడ్డులు, భద్రమనస్సున కైరావతంబును, హరికిఁ గోఁతులును, శార్దూలికి సింహవ్యాఘ్రములును, శ్వేతకు దిగ్గజములును, సురభికి రోహిణియు, గంధర్వియు, ననలయు ననునవి జనించెను. రోహిణికి గోవులును, గంధర్వికి గుఱ్ఱములును, అనలకు వృక్షములును, శుకి యను కూఁతురును, సురసకుఁ బాములును గంకములును బుట్టినవి. ఇది చరాచరసకలభూతజాలంబుల యుత్పత్తి ప్రకారంబు. ఈసృష్టివిధమును జదివినవాఁడును వినినవాఁడును సర్వ పాపచ్యుతులై యుత్తమగతిం జెందుదురు అని చెప్పఁగా జనమేజయుండు విని వైశంపాయనుని దేవదానవాద్యంశములలో నెవ రెవ రెవ్విధమున భూమిలోఁ బుట్టినవారలో దానిం దెల్పు మనఁగా నన్న రేంద్రున కమ్మునీంద్రుం డిట్లనియె.

### దేవదానవాద్యంశముల భూమియందుఁ బుట్టినవారిక్రమము

రాజతిలకా! వినుము. మొదట దైత్యదానవాంశములఁ బుట్టిన వారిం బేర్కొని పదంపడి దేవాంశసంభూతులం జెప్పెద. హిరణ్యకశి

పుండు శిశుపాలుండై జనించె. సంహ్లాదుండు శల్యుఁడుగను, అనుహ్లాదుండు ధృష్టకేతుండుగను. శిబి ద్రుముండుగను, బాష్కలుండు భగదత్తుఁడుగను, విప్రచిత్తి జరాసంధుఁడుగను బుట్టిరి. అయశ్శిరుండును, నశ్వశిరుఁడును, నయశ్శంకుఁడును, గగనమూర్ధుఁడును, వేగవంతుండునను వారు కేకయరాజులై పుట్టిరి. కేతుమంతుఁ డమితౌజుఁడుగను, స్వర్భానుఁ డుగ్రసేనుఁడుగను, అశ్వుఁ డశోకుఁడుగను, అశ్వపతి హార్దిక్యుఁడుగను, వృషపర్వుఁడు దీర్ఘప్రజ్ఞుఁడుగను, అజకుఁడు సాళ్వుఁడుగను, అశ్వగ్రీవుండు రోచమానుఁడుగను, సూక్ష్ముఁడు బృహద్రథుండుగను, తుహుండుఁడు సేనాబిందుఁడుగను బుట్టిరి. ఇషువు నగ్నజిత్తై పుట్టె. ఏకచిత్తుఁడు ప్రతివింధ్యుఁడై పుట్టె. విరూపాక్షుఁడు చిత్రధర్ముఁడై పుట్టె. హరుఁడు సుబాహువుగను, సుహరుఁడు బాహ్లీకుఁడుగను, నిచంద్రుఁడు ముంజకేశుఁడుగను, నికుంభుఁడు దేవాధిపుఁడుగను, శరభుఁడు పౌరవుఁడుగను, కుపథుఁడు సుపార్శ్వుఁడుగను, క్రథుఁడు పార్వతేయుఁడుగను, శలభుఁడు ప్రహ్లాదుఁడుగను, దానవులలోఁ జంద్రుఁడు చంద్రవర్మగను, మఱియు వారిలో నున్న సూర్యుఁ డను వాఁడు ఋషికుఁడును దండుఁడును నై పుట్టిరి. మృతపుఁడు పశ్చిమానూపకుఁడై పుట్టె; గవిష్ఠుఁడు ద్రుమసేనుఁడుగఁ బుట్టె; మయూరుఁడు విశ్వుఁడుగఁ బుట్టె; సుపర్ణుఁడు కాలకీర్తియయ్యె; చంద్రహంత శునకుఁ డయ్యె. చంద్రవినాశకుఁడు జానకి యను వాఁడుగఁ బుట్టెను. దీర్ఘజిహ్వుఁడు కాశిరా జయ్యె. రాహువు క్రోధుఁడై పుట్టె. వికరుఁడు వసుమిత్రుఁడై పుట్టె. పాసిత్ముఁడు పాంసురాష్ట్రాధిపుఁడను వాఁడై జనించె. బలుఁడు పౌండ్రమత్స్యుఁడై జన్మించె. వృత్రుఁడు మణిమంతుఁడుగను, క్రోధహంత దండుఁడుగను, క్రోధవర్ధనుఁడు దండధారుఁడుగను, కాలాపుత్రులెనమండ్రును వరుసను జయత్సేన, అపరాజిత, నిషాదాధిప, శ్రేణిమంత, మహౌజస, భీరు, సముద్రసేన, బృహత్తుననువారై పుట్టిరి. కుక్షి యనువాఁడు పార్వతీయుఁ డయ్యె. క్రథనుఁడు సూర్యాక్షుఁడాయెను. దుర్జయుఁడు దంతవక్త్రుఁడుగను, క్రోధవశగణమువలన మద్రక, కర్ణవేష్ట, సిద్ధార్థ, కీటక, సువీర, సుబాహువు, మహావీర, క్రథ, విచిత్ర, సురథ, నీల, చీరవాస, ఉరుక్షి, ఆషాఢ, వాయువేగ, భూరితేజ, ఏకలవ్య, సుమిత్ర, వాటధాన, గోముఖ,

కారూషక, క్షేమధూర్తి, శ్రుతాయు, రుద్వహ, బృహత్సేన, క్షేమ, అగ్రతీర్థ, కుహర, మతిమత్, ఈశ్వరు లనువారు పుట్టిరి. కాలనేమి కంసుఁడై పుట్టె.

ఇఁక దేవగంధర్వాద్యంశములఁ బుట్టినవారిని నుడివెద. ఓ నృపాలా! సావధానుండవై వినుము. బృహస్పతియంశమున ద్రోణాచార్యుఁడును, కామక్రోధాదు లేకంబై మహాదేవాంశమున నశ్వత్థామయు, వసువులలోఁ బ్రభాసుఁడను పుణ్యాత్ముండు భీష్ముఁడును, రుద్రాంశమునఁ గృపాచార్యుఁడును, ద్వాపరునియంశమున శకునియు, మరుత్తులయంశమున సాత్యకిద్రుపదవిరాటులుం బుట్టిరి. అరిష్టాపుత్త్రుండైన హంసుఁడను గంధర్వుండు ధృతరాష్ట్రుఁడును, మరుదంశమునఁ బాండురాజును, యమునియంశమున విదురుఁడును, కల్యంశంబున దుర్యోధనుఁడును, పౌలస్త్యభ్రాతృవర్గము దుర్యోధనునితమ్ములుగను, యమాంశమున యుధిష్ఠిరుండును, మారుతాంశమున భీముండును, మహేంద్రాంశమున నర్జునుండును, అశ్వినులయంశమున నకులసహదేవులుం బుట్టిరి. సోమపుత్త్రుం డగు వర్చస్వి యనువానియంశమున నభిమన్యుండు సుభద్రయం దర్జునునకును బుట్టె.

## అభిమన్యునిగుఱించిన యొక్క విశేషము

మఱియు నీయభిమన్యునిపుట్టుకయం దొకవిశేషాంశమున్నది. చెప్పెదను వినుము. దేవత లందఱును వారివారియంశములలో భూమియం దవతరించుచుండు సమయమున సోముండు సురల కిట్లనియె. నా పుత్త్రుం డగు వర్చసుని భూలోకమున నుంచి యనేకవత్సరములు వాని వదలి నే నుండ లేను. దేవకార్యార్థమై వానిని బంపి తీరవలయును. కావున నే నొకయుపాయం బూహించియున్నాను. మహేంద్రాంశమున నర్జునుండు పాండునృపాలునకుఁ బుత్త్రుండై పుట్టు. వానికి నాకుమారుం డగు వర్చసుండు సుభద్రయను యాదవవనితగర్భమునఁ గుమారుండై పుట్టి యభిమన్యనామధేయుండై పదునాఱుసంవత్సరములలో విలువిద్య యందు నేర్పరియై భారతయుద్ధకాలమునఁ గౌరవయోధులతో నొక్కండుగఁ బోరాడుచు, నొక్కనాఁడు కృష్ణార్జునులు సమీపమున లేనిసమయమునఁ జక్రాకారం బగు శత్రుసేనావ్యూహంబునందుఁ జొచ్చి విజృంభించి యాసేనలోన నాలవపాలి నొక్కరుండవధించి యాసాయం

కాలమున నాశరీరమును వదలి నాసమీపమునకు మఱలివచ్చి చేరు వాఁడు. వాఁడే భారతవంశకర్త యగును. అనఁగా దేవత లంద ఱందుల కంగీకరించిరి. వీఁడే నీకుఁ బితామహుండు. వీనిపుట్టుకలో నిది విశేషము. దీని నీకుఁ జెప్పితి. అగ్నియంశమున ధృష్టద్యుమ్నుండును, స్త్రీపుంసరూపధరుం డగు గుహ్యకుఁ డను యక్షుండు శిఖండిగను, విశ్వ నామకగణాంశమున ద్రౌపదీపుత్త్రు లేవురునుం బుట్టిరి. ఆదిదేవుం డగు శ్రీమన్నారాయణాంశమున దేవకియందు వసుదేవునకు శ్రీకృష్ణుండు పుట్టె; శేషాంశమున వసుదేవునకు రోహిణియందు బలరాముఁ డుద యించె. భానునియంశమునఁ గర్ణుండును, సనత్కుమారాంశమునఁ బ్రద్యుమ్నుండును బుట్టిరి. శ్రీమహాలక్ష్మియంశమున భీష్మకునకు రుక్మిణి జనించె. అప్సరసలయంశమున శ్రీకృష్ణమూర్తికి షోడశసహస్రాంతఃపుర స్త్రీలు పుట్టిరి. సిద్ధియు ధృతియు ననువారు కుంతీమాద్రులై జనించిరి. మతి గాంధారి యయ్యె. మఱియు దేవత లనేకులు యదుకులమున యాదవులై యవతరించిరి. ఇదియంతయు భూలోకమునందు భూభార మును బోఁగొట్టుటకుఁగాను భూలోకమున నాదిపురుషుండు శ్రీమన్నా రాయణుండు మనుష్యుండై యవతరింపఁగా నాలోకారాధ్యుని కార్య మును సులభ మొనర్చునిమిత్తము దేవదానవులు తమతమయంశముల యందుఁ బుట్టినవారి యనుక్రమంబు. దీనిని వినువారు ధనమును, కీర్తిని, సత్సంతానమును, దీర్ఘాయువును, భూలోకమున వారుద్యమించు కార్య ములలో గెలుపునుంబొంది యంత్యకాలమునందు మహాయోగులుపొందు సద్గతిం గాంతు రనఁగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

మునీంద్రా! మీ రానతిచ్చినచొప్పున దేవదానవాద్యంశము లలో భూలోకంబునఁ బుట్టినవారియనుక్రమంబు తెలిసె. ఇంకను మనువుండొట్టి కౌరవులవంశము భూలోకమునఁ బుట్టి ప్రవర్తిల్లిన చొప్పుం తయుఁ దేటతెల్లం బగునట్లు వివరింపవలయు నని యడిగెను. అంత వైశం పాయనుండు పరీక్షిత్పుత్త్రున కిట్లనియె.

## వైవస్వతమనువుం గొట్టి భారతవంశానుక్రమణిక

పూర్వ మదితికిఁ గశ్యపువలన ద్వాదశాదిత్యులు జనించి రని చెప్పియుంటిని. వారిలో వివస్వంతునకు వైవస్వతమనువు కుమారుం

డయ్యె. ఇంకను యముండు మున్నగువారు కుమారులైరి. ఇంతేగాక వైవస్వతమనువునకు బ్రాహ్మణులును క్షత్త్రియులును నగు కొడుకులునుం గలిగిరి. మఱియు వానికి వేనుఁడు మొదలగు నేఁబదిగురుం బుత్త్రులును నిళ యనుకూఁతురు గలిగెను. వేనాదు లగు కొడుకులు పరస్పరకలహా ములఁ గావించుచు వైరముం జేసి యొకరితో నొకరు తగవు లాడి మడిసిరి. ఇళకుఁ బురూరవుండు పుట్టి ప్రబలుండై సకలమహీరాజ్యము నేల సాగెను. ఈతం డధార్మికుండు. తనశౌర్యమదంబున విప్రులతోఁ గలహించుచు వారల ద్రవ్యమంతయు నపహరించుచుండ బ్రహ్మ మానసపుత్త్రుం డైనసనత్కుమారుం డతి కారుణికుండై యాతనిని సమీ పించి యెంతచెప్పినను సామవచనముల వినకుండె. అంత మును లాగ్ర హించి వానిని శపించిరి. అప్పుడు వాఁడు పిచ్చివానివలెఁ దిరుగుచు, నూర్వశితో నొక్కనాఁడు గంధర్వలోకంబున కేగి యచ్చటినుండి త్రేతా గ్నులం దెచ్చె. ఆపురూరవున కూర్వశియం దాయువు, ధీమంతుఁడు, సుదావసుఁడు, దృఢాయువు, వనాయువు, శతాయువు ననువా రాఱుగురు పుత్త్రులు జనించిరి. ఆయువునకు స్వర్భానవి యను వనితయందు నహు షుఁడు, వృద్ధశర్మ, గయుఁడు, ననేనసుఁడు ననువారు నలువురు కొడు కులు పుట్టిరి. నహుషుఁడు ప్రజల ధర్మపరిపాలనంబున బ్రహ్మోక్తరంబుగా నేలుచు శతమఖంబు లొనర్చి యింద్రపదవి నధిష్ఠించె. అప్పుడు వాఁడు గర్వంబున సప్తర్షులచేఁ బల్లకులమోయించి దేవతల ధిక్కరించు టచే శపింపఁబడి భూలోకమునం బడి యజగరాకారంబునఁ బెక్కేఁడు లుండె. నహుషునకు యతియు, యయాతియు, సంయాతియు, నాయాతి యు, నయతియు, ధ్రువుఁడు నను నాఱుగురు సుతులు పుట్టిరి. అందు యతి యనువాఁడు పరమతపోనియతిం జేసి యాత్మజ్ఞానంబున ముక్తుఁడయ్యె. అంత యయాతి ప్రజాపాలనమునకు నియుక్తుండు గాఁగా బ్రజలఁ బ్రీతి తో నేలుచుండె. ఈతం డనేకయజ్ఞముల నొనర్చి దేవతలను మెప్పించి భక్తితోఁ గర్మముల నొనర్చి పితరులను బ్రీతులఁ గావించె. యయాతికి శుక్రునికూఁతురు దేవయాని భార్యయై యదు, తుర్వసు లనునిర్వురుసుతుల, వృషపర్వుఁడనుదానవునికూఁతురు శర్మిష్ఠయందు ద్రుహ్యుఁడు, ననుఁడు, పూరుఁడు నను ముగ్వురను బుత్త్రులు గలిగిరి. మఱియు నయ్యయా తిని నొండొక కారణంబున శుక్రుఁడు శపింపఁగా వేగంబ ముదిమి యా

క్రమించి, భార్యలయందుఁ గామసుఖంబులఁ దనివిఁ జెందక యింకను గొన్నినాళ్లు ప్రాయంపువాఁడై యుండఁగోరి తనముదిమిం గైకొని వారి యౌవనమును దనకు నొసంగు మని పుత్త్రుల వేఁడఁగాఁ బెద్దవారైన యదు తుర్వసు ద్రుహ్యు లనువార లొప్పకుండిరి. కడగొట్టువాఁ డగు పూరుఁడు తండ్రియందుఁ బెద్దయుభక్తి గలిగి తండ్రియభిమతంబుఁ దీర్పఁ దనయౌవనమును యయాతికి ధారపోసి యాతనిముదిమిని దా ననుభవించుచుండె. అవ్విధంబునకు యయాతి సంతుష్టాంతరంగుఁడై సకల మహీరాజ్యమునకుఁ బూరుని రాజుం జేసె నని చెప్పఁగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

మునివర్యా! శుక్రునికుమార్తెయైన దేవయాని యయాతి నెట్లు పెండ్లాడె? శుక్రుం డల్లుని నేల శపించె? నని యడుగఁగా వ్యాస శిష్యుం డిట్లనిగు

## యయాతిచరిత్రము

భృగువంశమునందు శుక్రుండు పుట్టి దైత్యదానవుల కాచార్యుండై వెలసె నని చెప్పియుంటిని. ఆశుక్రుఁడు తనతపోవిద్యాదుల మహిమచేఁ బూర్వము దేవాసురుల యుద్ధమునఁ జచ్చినవారిని మృతసంజీవనియను తన మంత్రరాజమున బ్రతికించె. దేవగురుండైన బృహస్పతి కావిద్య రామింజేసి యాహతఁడు దేవసైన్యమున మడిసినవారిని బ్రతికింప నేరకుండె. అంత దేవత లెల్లరును నిర్విణ్ణులై చేయునది గానక బృహస్పతిపుత్త్రునిఁ గచుఁ డనువానిం బిలిచి యిట్లనిరి. మనయొద్ద మృతసంజీవనీమంత్రరాజము లేదు. దానవాచార్యుం డగు శుక్రుండు దానిని నేర్చియుండుటంబట్టి రాక్షసులకు మేలును, మనకు హాని యుఁ గలుగుచున్నది. కావున నీ విప్పుడు దేవకార్యార్థము శుక్రుని యొద్ద కేగుము. ఆతండు మెచ్చునట్లు శుశ్రూషలం జేయుము. మఱి యు నామహాముని కుమారుని దేవయాని యను నొక్కకూఁతురు గలదు. ఆసుతమనస్సునకుఁ బ్రియం బగునట్లు వర్తింపుము. నీవు దేవయానికిఁ బ్రియంబుగ వర్తించుచు, శుక్రుమది మెచ్చ శుశ్రూషఁ గావించుచుండిన శుక్రుండు నీకు మెచ్చి వరము నిచ్చెద ననును. అప్పుడు వెంటనే

మృతసంజీవనీమంత్రరాజము నుపదేశింపు మని వేఁడుము. పొమ్ము. శుక్రునింట నుచితరీతి నుండి దేవకార్యమును సాధించుకొనిరమ్ము. అని చెప్పిరి. అంతఁ గచుండు వృషపర్వుపురమునకుఁ బోయి శుక్రుం జూచి నమస్కరించి మిక్కిలి వినయమున నాతనితో నిట్లనియె. కావ్యా! నేను దేవగురుండైన బృహస్పతిపుత్త్రుఁడను. కచుం డనువాఁడ. మీకు శిష్యుండనై శుశ్రూష లొనర్చుచు వేయివత్సరములు మీయొద్దనుండ వచ్చితి. అని చెప్పఁగా శుక్రాచార్యుండు కచున కిట్లనియె. వత్సా! నీవు దేవగురునిపుత్త్రుఁడవు. కావున మాకు మాన్యుఁడవు. నిన్ను మన్నించితో నేను జూచినచో గురుఁడైన బృహస్పతికి మర్యాదఁ జేసిన వాఁడ నగుదు. నీమనోరథంబుచొప్పున నాయొద్ద శిష్యుంగా నిన్ను గ్రహించెద. అని చెప్పఁగా గచుండు శుక్రునకును నాతనికూఁతురు దేవయానికిని మెప్పువచ్చునట్లు శుశ్రూషలు సేయుచుండె.

## శుక్రుండు దానవహతుం డైన కచుని సంజీవనిచే బ్రదికించుట

ఇవ్విధంబునఁ గచుండు శుక్రునకు శిష్యుఁడై యేనూఱేండ్లు సకలోపచారములచే శుక్రుని వానిపుత్త్రికను దృప్తిఁ బఱచుచుండి యొక్కనాఁడు యథారీతిని శుక్రునిహోమధేనువుల నరణ్యంబునఁ గొని పోయి మేపుచుండ నచ్చోటఁ గొందఱు దానవులు వానిం బృహస్పతి పుత్త్రుంగా నెఱింగి వారికి బృహస్పతియెడల నుండు ద్వేషమునను, శుక్రుని యొద్దనుండి కచుఁడు మృతసంజీవనిని గొనిపోవు ననుతలంపునను గ్రూరులై యచ్చోట వానిం జంపి వానిశరీరమును నుగ్గునుగ్గుగాఁ జేసి యా ఖండములను దోడేళ్లకు వైచిరి. అంత దినావసానం బగుటయు, శుక్రుని గోవులు తమంతట నాశ్రమములోని గోష్ఠమును జేరె. కచుండు రాఁ డయ్యె. అంత దేవయాని కచుని రామికి వగచి తండ్రిం జేరి యిట్లనియె. తండ్రీ! సాయంకాలాగ్నిహోత్రములు వేల్వఁబడినవి. గోవులు సకాలమునకు గోష్ఠమును జేరె. కచుం డిప్పటికి నేలకో రాఁడయ్యె. అరణ్యంబున నతఁడు మృగరాక్షసపన్నగబాధ నొందెనో? అని యేడ్వఁగా శుక్రుండు తనదివ్యజ్ఞానంబునఁ గచుం డసురులచే హతుం డయ్యె నని యెఱింగి మృతసంజీవనిం బంచిన నదియును మహాప్రసాదం

బని త్వరితగతినే తోడేళ్లగర్భముల నున్న కచుని దనమహిమంబున సజీవితుం జేయఁగాఁ గచుఁడును వానిగర్భములను భేదించుకొని యాశ్రమంబునకు మగిడి యేతెంచె. అప్పుడు దేవయాని వానింజూచి యిట్లనియె. అయ్యా! ఏల వనంబున నింతప్రొద్దు తడసియుంటివి? అనఁగా నాశుక్రసుతకుఁ గచుం డిట్లనియె. నే నరణ్యమున సమిధల నేరుచుఁ గొంత బడలి యొకవృక్షిక్రింద గూర్చుండి యుంటిని. అప్పుడు దానవులు కొందఱు నన్ను సమీపించి నావలన దేవగురుం డగుబృహస్పతిసుతునిగా నన్నెఱింగి నన్నుఁ జంపఁబోయిరి. అంత నాచార్యుని ప్రభావంబున నేను బునర్జీవితుండనై తోడేళ్లగర్భంబులయం దుంటిని. దానివలన నన్నుఁ జంపినవారును నామాంసఖండములను దోడేళ్లకు బలిగా వేసి రని గ్రహించితి. వెంటనే సంజీవనీప్రభావంబున వానిగర్భంబులను జీల్చికొని యరణ్యమునుండి యిప్పుడే వచ్చుచున్నవాఁడ. అని చెప్పి యెప్పటియట్ల యాశ్రమకార్యంబులను దండ్రికూఁతుల శుశ్రూషలను గావించుచుండె. ఇట్లుండఁ గొంతకాలమునకు దేవయాని వచనంబునఁ బుష్పముల గొనితేర నరణ్యమునకుఁ బోయిన, వానిని మరల దానవు లడ్డగించి వధించి వానిశరీరమును బూర్ణము గావించి యాపిండిని సముద్రపునీటఁ గల్పిరి. అంతఁ దొల్లింటియట్ల దేవయాని కచుండు సకాలమునకు రామి నెఱింగి యది గాఢసాపకృతింగా నెఱింగి మలమల మఱుంగుచుం బోయి పూర్వమువలెఁ దండ్రి కెఱిఁగింప శుక్రుండు తనవిద్యామహిమంబున వానిం బునర్జీవితుం జేసె. మఱియును నొక్కసారి యడవికిఁ బుష్పములు దేఁ నరిగిన కచుని దానవులు చంపి వాని రూపు సెడనట్లు గాల్చి భస్మము గావించి సురం గలిపి యబ్బ్యాదితో మిశ్రమయిన సురను శుక్రునకుఁ ద్రావించిరి. ఆసమయమున దేవయాని కచుం గానక దుఃఖితురాలై నేఁడును కచుండు రాక మసలె. అసురులచే నిహతుం డగియుంటఁ గావలయును. అని బోరన నేడువఁగా దానింజూచి సురాపానమోహితుండైయున్న శుక్రుం డిట్లనియె. దైత్యులకు మృతసంజీవనివిద్యామహిమ నుపయోగింపఁబడుచున్నది. ఆప్రభావంబున దేవగురుపుత్రుండు జీవంతుఁ డగుటకు వారోర్వరు. కావున వానితోడం బగఁ గొని వాని నిన్నిమార్లు వధించిరి. వాఁడు సుగతిం జెందుఁగాక.

వానినిమిత్తము నీ విఁక శోకింపకుము. అనినఁ దండ్రికి దేవయాని యిట్లని
నియె. కచుండు సామాన్యుండు గాఁడు. లోకోత్తరుఁడగు నంగిరసు మను
మఁడు. దేవగురువైనబృహస్పతికిం బుత్త్రుఁడు, దైత్యగురుండ వగు నీకు
శిష్యుఁడు. మన కాశ్రితుండు. నిరుపమబ్రహ్మచర్యాశ్రమవ్రతసంప
న్నుండు. కావున నోపాపరహితుఁడా! ధర్మజ్ఞుఁడా! మహాత్మా! అట్టివాఁడిపు
దుర్మార్గులగు దనుజులచే హతుండు కాఁగా వాని కే శోకింప కెట్లుండఁ
గలను? అనఁగా శుక్రుండు కూఁతు నుద్దేశించి, దేవయానీ! ఎన్నిమారులు
దానవులు కచుని నిహతుం జేసినను వానిని నేను గ్రమ్మఱ బ్రతికించు
చున్నాను వానియెడ దానవులు తులువలై పగ సాధించెదరు. ఏమి
చేయఁగలను? నేఁజేయుచున్న వానికి విపరీతమును దైత్యు లాచరించుచు
మహాపాపముల నొడఁ గూర్చుచున్నవారు. వారియెడ మనము శిష్య
వాత్సల్య మూనియుండుటచే వారిని నే మన లేను! అని చెప్పి మృత
సంజీవనిం బ్రయోగింప వాఁ డావిద్యాప్రభావంబున శుక్రాచార్యుని
యుదరంబునందు సచేతనుండై గురువర్యా! నేను నీకుక్షిగతుండ
నగుటకుఁ గారణము దైత్యులే. వారు నన్ను వధించి, నాశరీర
మును దహించి బూదిచేసి యాబూదిని సురయందుఁ గల్పి నీచేఁ
ద్రావించిరి. ఆకారణమున నేను నీకుక్షియం దచేతనత్వము నొంది
యుంటిని. ఇప్పుడు నీవిద్యాప్రభావంబున సచేతనుండ నైతిని. కాని
నీకుక్షియందుండి వెలువడినచో నీ కపాయంబు గల్గు. కావున మన
కిరువురకును నపాయంబు లేనియుపాయము నూహింపు మనఁగా దేవ
యానియు శుక్రకచులలో నెవ్వరికిని నపాయము కలుగఁగూడ దని
యుమ్మలించుచుండ శుక్రుఁడు కొంతసే పాలోచించి నిజగర్భస్థితుం డగు
కచున కిట్లనియె. ఓకచుఁడా! నాయనుంగుఁగూఁతు దేవయాని నీకుఁగడు
ననురక్తురాలు. కావున నీయెడ నెప్పుడును దయాళువుగ నుండును.
నీవులేక యొక్కనిమిష మేనియు నది మేనఁ బ్రాణములను ధరింప
ననియు, జీవమున్నంతవఱకుఁ గుడువ ననియుఁ గడుంగడు వగచుచున్నది.
దానివగపును నేను విననొల్ల. మఱియును నేను నిను నాపుత్త్రుంబోలె
భావించియుండుదు. కాన నెట్లైనను నిన్ను వెలుపలికి రప్పింప నిశ్చ
యించితి. నీవు వెలుపలికి నాగర్భమును జీల్చి కాని రానేరవు. కావున,
నేను బ్రాణములను గోల్పోవుదును. మనయిరువురిలో నెవరిని దేవయాని

గోల్పోనొల్లదు. కావున నిరువురును జీవించియుండుటకై గర్భస్థుండ
వైన నీకీమంత్రరాజమును నుపదేశించెద. నీవు నాకుక్షిని జీల్చుకొని వెలు
పటి కేతెంచి నే నిప్పుడు నీ కుపదేశించు సంజీవనీవిద్యచేత నన్ను బ్రతి
కింపుము. ఇంతేగాక బృహస్పతికుమారుండుదక్క నన్యుండు నాకుక్షియం
దుండినచో వాఁ డీమంత్రప్రభావంబున వెలుపలికి రాలేఁడు. కావున నీ
వీమంత్రము నుపదేశముగొనుము. పిదప నేఁ జెప్పినట్లెల్లఁ జేయుము. అని
చెప్పఁగాఁ గచుండు మహాప్రసాదంబని యాపవిత్రమంత్రరాజమును శుక్రా
చార్యునిమూలమున యథావిధి నుపదేశముం గొని, యాచార్యుకుక్షి
భేదించుకొని వెడలివచ్చెను. వెంటనే యామంత్రమును గురువు నుద్దే
శించి కచుండు స్మరింపఁగా శుక్రుండు జీవవంతుఁడయ్యెను. అంతఁ
గచుండు గురునకు మ్రొక్కి దైత్యగురూ! ఓస్వామీ, ఎవ్వఁడు మహా
విద్య నుపదేశించి జ్ఞానముఁ గలిగించునో యామహనీయుఁడే తల్లియుఁ
దండ్రియు నగుచున్నాఁడు. అట్టి సద్గురువు నుపాసింపనినీచులు విద్యా
ఫలము నొందక నరకముల పాలయ్యెదరు. ఇఁక వారియెడ ద్రోహా
చరణము గావింతు రేని యట్టి పాపాత్ములగతి యే మగునో యని చెప్పి
పితృపుత్త్రికలయెడఁ గడు గౌరవముతోను, వినమ్రతతోను గచుండు
వర్తిల్లుచుండె.

### సురాపానంబు మహాపాతకం బని శుక్రుండు నియమముఁ జేయుట

అంత శుక్రాచార్యుండు సురాపానంబునఁ దనకుఁ గలిగిన బుద్ధి
నాశము నాలోచించి యిప్పటినుండి బ్రాహ్మణుఁ డెవ్వండేని మద్య
పానము చేసినచో వాఁడు బ్రహ్మహత్యను జేసినవాఁడువోలె నరక
మున బొందు నని నియమమును జేసెను. మఱియును దాఁ జేసిన
నియమమును సకలభూసురులును మునీంద్రులును దేవతలును నెల్ల
వారును నంగీకరింపవలయు నని చెప్పి సురాపానంబు మహాపాతక మని
గట్టి నియమము మేర్పఱచి దానవులం బిలిచి కచునకుఁ దాను మృతసంజీ
వనిమంత్రోపదేశమును జేసి వానిని మహనీయుంగా నొనర్చితి నని
వచించెను. అంతఁ గచుండు శుక్రాచార్యునకు బ్రియంబుగ సేవ
లొనర్చుచు వేయిసంవత్సరము లుండి యాచార్యు సెలవుంగొని సమా

వర్తనము గావించుకొని నాకలోకంబునకు బోవ నుద్యుక్తుఁడై యుండ నొక్కనాఁడు శుక్రాచార్యకొమార్తె దేవయాని కచునితో నిట్లనియె. “నీవు గొప్పవంశమున జనించినవాఁడవు. విద్యావంతుండవు. తపస్సంపన్నుండవు. దానంజేసి మిక్కిలి తేజస్వివై వెలుంగుచున్నవాఁడవు. నీపై నాకుఁ గోర్కి పొడమియున్నది. నిన్ను దానవులు పలుమాఱులు వధించినను నీయెడ నాకుంగల మోహాతిశయమున నాతండ్రి నెన్నియేని విధములఁ బ్రార్థించి నిన్ను బ్రదికించియుంటి. కావున నన్ను నీవు తప్పక పెండ్లాడవలయును” అని దేవయాని కచునకుఁ దనమనోభిప్రాయమును దేటపఱుపఁగా గచుండు దాని కిట్లనియె. దేవయానీ! నాకు గురుపుత్రివగు నీవు నాతో నిట్టిపలుకులు పలుకందగునే? నాకు నీవు తోఁబుట్టువనుఁదుల్యవు. అధర్మమున నెవరును బ్రవర్తింపఁ గూడదు. నన్ననుగ్రహింపుము. సెలవిమ్ము నేను బోయి వచ్చెద ననఁగా దేవయాని కచునకు మిక్కిలి యలిగి మాయింట నిన్నినాళ్లుండి నావేఁడినదానిని వృథ చేసితివి. కావున నాతండ్రియొద్ద నీవు నేర్చిన సంజీవనిమంత్రవిద్య నీకు ఫలింపకుండుఁగాక యని శపించె. కచుండు నంతఁ గుపితుండై సంజీవని నాకు ఫలింపకున్నను నావలన నుపదేశముం బొందినవారికి ఫలించును. నీవధర్మ్యమైనమాటలం బల్కితివి. కావున నిన్ను బ్రాహ్మణుఁ డెవ్వండును బెండ్లాడకుండుఁ గాక యని ప్రతిశాపంబొసంగి స్వేచ్ఛతో నాకంబునకుఁ జనెను. వాఁడు తా శుక్రునొద్ద నేర్చిన విద్య నమరుల కుపదేశించి వారిని సంతోషింపఁజేసి వారివలన యజ్ఞభాగముగొని సుఖ ముండె. దేవతలును సంజీవనీప్రభావంబున దానవులతోడి రణంబు గలిగెనేని హతులైన దేవతలను బునర్జీవితులఁ గావించుచు సుఖులయి వర్తిల్లిరి.

ఇట్లుండ భూలోకమున వృషపర్వుకూఁతురు శర్మిష్ఠ యను నంగనామణి తన్ను వేవురు సుందరాంగులైనయువతీజనంబులు పరివేష్టించిరాఁగా గురుపుత్త్రిక యగు దేవయానిం దోడ్కొని విలాసార్థము వనవిహారంబు సలుపంబోయి యొకసరోవరతీరంబునఁ దమకట్టుపుట్టంబుల నునిచి నగ్నలై జలక్రీడలఁ గావించుచుండిరి. పిదప వారందఱును గ్రీడను జాలించి సరోవరతీరంబున కరిగి తమతమచీరలను జూడఁగా నవి యెల్లను

గాలిచేతం బ్రేరితంబులై కలిసిన, వారొకరికి ముం దొకరు గడచుట
కునై కొలను వెలువడు సంభ్రమంబున నాకన్యక లొకరిచీరల నొకరు
గొని కట్టికొనిరి. అప్పుడు దేవయానిపుట్టంబు శర్మిష్ఠ గట్టికొనిన, శర్మిష్ఠ
పుట్టమును దేవయాని కట్టుకొనక రోసి శర్మిష్ఠం జూచి యిట్లనియె. రాక్షసీ!
మా యయ్య మీ కాచార్యుండు. నేను బ్రాహ్మణవనితను. ఆచారంబు కొఱంత
వడ నీపుట్టంబు నేను గట్టికొననేర. నావస్త్రంబు నీ వేల గట్టితివి? యని
యడుగ శర్మిష్ఠ యందుల కలిగి దేవయాని కిట్లనియె. ఓభిక్షుకీ! మీ
యయ్య యెప్పుడును మా యయ్యను దీవించుచు, మాయయ్య యే
మేనియు నొసంగినం గొనిపోయి జీవించువాఁడు. అటులుండ నేమో
మీయయ్య మహామహిమగలవాఁ డని చెప్పుచున్నదానవు. నీగర్వ
మే పాటిదే? యని చెప్పి నాచీరను నీ వేల కట్టరా వని సగర్వంబుగఁ
బలికి దేవయానిని సమీపమునం దున్న బావిలోఁ ద్రోయించి యది
చచ్చు నని తలంచి నిజగృహమునకుఁ జనియె.

### యయాతి బావిలోఁ బడియున్న దేవయానిని లేవనెత్తుట

ఆసమయమున భూపాలుండగు యయాతి వేఁటకై వనంబున
చరించుచు బహుదూరము నడచుటచేఁ బడలి, దప్పిఁగొని దేవయాని
పడియున్న బావిసమీపమునకు వచ్చి యాబావియం దున్నది
యంగనామణియని తలపోసి చూచి "నీ వెవ్వతెవు? బావిలో నేల
పడియున్నదానవు?" అని యడుగఁగా నారాజునకు దేవయాని యిట్ల
నియె. నేను దేవయానియను పేరుతో నొప్పుచు, యుద్ధమున దేవతలచే
హతు లయినదానవులను దైత్యులను సజీవితులం జేయంజాలిన విద్యా
మహిమముగల శుక్రాచార్య కూఁతురను. ఒక్కనెపంబున నీబావి
లోఁబడి యున్నదాన. నన్ను వెడలనెత్తు మని తన కుడి చేయి చాచు
టయు, రాజును దన దక్షిణహస్తమిచ్చి దానిం బైకెత్తి యాయమ
సెలవుం బొంది నిజనగరమునకుఁ జనియె. అంత దేవయానియు శర్మిష్ఠ
కావించిన యెగ్గువలన విముక్తయై తన్ను రోయుచు వచ్చుదాని ఘూర్ణిక
యను పరిచారికం గని ఓసి! ఏను వృషపర్వపురము సొరనొల్ల. శర్మిష్ఠ

నా కొనర్చిన హాని నంతయు నాతండ్రికి నివేదింపుము. అనిచెప్పి పుత్తేరఁగా నదియు వేగంబునం జని తద్వృత్తాంతం బంతయు శుక్రునకుం జెప్పిన, శుక్రుండును నాక్షణంబ క్రుద్ధుండై దేవయానికడ కేతెంచి కూఁతుం గాంచి విషణ్ణుండై కౌఁగలించుకొని దాని కిట్లనియె. నాబిడ్డా! శర్మిష్ఠకు నీ వేమైన నెగ్గొనర్చితివే? కాకున్న నీయెడ నది యేల యిట్టి విపరీతభావముం బూనును? అని యడుగఁగా దండ్రికిఁ గ్రుద్ధయైన కూఁతు రిట్లనియె.

తండ్రీ! వినుము. "ఎల్లప్పుడు నాతండ్రిని భిక్షుకునివలె యాచించి, యెప్పుడప్పుడు స్తుతివచనంబు లాడి యేమైనను గొని పోయి జీవించు బిచ్చగానికూఁతున కింత పొగ రేల?" యని శర్మిష్ఠ సగర్వముగ నన్ను దూలనాడె. నిశ్చయముగ నే నట్టివాని కూఁతున నే నైతినేని నే నిప్పుడపోయి దాని ప్రసాదమునకుఁ బాత్రురాల నగుదుఁగాక. అని చెప్పఁగా, శుక్రాచార్యుండు శర్మిష్ఠచే నవమానింపఁబడిన కూఁతు హృదయం బెఱింగి యి ట్లనియె. తల్లీ! నీ వెట్టివానికూఁతుర వైన దియు నిన్నవమానించిన దానితండ్రి వృషపర్వుఁ డెఱుంగును. ఇంత యేల? ఇంద్రుండును, యయాతియు నెఱుంగుదురు. నేను లోక హితంబును గోరి యజ్ఞముల నాచరించి సకాలవర్షములఁ గురిపించి యోషధుల నెల్ల వృద్ధిగావించుచున్నవాఁడను. ఇంతేగాక, తొల్లి పర మేష్ఠి నన్ను సమస్తభూతములకు నీశ్వరుండవుగా నుండుమని నా యందు సంతుష్టుండై చెప్పియున్నవాఁడు. అది యంతయు నిప్పుడు చెప్పనేల? నీకొక్కహితం బుపదేశించెద. వినుము. మిక్కిలి నిష్ఠగల వారై బహుదక్షిణల నొసంగి యనేక యజ్ఞములు చేసినవారికంటె నక్రోధనుఁ డైనవాఁ డధికుండని పెద్దలు సెప్పుదురు. అలిగినవాని కలుగని వాఁడును, నెగ్గులొనర్చువానికి మాఱుచేయనివాఁడును, దూషించి నప్పుడు విననివానింబోలె నుండి ప్రతిదూషణవచనము లాడనివాఁడును, నవమానమును సహించువాఁడును, ధర్మముల నెఱింగినవాఁడు. కావున బుద్ధిమంతులు క్రోధమును గొనియాడరు. శర్మిష్ఠ రాచకూఁతురు. మఱియుం గొండుక. దానితోడి దేమి? నావెంట రమ్మనెను. అంత నట్లు శాంతవచనంబు లుపన్యసించి ప్రశాంతుండై యుండు శుక్రునకు దేవయాని

యిట్లనియె. తండ్రీ ! శాంతి ననుసరించుట యుత్తమధర్మము. అయినను మిక్కిలి ప్రేమయు, నేర్పును, గడకయుఁ గలవారిని లక్ష్యపెట్టక యెవ్వరు నిందింతురో యట్టి కష్టాత్ములయొద్ద నుండుటకన్న రోఁత వేఱొండు కలదే ? ఎవ్వ రుచితము నెఱింగి సాధుల మన్నింతురో యట్టివారిసన్నిధి నుంట సముచితంబు. ఇట్టి దుష్టచిత్తులయెడ నుండనోప. శర్మిష్ఠ నన్నాడినమాటలు నాహృదయమును విదారించుచున్నవి. సంపద్రహితుఁడు శత్రుసంపదలచే జీవించుటకంటె వాఁడు చచ్చుట కుపాయము వెదకి చచ్చుట మేలు. దానవులు మనకు శత్రువు లనుటకు వెఱ నిదర్శనంబు లేల? కావున నీవృషపర్వపురం బేను జొర నొల్ల. ఎటకేనియుం బోదు ననఁగా, గాదిలికూఁతు ననునయింపలేక దానియందలి యనురాగాతిశయమున శుక్రుండు వెండియు దాని కిట్లనియె. తల్లీ! నాకు నీవ గతివి. నీతోడ నేనును వత్తునని కూఁతు సమాధాన పఱచుచున్నంత నంతయును జారులవలన వృషపర్వుం డెఱింగి శుక్రుండు కూఁతుతోనున్న వనప్రదేశమునకు వచ్చి యాచార్యునకు నమస్కరించి యిట్లనియె. మీరిరువు రీవనభూమియం దిట్లేల వంత నున్నవారు? పురమునకుఁ బోవుదము. రండనఁగా శుక్రుండు వృషపర్వున కిట్లనియె. దానవాధిపతీ! అధర్మప్రవర్తకునకుఁ గీడు కలుగకుండినను, నాయధర్మము వానిపుత్త్రునికైనను, మనుమనికైనను జేటుఁ దెచ్చు. దాన నాతఁడు మొదలంటనఱికిన చెట్టువోలెఁ జెడును. సురాచార్యుని పుత్త్రుండును, నాకు శిష్యుండును, నా కెప్పుడును శుశ్రూషలు సేయుచు ధర్మాత్ముండై పుణ్యవ్రతముల ననుష్ఠించుచుండిన కచుని మీవారు పలుమాఱు వధించుటం జేసియు, నీప్పుడు నా యనుంగుకూఁతు దేవయానిని బావియందుఁ ద్రోసి నీకూఁతురు శర్మిష్ఠ చంపఁదలంచుటయుఁ, గారణములుగా నేను మీయొద్దనుండనోపను. మఱి గొటకేనియుంబోయి సుఖముండెద. మీకు శత్రువైన మహేంద్రున కాచార్యుండైన బృహస్పతి దేవతలకుంబోలె నేను మీకు యోగక్షేమంబుల నొనర్చుచుండినను మీరెల్లప్పుడును నాకు హాని నే చేయుచుండెదరు. నీవు నీదోషమును గుర్తింపలేక నాయందే యసత్యారోపణమును జేయుదువు. అనఁగా శుక్రునకు దానవాధిపతి యిట్లనియె. గురువర్యా ! మీయం దెప్పుడు నసత్యమును, నధర్మమును నిసుమంతయేని నే నెఱుంగను. సత్య

ధర్మములు మీయందు సుప్రతిష్ఠితము లని నే నెఱుంగుదు. దానవులు మీవిద్యామహిమచే దేవతలను జయింపఁ గలిగిరి. స్థిరసంపదలం జెందిరి. పరాక్రమవంతులైరి. కాకున్న వా రెన్నఁడో నిలువ నీడలేక దేవతలమహాస్త్రములచేఁ జచ్చి యుండరా? లేక, సముద్రమున దాగి యుండుటకుఁ బోయియుండరా? కావున నోవిద్వన్మణీ! మేము మాకుండు సర్వసంపదలతోను, గలధనములతోను నందఱము నీకు వశులమని తలంపుము. మమ్మనుగ్రహింపుము. అనఁగా శుక్రుండు వృష పర్వున కిట్లనియె. అయ్యా! ఏది యెట్లయినను నేను నాకూఁతున కని ష్టంబు సేయనోపను. నేను నీపురంబున నుండుటకుఁ గోరుదువేని నాకూఁతు నొడంబఱచి దానియిష్టము ననుసరింపుము. అని చెప్పఁగా వృషపర్వుండు దేవయానిని సమీపించి, ఓయాచార్యపుత్రీ! నీయిష్ట మెద్దియో చెప్పుము. అది దుర్లభంబైనను దానిని దెచ్చి నీకిత్తు. మాయెడ ననుగ్రహింపుము. అని వేడికొనఁగా దేవయాని కోప ముపసంహరించి కొని వాని కిట్లనియె. నాతండ్రి నన్నెవ్వని కిచ్చి వివాహము చేయునో యాతనిపురమునకు నేను బోవునపుడు శర్మిష్ఠ దాసీసహస్రంబుతో నే తెంచి నాయొద్దనయుండి నాకూడిగంబు సేయుచుండవలయును. ఇది నా యభిమతం బనఁగా నందులకు వృషపర్వుం డొడంబడి దానిని బంపి యా వృత్తాంతంబంతయును శర్మిష్ఠకుఁ దెలుపుమనఁగా, నది పోయి శర్మిష్ఠతోఁ జెప్పి యాకన్యకను తోడితెచ్చె. తండ్రి యానతిని విని యామెయు దాసీ సహస్రముతో దేవయానియొద్ద కేతెంచి యో దేవయానీ! నీకోరినట్లు నేను నాదాసీసహస్రముతోడ నీవు నీమగనిపురమున కేగునప్పు డరు దెంచి నీపంపు సేయుచుండెద అనఁగా దానికి దేవయాని యిట్లులనియె. శర్మిష్ఠా! మాయయ్యను బొగడుచు మాయయ్య యేదేని యొసం గఁగాఁ దెచ్చి జీవించువానికూఁతునకు నీవు దాసివిగా నుండఁదగునే? యని నిష్ఠురోక్తులతోఁ బరిహాసముం జేసిన శర్మిష్ఠ యందులకు వగవక యెట్లయినను దానవులకు సుఖము నొడఁగూడ మనస్సున నెంచి యా మేలునే తలంచి దాస్యము నంగీకరించె. అంత దేవయాని పరమానంద భరితయై తండ్రిసామర్థ్యమునకు వింత నంది వృషపర్వనగరప్రవేశము గావించి శర్మిష్ఠచేఁ బనులు గొనుచుండె.

## యయాతి దేవయానిం బెండ్లియాడుట

అంత నొక్కనాఁడు దేవయాని శర్మిష్ఠను దానిదాసీసహస్రముతో మఱివేవురు సేవకురాండ్రఁ గొని ముందు విహరించిన వనంబునకుఁ జని విలాసంబునఁ దనకు శర్మిష్ఠయు నారెండువేల పరిచారికాజనులును గూడికంబు సేయుచుండ నొక్కచో సుఖాసీనయై యుండె. అప్పు డా వనమునకు వేటనిమిత్తమై యయాతిభూపాలుండరుదెంచి నలుదెసల మృగంబుల వేటాడుచు బహు దూరము నడిచినచ్చుటం జేసి దప్పిఁగొని సలిలాశయమును వెదకుచు దేవయాని దాసీద్విసహస్రంబుతో సుఖాసీనయై యుండుసరోవరతీరంబున కరుదెంచి యందు నొడ్డోలగంబున విలాసవతులై యున్న దేవయానీ శర్మిష్ఠలం గాంచి మీ రిరువు రేవారు? మీ రేవంశమున జనించితిరి? మీపేళ్లెవ్వి? యని యడుగఁగా దేవయాని యిట్లనియె. నరపాలా! నేను దానవాచార్యుం డగుశుక్రుని కూఁతురను. దేవయాని యను పేరిదాన. ఇది దానవాధిపతి. వృష పర్వునికూఁతురు. శర్మిష్ఠ యని పేర్కొనఁబడి యీద్విసహస్రదాసీజనం బుతో నా కూడిగపుఁ గత్తెయై యున్నయది. అని చెప్పఁగా యయాతి దానవరాజుకూఁతుగు నీ కెట్లు దాసి యయ్యె నని యడుగఁగా దేవ యాని యయాతి కిట్లనియె. కర్మవశంగతులై మానవులు దైవనిర్దిష్ట కార్యములను జేయుచుందురు. దీని నడుగ నేల? నీ వొక్కటి యడిగెద. నీరూపమును వేషమును జూడ నీవు రాజుగాఁ దలంపఁబడి యెదవు. నీవచనసౌష్ఠవము బ్రాహ్మణత్వమును దోపించుచున్నది. నీవెవ్వఁడవు? నీకులగోత్రము లెవ్వి? ఏనిమిత్తమున నివ్వనమునఁ గ్రుమ్మరుచున్న వాఁడవు? తెలియఁజెప్పవే? యని యడుగ దేవయానికి యయాతి మహారా జిట్లులనియె. నేను రాజపుత్త్రుఁడను. నహుషుని కుమారుండను. యయాతి యని నన్నుఁ బేర్కొందురు. బ్రహ్మచారినై యయాశ్రమసమయమున వేదాధ్యయనము సాంగంబుగ నొనర్చితిని. వేఁటకై వచ్చి యీయరణ్యంబునఁ దిరుగుచు బడలి నీరుపట్టు గలిగి జలాశయంబును వెదకుచు నిచ్చోటి కేతెంచితి. పోయివచ్చెద అని చెప్పఁగా యయాతికి దేవయాని వెండియు నిట్లనియె. భూమిపాలా! ము న్నొకనాఁడు నే నొక నూతఁబడియుండ నీవు నీదక్షిణకరంబున

నా వామపాణిగ్రహణం బొనర్చి నన్ను నూతినుండి యుద్ధరించితివి కాదే? ఆ కారణంబున నీవు నన్ను బెండ్లాడి యీ ద్విసహస్రదాసీజనంబులును, దానవరాజపుత్త్రిక యగు శర్మిష్ఠతో నాకుఁ బరిచర్యలు సేయుచుండ న న్నేలికొనుము. నీపాణిం గ్రహించిన నా కితరుల నంటఁ జనదు. నాఁటఁగోలె నేను నిన్ను మగనిఁగా భావించియున్నదాన. అని విలాసంపుఁ బల్కుల యయాతికి మనోవేదనను గల్గింపఁగా నా రాజు, బ్రాహ్మణపుత్త్రిక యగు దేవయాని కిట్లనియె. లోకమున మనుష్యులం దఱును సమానులే. అయినను వర్ణభేదమును నాచారభేదమును గలిగి యుండుటంజేసి భూసురు లెల్ల వారికంటె నుత్తములు. అట్టి విప్రభామినులను క్షత్త్రియులు పెండ్లాడుదురే? క్షత్త్రియాంగనలను విప్రులు పెండ్లాడుట నే నెఱుంగుదు. ధర్మనిరుద్ధమైన వర్ణసంకరమునకు నే నెట్లొడిగట్టుదు. అందును నే భూపాలుం డగుక్షత్త్రియుండను. సర్వవర్ణాశ్రమంబులు సంకరంబు గాకుండ రక్షించుచున్న నే నీ యధర్మమున కొడంబడితి నేని జగత్ప్రవృత్తి విపరీతం బగు. వెండియుం బ్రాహ్మణుం డలిగెనేని, క్రూర విషసర్పమునకంటెను, నలుదెసల నాలుకలసాచి మండుచున్నదవదహనంబునకంటెను, మిక్కిలి క్రూరతను జూపును. ఎట్లంటేని క్రూరసర్పము గాని, దవానలంబు గాని చిక్కువడియున్న యొక్కనిం జంపు. బ్రాహ్మణుండు క్రూరతఁ జూపుచో సర్వమును నశింపఁజేయును. కావున నాకు విప్రులనఁ గడుభీతి. నిన్ను విప్రుండగు నీతండ్రి యనుమతింపక యిచ్చు ననుచో నేను నిన్నుఁ బెండ్లాడ నేర. ఇంతటితో నాసమాచారమును బోనిమ్ము. అనగా దేవయాని యయాతిని వదలక యాతనితో మఱియు నిట్లనియె. రాజులు భూసురాంగనలఁ బెండ్లాడిన మాత్రమున వర్ణసంకరమగు నని తలంపవలదు. పూర్వకాలమున భార్గవుం డగు పరశురాముండు రాజుల నెల్ల నేఱి యిరువదియొక్కమాఱులు వధింపఁగా క్షత్త్రియాంగనలయందు విప్రులు గాదే క్షత్త్రియవంశముల నుద్ధరించిరి. మఱియు లోపాముద్ర మున్నగు ననేక క్షత్త్రియాంగనలకు లోకోత్తరులగు విప్రశ్రేష్ఠులు పుట్టియున్నవారు. ఇంత చెప్పనేల ? విద్యాపెంపునను, తపము యొక్క యాధిక్యతను, నియమాతిశయంబుచేతను నీవు రాజర్షివి. నీతండ్రి శతమఖ

ములం గావించి యింద్రపదవినిఁ జేకొన్న మహానీయుఁడు. మఱియును దానవాచార్యుండగు నాతండ్రి యనుమతించి దీనివలన ధర్మవిరోధంబు లేదనునేని నన్నుఁ బెండ్లాడుమని చెప్పి వెంటనే పరిచారిక నొక్కదానిం బిలిచి తండ్రిం దోడ్కొని రా దానిం బుత్తెంచె. అంత భృగునందనుఁడు తనప్రియనందనకుఁ బ్రియ మొనరింప నెంచి దివ్యమగు బ్రహ్మతేజస్సున నావనమును వెలిఁగించుచు, మిక్కిలి సంతోషముతోఁ గూఁతునొద్ద కేతెంచెను. అప్పుడు తపస్సుపెంపుచేత బ్రహ్మ కైన గ్గైన యాశుక్రాచార్యుం జూచి యయాతి లేచి నిలుచుండి సాష్టాంగ దండప్రణామం బాచరించెను. పదంపడి దేవయానియు, దాసీసహస్రయుత యగు శర్మిష్ఠయు నందఱును లేచి మిక్కిలి భక్తితోఁ గ్రమంబున నమస్కరించిరి. అంత దేవయాని తండ్రి కిట్లనియె. ఓపరమమూర్తీ! వినుము. ఇయ్యయాతి మున్ను నేను నూతిలోఁ బడియుండ నాదక్షిణపాణిని గ్రహించి యుద్ధరించియుండె. అట్లొకప్పుఁ డొకనిచే గృహీతనైన నే నింకొకనిని బరిణయవిషయమున నెట్లు గ్రహింతు? కావున నాకు నీజన్మంబునఁ బతి యయాతియె. ఇతండును నీవనుమతింప నన్నుఁ బెండ్లాడెద ననెను. ఇందు ధర్మవిరోధంబు లేకుండ సమర్థింపవలయు. అని చెప్పగా శుక్రుండు యయాతితో నిట్లనియె. "భూమిపాలా! ఈనాకూతుం దేవయానిని నీకు వివాహము నిమిత్తమై యొసంగెద. వివాహముఁ జేసికొనుము. ఇరువురును సుఖ ముండుఁడు. ఇందపక్రమదోషంబు లేదు. అట్లు నీకు వర మొసంగితి" అని చెప్పి శర్మిష్ఠం జూపి యిక్కన్య వృషపర్వకూఁతురు. దీనిని నన్నపానవస్త్రాదులచే సత్కరింపుము. దీనియందు శయనసుఖభోగములను వర్జింపుము. ఇది నాయాజ్ఞ యనఁగా యయాతి దానిని దలం దాల్చి శుక్రాచార్యునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లొనర్చి విధ్యుక్తప్రకారంబున నొక్క సుముహూర్తంబున దేవయానిం బెండ్లాడి మామయగు దానవాచార్యునివలన విశేషధనముల నరణంబుగాఁ గొని యింక ననేకవిధంబుల దానవులు తన్ను బహూకరింప దేవయానిని, రెండువేలదాసీజనంబులతోనున్న శర్మిష్ఠను దోడ్కొని నిజపురంబునకు నరిగి యం దొక హర్మ్యంబున దేవయాని నుంచి, యాదేవియనుమతంబున నశోకవనసమీపంబున

నొక్కనూతనగృహము నేర్పఱచి కన్యకాద్విసహస్రంబుతో శర్మిష్ఠనం దునిచి, దేవయానియందు సుఖోపభోగపరుండై యనేకసంవత్సరములు విహరించుచుండె. అంత దేవయానికి యదుతుర్వసులనుపుత్త్రులుజనించిరి.

### యయాతి శర్మిష్ఠకుఁ బుత్త్రదానంబు చేయుట

ఇవ్విధంబున యయాతి రాజ్యమును ధర్మమార్గంబున నేలుచుండఁగా వేయిసంవత్సరంబులు గతించె. అప్పుడొక్కనాఁడు శర్మిష్ఠ తనకు ఋతుకాలము కాఁగా మనస్సున నిట్లు వితర్కించె. ఇంతకాలమైనను నాకు భర్త లేఁడు. నాఋతుకాల మిట్లుడవింగాచిన వెన్నెల యగుచున్నది. దేవయాని సంతానవంతురాలయినది. నే నేమి చేయుదాన? నని కొంత మనస్సునఁ జింతించి దేవయాని యయాతిభూపాలుని వరించినట్లు నేనును వరించెద నని తీర్మానించుకొని యొక్కనాఁడు యయాతి శర్మిష్ఠయుండు నశోకవన సమీపమున నేకాంతమున సంచరించుచుండ నామహీపాలుని సమీపించి నమస్కరించి యిట్లనియె. భూపాలా! నీయింటనుండుకోమలుల నన్యులెవరును గన్నెత్తిచూడ సాధ్యము కాదు. ఇంతేగాక నేనిన్నినాళ్లీయశోకవనసమీపమున నాకు నిర్దిష్టమైన గృహంబున నెట్లు వర్తించుచుండునదియు నీ వెఱుంగనిది కానేరదు. నాయేలికసానికి నీవు భర్తవైననాఁడే దానిదాసి నగు నాకును భర్తవైతివి. ఇది యధర్మంబు కానేరదు. కావున నాకిప్పు డీఋతుకాలము వమ్ము గాక నన్ననుగ్రహించి నాతో సంగమింపుము. ఆలును, దాసియును, సుతుఁడును నొక్కరూప కాదే యని తన్నుఁ బరిగ్రహింప వేఁడికొనెను. అంత నయ్యయాతి యావృషపర్వపుత్త్రిక కిట్లనియె. కోమలీ! ముందు యయాతిమాఁతు నేఁబరిగ్రహించి పెండ్లాడిన పిదప శుక్రుండు నిన్నుఁగన్యకాసహస్రంబుతో నాదేవింబోలె నేలునట్లును, నీకు శయనము దప్పరుచిరాన్నపానములను, వివిధాభరణాదుల నింపుసొంపార నొసంగునట్లును నియమించియుండె. ఆనియమమున కే సమ్మతించి యిట్లు నిన్నినాళ్లు గడపితి. నాప్రజల నసత్యమార్గమునఁ బ్రవర్తింపనీయక శాసించు నేనీవిషయమున నసత్యమున కెట్లొడంబడుదు. అని చెప్పఁగా యయాతికి శర్మిష్ఠ యిట్లనియె. రాజేంద్రా! వినుము. పరిహాసంపువేళలయందును, జంపఁబడఁబోవు విప్రునిఁ గాపాడవలసిన సమయమునను,

సర్వధనవినాశకాలమునను, ప్రాణసంకటసమయమునను, వధూజన
సంగమునను బొంకుట చనును. ఈయేనింటియం దసత్యదోషము వాటి
ల్లదు. ఇట్లు ఋషివచనప్రమాణము గలదు. నీవు వివాహకాలమునం
దీసమయమున కొడంబడితివి. కాన నా కిప్పుడు ఋతుకాలోచితమును
బ్రసాదించిన నిన్ను దోషం బంట నేరదు. ఇరువు రొక్కప్రయోజన
మునే యపేక్షించి వాదు లాడుచుండ నొకపక్షమునే యవలంబించుట
పాతకంబు గాదే? నేనును నాయేలికసానియు నిరువుర మొకసమయ
మున నే నిన్ను వరింప నెట్లో యేలికసానిని వరించితివి. అటు లగుటం జేసి
నేనును నీయధీనురాల నైతిని. అట్లగుట ననుఁ బరిగ్రహింపుము. నీవలన
సంతానమును బడయుట కువ్విళ్లూరుచున్నదాన. నాకోర్కిని నెఱ
వేర్పుము" అని యాచింప యయాతికి యాచకులయీప్సితము లొసంగుట
వ్రతము గాన శర్మిష్ఠవేఁడికోలును నిరాకరింపఁదగ దని నిశ్చయించి
వృషపర్వసుతను గారవించి ఋతుకాలోచితమును బ్రసాదింప నద్దానవ
రాజసుత క్రమంబున గర్భమును ధరించి ద్రుహ్యుఁడు, ననుఁడు, పూరుఁడు
నను మువ్వురు పుత్త్రులం గనెను.

అంత నొక్కనాఁడు శర్మిష్ఠ కొడుకులం గనుటం దెలిసి దేవ
యాని దానిని సమీపించి యి ట్లనియె. లతాంగీ! నీ వత్యుత్తమశీల
వనియు, వినయపరురాల వనియు, గొప్పవంశమునఁ బుట్టినదాన వనియు,
నిర్వికారవ్యాపారముతో బాలగా నున్నదాన వనియు విని యుంటిని.
ఇప్పు డీ సుతుల నెట్లు గంటివి? అనఁగా శర్మిష్ఠ లజ్జావనతవదనయై
దేవయాని కిట్లనియె. దేవీ! ఒక్కమహాముని నిఖిలవేదవేదాంగపారంగ
తుఁడు వచ్చి ఋతుమతినై యున్న నన్నుం జూచి నాకుఁ బుత్త్రోత్పత్తిఁ
బ్రసాదించె. అనఁగా విని దానినిఁ గొంత మేలమాడి యమ్మునికుల
నామము లెయ్యవి? ఆఋషి యెవండు? అని యడుగఁగఁ దనదివ్య
తపస్సునఁ బొందిన తేజస్సుచే వెల్గుచుండిన యమ్మహనీయుం జూచి పేరును
గోత్రమును నడుగనేరక నే నూరకుంటి ననఁగా నిది సత్యమేని నీయెడ
నాకుఁ గోపము లేదని నిజాంతఃపురమున కేగెను.

అంత నొక్కనాఁడు దాసీజనంబులతో శర్మిష్ఠ యున్నవనంబు
నకు దేవయాని యయాతితో విలాసంబుగా విహారమున కేగెను.

అప్పు డందొక్కచో ముద్దులుగులుకుచు నాడుచున్న శర్మిష్ఠబిడ్డల యొక్క రూపరేఖావిలాసంబు లన్నిటిని యయాతివిగా గుర్తించి యయాతితో 'భూపాలా! వీ రెవనిపుత్త్రులు? ఉనికి వర్తనంబులచే నినుఁబోలి యున్నారు.' అని యడుగ యయాతి దాని కదత్తోత్తరుండయ్యె. పదంపడి దేవయాని యాముగ్వురు బాలకులం జూచి మీ రెవ్వరిపుత్త్రులు? సత్యమాడుఁ డనఁగా వారు మాయయ్య యీరా జని యయాతిం జూపి వెంటనే యయాతిం గౌఁగిలింపఁ బోఁగా నప్పు డయ్యయాతి వారినిఁ జెంగటఁజేర్పకుండుట నంతట వా రేడ్చుచుఁ దల్లి యగుశర్మిష్ఠ పాలి కరిగిరి. అంత దేవయాని వీరు శర్మిష్ఠయందు సత్యముగ యయాతికిం జనించినవారే యని నిశ్చయించి శర్మిష్ఠతో నిట్లనియె. 'రాక్షసీ! నీస్వభావమును వెలిపుచ్చితిగాదే? నాకు దాసురాలవై నా కెంతమాత్ర మెఱుకపడనీయక నావంతయేని వెఱవక యిక్కార్యం బెట్లొనర్చితివి? నాకే యపాయంబు తెచ్చితివి గదే?' యని నిందించుటయు శర్మిష్ఠ దేవయానికి జంకక యిట్లుత్తర మిచ్చెను. నేను ధర్మమునకు వెలిగా వర్తిల్లకుండుట నీకు వెఱవనైతి. ఈరాజును నీవు వరించినప్పుడే నేనును వరించితిని. నీవు నాకంటె వయస్సునఁ బెద్దదానవు. భూసురాంగనవు. కావునఁ బూజ్యురాలవు. నీకుఁ బతిగ్గైన యీమహానీయుండు నాకుం బూజనీయుండే యగును. అంతియగాక ధర్మపాలనంబుచేతను, నియమాద్యనుష్ఠానంబులచేతను నీపూజ్యుండు రాజర్షియే యగును. ఋషివలనఁ బుత్త్రులం బడసితి నని నీతో నేను మున్న చెప్పియుంటిఁగాదే? ఈతండు నన్నుఁ బొందుట తగదే? ఇందు నాదోష మేది? అనఁగాఁ దానెఱుంగకుండ నయ్యయాతి శర్మిష్ఠవలన లబ్ధసంతానుం డగు టెఱింగి దేవయాని యయాతిం జూచి కుపితయై యిట్లనియె. "రాజా! నీవేల నాకిట్లప్రియం బొనర్చితివి? కావుననే నిఁక నీయొద్ద నుండనేర" నని పలికి రా జెంత నివారించినను నిలువక తండ్రి యగు శుక్రుపాలికిం జని తనకన్నీట నమ్మునిపాదంబు లక్కాంత గడిగెను. అయ్యయాతియు దానిని సమాధానపఱచుచుఁ దోడన చని మామను గని నమస్కరించియున్న నద్దేవి తండ్రితో నిట్లనియె. 'తండ్రీ! ఈరాజు ధర్మమును గీడ్పఱచె. ఈతం డాసురంబున నాసురిగ్గైన శర్మిష్ఠయందుఁ బ్రవేశించి దానికనురక్తుండు కాఁగా నయ్యది

మువ్వురు కొడుకులం గనెను. నాయం దితని కిరువురు పుట్టిరి. ధర్మ
మును దెలిసి వర్తించువాఁ డని ఖ్యాతిం జెందియు, నీతండు ధర్మ
విరోధంబొనర్చి నా కవమానంబు గలిగించె' నని చెప్పఁగా శుక్రుఁడు
యయాతి కిట్లనియె. 'నీవు నావచనమును బాలించెద నని చెప్పి
నాకధీనుండవై యుండియు, ధర్మజ్ఞుండ వయ్యును, యౌవనగర్వంబున
గామాంధుండవై యధర్మమాచరించితివి. కావున నచిరంబున నిన్ను
ముదిమి యాక్రమించుఁగాక' యని శపించె. అప్పుడు యయాతి
శుక్రునితో, 'దేవా ! ఋతుకాలమున నుండి సంగమయోగ్యురాలైన
వనిత సంతానార్థము సంగమమును వేఁడినచో దాని నిరాకరింపఁ
దగదనియు, నిరాకరింప భ్రూణహత్యాపాతకము వాటిల్లు ననియుఁ
బెద్దలు సెప్పుదురు. అక్కతమున శర్మిష్ఠం బొందితినిగాని కాముకుఁడనై
దోషంబుఁ జేయలేదు. నీపుత్త్రికయగు నిద్దేవయానియందు విషయోప
భోగతృప్తుండను గాను. ముదిమి నిప్పుడే వహింప నోప నాయెడం
గరుణించి ముదిమి నన్నిప్పుడే యాక్రమింపక యుండ నన్ను నను
గ్రహింపుము.' అని వేఁడగా నాదానవాచార్యుండు యయాతితో
'నామాట యనృతంబు కానేరదు. నీ వింకను యౌవనవంతుఁడవై
యుండవలయును నని గోరుదేని నీముదిమి మఱియొక ప్రాయంపు వాని
కిచ్చి వాని ప్రాయమును నీపై వ్యాపించునట్లను గ్రహించెద. నీముదిమిని
గొనువాఁ డెవ్వఁడో వాని నియమించి నన్నుఁ దలంపుము. అప్పుడ
వాఁడు నీముదిమిని వహించుటకును, వాని ప్రాయము నిన్నావహించుట
కును నుపాయ మేర్పఱిచెద' ననెను. అంత యయాతి, శుక్రునితో
నిట్లనెను. 'అయ్యా ! నాముదిమిని గైకొను మని నే నింకొకరిని వేఁడం
బోను. నాసుతులలో నెవ్వరైనను దీని దాల్పవలయును. అట్లు దాల్చిన
వాఁడే నాయనంతరము రాజ్యార్హుండై వంశకరుం డగునట్లు వరము
నిమ్ము' అని ప్రార్థింపఁగా శుక్రుం డగును గాక యనియె.

## యయాతి యదుప్రభృతులకు శాపం బిచ్చుట

అంత యయాతికి శుక్రుశాపంబున ముదిమి యావహింపఁగాఁ
దల వడఁకఁజొచ్చె ఇంద్రియములపటుత్వము తప్పినది. అంగములు సడ

లెను. చర్మము ముడతలువడినది. వెంట్రుకలు నెఱసినవి. ఉబ్బసరోగము శ్వాసకోశ మాక్రమించినది. తలయేరును బొడిదగ్గును దలకొనెను. అంత యయాతి జ్యేష్ఠుఁడైన యదువును బిలిచి నాకు శుక్రశాపంబున నకాలమున నీముదిమి సంభవించె. నాకు విషయోపభోగములయం దింకను దృప్తి కలుగదు. ప్రాయము నన్నిప్పుడ వదలుటకు సహింపనోప. కావున నీప్రాయమును నాకొసఁగి నాముదిమిని నీవు కొంతకాలము భరింపుము. ఇట్లీవు నాముదిమిని వేయియేండ్లు భరింపుము. పిదప నీప్రాయమును నీకొసఁగి నాముదిమిని నేఁ జేకొనియెద ననిన తండ్రికి యదు విట్లనియె. ముదిమివలన ననేకదోషములు కలుగును. శరీర దుర్బల మగును. ఇష్టమైన విషయోపభోగముల ననుభవించుటకు వలను గాదు. ముసలివాఁడే కార్యములను స్వతంత్రించి చేయఁజాలఁడు. వానిని సేవకులును వయస్సున నుండువారును లక్ష్యము సేయరు. కావున నీముదిమిని నేను జేకొననేరను. అనఁగా యయాతి యదువున కలిగి, యోరీ! నీవు నాకుఁ బుత్త్రుండవై నాయం దనాదరణమును జూపితివి. నామాటఁ దిరస్కరించితివి. కావున నీవును నీసంతతివారును రాజులుగా నుండ ననర్హు లని శపించెను. పిదప రెండవకుమారుం డగు తుర్వసునిం బిలిచి యదువునకుఁ జెప్పినట్లు చెప్పిన వాఁడు ముదిమి సురూపమును బుద్ధిని నడఁచు ననియు, విషయసుఖంబుల ననుభవింప నీయ దనియుఁ, గావున దానిఁ గ్రహింప ననఁగా యయాతి వానికిం గోపించి, వానిని సంతానహీనునిఁ గాను వాఁడు సదాచారవిహీనులై ధర్మాధర్మవివేకశూన్యులైన సంకీర్ణ వర్ణకిరాతులకు రాజగునట్లుగాను శపించె. పిదప శర్మిష్ఠ కుమారులలోఁ బెద్ద యగు ద్రుహ్యునిం బిలిచి పూర్వపువారితోఁ జెప్పినట్ల సెప్పఁగా వాఁడు ముసలివాఁ డేనుఁగుల నెక్కలేఁడు. గుఱ్ఱపుస్వారుల నొనర్పలేఁడు. సుందరాంగనలతో నిష్టవిహారంబులు సలుపలేఁడు. తుదకు దంతములన్నియు నూడునుగాక. వానిమాటలనుసైతము ప్రాయంపువారు వెక్కిరించుచుందురు. అని ముదిమిని గైకొన నొల్ల ననఁగా వానిని గజరథ తురగారోహణంబులకు యోగ్యముగాక యెల్లప్పు డోడలచే దాటఁబడు ప్రదేశముల కధీశ్వరుం డగునట్లు శపించె. అంత నాలవవాఁ డగుననువుం బిలిచి తొల్లిఁటిపుత్త్రులతో నన్నవానిని దెలుపఁగా వాఁ డి ట్లనియె.

ముసలివాఁడు నిష్ఠలేక పసిబాలురచందమున నాహారాదులయందు
నియతి లేక, మలమూత్రవిసర్జనములయందు విధ్యుక్తశౌచములఁ గావిం
పక, శాస్త్రవిహితకర్మముల ననుష్ఠింప లేక పోవును. మఱియు జరయును,
రోగమును దైవవశమున నయ్యె నేని దాని నెవ్వరైన ననుభవింతురు. కాని,
తెలిసితెలిసి యీరెంటి నెట్టిపిచ్చివాఁడైనను జేకొనునే? కావున నీముది
మిని నే నొల్ల ననఁగా యయాతి వాని కెంతయుం గోపించి, యోరీ! నీవు
ముసలితనమును రోగములను దూషించితివి. మఱియుం దండ్రినగు నా
కుపచరించునిమిత్తమునన్నైనను గొంత కాలము దాని గ్రహింప నని చెప్పి
తివిగాన నీ సంతతివా రెవరును ముసలితనమువచ్చువఱకు జీవించియుండక
ప్రాయంపువయస్సుననే చత్తురు. మఱియును నీవు విధ్యుక్తశ్రౌతస్మార్త
కర్మపరిత్యాగివి కాఁగల వని శపించె. మఱియందఱిలోఁ బిన్నవాఁడును,
శర్మిష్ఠకొడుకును నైన పూరువుం బిలిచి, వత్సా! నాముదిమిని నీవుగొని
నీప్రాయంపు వయస్సు నా కొసంగెదవే, యని వేఁడఁగా నాపూరుండు
తండ్రిమాటకు మాఱాడక తండ్రియిచ్చు మెయి వర్తిల్లెద నని, వాగ్దా
నము సేసెను. అంత యయాతి పుత్రులలోఁ గొండికయయ్యు నీ
పూరుండు సద్గుణరాశి యని నుతించి పూరునకు ముదిమి నొసంగి, వాని
ప్రాయమును దాఁ గొని యధిగతయౌవనుండై ధర్మమార్గములఁ బ్రజల
నేలుచు, విశ్వాచియను నప్సరసం దవిలి గృహారామక్షేత్రములయందు
నందనాది రమణీయస్థలములయందును దానితో విషయోపభోగముల
నందుచుఁ బరమానందమున సహస్రవర్షములు పూర్తియగువఱకుఁ
బొదలు చుండె. అంత యయాతి జరాభారపీడితుఁ డైనపూరుం బిలిచి
వానిజవ్వనంబు వానికి మఱల నొసంగి, తనయాజ్ఞానువర్తను లైన భూలో
కమునందలి బ్రాహ్మణులను, క్షత్రియులను, నితరములగు వర్ణములవారిని
రావించి మంత్రిపురోహితసామంతానంతపౌరజనసమక్షంబున సకల
భూరాజ్యమునకుఁ బూరు నభిషిక్తుం జేసినఁ బ్రకృతిజనంబు లారాజున
కిట్లనిరి. ధర్మజ్ఞా! వినుము. నీ వొనర్చిన కార్య మవిచార మని మేము
చెప్పుటకు సాహసింపలేము. నీజ్యేష్ఠపుత్త్రుండు మిక్కిలివిద్యాసంపన్నుండు
విశేషించి సామర్థ్యము పెంపునఁ గీర్తిఁ జెందినవాఁడు. రాజ్యకార్యధురం
ధరుఁడు. మఱియు శుక్రాచార్యుని మనుమఁడు. ఇట్టిలోకోత్తరుఁడైన

జ్యేష్ఠుని వదలి భువనేశ్వరత్వమునకు శూద్రజాతివనితకుఁబుట్టిన పుత్త్రుని బూన్పఁదగునా ? అనిన వారల కయ్యయాతి యిట్లనియె. జ్యేష్ఠపుత్త్రుం డైనను నేఁజెప్పినదానిఁ జేయ నొల్లక నన్నుఁ దిరస్కరించెను. కుమారుండు తలిదండ్రుల కవిధేయుం డగునేని, వారల లక్ష్యముచేయఁడేని వాఁడు కుమారుం డనఁబడఁడు. పితృధనముల కర్హుఁడు కానేరఁడు. పూరుండు పిన్నయయ్యును వాఁడు గుణశ్రేష్ఠుండు, వాఁడు సుపుత్త్రుఁడు, నాకోరినదానిందీర్చి నేర్పరితనముం జూపినవాఁ డగుటచే భువనభారము నోపికతోఁ దాల్చు నని వానికి నాయనంతరము భూపాలనాధికార మొసంగితి. మఱియును నాముదిమిని దాల్చిన పుత్త్రుండు నాయనంతరము రాజ్యమున కర్హుండును, వంశకర్తయు నగు నని తొల్లి శుక్రుండు నాకు వరము నొసంగి యుండుట నీకార్యమునకు శుక్రానుమతి గలదు. అని యయాతి పామరజనంబుల నొడంబఱిచె.

యయాతి పూరుని రాజుఁజేసి వనమునకుఁ దపంబొనర్ప నేగి స్వర్గంబునకు జనుటు

అంత నయ్యయాతి శర్మిష్ఠసుతుండైన పూరువుం బిలిచి కుమారా ! నీప్రాయము నీసహస్రవర్షములుం దాల్చి విషయోపభోగములఁ దనివితీర ననుభవించితి. కాముకుల కామము హవిస్సులచే నగ్ని చల్లారకుండునట్లు అనుభవించుచుండినచోఁ దనివి గలుగనేరదు. మనుష్యునకు శరీరము కాలవశంబున ముదిమిఁ జెందినను విషయలంపటత్వము ముదిమిఁ జెందనేరదు. భూలోకమున నున్నవస్తువుల నన్నింటిని గలవాఁడైనను వానికిఁ దృప్తి గలుగనేరదు. అని చెప్పి ప్రాజ్ఞుండగుటచే మఱియుఁ దనపుత్త్రునితో "కుమారా! వైరాగ్యమును బొంది త్రికరణశుద్ధిగా సర్వభూతముల కెగ్గొనరింపక, యితరులను బెదరింపక, యొకరి వలనఁ దానును భీతిల్లక, దేనిం గోరక, యెవనితోడను వాదులాడి కలహింపక సముఁడై, విషయవాంఛలను నీచము లని భావించి, మనస్సు విడివడి, సారథిలేని గుఱ్ఱములమాడ్కిఁ జనకుండ, యోగముచే నిలిపి పరబ్రహ్మాసక్తి నుండవలయు. కావున నేను విషయానుభవంబుల విరక్తుఁడ నైతి. నిన్నఖిలభూభారధురంధరుం జేసితి. యదుప్రభృతులను బ్రాంత దేశములకుఁ బ్రభువులఁగా నొనర్చెద. నేను వేదవేదాంగపారగు లగు

విప్రులతోడం దపోవనంబునకుం జని యందుఁ గందమూలఫలముల భక్షించుచు, వనములందు లభించుఫలములచే హావ్యకవ్యంబుల నగ్ని మూలమున దేవతలను, బితరులను దనుపుచు వానప్రస్థాశ్రమవిధాన మును దప్పక, *శిలోంఛవృత్తులచే నతిథి కిడఁగా మిగిలిన యన్నముం దినుచు నియమపరుండనై యరిషడ్వర్గంబుల గెలిచి వేయియేండ్లు తప స్సుఁ జేసి సర్వసంగములను వదలి శీతోష్ణాదిద్వంద్వముల కోర్చి యహాం కారాదులను వదలి మృగాదులతోఁ జరించుచుండెను. నీవు నాకు నాము దిమి నొసంగుము. నీజవ్వనంబును జేకొనుము. ధర్మమార్గ మతిక్రమిం పక రాజ్యము నేలుము. వంశకర్త వగుము.” అని పూరుని గంగాయము నామధ్యప్రదేశమున కధిపతిగఁ జేసి తక్కినకుమారులను బ్రాంతదేశ ములపాలకులుఁగఁ జేసి, తీవ్రమైనతపం బొనర్చి, స్వర్గమున దేవర్షిగణ పూజితుండై బ్రహ్మలోకమునను ననేకసంవత్సరము లుండి యందు బ్రహ్మ ర్షిగణపూజితుండై యం దనేక కల్పములుండి మఱల నింద్రలోకమునకు వచ్చి పిదప స్వర్గభ్రష్టుండై భూమింబొందక యంతరిక్షమున నుండి యష్టక, వసుమ, త్ప్రతర్దన, శిబులతోడ మఱల స్వర్గలోకమును బ్రాపించె నని చెప్పఁగా జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. మునీంద్రా! ఆయయాతి యేతపోమహిమంబునం జేసి క్రమ్మఱ నాకలో కము నేరెను ? ఏహేతువున నాతనికి నాకలోకభ్రష్టత్వము కలిగె? వీపు ణ్యకార్యముచే నాతనికి స్వర్గము మఱల లభించినది ? ఆమహానీయుండు కురువంశమున కభివృద్ధికారకుండును బుణ్యాత్మకుండును గాఁడె ? కావున నతని వృత్తాంతంబులను సవిస్తరముగ వివరింపు మనుటయు నామునివ రుం డానరవరున కిట్లనియె.

అట్లు యయాతి వనంబున కేగి సర్వసంగవిముక్తుండయి సర్వ ద్వంద్వములను వీడి ముప్పదేండ్లు నిరాహారుండై, యొక్కయేఁడు వా యువును మాత్రము భక్షించుచు, పంచాగ్ని మధ్యమున నిల్చి యొక్క యేఁడు నీటిలో నేకపాదంబున నిల్చి మహాఘోరతపంబు సేసిన,

---

* శిల మనఁగాఁ బైరుకోఁత కాలమున నచ్చట నొడెల నెత్తికొని పోవుచుండఁ గ్రిందపడు వెన్నులనేఱుట. ఉంఛ మనఁగా పడియుండు వెన్నుల నొక్కచోఁ జేర్చి యాశ్రమమునకుఁ దెచ్చుట.

పుణ్యాత్ముం డగుటచే వానికి దేవతలు విమానమును బంపిరి. ఆ విమానంబు నారోహించి దేవమునులుపూజింపఁ గొన్నినాళ్లు దేవ లోకంబునను, బ్రహ్మర్షులు పొగడఁ గొన్నినాళ్లు బ్రహ్మలోకంబునను నుండి మరల దేవలోకంబున కేతెంచె నని చెప్పియుంటివి. అప్పు డింద్రుఁడు దేవలోకమున నయ్యయాతిం బూజించి వెండియు నిట్లనియె. రాజేంద్రా! నీ కొడుకుఁ బూరుని రాజ్యాభిషిక్తుం గావించి యాసమయమున నతని కేమిబోధించితి వని యడుగ నమ్మహేంద్రున కానరేంద్రుం డిట్లనియె.

## యయాతి పూరునకు బోధించిన నీతులు

ఎఱుక గలవారిచరితల నభ్యసింపు మంటిని. సజ్జనుల సహవాసము కర్తవ్య మంటిని. ధర్మమును దెలిసికొనుచుఁ దెలిసినదానిని మఱవక న్యాయబుద్ధితోఁ బ్రవర్తించుచుండవలయు నంటిని. మఱియు సత్పాత్రమున కొరుని వేడక ధనము నొసంగు మంటిని. సర్వభూతములకు బ్రీతిఁ జేయు మంటిని. యాచకులయాశను వ్యర్థపుచ్చవల దంటిని. సభలలో నొరులమనస్సును నొప్పింపక ప్రియమును, హితమును, బథ్యమును, సత్యమును, మధురమును, వ్యర్థముకానిదియును, మితివిరారనిదియును, ధర్మయుతమును నగు పలుకులాడు మంటిని. పరమర్మభేదములను జేయు దుర్జనులపొంత నుండవల దంటిని. సత్యతపశ్శౌచములయం దప్రమత్తుఁడవై మెలఁగు మంటిని. దానం జేసి కామక్రోధలోభమోహమదమాత్సర్యములను లోనున్న యరిషడ్వర్గము జయించినవాఁడ వయిసకలశరీరేంద్రియముల కొడయుండవై వెలుపలిశత్రువులను క్షణమాత్రమున గెల్తు వంటి. మఱియు నమ్మహాత్ముండైన పూరుం డొరులకుఁ గలుపునంతటి సర్వగుణసంపన్నుండనిన విని యింద్రుండు వెండియు నయ్యయాతి కిట్లనియె. రాజేంద్రా! నీవు లక్షసంవత్సరములు పుణ్యలోకభోగైశ్వర్యముల ననుభవించుట కేమి తపం బొనర్చితివో చెప్పవే యనఁగా, యయాతి పాకశాసనునితో నిట్లనియె. మహేంద్రా! దేవ, గంధర్వ, యక్ష, దానవ, దైత్య, నర, సిద్ధ, భూసురమునిగణముఖ్యుల తపస్సులు నాయొనర్చిన కఠినతపంబునకు సరి రావనెను. అంత దేవేంద్రుం డిది గర్వోక్తి యనియు, యయాతి మునిగణముల నధిక్షేపించె

ననియు, వానిని నొకపరిఁ బదభ్రష్టుం జేయఁగా నయ్యయాతి తన్ను మన్నింపుమని మిగుల వేఁడి యింద్రునితో నయ్యా! నేను మనుష్యలోకమునకుఁ బోవ నోపను. అంతరిక్షంబున సత్పురుషులమధ్యంబునఁ బడునట్లు ప్రసాదింప మనెను. అంత నయ్యింద్రుం డందులకు సమ్మతించి యో రాజా! ఇఁక నైనను గర్వ ముడిగి యుండుము. నీయహంకారము నిన్నింత నేసె నని చెప్పఁగా నా పుణ్యాత్ముం డైనయయాతి భూరితపోబలంబున వెలుఁగుచు నంతరిక్షమును దన దివ్యవిమలదీప్తిచేఁ బ్రకాశింపఁ జేయుచుఁ బడుచు సద్గణము లిది యేమి ప్రకాశము? అద్భుతావహముగ నున్నదని యనుచునుండ స్వర్గచ్యుతుండై తన దౌహిత్రులగు నష్టకుఁడును, ప్రతర్దనుఁడును, వసుమంతుఁడును, నౌశీనరుఁ డగు శిబియు ననువారు యజ్ఞము లాచరించుచున్న యాగశాల సమీపమున నంతరిక్షమునఁ బడుచుండువానిఁ దేజోమూర్తిని వారు వీక్షించి యితం డెవ్వఁ డొకో యని యాలోచించుచున్నంత యయాతి పుణ్యమూర్తి గనుంగొని యష్టకుం డనువాఁ డతని కిట్లనియె.

## అష్టకుని ప్రశ్నములకు యయాతి సదుత్తరముల నొసంగుట

అయ్యా! నీ వెవండవో గాని మహిమంబునఁ మహేంద్రునిఁ, దేజస్సున నగ్నిని నంధకారమును దొలఁగునట్లు చేయుటచే సూర్యునింబోలి యున్నాఁడవు. నీ వంతరిక్షంబునఁ బడుచుండుటను జూచి యిది యొకమహాతేజమే కారణంబున నిట్లధోలోకమున కేతెంచుచున్నదని విస్మయమంది వితర్కించుచు వీక్షించెదము. నీ విట్లుపడుటకుఁ గతం బేమి? దాని దెలియఁగోరి మే మిచ్చోట నున్నారము. మమ్మును మీ రెవరని నీ వడుగకున్నను, మేము సాహసించి ని న్నిట్లడిగితిమి. నీ వెవండవు? నీ వెవరికుమారుండవు? ఏ హేతువున నిచ్చోటికి కేతెంచెదవు? అంతయుఁ దెలియఁ జెప్పుము. మనస్సునందు దుఃఖమును నభిమానమును వెఱపును వదలుము. సత్పురుషులకడ నుండు నీ కింద్రుం డైనఁగీడు చేయలేఁడు. అగ్ని దహించునట్లును, భూమి బీజముల మొలకెత్తించునట్లును, సూర్యుఁడు నిజకాంతులచే జగమును బ్రకాశింపఁ జేయునట్లును, సజ్జను లభ్యాగతులను సన్మానింతురు. సుఖము ననుభవిం

చుచు దానిని బోఁగొట్టికొనినవారు సత్పురుషుల ముఖ్యాధారమున మనుదురు. కావున నీవు సాధువుల సన్నిధానమున కేతెంచుటంజేసి చింతఁదొఱంగుము. అనఁగా నష్టకునకు యయాతి యిట్లనియె. నేను మున్నీలోకమున యయాతి యన నెగడితిని. నహుషునికుమారుండను. పూరునితండ్రిని. భూలోకంబున బహుసంవత్సరములు నేను రాజ్యము నేలి వేయియేండ్లు తపంబాచరించి యామహిమమున నూఱుయోజనముల విస్తృతియు, వేయిద్వారములతో వెలయు దేవేంద్రుపట్టణంబు నేరి, యచ్చోట వేయిసంవత్సరములు దేవతలు మన్నింపఁగా నుండి, పాకారియుద్యానవనంబైన నందనవనమున దేవాప్సరసలు సేవచేయ నచ్చోట దివ్యవర్షసహస్రంబులు గడపి, యచ్చోటినుండి బ్రహ్మలోకమున కేగి బ్రహ్మర్షులమన్ననఁ జెంది సుఖముగా నుండి, మఱల నింద్రలోకమునకు రాఁగా నచ్చోటఁ గామరూపుఁడనై యచ్చరలనడుమ సొంపు పెంపార విలాసవంతుఁడనై చరించుచుఁ బదిలక్షలసంవత్సరములుండి యొక్కనాఁడు నాకలోకాధిపతిచెంత నాతపంబుపెంపును సగర్వముగా నుడివి, సురమునిప్రముఖుల తపస్సును నాతపంబునకంటె దక్కువయంటిని. అందులకు మహేంద్రుండు నేను సురమునిగణంబుల నవమానించితిననియు, నాతపస్సును గొప్పదనీ గర్వించితిననియు నెంచి నన్నధోలోకమునంబడున ట్లొనర్చెను. అట్లు క్షీణపుణ్యుండనై మరల మర్త్యలోకమున నింద్రానుమతి నొకదేవదూత త్రిమాత్రస్వరంబున ముమ్మాఱు లధోలోకమునకుఁ బొమ్మన నిట్లు పడుచుండు నన్ను "అయ్యో! యయాతి పుణ్యము క్షీణించి యధోలోకమున కేగుచున్నాఁడని సుర లెల్ల రనఁగా వారి యనుగ్రహంబునను, సురపతి నాకొసంగిన వరమాహాత్మ్యంబునను, సజ్జనసన్నిధానమునను మీయాగశాలం జేరితిని. మీకంటె నేను వయస్సునఁ బెద్దవాఁడ నగుటంజేసి మీకు నేను వందనముల నాచరింపను. విద్యచేతఁగాని, తపస్సుచేతఁగాని,వయస్సుచేతఁగాని యెవఁడు వృద్ధుండో వాఁడే నమస్కారమునకుఁ దగినవాఁడు. అది యట్లుండుఁగాక! సత్పురుష సన్నిధానము గలుగుటంజేసి పుణ్యలోకములను బాసిన వగనుమాని యుండెద. సత్పురుషు లెల్లవేళలయందుఁ బుణ్యానుష్ఠానమును జేయుచుందురు. దురాత్ములు పుణ్యకర్మముల నథికరించి నరకావాసమును

గలిగించు పాపకర్మముల నెల్ల నహంకారమునంగాదె యొనర్చి భ్రష్టు లగుదురు. ఎంతకాలముగనో సంపాదించినపుణ్యఫలమును నే నహంకరించి గదా నశింపఁజేసికొంటిని. కావునఁ బ్రాజ్ఞుండు తన మేలుగోరి సర్వశాస్త్రముల నభ్యసించి వినయముతోఁ గూడికొని భగవదర్పణముగా ననేకయజ్ఞముల నొనర్చి తపస్సు పెంపునఁ బుణ్యలోకముల కేగి యభిమానమును, గామమును, క్రోధమును, మోహమును వదలి సుఖించును. కర్మవశంబునఁ బ్రాణులకు సుఖదుఃఖములు గలుగుచుండును. వానిని నాత్మశక్తిచే నిరాకరింప నలవి గాదు. ప్రపంచములో నుండు చరాచరవస్తుజాలము లన్నియుఁ దమతమ కర్మవశంబునంగాదే యాయాకృతుల గోచర మగుచున్నవి. ద్వంద్వములలోఁ జేరిన సుఖదుఃఖము లనిత్యములు గావె? కావున వగచికాని, వగవకకాని యెద్దానిని సాధింపలేము. అని నిశ్చయించి నిండుమనస్సుతోఁ గర్మము ననుభవించుచున్నా నను టయు, నష్టకుండు మఱియు నయ్యయాతి కిట్లనియె.

రాజేంద్రా! పుట్టుకచే నెవ్వం డధికుఁడో వాఁడు పూజ్యుఁడు కానేరఁడు. విద్యచేతను దపంబు పెంపుచేతను నధికుండే పూజ్యుండు. అది యట్లుండనిమ్ము. నాకంబున రమణీయంబైన నందనవనమునందుఁ గామరూపివై యనేకసుఖములనొందితి నని వక్కాణించితి గాదే? అట్టిపుణ్యస్థల మెట్లు వదలితివి? నీపుణ్య మెట్లు నశించెను? పుణ్యలోకవాసుల కును బుణ్యములు నశించునే? అట్టివా రెచ్చోటి కేగెదరు? వివరించి సవిస్తరముగఁ జెప్పు మనఁగా నష్టకునకు యయాతి యిట్లనియె. ఈలోకమున ద్రవ్యమును బోఁగొట్టికొనినవానిని, బంధుమిత్రాదులు వదలిపోవునట్లు నాకంబునఁ బుణ్యము నశింపఁగనే దేవతలందఱును వానిని వదలి పోవుదురు. కానఁ బుణ్యము నశించినంతట నచ్చో వసింప నలవి కానేరదు. గొప్పవారిని సత్పురుషులను నవమానించినంతటనే పుణ్యము నశించుట సహజముకాదే? పుణ్యలోకవాసులగు సుకృతులు నివసింపఁగనే వారు నరకదుఃఖము ననుభవించునిమిత్తము భూలోకమునఁ గాకులకు, గ్రద్దలకు నాహారము లగు దేహముల నెత్తి సంతానవంతులై పుత్త్రాది శరీరములచే వృద్ధిఁ బొందుదురు. కావునఁ బ్రాజ్ఞుండు నరకకష్టమును దొలఁగించు పుణ్యకర్మములనే చేయుచుండు. నింద్యములగు పాపకర్మమును

నిరసించుచు దానిచెంతఁ బోకుండును. అని చెప్పఁగా నయ్యష్టకుండు యయాతికి మఱియు నిట్లనియె. కాకులను గ్రద్దలను హింసించుచుండ వా రేశరీరములలో నెవ్విధంబున నుండుదురు? భూలోకమున నరక మనఁగా నెయ్యది ? తెలుపవలయు నని యయాతి నడుగ, నామహీ నాథుండు వెండియు నిట్లనియె. క్షీణపుణ్యు లగుచుండఁగనే వారు భూలోకమునకుఁ ద్రోయఁబడి భౌమనరకము ననుభవింతురు. భౌమనరక మనఁగా సంసారము. సంసారము జననమరణచక్రము. అందుఁ జిక్కువడిన వానిని భార్యాపుత్రాదులు క్రూరరాక్షసులవలె బాధింతు రనఁగా విని యష్టకుండు వెండియు యయాతి నిట్లడిగెను.

పుణ్యము క్షీణించి స్వర్గమునుండి నిరయమును బొందినప్పుడాజీవి యవయవములు చిందరవందరలు గాకుండునా? ఇంద్రియాదులు వారల కెట్లు కలుగును? జన్మాంతరములను బొందునిమిత్తము వారలు గర్భముల నెట్లు ప్రవేశించుదురు? అని యడుగ యయాతి వాని కిట్లనియె. పుణ్యము క్షీణించి మర్త్యలోకమును జెందుజీవుల కపరిమిత మగు దుఃఖము కలుగును. ఆ దుఃఖముచే వారికి జలమయమగు దేహ ముత్పన్న మగును. ఆయుదకశరీరముతో జీవుఁడు చెట్లు, నోషధులు మొదలగు వానిం బ్రవేశించి వానిని భుజించు మానవులు, తిర్యక్కులు మొదలగుప్రాణులలో దమపుణ్యపాపకర్మముల కనుగుణముగఁ జొచ్చి రేతస్స్వరూపమునుబొంది రేతస్సు వర్షించు పురుషుని ప్రేరణంబున స్త్రీల గర్భకోశమును జేరు ననఁగా నష్టకుం డిట్లడిగెను. మహానుభావా! నీవు సృష్టియొక్క యథార్థము నెఱింగినవాఁడవుగఁ దోఁచుచున్నావు. ఇప్పు డొక్కసందేహము కలిగినది. జీవుఁడు గర్భకోశమునందుఁ దన కళా మాత్రమునఁ జేరునా? కాకున్న వేఱొక శరీరోపాధిని బడయునా? చెవులు, కన్నులు మున్నగు నింద్రియముల నెట్లు పొందును? దీనిని వివరించి చెప్పు మని యడిగెను. అప్పు డష్టకునకు యయాతి యిట్లనియె. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము నను పంచ ప్రాణవాయువులును; మనస్సు, బుద్ధి, త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాదము, పాణి, పాయువు, ఉపస్థము అను యింద్రియములతోఁ జేరి, పృథివ్యప్తేజోవాయ్వాకాశము లను నైదుమహా

భూతములయొక్క సూక్ష్మరూపములచే నావరింపఁబడి భోగమునకు సాధనమగు లింగదేహముతో రేతస్సైన జీవుండు ప్రారబ్ధకర్మవశమున స్త్రీగర్భమును బ్రవేశించి కుండకు మన్నువోలె వికృతికి కారణములగు పంచమహాభూతముల సూక్ష్మరూపముల చేరికచే శరీరము వృద్ధిఁబొంది సర్వావయవములతోఁ బూర్ణుండై యుచితకాలమున గర్భకోశమునుండి వెడలి పూర్వజన్మవాసనచేఁ దాను మానవుఁడ నేనునభిమానముతో వీనులతో శబ్దమును, నేత్రములతో రూపమును, ముక్కుతో గంధమును, నాలుకచేత రసమును, జన్మముచే దారకుడును, మనస్సుచే నీయైదింటిని నెఱుఁగును అని చెప్పఁగా, విని యష్టకుండు యయాతి కిట్లనియె. ఈ లోకమునఁ జచ్చినవానిశరీరము దహనాదికర్మములచే నశింపఁగా వాని యింద్రియములు సైతము నశించుచున్నవిగావె? అట్లుండ నతనికి లింగశరీర మెట్లు గలుగు? ఆశరీరముతో గర్భాశయము నెట్లు చొరఁగలండు? అని యడుగఁగా వానికి యయాతి యిట్లనియె. చచ్చినవాఁడు ఈలోకమునఁ దనస్థూలశరీరమును వదలి వాయువు గంధమును గొనురీతి ప్రాణములను మాత్రము గొని లోకాంతరమునకుఁ బోవును. ప్రాణములతో వాని సర్వేంద్రియములును వానివెంటఁ గొనిపోవును. ఈలోకమున దహనాది కర్మములచే వినాశనము వాని స్థూలశరీరమునకుఁ దప్ప లింగశరీరమున కెంతమాత్రము కలుగనేరదు. కావున నాలింగశరీరముతోడఁ గూడి జీవుఁడు తన పూర్వభవమునందలి సుకృతవిశేషమున జ్ఞానముతో నుండు మనుజులలోను, దుష్కృతవిశేషమున జ్ఞానములేని తిర్యక్కులు ప్రాఁకుడు జంతువులు జడపదార్థములును మున్నగువానిలోఁబుట్టి వానియాకారమును బొందును అని చెప్పఁగా నష్టకుఁడు యయాతిని దేని నాచరించిన మనుజుఁడు సద్గతి కాధారమైనపుణ్యలోకముల సాధింపఁగలఁడు అని యడుగఁగా, వానికి యయాతి యిట్లని చెప్పెను. పుణ్యలోకములను సాధించునవి తపము, దానము, శమము, ఇంద్రియముల జయించుట, హ్రీయు. ఋజుమార్గమున వర్తించుట, సర్వభూతములయెడ కృప, తాను సర్వభూతాంతరుండని యెఱుంగుట, తనయందు సర్వభూతము లున్నవని తెలియుట, సర్వభూతములయందు సమభావము నని యెఱుంగుము. దురభిమానినై తన్ను సర్వము దెలిసిన

వానిఁగ భావించికొని యితరుల నవమానించువానికిఁ బుణ్యము నశించు టయ కాక వాఁడు గావించిన వేదశాస్త్రాధ్యయనఫలమును నైతము బొందకుండును. కావున పరుల కవమాన మెంచక దాఁజేయు కర్మఫల మును భగవంతున కర్పించి త న్నొరులు స్తుతింపగా నుబ్బక, దూషించిన బరితాపపడక, సజ్జనుల సత్కరించుచుఁ గాలముఁ గడతేర్పవలయును. అట్టి సుకృతి పరలోకమున శాశ్వతసుఖముల ననుభవించు ననఁగా విని యష్ట కుండు యయాతిని "ఆర్యా? బ్రహ్మచారులు మొదలగువా రేక్రియల నాచరించి పరమగతిం బ్రాప్తింతురు? ఆనతీయవే" యన యయాతి యిట్లనియె.

బ్రహ్మచారి గురుశుశ్రూషయం దప్రమత్తుండై యాచార్యుండు పిలుచుచుండఁగ వచ్చి వేదాధ్యయనమును గావించుచు, గురుకార్యము లనుజెప్పకయే తానుచేయుచు నాచార్యుండు నిదురపోయినపిదపఁ దాను నిదురించుచు, నాచార్యుండు మేలుకొనుటకుఁ బూర్వమే తాను మేల్కొనుచుఁ, గఠినాత్ముఁడుగాక, జాగరూకుఁడై, ధైర్యమునుబూని, జితేంద్రియుఁడై, భగవద్ధ్యానమునందు మనస్సును నిలిపియుండవలయును. ఇఁకను గృహస్థుఁ డెట్లు వర్తించి పరమగతిం బ్రాపించునో చెప్పెద వినుము. వాఁడెవ్వనిని యాచింపక ధర్మమార్గమున నార్జించినధనమును యజ్ఞ కర్మములను జేయుటయందు వెచ్చించుచు, నతిథుల సత్కరించుచు, దానమొసంగుచు ధర్మాత్ముం డై చరింపవలయును. వానప్రస్థాశ్రమమున నుండు మహనీయుఁడు పట్టణవాసమును వదలి, వనమునకుం జని యెండ వాన యనక ద్వంద్వముల నొక్కరీతిగా భావించుచు, దపోవ్రతపరాయ ణుండై తన యాశ్రమధర్మముల చొప్పున శిలోంఛవృత్తులచే లభించిన యాహారవస్తువులను నతిథ్యభ్యాగతుల కొసంగుచు, నెవ్వారిని దనజీవిక నిమిత్త మాహారాదుల నొసంగుమని బాధింపక, నియతాహారుండై కాలముఁ ద్రోయవలయును. యతి శిల్పాదివృత్తుల నవలంబింపక జితేంద్రి యుండై, సంగరహితుండై, యొంటరిపాటున దేశములఁ గ్రుమ్మరుచు, మనుజులు తిరుగని స్థలములయందును, దేవాలయములయందును నివసించుచు, లోకములోని విషయాదులను దదుపరిభోగములను దుచ్ఛములు, నిస్సారము లని భావించి వైరాగ్యమునే గొప్పఁగా నెంచి

చరింపవలయును. ఇట్టిసుకృతులు తమకు ముందటి పదితరములవారిని, వారికి వెనుకటి పదితరములవారిని దమ్మును రక్షింతురు. అని చెప్పఁగా మును లెన్ని విధములవా రున్నవారు? వారిధర్మములను మోక్షమునకు, మార్గములను నెఱింగింపుమని యష్టకుం డడుగఁగా వానికిఁ దపోధనుం డైనయయాతి యిట్లనియె. వనమునందే నివసించుచు గ్రామమున నుత్పన్నమైనపదార్థముల నుపయోగింపక, తపస్సునందే సదాయాసక్తులునునై గ్రామములవసించుచు సన్న్యసించి కృషిపాశుపాల్యాద్యుదరపోషణవ్యాపారములయం దనాసక్తులై, వంశమువారియెడఁగాని, మిత్రులయెడఁ గాని, పక్షపాతబుద్ధి లేక, పరమహంసపదవిం గాంచి, కౌపీనమాత్ర వస్త్రధారణము చేసికొని, ప్రాణములను మాత్రము నిలుపుకొనుటకు వలసినంతయాహారమును గొనుచు, సర్వకర్మసన్న్యాసమును జేసి, జితేంద్రియులై, బ్రహ్మీభూతచేతస్కులును, మోక్షమును బొందుదురు. కొంద ఱాహారమును వర్జించి కృశాంగులై యుందురు. మఱికొందఱు సుఖదుఃఖములను, మానావమానములను, శీతోష్ణములను, ద్వంద్వములయందు భావమును సమముగాఁ బెట్టుకొని వర్తింతురు. కొందఱు మౌననియమము నవలంబించి యెల్లప్పుడును పమాధియందుఁ బరతంత్రులై యుందురు. వీరును మోక్షమును బడయుదురు. మఱికొందఱు మహానీయులు బాలుఁడు నిదురించుచుఁ బాలుగుడుచువిధమున సర్వసమత్వము గల్గి యాహారమును జేతితోఁ గొనక పశువులవలె నోటితో గ్రహించుచు, ననన్యచింతాసక్తులై పరబ్రహ్మమునే యెల్లప్పుడు ధ్యానించుచు మోక్షమునుబొందుదురు. అని చెప్పఁగా నష్టకుండు యయాతిని "నార్యవర్యా! వనమునందు వసించుచు గ్రామ్యపదార్థముల నొల్లక తపోనిష్ఠులగు యోగులా? లేక పట్టణమునందే వసించుచుఁ బరమహంసాశ్రమమునఁ జరించుచున్నయోగులా? ఎవ్వ రీ రెండుతెగలలోని వారిలోఁ ద్వరితగతి ముక్తు లగుదురు" అని యడుగ యయాతిపట్టణవాసి యగు పరమహంసయే త్వరితముగ ముక్తుఁ డగు ననియె. సర్వకాలములయందును బ్రహ్మనిష్ఠసలుపుచు సంగరహితుండైనయోగి పాపకర్మము లాచరించినను, వానిని దోషములు జెందవు. పాపాత్ముండు ధర్మకార్యములను జేసినను వాని కవి మంచిఫలముల నొసంగవు.

కల్మషరహితుం డే కార్యమును జేసినను నయ్యది ధర్మమే యగును. ప్రాయంపువాఁడైనను, రాగాదులకులోఁగక తపోనిష్ఠమెయిఁ జరించువాఁ డుత్తముఁ డనఁదగు నని చెప్పఁగ నయ్యష్టకుం డో రాజవంద్యా! నీవలన నంతయును దెలిసితి. నాకుఁ బుణ్యలోకములు గలవా? తెలియఁ జెప్పు మని యడుగుటయు యయాతి భూలోకమున గోవులును నశ్వంబులును నెన్ని యున్నవో యన్ని పుణ్యలోకములు నీకుఁ గలవని నుడువఁగా నయ్యష్టకుం డయ్యయాతి కిట్లనియె.

### యయాతి యష్టకాదులతోడ బుణ్యలోకముల కేగుట

మహారాజా! నీవు భూమిలోనం బడకుము. నే నాచరించియుండు సుకృతఫల మగుపుణ్యలోకావాసము నీ కొసంగెద. దానిం గైకొను మనగా నయ్యయాతి యష్టకున కిట్లనియె. ఓసుకృతీ! వినుము. నే నీలోకమున మున్నున్న కాలమునందు నాయిష్టానుసారముగ మితిలేని గోదానములను భూదానములను నొనర్చియుంటిని. ఇప్పుడు నావర్ణధర్మమున కుచితముగాని యీప్రతిగ్రహము నేను గావింపనేరను. ఆపద సంభవించినపుడు సైతము బ్రాహ్మణుండు గానివాఁడు చేయి చాచి యొరునియొద్ద నున్నయెద్దానినైనను బ్రతిగ్రహింపరాదు. ఇంతేల? క్షత్రియపత్ని యైన బ్రాహ్మణియుఁ బ్రతిగ్రహమును జేయఁగూడదు. నే నెప్పుడును జేయి చాచి యొరుల సొమ్మును గ్రహించి యెఱుఁగను. వెండియు నిప్పుడు నే ననుచితకర్మము ననుష్ఠించి నావర్ణధర్మమునకు విరోధము చేయను. ధర్మవిరోధమున మఱల పాతకములు గలుగును. అని చెప్పఁగా నా రాజునకుఁ బ్రతర్దనుఁ డనువాఁ డిట్లనియె. మహాత్మా! నేను ప్రతర్దనుఁ డనువాఁడను. వచింపుము. నాకుఁ బుణ్యలోకములు గలవా? ఉండినచో వానిని నేను నీకు నొసంగెద. గ్రహింపుము అనెను. వానికి యయాతి యిట్లనియె. ప్రతర్దనా! నీ వపారమైన సుకృతములను జేసినవాఁడవు. నీ వొక్కొక్కపుణ్యలోకమునం దేడేసిదినములు మాత్రము నివసించినను బహుకాల మనుభవింపఁ జాలినన్ని పుణ్యలోకము లున్నవి. కాని నావర్ణధర్మానుచితమగు ప్రతిగ్రహము నే నెంతమాత్రము నంగీకరింప ననెను. అంత వసుమంతుం డనువాఁడు యయాతి కిట్లనియె. లోకోత్త

రూఁడా! నే సుమదశ్వపుత్త్రుండను, వసుమంతుఁ డని నన్నుఁ బేర్కొం
దురు. నే నడిగినదానిని నాకుఁ జెప్పుము. నాకును బుణ్యలోకము లుండు
నేని నీవు వాని నాక్రమింపుము. ప్రతిగ్రహము నీవర్ణధర్మానుచిత మని
నీకుఁ దోఁచును; గాన నాపుణ్యలోకములను నీకొకతృణమునకుఁ గాని,
లేక, మఱియొక యల్పవస్తువునకుఁ గాని విక్రయమునకుఁ గొనుము.
అనఁగా వానికి యయాతి యిట్లనియె. సూర్యకిరణము లేయేలోకము
లలోఁ బ్రకాశించుచు నాలోకములను గాంతిమంతములుగఁ జేయుచుం
డునో యాలోకములలో నెల్ల నీవు సుఖోపభోగములను బుణ్యాత్ముం
డవై బహుకాల మనుభవింపఁ గలవు. అయినను మనుష్యుల ధర్మాధర్మ
ములను బరీక్షించుకాలచక్ర మొక్కటి కలదు. నేను దాని కెల్లప్పుడును
జంకి వర్తింతు. ఆచక్రము దీనిని గపటవిక్రయముగా నెన్ని, నాయాచ
రించినక్రయమును బరిశుద్ధముగ భావింపదు. ఆర్యు లాచరింపనిదానిని
నే నెట్లాచరింతు నని నుడువఁగా వసుమంతుం డో భూమిపాలా! కపట
విక్రయ ముచితము గాదంటివి. నాలోకముల నుచితముగా నొసంగెద.
కైకొని పుణ్యలోకముల కరుగుము. అని మఱలం జెప్పినను యయాతి
వానికిఁ బ్రత్యుత్తర మొసంగక యూరకుండెను. అంత నౌశీనరుం డగు
శిబియనువాఁడు యయాతిం జూచి యిట్లనియె. సత్పురుషా! నే నుశీనర
పుత్త్రుండను, శిబియనువాఁడను, నామాట నంగీకరింపుము. విక్రయము
ధర్మయుతముగాక కపటవిక్రయ మగుచో నాయిచ్చు నాపుణ్యలోక
ములం గొనుము. వానిని నేను మరల నపేక్షింపను. అనఁగా శిబికి
యయాతి యిట్లనియె. పుణ్యపురుషా! నీవు మనస్సున నొకప్పుడైనను
సాధుజనుల కవమానముఁ దలంపనివాఁడవు. నీ కనంతపుణ్యలోకములు
గలవు. అయినను రాజధర్మానుచితం బగు ప్రతిగ్రహమును నేఁ జేయ
నొల్ల నని మున్నె చెప్పియుంటిని. అనఁగా మొదటి పుణ్యమూర్తి
యైన యష్టకుండు యయాతికి మఱియు నిట్లనియె. అవనిపాలా!
వినుము. నీవు మాలో నొక్కరిపుణ్యము నైన గ్రహింపవైతి వేని,
మే మెల్లరము గూడి మాపుణ్యముల నన్నియును నీ కొసంగెదము.
ఆపుణ్యములకు ఫలమగులోకములను నీవు ధర్మాత్ముండవై యనుభ
వించుటకు మే మెల్లర మొప్పికొనెదము. మరల మాలో నొక్కర

మును బుణ్యలోకానుభవము నిచ్ఛగింపము. నరకమునకుఁ బోయెదము.
అని చెప్పఁగా యయాతి సాధుజనులగు మీమాటలను నే నిరాకరింప
లేను. మీ రెట్టిచేయు మనియెదరో దానిన యాచరించెదను. అని చెప్పి
ఊరకుండె. అంత వారెల్లరు నంతరిక్షమున నొకయాశ్చర్యముం గనిరి.
అంతట తటాలున వారి కైదు కనకవిమానంబులు గానవచ్చినవి. అప్పుడు
వారు యయాతి నివియేల మనవైపునకు వచ్చుచున్న వని యడిగిరి.
అంత నయ్యయాతి యీవిమానములు మీకొఱకు దివినుండి యేతెంచి
నవి. మీకొఱకుఁ బ్రతీక్షించియున్నవి. అని చెప్పఁగా నష్టకుం
డయ్యయాతి కి ట్లనియె. రాజా! నీ వీవిమానములలో నీ కిష్టమైనదాని
నెక్కి స్వర్గమునకుఁ బొమ్ము. మేము నీవెంటన వచ్చువారము. అని
చెప్పఁగా నయ్యయాతి మన మందఱ మేకకాలమున నీవిమానము
లెక్కి యొక్కట స్వర్గమున కేగుదము అని చెప్పఁగా వా రంద ఱట్లొన
ర్చిరి. అంత నందఱును విమానముల నెక్కి వెంట రాఁగా సురలోక
మునకుఁ బోవునప్పుడు శిబి విమానముమాత్ర మన్నింటికంటె వేగము
గను, ముందుగను, బఱచుచుండుటంజూచి యయ్యష్టకుండు యయాతి
కిట్లనియె. ఇంద్రుండు నాకు నెచ్చెలి. కావున నందఱకు మునుపు నేను
బోయి వానిదర్శనము గావింపఁ దలంచియుంటి. అట్లుండ మనలో నంద
ఱకు మున్ను శిబి యేమికారణమున ముందేగుచున్నాఁడో యని యయా
తిని నడుగఁగా వాఁ డిట్లనియె. మహానుభావా! వినుము. మీకంటె
శిబి దానమునందును, దపస్సునందును, సత్యమునందును, ధర్మాచరణము
నందును నధికుండు. ఇతండు బ్రహ్మలోకమున కేగుటకుఁ దగినవాఁడు.
ఆకారణంబున మనల నెల్ల మిగిలి పోవుచున్నవాఁడు. అని చెప్పఁగా విని
యష్టకుం, డో రాజా! నీ వెవ్వండవో మాకు వివరముగఁ దెల్పుమనఁగా,
యయాతి వాని కిట్లనియె. ఆర్యా! ఈయర్థమును నేను మున్నే వివరిం
చితి. నేను యయాతిని. నహుషపుత్త్రుండను. పూరునకుఁ దండ్రిని. మీకు
మాతామహుఁడను. నేను రాజ్యమును బాలించినవిధమును దానముల
నేమి యొనర్చితినో వానిని మున్నే మీకుఁ దెలిపితిని. ఇప్పుడు మీవలనఁ
బుణ్యలోకములను మఱల సాధింపగలిగితిని. ఈనాచరిత్ర నెల్లను
బ్రాహ్మణసభలో నుపన్యసించు పుణ్యపురుషుఁడు మనవలెఁ బుణ్యలోక

ములను సాధించుము. అని చెప్పి యయాతి తనదౌహిత్రుల నిష్కల్మష ములగు పుణ్యకార్యములయొక్క మాహాత్మ్యమువలన స్వర్గమును బ్రవేశించి సుఖముగ నుండె నని చెప్పఁగా జనమేజయుండు వైశం పాయనమునివరున కిట్లనియె.

మునీంద్రా! అట్టి మహనీయుండగు యయాతివంశవర్ధనుం డగు వాఁడును, నాతనికిఁ బిదప రాజ్యభారమును వహించినవాఁడు నగు పూరువంశమునందుఁ బుట్టినవారి సచ్చరిత్రములవినుటకు మనస్సు కుతూ హలపడుచున్నది. వారు గుణముచేతను, మహిమచేతను, ధైర్యబలముల చేతను బెంపొందినవారు. అట్టిమహనీయుల సత్కథలను వినను వినను మిక్కిలి యానందము కలుగుచున్నది. కావున విస్తరించి చెప్పవలయు నని యడుగఁగా, నమ్మునీంద్రుం డన్న రేంద్రున కిట్లనియె. పూరుభార్య లిరువురు, పౌష్టియుఁ, గౌసల్యయు ననువారు. వారిలోఁ బౌష్టికిఁ బ్రవీర, ఈశ్వర, రౌద్రాశ్వులనువారు ముువ్వురు కుమారులు పుట్టిరి. ఆసుతులలోఁ బ్రవీ రుండు ప్రబలవిఖ్యాతుండై శూరసేని యనుదానిం బెండ్లియాడ వారికి మనస్యుఁ డనువాఁడు జనించి తండ్రి యనంతరము రాజయ్యెను. వానికి సౌవీరి యనువనితామణి భార్యయయ్యెను. వీరి కన్యగర్భనుండు మున్న గా ముువ్వురు పుట్టిరి. మఱియుఁ బూరుపుత్త్రుఁడగు రౌద్రాశ్వునకు మిశ్ర కేశియను నప్సరసాంగనయందు ఋచేయు, కక్షేయు, కృకణేయు, స్థండి లేయు, వినేయు, జలేయు, తేజేయు, సత్యేయు, సన్నతేయువు లనువారు పదుగురు జనించిరి. వీరిలో ఋచేయు వనువాఁడు రాజై నెగడె. వీనిపుత్త్రుం డనాధృష్టి యనువాఁడు. ఇది పూరుని పౌష్టిభార్యకుఁ గలి గిన వంశపరంపర. మఱియు పూరుభార్యయగు కౌసల్యావంశమును జెప్పెద వినుము. కౌసల్యకు జనమేజయుం డనువాఁడు గలిగెను. వీఁడు మహాతపస్వియును, గర్మఠుండును నై విశ్వజిద్యాగమును, మూఁడశ్వ మేధయాగములను జేసి వినుతి కెక్కెను. ఈజనమేజయునకు మాధవి రైన యనంత యనుభార్యయందుఁ బుత్త్రుండు జనించి పరాక్రమవం తుఁడై తూర్పుకొండవఱకు బూర్వదిగ్దేశములనెల్ల వశపఱచుకొని యేలుటంజేసి ప్రాచిన్వంతుం డనుపేరుతో వెలసెను. వానికి యాదవి యగు నశ్మకియను నంగనామణి భార్యయై సంయాతి యను సుతుం

గనెను. సంయాతి దృషద్వంతునికూఁతు రగుకోమలియందు "అహం యాతి యను సుతుం బడసె. వానికిఁ గృతవీర్యపుత్త్రి యగుభానుమతి యందు సార్వభౌముండు జనించి బలశౌర్యములయందు వాసి కెక్కి క్షత్త్రరాజు లనేకులం గెలిచి కేకయరాజు కూఁతురు సునంద యనువరాంగిని బెండ్లియాడె. వీ రిరువురకును జయత్సేనుం డనువాఁడు గలిగెను. వీఁడు సుశ్రవ యనువిదర్భరాజుపుత్త్రికను బెండ్లాడి యవాచీనుం డను సుతుం బడసెను. అవాచీనుండు వైదర్భియగు మర్యాదయందు అరిహుం డను పుత్త్రుం బొందెను. వాని కాంగియందు మహాభౌముండు గలిగెను. వానికిఁ బ్రసేనజిత్పుత్త్రియగు సుయజ్ఞయందుఁ గుమారుండు పదివేల యజ్ఞములు చేసినవాఁ డయుతనాయి యనువాఁడు జనించె. వానికిఁ గామ యనుదానియం దక్రోధనుఁ డనువాఁడు జనించె. వానికిఁ గళింగరాజుకూఁతు రగు కరంభయందు దేవాతిథి యనువాఁడు గలిగెను. వానికి విదేహరాజపుత్త్రిక యగుమర్యాదయం దరిహుండు పుట్టెను. అతనికిఁ బుత్త్రుం డంగరాజుకూఁతు రగు సుదేవయందు ఋక్షుండు జనించెను. ఈతనికి దక్షపుత్త్రిక యగు జ్వాలయందు మతినారుం డుద్భవిల్లెను. మతినారునకు "అతిరథుఁడు, ద్రుహ్యుఁడు అప్రతిమద్యుతి" యను మువ్వురుపుత్త్రులు గలిగిరి. మఱియు నామతినారుండు ధర్మజ్ఞుం డై సరస్వతీతీరమునందుఁ బండ్రెండేండ్లు సత్త్రయాగమును గావించి ప్రఖ్యాతుం డయ్యె. ఆసత్త్రయాగము సంపూర్ణ మగుడు వానివినయసౌజన్యముల కెద మెచ్చి సరస్వతి నది స్త్రీరూపమును ధరించి వానికిం బొడసూపి కాముకయై తన్నుఁ బొందు మని ప్రార్థింప వాఁడు దానికోర్కి కియ్యకొనెను. అప్పుడు వా రిరువురిసమాగంబునఁ దంసుం డనువాఁడుగలిగి వంశకర్తయయ్యె. ఆతంసునకుఁ గాళింది యను దానియం దాళినుండు గలిగె. ఆయీళినుండు రథంతరియనుదానిం బెండ్లాడి దుష్యంతుఁడు, శూరుఁడు, భీముఁడు, ప్రవసుఁడు, వసుఁడు ననఁగా నేవురు పుత్త్రులఁ గాంచెను. వారలలో దుష్యంతునకు విశ్వామిత్త్రపుత్త్రిక యగు శకుంతలయను లలనామణికి భరతుం డగు జగన్మోహనాకారుండు సుతుండై జనియించెనని విని జనమేజయుండు శకుంతలోపాఖ్యానమును సవిస్తరముగాఁ జెప్పు మనుటయు వైశంపాయనుం డిట్లని చెప్పఁదొడంగె.

## శకుంతలోపాఖ్యానము

పూర్వ మొకప్పుడు విశ్వామిత్రుం డను ఋషివర్యుండు తపము నతితీక్ష్ణంబుగఁ గావించుచుండె. ఆతపస్సున కింద్రుండు వెఱఁగంది మేనక యను దేవవేశ్యం బిలిచి యి ట్లనియె. ఓ మేనకా! నీ వప్సరఃకాంతలలో మిగులఁ జతురత గలదానవు. లావణ్యవతివి. గుణముల నధికురాలవు. ఇప్పుడు భూలోకంబున విశ్వామిత్రుం డనురాజు తీవ్రతపంబు లాచ రించుచున్నవాఁడు. తపంబు పూర్తి యగుచో దేవతల కేమైన నిబ్బంది కలుగునని నాకు భయము కలుగుచున్నది. నీ వతనిపాలికిం జని నీలావణ్య మును జాతుర్యమును జూపి యాతనికిఁ దపోభంగము గావింపవలయును. అప్పటికిఁగాని నామనస్సు కొందలంబు దీరదు. ఇది యిప్పుడు నీవలన దేవ తల కగత్యము కావలసినపని. అనిన మహేంద్రునకు దేవవేశ్య మేనక యి ట్లనియె. సురపతీ! నా కిప్పుడు మహాకార్యము నియోగించితివి. విశ్వామిత్రుండు సామాన్యుండు కాఁడు. మొట్టమొదటఁ దాను రాజుగా నుండి తపోబలంబున బ్రాహ్మణుఁ డయ్యెను. శౌచనిమిత్తముగఁ గౌశిక యనుమహాప్రవాహముగల యేటి నొకదానిని సృజించెను. ఆయేటి మధ్యయందుఁ ద్రిశంకుండను రాజొకయాపదనుబొంది తండ్రిచే నశింపఁ బడి వ్యాధుండై యుండి తనభార్య మొదలగు పోష్యవర్గమును రక్షించు కొనియె. ఆదుర్భిక్షసమయము గడచినదుఁ బదంపడి యయ్యేటికిఁ బార యని పేరుఁబెట్టె ననియు మనము విందుము గాదె? మఱియు నవ్విశ్వా మిత్రుండు వసిష్ఠునంత మహనీయునితో మత్సరించి యాతనికిఁ బుత్ర శోకము నైతము గల్గించినవాఁడు కాదే! గురుశాపంబునఁ జండాలుఁడైన త్రిశంకునిచే యాగంబుఁ జేయింపఁగా నాయాగమున కాతనికి భయం పడిగాదే నీవును బోయి హవిర్భాగంబును గొనివచ్చితివి. అంతటఁ ద్రిశంకుఁ డాతని మహిమను పోషుఁడయాజి యయ్యెంగాదే? మఱియు నాత్రిశంకుని దేవలోకభ్రష్టునిఁగ మీరా రెల్లరు చేయఁగా నాతండు క్రిందఁబడుచుండఁ దన తపోమాహాత్మ్యమున వానిం గ్రిందఁబడనీయక యంతరిక్షంబున నిలిపి వానినిమిత్త మచ్చోటఁ బ్రత్యేకస్వర్గమును నిర్మిం చిన మహనీయుం డని యెఱుంగమే? ఆతం డతికోపస్వభావుండు. అలిగెనేని ముల్లోకములను దనదివ్యతేజస్సుచే దహింప సమర్థుండు.

ఆతనివలన లోకపాలు రగు మీ రందఱును భయపడియుందురు. అట్టి తపోమహిమగలవాఁడును, గోపనుండును నగువానిం జేర నైన మాబోఁటుల కలవి యగునే? అయినను నీవు సురపతివి. మాకు నాయకుండవు. నీయానతిమేరకుఁ బోయి నాచాతుర్యమును, విలాసమునుం జూపి యాతనితపంబున కంతరాయముఁ గలిగించెద. నాకు మేలుచేకూఱ ననుగ్రహింపుము. మలయమారుతమును, మన్మథుండును నాకాతని యాశ్రమంబునఁ దోడ్పడుట కుత్తరువొసంగుము. అని చెప్పఁగా నింద్రుం డట్ల ప్రసాదించె.

అంత మేనక యింద్రునిచేత ననుజ్ఞాతయై విశ్వామిత్రుఁడు తపస్సు చేయుచుండు నాశ్రమంబుం జేరి యామహానీయునకు మ్రొక్కి తనయిచ్ఛ మెయి నచ్చోట విలాసంబున విహరించుచుండె. అంత నొకప్పుడు మలయమారుతము మెల్లన వీవఁదొడంగె. ఆ పవనవేగమున కాయచ్చర చీర తొలంగఁగా సిగ్గుగదుర నదియు దానిని మెల్లన సవరించికొనుచుండె. లేఁతమావితీగెంబోలె లలితమైనదాని మేనిసౌందర్యమును బలుమాఱు మునివర్యుండు చూచిచూచి యపారవిభ్రమాతిశయంబునం జేసి దానియందుఁ బరవశుఁడయ్యెను. అవ్విధంబున మునివరుండు చెదరిన మనస్సుతో నున్నాఁడని వానిమన్మథవికారంబులం దెలిసి మేనకయుఁ దన యత్నము కొనసాగె నని మనంబున సంతసించి యాతనితో నిష్టగోష్ఠిఁ జిరకాల మేకదినంబుగాఁ దోఁపఁ గందర్పకేళిం దేలియాడుచుండె. అప్పుడు వారిరువురిసమాగమంబున మిక్కిలి సౌందర్యముతో ముద్దులు గులుకు మొగంబుతో నొకబాలిక జనించె. అంత మేనక యింద్రుండు తనకిడినకార్యము పూర్ణమయ్యెఁగా యని తలంచి మాలినీతీరంబున నాశిశువు నుంచి తనంతటఁ దాను దేవలోకంబున కరిగె. మహాక్రూరమృగసంచారముతో వెలయు నవ్విజనారణ్యంబున నాయేటిగట్టున విలాసంబులం జూపుచు, మనోజ్ఞంబగు నాశిశువును శకుంతపక్షులు తమ ఱెక్కలం గప్పి రక్షించుచుండె. అంతట మధ్యాహ్నం బగుడుఁ దత్సమీపంబున నాశ్రమంబు గావించుకొని తపం బొనర్చుచున్న కణ్వమహర్షి స్నానార్థం బేటి కరిగి దాని సమీపంబున శకుంతపక్షిఱెక్కలచే నాచ్ఛాదితయై యుండసోకకున్నదియు, నితరరక్షకు లెవరును నచ్చోట

లేనిదియు నగు నొకశిశువుం గాంచి యాశిశువును గణ్వుండాశ్రమంబు
నకుం దోడ్తెచ్చి శకుంతరక్షిత యగుటం జేసి దానికి శకుంతల యను
పేరిడి తన కూఁతుంబోలె నానాఁటినుండి యామహర్షి పెంచుచుండె.
తండ్రియుఁ, బ్రాణములఁ గాపాడినవాఁడును, నన్నమిడి పోషించువాఁ
డును, లోకమున మువ్వురు తండ్రులు. ఆయార్యవచనప్రకారంబు శకుం
తలయుఁ గణ్వమునినిఁ దనకుఁ దండ్రిగా భావించి యయ్యాశ్రమంపు
బనులయం దప్రమత్తురాలై మెలఁగుచుండె. ఇట్లుండ నయ్యాశ్రమంబు
నకుఁ బూరువంశసంజాతుండును, సత్తమగోత్రజుండును, బల పరా
క్రమ తేజో గాంభీర్యాదులు గలిగినవాఁడును, దనయాజ్ఞను శిరసా
వహించి విధేయతతో వర్తించుచుండు ప్రజలను ధర్మమార్గమున నేలు
చుండుటచేఁ దనరాజ్యమున నెప్పుడును బ్రజలకు క్షుద్బాధగాని, రోగ
ములుగాని, చోరభయముగాని లేకయున్నవాఁడును, దనరాజ్యమునఁ
బ్రజలందఱును దైవభయంబున సత్యనిరతులై యాగాదిపుణ్యకర్మముల
నెల్లప్పుడుఁ జేయుచుండుటచే వర్షములు కోరినట్లు కురియుచుండుటవలన
సస్యసమృద్ధియుఁ బశుసమృద్ధియుఁ గలిగియున్నవాఁడును నగు దుష్యంతుం
డను మహీపాలుండొక్కనాఁడు బంగారుతేరెక్కి యేనుఁగుల ఘీంకార
ములతోను, గుఱ్ఱముల సకిలింతలతోను, బండ్లబాటసైనడచు జనుల
చప్పుళ్ళతోను, నానాప్రకారము లగునాయుధములను ధరించిన శూర
భటుల కేకారింపులతోను, శంఖపటహభేరీకాహళాదినానావిధవాద్యశుభ
ధ్వనులతోను, భూమ్యాకాశమధ్యప్రదేశంబులు నిండఁగా మేడలపై
నూరేగింపుఁ జూచుచున్న పౌరజనంబు లీదుష్యంతుఁడు దేవలోకంబు
నుండి భువి కేతెంచిన మహేంద్రుఁడో యనుతలంపులతోఁ దనపైఁ
బూలవాన గురియింప, బ్రాహ్మణులు లొక్కవెంగి స్వస్తివచన
ముల నాశీర్వదించుచుండఁ బురము వెడలి వేఁటకుం బోయెను. వేఁటా
డుచు నొక ఘోరారణ్యమున ననేకక్రూరమృగములు తనుఁ జూచి దప్ప
పరుగెత్తుచున్నంత వానిపై బాణప్రయోగములను జేసియు, సమీపా
మున నున్నవానిని ఖడ్గములతో నఱికియు, నీటెలతోఁ బొడిచియుఁ,
జేతికిఁ జిక్కినవాని నొడిసిపట్టికొని వధించుచు, ననేకవిధములఁ జిత్ర
విచిత్రములుగ మృగములను సుఱుమాడుచుఁ దనవెంట వచ్చిన వేఁట

కాండ్రు చెల్లాచెదరై యాఖేటాయాసంబున నచ్చటచ్చట నిలిచిపోఁగా, రాజుమాత్రము వేఁటయందాసక్తి మెండై మృగముల వెంటఁదవిలి యల్ప పరివారము మాత్రము తన్నుఁ గాంచి వచ్చుచుండ నొకచోట మాలినీ నదీతీరంబున నానావిధపుష్పఫలభారమున వంగియుండు చెట్లతోను, దీఁగెలతోను, బొదళ్ళతోను శోభితంబై యా చెట్లపుష్పములలోని మకరందమును దనివితీరఁ ద్రావి ఝమ్మనుఝుంకారనినాదంబులతో నొప్పు భ్రమరసమూహములుగలదై, లేఁతచిగుళ్లను గడుపునిండ మెక్కి పంచమస్వనంబునఁ గూయుచుండు కోయిలలపిండు గలదై, చక్రవాక దంపతులు విలాసమునఁ బొర్లుట కింపైనయిసుకదిబ్బలుగలదై పవిత్రము లును నిర్మలములును నగు చల్లనినీటిప్రవాహము గలదైన యొకప్రదేశ మున నుండు కణ్వమహర్షియాశ్రమముఁ గాంచి, గంగాతీరంబున నున్న నరనారాయణాశ్రమంబువోలెఁ బవిత్రమై, నాకమునందలి నందనవనము వోలె శృంగారాస్పదంబై, వైశ్రవణునిచైత్రరథమునకు సమానమై, రామ ణీయకంబు నొదవించుచుఁ జూచువారికి మానసోల్లాసకరంబైన యువ్వనం బున లతాలలనలు తిన్ననిపిల్లతెమ్మెరలఁ గదలి రాలిన పుష్పాక్షతలచేఁ దనకు సేసలు పెట్టినట్లును, శృంగారభరితంబులై యంతరిక్షంబునఁ దిన్ననిఝుంకారరవంబుల నొప్పుతుమ్మెదదంపతులు తనకు దీవన లొప్ప నిచ్చునట్లును నొప్పుచుండ, ఘోరారణ్యమునందు నధిజ్య శరశరాస నంబును గేల ధరించి, తమ్ము తఱుముచుండ వేగంబునఁ బఱచు మృగముల నాఱడక వేఁటాడి యలసియున్న యారాజు శ్రమంబాఱఁగ నొడలిపరితాపము దీరునట్లు మాలినీనదీజలంబులపై నుండి శీతల వాయువులు వీచెను. అట్లు మనోహరంబై, సుందరంబై యుండు కణ్వాశ్రమము నారాజు ప్రవేశించి పోవుచుండ ఋషు లగ్నియందు సేతిని హోమము చేయఁగా నాహావిస్సును గొనిన, సుగంధధూమములచే నొప్పారుచున్న తీఁగెల గుబుళ్లతోఁ బెనఁగియున్న మ్రాఁకులకొమ్మలలోని పుష్పములురాలఁ బుష్పవర్జితములైనను నాకొమ్మలనే చుట్టితిరుగుచుండు మధుపప్రకరముల నానరనాథుండు చూచి యిట్టిది మహనీయంబయిన ఋష్యాశ్రమం బని తలపోసి, పోవుచుండఁగా ఋషికుమారుల వేద ధ్వను లాతనికి వినవచ్చెను. ఎడతెగక మును లగ్నిహోత్రమునందు హవి

స్సులను వేల్చుచున్నప్పుడు చెప్పు స్వాహాశబ్దము లాతనివీనుల కింపుఁ గొల్పెను. మఱియు నచ్చోట, మహర్షిగణ ప్రణీతవచనవిషయవిభాగవిని ర్ణయన్యాయనిపుణవిద్వత్సంభాషణఘోషము లాతనిమనస్సును సొక్కించెను. ప్రతిపక్షులకుఁ బైనిదోఁచకుండునట్లు ప్రమాణములగు వేదార్థక మీమాంసకవాక్యముల నిరూపించు విద్యార్థులవాదనిస్స్వనంబులకును, యజ్ఞప్రయోగప్రవీణులగు మహనీయులకును, వేదవిహితకర్మానుష్ఠాన తత్పరులగు ననుష్ఠాతలకును, సంతతతపోనిరతులగు మునివర్యులకును, నివాసంబై జగత్పావనంబై యున్న యయ్యాశ్రమంబు నారాజు చూచుచు, వీనుల కింపుగా సామగానములను బాడుచున్నట్లున్న చిలుకలపలుకులఁ గదలక వినుచున్న యేనుఁగులును, వానితొండములనుండి వెలువడు చల్లని నీటితుంపరల కాశపడి వానినీడయందు సుఖమున మెలఁగు సింహములును, విప్రులు వైశ్వదేవాదికర్మముల నొనర్చి భూతబలులు వెట్టఁగా వానిఁ దినుట కాశించి యొక్కచోటనే కలసియాడుచుండునవియు, సహజవైరమును మాని సహవాసమున నుండునవియు నగుమూషికమార్జాలములు గలిగిన యాశ్రమమహిమ కారాజు మిక్కిలి విస్మయమందెను. అప్పుడతఁ డత్యంతసంతుష్టస్వాంతుండై కాశ్యపుండైన కణ్వునకు నమస్కరించి వచ్చెద నని వెంటవచ్చినవారి నెల్ల దూరంబున నిలిపి తా నొక్కరుండై కణ్వమునీంద్రుపర్ణశాల కరిగి యచ్చోట నమ్మహర్షిం గానక యీయాశ్రమమున నుండువా రెవ రని బిగ్గరగా నఱచి పిలువఁగఁ దాపసస్త్రీవేషమున సహజసౌందర్యశృంగారమున నొప్పునదియు, నల్లనీలపరికుంచితకోమలకుంతలయు నగు శకుంతల యను కన్యక యరుదెంచి మహారాజలక్షణంబులతో నున్నవాఁడును, ననంతసౌందర్యవిలాసంబున జయంతునిం బోలినవాఁడు నగు నమ్మహాపురుషుని రాజుఁగా నెఱింగి యుచితప్రకారంబున నతిథుల కొసఁగుపాద్యము, నాసనము, నర్ఘ్యము మున్నగువిధులం బూజించి స్వాగతం బడిగి తా నప్పు డేమి సేయవలయు నని వినయముతో విన్నవించెను. అంత దుష్యంతుఁడు వనచరయైన యాకుసుమకోమలి యాదరంబున కత్యాశ్చర్యపడి దానితో నిట్లనియె. కోమలీ! ఈయరణ్యమున నుండు మృగముల వేఁటాడ వచ్చి యిచ్చటఁ గాశ్యపు లగు కణ్వమహామునిని దర్శించి సేవింపవచ్చితిని.

ఆమహానీయుం డెటువోయియున్నవాఁడు? అని యడుగఁగా రాజునకు శకుంతల యిట్లనియె. జనవల్లభా! నాతండ్రి యగు కణ్వుండు ఫలసమిత్తులను దేర వనమునకుఁ బోయియున్నవాఁడు. ముహూర్తకాలమాగినచో నాతఁ డిటకు వచ్చును. అని చెప్పఁగా శకుంతల వినయంబునకును మందస్మిత మృదుమధురవచనంబులకును సంతసిల్లి దానిం గన్యకగా నెఱింగి, సర్వలక్షణలక్షితంబులైన సకలావయవంబులచే మన్మథరాజ్యలక్ష్మినాఁదగు నద్దానిం గాంచి చలించిన హృదయముతో దాని కిట్లనియె. సుందరీ! నీ వెవ్వరికూఁతురవు? ఇట్టి రూపలావణ్యవిలాసవిభ్రమగుణసుందరాకారంబులతోఁ గూడినదాన విందుల కేల వచ్చితివి? నిన్నుం గనుగొనినమాత్రమున నామనము నీయందుఁ దగులువడియె. నీకులం బెఱుంగఁ జెప్పుము. మఱియు నొకసందియంబు. కణ్వమునీంద్రుండు నీకు జనకుండని యింతకుమున్న చెప్పియుంటివి గాదె? అమ్మునీంద్రుండు జితేంద్రియుం డని లోకఖ్యాతి గలదు. ధర్మదేవత యొకవేళ ధర్మమును దప్పినను దప్పుం గాని, యామునీంద్రుండు తననియమమును దప్పనేరఁడు. ఇట్లుండ నీ వాఋషికిఁ బుత్త్రిక వగు టెట్లగును? అని యడిగిన నారాజునకు శకుంతల తనవృత్తాంతంబు నంతయు నిట్లు చెప్పెను. ఒకప్పు డొక మునినాథుండు మా యాశ్రమంబున కేతెంచియుండి యిక్కమలాక్షి శకుంతల యనునది మీయాశ్రమమున నుండునది యెక్కడి వనిత దీనిజన్మ మెవ్విధము? అని యడుగఁగా నాసమక్షమున నక్కాశ్యపులు మిగులఁ బ్రియముతో నాజన్మప్రకారం బమ్మునికిట్లు చెప్పె నని యామువ్యంతునితో విశ్వామిత్త్ర మేనక సమాగమంబునఁ గాను బుట్టి తన్నుఁ దనతల్లిదండ్రులు కరుణలేక మాలినీతీరంబున శిశువుగానున్నప్పుడే వదలిపోఁగాఁ దన కెండసోకనీయక శకుంతములు తమ ఱెక్కలమఱువునఁ దన్ను బోషించుచుండఁగా గృపాళుండైన కణ్వమహర్షి యచ్చోటికి నేతెంచి సింహవ్యాఘ్రాదిక్రూరమృగసంచారంబున భయంకరమైయుండు నవ్వనంబునఁ దనయునికి శంకించి తన్ను వాత్సల్యముతో నీయాశ్రమంబునకుఁ దోడ్తెచ్చి నాటంగోలె తన్నుఁ దనకభిమానపుత్త్రికగాఁ దలంచుచుండుటను దాను గణ్వపాదులను నయ్యగాఁ బిలుచుచుంటిననియుఁ దనకు భయత్రాతయగుటం జేసియు, వారిచే నభివర్ధిత నగుటం జేసియుఁ

వారికిఁ దాను హృదయానందినియైన కూఁతు నైతి ననియుం జెప్పిన విధ
మంతయు సవిస్తరంబుగా శకుంతల సెప్పిన విని యమ్మహీకాంతుం
డి ట్లనియె.

"కోమలీ! నీచరిత్ర నంతను విని నంతట నీవు రాజకన్యవని తెలి
సెను. నీచక్కదనము, కాంతి, సుగుణసంపదయును జూడ నీ నారచీరలను
ధరించి యడవిపండ్లు దిని పర్ణకుటీరంబులయందు వాసముచేయుట నీకుఁ
దగదని నాయుద్దేశము. నీ వీమునిపల్లెయం దేల యున్న దానవు? ప్రీతితో
నాకుభార్యవై చంద్రకిరణములవలె నిర్మలములై, పొడవులై మనోహరము
లైన మేడలయందుఁ గోరినసౌఖ్య మనుభవింప నియ్యకొనుము. నారాజ్య
మంతయు నీయధీనమైయుండును" అని చెప్పఁగా నాచంచలాక్షి ఫలములఁ
గొనితేర నడవికేగియుండు మాయయ్య కణ్వముని వచ్చునంతకుఁ బ్రతీ
క్షింపుము. ఆమునీంద్రుం డనుమతింప నన్ను నీవు పెండ్లాడుము.
అని చెప్పగా దుష్యంతుం డాసుందరాంగికిఁ దనయందుఁ బొడమిన యను
రాగవిశేషం బుపలక్షించి మఱియు నప్పొలఁతి కిట్లనియె.

### దుష్యంతుండు శకుంతలను గాంధర్వవివాహంబునఁ బెండ్లి యగుట

కోమలీ! నామనంబు నీయందు ననురక్తమైయున్నది. బ్రాహ్మము,
దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము,
పైశాచము నన నెనిమిదివిధములు వివాహము లున్నవి. వానిలో
బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యవిధుల నాలుగు. బ్రాహ్మణులకును,
క్షత్రియుల కానాల్గు లెఱింగులతో గాంధర్వరాక్షసంబులును, వైశ్య
శూద్రుల కాసురంబును, నుచితవిధానము లని మను వ్యాఖ్యానించె.*

* అష్టవిధవివాహములు (మనుస్మృతి 3-వ అధ్యాయము):—బ్రాహ్మము ౧, దైవము ౨, ఆర్షము ౩, ప్రాజాపత్యము ౪, ఆసురము ౫, గాంధర్వము ౬, రాక్షసము ౭, పైశాచము ౮. అని వివాహము లెనిమిది తెలియవలెను. వీనిలో బ్రాహ్మణులకు నాలుగును, క్షత్రియులకు ఆఱును తగినవి. క్షత్రియులకు వలె వైశ్యులకు రాక్షసముఁ గూడదు. బ్రాహ్మణులకు మొదటి నాలుగును ముఖ్యములు. రాక్షసము క్షత్రియునకే ముఖ్యము. వైశ్యశూద్రులకు నాసురము. ఆ యైదింట మూఁడు ధర్మ్యములు. రెండు అధర్మ్యములు. పైశాచమును అసురమును జేయఁ గూడదు. కలిసిగాని వేఱువేఱుగాఁ గాని, గాంధర్వము, రాక్షసము ఇవి రెండును రాజులకు ముఖ్యములు.

ఏకాంతమున వధూవరులు పరస్పరము కామించి సమ్మతించి యొకరితో నొక రాశచే నప్పుడే కలియుట గాంధర్వ మనఁ బడును. ఇది

---

౧. వేదములు చదివి యాచారముగలిగి తనకులధర్మముల కనురూపుఁడైన వరునిఁ బ్రార్థించి పిలుచుకొనివచ్చి వానికిఁ గన్య నొసంగుట బ్రాహ్మ మనఁబడును.

౨. తనకులమువాఁడైన యజ్ఞమున ఋత్విక్కుగా నుండువానికిఁ గన్య నలంకరించి యిచ్చుట దైవ మనఁబడును.

౩. ఒకయావును నెద్దునుగాని, రెండావులు రెండెద్దులనుగాని యల్లునివలనఁ గైకొని కూతు నిచ్చుట ఆర్ష మనఁబడును.

౪. అల్లునిని గూఁతును తనశక్తిఁ గొలఁదిఁ బూజించి మీరిరువురును సంసారమును జేయుచు సంతతివృద్ధిఁ జేయుఁడని యొప్పించి కన్య నిచ్చుట ప్రాజాపత్య మనఁబడును. ఈనాలుగును సర్వోత్కృష్టములు.

౫. చిన్నదాని తల్లిదండ్రులకుఁగాని, దాని బంధువులకుఁగాని, చిన్నదానికిఁగాని తనశక్తికొలఁది ధన మిచ్చి పెండ్లిచేసికొనుట యాసుర మనఁబడును.

౬. కన్యయును, వరుఁడును బరస్పరము సమ్మతించి యొకరితో నొక రాశచే నప్పుడే కలియుట గాంధర్వ మనఁబడును.

౭. వచ్చినవారిని గలవారిని, జంపికాని, కోసికాని, కొట్టికాని చుట్టములును కన్యకయును నేడ్చుచుండ బలవంతముగఁ దీసికొనిపోవుట రాక్షస మనఁబడును.

౮. నిదురించునదియు, పిచ్చిదియు, మైకముగలదియు, ఒంటిగా నుండునదియు నగుదాని బలవంతముగాఁ గూడి చెఱచి యెత్తికొనిపోవుట పైశాచ మనఁబడును. ఇది మహాపాతకమునకు హేతువును, గర్హితమును నగును.

బ్రాహ్మ విధిని పెండ్లియైనదానికిఁ బుట్టినకొడుకు, ఇరువదియొకవంశముల నుద్ధరించును,

దైవ మను విధిని పెండ్లియైనదానికిఁ బుట్టినవాఁడు పదునైదువంశములవారి నుద్ధరించును.

ఆర్ష మను విధిని పెండ్లియైనదానికిఁ బుట్టినవాఁడు, ఏడువంశములవారి నుద్ధరించును.

ప్రాజాపత్య విధిని పెండ్లియైనదానికిఁ బుట్టినవాఁడు పదమూఁడువంశములవారి నుద్ధరించును.

ఈచెప్పిన నాల్గువిధములైన పెండ్లిండ్లవలనఁ బుట్టినకొడుకులు బ్రహ్మతేజము గలవారై యుందురు.

రాజులకు ధర్మయుక్తమైన వివాహము. కావున నాలస్యమేల? తొల్లి
రాజులు గాంధర్వవిధిని వివాహ మగుట యుక్త మని చెప్ప నీవు విని
యుండవా? యని చెప్పఁగా నాలతాంగి సిగ్గునఁ దలవంచి రాజున కిట్టు
లనియెను. పరమదయాళువును, ధర్మస్వరూపులును నగు నాజనకు
లింతకు వత్తురు. వారు వచ్చి నన్ను మీ కొసఁగుదు రేని యవశ్యము
మీరు నన్నుఁ బాణిగ్రహణము చేయ నగును. అనిన, దానికి దుష్యంతుం
డిట్లనియె. కమలనేత్రా! వినుము. తన్నొరుల కిచ్చువిషయమునఁ
దనకు మఱి తాన చుట్టము. తాన దనకు గతి. తాన తనకుఁ గర్త.
గాంధర్వవివాహ మతిరహస్యము. అమంత్రకము. అని శకుంతలకు
దుష్యంతుండు గాంధర్వవివాహస్వరూపంబు సెప్పి యాయబల నొడం
బఱిచిన నప్పుడు రాజునకు శకుంతల యిట్లనియె. నరనుతా! ఇది ధర్మ్యం
బగు నేని యిప్పు డొకసమయ మొనర్పుము. నీప్రసాదమున నాకు
నుదయించునందనునకు నీ వుండఁగనే మిక్కిలిప్రియమున యౌవరాజ్య
పట్టాభిషేకముఁ జేసెద నని యనుగ్రహబుద్ధితో వరము దయసేయుము.
అటు లగునేని మన కిరువురకు నిప్పుడే సంగమ మగు ననఁగా విని రాజు
శకుంతల కెంతయు సంతోషంబున దాని కోరినవరం బిచ్చి గాంధర్వ
వివాహంబున నభిమతసుఖంబు లనుభవించి యక్కోమలి వీడ్కొని
నిను మాపురంబునకుఁ దోడ్కొని తేరఁ దగువారలఁ గణ్వమహాముని
పాలికిం బుత్తెంచెద నని యూఱడించి కణ్వుం డెఱింగిన నిందుల కలిగి
యేమి చేయునొకో యని మనమునఁ జింతించుచు నిజపురంబునకుఁ
జనియె. ఇట శకుంతలయుఁ దనచేసినదాని మునివరుం డెఱింగి యలి
గెడునో యని వెఱచుచుండెను. అంత నమ్మహాముని వనమునందుండి
కందమూలఫలంబులఁ గొని చనుదెంచి తాఁదెచ్చినపదార్థము లటఁబెట్టి
కాలుసేతులం గడిగికొని కూర్చుండి లలితశృంగారభావముల లజ్జా
వనతవదనయు, నతిభీతచిత్తయు నై యున్న కూఁతుం జూచి తనదివ్య
జ్ఞానమహిమంబున నంతవృత్తాంతంబు నెఱింగి క్షత్త్రియులకు గాంధర్వ
వివాహంబు విధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కిట్లనియె.
క్షత్త్రియయోగ్య మగుగాంధర్వవివాహమున మహాధర్మశీలుం డగు
దుష్యంతుని నీవు పెండ్లాడినందులకు సంతుష్టస్వాంతుండ నైతి. నీకుల

గోత్రములకుఁ దగిన భర్తను బొందితివి. దానికిఁ దగినట్లు నీవు గర్భ
మును ధరించితివి. నీగర్భమున నుండుపుత్త్రుండు సర్వంసహావహనమహా
నీయుం డగుచక్రవర్తి యగును జుమీ! నీధర్మచరితంబునకు మెచ్చితి,
నీవు కోరినవరం బొసఁగెద. వేఁడు మన శకుంతల తనయుం డనురాగాతి
శయముతో నుండు తండ్రి కిట్లనియె. అయ్యా! నామన స్సెల్లప్పుడు
ధర్మమునందె తగిలియుండుటకును, నాకుఁ గలుగు పుత్త్రుఁడు దీర్ఘాయు
రైశ్వర్యబలసమన్వితుం డగుటకును, వంశకర్త యగుటకును గోరెద.
అని యడుగఁగా నమ్మహాముని దానికిం గరుణించి యనుగ్రహింప
శకుంతల కొండలపాటుఁ దక్కి సంతుష్టచిత్త యయ్యెను.

### భరతుని జననము

అంత శకుంతల మూఁడుసంవత్సరములు సంపూర్ణంబు కాఁగా
చక్రవర్తిచిహ్నములం దాల్చి ప్రకాశించుచున్న కుమారుం గనియె.
వానికిఁ గణ్వమహాముని యథావిధిగ జాతకర్మాది సంస్కారములు క్షత్త్రి
యోచితములఁ గావించె. అంత నక్కుమారుండు శుక్లపక్షచంద్రుని
మాడ్కిఁ బెరుగుచు సింహసంహననుండును, దీర్ఘబాహుండును, ననంతజవ
సత్త్వసంపన్నుండును నై పరఁగుచు నాఱేండ్లవాఁడయ్యెను నవ్వన
మున నుండు సింహములను శార్దూలములను నేనుంగులను బట్టి తెచ్చి
యాశ్రమ వృక్షములం గట్టుచు, వాని నారోహించుచు, బహువిధము
లగు శైశవక్రీడలను దేలియాడుచుండె. వాఁ డాయాశ్రమమున నుండు
మును లెల్లరును భీతిల్లునట్లు సమీపారణ్యమృగముల నెల్లను భయ మొకిం
తయును లేక దమియించుటం జేసి (అణఁగ ద్రొక్కుటం జేసి) సర్వదమనుం
డని యాశ్రమమునులు వానిం బేర్కొనిరి. అంతఁ గణ్వమహామునియుఁ
గొంతకాలమునకు వానితేజస్సును బలమును విక్రమమును గని
శకుంతలం జూచి తల్లీ! నీకుమారుండిప్పుడు యౌవరాజ్యలక్ష్మిని బొందుట
కర్హుండై యున్నవాఁడు. మఱియు స్త్రీ లెంత పతివ్రతలైనను జిరకాల
ము పుట్టినిండ్ల నుండఁదగరు. సతులకుఁ బతులకడ నునికి ధర్మువు. వారికిఁ
బతియే యేడుగడయ సుమా! యని చెప్పి శిష్యులఁ గొందఱం బిలిచి
మీ రీ శకుంతలను సుతునితోడఁ దోడ్కొని చని దుష్యంతునొద్ద విడిచి
పుచ్చి రండని యాజ్ఞాపించె. అంత వారు గురువచనప్రకారమున సుత

సహితయగు శకుంతలను దుష్యంతునగరమునఁ జేర్చి యాశకుంతల తనకు
సెలవొసఁగఁగా మఱలి కణ్వాశ్రమమునకుఁ బోయిరి. శకుంతలయు ద్వార
పాలకుం డనుమతింప సుతునితో రాజసన్నిధిం జేరి రాజు తన్నే మియు
గుర్తించినవానివలె నుండమికి మనంబున నగచి పిదపఁ దానే తన
పూర్వవృత్తాంతంబంతయు నారాజునకు నివేదింపనెంచి, 'యోరాజేంద్రా!
పూర్వ మొకప్పుడు నీవు వేఁటకై వచ్చియుండి కణ్వాశ్రమమున కేతెం
చితివి. అప్పటివృత్తాంతంబును స్మరణకుఁ దెచ్చికొనుము. ఈకుమారుఁడు
నీవలన నాకుఁ బుట్టినవాఁడు. వీనిని యువరాజుం జేసెద నని వర మిచ్చి
యుంటివి. కావున నన్నొడంబఱచి సమయ మేర్పఱచికొని చేసినసంకేత
మునకు లోపము రానీయకుండు' మనఁగా దుష్యంతుండు దాని నంత
నెఱింగియు నెఱుంగనివాఁడపోలె నిట్లనియె. 'ఓసీదుష్టురాలా! నీవెక్కడి
దానవో? నేను నిన్నెఱుంగను. అనుచితము లగుమాటల నాడకుము.
వచ్చినదారిం బొమ్ము' అనఁగా శకుంతల మిక్కిలి వంతతోఁ గొంతసే
పూరకుండి కొండొకవడికిఁ గోపారుణితనేత్రములనుండి బాష్పకణ
ములు జలజలరాల నారాజుం జుఱచుఱుం జూచి కోపావేశంబునఁ బెదవు
లదర విషాదంబు గదుర నిట్లనియె.

మహారాజా! ఎఱుకలేనివారివలె నీవేమియు నెఱుఁగ నని చెప్పె
దవు. నీ కన్నియుఁ దెలియును. నీవు తప్ప నితరు లెఱుఁగని దానివిష
యమున నీ వసత్యం బాడఁదగునే? ఈవిషయమున సత్యాసత్యములకు
నీవ సాక్షివి. నిజమైనదాని వేఱొకవిధముగఁ దోఁపింప యత్నించుట
తన్నుఁదా దొంగిలించుకొనుట యని యెఱుంగుము. అట్టివానికి మహాపాత
కములు సంభవించును. ఒంటరిపాటున జరిగినవృత్తాంతము నన్యు లెవ
రెఱుంగ రని యసత్యమునకుఁ బాల్పడరాదు. ఏకార్య మొనర్చినను
హృద్గతంబైన యంతరాత్మయు, సూర్యచంద్రులును, పంచభూతములును,
దివారాత్రంబులును, సంధ్యలు రెండును, ధర్ముండును, మనుజునిపుణ్య
పాపకర్మములను దెలియుచుందురు. ఎవనియొక్క సత్యపునడవడికి వాని
యంతరాత్మ, లేక, కర్మసాక్షి పురుషుండు సంతసమందునో యతనికి
సర్వపుణ్యములును జేకూఱును. కానున్నఁ బాతకములు పెల్లై నరకము

నం బడి కష్టముల ననుభవించును. నీవు నన్ను సమ్మతింపఁజేయునపుడు నా కొసంగినవరమును స్మరింపుము. అప్పుడు నన్నెట్లనుగ్రహబుద్ధితో నొప్పించితివో యాబుద్ధితోఁడనే నన్నిప్పుడును బరిగ్రహింపుము. సతియును, గుణవతియును, బ్రజావతియును, ననువ్రతయు నైన వనితనేలుం గనివాఁడు వోలెఁ జూచు దుష్టుం డిహపరముల రెంటియందును సుఖింపఁడు. అనుగుణభార్యావంతుం డగువాఁడు కర్మపరతంత్రుఁడును, దాంతుండును, బుత్రవంతుండును నై గృహమేధిఫలమునంతను సంతతము పడయును. పురుషునకు గార్హస్థ్యము ధర్మార్థకామసాధనమున కుపకరణము, విద్యకు నునికిపట్టు, నిర్మల మగునడవడికి గురువు. వంశమును నిలుపుటకాధారము. పుణ్యలోకములు పొందుటకు నూఁతఁగఱ్ఱ. గౌరవార్హుం డగుటకు ముఖ్యకారణము. సద్గుణమణులకుఁ గని. భర్తకు మనస్సంతోషమును భార్యయే సుమా పుట్టింపఁగల్గును. ఎంతటికష్టములయందైనను, నాపదలయందైనను, నెట్టిదుఃఖములయందైనను తమభార్యలను సంతానములను జూచుచుండినచోఁ బురుషులకు మనశ్శాంతి గలుగును. మఱియును భార్య పురుషునియర్ధాంగి. కావున భర్తకు మున్నుశరీరంబును వదలినపతివ్రత తనపురుషునితోఁ బరలోకంబునం గూడ, వాని యాగమనమును బ్రతీక్షించుచుండు. అట్లుగాక పురుషుండు తనశరీరమును వదలుచుండఁగనే వానివెంటఁ బతివ్రత యగునంగనామణి తన పురుషుం గూడ నీదేహమును వదలిపోవుచుండు. అట్టి భార్యనవమానించుట యధర్మము. మఱియునుం బురుషుండు భార్యగర్భమునందుఁ బ్రవేశించి పుత్రుండై తాన యుద్భవిల్లు. కాఁబట్టి "యఙ్గాదఙ్గాత్సంభవసి" యను వేదవచనంబులయందును, జనకుండును బుత్రుండును నను భేదము లేదు. అద్దములోన ముఖమును జూచువిధమున భార్యయందుఁ దనప్రతిబింబమగు పుత్రునిఁ జూచి తండ్రి స్వర్గమును బొందు సుకృతివోలె సంతసిల్లును. మఱియు సంతసముఁ బడసినవాఁడు తనపితరులకు స్వర్గప్రాప్తిఁ గలిగించును. పున్నామనరకమునుండి రక్షించును గానఁ బుత్రుఁడని సుతునకుఁ బేరుగల్గెను. పుత్రుఁడు తండ్రికంటె వేఱుకాఁడని జాతకర్మకాలమునందుఁ జెప్పుమంత్రములచే నిర్దేశింపఁబడును. అవియెల్లను నీవెఱింగినవియ. గార్హపత్యాగ్నియందుండి యాహవనీయాగ్ని ప్రజ్వలించునట్లు

నీపుత్త్రుఁడు నీవలనఁబుట్టెను. ఒకదీపమువలన వేఱొకదీపము జ్వలించు భంగి నీపుత్త్రుఁడు నీవలనఁ బుట్టి తేజోవంతుండై వెలుఁగుచున్న వాఁడు. మంటియం దాటలాడి శరీర మంతయును ధూళిధూసరితముగఁ బసములు దొట్రిలుచుండఁ బుత్త్రుండు తండ్రిం గౌఁగిలించు నేని యా పుత్త్రాలింగనసుఖమునకు వెల యింత యని చెప్పఁగలుగుదుమే? గ్రామాంతరమునకుఁ బోయి వచ్చినతండ్రి పుత్త్రుని నొడియందుఁ గూర్చుండఁ బెట్టికొని శిరము మూర్కొని యానందించును. పుత్త్రగాత్రపరిష్వంగము నట్లు జీవులకు ముక్తాహారకర్పూరసాంద్రపరాగప్రసవమును, చందనమును, చంద్రుని వెన్నెలయును, హృద్యము గా నుండునా? మిక్కిలిచల్లనిది యగునా? మనుష్యులలో బ్రాహ్మణుని వలెఁ, చతుష్పజ్జంతువులలో గోవు రీతిఁ, బూజనీయులలో గురువుమాడ్కిఁ, బుత్త్రునిస్పర్శసుఖమితరవస్తువులస్పర్శసుఖముకంటె నుత్తమము. ఇంతేల? నోరు వాయి లేని సరీసృపములును, కీటకములును, దమగ్రుడ్లను నానావిధములైనయాపదలనుండి రక్షించుకొనుచున్నవి గాని వానికి హాని దలఁచునే? ఇట్టుండ ననఘుఁడును, వంశకరుండును, విశేషగుణములచే నొప్పారువాఁడును, నీకు లనిస్తారకుఁడును నగు నీచిన్నికుమారుని నిష్కారణముగఁ దప్పఁజూడకుము. సకలధర్మముల నెఱింగిన నీ వున్నిఘ్నారుచుఁ దనంతవచ్చి కడకంటి చూపున నిన్నుఁ జూచుచున్న నీకుమారుని సమీపమునకుఁ జేరఁ దీయక యవమానింపఁ దగునే? వీఁడు నాగర్భమున మూఁడేండ్లునిండిన పిదపఁ బుట్టినవాఁడు. అంతరిక్షమున నాస్వాతియాకసమునుండి వీఁడు నూఱశ్వమేధములాచరించు నని పలికె" అని యెంత చెప్పినను దుష్యంతుం డేమియు నెఱుంగని వాఁడువోలె నుండఁగా, శకుంతల రాజువంకఁ దిరిగి యిట్లనియెను. రాజవర్యా! నామాటలు నీచెవి సోఁకినట్లుండవు. నా పలుకు లరణ్యరోదనము లగును! అయ్యయో! అప్సరసాంగనలలో శ్రేష్ఠురా లగు మేనకయందు విశ్వామిత్త్రునకు జనించి నప్పుడే వారలచే విడువఁబడితిని. నిను గాంధర్వంబున నీచే బోధింపఁబడి యొరు లెఱుంగక పెండ్లాడితి. ఇప్పుడు భర్తవైన నీవును నన్ను వదలఁ దలంచుచున్నావు. దీనురాలనై దిక్కులేక చింతలో మునిఁగియున్నదాన. పూర్వజన్మమున నే నెట్టిపాపకర్మములను జేసితినో? ఎట్లైన నీవు పొమ్మని

నను నేను బోవుదానఁ గాని నీ కీపుత్త్రునైనను వదలఁ దగదని పల్కిన శకుంతలకు దుష్యంతుండు కర మలిగినవాఁడు వోలె నిట్లనియె.

దుష్టురాలా! ఊరక వదరకుము. ఈకుమారుఁడు నావలన నీకుఁ గలిగినట్లు నే నెఱుంగను. స్త్రీలు సహజముగ బొంకువారలు. కావున నీమాటల నేను నమ్మను. చూడు మెట్లు బొంకు లల్లితివో? నీకుఁ దల్లి మేనక యంటివి. తండ్రి విశ్వామిత్త్రుం డంటివి. తల్లి దేవవేశ్య. తండ్రి మొదట రాజైయుండి బ్రహ్మర్షి యగుటకు యత్నించి కామాంధుఁ డయ్యెను. వీరు నినుఁ గన్నవారై యిరువురును నిర్దయులై నిన్ను విడిచి పోయిరనియుం జెప్పితివి. వారల నన నేల? వా రుత్తములే యగుదురు. అట్టివారికిఁ గూఁతురవై జనించి సిగ్గుమాలి రాజసభలో దురాలాపము లను బ్రేలుచున్నావు. బ్రహ్మర్షి విశ్వామిత్త్రుఁ డెక్కడ? అప్సరసలలో మేలైన మేనక యెక్కడ? నీతాపసీవేష మెక్కడ? ఈవేషమున సిగ్గు మాలినవెఱ్ఱిమాట లాడుచున్నావు. మిక్కిలి చిన్నవాఁడయ్యును, విశేష తేజస్సుతోను బలముతోను వెలయుచుండు నీ కుమారుం డెక్కడ? పరిశీలింపఁగా నియ్యది పరస్పరవిరుద్ధముగ నున్నది. కామాతుర నైన మేనక కెట్లో జనించియుందువు. అవన్నియు మాకు విచారింపనేల? నీ వాడుమాటలలో మా కెద్దియు స్మృతికి రాలేదు. తెలిసినదియుఁ గాదు. యథేష్టముగ నగు వెడలి పొమ్ము. అనిన దుష్యంతునకు శకుంతల వెండియు నిట్లనియె.

రాజా! పరరంధ్రాన్వేషణపరులకు విస్తారముగా నున్నను దమ దోషము లెఱుకపడవు. అన్నియుఁ దెలిసియుఁ దెలియనివానిపోలె నటించెదవు. మాతల్లిని నన్ను నీవు హీనలఁగఁ బరిగణింతు వేమో? వినుము. మాయమ్మ దేవలోకవాసిని యగుటంజేసి నన్ను మహేంద్ర యమవరుణ కుబేరపురములకును గొనిపోఁగల శక్తిగలది. ఆయమవెంట నేనును బోఁగలను. నీవో, భూమియందుఁ దప్ప వేఱొక్కచోట జరింప శక్తిలేనివాఁడవు. ఆలోచించుకొనుము. మన యిరువురకుం గల యంతర మిప్పుడు నీకే తెలియును. వేఱొకదానిని నిదర్శనమునకుఁ జెప్పెదు. ద్వేషమువలనఁ గాదు సుమా! వినినంతనే కోపపడకుము. కురూపి

ద్యైనవాఁడు తనముఖము నెన్నినాళ్లద్దమునఁ జూడకుండునో యన్ని నాళ్లును దన్ను సురూపునిఁగ భావించుకొనును. వాఁడెప్పుడద్దము చూచునో యప్పుడే వానికి నీలోకములో నుండు సుందరపురుషులకును గలయంతరము దెలియును. సత్య మప్పుడే వానికి గోచరించును. ప్రొద్దు గడపలేక వృథాపలుకులు పలికెడువాఁడు పరుల నెప్పుడు నిందించు చుండును. పరులమాటలలో గుణదోషములు రెండును నుండినను మూర్ఖుఁడు, సూకరము సహ్యమైన పురీషమునుంబోలె దోషమునే గ్రహించును. బుద్ధిమంతుఁడు దోషముల నావలకు నెట్టి నీరమును విడిచి పాలను గొను రాజహంసమునుంబోలె సుగుణములనే గ్రహించును. సజ్జనుండు దనవలన నితరుల కేదైన సంతాపము గలిగిన నెంతవగచునో? దుర్జనుం డంతటి సంతోషమును బొందును. సత్పురుషుఁడు పెద్దలను బూజించి, యెంత యానందించునో, దుర్జనుఁడు వారలను దిట్టి యంత యానందించును. తానే దుష్టుఁడై సాధువులను దుష్టులని చెప్పుటకంటె లోకమునందు వేఱొక్క యాశ్చర్యము లేదు. విపరీతోపన్యాసము లేల? తానుగన్న కొడుకును జేరఁదీయనివాఁడు సంపదలఁ గోల్పోవును. పుణ్య లోకములకుఁ బోవుట కనర్హుఁ డగును. కావున వంశమును నిలుపఁగల పుత్త్రుని విడనాడఁదగునే? సత్యమును ధర్మమును బరీక్షించి నిన్ను నీవ కాపాడుకొనుము. కపటవర్తనమిచ్చోటఁ బనికిరాదు. సుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె నొకదిగుడుబావి మేలు. అట్టిదిగుడుబావులు నూటికంటె లెస్సఁగా నాచరింపఁబడిన యొక్క యజ్ఞము మేలైనది. అట్టి జన్నములు నూఱింటికన్న నొకపుత్త్రుఁడు మేలైనవాఁడు. అట్టి పుత్త్రశత కంబునకంటె సూనృతపుఁబలు కొక్కటి శ్రేష్ఠమైనదని యెఱుంగుము. వేయియశ్వమేధయాగఫలములను, సత్యవచనమును రెంటిని దుల నిడి తూఁపఁగ సత్యవచనము ఘనమని సత్యముతట్టే మొల్లుసూపినది. సకలతీర్థ యాత్రలకుఁబోవుట, సర్వవేదముల నధ్యయనము చేసిన ప్రాజ్ఞుండగుట యివియెల్ల సత్యవ్రతము ననుష్ఠించువానిపుణ్యమునకు సరి గానేరవు. ధర్మజ్ఞులైన పెద్దలన్నిధర్మములలో సత్యమాడుట ఘనమైనదని చెప్పుదురు. సత్యమే పరబ్రహ్మస్వరూపము. అసత్యముకంటె వేఱొక్క మహాపాత కము పుడమియందుఁ గానరాదు. కావున నోరాజా! అసత్యమున కొడిగట్టకుము. దాన హాని కలుగును. సత్యపరుండవు కమ్ము. దానం జేసి

పుణ్యలోకములఁ బొందఁగలవు. ఆలోచించి మన కిరువురకును మాత్రమే తెలిసిన సంకేతమును నప్పటిసమయమును నడుపుము. అట్లుగాక యసత్యపరుం డగుదు వేని నే నెచటికేనిం బోయెద. ఈకుమారుని నీవు గ్రహింపకున్నను వీఁడు నిశ్చయముగ సకలమహీసామ్రాజ్యమును బాలింపఁగలఁడని చెప్పి మఱలి శకుంతల పోవుచుండె.

అప్పు డాసభలో నుండిన ఋత్విజులు, పురోహితులు, మంత్రులు నితరులగు సభాసదులు వినుచుండఁగా దుష్యంతునుద్దేశించి 'ఓ రాజా! గర్భమున ధరించుకతమునఁ దల్లి పుత్త్రున కాధారమాత్రమేగాని యుండు. కాని తండ్రి యట్లు కా నేరఁడు. తండ్రి వీర్యమున నుత్పత్తి యగువాఁ డగుటచేఁ బుత్త్రుండు తండ్రికంటె నన్యుండు కా నేరఁడు. మఱియును బుత్త్రోత్పత్తిచేఁ దండ్రికి నరకవాసము కలుగదు. ఈబాలుండు నిశ్చయముగ శకుంతలయందు నీకు జనించినవాఁడు. పుత్త్రుఁడు జీవించియుండఁగా వానికేదో దోషము నారోపించి వానిని త్యజించు తండ్రికి సర్వసంపదలు నశించును. కావున నోనృపాలా! ఈశకుంతల యందు నీకుత్పన్నుండైన యీపుత్త్రునిఁ బ్రేమతో భరింపుము. మాపలుకులయం దాదరముండి నీవు భరించినచో నితఁడు భరతుఁ డని పేర్కొనఁబడును.' అని యాకాశమునుండి యశరీరి యొక్కటి పల్కెను. అంత దుష్యంతుఁడు పురోహితామాత్యులను జూచి యిట్లనియె. సభాసదులారా! దేవతలమాట లాలకించితిరే? ఈకోమలిమగు శకుంతలయందీకుమారుండు నాకుం బుట్టినవాఁడని నే నెఱుంగుదును. కాని, యీ వృత్తాంతం బంతయును మే మిరువురముఁ దప్ప నన్యు లెవ్వరు నెఱుంగరు. అంతమాత్రమున నేను వీరిరువురను గైకొంటి నేని నిజ మెఱుంగని లోకులు నన్నపనిందలపాల్సేయుదురు. దీని నిజమును శంకింతురు. కావున నీసభలో వీరి వృత్తాంతం బంతయును వాస్తవమయినను గల్ల యని నటించితి. ఇప్పుఁ డెల్లవారును యథార్థమును గుర్తెఱింగి యుందురు. అని చెప్పి శకుంతలం బిలిచి రా జిట్లనియె. పరమసాధ్వీ! వినుము. అపు డా యాశ్రమమున మన కిరువురకును గలిగిన సమాగమము, సమయము గావించిన వృత్తాంత మంతయును లోకు లెవ్వ రెఱుంగరు. సమయము మేరకు నీకన్న మనపుత్త్రుని వీనిని యువ

రాజుగఁ జేయవలసి యుండుటచే, జనులకు మనకార్యము సంకేతము తెలియునిమిత్తము నే నిట్లు తెలియనివానింబోలె వర్తించితి. కాని, వ్యత్యస్తభావ మేమియును లేదు. ఇప్పుడు నాసభాసదులకుఁ, బౌరజనులకు యథార్థము దేవవాక్కునఁ దెలిసెను. కావున నంతయు నోర్చికొనుము. నీవు కోపాతిశయమునఁ బల్కినపల్కుల నెల్ల నే నోర్చితి. పుత్త్రుని గ్రహించెద. ప్రీతిమై నుపలాలించుచుఁ బెంచెద. అని భరతుం జేరఁదీసి తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని చుబుకంబును, మోమును దన యైదువ్రేళ్లం బుడుకుచు ముద్దాడి మిక్కిలి సంతసిల్లి యాకాశవాణి చెప్పినట్లు భరతుం డనుపేరుఁబెట్టి క్షత్రియోచితకర్మముల నొనర్చి యావరాజ్యమున కభిషిక్తుం జేసి యతనిని, శకుంతలను రాజోచిత వస్త్రాద్యాభరణాదులచే నలంకరించుచుండెను. ఇట్లాపరమపతివ్రతయగు శకుంతల తనసత్యమార్గంబున భర్త నధిగమించి యాతని మన్ననకుఁ బాత్రురాలై మహీపాలునితో విలాసంబునఁ గ్రీడించుచుండె. పదంపడి కొంత కాలమునకు దుష్యంతుండు భరతునకు రాజ్యభారము నంతయు సూర్యుండు దినాంతమునఁ దనతేజస్సు నగ్నియం దావహించి నట్లావహించి తపమునకై వనంబునకుఁ బోయెను. అంత భరతుండు రాజై పరాక్రమమునఁ బరరాజులం గెలిచి యనేక సామంతులంగూర్చి వారిమూలమునఁ గప్పములను గానుకలను గొనుచు నఖిలమహీమండలమున కేలికయై బ్రహ్మోత్తరంబుగా ధర్మపరిపాలనంబు సేయుచుఁ గణ్వమహాముని తన కాచార్యుండుగా ననేక యాగములను నశ్వమేధంబులను గావించి కణ్వునకు వేయిపద్మములధనమును దక్షిణగా నొసంగి ధర్మాత్ముండై వంశ మంతయుఁ దనపేర భారతవంశ మని వెలయఁగా యశఃకాయుఁ డయ్యె నని యీ శకుంతలోపాఖ్యానమును విస్తరముగ వివరించి వైశంపాయనుండు జనమేజయునితో వెండియు నిట్లనియె.

ఆభరతునకు భార్యలు ముగ్గురు. వారికి ముగ్గురకును దొమ్మండ్రు పుత్త్రులుపుట్టిరి. వారెవ్వరును దండ్రింబోలె సౌందర్యవంతులు కాకుండిరి. ఆకారణమున వారు తనకుఁదగినవారు కారని యాతండు మెచ్చకయుండెను. అంత వానిభార్యలు కొడుకుల నెల్ల నిర్దయులై చంపిరి. పదంపడి భరతుండు తనకుఁ గొడుకులు గలిగియు వ్యర్థ మయ్యె నని

చింతించి పుత్రునిమిత్తము విస్తారదక్షిణల నొసంగి యనేక యజ్ఞముల నాచరించెను. అనేకతపంబు లొనర్చెను. ఆసమయమున భరద్వాజుం డను మునియనుగ్రహమున వరమును బొంది కేకయరాజపుత్రిక యగు సునంద యను భార్యయందు భుమన్యుం గలిగించెను. ఆభుమన్యునకు దాశార్హియగు విజయ యను భార్యయందు సుహోత్రుఁడు మున్నగువారును, బుష్కరిణియనుదానియందు రుచీకుం డను వాఁడును బుట్టిరి. వారలలో సుహోత్రుండు రా జయ్యెను. వాఁడు మహావిభవంబున రాజై సర్వసంపదల ననుభవించుచు బహుయజ్ఞముల నాచరించి భూలోకమున నెచ్చటఁ జూచినను బాగు బహుయజ్ఞముల నాచరించినందులకు గుర్తులుగా యూపంబులఁ బెక్కింటిని నాటించె. ఆసుహోత్రునకు సువర్ణయను నిక్ష్వాకుపుత్రికయందు హస్తి యనువాఁడు పుట్టెను. వానిపేరునం గాదె ప్రస్తుత హస్తినాపురము ప్రశస్తిఁ గాంచెను. వాఁడు త్రిగర్తరాజుకూఁతుం బెండ్లాడెను. ఆ దేవి యశోధరయందు వికుంఠనుండు పుట్టె. వానికి దాశార్హి యగు సుదేవయం దజమీఢుఁడు జనించె. ఆ యజమీఢునకుఁ గైకేయియు, గాంధారియు, ఋక్షయు ననువారు మువ్వురు భార్యలైరి. వారియం దజమీఢుండు నూటయిరువండ్రు సుతులను మహాబలపరాక్రమశాలురను గనెను. వారనేకదేశములకు రాజులై పెక్కువంశములకుఁ గర్తలైరి. వారిలో సంవరణుండు విఖ్యాతపురుషుండై రాజ్యమేలుచుండ రోగములు ప్రజలను దుర్భిక్షములు దేశమును బీడింప మొదలిడెను. మఱియుఁ బాంచాలపతి యక్షౌహిణులసైన్యముతో సంవరణునిరాజ్యముపై దండెత్తివచ్చి సంవరణునియుద్ధమున నోడింపఁగా సంవరణుండు పుత్రమిత్ర బాంధవ జనులతోఁ బాఱిపోయిసింధు నదీతీరమున నుండు కొండగుహలలో శత్రురాజునకు భీతిల్లి దాగియుండె అట్లనేకసంవత్సరములు రాజ్యమునందు నిరాశుఁడై యుండ నొక్కనాఁ డాకస్మికముగ వసిష్ఠముని యచ్చోటికి కేతెంచుటయు, సంవరణుం డామహానీయుని సభక్తిగ నారాధించి, యమ్ముని ప్రసన్న చిత్తుఁడు కాఁగా సంవరణుం డాతని కిట్లనియె. మునీంద్రా! వంశక్రమాగతంబైన రాజ్యమును బాంచాలపతి యుద్ధమునందు నన్నోడించి వశపఱచుకొ

నియె. దానినిమిత్తము యత్నించెదను. నీవు పురోహితుండవై యుండి నాకుఁ గ్రమ్మఱ రాజ్యలాభప్రాప్తినిమిత్త మనుగ్రహింపుమనఁగా వసిష్ఠుండు వల్లె యని యొడంబడెను. అంత సంవరణుండు వసిష్ఠుప్రసాదంబునఁ గ్రమ్మఱ హస్తినాపురరాజ్యమును సాధించి యందు రాజ్యాభిషేకంబుఁ జేసికొని పరాక్రమించి సకలభూకాంతులు తనకు సామంతులై విధేయత ననుసరించుచుండఁ బూర్వమువలె రాజ్య మేలుచు బహుయజ్ఞముల నొనర్చి దేవతల సంతుష్టులంగాఁ జేసెను. ఆసంవరణునకు సూర్యపుత్త్రి యగు తపతి భార్యయై కురు వనువానిం గనెను. వానిపేరిటం గురుక్షేత్రంబు విఖ్యాతం బయ్యె. కురువు వాహిని యనుదానిం బెండ్లాడ దానియందు నవిక్షితుఁ డను వాఁడు మున్నుగా నేవురుపుత్త్రులుపుట్టిరి. అవిక్షితుఁడు, పరిక్షితుఁడు మున్నుగాఁగల యెనమండ్రు పుత్త్రులంగనెను. అందు బరిక్షితునకుఁ గక్షసేనుఁడు, ధృతరాష్ట్రుఁడు మున్నగువారు కొడుకులైరి. వారిలో ధృతరాష్ట్రుఁడు రాజ్య మేలెను. వానికిఁ గుండికాదు లనువారు పుట్టిరి. వారివంశము లనేకశాఖలై విస్తరిల్లె. వానినట్లుండనిమ్ము. కురునకు దాశార్హి యగు శుభాంగి యనునది మఱియొక భార్య గలదు. వీరి యిరువురసమాగమమునఁ బిదూరథుఁ డనుపుత్త్రుఁడు పుట్టెను. విదూరథుఁడు మాధవి యగుసుప్రియ యనుభార్యం జేకొని యనశ్వునిఁ బుత్త్రుంగాఁ బడసె. వానికి మాగధి యైనయమృత యను దానియందుఁ బరిక్షితుండు పుట్టెను. వీఁడు బహుదానపుత్త్రి యైన సుయశం జేకొని భీమసేనుఁ డనుపుత్త్రుం బొందె. భీమసేనునకు కైకేయి యైన కుమారి యనుదానియందుఁ బ్రతిశ్రవసుఁడు పుట్టెను. వీనికిఁ బ్రతీపుఁడు కుమారుం డయ్యెను. వీనికి శిబికూఁతురు సునందభార్యయై దేవాపి, శంతను, బాహ్లికు లనుమువ్వురు పుత్త్రులుగలిగిరి. వారిలో దేవాపి యనువాఁ డైహికములు తుచ్ఛము లనిత్యము లని బాల్యమునందే వైరాగ్యము నవలంబించి తపం బొనర్పుటకు వనమున కేఁగఁగా శంతనుండు రెండవవాఁడు రాజయ్యె. *శంతనునియం దొకమహిమ యుండెను. వాఁడు ముసలివారి నెవరినైనను జేతఁ

*శ్లో. యం యం కరాభ్యాం స్పృశతి జీర్ణం స సుఖమశ్నుతే,
పున ర్యువా చ భవతి తస్మాత్తం శంతనుం విదుః.

దాక నేని వా రప్పుడే ప్రాయంపువా రగుదురు. ఇట్లనేకులకుఁ దనహస్తస్పర్శచే సుఖియింపఁ జేయుటం జేసి, వాఁడు శంతనుం డనఁబరగె. ఆశంతనునకు వానిసుకృతంబునం జేసి గంగానది మనుష్యస్త్రీరూపము నెత్తి భార్యగానుండి భీష్మునిఁ గుమారుంగాఁ బడసెను. భీష్ముఁడు దేవవ్రతుఁ డనునామాంతరమున వెలసె. భీష్ముండు తండ్రికి మిక్కిలి ప్రియంబొనర్చువాఁడై భీష్మంబైన నిత్యబ్రహ్మచర్యనియమమును బూని మత్స్యరాజపుత్త్రి యగుసత్యవతిం దోడ్తెచ్చి తనతండ్రి యగుశంతనునకుఁ దాన మఱల వివాహమును గావించె. అంత వారిరువురకును జిత్రాంగద విచిత్రవీర్యు లనువా రిరువురుసుతులు జనించిరి. చిత్రాంగదుఁడు పసివాఁడై యుండఁగా గంధర్వు నొక్కనితో మత్సరించి వానితో ఘోరమగు పోరు సలిపి వానిచే నిహతుండయ్యె. అంత భీష్ముండు విచిత్రవీర్యు రాజు చేసె. విచిత్రవీర్యునకుఁ గాశీరాజకూఁతు లంబికాంబాలిక లిరువురు భార్యలైరి. విచిత్రవీర్యుఁడు సంతతి లేక మృతి నొందెను. వాని భార్య లగు నంబికాంబాలికలయందు వేదవ్యాసమునీంద్రుని యనుగ్రహమున ధృతరాష్ట్ర పాండురాజులు జనించిరి. అంబికాదాసియం దమ్మునివలన విదురుండు పుట్టెను. వారిలో ధృతరాష్ట్రునకు గాంధారియందు వేదవ్యాసునివరప్రసాదమున దుర్యోధనాదు లగు నూర్వురు పుత్త్రులు జనించిరి. పాండురాజునకుఁ గుంతీమాద్రు లనునిరువురు భార్యలైరి. వారిలోఁ గుంతి యందు ధర్మదేవతవలన యుధిష్ఠిరుండును, వాయుభట్టారకుని యనుగ్రహమున భీమసేనుండును, సురపతిప్రసాదంబున నర్జునుండును బుత్త్రులుగాఁ బుట్టిరి. మాద్రి కశ్వినీదేవతలయనుగ్రహమున నకులసహదేవు లను కవలు జనించిరి. స్త్రీసంగమము కలుగునప్పుడు పాండురాజునకు మృతి యగు నని యొకముని శపించుటఁ జేసి పిదపఁ గొన్నినాళ్లకుఁ బాండురాజు మాద్రీసంగమమున మృతిఁ జెందె. అంత మాద్రి తనకుమారు లగునకులసహదేవులను బోషించునట్లు కుంతి నొడఁబఱచి తాను పతితోఁ జితి నెక్కి శరీరత్యాగము సేసెను. పాండురాజపుత్త్రు లైదుగురును బాంచాలరాజపుత్త్రిక యగు ద్రౌపదిని ధర్మపత్నిగాఁ బడసిరి. ఆద్రౌపదికి ధర్మపుత్త్రునివలనఁ బ్రతివింధ్యుఁడును, భీమసేనువలన శ్రుతసోముఁడును, నర్జునునివలన శ్రుతకీర్తియు, నకులునివలన శతానీకుఁడును,

సహదేవునివలన శ్రుతసేనుఁడను నుపపాండవులు పుట్టిరి. మఱియును
యుధిష్ఠిరుండు స్వయంవరమువలన శైబ్యునికూఁతురు దేవిక యను
దానిని బెండ్లియాడెను. అతనికి దానియందు యౌధేయుండను
కుమారుండు గలిగెను. భీమసేనుఁడు కాశియందు వీర్యశుల్క-
యగు జలంధర యనుదానిఁ బెండ్లాడి సర్వగుండను కుమారుం
బడసెను. మఱియు నాభీమసేనుండు హిడింబయను నసురవనితం
జేపట్టి దానియందు ఘటోత్కచునిఁ బుత్త్రుంగాఁ బొందెను. అర్జును
నకు యాదవాంగనయు శ్రీకృష్ణునిచెలియ లగు సుభద్రయం దభి
మన్యుండు పుట్టెను. మద్రరాజగు ద్యుతిమంతుఁడు తనకూఁతురగు
విజయ యనుదానికి స్వయంవరోత్సవము గావింప నామహో
త్సవమునకుఁబోయిన రాజులమధ్యమున విజయ సహదేవుని వరింప
వివాహ మతివిభవముతో నర్తిల్లెను. వారికి సుహోత్రుండు పుట్టెను.
ఇవ్విధంబునఁ బాండవులకుఁ బదునొకండుగురు పుత్త్రులు వెలసిరి. వారిలో
నభిమన్యుండు వంశకర్త యయ్యెను. ఆయభిమన్యునకు విరాటరాజ
సుతగ్గున యుత్తర యనువనితారత్నమునందు మహాయశ్యు యగు పరీ
క్షితుండు జనించె. అతం డాఱునెలల శిశువై యుత్తరగర్భమున నుండగా
నశ్వత్థామ యేసిన బ్రహ్మశిరోనామకాస్త్రంబున విగతజీవుండయ్యె
భగవంతుం డగు దేవకీపుత్త్రుని యనుగ్రహంబున రక్షింపఁబడి పాండవు
లెల్ల నప్పటికిఁ బరిక్షీణులైనపదంపడి పుట్టినవాఁ డగుటంజేసి వాని
భగవంతుఁ డగువాసుదేవుండు పరీక్షితుండని పేర్కొనెను. ఆమహా
రాజునకు మాతల్లియగు మాద్రవతి యనుపుణ్యాంగనయందు నీవుజనించి
తివి. నీభార్య యగు వపుష్టకు శతానీక, శంఖుకర్ణు లనువారిరువురుపుత్త్రులు
గలిగిరి. అందు శతానీకుఁడు విదేహరాజుకూఁతుం బెండ్లియై యశ్వ
మేధదత్తుండు పుట్టెను. ఇదియేపూరువంశముయొక్క యనుక్రమణిక.
దీనిని వినినవారును జదివినవారును మనోరథంబులఁ బడసి పుణ్యలోక
వాసులగుదు రనిన విని జనమేజయుండు వైశంపాయనునితో నిట్ల
నియె. మునీంద్రా! శంతనునకు దేవనది గంగ యెవ్విధమున మనుష్యస్త్రీ
రూపము నొంది భార్య యయ్యె. ఆదంపతులకు భీష్ముం డెట్లు పుట్టె?

మఱియును భీష్ముం డేల యట్టి భీష్మంబైన బ్రహ్మచర్యవ్రతమును గలకా
లమంతయుఁ బూని యుండె? అవి యెల్లను నాహృదయమునకు సంశ
యములై యుండు. కావున వాని నెల్ల సవిస్తరముగఁ జెప్పుము. మఱి
యును బాండవుల జననవృత్తాంతమును విశదీకరించి తెలుపుము. మా
పూర్వులును మహనీయులును నగు వారివృత్తాంతంబులు నాకు వినను
వినను జోద్యమగుచున్నది. అని ప్రార్థింప నమ్మునిచంద్రుం డారాజచంద్రు
న కిట్లనియె.

పూర్వకాలమున నిక్ష్వాకుకులమునందు మహాభిషుం డనువాఁడు
పుట్టి మహాధర్మాత్ముండును, గర్మాసక్తుండును నై వేయియశ్వమేధయాగ
ములను, నూఱు రాజసూయయజ్ఞములను నీభూలోకంబున నాచరించి
యింద్రాదిదేవతలం దనిపి దేవలోకంబున కేఁగి, యొక్కనాఁడు బ్రహ్మర్షి
గణములు సేవించుచుండ బ్రహ్మదేవునిసభకుఁ బోయెను. అప్పుడు
గంగానదీ స్త్రీరూపధారిణియై బ్రహ్మను సేవింపవచ్చియుండె. అప్పుడు
గంగాదేవి కట్టియున్న పుట్టంబు గాలిచేఁ దొలంగఁగా నచ్చోట నుండిన
దేవర్షులును రాజర్షులును నెల్లవారు తలలు వాంచి యుండిరి. ఆసభలో
నుండిన మహాభిషుండు మాత్రము గంగయొక్క వస్త్రము తొలఁ
గఁగా నూరుమూలమును గామమునఁ జూచుచుండె. అంత బ్రహ్మదేవుండు
దాని నెఱింగి మహాభిషుని మనుష్యులలోఁ గొంతకాల ముండి పిదపఁ
బుణ్యలోకములకు వమ్మని శపించె. అంత మహాభిషుండు దీనుండై మను
ష్యలోకమున నుండునప్పటికి రాజులలోగుణశ్రేష్ఠుండైన ప్రతీపుఁ డను రాజు
నకుఁ గుమారుఁడై పుట్టుటకుఁ దలంచి వచ్చె. గంగాదేవియును బ్రహ్మను
సేవించి మహాభిషుని మహానుభావంబును రూపసౌందర్యంబులును దనయం
దలి యభిలాషయును నెఱింగి వానియం దనురాగముచే నాతని మనమున
దలంచుచు మఱలి భూలోకమునకు వచ్చుచుండ మార్గమున వసిష్ఠుశాపం
బునఁ దేజస్సు దఱిగి తమపదవుల వీఁడి, దేవలోకవియోగము గలిగెనే
యని విషణ్ణమానసులై వచ్చుచున్న యెనమండ్రు వసువులం జూచి సుర
నది మీ రేల యివ్విధమున దీనత్వమున నరుగుచున్నవా రని యడుగ
గంగకు వసువు లిట్లనిరి.

## గంగావసువుల సంభాషణము

మే మందఱము వసిష్ఠమహామునికి హాని యొనర్పఁగా నాతం డది తెలిసి కోపించి మమ్ము భూలోకమునఁ గొంతకాలము మనుష్యులై జన్మించుటకు శాప మిచ్చె. ఆమునిశాపమును దప్పించుకొనలేము. మనుష్యగర్భములలోఁబుట్టలేక వగచుచున్నవారము. నీవు మానుషస్త్రీ రూపమును మాయందుఁ గరుణించి ధరింపుము. నీగర్భమునందు మేము వసించి మనుష్యులమై పుట్టెదము. నీకుఁ బుత్రుల మయ్యెదము. ప్రతీపుని పుత్రుఁడు శంతనుఁడు మాకుఁ దండ్రియయ్యెడు నని వచింపఁగా గంగ వారికోరినకోర్కికి సమ్మతించెను. అంత వారు మఱియు గంగతో నిట్లనిరి. పరమపావనీ! నీగర్భమునుండి మేము మనుష్యులమై వెలువడుచుండఁ గనే మాశరీరములను నీవు గంగలోఁ బడవేయుము. అట్లు చేసితివేని మాకు భూలోకమునఁ జిరకాలవాసము గలుగదు. అనఁగా వారికి గంగ యిట్లనియె. మహాసీయులారా! అటులు, నేఁ జేసినచో నాకు సంతానప్రాప్తి యెట్లగును? నేను బుత్రుం గోరి కాదే మనుష్యస్త్రీయగుట కిష్టపడితి. మీరాయిష్టానుసారి నగుచో నే ననపత్య నగుదు. అట్లు పుత్రహీనగా నోప ననఁగా వసువు లిట్లనిరి. దేవీ! మాయెనమండ్రయంశ ములలో నష్టమాంశములను గ్రహించి నీకుఁ బుట్టువారిలోఁ గడకొట్టు వాఁడు జనింపఁ గలఁడు. వానిని గంగయందు వేయకుము. వాఁడు మానుషరూపధారియై పెక్కేండ్లు జీవించియుండి పెండ్లియాడక బ్రహ్మచర్యనిష్ఠమైనుండి సంతానము గాంచక కొన్నినాళ్లు భూలోకమున నుండి యావల మఱల నాకమునకు రాఁగలఁడు. వాఁడు సర్వవేదశాస్త్ర ముల నెఱింగి ప్రఖ్యాతుండై నీకుఁ బుత్రుండై బహుకాలము భూలో కమున వెలయును. పిదపనా దేహమును నచ్చోట వదలి మరల మాతోఁ గలియును అని చెప్పఁగా గంగాదేవి యంగీకరించెను. వసువులకు దమకు భూలోకమున నెనరిగర్భమునఁ బుట్టుదుమా యను సంకటముం దీరెను. ఇట్లు గంగా వసువు లొండొరులు సమయము నేసికొనిచనిరి.

అంత నిచ్చట భూలోకమునందుఁ బ్రతీపుఁ డనురాజు రాజ్య మేలి యఖిలమహీపాలన సుఖంబులం దృప్తిఁ జెంది గంగాతీరము

నకుఁ బోయి తపం బాచరింపఁ దొడంగెను. ఇట్లు భారతకులుండు నియమవ్రతపరాయణుండై తపోనిష్ఠయందుండ నచ్చోటికి గంగాదేవి స్త్రీరూపము నతిమనోహరలావణ్యములం దాల్చి యొక్కనాఁడు ప్రతీపుని దక్షిణపుతొడపైఁ దటాలు మని వచ్చికూర్చుండెను. ప్రతీపుఁడును నంగనారూపముతో సాహసించి యవ్వనిత, పరమవైరాగ్యమున నుండు తనతొడపై వచ్చి కూర్చుండుట కాశ్చర్యపడి గంగతో “నీ వెవ్వరవు? ఏల యిట్లు సాహసించి నాతొడపైఁ గూర్చున్నదానవు?” అని యడుగ, నాయంగనామణి ప్రతీపున కిట్లనియె. “మహేంద్రతుల్యుఁడా! నేను జహ్నుకన్యను. నీసద్గుణములకు సంతసిల్లి, నీకు భార్యగావచ్చితి. న న్నిష్టముతోఁ బరిగ్రహింపుము” అనఁగాఁ బ్రతీపుఁడు దాని కిట్లనియె. కమలముఖీ! పెండ్లియైనసతిం దప్ప నన్యకాంతలఁ బొందరా దని నాకు వ్రతము గలదు. పరాంగనలను మనస్సున నైన నే దలంపను. అన్యులతో నాడినట్లు జితేంద్రియుఁడ నగు నాతో నీ వేల యిట్లాడెదవు? అంతియ గాక స్త్రీభాగ మగు నెడమపార్శ్వపుఁదొడ నారోహింపక, పురుషభాగమై పుత్త్రులును గోడండ్లును గూర్చుండుట కర్హమైన దక్షిణపుఁదొడపై నాసీనవైతివి. కావున నీవు నాపుత్త్రునకు భార్య వగుము. నాకుఁ గోడలవై వెలయుము. అని చెప్పఁగా నావనిత ప్రతీపున కిట్లనియె. భూమిపాలా! నీకోర్కెమేరకు నీపుత్త్రునకు భార్యనై నీకుఁ గోడల నగుదు. నన్ను విచారింపక పెండ్లియగుటకును, బెండ్లియైన పిదప నే నేమిచేసినను నా కాటంకము గావింపకుండుటకును నీపుత్త్రుని నియమింపుము. అటులైన నాఁ డవశ్యము నీకుఁ గోడలనయ్యెద. నీకుమారుండు సంతతిం గని పుణ్యలోకముల నధిగమించువాఁడని చెప్పఁగాఁ బ్రతీపుం డట్ల యగు ననుటయు నావనితయు నంత నదృశ్య యయ్యె.

పదంపడి ప్రతీపుఁడును బుత్త్రార్థియై సకలతీర్థములయందును భార్య యగు సునందాదేవితో విధ్యుక్తవ్రతకర్మముల నాచరించుచుఁ బెద్దకాలము దపము సేయఁగా నాయిరువురు పుణ్యమూర్తులకు దేవతుల్యుఁడును, గౌరవవంశవర్ధనుఁడును, మహాశూరుండును నగు *శంతనుండు పుట్టెను. వాఁడును దినదినప్రవర్ధమానుండై సంప్రాప్త

యౌవనుఁడు కాఁగా వానిం జూచి ప్రతీపుఁడు తనకు నశింపని పుణ్య లోకములు ప్రాప్తించె నని సంతసిల్లి సకలరాజ్యభారమునకు వాని నభిషిక్తుం జేసి వానితో నిట్లనియె. పుత్త్రా! పూర్వ మొక్కనాఁడు కమనీయ రూపము గల కామినియొక్కతె నేను గంగాతీరంబున తపం బాచరించుచుండ నాసమీపమున కేతెంచి పుత్త్రార్థినియై నన్ను వరింప, "నేను దానితో నప్పుడు నీవు నాకుఁ గోడలవు కమ్మ"ని చెప్పితి. అది యట్ల యగుఁ గాక యని యదృశ్య యయ్యె. ఆయంగన పుత్త్రార్థినియై నీయొద్దకు వచ్చెనేని నీవు దాని కులగోత్రములను విచారింపక నాయాజ్ఞ ననుసరించి పెండ్లియాడుము. మఱియు నీవు దానిఁ జేపట్టిన పిదప నాయంగన యెట్టి కార్యము నాచరించినను దానిని నివారింపకుము. ఈతీరున దానితో నిష్టోపభోగముల ననుభవింపుము. అని చెప్పి ప్రతీపుఁడు శంతనుని నొప్పించినవాఁడై వనంబునకుఁ దప మాచరింపఁ బోయెను.

### గంగాశంతనుల సమాగమము

అంత శంతనుండు తండ్రి తనయం దుంచిన రాజ్యభారమును నేర్పుతో వహించి ప్రజల ధర్మమునఁ బరిపాలించుచుండ నొక్కనాఁడు వేఁటనిమిత్త మరణ్యమునకేగి యనేకమృగముల వేఁటాడి గంగాతీరమున విలాసముతోఁ దిరుగుచుండఁ, జలించుచున్న విశాలనేత్రములును, నిండైన కాంతియును గలిగి దివ్యాంబరాభరణభూషితయును నగు నొక్క శృంగారవతి గానవచ్చె, దాని దివ్యరూపరేఖావిలాసముల కాశ్చర్యము నొంది యిది యౌవనకన్యకయో, దనుజకన్యకయో, నాగకన్యకయో, దేవకన్యకయో, గాకున్న నచ్చరకన్నెయో దీనిరూప మపూర్వము. ఇది మానుషకన్యక యన వచ్చునే యని మనంబున నాలోచించుచుండ నావనితయును శంతనుని రూపయౌవన సౌందర్యవిలాసముల కోటువడి

* శాంతుఁడై యుండు తండ్రికిఁ బుట్టినవాఁడు గావున శంతనుఁ డను నామము. ఇతని కొకమహిమ గలదు. ఇతఁడు ముసలివారిని తన హస్తస్పర్శచే బ్రాయంపువారినిగాఁ జేయును. అందుచే ననేకులు సుఖించిరి. ఇవ్విధంబున నీతండు శంతనుఁ డని పేర్కొనఁబడుటకుఁ గారణములు రెండు చెప్పఁబడినవి.

వానిని ననురాగంబుతోఁ గనువాల్పక చూచుచుండె. అప్పు డాయిరువురి యన్యోన్యావలోకనంబుల నెపంబుగొని మన్మథుండు ప్రవేశింప, వా రొక్కరినొక్కరు వలచిరి. అంత శంతనుం డాసుందరినిం జూచి, కోమలీ! ని వెవ్వరిదానవు? ఇట్టిసౌందర్యాతిశయముతో నేకతంబున నీగంగా పులినతలంబున నేకారణంబునఁ గ్రుమ్మరుచున్నదానవు? అని యడుగఁగా నాకోమలి శంతనుఁడు తనయందు బద్ధానురాగుండయ్యె నని గుర్తించి యతని కిట్లనియె. భూమిపాలా! నన్నుఁ బెండ్లాడుట నీ కిష్టమయ్యెనేని నేను జెప్పెడి సమయమున కొడంబడుము. అది యెట్లంటివేని, యే నెద్ది యాచరించినను దానికి నీవొడంబడియుండి నాకాటంకము చెప్పకుండుటయును, న న్నెన్నఁడును నప్రియంబులుపలుక కుండుటకును నిర్ణయము. అట్లైనచో నేను నీకు భార్యనై యిష్టోపభోగంబుల కుపకరించెద. నీ వెప్పుడైనను నాకార్యముల కాటంకపఱచి, న న్నప్రియంపుఁబలుకుల నాడుదువేని నేను దక్షణము నిన్నుఁ బాసి చనుదు. అని చెప్పఁగా శంతనుండు దానిరూప వైలక్షణ్యములకు మోహితుండై దానిమాటల కొడంబడి యాశృంగారవతిం బరిగ్రహించె. గంగయు మనుష్య స్త్రీరూపవేషమున శంతనుని యిష్టోపభోగంబుల సంతృప్తునిఁగావించుచుండె. దాని యుపలాలనములయం దనేకవర్షము లొక్కముహూర్తమై గడచెను. అప్పు డా సుందరికి వరుసఁ డాదివసువులుపుట్టుచుండఁగా బుట్టినవెంటనే యా పొలఁతి వారినిఁగొనిపోయి నిర్దయురాలై గంగాజలంబులయందు వైచుచున్నను రాజును నిట్లేల దయలేనిదానవై పడయరాని పుత్రులఁ బడసి గంగపా ల్సేసెదవేమి? యనినచోఁ దనమనోహారిణి తన్ను బాసి చను ననుభయమున దాని మధర్మంపుఁజేతల కెప్పటి యట్ల నివారణమును బలుకకుండెను. ఇవ్విధంబున నేడ్గురు పుత్రులను గంగం ద్రోసి మృతులం జేసినఁ జింతాక్రాంతుండై శంతనుం డెనిమిదవపుత్రుని భార్య గనుటెఱింగి వానిని సైతము గంగయందుఁ బడవైచునేమో యని శంకించి శిశువును రక్షించువాఁడై, భార్యంబిలిచి యోపుత్రఘాతినీ! రత్నములవంటి పుత్రులం గని వారి నెల్ల నిర్దయవై గంగాప్రవాహమునకు బలివెట్టితివి. కన్నబిడ్డల నిట్లు చంపి పాతకంబున కొడిగట్టు స్త్రీ లెందేనిఁ గలరే? ఇంక

నైన నట్లు చేయకుము. నీ వెవ్వతెవు ? నీతలిదండ్రు లెవ్వరు ? పుత్త్రుల నిట్లు చంపనేల ? నీవృత్తాంతమును వినవలతు ననఁగా శంతనునకు మానుషస్త్రీరూపమును ధరించియుండు గంగ యిట్లనియె. రాజా ! నీవు పుత్త్రునిఁ గోరుచున్నావు. కావున నే నీపుత్త్రుని గంగా ప్రవాహము పాల్సేయను. వీనిం జంపను. నీ కొసఁగెదను. నాచేయుదాని కాటంకము గావించితివి గాన నేనిఁక నీ యొద్ద నుండ నొల్లను. ఇప్పుడే నిన్ను విడిచి చనెదను. నే నెవ్వతె నైనదియు నిఁక నీకుఁ జెప్పెద వినుము. నేను బుణ్యజల ప్రవాహ త్రిభువనపావని నగు భాగీరథిని. వసువులను వసిష్ఠుండు మనుష్యులలోఁ బుట్టుడని తొల్లి శపించియుండె, వారు భూమిలోఁ దమకు నన్నును నిన్నును జననీజనకులుగఁ గోరి మనయందు మనుష్యులై పుట్టుటకు సమ్మతించిరి. దేవకార్యార్థమై నేను మానుషరూపమును దాల్చి నీ కిన్నినాళ్లు భార్యనై యుంటిని. నాయం దష్ట వసువులు పుట్టుచుండఁగనే వారికి శాపావసానమును వసిష్ఠుండు నిర్ణయించియుండెను. కావున వారు జన్మింపఁగనే వారిని గంగయందుఁ ద్రోసి మరల పుణ్యలోకములయందు వారిస్థానములకుఁ బంపుచు వచ్చితిని. ఈ సంకేతము వసువులకును నాకును నిర్ణయింపబడియుండెను. ఈవసువులు నీకుఁ బుత్త్రులై పుట్టుటచే నీకు నశింపని పుణ్యలోకములు బహువర్షములు కలుగును. ఈపుత్త్రుని నీకొసంగెద. వీనిని రక్షించుకొనుము. నేను పూర్వ మీవసువుల మేర్పఱచుకొనునప్పుడు వసువులతో నిట్లంటిని. పుత్త్రులు కలిగియుఁ జచ్చినచో నీ వపుత్త్రకుఁడ వగుదు వని ధర్మబుద్ధితో నీకుఁగా నేను వారిని బుత్త్రలాభముకొఱ కొక్కని యాచించితి. అట్లు నేను బ్రార్థింపఁగా నావసువులందఱును దమలో నష్టమాంశ మేర్పఱచి యాయష్టమాంశములరాశియే యొక పుత్త్రుం డయ్యెడు ననిరి. ఈపుత్త్రుఁడు వసువులయష్టమాంశములరాశియై పుట్టెను. వీఁడు చిరంజీవియై యుండును. అని చెప్పఁగా శంతనుఁడు విని యావనితను భాగీరథినిఁగా నెఱింగి యాలోకపావనితో నిట్లనియె.

జాహ్నవీ! వసువులు వసిష్ఠున కేయపకృతిం గావించిరి? ఈశిశువు భూమిలో బహుకాల ముండుటకు వీఁడు చేసినదోష మేమి ? మహా

సీయులగు వసువులు భూలోకమున మర్త్యులై పుట్టి రన నాశ్చర్యము కలుగుచున్నది. ఈవృత్తాంతంబంతయు వినిపింపు మనఁగా శంతనునకు మందాకిని యిట్లనియె.

వరుణపుత్త్రుండగు వసిష్ఠమునికశ్యపప్రజాపతికి సురభివలనం జనించిన నందిని తనకు హోమధేనువై యుపచరించుచుండ దానివలనఁ గోరిన వస్తువుల నెల్ల బొందుచు మేరుపర్వతమునందుఁ దపమాచరించుచుండె. అంతట నొక సమయమున వసువు లెల్లరును ద్రిభువనముల సంచరించుచు వసిష్ఠుండు తపమాచరించుచున్న మేరుపర్వతసమీపంబున నాశ్రమమునకుఁ బోయిరి. వారలెనమండ్రును దమభార్యలతో వసిష్ఠునకు సకల పదార్థములను వలసినపుడెల్ల నొసఁగు నందినిని జూచి దాని సుగుణములకు వింతనొందుచుండ నష్టమవసువుభార్య తనభర్తతో నిట్లనియె. ఈయావుపాలు త్రావినవారు పదివేలేండ్లు ప్రాయముగలవారై ముదిమిఁ జెందక సుఖులై యుందురని విందును. భూలోకమున నుశీనరుఁ డను రాజర్షికుమార్తె జితవతియనునది నాకు సంగాతకత్తె. దాని కీయావు నిచ్చి పంపినచో నాకెంతయుఁ బ్రియమైయుండును కావున దాని నెటులైనఁ బట్టి తోలుకొని పోయి నా నెచ్చెలి కిమ్ము. అట్లు చేసినచో నాజితవతి పెక్కువేలేండ్లు జరారుజావర్జితయై సుఖించు. అని చెప్పఁగా నాతండు భార్యకుఁ బ్రియంబు సలుప నిశ్చయించి తన యన్నలం బిలుచుకొని వసిష్ఠునకుఁ దెలిసినచో నామునీంద్రుండు తమ్మేమి చేయునోయని యెంత మాత్రము భీతిల్లక యాముని ఫలములం గొని తెచ్చుటకాశ్రమమును వీడి వనమునకుఁ బోయియుండ, విధిచోదితుండై యాయావుం దోలుకొనిపోయెను. అంత వసిష్ఠుం డాశ్రమమున కేతెంచి హోమధేనువుం గానక దానిని వసువులు ముచ్చిలి గొనిపోయి రని యోగమహిమం దెలిసి వారి నెల్లను మనుష్యయోనిం బుట్టునట్లు శపించె. అంత వసువులు వసిష్ఠుండు తమ్ము నందఱను మానవశరీరధారు లగునట్లు శపించెనని తెలిసి మనుష్యదేహం బెత్తుటకు వెఱచి క్రమ్మఱ నందఱును వసిష్ఠుడున్న మేరుపర్వతప్రాంతమందలి యాశ్రమమున కేతెంచి యమ్మునీంద్రుం జూచి యిట్లనిరి. మహామునీ! మాయపరాధమును క్షమింపుము. తెలివితక్కువవారమై మీయావును దోలుకొనిపోయితిమి. శాపమో

మోక్షము ననుగ్రహింపుము. అని ప్రార్థింప నామహాత్ముండు వారికిఁగరు ణించి వారితో నిట్లనియె. వసువులారా ! నాశాపమువ్యర్థముకానేరదు. మీరంద ఱొక్కసంవత్సరము మాత్రము భూలోకమున నుండి మనుష్యదేహములను వదలి శాపవిముక్తు లయ్యెదరు. నాధేను వును గొనిపోయిన యష్టమవసువుమాత్రము భూలోకమున బహువర్ష ములు జీవించియుండి సకలవేదశాస్త్రముల నభ్యసించి యొకకారణ మునఁ దండ్రికిం బ్రియంబు సేయఁదలఁచి స్త్రీలం గూడుట వదలి సంతా నము లేనివాఁడై పిదపశాపమోక్షముం బడయును. అని వసిష్ఠుం డాన తిచ్చెను. అంతట వసువులు నాకడ కేతెంచి నాయందు నీకుఁ బుట్టు వారైనిన్నయించుకొని పుట్టుచుండఁగనే తమశరీరములను గంగయందు వేయవలయు నని నన్ను వేఁడిరి. వారి కా వరము నొసంగితిని కాన వారి శరీరములునాయందుండి వెలువడఁగనేగంగయందుఁబడవేయుచువచ్చితిని. ఈయున్న పుత్త్రుండు చిరకాలము జీవించియుండును. అని జాహ్నవి తన మానుషస్వరూపము మెత్తుటకుఁ గారణమును, వసువులు మర్త్యులగు టకు వసిష్ఠుని శాపకారణమును వినిపించి, శిశువు నెత్తికొని యదృశ్య యయ్యెను. ఆశిశువునకే దేవవ్రతుఁడనియు, గాంగేయుఁ డనియుఁ బేళ్లు.

అంత శంతనుండు తనసతీసుతు లదృశ్యులై పోవుటకు వగచి హాస్తిపురంబు సేరి పరమధార్మికుఁ డని ప్రజలు నుతించుచుండ బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచుండె.

## గంగ భీష్మునిఁ దెచ్చి శంతనున కిచ్చుట

అవ్విధంబున గంగ పుత్త్రునితో శంతనుని వదలి ముప్పదియాఱేం డ్లుండెను. ఇట్లుండ నొక్కనాఁడు శంతనుండు మృగయావినోదంబు సలు పుచు గంగాతీరంబున మసలుచుండ గంగ యత్యల్పప్రవాహముతోఁ దనకుఁ జూపట్టుటయును, నిందులకుఁ గారణం బేమియో యని శంత నుండు మనః నాలోచించుచుండె. అప్పు డొక్కపురుషుండు తనశర ప్రయోగంబున గంగను బ్రవహింపనీయక యడ్డుగట్టియుండం జూచి యాతని యద్భుతకార్యమునకు మనమున నాశ్చర్యపడుచుండ నా

పురుషుం డంతర్హితుం డయ్యెను. అప్పుడు శంతనుండు జాహ్నవినిఁ బ్రార్థించి యామహాపురుషుం డెవండో తనకుఁ జూపు మనఁగా గంగాదేవియుఁ దాను పూర్వము శంతనుదేవిగా నున్న రూపుం దాల్చి శంతనుసమాగమమున జనించి పెంపఁబడి పెద్దవాఁడైన పుత్త్రునిదక్షిణకరంబును బట్టుకొని శంతనుముంగట నిలిచెను. అప్పుడు శంతనుఁడు తన్నును, దన కుమారుని గుర్తింపలేక మీ రెవ్వరో యని బిత్తరిచూపులతో నుండఁగా గంగాదేవి శంతనున కిట్లనియె. నరేంద్రా! నేను తొల్లి నీకు భార్యగానున్న దానను. వీఁడు నీవలన నాకుఁ బుట్టినకుమారులలో గంగయందు నేను బ్రవాహమునఁ బడవేసినవారు పోఁగా నేను గనుచుండఁగనే నీవడ్డగించి యీపుత్త్రుని గంగయందుఁ బడవేయవల దనఁగా నే నాఁగి నీయిష్టము చొప్పునఁ బ్రవర్తింపఁగా మిగిలి బ్రతికినవాఁడు. అదియు విధిప్రేరణము. వీఁడు నీయెనిమిదవకుమారుఁడు. వీఁడు శిశువుగా నుండఁగా నీవు వీనిని గాపాడలేవని నేనదృశ్యనై పోవుచు వీనిని సైత మెత్తికొనిపోయి పెంచి పెద్దవానిని జేసితిని. ఈతం డిన్నిసంవత్సరములు నాయొద్దఁ బెరిగి వసిష్ఠునకు శిష్యుండై వేదవేదాంగముల నభ్యసించె శుక్రబృహస్పతులకుఁ దెలిసిన నీతిశాస్త్రము నంతయు నభ్యసించె. మఱియుఁ బరశురామునితో ధనుర్విద్యావిలాసముల నెల్లఁ జదివె. ఇట్టివాఁడగు నీపుత్త్రుని నీయింటికిఁ దోడ్కొనిపొమ్ము. అని భీష్ముని శంతనునికై వశపఱచి గంగాదేవియదృశ్య యయ్యె. అంత సకలశాస్త్రవేత్త యగు సుతుని శంతనుండు దోడ్కొని హస్తినాపురమునకుఁ బోయి మంత్రిపురోహితపౌరజానపదుల నెల్ల రావించి వారిసమక్షమున సకలగుణముల విరాజిల్లు దేవవ్రతుని యౌవరాజ్యాభిషిక్తునిగఁ జేసి యుల్లమున సంతసిల్లుచుండె. గంగాపుత్త్రుండును దండ్రికి వినయపరుండై ప్రజలకుఁ బ్రియుండై, ధర్మము నతిక్రమింపక తండ్రి యనుమతిం గొని ప్రజాపాలనంబుఁ గావించుచుండె.

### శంతనుండు సత్యవతిని వరించుట

ఇవ్విధమున సంవత్సరములు నాలుగు గడచినవి. అంత నొక్క నాఁడు శంతనుండు యమునానదీతీరమున విలాసమున విహరించుచుండ నొక్కమారుతము వానిఘ్రాణముల నానందింపఁజేయు దివ్యగంధమును

గొని తెచ్చెను. ఆసుగంధపరిమళమునకు మనస్సు సొక్కి యాగంధం బేదారినుండి వచ్చెనో యాదారింబట్టి పోయి యయ్యది యొక యతివ మేని సుగంధముగ గుర్తించి దానిం జేరి యడుగుటకుఁ బ్రయత్నించి యది యోజనగంధి యను దివ్యసుందరమూర్తిగా నెఱింగి యాకన్యకం దఱిసి యిట్లనియె. ఓగంధవతీ! నీ వెవ్వతెవు? ఎవనికుమార్తెవు? ఇచ్చోట నీ వేమి చేయుచున్నదానవు? అని యడుగ నాకన్యక శంతనున కిట్లనియె. నేను దాశరాజుకూఁతురను. నన్ను యోజనగంధియనియు, మత్స్యగంధియనియుఁ బేర్కొందురు. నాతండ్రి యాజ్ఞమెయి నిచ్చోటఁ ధర్మార్థముగ యమున నీరోడచే దాటింతును. అనిన విని శంతనుండు దాని రూపరేఖావిలాసములకును దానిమైనుండి వెలువడు పరిమళ సుగంధవాయువులకును మోహించి దాశరాజునొద్దకుం బోయి యాకన్యకను దన కిచ్చి వివాహము గావింపు మనఁగా నాతండు శంతనున కిట్లనియె. రాజేంద్రా! ఆఁడుపిల్లపుట్టినంతటనే యన్యున కొసంగవలసినది మేలైనధర్మము. అందుఁ దగినవరుఁడు లభ్యపడినపు డొసంగి తీరవలయును. నీవంటిగుణోత్తమవరుండు లభ్యపడఁగా వెనుదీయ వచ్చునే? నా కొకవరము నిచ్చి కన్యకను గొనిపొమ్ము. అనఁగా శంతనుం డావర మీయ నలవి యేని యిచ్చి కన్యకఁ గొనిపోయెద. అడుగు మనఁగా; దాశరాజు "దీనియందు నీకు జనించు పుత్రునకు నీయనంతరము నీ రాజ్యము నొందునట్లు వర మొసఁగి కన్యకం గొనిపొమ్మ"నెను. అప్పటికే యావరాజ్యపట్టాభిషిక్తుఁ డైన దేవవ్రతుని శంతనుండు తలంచి యావర మీనొల్లక మరల వచ్చినత్రోవ హస్తినాపురముం జేరి యోజనగంధిం దలంచుచు నిట్టూర్పు నిగుడ్చుచు మన్మథునొఱపులం బడుచు నేమియుం జేయనేరక చింతాక్రాంతుండై యుండె.

అంత గంగాపుత్రుండు తండ్రినిసమీపించి యోగక్షేమము లారసి యాతనిమనోభావం బుపలక్షించి దానికారణంబు లరయఁ గోరి యిట్లనియె. రాజేంద్రా! నీపాలించురాజ్యంబునఁ బ్రజ లెల్లరు సుఖులై యున్నారు. సామంతులు విధేయులై సకాలమునకుఁ గానుకలను, గప్పములను నొసంగుచున్నారు. శత్రురాజులు విధేయులై యున్నవారు, ఎట్టికొఱంతయుఁ గానరాదు. ఇట్లు రాజ్యపాలనంబు శాంతియుతంబై

యుండ నీవు చింతాక్రాంతుండ వగుటకుఁ గారణమేమి? అశ్వారోహణాది విలాసములకు విముఖుండవై యున్నావు. వనకేళిసలుప నొల్లవు. ఆ ఖేటంబు మఱి కింపుగాదు. నీశోకకారణంబు నాతోడ నేనియుఁ జెప్పవు. ఇట్లుండుటకుఁ గారణము నానతీయవే? యని యడుగఁగా శాంతనవునకు శంతనుం డిట్లనియె. కుమారా! నామనస్సునం దుండు కొఱంతను నీకుఁ దప్ప మఱియొవరితోఁ జెప్పుదు? వినుము. ఇంతకాలమునకు నాకు నీ వొక్కరుఁడవే కుమారుండవు. అందును సకలవిద్యలను, క్షత్రియోచితశస్త్రాస్త్రవిద్యలను సంపూర్ణముగ నేర్చిన మహానీయుండవు. వ్యర్థులగు నూర్గురుకొడుకులకంటె నధీతసర్వశాస్త్రకోవిదుం డగుపుత్త్రుం డొక్కఁడే చాలును. నీవు సకలశస్త్రాస్త్రవిద్యల నిపుణుండ వగుటవలనను, రణములయందుఁ గ్రూరుఁడ వగుటను, శత్త్రురాజుల నడుముటలో సాహసికుఁడ వగుటను నీయునికి నే నంతగా నమ్మకున్నాఁడను. బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయవలయు. మఱియుఁ బెండ్లాడెదను. అనిన విని గాంగేయుండు వృద్ధులగుమంత్రులతోను బురోహితులతోను సుహృజ్జనులతోను విచారించి యోజనగంధిపై రాజుచిత్తము తగిలియుండుట నెఱింగి యనేక రాజన్యులతోడం గూడి దాశరాజు కడకుం జని మా రాజునకు సత్యవతిని దేవేరిగా నిచ్చునది యని యడిగిన నాతండును దేవవ్రతుం బూజించి, 'నీవు ధర్మశీలుండవు; అర్థానర్థవిదుండవు; సకలకార్యసమర్థుండవు; గుర్వర్థంబు కన్యార్థివై వచ్చితివి; కావున నేను గృతార్థుండ నైతి. ఈకన్య యుపరిచరవసు రాజపుత్త్రిక. ఆ రాజర్షి యిక్కన్యకను నా కొప్పగించునప్పుడు దీని నొరుల కీవలదు. శంతనున కిచ్చునది యని చెప్పఁగా నసితుండైన దేవలుండు కన్యార్థియై వచ్చి దీని నడుగ నతండు దీనికిఁ దగినవరుఁడు గాఁ డని యొసఁగనైతి. ఇపుడు మీతండ్రి యిక్కన్యకకు వరుఁడుగా లభించి నందుల కెంతయు సంతసింతు. ఇది శ్లాఘ్యమైనసంబంధము. దీనిని వదలుటకు నా కిచ్చలేదు. నేన కాదు. మహేంద్రుండైనను నిట్టిసంబంధమును విడుచునే? అంతయు ననుకూలముగ నున్నది. అయినను గన్యకకుఁ దండ్రి నగుటం జేసి యొకటి చెప్ప నవసర మయ్యె. మీతండ్రికి దీనియందుఁ గలుగుపుత్త్రుఁడు నీకు సపత్నీమాతృపుత్త్రుఁ డగును. దానం

జేసి మీకిరువురకును విరోధము గలుగును. నీ కెట్టిపరాక్రమవంతుఁడు శత్రువైనను నీయెదుటఁ జిరకాలము ప్రాణములతో జీవింప నోపునే? యని నేభీతిల్లియున్నవాఁడను. ఇవ్విధమున నాలోచించిచూడ సత్యవతిని నీతండ్రికొసంగుటలో నాకు సంశయమయ్యెడిని. ఇఁక నీవేమిచెప్పెదవో వినియెద' నని దాశరాజు మిన్నకుండె. అపుడు భీష్ముఁ డాతనిం గాంచి దాశరాజా! ఈ నీ రాజసభలో నేఁజేయు ప్రతిజ్ఞను వినుము. సర్వవిధవైరములకు మూలమైన రాజ్యమును నే నుండుకాలముననె త్యజించితిని. ఈ సత్యవతియందు మాయయ్యకుఁ బుట్టువాఁడే మాకెల్ల రాజగుఁగాక. ఇట్లీసభామధ్యమున వ్రతమును బూనితిని. అని చెప్పఁగా దాశరాజు దేవవ్రతున కిట్లనియె. 'మహానీయా! వినుము. ఇట్టి వీరవ్రతమును బూనుటకు నీవంటితెంపరికి ధర్మాత్మునకుఁ దగుఁ గాని యొరుల కిది సాధ్యమగునే? ఈ కన్యకవిషయమున సకలచర్యలకును నీవే నియామకుఁడవై యుండెదవు కాని యింకొక్కటి చెప్పెద. వినుము. సత్యవతీనిమిత్తమున సత్యవ్రతమును బూని రాజ్యము నెల్ల సత్యవతీసంతానమునకే నీ విచ్చుటకుఁ దీర్మానించుకొనినను నీసంతతివారు తమరాజ్యమును గ్రహింపకుందురే? యని సందేహము గలుగుచున్న' దని చెప్పఁగా విని గాంగేయుండు దాశరాజుభావము నెఱింగి యెటులైనను దండ్రికిఁ బ్రియము సలుపువాఁడై దాశరాజు నుద్దేశించి యాసభలో మఱియు భీష్మంబైనపలుకు నుడివెను. దాశరాజా! నేను మున్నే రాజ్యమును త్యజించితి. నాసంతతివారేని మఱల నీ రాజ్యము నపేక్షింతు రను సంశయము తీఱఁగ నేను వివాహముఁ జేసికొనక నియమముతో నాకలకాలము బ్రహ్మచారినై యుండెద. అట్లైన నాకు సంతానమే కలుగదు. సంతతి లేనివాఁడనైనను నాకు శాశ్వతపుణ్యలోకము లనేకములు గలవు. నీయిచ్ఛమేరకు వ్రతపరాయణుండనైతిని. ఇఁక సత్యవతిని మాతండ్రికీయఁ దగునుగదా! అనఁగా దాశరాజు సంతుష్టస్వాంతుండై సత్యవతిని శంతనున కిచ్చెద ననియె. అంత నాగంగాపుత్త్రుని యత్యుత్తమమైన సజ్జనత్వమునకును బితృభక్తికిని దేవతలు మెచ్చి వానిపైఁ బూలవాన గురిసిరి. ఇతరభయోత్పాదకములగు కార్యముల నాచరించుటంజేసి

యాదినముమొదలు దేవవ్రతుండు భీష్ముం డని పేర్కొనంబడెను. అంత నాదేవవ్రతుండు సత్యవతియొద్ద కేగి యమ్మా! మీతండ్రి నిన్ను నాతండ్రికొసంగెను. మనయూరికిఁ బోదము రమ్ము. ఇదిగో రథ్యములం బూన్చిన రథ మాయితమై యున్నయది. దాని నెక్కు మని చెప్పి యామెం దోడ్కొని హస్తిపురప్రవేశము గావించి యామెను దండ్రికి నివేదించెను. రాజు లెల్లరు నాదేవవ్రతుని సాహసకార్యములం జెప్పుకొనుచు నాతని భీష్ముండనిరి. అంత శంతనుండు పుత్రునిసాహసకార్యమున కొకవంక నాశ్చర్యమును, వేఱొకవంక సంతోషమును బొంది, భీష్ముఁ డనునామ మాతనికి సార్థక మనెను. అంతఁ బుత్రునకు సంతోషించి శంతనుండు వానికి స్వచ్ఛందమరణము వరముగా నొసంగెను.

## చిత్రాంగద విచిత్రవీర్యుల జననము

పిదప శంతనుండు తనయిష్టానుసారముగ యోజనగంధి యను నామాంతరముఁ గల దాశరాజుపుత్రి సత్యవతిం బెండ్లాడి క్రమమున నాదేవియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యు లను పుత్రులం బడసి వారి బాల్యమునందే పరలోకగతుం డయ్యెను. అంత భీష్ముండు తండ్రికి ప్రేతకార్యముల నొనర్చి వెంటనే సత్యవతి యనుజ్ఞఁగొని చిత్రాంగదునకు కౌరవరాజ్యాభిషేకము గావించెను. ఆచిత్రాంగదుం డతి పరాక్రమవంతుండై తోడిరాజులను శూరులను లక్ష్యపెట్టక, దేవతలతోను దానవులతోను గంధర్వులతోను నెల్లప్పుడుం బోరాడుచుండె. అంతఁ గొన్నినాళ్ళకుఁ జిత్రాంగదుం డనుకౌరవరాజుపేరుగల గంధర్వుం డొకఁడు కురువంశపుఁ జిత్రాంగదునిపై విజృంభించి యుద్ధమునకుఁ బిలువఁగా నాచిత్రాంగదద్వయమునకుఁ గురుక్షేత్రంబున మూఁడేండ్లు పోరు సరస్వతీనదీతీరమున ఘోరంబుగాఁ బ్రవర్తిల్లె. ఆపోరునందు గంధర్వుండు మాయాబలంబుఁ బరపి కౌరవచిత్రాంగదుం దెగఁజూచె. అట్లు సత్యవతీసూనుం డగు చిత్రాంగదుండు గంధర్వునిచే నిహతుం డగుటకు భీష్ముం డెంతయు వగచి వానికిఁ బరలోకకార్యములం జేసి వాని తమ్ముం డగు విచిత్రవీర్యునిఁ గౌరవరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుం జేసెను. అంత రాజు బాలుండు గావున భీష్ముండు సత్యవతి యనుమతిం గొని

రాజ్యకార్యముల నెల్లఁ దాను నడపుచుండె. విచిత్రవీర్యుఁడును దేవవ్రతుమాట జవదాఁటక యాతని యాలోచనమేరకు ధర్మమున రాజ్య మేలుచుండెను.

అంతఁ గొన్నిదినములకు విచిత్రవీర్యునకు వివాహోచితకాల మగుటఁ గాశిరాజపుత్త్రికలగు నంబాంబికాంబాలికలకు స్వయంవరోత్సవము వారితండ్రి సాటఁగా నావృత్తాంతమును భీష్ముఁడు విని సత్యవతి యనుమతిం గొని రథారూఢుండై కాశీపురమునకుం బోయి స్వయంవర మందిరము సేరి యచ్చోట స్వయంవరాహూతు లగురాజన్యవరుల సమక్షమున నాకన్నియలం జూచి, వారి కచ్చోట మూఁగియుండురాజుల పేళ్లను తెలియఁ జెప్పుచుండ భీష్ముండు వారిముగ్గురను హఠాత్తుగా "నే నీకన్నియలను నాతమ్ముండు విచిత్రవీర్యునకుఁగ వరించి కొనిపోవు చున్నాను" అని వారిముగ్గురను దనరథంబుపై నెక్కించుకొని బిగ్గరగా జలదనిస్వనంబుతో సకలరాజుల కిట్లనియె.

**భీష్ముఁడు రాజుల నెల్లరజయించి కాశిరాజుకన్యలఁ దెచ్చి విచిత్రవీర్యునకు వివాహము చేయుట**

రాజన్యులారా! వినుఁడు. లోకమున నెనిమిదివిధము లగు వివాహములు గలవు పెద్దలు కొందఱు సద్గుణవంతుఁ డయినవరునిఁ బిలిచి వానికుచితముగ ధన మొసంగి, తమశక్తికొలంది నాభరణముల తోను, వస్త్రములతోను నలంకరించిన కన్యకను దానము చేయుట బ్రాహ్మవివాహమందురు. మఱికొందఱు వరునివలన నొకగోమిథునమునుదీసికొని గాని, రెండుగోవులను దీసికొని గాని కన్య నిచ్చి వివాహముచేయుట యార్షవివాహ మందురు. ఇందు హోమద్రవ్యాదులను గన్యాదాత నేకరించునిమిత్తము గోమిథునమును గొనును. కొందఱు కన్యక తలిదండ్రులు కోరినధనమునొసంగి కన్యకం గొని వివాహము చేసికొందురు. ఇది యాసురవివాహము. మఱికొందఱు బలవీర్యసాహసంబులఁ గన్యకం గొనిపోయి పెండ్లియాడుదురు. ఇది రాక్షసవివాహమనఁబడును. కన్యక నిదురించుచుండినఁగాని, లేక, యేవిధముననైన నొడలెఱుంగకయున్న ప్పుడుగాని దానిం గామించి సంగమించి వివాహము చేసికొనుట కలదు.

ఇది పైశాచవివాహమందురు. కొందఱు కన్యకలతలిదండ్రులు వరునిఁ బిలిచి
యీ మాకన్యకను నీకిచ్చి వివాహ మొనర్చెదము. ఇదియు నీవును సర్వ
ధర్మముల నాచరించునది యని వరుని నొడంబఱచి వాని కొసంగెదరు.
ఇది ప్రాజాపత్యవివాహము. మఱికొందఱు యాగ మొనర్చునప్పుడే ఋత్వి
జుని యార్త్విజ్యమునకు సంతసించి వానికి సోమయాజి తనకూఁతు నిచ్చి
వివాహము చేయవచ్చునందురు. ఇది దైవవిధానవివాహ మనఁబడును.
ఈయన్నివిధముల వివాహములలో నొక్కొక్కవర్ణమువారికిఁ గొన్ని
విధానము లుచితముగానుండును. అందు బలవీర్యసాహసములం గన్యలం
గొనిపోయి పెండ్లియాడుట రాక్షసవివాహము. రాజుల కుచితమై
యుండు. కావున నే నిప్పుడీకన్యకలను విక్రమించి గొనిపోయి
నాతమ్మున కిచ్చి వివాహము గావించెద. నన్ను గెల్చి కన్యకలను
విడిపించుకొనిపోవుటకు శక్తిపౌరుషములుగల వారు నాతోఁ బోరాడి
బలశౌర్యములఁ జూపి కన్యకలం గొనిపొండు. నేను మీతో
యుద్ధమునకు సన్నద్ధుఁడనై యున్నాఁడను.” అని భీష్ముండు భీష్మకార్యో
న్ముఖుండై యారాజుల నెల్లఁ బోరునకుఁ జీరఁగా వారెల్లరు
వెంటనే తనుత్రాణశిరస్త్రాణములను దాల్చి, సకలాయుధంబులఁ గట్టా
యితంబులైన తేరు లెక్కి, భీష్ము నడ్డగించి యందఱు నొక్కమొగి
నతనిపైకి సురవడించిరి. అప్పుడు భీష్ముఁడు వారు తనపైఁ బ్రయోగించిన
శరజాలముల నన్నింటిని నడుమన తునుముచుండె. అంత రాజు లెల్ల
రొక్కటంగూడి వర్షకాలమున మేఘములు కొండ నావరించి గొప్ప
జడివాన గురియించుపగిది భీష్ముపై బాణవర్షమును గురియించిరి. ఆ
శూరుండు తనహస్తలాఘవము మెఱయ వారిబాణముల నన్నింటిని నన్ని
బాణంబు లేసి వానిని నడుమనే ఖండించుచుండెను. పిదపఁ దనపై
బాణప్రయోగమును గావించుశత్రురాజులను వేర్వేఱ నొక్కొక్కనిపై
మూఁడేసి యమ్ముల నేసిన వారు భీష్మునిపైఁ దాము ప్రత్యేకప్రత్యేక
ముగ నైదేసిబాణములను బ్రయోగించిరి అంత దేవవ్రతుండు రోషా
రుణితలోచనుండై వారిపై రెండేసి ప్రత్యేకబాణముల నేసి కొందఱ
విండులఁ దునిమెను. కొందఱ విండులయల్లెత్రాళ్లఁ ద్రెంచెను. కొందఱ
ధ్వజములఁ గ్రిందఁబడ గొట్టెను. మఱికొందఱ మైమరువులఁ జించెను.
వేఱొకకొందఱతలలఁ దఱిగెను. ఇట్లు రాజలోకము నంతను బీభత్స

ముగఁ గొట్టి వారెల్ల రాశ్చర్యముతోఁ జూచుచుండఁ గాశీరాజకన్య కల మువ్వురం గొని హస్తినాపురంబునకు విక్రమవంతుం డై యేఁగు చుండెను.

అట్లు పోవుచుండ సాళ్వుం డను రాజు భీష్ము నదలించి నిలునిలు మని పోరునకుఁ బిల్వఁగా భీష్ముఁడు భీష్మముఖంబుఁ దాల్చి రథంబు నిలి పెను. అంత సాళ్వుండు రాజు లెల్లఁ జూచుచుండ భీష్మునిపై ననేకశర ములను వైచి నొప్పించెను. రాజు లందఱును సాళ్వుం గొనియాడిరి. అ ట్లందఱచేత శ్లాఘింపఁబడుచున్న సాళ్వుని భీష్ముం డుద్రేకంబున నిలు నిలు మని యెదిరించి తనసారథితో నిట్లనియె. గరుత్మంతుఁడు సర్పమును జూచినంతనే పట్టుకొని వధించుటకుఁ గొంతకాల మగును. అట్లు నీవును నేను సాళ్వునిఁబట్టి వధించువఱకు మనతేరిని వానియెదుటనే యుండునట్లు తోలుచుండు మనెను. వాఁ డట్లు సేయుచుండ భీష్ముండు విక్రమించి సాళ్వునియస్త్రములకుఁ దాను మాఱస్త్రముల నేయుచు, వారుణాస్త్రం బేసి వానిగుఱ్ఱములను గూల్చెను. ఐంద్రాస్త్రమును బ్రయో గించి సారథితల నుఱుమాడెను. అంత సాళ్వునిమాత్రము ప్రాణములతో వదలెను. ఇట్లు సాళ్వుండు పరాజితుండై తనపురమునకుం జనియె. స్వయంవరమునకు వచ్చిన రాజు లందఱును దమతమదేశంబుల కేఁగిరి.

ఇట్లు గాంగేయుండు రాజలోకంబు నెల్ల నశ్రమంబున నోడించి యాకన్యకలను గూఁతుండ్రమాడ్కిఁ, గోడండ్రంబోలె, జెల్లెండ్ర పగిది భావించి హస్తినాపురంబునకుఁ దోడ్తెచ్చి సత్యవతీదేవితో నాలో చించి యొక్కసుముహూర్తంబున విచిత్రవీర్యునకు వారిని వివాహంబు సేయనున్న వారిలోఁ బెద్దది యగు నంబ భీష్మునితో నిట్లనియె. నేను బూర్వము నామనస్సున సాళ్వరాజును వరియించియుంటిని. అతండును నాకనురక్తుండై యుండె. మాతండ్రియు మాయభిమతమున కీయ కొనియె. సకలరాజసమక్షమున నేను స్వయంవరకాలమున సాళ్వునే వరియింప నిశ్చయించియుంటిని. ఇంతలో నీవు నన్ను నాచెల్లెండ్రతో రథంబున నిడికొని స్వయంవరాగతరాజుల నోడించి హస్తినాపురంబునకుఁ దోడ్తెచ్చితివి. అబల నగు నే నేమి చేయుదాన? నామనోరథం బీడేర్పు

మని కోరెద. నీవు సకలధర్మముల నెఱింగిన మహానీయుండవు. నీ వెట్లుతలంతువో యని మనవి సేసెను. అప్పుడు గంగాపుత్త్రుండు తన మంత్రిపురోహితాప్తజనులతో నాలోచించి వారిసెలవుం గొని దాని సాళ్వునొద్దకుఁ బంపెను. అంబికాంబాలికలనుమాత్రము విచిత్రవీర్యునకు మహావిభవంబున వివాహము గావించెను. విచిత్రవీర్యుండును నాసుంద రులయెడఁ గర మనురాగంబుఁ గలిగి రాచకార్యములనెల్ల విడిచి కేవల కామపరతంత్త్రుండై స్త్రీలోలుండై యుండె. ఇవ్విధంబున నేడేండ్లు సెల్లెను. విచిత్రవీర్యుఁడు రాజయక్ష్మరోగబాధితుండై శోషించి సంతతిఁ బడయక మృతుండయ్యెను. అంత భీష్ముండు దుఃఖపరవశుండై తమ్మునకుఁ బ్రేతకార్యములను నిర్వర్తించి, యాపరానిపుత్త్రశోకంబున ననయుచున్న సత్యవతిని సమాధానపఱచుచు, నుపశమిల్లున ట్లొనర్చుచుండ నెట్టకేలకు ధైర్య మవలంబించి యుండి యరాజకం బైన రాజ్యం బకలంకంబుగా రక్షించుచున్న కొడుకు ధర్మజ్ఞమూర్తిం సమీపించి సత్యవతి యొక నాఁ డిట్లనియె.

గాంగేయా! వినుము. మీతండ్రి మహాధర్మపరుండు. నిర్మల కీర్తిని సంపాదించిన మహానీయుండు. అట్టివానికి మీరు కొడుకులుగ జనించితిరి. ఇరువురు విధిప్రేరణంబున గతించిరి. మీతండ్రి వంశము నుద్ధరించుటకు నీ వొక్కరుండ విప్పుడు మిగిలియున్న వాఁడవు. శంత నుని కీర్తియు, సంతతియుఁ బిండదానవిధానంబును నీయొక్కనియంద నిలిచియున్నది. పుణ్యకర్మముల నాచరించిన స్వర్గప్రాప్తియును, సత్య వచనమున దీర్ఘాయువును నెట్లో ధర్మ మట్లు నీయందు నియతమై యున్నది. నీ వెఱుంగని ధర్మములు, వేదశాస్త్రంబులు, పురాణేతిహా సములును లేవు. నీకు సకలధర్మములు, నాపద్ధర్మములు సకలమును దెలి యును. కావున మన కందఱకును శ్రేయోదాయకమైనదాని నొకటి నేఁజెప్పెద. దానిని నీవనుష్ఠింపవలయును. నీకూర్మి తమ్ముఁడును నాకుమారుండును గౌరవవంశము నుద్ధరింపనున్న వాఁడును నగు విచిత్ర వీర్యుండు సంతానమును బడయక పరలోకగతుం డయ్యె నని నీవెఱుం గుదు. వాఁడట్లు బాల్యమునసే మరణించియుండుటచే మనవంశ మింతటితోఁ బరిసమాప్తి యగుకాలము సంభవించినట్లున్నది. కావున

నీవు రూపసౌందర్యయుతులును, సంతతిం గోరియుండువారును నగు విచిత్రవీర్యుని భార్యలయందు దేవరన్యాయంబున సంతతిని బడయుము. వంశము నుద్ధరింపుము. కాదేని తగినకన్యకలను వివాహమాడి వంశమును నిలుపుము. ఎవ్విధముననైనను బితరులకుఁ బుణ్యలోకావాసమును గలిగింపుము. అరాజకంబైన ప్రతీపరాజ్యంబున కభిషిక్తుండవై ధర్మమునఁ బ్రజల నేలుము. బ్రహ్మ మొద లింతవఱ కవిచ్ఛిన్నముగా నిట్లు వచ్చినవంశము నీ వుండఁగనే నీతరమున నేదోయొక కారణమున విచ్ఛిన్నమై చనుటను, నీవు చూచుచుండుట ధర్మమే ? అని తల్లియును, మిత్రులును జెప్పఁగా విని భీష్ముండు వారల కిట్లనియె. ఇది ధర్మమేగాయినను నోతల్లీ! నాకాచరించుటకుఁ దగనిది. మున్ను దాశరాజు సభలో నేఁజేసిన ప్రతిజ్ఞ నీవెఱుంగని యదియే ? భూమి తనగుణమగు గంధమును, ఉదకము తనగుణమగు రసమును, తేజస్సు తనప్రకాశమును, వాయువు స్పర్శమును, నాకసము శబ్దమును నొకవేళ వదలిన వదలుఁగాని, యింద్రుఁడు తనపరాక్రమమును, సూర్యుఁడు తనతీక్ష్ణతను, జంద్రుఁడు శైత్యమును, యముండు ధర్మమును విడిచినను నే నాడినసత్యవాక్కును దప్పుదునే ? హస్తినాపురప్రభుత్వమే కాదు సుమీ! ముల్లోకముల నేలుట గాని, యింద్రపదవి గాని, యంతకంటె నుత్తమపదవి గాని యేది లభించినను నే నాడినసత్యవచనము దప్పను. కావున నీ యానతిమెయి నే నాచరింపనొల్లను. అని చెప్పఁగా ధర్మజ్ఞుండైన కుమారునకుఁ దల్లియైన సత్యవతి వెండియు నిట్లనియె. ధర్మమూర్తీ! నీవచనము నీవ్రతము నీధర్మము నే నెఱుంగనిది కాదు. నీవగుదివ్యతేజస్సున ముల్లోకములను వేఱుగ సృజించు సామర్థ్యముగల మహానీయుండవీవు. దాశరాజు సభలో నాఁడు నీవుచేసినప్రతిజ్ఞను నే నెఱుంగుదు. అయినను ఆపత్సమయమునం దాచరింపవలసినధర్మముల నేల యాచరింపరాదు? నీవు శుక్రాంగిరసుల కెనయైనవాఁడవు. కావున నాపద్ధర్మము ననుష్ఠించి కులమును గీర్తిని నిలిపి పితరులకుఁ బుణ్యలోకమునం దావాసము స్థిరపరచి మమ్మును సంతోషింపఁ జేయరాదే ? అనిన విని సత్యవతికి భీష్ముం డిట్లనియె. తల్లీ! వినుము. ఇది ధర్మ మనుపేరుతో నుండు నధర్మము. దీని నాచరించుటచే హాని కలుగును. మేలు కలుగదు. రాజులకు

సత్యమును వదలుట దగునే ? కావున నావిషయంబు విడువుము. శంతను సంతాన మవిచ్ఛిన్నముగ నుండు నిమిత్తము క్షత్రియోచిత మగు నదియుఁ బూర్వ మాచరింపఁబడు చుండినదియు నగు నాపద్ధర్మ మొకటి యున్నది. దానిం జెప్పెదను. ఆకర్ణింపుము. ఆధర్మమును సైతము మనలోఁ బెద్దలగువారితోను, మన కాప్తులగు మంత్రివర్గముతోను, ధర్మముల నెఱింగిన మన కులబ్రాహ్మణులతోను, నీతిపరులగు పౌరజనుల తోను నాలోచించి యనుష్ఠింపవలయును. అధర్మమును వివరించెదను. పూర్వకాలమునఁ బరశురాముఁడు దనతండ్రి యగు జమదగ్ని ని వధించె నని కార్తవీర్యార్జునునిపైఁ గ్రోధమునుదాల్చి వాని వేయిచేతులను నఱికి గతాసువుం జేసెను. అంతఁ దనివిఁబొందక సకలక్షత్రియకులమునకు నలిగి రాజుల నెల్లను నిరువదియొక్కమాఱులు వెదకివెదకి యుద్ధము చేసి వారిపై నానాస్త్రప్రయోగంబులఁ గావించి లోకము నిక్షత్రియ మగునట్లు చేసెను. అంత లోకమునందు క్షత్రియపురుషులు లేక పోయిరి క్షత్రియస్త్రీలు మాత్ర మెట్లైన వంశము నుద్ధరింపవలె నని తలపోసి క్షేత్రజుఁడు వంశకరుఁ డగు నని తెలిసినవారై యట్టి పుత్త్రో త్పాదననిమిత్తము వేదవిదు లగు నుత్తమబ్రాహ్మణులను సంతానకాంక్ష లై ప్రార్థించిరి. బ్రాహ్మణులును సంతానార్థము ప్రార్థించిన స్త్రీలనుబొం దుటయు, నాస్త్రీలకుఁ గలిగిన సుతులు క్షేత్రజు లై వారిభర్తలకుల ముల నుద్ధరించుటయు ధర్మమని యాస్త్రీల ప్రార్థనల నంగీకరించి యాకాల మున క్షత్రియ కులములను వృద్ధిఁజేసిరి. కావున క్షత్రియాంగన లుత్తమ బ్రాహ్మణసంగమమున సంతతిం బడయుట ధర్మమై యనుభవసిద్ధమునై యున్నది. ఇంతేగాక యీవిషయము నిదర్శనపూర్వముగఁ దెలియు నిమిత్త మొక యితిహాసమును వివరించెద.

## దీర్ఘతమునివృత్తాంతము

దేవగురు వగు బృహస్పతికి నుతథ్యుఁడను జ్యేష్ఠుఁడు భ్రాతగా యుండె. ఉతథ్యుని భార్య నిండుచూలాలై యుండ బృహస్పతి దానిం గామించి సంగమోన్ముఖుండు కాఁగా మమత యను పేరు గల యా యిల్లాలు 'ఓబృహస్పతీ! నేనిపుడు మీయన్నవలన గర్భమును ధరించియు

న్నదానను. నాగర్భములో నుండు నుతథ్యపుత్త్రుఁ డిప్పటి కీవేదవేదాంగ
ముల నధ్యయనము గావించియున్నాఁడు. నీసంగమమున నీయమోఘవీర్య
మునఁ బొడమువానికిని ఇదివఱకు నాగర్భమున మహానీయుండై పెరిఁగి
యుండు నుతథ్యపుత్త్రునకు నెడ ముండదు. కావున నిపుడు నీవు నాతో
సంగమము నుడుగుము.' అనఁగా మమతమాటలను బృహస్పతి యాద
రింపక దానిని బలాత్కరించి రమింప నుద్యమించెను. అపుడు గర్భ
మునందున్న యుతథ్యపుత్త్రుఁడు గర్భము రేతస్సున దడుపఁబడుచుండుట
నాలోచించి బృహస్పతి తనతల్లి వల దన్నను బలాత్కరించి యామెను
గమించుటం జేసి గర్భమిప్పుడు రేతస్సుచే చెమ్మఁదగులుచున్న దని
తెలిసి యోసురాచార్యా! యిపుడు నీయుద్యమము తగనిది. ముందుగ
నే నీగర్భమున నుద్భవిల్లి వర్ధిల్లుచున్నాను. ఇఁక నీరేతస్సు పడుటచేఁ
గలుగు రెండవవాని కీగర్భమున నెడముండదు. కావున నీతలపెట్టిన
కార్యము నుడుగుమనెను. బృహస్పతియు గర్భమున నున్నవానిమాటల
సైతము సరకుగొనక రతిపరవశుండయ్యెను. అంత నాగర్భస్థుండగు
బాలుఁడు గర్భమున రేతస్సును బడనీయక దనపాదమున గర్భద్వారము
నడ్డగించె. అప్పుడా రేతము గర్భములోనికిఁ జొచ్చుటకు వీలుగాక
పొఱలి క్రిందఁ బడెను. బృహస్పతి గర్భస్థుండైనబాలుం డడ్డగింపఁగా
నిది యిట్లు వ్యర్థమయ్యె నని కోపించి సర్వభూతములకు హితంబైన
యిక్కార్యంబునందు నాకుఁ బ్రతికూలుండ వైతివి. కావున దీర్ఘతమంబును
బొందు మని శాపం బిచ్చిన వాఁడును దీర్ఘతముండు నాఁ బుట్టి సకల
వేదవేదాంగవిదుండై పుట్టుగ్రుడ్డియయ్యును దనవిద్యాబలంబున బహు
కాలంబునకుఁ బ్రద్వేషిణి యనునొక్కబ్రాహ్మణవనితను బెండ్లియాడి యా
రూపసంపన్నయందు మహాయశు లగు గౌతమాదు లైన కుమారులం
బడసెను. వీ రుతథ్యకులమును వృద్ధిఁజేసిరి. అంత నొక్కనాఁడు
వృషభ మొక్కటి యావుతో సంగమించుచుండ నాసంగతిని దీర్ఘత
ముండు గుర్తించి యప్పటినుండి చేతికిఁ జిక్కినగోవుతో జంకక కామచర్యల
జరుపుచుండఁగా నాయాశ్రమవాసులు వీని యసహ్యకార్యములకును
దుశ్చారిత్రమునకు రోసి వీని నీయాశ్రమంబున నుండనీయరా దని నిశ్చ
యించిరి. భార్యయగు ప్రద్వేషిణియుఁ బుత్త్రవతి యగుటం జేసి దీర్ఘత

ముని ననాదరణముతోఁ జూచుచుండె. అంత దీర్ఘతముండు భార్యంబిలిచి తన్నది ద్వేషించుటకుఁ గారణం బడుగఁగా బ్రద్వేషిణి యిట్లనియె. లోకమున మగఁడు భార్యను భరించుటంజేసి భర్త యనఁబడెను. పాలించుటంజేసి పతియనఁబడెను. నీవు పుట్టుగ్రుడ్డివై యుండుట నిన్ను బెండ్లియాడినది మొదలు నిన్నును నీబిడ్డలను నేనే భరించుచుఁ బోషించుచున్నదాన; ఇఁక నేను నిన్ను భరింపనేరను. అనఁగా దీర్ఘతముండు భార్యతో, ఓప్రద్వేషిణీ! నీకు ధనము కావలయు నని కదా యిట్లు చేయుచున్నదానవు. నన్ను రాజగృహంబునకుఁ దోడ్కొనిపొమ్ము. నీకు వలసినంత ధనము నిప్పించెద ననఁగా బ్రద్వేషిణి పతి కిట్లనియె స్వామి! దుఃఖకారణ మగుధనమూ నాకు వలదు. నీ విచ్చుధనము నే నొల్లను. నేను నీ వే మొసఁగినను నిన్ను నేను భరింపనేరను. నీయిష్టానుసారము వర్తిల్లు మనఁగా దీర్ఘతముండు కోపము గలవాఁడై యిట్లనియె. ఈ దినము మొదలు నేనొకవ్యవస్థను జేసెదను. స్త్రీలకు వారు బ్రతికియుండు నంతకాల మొక్కఁడే పతిగా నుండును గాక! వా రితరుల నపేక్షింపఁ గూడదు. ఆపతి పరలోకముల కేఁగినను వా రన్యునిఁ జేపట్టరాదు. వారినిఁ బొందరాదు. అటు లగుచో వారిని మహాపాతకంబు లావరించును. భర్తలేనిభార్య లెంత ధనవంతులైనను భోగవిముఖురాండ్రు కావలయును. అట్లు వా రీవ్యవస్థను మీఱి నడచిరేని యపనిందలకుఁ బా లగుదురు. దాన వారు కీర్తి తొలఁగి యపకీర్తిభాజన లగుదురు. అని వ్యవస్థాపూర్వకంబుగాఁ జెప్పగాఁ బ్రద్వేషిణి వానికిఁ గడుంగోపించి కుమారులను బిలిచి యీవిధమున నోటికి వచ్చినవాని నన్నిటిని వ్యవస్థగాఁ బ్రేలుచున్న యీముసలిబడుగును గంగలో ద్రోసి రం డనఁగా నా గౌతమాదులు రాగద్వేషములతోఁ గూడికొని పుట్టుగ్రుడ్డివాఁడును, ముదుసలియు, మహానుభావుండును నగు తండ్రిని నొక తెప్పకొయ్యకుఁ గట్టి యతిక్రూరులై గంగాప్రవాహమున నైచి మఱలి యాశ్రమంబున కేగిరి. దీర్ఘతముండును దన్నుఁ గట్టిన తెప్పకొయ్య వెల్లువయందు గొట్టుకొనిపోవుచుండఁగా బహుదేశములఁ గడచి యొక్కచోటఁ దెప్పతో గట్టుచేరెను. ఆతీరమున ధర్మాత్ముండును, సంపన్నుండును నగు బలి యనురాజు స్నానమునకు గంగకు

వచ్చి తెప్పకు బంధింపఁబడియుండు దీర్ఘతమునిం గాంచి వాఁ డొక మహానీయుం డని తలంచి వానిబంధములను వదలించి యతి వినయపరుండై యిట్లనియె. మహాత్మా! సంతానకాంక్షినై యున్న నాకు దయఁదాల్చి నాభార్యయందు నా కపత్యోత్పాదనము గావింపుము. నీవు గలిగించు పుత్త్రులు ధర్మార్థపరిజ్ఞానము గలవారై యుందు రని నానమ్మకము. అని విన్నవించి దీర్ఘతముని నొడఁబఱుపఁగా నాతండు వల్లె యన నతనితో సంగమింపఁ దనభార్య సుదేష్ణను నియమించె. అంత సుదేష్ణ యంధుండును వృద్ధుండును నగు నమ్మునిసంగమమునకుఁ బ్రియము పడక సంగమమునకుఁ దనదాసి నొక్కదాని నియమించె. అంత నద్దాసియందుఁ గాక్షీవాదాదులు పదునొకండ్రు మునికిఁ బుట్టి పెరుగుచు యథాకాలమున విద్యాభ్యాసము చేయుచుండిరి. అంత బలి యమ్మునితో నిట్లనియె. మునీంద్రా! వీరు నాకు క్షేత్రజులైన కుమారులు గదా! యని యడుగ నమ్ముని రాజున కిట్లనియె. ఆనాఁడు నీనియోగమున నీభార్య సుదేష్ణ యంధుండను, ముసలివాఁడను నగు నన్నిష్టపడక నాసంగమమునకు దాసి నొక్కదాని నంపెను. కావున నీబాలు రాదాసికిఁ బుత్త్రు లగుదురు. కాని, నీకు క్షేత్రజులు కానేర రనెను. అప్పు డారాజు వగచి మఱల నమ్మునిం బ్రార్థించి యెట్లులైనఁ దనక్షేత్రమగు సుదేష్ణయందుఁ దన కపత్యములను గలిగింప వేఁడికొని యాతండు వల్లె యనఁగా మఱల సుదేష్ణను నామునిసంగమమున కొడంబఱిచి యాతని యొద్ద కొకరేయి పంచెను. అంత సుదేష్ణయు భర్త్రనుమతింగొని మునిపాలి కరుగ నమ్ముని యంధుండు గావున దాని సర్వావయవముల నంటి చూచి దాని సుదేష్ణగా నెఱింగి యోసుదేష్ణా! నీకు సూర్యునితేజస్సువంటి తేజస్సుగల పుత్త్రులు కలిగెద రని దీవించి దానిసంగమమున కుపక్రమించె. అప్పు డమ్మునికి సుదేష్ణయందుఁ గ్రమమున నంగ, వంగ, కళింగ, సుహ్మా, పుండ్రులనువారు పుట్టి తమతమపేళ్లతో నొప్పారునట్లు దేశములను బ్రతిష్ఠించిరి. ఇవ్విధమున బలిభార్య కమ్మునివలనఁ బుత్త్రులు పుట్టుటం జేసి వారు బలికి వంశకరులైరి. ఇంకను ననేకులు రాచకన్నెలు బ్రాహ్మణులవలన బుత్త్రులం గని తమభర్తలవంశములను నవిచ్ఛిన్నముగాఁ జేసిరి. మఱియు బ్రాహ్మణులవలనఁ గలిగినపుత్త్రులు శౌర్యధైర్యాదిసుగుణముల కాల

వాలంబులై విరాజిల్లిరి. కావునఁ దగినదాని నాలోచించి భరతవంశ మభివృద్ధిఁ గాంచుటకై గుణవంతుఁడును దపోధనుండును నగు బ్రాహ్మణు నకు ధనము నిచ్చి ప్రార్థించి తోడ్కొని వచ్చి విచిత్రవీర్యుని కళత్రంబుల యందు సంతానార్థంబు నియోగించుట శ్రేయస్కరము. అని చెప్పఁగా సత్యవతి కొంత లజ్జను గనుపఱచి యా దేవవ్రతునితో నిట్లనియె.

గాంగేయా ! నీ వాడినదంతయు ధర్మమును సత్యమును నగును. ఈసందర్భమున నీ కొకరహస్యవృత్తాంతమును నుడివెదను. దానిని విని యుచితము నాచరింపుము. నాపసితనమునందు నేను నాపుట్టినింట నుండఁగా నాతండ్రియనుమతిం గొని యమునానదిని ధర్మార్థముగఁ బుణ్యాత్ములను దాఁటించునిమిత్త మోడ నడపుటకు నియుక్తురాల నైతిని. అట్లుండ నొకనాఁడు తనదివ్యతేజోమహిమచేత దెసల నన్నిటిని విరాజిల్లఁ జేయుచుఁ బరాశరుండను మునివర్యుఁడు యమునం దాఁటు నిమిత్తము నాపడవ నెక్కెను. అంత నామహానీయుండు నన్నుఁ జూచి కామించి సంగమింప వేఁడెను. అప్పుడు నేను మీనుపోలఁగలచు దుర్గంధ శరీరముతో నుండ నన్ను సుగంధిఁ జేయుమనియుఁ దనతో సంగమించిన నాకుఁ గన్యాత్వము దూషితంబు గాక యుండవలయు ననియు వర ములు వేఁడితిని. అంత నాతపస్వి యప్పుడ నాయొడలి దుర్గంధమును నశింపఁజేసి యిప్పటిసుగంధము గల్గునట్లు చేసి నాకన్యాత్వము దూషి తముగాకుండ ననుగ్రహించెను. పిదపఁ దనతపోమహిమవలనఁ బట్టపగ లిరులుగావించి యొరులకుఁ గానరాక నాతో సంగమించెను. అంత నా యమునాద్వీపమునందు నాకు సద్యోగర్భంబునఁ బారాశర్యుండుపుట్టెను. ఆద్వీపమునఁ బుట్టుటం జేసి యాతండు ద్వైపాయనుం డనం బరఁగె. నీలదేహచ్ఛాయగలవాఁ డగుటచేఁ గృష్ణుఁ డనియు, వేదవిభాగము గావించియుండుటచే వేదవ్యాసుఁడనియుఁ బేర్కొనఁబడెను. ఆపుణ్యా త్ముండు పుట్టుచునే తాను దపంబునకుఁ బోయెద ననియు, నేను దన్నుఁ దలఁచినప్పుడు తనదర్శనము నాకిత్తు ననియుఁ జెప్పి తండ్రిగ్గైన పరాశరుని తోడ నరిగె. అమ్మహానీయునిఁ బిలిచి విచిత్రవీర్యుని క్షేత్రములగు నంబి కాంబాలికలయందుఁ బుత్రులఁ బుట్టింప వేడెద. ఇయ్యది నీయభీష్టం బైనచో నట్లగావించెద. అని చెప్పినంతనే గాంగేయుం డాకృష్ణద్వైపా

పాయనుని దివ్యనామంబు వినినంతనే వినయపరుండై రెండుచేతులను జోడించి మ్రొక్కి సత్యవతి కిట్లనియె. ఎవ్వఁడు ధర్మార్థకామములను మూఁటిని వానిఫలములను, వానివైపరీత్యములను నాలోచించి కర్తవ్యమును జేయునో వాఁడే బుద్ధిమంతుఁడు. నీ విప్పుడు చెప్పినది ధర్మయుతము, మనవంశమునకు హితమైనది. కావున నీయాలోచనయే సముచితంబు. అని చెప్పఁగా సత్యవతీదేవి శ్రీకృష్ణద్వైపాయనుని మనస్సున ధ్యానించుటయు వెంటనే యమ్మునిచంద్రుండగు శ్రీకృష్ణ ద్వైపాయనుండు వేదాధ్యయనంబు సేయుచుఁ దల్లికిఁ బొడసూపె.

### వేదవ్యాసుండు సత్యవతియొద్ద కేతెంచుట

అప్పుడు సత్యవతి తన తొలిచూలైన వ్యాసమహర్షిని జూచి నంతటనే కన్నుల నానందబాష్పములు రాల్చెను. వాని నెదుర్కొని పోయి కౌఁగిలించెను. అప్పు డామునివర్యుండు తల్లికన్నీరు దుడిచి నమస్కరించి 'యమ్మా! నన్నే పనినిమిత్తము తలంచితివి. నీయాజ్ఞ నవశ్యము నెరవేర్చెదను. కార్యమును నియమింపు' మనియె. అంత భీష్ముని యానతిమెయి రాజపురోహితుఁ డామునివర్యున కర్ఘ్యపాద్యాదుల నొసఁగి తెచ్చి పూజించిన, వాని నెల్ల నిక్కలిసంతోషముతోఁ గొని సుఖముగఁ గూర్చుండియుండఁ దల్లి, క్షేమ మడిగి పిమ్మట ని ట్లనియె.

'తేజోవంతుఁడా! వినుము. కుమారులు తండ్రియానతిమెయి నడుచుకొనురీతిఁ, దల్లిమాటలను సైతము విని వర్తించుట ధర్మముకాదె? నాపురాకృతసుకృతవిశేషమునంజేసి మహనీయుండవగు నీవు నాగర్భమునందుఁ బుట్టితివి. కావునఁ బ్రకృతము కర్తవ్యమును నీకుఁ జెప్పెద. గతించిన నాకుమారుఁడు విచిత్రవీర్యునకుఁ దండ్రిపార్శ్వమున గాంగేయుం డెట్లు సోదరుఁడయ్యెనో నీవును నామూలమున వానికి సోదరుఁడవైతివి. వానియకాలమరణమున నీసత్యవ్రతుఁడు వానిక్షేత్రములయందు దేవరన్యాయమునఁ బుత్త్రోత్పాదనంబు సేయు మనఁగా దాశరాజసభలోఁ దొల్లి తాఁ జేసినమాటను తప్ప ననుచున్నవాఁడు. ఇప్పుడు శంతను వంశము నేనుండఁగనే విచ్ఛిన్న మగుటకు మన సొప్పకున్నది.

కావున నీ విప్పుడు విచిత్రవీర్యక్షేత్రంబులయందు శంతనువంశకరుల నుత్పాదింపుము. దానంజేసి భారతవంశము వృద్ధి యగును. ఇట్లొన ర్చుట నాకును, నీదేవవ్రతునకును గడుఁ బ్రియంబు. మఱియు సర్వ భూతదయారక్షణానృశంస్యంబులను బరిశీలించి నావచనమును నడు పుము. రూపవంతులును యౌవనవంతులును నగు విచిత్రవీర్యునికళత్రం బులయందు దేవరన్యాయమున నీవు కొడుకులం గాంచుము. ఇదిసముచిత మని చెప్పఁగా విని యానీలతనుండైన కృష్ణద్వైపాయనుండు తల్లియగు సత్యవతి కిట్లనియె. తల్లీ! నీ విహాపరలోకసాధనంబు లగు ధర్మార్థకామ మోక్షము లను నాల్గుపురుషార్థములను లెస్సఁగ నెఱింగినదానవు. కావున నీమన స్సెల్లప్పుడు ధర్మాచరణమునందే వర్తిల్లును. కావున నీ నియోగమున ధర్మమార్గ మవలంబించి నీకోర్కె నెఱవేఱునిమిత్తము మిత్రావరుణులకుఁ దుల్యు లైన యపత్యంబుల విచిత్రవీర్యుకళత్రంబుల బుట్టించెద. వారు నానిర్దిష్టప్రకారం బొక్కవత్సరంబు వ్రత మాచ రించినచో నేను వారలం బొంది నీయభిమతం బొడఁగూర్తును. సువ్రతలు గావలయు. శుద్ధిలేనివనితల నేను బొందను. అని చెప్పి తనముందట నుండు వేదపురుషుంబోలు తనపుత్త్రు సాత్యవతేయు దివ్యతేజోవిలాసమున నొప్పువదనంబునఁ జూడ్కి నిలిపి సత్యవతి యిట్లనియె. వత్సా! వినుమా. ఇప్పుడే రాజ్య మరాజక మయ్యె. ఇప్పుడు కాలయాపన సేయఁదగదు. రాష్ట్రమునకు రాజు లేకున్న సర్వకార్యములకు హాని వాటిల్లును. ప్రజ లకుఁ బీడలుం గలుగును. కావున వేగంబ వారిని గర్భవతు లగున ట్లనుగ్రహింపుము. పిదప వారిగర్భజాతులను భీష్ముఁడు పెంచువాఁ డని చెప్పఁగా విని యప్పారాశర్యుండు తల్లీ! నీయభిమతం బట్టిద యేని, యీవనితలు నావికృతరూపమును నాశరీరంపుదుర్గంధమును సైచి యుం డవలయును. అటు లగుచో వారిప్పుడే గర్భవతు లగుదురు. నేఁటి రాత్రివేళఁ గౌసల్య యగు నంబిక యలంకృతయై పరిశుద్ధురాలై శయన గృహంబున నారాకఁ బ్రతీక్షించియుండ నియమింపుము. అని చెప్పి యామునివర్యుం డదృశ్యుండయ్యె. అనంతరము సత్యవతి విచిత్రవీర్యుని భార్య కౌసల్యయైన యంబికను సమీపించి యిట్లనియె. కౌసల్యా!

శించుట నెవరును లేరుగదా? ఏకాంతమున నీతోఁ గొన్ని మాటలం జెప్పి నిన్నొప్పించి పోవలయు ననివచ్చితి. ఆమార్గ మవలంబించినచో మనకు శ్రేయస్సు గలదు. మనదౌర్భాగ్యంబుకతన మీ యిరువురలో నెవరికిని విచిత్రవీర్యునివలన వంశకరుండైనపుత్త్రుండు పుట్టఁడయ్యె. మనము చూచు చుండఁగనే యీభరతవంశ మీతరమున విచ్ఛిన్న మగుట సంభవించి నది. అట్లు కాకుండున ట్లొకయుపాయమును నేనును మీ బావ భీష్ముండు నూహించితిమి. ఆయుపాయ మొనఁగూర్చుట నీయధీనమై యున్నది. నామాటలను విని మనకోర్కి నెరవేర్చుము. జీర్ణమైన యీభారతవంశ మభివృద్ధి నొందుటకు నీవు నీబావవలన మహేంద్రతుల్యుండగు సుతునిఁ బడయుము. ఎట్లైనను వంశమును రక్షించుట యుత్తమధర్మము. నీకుఁ గలుగు కుమారుఁడు రాజ్యభారమును వహించును. భారతవంశో ద్ధారకుఁ డగును అని యంబిక ననేకవచనములతో నొప్పించెను. వెంటనే యాదినము పగటియందుఁ గులదేవతలను బూజించుటకును, బ్రాహ్మణసంతర్పణంబు గావించుటకును సత్యవతి తగువారిని నియమిం చెను. కోడలిని బరిశుద్ధురాలై యుండున ట్లాజ్ఞాపించి దానితో నిట్లనియె. ఓయంబికా! నీ వీదినము రాత్రికాలమున నీశయనగృహమున శుచివై యుండుము. నీకడకు నీబావ వచ్చువాఁడు. అప్రమత్తవై యామహానీ యునిరాకకు వేచియుండుము. అని నియమింపఁగా నాయంబిక యత్త మాటమేరకుఁ బడకటింటికిఁ జని శుచియై పాన్పుపైఁ బరుండి బావరాక నిరీక్షింపు మనుటచే భీష్ముఁ డని తలంచుచుఁ దనకు బావ భీష్ముఁడు గాక యితరు లెవ్వరా యని తలపోయుచుండెను.

### ధృతరాష్ట్రపాండురాజవిదురుల జననము

అప్పుడు నడు రేయి యయ్యెను. దీపములు కాంతితో వెలుంగు చుండెను. అంతఁ గృష్ణద్వైపాయనుం డంబికపడకటిల్లు సొచ్చెను. ఆకోమలి యామహానీయుని మున్నెన్నఁడును జూచి యెఱుఁగదు. ఆతని కపిలజడలును, నెఱ్ఱనికన్నులును, బచ్చనైయున్న మీసములనుం గని భీతిల్లి కన్నులుమూసికొని యుండెను. అప్పుడు సాత్యవతేయుండు

తల్లికిఁ బ్రీతిగా దానితో సంగమించి వెడలిపోవుచుండఁగా, సత్యవతి పుత్త్రుం జూచి కోడలికి సత్పుత్త్రుండు గలుగఁగలఁడా ? యని యడిగెను. అంత నా వేదవ్యాసుండు సత్యవతి కిట్లనియె. అంబికయందుఁ జనించు వాఁడు పరాక్రమము సాహసము మున్నగు సద్గుణములతోఁ బదివేల యేనుఁగుల బలము గలవాఁడై నూర్గురుకొడుకులం బడయువాఁ డుద్భవిల్లును. కాని మాతృదోషంబునం జేసి యంధుఁ డగును. అనిన సత్యవతి వాని కిట్లనియె. తపోధన ! కౌరవులకు గ్రుడ్డివాఁడు రాజగుట తగదు. కావున నంబాలికయందైన వంశకరుండగు వేఱొకపుత్త్రునిఁ బుట్టింపుము. అనఁగా నప్పరాశరాత్మజుండు వెళ్లె ననెను. పిదప నంబికకుఁ గనుప్రొద్దు లగుటయు నంధుండైన పుత్త్రుండు పుట్టెను. ఆతండే ధృతరాష్ట్రుండనువాఁడు. అంత నొక్కనాఁడు సత్యవతి తనరెండవకోడలగు నంబాలికకడ కేతెంచి కురువంశవివర్ధనుం డగు సుతునిఁ బడయుటకుఁ దగినయుపాయమును జెప్పి దానియొద్దకు శయనాగారమున కొక మునివచ్చువాఁ డనియు, వానితోఁ సంగమింపవలయు ననియుఁ దాని నొడంబఱిచెను. అంత సత్యవతి తలంపఁగనే వ్యాసుండేతెంచి పడుకటింటనున్న యంబాలికను సమీపించెను. ఆకోమలియు నమ్మునిని ఘోరరూపమును, గపిలజడలను, నెఱ్ఱని కన్నులను, బచ్చనిమీసములను జూచి వెలవెలవోయి విషణ్ణహృదయ యయ్యెను. అంతవ్యాసుండు దానితో సంగమించి నారూపమును జూచి నీవు వెల్లనైతివిగాన నీకు సకలధర్మజ్ఞుండగు కుమారుఁడు గల్గియుఁ బాండువర్ణుండై పాండుండను పేరితో వెలయు నని చెప్పిపోవుచుండఁగాఁ దల్లి సత్యవతి వ్యాసునినడ్డగించి దీనియందు వంశకరుండైన సుపుత్త్రుండు కలుగునా యని యడుగఁగా నీపుత్త్రుండు సుగుణముల రాశియయ్యు మాతృదోషమునఁ బాండువర్ణశరీరము గలవాఁ డగునని చెప్పెను. అంత సత్యవతి మఱలఁ గుమారుని నంబికయందు సత్త్వగుణశ్రేష్ఠుని నుత్పాదింపు మని వేఁడఁగా వ్యాసుఁడు తల్లి మాటల కొడఁబడెను. అంత సత్యవతి యంబికను సమీపించి నీవు నీతొలిచూలు గ్రుడ్డివానిని గంటివి. నీచెల్లెలు

పాండుదేహుని గనియెను. కురువంశోద్ధారకుఁడు సర్వాంగసుందరుఁడై సకలసద్గుణముల కాలవాలంబై బలాఢ్యుఁడై యుండవలయును. మఱల నమ్మునిని నీకడకు రమ్మని ప్రార్థించితి. ఈపర్యాయ మతనికి నిర్భీకవై యుపచారములు సలుపుము. నీకుఁ దగినసుతునిఁ బొందుమని చెప్పఁగా నంబిక యత్తపలుకులకు మాఱాడక యప్పటి కష్టపడినట్లు నటించి ఘనస్సున నామునినాథుని వికృతరూపము, మేనిదుర్గంధము, కపిలజడలు, నెఱ్ఱని కన్నులు, పచ్చనిమీసములుం దలంచి భీతిల్లి తనదాసి నొకదానిని సకలాభరణములచే నలంకృతం గావించి శయనాగారంబున మునిరాకకు వేచియుండ నియమించెను. అదియుఁ బడుకటింటియందుఁ దనయజమానురాలి యానతిమెయి మునీంద్రుని సంగమించుటకై యా రాత్రి యాపడుకటింటియందు సంసిద్ధురాలై యుండెను. అప్పుడు వేదవ్యాసుండు సత్యవతితో నాడంబడినతీరున దివ్యతేజంబుతో యథారీతి నాశయనాగారంబును సమీపింపఁగా నాదాసి లేచి, మునికెదురేగి తోడ్కొని శయ్యం జేర్చి యాతనిని సకలోపచారంబులఁ దృప్తిపఱచి యాతనితోఁ గామోపభోగంబులఁ దేలెను. అంత వ్యాసుండు దీనిసంగమమున కెద మెచ్చి దానితో నిట్లనియె. కోమలీ! నీవు నీయజమానురాలగు నంబిక నెలవుఁ బొంది నాతో నిష్టోపభోగంబుల ననుభవించితివి. నీకిఁక దాసీత్వము లేదు. నీగర్భమున సకలధర్మములు నెఱింగిన సుతుం డుదయించు నని ప్రసాదించి యావృత్తాంత మెల్ల సత్యవతి కెఱింగించి యదృశ్యుం డయ్యెను. అంత నంబాలిక యుచితకాలమునఁ బాండుదేహునిఁ గుమారునిఁ గనెను. అతండే పాండురాజు పేరునొంది వెలసెను. పిదపఁ గొన్నాళ్ళ కంబికయొక్క దాసియుం దా మాండవ్యముని శాపంబున యముండు విదురుండై పుట్టెను. అనిచెప్పఁగా జనమేజయుండు మాండవ్యుం డేకారణమున యముని శపించెను? ఆమునీంద్రుం డంత మహానీయుండే? ఆమునిచరిత్రను సవిస్తరముగ నానతీయవలయును నని వైశంపాయనునిఁ బ్రార్థింప నన్నరేంద్రున కామునీంద్రుం డిట్లనియె.

## ఆణిమాండవ్యోపాఖ్యానము

భూమిపాలా! వినుము. పూర్వకాలమున మాండవ్యుండను మహా తపస్వి తనయాశ్రమమునఁ బర్ణశాలకు వెలుపల నుండు నొకచెట్టు క్రింద నూర్ధ్వబాహుండై తపస్సుచేయుచుండెను. అంత దొంగలు కొందఱొకరాత్రి యెచ్చటనో కన్నము వేసి ధనమును ముచ్చిలి పాఱుచుండువారీమునిసమీపమున నాధనరాశి నుంచి దూరమున నదృశ్యులై కాఁచియుండిరి. అంతఁ దలవరులు దొంగలజాడలను గుర్తించుచు నమ్మాండవ్యముని యాశ్రమంబునకువచ్చి 'యీదారిన దొంగలుపోయిరి. వా రెందున్నవా' రని తలవరులు మునీంద్రు నడిగిరి. ముని మౌనవ్రతమును దాల్చియుండుటనుబట్టి వారికిఁ బ్రత్యుత్తర మొసఁగఁ డయ్యెను. అంత రాజభటులు మునియాశ్రమమును, బర్ణశాలను నంతయుఁ గలయ వెదకిరి. అప్పు డాదొంగలును వారు ముచ్చిలిన ధనరాశియు నచ్చోట దొరికెను. రాజభటులు మునియు దొంగలలో నొకఁ డని భావించి, యీతండు కపటతపస్వి, మనయెదుట నేమియు నెఱుంగనివానింబోలె మౌననియమముం బూనియున్నాఁడు. అని యమ్మునిని సైతము దొంగలతో బంధించి రాజసన్నిధికిం గొనిపోయి దొంగలను ధనముతోఁ బట్టి తెచ్చితి మని రాజుతోఁ దలవరులు విన్నవించిరి. అంత నారాజు దొంగల నందఱను వధింప నాజ్ఞాపించెను. రాజభటులు దొంగల నందఱ నుఱిమ్రాను నెక్కించి యుఱిఁదీసి వధించిరి. మునిని మాత్రమొక కొఱుత వేసి ధనముం గొని రాజుమ్రోల నుంచిరి. అట్లు కొఱుతఁ గ్రుచ్చఁబడినవాఁ డయ్యును మాండవ్యుండు నిజతపోమహిమంబునఁ జావఁ డయ్యె. అట్లుండ నొక్కనాఁడు ముని కొఱుతనుండు మార్గంబునఁ గొందఱు మునులు పోవుచుండి శూలాగ్రంబున గ్రుచ్చఁబడి సప్రాణుండై యుండుమాండవ్యఋషిం గని యిట్లనిరి ఓతపోధనా! నీవు మహానీయుండవై చూపట్టెదవు. ఏపాప మొనర్చి యీశూలాగ్రంబున గ్రుచ్చఁబడియున్న వాఁడ వని యడిగిరి. నే ననుభవించు నీశిక్ష కెవ్వరిపై దోషమును జెప్పను. ఏకారణమున నాకీపాటు గల్గెనో? నే నీపాపమును జేసి యెఱుఁగను. అని చెప్పెను. వారిసంభాషణ

ముల నచ్చోటఁ గావలియుండు రాజభటులు విని మరునాటి ప్రభాత మున నావృత్తాంతంబును రాజునకుఁ దెల్పిరి. అంత రాజు మిక్కిలి చింతాభయములతోఁ గూడి మంత్రులతోఁ గొఱుతనుండు మాండవ్య మునియుండు ప్రదేశమునకు విచ్చేసి, యామునికి మ్రొక్కి యిట్లనియె. మునీంద్రా! ఎఱుక లేక నా చేసిన యపరాధమును సైరింపుము. కోపము నుడుగుము. నాయెడఁ గరుణింపుము. నన్ను మన్నింపుము. అని బహువిధముల వేఁడి యమ్మునీంద్రుం డనుగ్రహబుద్ధితో నున్నాఁ డని యెఱింగి కొఱుతనుండి యాముని నూడఁదీయుటకు యత్నింపఁగా నాశూల మూడిరాకుండెను. అప్పు డాకొఱుతిని మొదలంట ఛేదించిరి. కాని శూలాగ్రము మాత్ర మాతనిశరీరమున నిఱికికొనియుండెను. ముని యు దానితోనే సంచరించుచుండెను. ఆకారణమున నాముని యాణి మాండవ్యుం డని పేర్కొనఁబడెను. అంతట నమ్ముని యొకనాఁడు యమునిపురి యగు సంయమినీపట్టణంబునకుఁ బోయి ధర్మ దేవతం జూచి "ధర్మస్వరూపా! నా కేపాపంబున నీశూలారోపప్రాప్తి కలిగె? నిరూ పింపు" మనెను. అంత నంతకుం 'డోమునీంద్రా! బాల్యమున నీవు తూనీఁ గలతోఁకలఁ బుల్లలు గ్రుచ్చి వాని బాధించితివి. కావున నిప్పు డాఫల మును ననుభవింపవలసె.' అని చెప్పఁగా నమ్మునీంద్రుం డల్పదోషమున కీతీవ్రదండన మొసఁగిన నీవు కొంతకాలము భూలోకమున శూద్రయో నియందుఁ బుట్టి శూద్రుండవై చరింపు మని శపించి వెండియు నిట్లనియె. ఇప్పుడు మొద లే నొకవ్యవస్థ నేర్పఱచెదను. దీనిని లోకు లెల్ల నంగీ కరింపవలయును. బాలురు పదునాలుగేండ్లవయస్సువఱకు నేపాపకార్యముల నొనర్చినను వారల నాపాతకంబు లొందకుండుచు గాక యనెను. ఆవ్య వస్థను లోకు లాదినములనుండి ధర్మముగా ననుష్ఠించుచున్నారు. అయ్యాది మహానీయుండును, జితేంద్రియుండును నగు మునివాక్కగుటచే దాని కంతమర్యాదను లోకు లొసఁగిరి. ఆమాండవ్యముని శాపమున యముఁడు శూద్రగర్భమున విదురుండై పుట్టెను. అని యాణిమాండవ్యోపాఖ్యా నమును నమ్మునిచంద్రుం డారాజచంద్రునకు విన్నవింపఁగా విని మిక్కిలి సంతోషించెను.

## ధృతరాష్ట్ర పాండు విదురులు పెరుగుట

అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె. ఇవ్విధంబున ధృతరాష్ట్రుండును, పాండురాజును, విదురుండును బుట్టి పెరుగుచుండు కాలమున హస్తినాపురరాజ్యము సుభిక్షంబై యుండె. భీష్ముండు రాజ్యపరిపాలనంబు సేయుచుండ వర్ణాశ్రమములు లెస్సగాఁ గొనసాఁగుచుండెను. ప్రజలు ధర్మమునం దాసక్తులై సత్యపరాయణులైరి. భూసురులు వేదాధ్యయనపరులై తపస్సులను నిర్విఘ్నముగఁ జేయుచుండిరి. క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును క్రోధలోభమోహమదమాత్సర్యకామములను విడలి సర్వసంపదలతోఁ బొదలుచు వర్ణత్రయములవారి సేవాతత్పరులై మెలఁగుచుండిరి. ఇవ్విధమున రాజకుమారులు పెరుగుచుండఁగా భీష్మాభిరక్షితయై భూమి సర్వసస్యాఢ్యయై ప్రజలు సుఖమున నుండిరి. రాజకుమారులగు ధృతరాష్ట్రపాండుపుత్రవిదురులు భీష్ముఁడు పెంపఁగా బెరిఁగి రక్షితులై క్షత్రియోచితవిధానంబున సుపనీతులై సకలవేదములను, వేదాంగములను, నీతిశాస్త్రమును, నితిహాసపురాణములను నధ్యయనముచేసియు, ధనుర్వేదము నభ్యసించియు, గదాఖడ్గాద్యాయుధములను యుద్ధములయం దుపయోగించు నేర్పును, నేయే కాలములలో నెట్లెట్లు గజాశ్వాదుల నెక్కి చరింపవలయునో యాశిక్షలయందును బ్రావీణ్యమును గడించి బలవంతులై విఖ్యాతిఁ గాంచిరి. మఱి వారలలో ధృతరాష్ట్రుండు శరీరదార్ఢ్య మెక్కువగలవాఁ డయ్యెను. పాండురాజు విలువిద్యయందు నేర్పరి యయ్యెను. విదురుం డంతకంటె ధర్మపరుండై మెలఁగెను. ఇట్లు సకలదేశములలోఁ గురుదేశమును, శూరులం గన్నతల్లులలో నంబికాంబాలికలును, ధర్మజ్ఞులలో భీష్ముండును, పట్టణములలోన హస్తినాపట్టణమును వాసి కెక్కెను. ధృతరాష్ట్రుండు జన్మాంధుఁడు కావునను, విదురుండు శూద్రాపుత్రుండు కావునను బాండురాజు హస్తినాపురరాజ్యమున నభిషిక్తుండయ్యెను. అట్లుండఁ గొన్నినాళ్లకు కా

రాజపుత్త్రులు పెద్దవారై యందఱును వివాహోచితప్రాయము గల వారు కాఁగా సకలరాజ్యమును దనవిల్లుతోడుగా రక్షించుచున్న భీష్ముం డొక్కనాఁడు ధర్మతత్త్వజ్ఞుం డైన విదురుం బిలిచి యిట్లనియె. విదురా! వినుము. మనవంశము క్రమముగ సర్వసద్గుణముల కాలవాలమై ప్రఖ్యాతి వహించియున్నది గదా? ఇట్టి కుల మొకప్పుడు క్షీణ దశకు గా నుండఁగా నేను సత్యవతియుఁ బ్రార్థింప వేదవ్యాసుం డను మునీంద్రునిచే మరల సుప్రతిష్ఠిత మయ్యె. ఇంకను దీనికి లెస్సగా వృద్ధి యగునట్లు మన మొకటి నిర్ణయింపవలసియున్నది. దానిని నీతో నాలోచింపఁదలంచెదను. గాంధారరాజగు సుబలునికూఁతురు గాంధారి యును, యదుకులమున శూరునకుఁ బుట్టి యాతనిమేనత్తకుమారుఁ డనఁ దత్పుత్త్రికయై యుండ వానియింటఁ బెరుగుచుండు కుంతియను కన్యక యును, మద్రరాజపుత్త్రిక మాద్రి యను సుందరాంగియును నీముగ్గురు వివాహమునకుఁ దగిన కన్యకలుగా నున్నారు. వారిసంబంధబాంధవ్య ములు మనకుఁ దగినవి కావున నాకన్యకలం దోడ్తెచ్చి మనధృతరాష్ట్ర పాండురాజులకు వివాహయత్నములఁ జేసెదను. దీర్ఘాలోచనపరుం డవై నీమనస్సును నాకు విప్పిచెప్పు మని యడుగఁగా విదురుండు భీష్మున కిట్లనియె. మహానీయా! నీవే మాకు నేడుగడవై యుండ నీ వాంఛల నేల యడుగ నెంచెదవు? నీకుఁ దెలియనిది నే వచింప శక్తుండనే? అని వినయముతో విన్నవింపఁగా నాముగ్గురు కన్య కలం దెచ్చి ధృతరాష్ట్రపాండురాజులకు భీష్ముండు వివాహ మొనర్ప యత్నించుచుండె.

## ధృతరాష్ట్రునివివాహము

అట్లుభీష్ముండు ధృతరాష్ట్రునకు వివాహము చేయు యత్నమునసుం డఁగా సుబలరాజతనయ యగు గాంధారి పశుపతి నారాధించి యాదేవు ప్రసాదంబున నూర్గురుతనయులం బడయునట్లు వరమును బొందియున్న దని భూసురులచేతం దెలిసి తగినవారిని బంపి యాకన్యకను ధృతరాష్ట్రునకు వివాహనిమిత్తమొసఁగు మని సుబలుని నడుగుఁడనెను. వారును భీష్ముని

సెలవుఁబొంది గాంధారరాజుపాలికిం బోయిరి. సుబలుఁడును భీష్ముండు పంపినవారికి మర్యాదసేసి వారిస్వాగతం బడిగెను. అంత వారు "ధృతరాష్ట్రమహారాజునకు గాంధారి నిచ్చి వివాహముచేయవలయునని మిమ్ము సుధర్మజ్ఞుండగు భీష్ముం డడుగఁ బంపె." నని చెప్పఁగా సుబలుఁడు ధృతరాష్ట్రుం డంధుండని కొంతయాలోచించి పిదప ధృతరాష్ట్రుని సద్వంశసచ్చరిత్రంబులం దలపోసి కూఁతు నిచ్చుటకు నిశ్చయించెను. గాంధారియుఁ దండ్రినిశ్చయము నెఱిఁగి తనకుఁ గానున్నభర్త యంధుండైనను సత్కులప్రసూతుఁడును, రాజులలో విఖ్యాతపురుషుండును నగు నని తనపతివ్రతాధర్మమును సహజస్వరూపంబుఁ దెలియునట్లు తానును నేపదార్థములనుగాని, యన్యపురుషులను గాని చూచుట లేదని ప్రతిజ్ఞ చేసి దృఢమగు నేత్రపటము నొకదానిని గట్టుకొనెను. అంతఁ గొన్నినాళ్లకు సుబలరాజపుత్త్రుం డగు శకుని తనసోదరి యగు గాంధారిని హస్తినాపురమునకుఁ దోడ్తెచ్చి భీష్మున కప్పగింపంగా నాదేవవ్రతుం డొకసుముహూర్తమునందు గాంధారీధృతరాష్ట్రులకు వివాహమును గావించెను. అప్పుడు శకుని, సుబలుఁడు కూఁతునకుఁ బంపిన యరణమునంతయును నావివాహకాలమున గాంధారికొసఁగెను. భీష్ముఁడును శకుని నుచితరీతి సత్కరించి వివాహమహోత్సవమును దగిన భూసురులయొక్కయుఁ బుణ్యాంగనలయొక్కయు సమక్షమునఁ గావించి సంతోషించెను. అంత శకుని భీష్మానుమతంబున గాంధారిని హస్తిపురంబున వదలి తాను నిజపురమున కరిగెను. అంత గాంధారి శిష్టాచారయుతయై మనస్సున నైన నన్యపురుషులనామములను నైతము స్మరింపక పతివ్రతాశిరోమణియై హస్తిపురమున భర్తతోఁ గాపుర ముండెను. అంత భీష్ముండు పాండుభూపాలునకును నైతము వివాహము జరిపింపఁగోరి యాతనికి యాదవాంగన యగు కుంతి యను కన్యకను బెండ్లిసేయఁ దలంచెను. ఆవివాహవృత్తాంతమును విను మని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

## కుంతిచరిత్రము

యాదవులలోఁ బ్రసిద్ధుం డైన వసుదేవునితండ్రి శూరుం డను వానికిఁ బృథ యను కుమార్తె జనించియుండె. తనమేనయత్తకుమారుండు కుంతిభోజుం డనువాఁ డనపత్యుఁడై యుండ నతనికి శూరుండు తనపుత్త్రినిఁ బృథను కొమార్తెగా నొసంగెను. అంతఁ బృథ యా కుంతిభోజునింటఁ బెరుగుచుఁ గుంతి యనుపేరఁ బిలువఁబడుచుండెను. పృథ కుంతిభోజునింటఁ దన పెంపుడుతండ్రి యనుజ్ఞ సేయఁగా బ్రాహ్మణాతిథిసత్కారములను నియమపూర్వకముగ జరుపుచుండెను. అంతఁ గొన్నినాళ్ల కాకుంతిభోజునింటికి దుర్వాసుండను మహర్షి యేతేరఁగాఁ గుంతి యమ్మునిని వివిధోపచారంబులచే సంతుష్టుఁ గావించె. ఆముని కుంతి సపర్యచే సంతుష్టుండై పోవువాఁ డాకన్యకయందుఁ బ్రీతి గలిగి యొక మంత్రము నుపదేశించిపోయెను. మంత్రమును నొసఁగునప్పు డాముని కుంతి కిట్లనియె. కన్యకామణీ! ఈమంత్రమును నీవు పురశ్చరణము చేసి జపింపఁగనే నీకోరినదేవత యొకటి నీకుఁ బ్రసన్నమై నిన్నుఁ బొందును. వానివలన నీకు దివ్యతేజస్సుగల నందనుండు పుట్టఁగలఁడు. అని చెప్పి యాముని యదృశ్యుం డయ్యెను.

## కుంతియందుఁ గర్ణుఁడు పుట్టి సూతగృహమును జేరుట

అంత నొక్కనాఁడు కుంతి మునిమంత్రమును బరీక్షించునిమిత్తము సూర్యుని నుద్దేశించి మంత్రమును జపించెను. వెంటనే వేవెలుంగు తనసహజకాంతు లచ్చువడ మహనీయుండై యాకన్యకయెదుట నిలుచుండి, 'యోకనకాంగీ! నన్నేల యిప్పుడు రావించితివి? నీతో నిప్పుడు నేను సంగమించి నీకు సర్వలక్షణలక్షితుం డగు పుత్త్రు నొసంగెద నని చెప్పఁగాఁ గుంతి యామహనీయునిదర్శనమునకు వెఱచి దేవా! మునిమంత్రమును బరీక్షింప నిన్నుద్దేశించి యామంత్రమును జపించితిని పుత్త్రేచ్ఛతో జపించినదానను గాను. నీవు వచ్చినదారిని బోవచ్చు ననఁగా సూర్యుండు ఓశుభాంగీ! నాదర్శనము నీకు వృథ కాఁగూడదు. నీతో

భోగించి నీ కిప్పుడ గర్భము నిచ్చెదను దాన నీకు సత్పుత్త్రుఁడు గలుగును. అనఁగాఁ గుంతి దేవా! నేను గన్యకను, అవివాహితను. నాకుఁ బుత్త్రుండు కలిగె నేని బంధువులు దూరుదురు. తల్లిదండ్రుల కప్రియకారాల నగుదు. దాని కుపాయముఁ జెప్పుము. అని వేఁడఁగా నాదేవుండు నీకుఁ గన్యాత్వము దూషితంబు గాకుండ వర మొసంగెదను. నన్నిప్పు డిష్టోపభోగముల నుపలాలింపు మనఁగాఁ గుంతి యొట్టకేల కొప్పుకొని సంపూర్ణాభీష్టంబుఁ దీర్చి తత్ప్రసాదంబున గర్భవతియై యుచితకాలంబున దివ్యతేజోమూర్తియు, సహజకవచకుండలుండును నగు పుత్త్రునిం గనెను. అప్పు డాపుత్త్రునకుఁ గుంతి యెంతయును వగచి యీవయస్సున నాకుఁ బుత్త్రుఁడు కలిగెనని లోకులకుఁ దెలిసినచో వారు నన్నేమందురో? నేనేమి చేసినచో శుభం బగునని కొంత యాలోచించి యాపురుషశిశువు నొకమంజూషములో నుంచి దానిని గట్టిగ నొక తెప్పకుఁ గట్టి నదీప్రవాహమున వదలెను

ఆమందసము నదీప్రవాహవేగంబునఁ దెప్పతోఁ బోవుచుండ నొకసూతకులుండు దానిం జూచి యామందసమం దేమున్నదో యని తెప్పను గట్టునకు లాగి మందసమును దెఱచి చూచి యందు దయార్కతేజోంశును సహజకుండలములను ధనముతోఁడఁ బుట్టినవాఁడు నగు కుమారునిఁ జూచి వాని నెత్తికొని పెంచునిమిత్తము తనభార్య యగు రాధచేతి కిచ్చెను. అంత రాధ యాశిశువు నెత్తికొనుచుండఁగనె దానికిఁ జన్నులు చేఁపెను. అప్పు డారాధ యాశిశువునకుఁ జన్నిచ్చి పోషించి పెద్దవానిఁగఁ జేసెను. వాఁడు సహజకుండలములను ధనముతోఁ దనకుఁ బొడసూపుటను సూతుండు వానిని వసుషేణుం డని పేర్కొనెను! ఆవసుషేణుఁడు క్రమముగఁ బెద్దవాఁడై యస్త్రశస్త్రవిద్యల యందుఁ గడునేర్పరియై, బ్రాహ్మణులయెడ మిక్కిలి ప్రీతిఁ గలిగి వారేది తన్నుఁ గోరిన లేదని చెప్పక దాన మిచ్చువ్రతము ననుష్ఠించుచుండెను. అంత బహుకాలంబునకు మహేంద్రుం డర్జునునిహితముఁ గోరి కర్ణుని సహజకవచకుండలంబుల నపహరించువాఁడై నొకబ్రాహ్మణవేషముతో

వాఁడు నదీతీరమున దేవపూజసేయుకాలమున మధ్యాహ్నమప్పుడు
వచ్చి యాచించెను. కర్ణుఁడు బ్రాహ్మణుఁ డేది వచ్చి యాచించినను దాన
మొసఁగుట యను నియతవ్రతము గలవాఁడు. కావున విప్రవేషమున
నుండు దేవేంద్రునకుఁ దనసహజకవచకుండలములను గత్తితోఁ గోసి
యిచ్చెను. దేవేంద్రుఁ డంత వానిదాతృత్వమునకు మిక్కిలి సంతసించి
కవచకుండలములు కోసి యిచ్చుటవలన వానికిఁ గలుగు శరీరవికార
మేమియుఁ గలుగకుండునట్లు చేసి వేఱొకశక్తి నిచ్చి వానితో నిట్లనియె.
వదాన్యా! వినుము. నీ కెవ్వం డేనియుఁ బ్రబలశత్రు వుండెనేని వాని
సాహసంబున నీ వెన్నివిధానములం జంప యత్నించినను, వాఁడు
నీసాధనంబులఁ జావఁడేని యప్పుడ యీదివ్యశక్తిని వానిపై నొక్కమాఱే
ప్రయోగింపుము. ఆఘోరశక్తి వానిం దునుమాడి క్రమ్మర నాయొద్దకు
రాఁ గలదు. పిదప నీ వెప్పుడును దానిని బునశ్చరణముచేసి ప్రయో
గింపరాదు. దీనిని మనుష్యదేవదానవాదులలో నీకుండు బ్రబలశత్రువు
పైని బ్రయోగింపుము. అట్లు చేయక యల్పునిపైఁ బ్రయోగించితి వేని
నీకు హాని వాటిల్లును. అని చెప్పి శక్తిప్రయోగమును నొకమాఱు
మాత్రము చేయున ట్లనుగ్రహించి యింద్రుండు తనశక్తి నొసంగి కవచ
కుండలంబులను గైకొని వెళ్లెను. ఆవసుషేణుం డింద్రునకు సహజకవచ
కర్ణకుండలములను గత్తిరించి యిచ్చుటచే వానికిఁ గర్ణుం డని యప్పటి
నుండి పేరు ప్రసిద్ధమయ్యెను.

## కుంతీపాండురాజులవివాహము

అది యట్లుండఁగాక. కుంతిభోజుండు తనకూఁతురు పృథకుఁ బెండ్లి
చేయుటకు నిశ్చయించి స్వయంవరమహోత్సవప్రయత్నము గావించెను.
అంత నాయుత్సవమునకు దేశములనుండి రాజు లెల్లరు విచ్చేసిరి.
అప్పుడు పృథ సర్వాభరణభూషితయై స్వయంవరమండపమునకుఁ గర
కమలంబులయం దొకకమలమాలికం గొని వచ్చియున్న సకల
రాజలోకంబున నాదిత్యులలో విష్ణువుంబోలినవాఁడై పాండులక్షణము
లతో వరశ్రీసంపన్నుండై తనదివ్యతేజంబున వెలుఁగుచున్న కౌరవాన్వయ

ప్రకాశకుం డగు పాండుభూపాలుం జూచి వానిసౌందర్యమునకును, మహావిభవమునకును నచ్చెరువొంది కామించి సిగ్గుతోఁ దిన్నగాఁ జేతి పుష్పమాల నాతనిని వరించినందులకు గుర్తుగా నాతనిమెడయందు వైచెను. అంత నితరరాజు లందఱును విఫలమనోరథులై స్వయంవరమునందుఁ బాండురాజు వరింపఁబడె నని నిశ్చయించి తమతమ దేశములకేఁగిరి. అంతఁ గుంతిభోజుండు పాండుభూవల్లభునకుఁ దనగాదిలికూఁతు నిచ్చి మహావిభవంబునఁ బెండ్లి యొనర్చి బంగారమును రత్నములను వస్త్రములను వాహనముల నమూల్యములైనవానిని నరణంబుగ నూతన వధూవరుల కొసంగి హస్తినాపురమునకుఁ బంపెను. పాండురాజును వాని నన్నింటిని గొని నూతనవధువుం దోడ్కొని సకలసేనాసమన్వితుండై నిజపురము సొచ్చి బ్రాహ్మణాశీర్వచనంబులను జేకొని కుంతిని బ్రత్యేకాంతఃపురప్రవేశము గావించి యాదేవితో నిష్టోపభోగంబులఁ దేలియాడుచు మహేంద్రవిభవంబునఁ బొదలుచుండె.

పదంపడి భీష్ముండు పాండురాజునకు వేఱొక్కకన్యకను దెచ్చి భార్యఁగాఁ జేయుటకు యత్నించి పెద్దలను,మంత్రులను,బురోహితులను నింకను వాక్ప్రమత్కారులగు పౌరజనులను దోడ్కొని చతురంగబలంబులను గొనిరాఁగా మద్రదేశాధిపతిరాజధానికిం బోయెను. భీష్ముఁడు ఆపురంబునకు సమీపగతుం డగుచుండఁగనే మద్రేశుండగు శల్యుండు భీష్ము నెదుర్కొని మహావిభవముతోఁ దనపురికిం గొనిపోయి యాదేవవ్రతుం బూజించి స్వాగతం బడిగెను. అప్పుడు శాంతనవుండు శల్యున కిట్లనియె. మద్రాధిపా! వినుము. నీచెల్లెలు మాద్రి వివాహమున కీడై యున్నదని తెలిసి యాచిన్నదానిని నాతమ్ముఁడు పాండురాజునకు భార్యగాఁగొనిపోవచ్చితిని. మనకు వివాహసంబంధము సముచితము. అనఁగా భీష్మునకు శల్యుం డిట్లనియె. దేవవ్రతా! వినుము. మీవంశమువారి కంటె నుత్తములగు పురుషులకు మాకన్యల నీయఁగలమా? మీతోడి బాంధవ్య మత్యుత్తమ మని ప్రత్యేకముగఁ జెప్పనేల? అయిన నొక్కటి చెప్పవలసియున్నది. అది మాకు వృద్ధాచారము; చెప్పెదను. మాకన్యలకు వివాహము చేయఁదలఁచునపుడు మేము. కన్యాశుల్కముగొందు

ము. అది మాకుఁ గులధర్మము. దానిని నిప్పుడు మీా కెఱుకపఱుచుట యావశ్యకము. కాన నీ మూవృద్ధాచారమున కొడంబడుదువేని కన్యకం గొనిపోయి మీాయింట వివాహముసుజరుపవచ్చును అనిచెప్పఁగా సర్వ ధర్మముల నెఱింగిన గాంగేయుండు మద్రపతితో నిట్లనియె. మద్ర నాథా! ఈసందర్భములను నాతోఁ జెప్పుటకు నీకు సంకోచ మేల? పారం పర్యముగా వంశమున నేర్పడియుండు నాచారము ధర్మ్యమే యగు నని పూర్వము బ్రహ్మదేవుండు వచించెను. ఈవిషయంబున సంశయము లేదు. అని చెప్పి మద్రరాజున కమూల్య మగు కనకమును, రత్నాభరణము లను, వస్త్రవాహనములను, గజములను, నశ్వములను, మణులను, ముత్తె ములను, బగడములను గాంగేయుం డపారంబుగా నొసంగెను. అంత వాని నన్నింటిని శల్యుండు గైకొని సంతుష్టస్వాంతుండై తన సోదరి యగుమాద్రికి మంగళస్నానంబులు చేయించి యలంకరింపఁజేసి యాకన్యకను బాండుభూపాలునకు వివాహార్థముగ నొసంగెను. అంత భీష్ముండు మాద్రిని హస్తినాపురంబునకుఁ దోడ్తెచ్చి శుభముహూర్తంబున భూసురసన్నిధానమునందు నాంబాలికేయునకుఁ బెండ్లి సేయఁగా నాతండు కుంతీమాద్రుల మధ్యమందు వశాద్వయమధ్యస్థగజేంద్రునివలె శృంగార ములతో సుఖముల నోలలాడుచుండెను.

## పాండురాజు దిగ్విజయము చేయుట

అవ్విధమునఁ బాండురాజు భార్యలతో విలాసియై యొక్కనెల గడపుటయు దేశములోని సకలరాజులను గెలువ నిచ్ఛవొడమి చతు రంగబలంబులను సమకూర్చుకొని యుద్ధమునకుఁ బ్రయాణభేరి వేయించి భీష్మాదివృద్ధరాజులకు మ్రొక్కి భూసురుల యాశీర్వచనంబులు గొని వారియనుమతిం బొంది యొక్కసుముహూర్తమునఁ బయనమై తొలుత మ్రుచ్చుల కునికిపట్టైన దశార్ణదేశములకుం బోయి యాదొంగరాజుల నడిమి, పిదప మగధదేశమునకు దండువెడలి యాదేశపురాజుం జంపి యాదేశమున బహువిధద్రవ్యవాహనములను, దాసదాసీజనులం గొని, మిథిలానగరమునకుఁ దఱలి విదేహులం గెల్చి యంతటఁ గాశి, సుహ్మ

పుండ్రదేశాధిపతులం గెలిచి వారియొద్దనుండి యనేకవిధ ధనకనకవస్తు
వాహనములను గానుకలుగను, గప్పములుగను గొని, పూర్వము కౌర
వులధనము నపహరించినవారలవలన ననేకగజరథతురగవస్తువులను గొల్ల
గొని శంతనుభరత ప్రభృతుల పేళ్లను జ్ఞప్తిపఱచి యందఱు తన్ను మహా
బలపరాక్రమశాలి యనియు, నధికతేజోవంతుం డనియుఁ బొగడుచుండ
నానాదేశములను దిగ్విజయ మొనర్చి మరలి హస్తిపురంబునకు వచ్చు
చుండె. అంత హస్తిపురమునం దున్న వృద్ధులగు భీష్మాదిరాజులును,
కులబ్రాహ్మణులును, నగరున కేడ తెగక వచ్చుచుండు పౌరులును వంది
మాగధులతోను, బహుతూర్యరవంబులతోను విజయశీలుం డగు
పాండురాజు నెదుర్కొనుటకు సంతోషమున బహుదూర మరిగిరి.
అట్లు వచ్చిన భీష్మాదులకుఁ బాండునృపాలుండు మ్రొక్కి పరిజనము
లను గారవించెను. అంతట భీష్ముండు జయశీలుఁడైన పాండునృపాలుం
గౌఁగిలించుకొని సంతుష్టుండై యెదుర్కొనుటకుఁ బోయిన నానావిధ
వాద్యముల ధ్వనులు రోదసీకుహరము నిండఁగాఁ, బాండురాజుం
దోడ్కొని హస్తిపురముఁ బ్రవేశించెను. అంతఁ బాండురాజు ధృత
రాష్ట్రునకు మ్రొక్కి యాతనియనుమతి వొప్పునఁ దాను నానాదేశానీత
చిత్రవిచిత్రవస్తువులను ధనకనకములను భీష్మునకును, సత్యవతికిని,
దల్లులకును గానుకలుగ నొసంగి కొంతధనమును విదురున కిచ్చి
శేషించినదానిని మిత్రుల కొసంగ వా రంతఱుం గడుం బ్రీతులై
యుండిరి. ఇట్లు పాండురాజు దిగ్విజయ మొనర్చి నానాదేశములనుండి
తెచ్చిన ధనధాన్యములతో ధృతరాష్ట్రుం డనేకాశ్వమేధముల నాచ
రించెను. అంతఁ బాండురాజు కుంతీమాద్రులయం దనురాగాతిశయ
మున వారి నిరువురను దోడ్కొని వనవిహారము సేయఁదలంచి హిమవ
త్ప్రాంతముల రమణీయములగు నరణ్యములకుఁబోయి యచ్చోట
నింద్రుని యైరావతము రెండు కరేణువులమధ్య నుండునట్లు
విలాసవంతుఁడై కుంతీమాద్రులనడుమఁ జరించుచుండెను. అవ్విధమున
బహుకాలము వనవాసియై మృగములను నెల్లప్పుడు వేటాడుటయం
దభిరుచిగలవాఁడై హస్తినాపురమునందుండి ధృతరాష్ట్రుఁడు పుత్తెంచు
సర్వపదార్థములను గ్రహించుచు ననవరతకామక్రీడలను భార్యలతోఁ

దేలియాడుచు సుఖంబుండె. అట హాస్తినాపురమునందు భీష్ముండు విదురు
నకు వివాహముచేయఁ బ్రయత్నముఁ జేసి దేవకుఁడను రాజునకుఁ *పార
శవీ స్త్రీయందుఁ బుట్టిన యొకకన్యం దెచ్చి పెండ్లిఁ గావించెను. ఆరూప
యౌవనవంతురాలగు భార్యయందు విదురుండు కుమారుల సర్వగుణ
విశిష్టులఁ గొందఱఁ బడసెను. అంతటఁ గొన్ని సంవత్సరములు కాఁగా
ధృతరాష్ట్రునకు గాంధారియందు నూర్గురు కొడుకులును, గోమటిజాతి
వనితయం దొక్క కుమారుండును, పాండురాజుభార్య లగు కుంతీ
మాద్రులకు దేవతలవలన నైదుగురు పుత్త్రులును గలిగిరి అని చెప్పఁగా
జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. మునివర్యా! గాంధారికిఁ
బుత్త్రశతం బెంతకాలమునకుఁ బుట్టెను? వారలపే ర్లేమి? మఱియు
ధృతరాష్ట్రుండు తన కనువ్రతయుఁ బరమపవిత్రయు నగు గాంధారి
భార్యయై యుండ వైశ్యస్త్రీ నెట్లు పరిగ్రహించె? కుంతీమాద్రులకు
దేవతలవలనఁ బుత్త్రు లెట్లు గలిగిరి? వీనివిస్తారముఁ దెల్లముగాఁ జెప్పుము.
మాపూర్వులచరిత్రము వినను వినను నాశ్చర్యావహమై యున్నది.
కావున విన్నవింపవే యని యడుగ వైశంపాయనుండు జనమేజయున
కిట్లనియె.

## దుర్యోధనాదుల జననము

ఇట్లాముగ్వురకును భీష్ముండు తగిన భార్యలం దెచ్చి వివాహము
గావించి యాభార్యలతో వారు సుఖముల ననుభవించుచుండ నొక్క
నాఁడు ధృతరాష్ట్రుని యంతిపురంబునకు వేదవ్యాసుం డాఁకలిచేతఁ
గడు డస్సి యతిథియై వచ్చెను. అప్పు డామునికి గాంధారి సకలోప
చారంబులం జేసి సేద దీర్చ నమ్ముని ప్రీతచిత్తుండై యాదేవిని వరము
గోరుమనియె. అంత నమ్ముదిత తనభర్తకుం దగిన నూర్గురు కొడుకులం
గోరెను. వేదవ్యాసుం డట్ల యగుంగాక యని యదృశ్యుం డైనఁ గొన్ని
నాళ్లకు గాంధారి భర్తవలన గర్భిణియై యాగర్భమును రెండేండ్లు మోచి
కొనియుండె. ఆసమయముననే కుంతియును దొలిచూలాలై యుధిష్ఠిరునిఁ
గనె నని విని తనకు మునిచంద్రుండు వర మొసంగినతీరున నెన్నాళ్లకును

* "పారశవీం=బ్రాహ్మణేన శూద్రాయాం జాతాం" బ్రాహ్మణునకు శూద్ర
స్త్రీయందుఁ బుట్టినది.

సుతు లుద్భవిల్ల లేదని వగచి ధృతరాష్ట్రునితో నాలోచింపకయే యుదర తాడనమును గావించె. ఆతీవ్రతకు గాంధారికి గర్భపాతమయ్యెను. ఆ గర్భ మంతయును సూక్ష్మము లగు మాంసమయఖండములచే నిండి యుండెను. అట్టిగర్భమునుజూచి మనస్సున మిక్కిలి వగచుచు రెండేండ్లు గర్భమున భరించియు నామాంసమయఖండములతో నుండునండమును బారవైచుటకు యత్నించుచుండె. ఇంతలో సాత్యవతేయుండు హఠాత్తున ధృతరాష్ట్రునొద్దకు వచ్చి గాంధారియొక్క యీచర్యను గని యిది యేమిచేయుచున్నదాన వని గాంధారి నడుగఁగా నద్దేవి యమ్మునికి ట్లనియె. మునివర్యా! రెండేండ్లు చూలు దాల్చియు నాకుఁ బుత్త్రులు గలుగకుండిరి. పాండురాజమహిషి కుంతి భానుతేజుం డగు పుత్త్రుం బడసెనని మనంబునఁ జింతిల్లి పరవశనై యుదరతాడనంబు గావించితి. అంత మాంసశకలములతో నిండియున్న యీగర్భము పడిపోయెను. నీవు పూర్వము నాకు నూర్గురు కుమారులు గలుగునట్లు వర మిచ్చి యుంటివి. ఆవర మెట్టిదో నాకుఁ దెలియదయ్యె. ఇప్పు డీగర్భ మివ్విధంబయ్యె నని శోకింపఁగా వ్యాసుండు తనమాట యెన్నండును వమ్ముగా దని చెప్పి యాగర్భమును శీతోదకంబున లెస్సగాఁ గడుగు నట్లుత్తరువు చేసి యందుండు మాంసశకలములను నూటినిఁ బ్రత్యేకమగు నూఱు ఘృతభాండంబులఁ దెప్పించి వానియందుఁ దాన పెట్టించుచుండఁగా గాంధారి వ్యాసమహర్షితో నిట్లనియె. మహానీయా! పూర్వము నాకిచ్చిన వరముప్రకారము నూర్గురు కొడుకులును దీన నుద్భవిల్లుదురు గాదే? మఱియు నిపుడు వారితోఁ జేర్చి యొకకూఁతును సైత మొసంగుము. అటు లగుచో దౌహిత్రలాభమును బడసి వానివలనఁ గలుగు పుణ్యలోకములను గూడఁ బొంది సంతసిల్లెదను. కావున నీకోరిక నెఱవేరు నట్లు ప్రసాదింపు మనెను. మఱియును గాంధారి యమ్మునివరునితో నిట్లనియె. నేను దమస్సత్యాదిగుణములు గలదాననైతినేని, పూజ్యులగు పెద్దలను బ్రియంబున సేవించియుంటినేని నామనోరథం బీడేరు ననఁగా వేదవ్యాసుం డట్ల యగుఁ గాక యని దీవించె. మఱియు నాగర్భమును దానే శీతోదకంబులఁ దడిపి దానిని నూటయొక్క ఖండములుగఁ జేసి వానినెల్ల ఘృతపాత్రంబుల సురక్షితముగా నుంచి వానిని బదిలముగా

రక్షించుచుండు మనియు నవివియెల్లఁ దమకుఁ దామే యవియువలెను నుచితకాలమును నిరీక్షించుచుండవలయు ననియు నియమించి యా బ్రహ్మర్షి చనెను. అంత మఱియు నొకసంవత్సరము కాఁగా నొకభాండము లోని మాంసఖండమునుండి యొకశిశు వుదయించెను. అతండు పుట్టుచుండఁగనే గాడెవ లఱచినవి. నక్కలు కూసినవి. గ్రద్ద లాకసంబునఁదిరిగినవి. ప్రతికూలవాయువులు వీచినవి. దిక్కులు దహింపఁబడుచుండునట్లు తోఁచెంచినవి. ఇవ్విధంబునఁ బెక్కుదుర్నిమిత్తంబులు పుట్టఁగా ధృతరాష్ట్రుఁడు భీతిల్లి భీష్మవిదురులను నాప్తమంత్రిపురోహితులను బిలిపించి వారితో నిట్లనియె. అప్తులారా! వినుఁడు. మావంశమున కిదివఱకే రాజార్హుఁడై సకలగుణసంపన్నుం డగు యుధిష్ఠిరుండు బుట్టియున్నవాఁడు. అతండే రాజు గాఁగలఁడు. అవిషయము నిర్వివాదముగదా? ఆతని యనంతరమైన నిప్పుడు జనించిన వీఁడు రాజ్యార్హుం డగునే? వివరింపుఁ డనిన వారిట్లనిరి. మహారాజా! వీఁడు పుట్టుచుండఁగనే మహోత్పాతంబు లుద్భవిల్లినవి. వీనిమూలమున క్షత్రియకులమున కెల్లఁ గీడుమూడును. కావున నిప్పుడే వీనిఁ ద్యజించినచో వంశ మెల్ల సురక్షిత మగును. నూఱుగురు సుతులలో నొక్కఁడు పోయినమాత్రమున నీ కేమి లోటు గలుగును? మఱియును ధర్మమును నిందుల కనుకూలముగనే యున్నది. ఒకనివలన వంశమునకు హాని కలుగనున్నచో వానిఁ ద్యజింపవలయును. ఒక గ్రామమున నొకయింటివారివలన గ్రామమున కంతటికిని గీడు మూఁడునట్లగుచో నాయొక యింటిని బరిహరింపవలయును. భూమికెల్లఁ దనవలన జెఱుపు గలుగునేని తానే భూమిని విడువవలయును. *అని పెద్దలవలన

* ఈవాక్యములకు మూలశ్లోకములఁ బొందుపరచుట యుక్తమని తోఁచినది కావున పాఠకులు వానిని గమనింతురు గాక!

శ్లో. శత మేకోనమప్యస్తు పుత్త్రాణాం తే మహీపతే,
 త్యజై నమేకం శాంతిం చేత్ కులస్యేచ్ఛసి భారత.
శ్లో. ఏకేన కురు వై క్షేమం కులస్య జగత స్తథా,
 త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్,
శ్లో. గ్రామం జనపదస్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్,
 సతథా విదురేణోక్తః తైశ్చ సర్వైః ద్విజోత్తమైః.

వెందు మని విదురుఁడు మున్నగుధర్మజ్ఞు లనిరి. విదురుఁడును ధృత రాష్ట్రున కీవిషయమున నెంత చెప్పినను బుత్త్రప్రీతిం జేసి వానిని విడువఁ జాలకుండెను. అట్లు మొదటిఖండమువలన జ్యేష్ఠుఁ డగుదుర్యోధనుం డనువాఁడు కలుగఁగా, మిగిలిన నూఱుమాంసఖండములును గ్రమమున బుత్త్రు లయినవి. వారిట్లు వరుసగాఁ బేర్కొనఁబడిరి. దుశ్శాసన, దుస్సహ, దుశ్శల, జలసంధ, సమ, సహ, వింద, అనువింద, దుర్ధర్ష, సుబాహు, దుష్ప్రధర్షణ, దుర్మర్షణ, దుర్ముఖ, దుష్కర్ణ, కర్ణ, వివింశతి, వికర్ణ, శల, సత్వ, సులోచన, చిత్ర, ఉపచిత్ర, చిత్రాక్ష, చారుచిత్ర, శరా సన, దుర్మద, దుర్విగాహ, వివిత్సు, వికటానన, ఊర్ణనాభ, సునాభ, నంద, ఉపనందక, చిత్రబాణ, చిత్రవర్మ, సువర్మ, దుర్విమోచన, అయోబాహు, మహాబాహు, చిత్రాంగ, చిత్రకుండల, భీరువేగ, భీమ బల, బలాకి, బలవర్ధన, ఉగ్రాయుధ, సుషేణ, కుండధార, మహోదర, చిత్రాయుధ, నిషంగి, పాశి, బృందారక, దృఢవర్మ, దృఢక్షత్ర, సోమ కీర్తి, అనూదర, దృఢసంధ, జరాసంధ, సద, సువాక్కు, ఉగ్రశ్రవ, ఉగ్ర సేన, సేనానీ, దుష్పరాజయ, అపరాజిత, కుండశాయి, విశాలాక్ష, దురా ధర, దృఢహస్త, సుహస్త, వాతవేగ, సువర్చ, ఆదిత్యకేతు, బహ్వాశి, నాగదత్త, అగ్రయాయి, కవచి, క్రథన, కుండ, ధనుర్ధర, ఉగ్ర, భీమ రథ, వీరబాహు, అలోలుప, అభయ, రౌద్రకర్మ, దృఢరథాశ్రయ, అనాధృష్య, కుండభేది, విరావి, ప్రమథ, ప్రమాది, దీర్ఘరోమ, దీర్ఘ బాహు, వ్యూఢోరు, కనకధ్వజ, కుండాశి, విరజసు లనువారు గలి గిరి. *అంత నొక్కమాంసఖండమున దుశ్శల యనుకూఁతురు గలిగె.

గాంధారి గర్భిణియై ధృతరాష్ట్రున కుపచారములు సేయలేనికాలము నందు ధృతరాష్ట్రుఁడు వైశ్యవనిత నొక్కదానిం జేపట్టెను. అది రాజునకుఁ బరిచర్యాదుల కుపయుక్తురాలై యుండెను. ఆసంవత్సర మున నావైశ్యస్త్రీయందు యుయుత్సుం డనువాఁడు ధృతరాష్ట్ర నకుఁ బుత్త్రుఁడై జనించెను. ఇవ్విధమున ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనుఁడు మున్నుగాఁ గలనూర్గురు కొడుకులును, దుశ్శల యను

---

* ఈపేరులలో సంస్కృతభారతములోనివానికిని నాంధ్రభారతములోని వానికిని భేదము కానవచ్చుచున్నది.

కూఁతురును, వైశ్యయందు యుయుత్సుం డనునొక్క కుమారుండును గలిగిరి. ధృతరాష్ట్రుఁ డాకుమారులకు విలువిద్య మున్నగు రాజకులో చిత విద్యల నేర్పి క్రమముగ వారి కెల్లరకును గన్యకలం దెచ్చి వివాహము గావించె. మఱియు దుశ్శలను సైంధవున కొసఁగి మహావిభవముతో వివాహమును జేసెను.

## పాండురాజునకు శాపంబు గలుగుట

ఇఁకఁ బాండు రాజుకొడుకులు పుట్టిన క్రమమును వివరింతును. పాండురా జట్లు మహారణ్యములలో నెప్పుడును వేఁటాడుటయందే యాసక్తుండై మెలఁగుచుండ, నొక్కనాఁడు మృగమిథునం బొక్కటి కామకేళితత్పరతతో నుండ దానిని గుఱిపెట్టి యేయుటయు నాయేటునఁ గొట్టుపడి యిఱ్ఱియు, లేడియును గ్రిందఁబడినవి. వానిలోఁ గొలఁప్రాణములతో నుండు మృగము మనుష్యవచనములతో నిట్లనియె. రాజేంద్రా! లోకమునందుఁ బాపాత్ములు సహజముగఁ గామక్రోధాదులకు లోనై యనేకములగు చేయరానికార్యముల నాచరింపుదురు. అట్టివారు సైత మిట్టి యవస్థలో నుండుమావంటివారిని వేఁటాడుటకు జంకుదురు. శాస్త్రమునకు నాచారమునకు లోఁబడి నిర్మలమైన బుద్ధితో నుండువాఁడు దైవప్రేరణచేఁ గల్గుదానిని మీఱి ప్రవర్తింపక కాలమునకుఁ గట్టుపడి యుండును. సమస్తసద్గుణములతో మహనీయులైనవారివంశమునఁ బుట్టిన నీయట్టివాని కీకార్యము తగినదా? మఱియును శత్రువుల నైన వధింప నవసరము వచ్చునప్పుడు దానికిని సమయమును బరికింతురు. అట్లుండ సర్వభూతహితకరంబైన కామేచ్ఛతో నాభర్తతో నేను సంగమించుచుండఁగా నిరపరాధి నగు నావిషయమున నిట్టియపరాధంబు చేసి పాపము నేల మూటఁగట్టుకొంటివి? అని యడుగఁగా నామృగమునకుఁ బాండురా జిట్లనియె. రాజులకు శత్రువులను వధించుటయును, వేఁటయును, నటులు మొదలగువాని నొడ్డి మాయచేతఁగాని, లేక యేకపట వృత్తిచేతఁగాని మృగవధ న్యాయ్యమైయుండును. పూర్వ మగస్త్యఋషి యరణ్యమున నుండు సకలమృగములను వేఁటాడి చంపి వానివపాహోమము గావించి సకలదేవతలను దృప్తిపఱచుట మన మెఱుంగనిదియే? కావున నాచేసినపని తప్పుగాదు. విధి యిట్లుండ నాయొనర్చిన ధర్మ్యమైన

చేతకు న న్నేల దూషించెదవు? అని చెప్పఁగా నారాజున కామృగం బిట్లనియె. నృపాలా! మృగవధము నీకు ధర్మము కాని దని నేను వచింప లేదు. మఱియు నామృగవధమునకు సైతిము సమయాసమయములు లేవే? నేను గామాతురుఁడనై యీవెంటితోఁ బెనంగుచుండ నాయభి లాషతీరుటకుమున్న మమ్మువురను వధియించితివి. శాస్త్రీయములగు ధర్మ ముల నెఱింగి స్త్రీలను బొందుటలో నుండు నానందసుఖమును దెలిసి సకలజనులను ధర్మపరులనుగా నుండునట్లు నియమించువాఁడవై యుండి, ధర్మజ్ఞుఁడ వని ఖ్యాతిఁ జెందిన నీవంటిమహారాజునకు లోకనింద్య మగు నిట్టిఘోరకార్యమును జరుపుటకు మన సెట్లు కలిగె నని మాత్రము చెప్పితి. ఇఁక నాచరిత్రను వినుము. నే నెల్లప్పుడును వన మున నే కాపుర ముండుచుఁ గందమూలఫలాహారములను గొనుచు నెడ తెగక తపం బాచరించుచుఁ గిందముం డనుపేరుతో వెలయు మునిని. మృగరూప మెత్తి రమింప నాసఁ గొని భార్యను మృగరూపమును దాల్పు మని దానితో నాకామసుఖము ననుభవించుచుంటిని. మృగ రూపముతో నున్న నన్నుఁ జంపుటచే నీకు బ్రహ్మహత్యాపాతకము గలుగదు. అయినను నాకోరిక కొనసాగకుండుటకు మును పే నన్నుఁ గొట్టి యమలోకమునకుఁ బంపితివి. కావున నీవును మనస్సునఁ దలఁచి నీభార్య నెప్పుడు పొందెదవో యాతత్క్షణము యమసదనమునకుఁ దప్ప కేఁగెదవు గాక! ఇది నీవివేవిచారమును, సమయమును గుర్తింపక చేసిన యధర్మ కార్యమునకు ఫలము. ఏస్త్రీతోడ సంగమించి నీదేహము నీశాపఫల ముగ విడుతువో యాస్త్రీ నీతోడనే సహగమనమును జేసి నీవెంట నూర్ధ్వలోకమునకు వచ్చు నని గోషమూర్తితసయనర్యై శపించి యా మృగము తన దేహమును వదలెను. అంతఁ బాండురాజు మృగరూపి యగు కిందమముని మృగరూపిణియైనభార్యతో రమించుచున్నాఁ డని యెఱుంగక మృగయావేశమునఁ గొట్టినవాఁడగుట నాముని శరీరత్యాగ మున కెంతయుఁ జింతిల్లి మనస్సున నిట్లు తలపోసెను.

ఉత్తములైనవారును గర్మాధీనులై కామపరతంత్రులై దుర్గతిఁ బొందెదరు. అయ్యయ్యో! మాయయ్య యగువిచిత్రవీర్యుఁడు సకల ధర్మపరుఁడైన శంతనునకుఁ బుట్టియు ననిశము స్త్రీలోలుఁడై యతిబాల్య

మునందే తనదేహపరిత్యాగము జేసెను. అట్టి స్త్రీవ్యామోహితుఁడగు
వానిభార్యయందు మహర్షి యగు కృష్ణద్వైపాయనుని యనుగ్రహమున
నేను బుట్టియును నిర్విధనింద్యకృత్యములఁ జేసితివి. ఇఁక నాకు శుభము
లెట్లు కలుగును? కిందముని శాపకారణమున నాకుఁ బుత్త్రోత్పాదన
సామర్థ్యంబు లేదయ్యెను. ఇఁకను నేను గృహస్థుఁడనై ప్రవృత్తిమార్గము
నవలంబించి యుండఁ దగను. ప్రవృత్తి పథమునందు మోక్షము లభించి
నను లేకున్నను, దానికై యత్నింపవలయును గాని యట్లుగాక గామా
తురుఁడై యేపురుషుఁ డన్యవ్యాపారమునం దాసక్తచిత్తుఁడగునో వాని
బ్రదు కంతయును శ్వవృత్తియే యనఁదగును. కావున దుఃఖపరంపరల
కాలవాలంబైన సంసారబంధములను వదలించుకొని విషయవాంఛలకు
మూలము లగు భార్యాదులసహాయములను నపేక్షింపక యీఋష్యా
శ్రమములలో నొక్కొక్కనాఁ డొక్కొక్క చెట్టునీడ నాశ్రయించుచుఁ
బుణ్యక్షేత్రములయందును బుణ్యనదీతీరంబులయందును సంచరించుచు
మౌనవ్రతనిష్ఠను బూని శిఖను దీసివైచి యాస్తరణంబుల నపేక్షింపక
భూతలముననే పరుండుచు, నొకఁడు నుతించిన నుబ్బక, యొకండు నమ
స్కరించిన దీవింపక, యొకనికి నమస్కరించి దీవనలను వరములను నపే
క్షింపక, నిందించినఁ గుందక, యొకనితో విలాసంపుమాటలాడి నవ్వక మఱి
యొకనితో రోషంపుఁబలుకులాడి కలహింపక, చరాచరజంతుజాలమునం
దెద్దానికిని హింస యొనర్పక, సర్వభూతములయందుఁ దానును దనయందు
సర్వభూతములను సమానముగఁ జూచుచుఁ, బదియేనిండ్లకుఁగాని,
యేడిండ్లకుఁగాని పోయి భిక్షాన్నమును దెచ్చి దినమున కొకపూట
మితాహారమును జేయుచు, భిక్షాన్న మేనాఁడు లభింపదో యానాఁ
డుపవసించుచు నాహారమును గొనిననాఁడును, నుపవసించిననాఁడును
తుల్యమనస్సు గలిగి, బాహువులను బాడిసెతోఁ జెక్కినను జెక్కిన
వాని కలుగక, వానికిఁ గీడు రోయక వేఱొకండు సుగంధముల
నలందుచో వానిని మెచ్చక సర్వసముండై జీవించువాని వలెను, శరీర
మును వీడవలసివచ్చినపుడు నిరపేక్షాపరుఁడై బహుకాల మున్న దేహ
మును వదలవలసివచ్చెనే యని దుఃఖపడని విరాగియుంబోలె, చిరకాల
జీవనంబును బొగడక, తీవ్రమరణమునకు ఖేదముఁ జెందక, చిరంజీవినైయు

పుణ్యలోకసౌఖ్యముల నార్జించువానివలె, నిశ్శ్రేయసకార్యముల నాచరింపక, ధర్మార్థకామముల నెంతమాత్ర మపేక్షింపక, సకలేంద్రియ వ్యాపారము లగువిషయలోలత్వమును, సర్వపాపములను, సర్వసంసార బంధనములను వదలి యెవ్వనికిని స్వాధీనుఁడఁ గాక సమీరునివలె నెల్లెడల సంచరించుచు నభయంబైన వైరాగ్యము నవలంబించి యీ దేహమును ద్యజించెద నని నిశ్చయించి భార్య లగుకుంతీమాద్రులతో నిట్లనియె. కామినులారా! నామనస్సు కామోపభోగవిముఖత్వమును బొందుచున్నది. కావున సంసారబంధములను ద్రెంపి యిపుడ సర్వసంగపరిత్యాగము నొనర్చి సన్న్యాసి నయ్యెద. మీరు హస్తిపురమున కేఁగి యీ నా వృత్తాంతంబును మాతల్లులకును, సత్యవతికిని, భీష్మధృతరాష్ట్రవిదురులకును, సకల బంధువులకును, నా ప్రమంత్రిపురోహిత జనంబులకును, వృద్ధబ్రాహ్మణులకును వినయపూర్వకముగ వివరింపవలయును. అని చెప్పఁగా కుంతీమాద్రులు భర్త యరణ్యవాసము నే కోరియున్నాఁ డని యెఱింగి యతని కిట్లనిరి.

మనోనాయకా! మే మెచ్చటికిఁ బోవుదుము? మమ్మెచ్చోట నుండుటకు నియమింతువు? ధర్మపత్నుల మగుమాతోఁ గూడి తపం బాచరించి ప్రాప్తమైన శరీరమును యథాకాలమున వదలి పుణ్య లోకముల కేఁగి యచ్చోటఁ జెడనిసౌఖ్యమును బొంది యంతము లేని యానందము ననుభవింపవలయును. ఏలోకమున వసించినను మాకు భర్త నీవే కాని యన్యుండు కానేరఁడు. మేమును జితేంద్రియులమై కామోపభోగములకు విముఖులమై నీతోడఁ బుణ్యలోకముల ననుగమించుటకుఁ దపం బాచరించెదము. ఇవ్విధమున నీతో నుండి తపస్సుల నాచరించుటకు ననుమతింపవేని మే మిప్పుడే యీశరీరములను విడిచెదము అని చెప్పఁగా పాండురాజు వారల కిట్లనియె. సతులారా! వినుఁడు. మీనిశ్చయమును నిట్టి దగునేని నేను వానప్రస్థాశ్రమి నయ్యెద. గ్రామ్యములగు రుచ్యములై నయాహారముల నిఁక భుజింపను, నారబట్టలం గట్టుకొనెద. ఊరుకూలవస్త్రములఁ ద్యజించెద. జడలు దాల్చెద. సంధికాలములయం దగ్నిహోత్రములయందు హవిస్సులను శుచినై వ్రేల్చెద. దేహము దృఢముగ నుండవలయునని కోరిక మిత

ముగ వన్యఫలములను భుజించెద, కందమూలఫలముల నాహారముగాఁ గొని జీవించి యన్నిసత్క్రియలఫలములను భగవంతున కర్పించెద. సర్వకాల సర్వావస్థలయందుఁ బ్రకృతిగుణము లగుశీతోష్ణాదు లైన ద్వంద్వములకు దూరుఁడనై యవి నన్నుదరిసిన నోర్చి తర్పణములచేఁ బితరులను, యజ్ఞములచే వేల్పులను, వేదాధ్యయనతపంబులచే ఋషులను, భూతదయచే మనుష్యులను దనివిఁ జెందున ట్లొనర్చుచు భూమియం దుండునెట్టిభూతమున కప్రియమును జేయక, వానప్రస్థాశ్రమధర్మముల నతికఠినముగ ననుష్ఠించుచు, శరీరత్యాగము చేసెద నని కుంతీమాద్రులకును నారచీరలఁ గట్టనిచ్చి దివ్యమైన వారివలిపముల నూడ్చి, వారిపై నున్నసకలాభరణములను దీసివైపించి వానినెల్లఁ జేరువ మునిపల్లెలయం దున్నబ్రాహ్మణుల కొసంగి త న్ననుసరించి తనవెంట సేవకులై యున్నవారిని బిలిచి వానప్రస్థాశ్రమస్వీకారమును హాస్తిపురమున నెల్లవారికిఁ దెలుపుఁ డని యానతిసేయఁగా వా రారాజుదీనాలాపములను విని కన్నీరు చొటచొటఁగార్చుచు మిగులఁ జింతతో హాస్తిపురంబునకుఁజనిరి. అప్పుడు వారు పాండురాజు తమయొద్దనిచ్చిన యనేక వస్తుసామగ్రులను సకలధనములను ధృతరాష్ట్రునకుఁ బాండురాజానుమతి నొప్పగించిరి, పాండురాజు వానప్రస్థాశ్రమస్వీకారవృత్తాంతంబును ధృతరాష్ట్రునకు నివేదించిరి. అంత ధృతరాష్ట్రుఁడును దమ్ముని వైరాగ్యమును దలంచి తానును విషాదమున శయ్యాసనాదుల నొల్లక యొక్కవిధమునఁ గాలముఁ గడుపుచుండెను.

అంత నిటఁ బాండురాజు కుంతీమాద్రులు తన్ను వెంబడించి వచ్చుచుండ నాగశతపర్వతమును, చైత్రరథమును, గాలకూటమును, హిమవంతమును, గంధమాదనంబును, నింద్రద్యుమ్నహ్రదమును, హంసకూటమును జేరి యాయాస్థలంబులఁ గొన్నినాళ్లుండి యచ్చోటునుండి, శతశృంగపర్వతమునకుఁ బోయెను. అచ్చోట నున్నమహర్షులు తన్ను మిత్రునిచాడ్పున, సోదరునిఁబోలెఁ బుత్రునివలెఁ విశ్వాసముతోను బ్రీతితోను వాత్సల్యముతోను వీక్షించుచుండఁ బాండురాజు వారలకు సకలోపచారములం జేయుచు నహంకారమమకారములను ద్యజించి యింద్రియములను జయించి తపస్సుఁ జేయుచుండె.

అంత నచ్చోటి మును లెల్లరును బ్రయాణమై బ్రహ్మలోకమున దేవతలును, మునులును, బితరులును గూడ నున్నవా రని వారిదర్శనార్థముగఁ బోవుచుండిరి. వారిని బాండురాజు చూచి మునీశ్వరులారా! మీ రెచ్చోటి కిప్పు డేఁగ నుద్యుక్తులైనా రని యడుగఁగా వారు తాము బ్రహ్మలోకమునకు మహనీయులసమాగము దర్శనార్థ మేఁగుచున్నామనిరి. అంతటఁ బాండురాజును, భార్యలతో వారిని వెంబడించెను. అంత నందఱును నుత్తరాభిముఖులై తమవెంబడి వచ్చుచున్న పాండురాజును గుంతీమాద్రులను జూచి వారిలోఁ బాండురాజున కిట్లనిరి. రాజా! మే మీపర్వతమున నుపరిభాగమున సంచరించుచుఁ బొంద నలవి కాని యనేక దేశములం జూచితిమి. గంధర్వులు విద్యాధరులును శ్రవణసుఖముగా గానములను జేయుచు విమానములలో విహరించుచుండు నీదేవవిహారయోగ్యమగు స్థానమును, బలుతెఱంగులైన లతావృక్షములలోని కుసుమములు పరిమళసుగంధముల నీనుచుండు కుబేరోద్యానమును, మహానదులకుఁ బుట్టువులగు స్థలంబులను, భయంకరక్రూరమృగములకు నివాసంబైనగిరిగుహలను ననేకములను జూచియున్నాము. మఱియు నీచోట నెప్పుడును హిమావృతములై గహనములైన గుహలచే దుర్గమములైన ప్రదేశము లనేకములు గలవు. ఆదేశములలోఁ బక్షిసంచారము లేదు. మృగములు మెలఁగవు. మనుష్యులమాట చెప్ప నేల? అచ్చోట సిద్ధపురుషులును, వాయువును మాత్రము సంచరించుచుండును. ఇఁక నెట్టివారికిని సంచరింప నాదేశము యోగ్యము కానేరదు. కష్టముల నెంతమాత్ర మెఱుఁగని యీ రాజపుత్రికలం దోడ్కొని యీగహనదుర్గమారణ్యంబులకు నీ వెట్లు రాఁగలవు? అనినఁ బాండురాజు వారి కిట్లనియె. మహర్షులారా! సంతతిలేనివాఁడు సద్గతిఁ జెందునే? నే నిపుడు సంతతిహీనుఁడనై యున్నవాఁడను. భూలోకమున మనుష్యుఁడు నాల్గు తెఱంగులైన ఋణములను దీర్పవలసినవాఁడుగ నున్నాఁడు. ఆఋణములను మున్నిడుకొని వాఁ డీలోకమునఁ బుట్టుచున్నాఁడు. వాఁ డెవ్విధముననైనను నాదేవ, ఋషి, పితృ, మనుష్యఋణములను దప్పక తీర్పవలయును. యజ్ఞములను జేసి దేవఋణమును, వేదాధ్యయన తపోనుష్ఠానములవలన ఋషులఋణమును, బుత్త్రులను గని శ్రాద్ధకార్య

ముల నొనర్చి పితరులఋణమును, సత్యవాక్కున మనుష్యఋణములను దీర్పవలయు. ఇప్పటి కెట్లో దేవర్షిఋణములను బాయఁగంటి. ఈ దేహము నిప్పుడు విడిచితినేని సంతతి లేనివాఁడనగుటఁ బితరుల ఋణము నీఁగ లేను. అనపత్యుఁడ నగుటచేతఁ బితరులఋణమును బాపుకొనలేనివాఁడనై పుణ్యలోకములఁ బొందలేనుగదా యని చింతతో నున్నవాఁడను. పితౄణమును బాపికొనుట కొండొకయుపాయమును బెద్దలగు మీరు సెలవిండు. వేదవ్యాసునకు నేను బుట్టి మాతండ్రికి క్షేత్రజపుత్త్రుఁడ నైతి. అట్లు నాక్షేత్రములయందు నాకుఁ బుత్త్రులుద్భవిల్లిరేని యది నాకు నిశ్శ్రేయసము నొడఁగూర్పదే? నా కట్టిక్షేత్రజుల ననుగ్రహింపుఁడు. అనఁగా నమ్మునులు యోగదృష్టిం జూచి పాండురాజున కిట్లనిరి. నరేంద్రా! నీకు దేవతుల్యు లగుక్షేత్రజులు గలిగెదరు. మేము మాదివ్యదృష్టిఁ గంటిమి. తెలివిగలవాఁడు సులభోపాయముల ఫలమును బడయుటకు యత్నించుచుండును. కావున నీవును నట్టిక్షేత్రజులఁ గనుటకు యత్నింపుము. అని చెప్పఁగాఁ బాండురాజు కిందమమునిశాపంబునఁ దనకుఁ బుత్త్రోత్పాదనసామర్థ్యంబు నశించె నని చింతించి యేకాంతంబునఁ గుంతితో నిట్లనియె.

సుదతీ! సంతానమున ధర్మము లన్నియుఁ జేకూరును. పుత్త్రులు లేనివాఁ డెంతతపస్సు చేసినను, నెన్ని దానముల నాచరించినను, వానిఫలముల నందలేఁ డని ధర్మజ్ఞు లగువారు సెప్పుదురు. కావున సంతానము లేని నేను పుణ్యలోకముల నెట్లు పొందఁ గల నని మనస్సున నెన్నఁడును జింతించుచుండుదును. కిందమమునిశాపమున నొకసుతుఁ బడయుదు ననుమాట తలంచుటకైన వీలు లేకపోయెను. కావున నాలోచింపఁగా నొక్కమార్గ ముచిత మని తలంచెద. అది యెట్టిదని వినుము. పండ్రెండువిధములైన పుత్త్రులు గలరు. వారలలో *నౌరస, క్షేత్రజ, కృత్రిమ, పౌనర్భవ, కానీన, గూఢోత్పన్ను లను నార్వురు బంధు

---

* ౧. ఔరసుఁడు; శాస్త్రీయముగఁ బెండ్లిచేసికొనినభార్యయందు భర్తకుఁ గలిగినవాఁడు.

౨. క్షేత్రజుఁడు పెండ్లిచేసికొనిన భార్యయందు గురువులు మొదలగు పెద్దల నియోగమున బావ మొదలగువారివలనఁ బుట్టినవాఁడు.

లును, దాయాదులును నగుదురు. దత్త, క్రీత, స్వయందత్త, సహోఢజ, జ్ఞాతిరేతస్, శౌద్ర లను నాలుగురును బంధువు లగుదురు కాని దాయా

---

౩. కృత్రిముఁడు:—గుణములఁ బరీక్షించి పుత్త్రుఁడుగఁ గైకొనఁబడినవాఁడు.

౪. పౌనర్భవుఁడు:—ఇద్దఱుమగలను బెండ్లిచేసికొన్న స్త్రీయందు రెండవమగనికిఁ గలిగినవాఁ డని కొందఱు చెప్పెదరు. మగనిచే విడువఁబడి కాని, మగఁడు చచ్చినతర్వాతఁగాని వేఱొకనికి భార్యయైనదానికిఁ బుట్టినవాఁ డని కొందఱు చెప్పెదరు. మఱియు వయస్సుగల మగనిని విడిచి వేఱొకనితోఁ గొన్నిదినములు కాపురము చేసి మఱల తన మగనియొద్దఁ గాపురముచేయుదానికిఁ బుట్టినవాఁ డని మఱికొందఱు చెప్పెదరు.

౫. కానీనుఁడు—పెండ్లియగుటకు ముం దొక పురుషునివలనఁ గలిగినవాఁడు.

౬. గూఢోత్పన్నుండు:—భర్త కెఱుక లేక రహస్యముగా జారపురుషుని వలనఁ గలిగినవాఁడు.

౭. దత్తుఁడు:—తలిదండ్రులచే నన్యునకుఁ బుత్త్రుఁ డగున ట్లొసంగఁబడినవాఁడు.

౮. క్రీతుఁడు:—వెలయిచ్చి యనఁగా తలిదండ్రులకు ద్రవ్యము నొసఁగి విక్రయమునకుఁ గొనఁబడినవాఁడు.

౯. స్వయందత్తుఁడు:—తనకుఁ దానే నీకుఁ గుమారుఁడనై యుండెదనని చెప్పి వచ్చువాఁడు.

౧౦. సహోఢజుఁడు:—ఒక స్త్రీ గర్భిణిగా నున్నప్పుడు పెండ్లిచేసికొనఁగా దానికాగర్భజనితుఁడు.

౧౧. జ్ఞాతిరేతసుఁడు:—వ్యవహితభ్రాత్రాదుల కుమారుఁడు.

౧౨. శౌద్రుఁడు:— శూద్ర స్త్రీయందుఁ బుట్టినవాఁడు. ఇచ్చట సంస్కృతభారతమునకుఁ దెనుఁగుభారతమునకు భేదము తెలియుచున్నది. ఈభేద కారణము బహుకాల పాఠభేదమని కొంద ఱనెదరు. తెనుఁగుభారతమునఁ గ్రమ మిట్లున్నది. ఔరస, క్షేత్రజ, దత్తక, కృత్రిమ, గూఢోత్పన్న, అపవిద్ధ లను వార్వురును, కానీన, సహోఢ, క్రీత, పౌనర్భవ, స్వయందత్త, జ్ఞాతిరేతసు, లను వార్వురును నని వరుసక్రమము చెప్పఁబడినది. సంస్కృతభారతమున దత్తపుత్త్రుఁడు ఏడవవాఁడుగఁ జెప్పఁబడియున్నాఁడు. తెనుఁగున మూఁడవవాఁడుగఁ జెప్పఁ బడెను. సంస్కృతభారతమున నున్నక్రమప్రకారము మొదటి యాఱుగురును బంధువులును దాయాదులును నగుదురు. ఆకారణమున దత్తుఁ డందుఁ జేర్పఁబడక యుండుటచే దత్తుఁడు బంధువు దాయాదియుఁ గానేరఁడు. మనుస్మృతియందు

దులు కారు. ఉత్తముఁడగు దేవరునివలనఁ బుట్టు క్షేత్రజుఁ డౌరసునకుఁ దుల్యుం డగును. ఈధర్మమును స్వాయంభువమనువు పూర్వము వక్కాణించెను. కావున నాకు సమానునివలనఁగాని నాకంటె నుత్తముని వలనఁగాని నాకు సద్గతి నిచ్చుపుత్త్రునిఁ బడయుము. పూర్వకాలమునఁ గేకయరా జగుశారదండాయని పుత్త్రోత్పాదనంబునం దశక్తుండయి తన భార్య నీచెలియలి శ్రుతిసేన పుత్త్రులఁ బడయునిమిత్త మనుమతింపఁగా నది యు నొక్కనాఁడు ఋతుస్నాతయై పరిశుద్ధయై యొకయుత్తమబ్రాహ్మణుని వేఁడి పుత్త్రుఁడు గలుగవలయు నని యగ్నియందు హోమముఁ జేసి పవిత్రయై యానాఁటిరాత్రి యాసిద్ధుండైన విప్రునియొక్క సమాగమంబున దుర్జయాదు లగు మహారథుల ముగ్గురు పుత్త్రులను బడసెను. ఇవ్విధమున నొక్కయుత్తమసిద్ధబ్రాహ్మణునివలన క్షత్త్రియాంగనలు సంతతిని బడిసి వంశము నుద్ధరించుట యాచారమై యున్నది. కావున నోకోమలీ! నీవును నానియోగంబున నాకుఁ బుత్త్రోత్పాదనమునిమిత్తము యత్నింపు మనఁగా గుంతి పాండురాజున కిట్లనియె. భూమిపాలా! సకలధర్మముల నెఱింగినవాఁడవయ్యును, నాగుణములను నెఱింగియుండియును నీ కనురక్తనై పరపురుషుల నేకాలమున నైనను మనస్సునందు నైతము స్మరింప. నన్నిట్టి కార్యములయందు నియోగింపఁదగునే? నీప్రసాదమున నాకుఁ బుత్త్రులు గలిగిన మనకుఁ బుణ్యలోకములు గలుగఁగలవు. ఎట్లనిన దీని కనుగుణంబైన దియొక్క పుణ్యకథఁ దొల్లి పౌరాణికులవలన నావినిన దానిఁ జెప్పెదఁ జిత్తగించి వినుము ని పాండురాజునకుఁ గుంతి యిట్లనియె.

### వ్యుషితాశ్వుం డను రాజువృత్తాంతము

తొల్లి పూరువంశోత్పన్నుండగు వ్యుషితాశ్వుం డనురాజు సకలమహీరాజ్యము నేలుచుఁ బ్రజల నతిప్రీతితోఁ బాలించుచుండెను. ఆ మహానీయుం డగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి,

దత్తుఁడు మూఁడవవాఁడుగ లెక్కింపఁబడినందున వాఁడు బంధువును దాయాదియును నగును. యాజ్ఞవల్క్యస్మృతియందు దత్తుఁడు సంస్కృతభారతమునవలె నేడవవాఁడుగ గణింపఁబడెను. ఇట్లు మనుస్మృతికిని భారతమునకు భేదమున్నది. భారతమున నుండు వరుసకు నితరస్మృతులలో నుండువరుసకు విరోధ మున్నది. మనుస్మృతితో జ్ఞాతి కేతసుఁడు చెప్పఁబడలేదు. వీనికిమాఱుగా పారశవుఁడు అని చేర్పఁబడియున్నది.

వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము లను వేదసంస్థ లని విఖ్యాతిగాంచిన నిత్యయజ్ఞముల నొనర్చి దేవతల నానందింపఁజేసెను. వసంతకాలపు భానునింబోలెఁ బరాక్రమించి శత్రురాజుల నెల్ల నణఁచి వారియొద్దనుండి కప్పములను గానుకలను గొనితెచ్చి, యశ్వమేధ యాగమున కుపక్రమింపఁగా నాయాగమునకు మహేంద్రుండు నిజ స్వరూపముతోఁ దోడిదేవతలతో నేతెంచి హవిర్భాగములఁ గొని పోయె ననియు వినుచుందుము. ఆవ్యుషితాశ్వుఁడు దనభార్యను "కక్షీవంతునికూఁతును రూపున రతీదేవింబోలుదాని నెల్లప్పుడు కామ భోగపరతంత్రుఁడై భోగించి యది కారణంబుగ శరీరము రోగము కలిగి కండ లేక శోషించుటను బక్కచిక్కి యచిరకాలములనే యస్త మించిన నది పుత్త్రలాభదుఃఖిత యయి పతివియోగంబు సహింపలేక యాశవముం గట్టికొని యిట్లని విలపించె. మహేంద్రతుల్యుఁడా! భర్తలేని బ్రతు కగునే? ఆబ్రతుకుకంటె మరణము మేలు. నిన్నుఁ బాసి యీలోకమున నే నుండనేరను. నీవెంట నేను వచ్చెదను. నన్నును నీతోడఁ దోడ్కొనిపొమ్ము. కాదేని యనపత్యనై యుండు నాకు నీపవిత్రంపు స్వరూపముగల పుత్త్రులనైన నొసంగుము. అంతదనుక దర్భలను బఱచుకొని యెవ్విధముననైన నిన్నుఁ గాంచఁగ వ్రతముఁ దాల్చెద. నాకు దర్శన మొసంగి తగినవిధమున హితబోధ సేయుము. అని యారాజుశవముపైఁ బడి పలుతెఱంగులఁ జూచువారి కతి దైన్యము దోఁచునట్లు విలపించుచుండె. అప్పు డాశవమునందుండి యొకయశరీరవాణి దాని కిట్లనియె. శుభద్రా! వినుము. ఊరకయేల యిట్లు వాపోయెదవు? లెమ్ము. నీకు వర మొసంగెదను. నావలన నీవు నిర్మల చరిత్రులగు కొడుకులను సద్గుణములతో నొప్పారెడువారి నేడ్వురను బడసెదవు. అని యశరీరిణి చెప్పఁగా నాయిందువదన ఋతుమతియైన యష్టమదివసంబుననో, లేక, చతుర్థదినముననో శుచియై శయనం బున నుండి యశరీరిణి చెప్పినతీరున భర్తను దలంచెను. అంత నొకమహా పురుషుండు భర్తఁ బోలువాఁడు దానితో సంగమింపఁగా ముగ్వురు సాల్వులును, నలువురు మద్రులునుం గల్గిరి. ఇవ్విధంబున వ్యుషితాశ్వుని పత్ని వానిశవంబువలనఁ దనతపంబు పెంపున నేడ్వురు పుత్త్రులం బడసె.

అవ్విధమున వ్యుషితాశ్వునిభార్య యాతని శవంబునఁ బుత్త్రులం బడసె
యఁగా నీనియోగబలంబునం జేసి నేఁబుత్త్రులఁ బడయఁగా నేరనా? కాన
నే నన్యపురుషునిసంగమము నొల్లను. నీప్రసాదంబుననే సంతతి గనుదు.
అనినఁ బాండురాజు కుంతీదేవి కిట్లనియె.

కుంతీ! నీచెప్పినవృత్తాంతమెల్లను సత్యమే. వ్యుషితాశ్వుం డనఁగ
దేవతుల్యుండు కావున నాతీరునఁ జేయఁగలిగెను. పెఱవారి కాసామ
ర్థ్యము గలుగునే? ఆవృత్తాంతము నంతటితో వదలుము. పూర్వసుప్ర
సిద్ధమై పురాణముల కెక్కియుండు నొక్కధర్మతత్త్వమును జెప్పెద నాల
కింపుము. పూర్వకాలమున స్త్రీలు స్వేచ్ఛావిహారపరలై కామసుఖముల
ననుభవించునపుడు పతి యని పరపురుషుఁ డని భేదము లేక యెప్పటి
కెట్లు సందర్భము కలుగునో యాసందర్భమునకు నుచితముగ నిచ్చ గల
వారిని బొందుచు స్వతంత్రలై వర్తించుచుండిరి. ఇప్పటికిని నాయాచార
ము త్తరకురుదేశములం దుండుమనుష్యులలోను మనదేశమునఁ బశు
పక్షిమృగములలోను ముఖ్యముగఁ గానవచ్చుచున్నది. అట్లుండ
నుద్దాలకుఁ డనుమునికి భార్యయు శ్వేతకేతు వనుమహర్షికి దల్లియు
నైన వనిత యొక్కర్తును నొక బ్రాహ్మణుండు కామభోగముల
ననుభవించి యామెయందు సంతానమును బడయఁగోరి యా
వనితను జేయి పట్టుకొని యేకాంతస్థలమునకుఁ గొనిపోవుచుండఁగా
నాయసహ్యాపుఁ గార్యమునకు శ్వేతకేతు వేవగించుకొని కోపించు
చుండ నుద్దాలకుం డిది యుచితమే యనియు సనాతనధర్మ మనియుఁ
జెప్పినను శ్వేతకేతు వది దురాచారము గాని ధర్మ్యము గానేరదని
కంఠోక్తిగాఁ జెప్పి తాను మహానీయుం డగుటచే నప్పటినుండి స్త్రీలకు
వ్యవస్థ నిట్లేర్పఱచెను. ఇప్పటినుండి పతిని వదలి కామోపభోగముల
నన్యపురుషుని సంతసింపఁజేయుభార్యయుఁ, బతివ్రతయైయున్న భార్యను
వదలి వ్యభిచరించుభర్తయును భ్రూణహత్యాదోషమును బొరయుదురు.
మఱియును బుత్త్రలాభార్థము భర్త భార్యను నుత్తమపురుషసంయోగ
మునకు నియోగింప భార్య యానియోగము నొల్లదేని యాభార్య
యును భ్రూణహత్యచేఁ గలుగుపాతకమును బొందును. ఈవ్యవస్థను
లోకు లాదరింతురుగాక యనియె. కావుననే సుదాసునిపుత్త్రుం డగు

కల్మాషపాదుండు సంతానార్థము తనసతి మదయంతిని వసిష్ఠమునితోడి సంగమమునకు నియోగింప నశ్మకుండుజనించె. మఱియును మేము విచిత్ర వీర్యుని క్షేత్రములయందు సత్యవతీభీష్ములు నియోగింప వ్యాసభట్టారకు నకు జనించితిమి. ఈసందర్భముల నన్నింటిని నాలోచించియే నిన్నీ కార్య మునకు నియోగించితిని. భార్య తన ప్రతిబుతుకాలమునయందును భర్త ననుసరించి యాతఁ డాజ్ఞాపించుకార్యములయం దప్రమాదయై వర్తింప వలయును, కాదేని వేయి యేల? ఆకాలములయందు ధర్మమైనను నధర్మ మైనను పతిచిత్తానుసారము భార్య వర్తించి తీరవలయును. కావున సం తానమును గోరియున్న నాచిత్తానుసారము వర్తించి నాకుఁ బుణ్యలోక ములు కలుగునట్లు చేయుము. అని చెప్పఁగాఁ బాండురాజునకుఁ గుంతి యిట్లనియె. నాపుట్టినింట నే నుండునపుడు నాతండ్రియింటికి వచ్చెడు భూసురులను లెస్సఁగాఁ బూజించి వారి కాసనాదుల నమర్చి యతిథి సత్కారముల నాచరించుట నాయధీనమయి యుండె. అప్పు డొకనాఁడు దుర్వాసుం డనుమహామునియుం డేతెంచి మాతండ్రిగృహమునఁ గొన్ని నాళ్లుండి నాచేఁ బరిచర్యలు గావించుకొనియె. నాయొనర్చు సకలోప చారంబులకు సంతుష్టిఁ బొంది ముని పోవునాఁడు నాకొకమంత్రము నుప దేశించిపోయెను. ఆమంత్రమును బునశ్చరణముచేసి నాకిష్టమగు దేవతను బ్రత్యక్షము గావించుకొనినచో నాదేవత నాకుఁ బుత్త్రలాభమును గలిగించిపోవును. ఇపుడు నీ వనుజ్ఞ యిత్తువేని యామంత్రోచ్చారణ మహిమవలన నీవు తలంపుచున్న దేవతను దలంచి యాదేవతమూలమున నీకు సంతానమును బొందెదను. ఏదేవతను నీవు స్మరింపు మనియెదవో, యిప్పు డాదేవతను స్మరించెదను. ఆనతిమ్ము. అనగాఁ బాండురా జట్లయెన్ని నేని మఱి మే లయ్యెడును. కౌరవవంశమునందుఁ బుట్టి రాజు కానున్న వాఁడు పరమధర్మజ్ఞుఁడుగ నుండవలయును. కావున నీవిప్పుడు ధర్మ దేవతను స్మరింపుము. ఆతని నావాహనించి యామహామునియనుగ్రహ మునఁ బుత్త్రునిఁ బడయు మనెను.

## కుంతికి ధర్మరాజు మున్నగువారు జనించుట

అంత నాకుంతిభోజతనయ స్నాతయై శుచియై పాండుభూపాలు నకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి మానసమున ధర్మదేవతను

స్మరించి మంత్రమును జపించెను. ధర్ముం డంతట దివ్యప్రభలతో నొప్పారు విమానము నెక్కి కుంతికిఁ బ్రత్యక్షగోచరుండై, కామినీ! నన్నేల స్మరించితివి? నే నేమి చేయవలయును? అని యడుగఁగాఁ గుంతీదేవి యించుక లజ్జావనతవదనయై నాకుఁ బుత్త్రు నిమ్మనెను. అప్పటికి గాంధారి యొకయేఁడు చూలాలై యుండెను. పదంపడి ధర్ముండు యోగంబునుబూని యాతరుణితో సంగమించుటయు వానియనుగ్రహంబునఁ గుంతి చూలుఁ దాల్చి పిదప సంవత్సరమునకు తులామాసమున శుక్లపక్షమునందు సోమవారజ్యేష్ఠానక్షత్రములతోఁ గూడిన పంచమినాఁటి సాయాహ్నంబునఁ గుమారునిఁ గనెను. *ఆకుమారుఁడు పుట్టుచుండఁగనే యాతండు

---

* ఇందులకుఁ బ్రమాణము. 'శ్లో. ఐంద్రే చంద్రసమాయుక్తే ముహూర్తే ఽభిజితేఽష్టమే, దివామధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేఽతిపూజితే. ఐంద్రే = జ్యేష్ఠానక్షత్రే, అభిజితే=దివసస్యాష్టమముహూర్తే, దివా=శుక్లపక్షే, మధ్యగతే= తులాయనగతే, తిథౌ పూర్ణే-పూర్ణాయాం పంచమ్యాం' అని యున్నది. ఈదినము ఆశ్వయుజ శుక్ల పంచమి యగుచున్నది.

ఆంధ్రభారతమున ధర్మరాజు మృగశిరనక్షత్రము శుక్లాష్టమినాఁడు పుట్టెనని వ్రాయఁబడియున్నది. కొందఱు జీజననదినమును జ్యేష్ఠశుక్లపూర్ణిమ జ్యేష్ఠానక్షత్రము మధ్యాహ్నకాలముగా నిర్ణయించిరి. ఇందునకు గణితప్రకారము.

సృష్ట్యాదిసంవత్సరములు ౧, ౯౫, ౫౮, ౪౯, ౮౯౧కు మీఁద బార్హస్పత్యమానము ప్రకారము క్రోధిసంవత్సరము. చాంద్రమానప్రకారము వికృతిసంవత్సరము. గురూదయాబ్దప్రకారము ఆషాఢాబ్దము జ్యేష్ఠశుద్ధ ౧౫-సోమవారము. ద్వాపరాంతమునకు ౩౯ ౪౬౩-దినములు తక్కువఁగానున్నప్పుడు ఉదయాది పున్నమ ౩౮-గడియలు అనూరాధ గడియలు ౪ కు మీఁద జ్యేష్ఠానక్షత్రము సింహలగ్నమందు జననము.

| | | ర-బు | |
|---|---|---|---|
| | | శు-శు | |
| కే-గు | రాశి చక్రం | | శని |
| | | | రా-ల |
| | చ | | |

యుధిష్ఠిరుఁ డను పేరితోఁ బరమధర్మజ్ఞుఁడై పరాక్రమవంతుఁడై ముల్లో కముల ఖ్యాతిఁ గాంచు నని యశరీరవాణి యాశ్రమములో నుండువా రెల్లరు వినునట్లు పలికెను. అంతఁ బాండురా జుండిన యాశ్రమములో నుండు మును లెల్లరు నశరీరిణి పల్కినచొప్పున నాశిశువునకు యుధిష్ఠిరుఁ డను నామమును బెట్టిరి. అట్లు యుధిష్ఠిరుండు పెరుఁగుచుండగాఁ బాండు రాజు కుంతిం బిలిచి యిట్లనియె. వరాంగీ! వినుము. సర్వసాధారణముగ రాజులు శరీరదార్ఢ్యము గలవారై యుండవలయును. కావున బలశాలి యగువాని నొక్కనిని గుమారుంగాఁ బడయఁగోరెద ననెను. అంత నమ్మహాదేవి వాయుభట్టారకు నుద్దేశించి దుర్వాసునిమంత్రమును బున శ్చరణము చేసెను. ఆమంత్రమహిమచే నాదేవుండు కుంతీదేవికిఁ బ్రత్యక్ష మయ్యెను. అప్పుడు కుంతి యాదేవుని తనకుఁ బుత్రోత్పాదంబునందు సాయపడు మని వేఁడఁగా నామహనీయుని ప్రసాదంబున మిక్కిలి బల శాలి యగు కుమారుని రెండవవానినిఁ గనెను. అప్పుడు మఱల నశ రీరిణి యిట్లని పలికె. లోకములో నున్న యందఱు బలశాలులకంటె ఓకుంతీ! ఈ నీ రెండవకుమారుఁడు దృఢకాయుఁడును బలశాలియునై యుండు నని వచించె. వాని విస్తారబలమునుగూర్చి యొక వృత్తాంత మును వైశంపాయనుఁడు జనమేజయున కిట్లని వక్కాణించెను. వాఁడు పుట్టినవెంటనే యొక్కనాఁ డాశిశువును గుంతీదేవి తనయొడియం దుంచుకొని కూర్చుండియుండెను. అప్పుడు సమీపముననే పెద్దపులి యొక్కటి నడయాడుచుండుటను గుంతీదేవి చూచి భీతిల్లి యొడియం దున్న శిశువును మఱచి తత్తరపాటు తటాలున లేచెను. అప్పు డొడియం దున్న కుమారుం డొకఱాతిపైఁ బడెను. ఆశిశువు దేహము సోఁకుచుండఁ గనే యాఱాయి నలుముక్కలుగఁ బగిలెను. అచ్చోట నున్నవా రాఱాయి పలుకు లగుట కాశ్చర్యపడిరి. అంత నాశిశువును భీమసేనాభి ధానుం జేసిరి. పదంపడి కొన్నినాళ్లకుఁ బాండురాజు కుంతితోఁ దనకు లోకోత్తరుఁ డగు మఱియొకపుత్త్రుం గలిగింప వేఁడెను. అప్పుడు కుంతి మనంబున మహేంద్రుం దలపోసి యాదేవతయనుగ్రహమున రణమున నెంతటివారిం దలపడినను గెలువనోపు సుపుత్త్రుం బడయ నిశ్చయించెను. పాండురాజు నొంటికాలిపై నిలిచి యొక్కయేడు మునులయానతిం

బడసి మహేంద్రుంగూర్చి తపం బాచరింప మహేంద్రుం డాపరకాలువకుఁ బ్రత్యక్షుండై "రాజా నీకోరినట్లు గోబ్రాహ్మణులకును మిత్రులకును బంధుజనులకును నుపకారియు, శత్రుల నుక్కడంచి, త్రిలోకముల యందుఁ బ్రకాశించుయశస్సుతోఁ గూడుకొన్న వాఁడును నైయుండు సుపుత్త్రు నొసఁగెద నని యనుజ్ఞ యిచ్చి చనెను. అప్పుడు పాండురాజు కుంతిం బిలిచి యప్పుడ దుర్వాసునిమంత్రమును మహేంద్రుం గూర్చి జపింపు మనఁగాఁ గుంతి యతిభక్తితో నా దేవతలయొడయని ధ్యానింప నాతండు కుంతికి దర్శన మొసంగెను. అంత నమ్మహేంద్రు ననుగ్రహంబునఁ గుంతీదేవి చూలుఁ దాల్చి యొక్కసుముహూర్తంబున దివ్యతేజోవిరాజితుం డగు పుత్త్రుం గనియె. ఆపుత్త్రుండు పుట్టుచుండఁగనే యశరీరవాణి కుంతి నుద్దేశించి యిట్లనియె. దేవీ! యీ నీకుమారుఁడు కురు, చేది, కాశి, కరూశాదిదేశములపై దండెత్తి వెడలి యారాజులం గెలిచి యాదేశములను వశపఱచుకొనును. కౌరవలక్ష్మి యీమహనీయుని వరించి యితనిం బొందును. ఇప్పుడు తనపరాక్రమమున నింద్రుని ఖాండవవనమును నగ్నికిఁ బ్రీతిగా నొసంగి దహింపఁ జేయును. నానాదేశాధీశులం గెలిచి మూఁడశ్వమేధయాగముల నన్నచేఁ జేయించును. మాయాకిరాతుం డగుమహాదేవునితోఁ బోరును. ఈతనితోఁడ బెనఁగి సంతసించి వీనిపరాక్రమమునకు మెచ్చి పినాకపాణి తన పాశుపతాస్త్రమును బ్రయోగోపసంహారములతో నుపదేశించి సమంత్రకముగ నొసఁగును. లోకపాలు రీతని యమానుషధైర్యసాహసములకు మెచ్చి తమతమదివ్యాస్త్రముల నీతని కొసంగుదురు. మఱియు వీఁడు మహేంద్రు ననుజ్ఞఁ బొంది సముద్రమున డాఁగియున్న నివాతకవచులను రాక్షసులం బరిమార్చి మహేంద్రుని మెప్పించి యాతనివలన దివ్యాస్త్రములను గొనును. ఇతనిపరాక్రమ మమానుషమని యాకాశవాణి పలుకుటయు నాశ్రమములోనిమును లత్యాశ్చర్య మొందిరి. మఱియు నీ పుత్త్రుండు జన్మించుచుండఁగనే ద్వాదశాదిత్యులును, నేకాదశరుద్రులును, నష్టవసువులును, సప్తమహర్షులును, మరుద్గణంబులును, బ్రహ్మమానస పుత్త్రులును, నితర దేవగణంబులును, ననూరుండును, గరుడుండును, వాసుకిప్రభృతిప్రసిద్ధనాగులును, సిద్ధులును, సాధ్యులును, గిన్నరులును,

కింపురుషులును, యక్షులును, విద్యాధరులును, విమానముల నారో
హించి వియత్తలంబునుండి వచ్చి దర్శనముచేసి ప్రస్తుతించిరి. అట్లె దేవ
గణంబులు వచ్చి చూచి పోవుట నాయాశ్రమవాసు లగు మును లెఱుం
గుదురు. అప్పుడు దేవదుందుభులు ఢణఢణ మ్రోగినవి. గంధర్వులు
గానము చేసిరి విద్యాధరులు వింజామరలు వీచిరి. అచ్చర లాడిరి.
పూలవాన గురిసెను. ఆకుమారు నచ్చటిమును లెల్ల రర్జునుఁడని పేర్కొ
నిరి. పాండురా జంతటితో సంతుష్టుఁడు గాక మఱియుం బుత్త్రులఁ
బడయఁగోరి కుంతిం జీరి తనయభిమతమును దెలుపఁగా, కుంతి భర్త
కిట్లనియె. ఇఁక బుత్త్రుల నియోగమునఁ గోరఁ దగదు. ఇవ్విధమున
ముఁవ్వురకన్న నితరపురుష సంగమమున నధికులఁ బడయరాదు. నియో
గమున నాలవవానిం బడసిన యది జారకాంత యనఁబడును. అయిదవ
వానిం బడసినచోఁ గులట యనఁబడును. కావున రాజా! నీకు నేను
ధర్మములఁ గఱపునంతటిదాననే? నీ వెఱుంగని ధర్మములు గలవే?
యనఁగాఁ బాండురాజు కుంతి మాటల నాదరించి యూరకుండె.

ఇవ్విధంబున హాస్తిపురంబున గాంధారిదేవి పుత్త్రశతంబు గను
టయును, శతశృంగంబునఁ గుంతీదేవి పుత్త్రత్రయంబును గనుటయును,
దలపోసి మాద్రి పతిని సమీపించి యిట్లనియె. మనోనాథా! నీకు
బుత్త్రులం గనుపాటవము క్షీణించెను. శాపోపహతుండవైతివి. గాంధా
రికి నూర్గురు పుత్త్రులు వ్యాసానుగ్రహమున రక్షితులై పుట్టిరి. దానికి
నే నంతగ వంతఁ బొందను. మంత్రబలంబునఁ గుంతి పుత్త్రులఁ బడసెను.
దానితో సమానురాల నగు నాకుఁ బుత్త్రులు లేకుండుట న్యాయ
మగునా? కావున నీవు కుంతి నామంత్రమును నా కుపదేశింపు
మనుము. ఆమంత్రబలమున నేనును బుత్త్రోత్పాదనంబునకు శక్త
రాల నయ్యెద ననఁగాఁ బాండురాజు మాద్రితో నిట్లనియె. శుభాంగీ!
నేనును నామనంబున దానిం దలపోయుచుంటిని. అయినను నీమనం
బెవ్విధమున నుండునో యని యూరకుంటిని. ఇప్పుడు నీయభిప్రాయము
నెఱింగితిని. కుంతిం బిలిచి యీయుద్దేశమును జెప్పెదను. అని చెప్పి
కుంతితోఁ దా నేకాంతమున నుండఁగా నాదేవి కిట్లనియె. 'దేవీ! నాకుఁ

ప్రియమును, వంశాభివృద్ధికరంబును, నీకుఁ జిరకాలయశస్సును గలిగించు నదియు నగు నేఁజెప్పెడుదానిం జేయుము. యశస్సు నపేక్షించికదా మహేంద్రుండు దేవరాజ్యమున సుప్రతిష్ఠుఁ డయ్యెను నింకను యజ్ఞములను జేయుచున్నాఁడు. వేదవిదు లగు విప్రులు దుష్కరంబు లగు తపముల ననుష్ఠించియు గురుసేవలం జేసెదరు. రాజర్షు లనేకులును, బ్రహ్మర్షు లనేకులును కఠినవ్రతముల నాచరించి దివ్యజ్ఞానమును బొందిన పదంపడి సైతము నానావిధదుష్కరకార్యముల నాచరించెదరు. ఎటులైనను గీర్తిని నార్జించుట యుత్తమధర్మము. తనకు సంతతి లే దని మాద్రి చింతాసముద్రమున మునిఁగియున్నది. దానికి నావం బోలె నీవు నీయొద్ద నుండు దుర్వాసుమంత్రము నుపదేశించి తన్మూలమున దానిం దరిఁ జేర్చి కీర్తిఁ బొందుము. అనఁగాఁ, గుంతి యట్ల చేసెద నని మాద్రి కామంత్రము నుపదేశింపఁగా నాదేవి యశ్వినీదేవతల నారాధించి వారివలన సమానతేజోవిరాజమాను లగు కవలను గనెను. మఱియు నప్పుడును నశరీరిణి గోచరించి యీకుమారు లశ్వినీదేవతలవంటి సుందరాకారులై తత్తుల్యు లగుదురని పలికెను. ఆశ్రమములోని మునులు కవలలోఁ బెద్దవానిని నకులుఁ డని పేర్కొనిరి. చిఱుతవానికి సహదేవుఁ డని పేరు పెట్టిరి. మఱియుఁ బుత్త్రోత్పాదనంబునం దభిలాష యంతటితో ముగించుకొనక పాండురాజు కుంతితో మరల నామంత్రమును మాద్రి కుపదేశింపు మనఁగాఁ గుంతి భర్తతో నిట్లనియె. మంత్రప్రభావమున ద్వంద్వదేవతల నాహ్వానము చేసి మాద్రి కవలం గనెను. అట్టి కుటిల స్వభావులకు మహనీయునిమంత్రమును బలుమా ఱుపదేశింప రాదు. ద్వంద్వదేవతల నాహ్వానించు నని నేను దెలియక మోసపోయితిని. ఇఁక నామంత్రమును నేను మాద్రి కుపదేశింపను. నన్నీకార్యమున నీవు బలాత్కరింపకుండ వరమొసంగు మనఁగా విని పాండుభూపతి మిన్నకుండె. ఇవ్విధమునఁ బాండుమహీపాలునకుఁ గుంతీదేవియందు యుధిష్ఠిరభీమార్జునులును, మాద్రీదేవియందు నకులసహదేవు లను కవలును బుట్టి వారొక్కొక్కరు వయస్సున నొక్కొక్కయే డంతరము గలవా రయ్యును నందఱును బాల్యమున నైదేండ్లయీడు గల్గిన వయస్సులగు బాలురంబోలె రూపుగలవారై వర్ధిల్లుచుండిరి. ధృతరాష్ట్రునిపుత్త్రులు

నూర్వురును హస్తిపురంబునను, బాండవు లేవురును శతశృంగపర్వతం
బున నాశ్రమమందును బెరుగుచుండిరి.

ఇవ్విధంబున దేవతలయనుగ్రహంబునఁ బుట్టిన యాపుత్త్రుల శైశవ
క్రీడలం జూచి సంతసించుచుఁ గొన్నివత్సరంబులు పాండురాజు గడ
పెను. *పాండుపుత్త్రు లిట్లు గారాబముతోఁ దల్లిదండ్రులచేతను నాశ్రమ
మునులచేతను బరమానందముతో నొక్కరూపునఁ బోషింపఁబడు
చుండఁగా నాసమయమున వసుదేవుఁడు తనమఱఁదికి నైదుగురుపుత్త్రులు
పుట్టి రని యెఱింగి చెలియలిని మఱఁదిని జూడఁ దనపురోహితునిం
గశ్యపుఁ డను విప్రునిఁ బంపెను. ఆపాఱునిచేతఁ దనమేనల్లుండ్రకు
బంగారుసొమ్ములును బట్టుబట్టలును నాటబొమ్మలును మఱియు విలువగల
వస్తువులను బంపెను. కశ్యపుఁడు వాని నెల్లఁ గైకొని పాండురాజున్న
శతశృంగమునకు వచ్చెను. ఆరాజు బ్రాహ్మణునిఁ బూజించెను. బ్రాహ్మ
ణుఁడును వారిని కుశల మడిగి వసుదేవుఁ డంపిన వస్తువుల నెల్ల బాలుర
కిచ్చి పాండురాజునను మతి వడసి వసుదేవునికడకుఁ జని వారల క్షేమ
మును దెలిపె. అంతఁ బాండురాజు తనపుత్త్రులకుఁ దగినయీడు రాఁగాఁ
జౌలోపనయనాదికర్మములను జేయించి యచటిమహర్షులతోడ వేదా
ధ్యయనముఁ జేయించుచుండె. †

* వసుదేవుఁడు పాండవులయొద్దకుఁ గశ్యపుఁ డనువానిని నాటవస్తువులతో
నంపిన యీవృత్తాంతము సంస్కృతభారతమున లేదు. తెనుఁగుభారతమున నున్నది.

† శర్యాతికొడుకు శుకుఁ డనువాఁడు ధనుస్సుచేత భూమినంతయు గెలిచి
నూఱశ్వమేధములు చేసి దేవతల నారాధించి విరక్తుఁడగుచు శతశృంగమున దపస్సు
చేయుచుండ యుధిష్ఠిరాదు అస్త్రశస్త్రవిద్యలును సాములును నేర్చుకొనుచు నతని
దయవలన ధనుర్వేదమును బడసిరి. అందుఁ దోమర మను నాయుధముయొక్క
యభ్యాసమున యుధిష్ఠిరుఁడును, గదయందు భీముఁడును, విలువిద్యయం దర్జునుఁ
డును, పట్టాకత్తి డాలు త్రిప్పుటయందు నకులసహదేవులును నిపుణు లగుచుండిరి.
కావున నారాజర్షి తన యాయుధములును విద్యలును వారివారికిఁ దగినవి
యిచ్చియు, నుపదేశించియు వారిని తనయంతవారినిఁగా నెంచి కొనియాడుచుండె.

## వసంతవర్ణనము

ఇట్లు వసంతఋతుసమయ మాసన్న మయ్యెను. చెట్లన్నియుఁ జిగిరించినవి. చిగిరించిన చెట్లన్నియు మొగ్గలతోను బువ్వులతోను నిండినవి. ఆపూవులవాసనకుమెచ్చి వానిపై వ్రాలి తేనియనుగ్రోలెడు తుమ్మెదలఝుంకారములు మెండయ్యెను. కోకిలములు లేమావిచిగుళ్లను గడుపునిండ మెసవి పంచమారావములతో వన మెల్లెడల నిండించెను. నిర్మలోదకములచే నిండియున్న కొలఁకులయందుఁ దామరలు నిండారఁ బూచియుండె. పిల్లతెమ్మెర సువాసనగల పూవులతావిని, గొలఁకుల నీటితుంపరలను గూడి చల్లగాఁ దోలుచుండె. ఈవసంతవిలాసములు చెలుల నెడఁబాసినకాముకుల మనస్సులను గలంచుచుండినవి.

## పాండురాజుమరణము

ఇట్లు సర్వభూతసమ్మోహనం బయిన వసంతసమయమునం బాండురాజు మదనునిమోహనాస్త్రములచేఁ గొట్టువడి చలించినమనస్సుతో సమీపమున నుండిన మాద్రియొక్క శృంగారపుఁజెయ్వులను సుందరశరీరమును మనంబునఁ దలపోసి దానిపై మనస్సు పాఱియు నసువుగానక కుందుచుండె. ఇట్లుండ నొక్కనాఁడు కుంతి బ్రాహ్మణసమారాధనము సేయించుచుండి మాద్రిరక్షణమునం దేమఱి మఱచియున్న యవసరంబునఁ బాండురాజు మాద్రిం గాముకునిచూపులతోఁ జూచి కామమును నిలుపలేక కిందమునిశాపమును దలంపక దైవప్రేరితుండై మాద్రి యెంత నివారించినను నిలువక దానిఁ గలసెను. వెంటనే యతఁడు శాపవశమున గాలధర్మము నొందెను. అప్పుడు మాద్రి యారాజు శరీరమును గౌఁగిలించుకొని రోదనము చేయుచుండె. ఆయేడ్పుధ్వనిని విని యదరిపడి కుంతియును బాండవులును బఱతెంచి పతియడుగులపయింబడి యేడ్చుచుండ నెఱింగి శతశృంగనివాసు లగుమును లెల్లరుం దెవలి వచ్చి చూచి విస్మయాకులితచిత్తులయిరి. అంత నమ్మాద్రి కుమారుల నట నిల్పి నీవొక్కతెవె రమ్మనఁగా గుంతి యంతన యయ్యాపద లెఱింగెఱింగి, 'హా! దైవమా!' యని విలపించుచు వచ్చి మాద్రి కిట్లనియె. మాద్రీ! మునిశాపమున నీయాపద సంభవించు నని తెలిసియే కదా రాజున

కీబుద్ధి పుట్టకుండ నే నెప్పుడును నేమఱక చూచుకొనుచుంటిని. ఇట్లేల చేసితివి? రాజునకుఁ బ్రథమభార్యనైన నే నీరాజుతోఁ బరలోకంబుల కేఁగెద. ఏమఱక పుత్త్రులఁ బోషించుచుండుము అని చెప్పఁగాఁ గుంతికి మాద్రి కన్నీరుగార్చుచు నిట్లనియె. రాజును నే నెంత నివారించి నను విధిప్రేరితుండై యతఁడు కాముకుఁ డయ్యెను. నే నేమి చేయుదు? నాయందుఁ బతియిష్టము నీలోకమునఁ దీర్పలేకపోయితిఁ గాన నేనే పతితోడఁ బరలోకమునం దైనఁ బ్రీతి సేయఁ గల్గుదు నేమో యని యేఁగెదను. కురువంశమును సుప్రతిష్ఠితము చేయుటకొఱకుఁ గడు ధర్మముతో నీ వీరాజునకుఁ గొడుకులఁ బడసితివి. పుణ్యలోకములు గలిగించునిమిత్తము రాజునకు మనఃప్రియం బొనర్చియుంటివి. మృగశాపభయము నెఱింగియు నిట్లేమఱిన యతిప్రమత్తురాల నగు నేను బుత్త్రుల రక్షింప నేర. నన్ను నివారింపవలదు. కొడుకుల నేమఱక రక్షించునది యని మ్రొక్కి కుంతీదేవిని వీడ్కొని మద్రరాజపుత్త్రి పతితోడను చితి నెక్కి యగ్నిశిఖలు నలుదెసలఁ ద న్నావరించుకొనఁగా నపగతప్రాణ యయ్యె. అంత శతశృంగవాసు లగు మును లెల్లరుఁ బాండురా జచ్చటికి వచ్చి దేవతానుగ్రహంబునఁ బుత్త్రులఁ బడసెను. ఇప్పుడు పరలోకమున కేఁగెను మాద్రి యాతనివెంటన పరలోకముల కేఁగునిమిత్తము సహగమనము చేసెను. అని తలపోసి కుంతితోఁ బుత్త్రులను దోడ్కొని పాండురాజమాద్రీకల్యముల నెత్తించుకొని హాస్తిపురంబునకుఁ జేర్చి భీష్మధృతరాష్ట్రుల కెఱిఁగింప నిశ్చయించుకొని హాస్తిపురంబున కేఁగి తమరాక రాజున కెఱిఁగింపుమని ద్వారపాలకునితోఁ జెప్పిరి. శతశృంగనివాసు లగుమునులయొక్క సంఘమురాక విని యత్యాశ్చర్యముతో భీష్మధృతరాష్ట్రబాహ్లికసోమదత్తవిదురాదులును, దుర్యోధనాదిరాజపుత్త్రులును, పురోహితాదికులు బ్రాహ్మణులును వచ్చి వారికి మ్రొక్కియుండ, భీష్ముఁడు వారిని నర్ఘ్యాదిసత్కారంబులచేఁ బూజించి వారితో నిట్లనియె. మునిచంద్రులారా! మారాజ్యమెల్ల మీయధీనము. మే మేమి చేయవలయును? అని యడుగఁగా నచ్చోటి కేతెంచిన మునిసహస్రానుమతంబున నొక్కముని యెలుంగెత్తి భీష్మాదులతో నిట్లనియె.

## పాండవులు హస్తిపురంబు సేరుట

పాండురాజు కామమోహభోగములను వదలి, సకలమహీరాజ్యపాలనమును ద్యజించి శతశృంగపర్వతమునఁ దపం బాచరించుచుండెను గదా! ఆపాండురాజుపుత్త్రులు వీ రైదుగురును. ఈతఁడు ధర్మదేవత యనుగ్రహమునఁ బాండురాజునకుఁ గుంతీదేవియందుఁ బుట్టినపుత్త్రుండు. ఈతండు వాయువు ననుగ్రహమునఁ బుట్టినమహాబలుండు. మహేంద్రు ననుగ్రహంబునఁ బుట్టినవాఁ డీతండు. వీరిరువురు మాద్రి కశ్వినీదేవతలవలనఁ బుట్టిరి. వీ రందఱిట్లు దేవానుగ్రహంబునఁ బాండురాజునకుఁ బుట్టిన పుణ్యమూర్తులు. వీరు క్రమముగ యుధిష్ఠిర, భీమసేన, అర్జున, నకుల, సహదేవ నామంబుల వెలయువారు అని * యాకుమారులను వేర్వేఱఁ జూపిచూపి చెప్పుచుఁ బాండురాజు వీరిశైశవక్రీడలకును, నధ్యయనాదిప్రవృత్తులకును మనస్సున నానందించుచుండి నేఁటికిఁ బదునేడవనాఁడు కిందమమునిశాపంబున మాద్రీసంగమంబుఁ జేసి మృతుండయ్యె. మాద్రియుఁ బతితోడన సహగమనం బొనర్చి స్వర్గస్థురాలయ్యెను. ఇవియె వారియస్థు లని వానిం దెచ్చిచూపి వీనికిఁదగినసంస్కా-

* హస్తినాపురమునకు పాండురాజుమరణానంతరము శతశృంగనివాసు లగు ఋషు లందఱు తల్లి, తమ్ములతోఁ గూడికొనిన యుధిష్ఠిరునిఁ దోడ్కొనిపోయి ధృతరాష్ట్రునికి స్వాధీనపఱచుసమయమున యుధిష్ఠిరునకు ౧౬ ఏండ్లు వయస్సు, భీమునకు ౧౫, అర్జునునకు ౧౪, కవలకు ౧౩. అచట ౧౩ సంవత్సరములుండిరి. వారణావతంబున లక్క యింటిలోఁ బాండవు లున్న నెలలు ౬. పిదప భీమునకు హిడింబయందు ఘటోత్కచుఁడు పుట్టెను. ఏకచక్రపురమున వారున్న నెలలు ౬. పిదప ద్రౌపదీస్వయంవరమైన తర్వాతను వారు పాంచాలపురమున నున్నకాల మొకసంవత్సరము. పిదప ధృతరాష్ట్రుఁడు భీష్మద్రోణవిదురులతో నాలోచించి మఱల పాండవులను హస్తినాపురమునకుఁ దోడ్తేరఁగా నప్పుడు వారు హస్తినాపురమున ౫ ఏండ్లుండిరి. పిదప వారికి ధృతరాష్ట్రుం డర్ధరాజ్యమును బంచియిచ్చెను. అంతట వారు నింద్రప్రస్థము రాజధానిగా రాజ్యమేలుచు ౨౩ సంవత్సరము లాపట్టణమున నుండిరి. అటుతర్వాత వనవాసాజ్ఞాతవాసములు ౧౩ ఏండ్లు. వెంటనే యుద్ధము జరిగెను. యుద్ధమున దుర్యోధనాదు లగు తమశత్రువుల నందఱను జంపి హస్తినాపురమును గైవశపఱచుకొని హస్తినాపురసింహాసన మెక్కి ధర్మరాజు బ్రహ్మోత్తరముగా ప్రజాపాలనమును జేసినయేండ్లు ౩౬. ఇట్లు ధర్మరాజునకు ౧౦౮ ఏండ్లు, ౯ నెలలు, ౧౫ దినము లాయుస్సు.

రములం గావింపుఁడు. ఈకుమారులను బాగుగఁ బోషింపుఁడు." అని చెప్పి యాఋషు లంతర్ధానము నొందిరి. భీష్మధృతరాష్ట్రులు పాండురాజు మరణంబునకు దుఃఖించుచుండిరి. అంతఁ గొంతవడికి ధృతరాష్ట్రుండు వేదవేది విదురుం జూచి పాండురాజునకును, మాద్రికిని యథావిధిగఁ బరలోకక్రియలను గావించునది యని యాజ్ఞ సేసెను. అంత విదురప్రేరణంబున వారియస్థుల నూరేగింపు గావించి వాని నొకపల్లకియం దునిచి ఛత్రచామరాద్యుపచారములతో యాజకులును బురోహితులును వహితాగ్నిహోత్రము ముందఱ నేఁగుచుండ హాస్తినాపురమునందలి నాల్గువర్ణములవారును గుంపులు గూడి కన్నీరు గార్చుచు వెంట వచ్చుచుండ, భీష్మవిదురాదిసకలబంధువర్గములును గంగాతీరంబుఁ జేరి యచ్చోటఁ బవిత్రమైన గంగాజలంబులయందు వారియస్థులను నిక్షేపించినఁ గౌసల్య యగు నంబికయు, సత్యవతియుఁ, గుంతియు దుఃఖాతిశయమున నేలంబడి దీనముగ విలపించుచుండిరి. భీష్మవిదురాదులు వారల నెట్టకేల కుపశమిల్లఁజేసి తామును నొక్కరీతి శోకము డిగి గతించినవారల కిరువురకును దిలోదకక్రియలను నౌర్ధ్వదైహిక శ్రాద్ధకర్మములను నొనర్చిరి. ఆయపరక్రియలు జరుగుచుండు పండ్రెండు నాళ్లును బురమంతయు దుఃఖచిహ్నములతో నుండుటంజేసి నిరానందమై వెలసె. అంతట నందఱును, గంగాతీరమునం దుండి పాండుపుత్త్రులం దోడ్కొని హాస్తిపురంబుఁ జేరిరి. కొన్నినాళ్లందఱును బాండురాజు సుగుణములను, శౌర్యధైర్యగాంభీర్యాదిచర్యలను మనములఁ బలవి పలవి దుఃఖించుచుండిరి.

అంత సాత్యవతేయుం డొక్కనాఁడు తల్లి సత్యవతియొద్ద కేతెంచి యాయమతో నిట్లనియె. తల్లీ! ధృతరాష్ట్రుని పెద్దకుమారుఁడు దుర్యోధనునివలన నీవంశమున నెన్నియో చెఱుపులు కలుగఁగలవు. ఆఘోరములను నీ వేల చూడవలయును? రానున్న కాలమునకంటెఁ గడచిన కాలము మేలు. కావున నీ వరణ్యమునకుఁ బొమ్ము. తపస్సును జేయుచు శరీరత్యాగ మొనర్పుము. ఇది లగ్గనఁగా సత్యవతి యంబికను బిలిచి నీ పౌత్త్రునివలన నెన్నియో కష్టము లు గలుగనున్న వని వినుచున్నదాన. మనకు భువిలో నుండి చేయవలసిన కార్యము లన్నియు ముగిసినవి. ఆకష్ట

ములను జూచుచు మన మిచ్చోట నుండవలసిన దేల? కావున నరణ్య మునకుఁ బోయి తపస్సులఁ జేయుచుఁ గందమూలఫలాశనులమై యుండి పవనపర్ణాంబుభక్షులమై శరీరమును వదలుదము అని చెప్పి యంబికను బాండురాజు మరణించెనే యని పుత్త్రశోకమునఁ బెల్లడలుచున్న యంబాలికను వీ రిరువురం దోడ్కొని వనమునకుఁ బోయి యచట ఘోరతపముల నాచరించి దేవులు మువ్వురును శరీరపరిత్యాగముఁ జేసి పుణ్యలోకముల కేఁగిరి.

అంతట ధృతరాష్ట్రుఁడు పాండురాజుపుత్త్రులకును దనపుత్త్రులకును భేదము పాటింపక యందఱ కుపనయనాదిక్రియల నాచరించి యథామతిఁ బెంచుచుండ వారు శైశవక్రీడల సలుపుచు ధృతరాష్ట్రునకు విధేయులై వృద్ధిఁ బొందుచుండిరి. పాండవులును ధార్తరాష్ట్రులును గలసి యనేక బాలక్రీడావిహారములను జేయుచుండిరి. బాలు రొండొరులు పందెము లను జఱచుచు నెవరు ముందు పరుగిడుదురో యని వేగమునఁ బరు గెత్తుచు, దూరమున దృష్టికి గోచరించినపదార్థమును దెచ్చుట కందఱును మునుమున్నుగఁ బరుగెత్తుచు దుమ్మును మైఁ బూసికొనునాట లాడుచు, నాహారపదార్థముల నుపయోగించు విలాసములను జూపుచు, మఱియు నానావిధములగు నాటలాడుచుండ నన్నిటిలో భీమసేనుం డందఱికంటె మిన్నయై యుండెను. మఱియు భీమసేనుండు విలాసమును జూప నెంచి పదుగురుపదుగుర నొక్కమాఱెత్తుకొని పరుగిడును. కొన్ని సమయము లందుఁ దోడిసోదరులతోఁ గలహించి యుద్రేకియై వారితలవెండ్రుకలఁ బట్టికొని లాగుచుండ వారు వానిచేతినుండి తప్పించుకొనలేక, క్రింద నీడిగిలఁ బడఁగా నప్పుడు మఱింతవేగముతోఁ బఱుగిడినప్పుడు వారి వీఁపులు దోఁకికొనిపోవును. మఱికొన్ని సమయములందు నీఁట నీదువారై యమునకు బాలు రెల్లరును జేరుదురు. ఆసమయమున భీమసేనుఁడు తనబలిమికొలఁది వారిలోఁ బదిపండ్రెండుగురి నొక్కమాఱు నీటిలో నదుమును. వా రూపిరిత్రిప్పుకొనలేక మ రెట్లో మొర్రో యని కూఁత లిడినచో నప్పుడు వదలుచుండును. ఒకకొన్నివేళలందు బాలురుకొందఱు చెట్ల నెక్కి పండ్లు కోసికొనుచుండఁగా భీమసేనుం డామ్రానివ్రేళ్లతోఁ గ్రిందఁ దోయునట్లు దాని నూఁచుచుండును. పండ్లను గోయుట కెక్కిన

వారు క్రిందఁ బడుదు మేమో యని భీతిల్లుదురు. ఇవ్విధంబున భీమసేను నకు ద్రోహబుద్ధి లేకున్నను బాల్యచాపలమునను బలగంతుఁడు గావు నను నతఁ డావయోధరమునఁ జేయుచేఁత లన్నియు నితరులకుఁ బ్రాణోపద్రవకరములై యుండెను. దుర్యోధనుండు భీమసేనుని మహా బలమునకు మాత్సర్యముతోఁ బాపచింతగలిగి యతిబలశాలి యగు భీముని రహస్యవిధమునఁ జంపితిమేని యితరులు తనకు వశంవదు లగుదు రనియు నప్పుడు హస్తినాపురరాజ్య మెల్లను నిస్సపత్నముగఁ దా నేల వచ్చుననియుఁ దలపోసి తగినసమయమునకు వేచియుంచెను.

## దుర్యోధనుఁడు భీముని గట్టి గంగలోఁ ద్రోయఁగా నాతండు నాగలోకము చేరి దివ్యరసపానము చేయుట

అట్లుండఁ బ్రమాణకోటిస్థల మను గంగాతీరవిశేషమున జలకేళి యొనర్చుటకుఁ దగిన నాలుగువైపులను జిగుట కనుకూల మగు దిగుడు బావులను, నుద్యానవనములను, విహారమునకు నున్న తంపు మేడలను దుర్యోధనుండు నిర్మింప నియమించియుండెను. ఆస్థలమునకు రాజ కుమారు లందఱును విలాసమున నొక్కనాఁ డేఁగియుండిరి. అప్పటికే దుర్యోధనుని నియామమున వీరి కందఱకును వలసిన భక్ష్య, భోజ్య, పేయ, చోష్య, లేహ్యరూపములతో రుచిగల పదార్థముల ననేకము లను సేవకులు గొనిపోయియుండిరి. కుమారులలోఁ బాండుకుమారు లును గలిసి మెలసి యుండిరి. వీరికిని నందఱతోఁ డ్పాటు వలసినన్ని భక్ష్య ములను దుర్యోధనుఁ డిచ్చున ట్లానతి యొసంగియుండెను. అప్పుడు దుర్యోధనుఁడు కొన్ని భక్ష్యములను విషపూరితములను జేసి యుంచి వానిని తానే ప్రత్యేకముగఁ జేఁతఁగొని భీమున కిచ్చి మనస్సునఁ గ్రౌర్య మప్పటికి నధిక మగుచుండఁగా దానిని బయలుపఱుపక మధురంపుఁ బలుకులఁ బ్రీతిగలవాఁడువోలెఁ బలుకుచు వానిని భక్షింపు మనెను. భీమసేనుం డామోసమును గుర్తెఱుంగక తాను నిష్కపటి కావున నావిషమిశ్రభక్ష్యముల నన్నింటిని దినెను. దుర్యోధనుండు తనకోర్కె నెఱవేఱిన దని మనస్సునఁ గుతూహలియై యుండెను. బాలు రందఱు నీఁదులాటయందు మునింగియుండిరి. భీముఁడు జలకేళి సలిపి కొంతవడికి

మైమఱచి యలసి గంగాతీరమునఁ జల్లనివాయువు వీఁచుచుండఁ బరుండి విషవికారమునఁ జేష్ట లుడిగియుండెను.

దుర్యోధనుఁ డదియే మంచివేళ యని తలఁచి బలువు లగుతీఁగెలతో వానిదేహము నెల్ల బంధించి యాసుపెంపున నాభీమునిశరీరమును గంగయం దొకలోఁతు ప్రదేశమున విసరివైచెను. అంత నాభీముఁడు మునుపే విషవికారమున స్మృతిఁ దప్పియుండెను. కాన వానిని బంధించుట గాని, గంగమడువునఁ ద్రోయించుట గాని యీ యుపాయకృత్యములను దుర్యోధనుఁడు గావించుట గాని యెఱుంగక పోయెను. వాఁడు గంగలోఁ బడి పాతాళలోకమునకుఁ బోఁగా నచ్చోట నుండిన నాగకుమారు లనేకు లతనిదేహమును గఱచిరి. ఈసర్పములవిష మాతని దేహమును సోఁకుచుండఁగనే యాతనిశరీరమున నప్పటికి వ్యాపించి యుండిన కాలకూటవిషము విఱిగి వానిదేహము నిర్విషమైనది. వెంటనే వానికి స్మృతి గలిగినది. వాఁడు తన్నెవరో బంధించియున్నారని తెలిసి యాకట్లనుండి తప్పించుకొనుట కొక నీల్గు నీల్గెను. అంతట భవబంధము పోఁద్రోలు యోగిచాడ్పున బంధములన్నిఁటినుండి విడువడి తన్నుఁ జుట్టుకొనుచుండు నాగకుమారులను వేగముగాఁ గొట్టి చంప నారంభించెను. అప్పుడు నాగు లెల్లరును వానికి భీతిల్లి యాతని వృత్తాంతమును వాసుకికిఁ దెల్పిరి. వాసుకి భీమసేనునికడ కేతెంచి వానిని తనదౌహిత్రుఁడగు శూరునిదౌహిత్రునిఁగా నెఱిఁగి నాగులతో "వీఁడు మనకు మన్నింపఁదగినవాఁడు, మనకు శత్రువు గా నేరఁడు. వీనికి విస్తార మగు ధనము నొసంగి పంపుఁడు" అని చెప్పఁగా నానాగు లెల్లరును వాసుకితో నిట్లనిరి. ఓనాగేంద్రా! వీఁడు రాకొమరుండు. వీనికి ద్రవ్య మేల! ఏరసమును ద్రావినచో వీనికిఁ బదివేలయేనుఁగులకుఁ గల బలము కలుగునో యారసమును వీని కిచ్చి కడుపారఁ ద్రావించెదము. అది వీని కంగబలము నొసంగఁగల దనఁగా వాసుకి వారి నట్లు గావింపుఁ డనియె. భీముఁడును బాములు తనకుఁ జేయు ననేకశుభచిహ్నములతోఁ గూడికొని పవిత్రుఁడై తూర్పుమొగంబై కూర్చుండి నాగులు తెచ్చియిచ్చిన కుండలోనిరస మెల్లఁ ద్రావెను. అంత వారు మఱల వేఱొకకుండరసమును దెచ్చియిచ్చిరి. వా రిట్లు తెచ్చియిచ్చుచుండిన కుండలలోని రసము

లోకగ్రుక్కకే త్రాగుచుండెను. అంతట వారును విసువక మొత్త
ముగ నెనిమిదికుండలరసమును వానిచేఁ ద్రావించి వాఁడు "తనవి తీరెను,
తృప్తి యైనది. ఇఁకఁ జాలు" నని చెప్పినపిదప వాఁడు సుఖముగఁ బవ్వ
ళించుటకుఁ బడుక నేర్పఱిచిరి. వాఁడును నాశయ్యపై సుఖముగ
శయనించెను.

అంత నీట ధర్మరాజు భీమునిపోకఁ దెలియక యన్నిస్థలముల
యందు నెమకి యందఱకు మున్నుగ నగరున కేమైనఁ బోయెనో యని
వేవేగ నగరు సొచ్చి తల్లి యగుకుంతీదేవిని భీముఁరాక నడిగెను. అంద
ఱకు మున్నుగ భీముండు పురమున కేఁగెనని దుర్యోధనుండు చెప్పెను.
వాఁ డేల యింతవఱకు రాక తడసెను? వనములో నలుదెసలం బరి
కించితిని. వానియునికిచోటనుం దెలియదయ్యె. వాఁ డొక్కచోఁ
బరుండి నిదురించుచుండును. ఆచోట వానిని వెదుకఁగా నిప్పుడు వాఁడు
గనఁబడఁడు. వాఁడు గానరామి నా కనుమానము గలిగించుచున్నది.
అన విని కుంతి యేడ్చుచు వాఁ డిచ్చోటికి రాఁడు. నీవును నీతమ్ములుం
గూడిపోయి వానిని నలుదెస వెదకుఁ డని చెప్పి విదురునిఁ బిలిపించి,
మహానీయా! భీముఁడు బాలురతో బ్రమాణకోటిస్థలమున కేఁగినవాఁడు
రాఁడయ్యె. ధర్మపుత్త్రుం డెంత వెదకినను వానికి గోచరింపఁడు. దుర్యో
ధనుం డెప్పుడును వానిపై నీసును గాన్పించుచుండు. వానిని వాఁడు
చంపెనోయని యనుమానము గల్గుచున్నది. మనస్సు మిక్కిలి వ్యాకు
లముగ నున్నది. అని చెప్పఁగా విదురుండు కుంతి కిట్లనియె. ఇంక నిట్టి
పలుకుల మానుము. దుర్వినీతుండైన దుర్యోధనుం డీమాటలను వినె
నేనిఁ దక్కటి వారిం జంపఁబూనును. మిగిలినవారి నైన బ్రతికించికొన
వలయునుగదా? నీ వేడువఁజనదు. నీపుత్త్రులు బహుకాలము జీవించి
యుందురా రని యోగులైనమహానీయు లనేకులు సెప్పియున్నారు.
వారిమాటలు పొల్లు లగునే? నీకొడుకు కెట్టులైనను బ్రదికివచ్చి నీకుఁ
బ్రీతిఁ గలిగించును. అని కుంతిని నూఱడించి విదురుండు తననెడిదల
కేఁగెను.

ఇఁట నాగలోకమున భీముండు తాను త్రావినదివ్యరసము నెల్ల
నెనిమిదిదినములకు జీర్ణించుకొని మేల్కాంచెను. అప్పుడు నాగు లెల్లరు

భీముని సమీపించి "ఓ భీమసేనా! యీదివ్యరసమును నీవు త్రావి జీర్ణించుకొంటివి. దానంజేసి పదివేల యేనుఁగులకుఁ గలబలము నీ యొడలి నాక్రమించినది. ఇఁక లెమ్ము. ఈగంగయందు స్నానము చేసి నీరాక కెదురుచూచుచున్న నీతల్లిని నీసోదరులను సంతసిల్లఁ జేయు మని చెప్పి యానాగు లాతని నాదివిజగంగాభవానీజలములయందు సుస్నాతుఁ జేసి దుకూలములను గట్టనిచ్చి సుగంధముతోఁ బరిమళించుచున్న దియు, విషహారమును, వివిధౌషధులఁ గూడినదియును నగు నమృత తుల్యమైన పరమాన్నమును గుడువఁబెట్టి వానిశరీరమును నానావిధా భరణములతో నలంకరించి బహువిధములుగ నాశీర్వదించి యాపాతాళ గంగనుండి వానిని భూప్రదేశమును జేర్పుట కొక్కనాగునిఁ బంపఁగా వాఁడు భీమసేను నెత్తికొని ప్రమాణకోటిస్థలమునందలి యొకవనమునందుఁ జేర్చెను. వీని నచ్చోట విడిచిపుచ్చుటకుఁ గొందఱు నాగులును వచ్చిరి. అప్పుడు వారందఱచే ననుజ్ఞాతుఁ డయ్యెను. వారును వెంటనే యదృశ్యులైరి. అంతట భీముండు హస్తినాపురమును జేరి నగరు సొచ్చి తల్లిని సోదరులం గాంచి వెంటనే తల్లికిని ధర్మరాజునకును నమ స్కరించి తక్కినసోదరులం జెంగట దీసెను. అప్పుడు భీమునిరాకకు వా రందఱును సంతసిల్లిరి. తమపాలిట దైవ మున్నది గదా యని తల పోసిరి. అప్పుడు భీమసేనుండు వారితో నిట్లనియె "అమ్మా! ప్రమాణ కోటిస్థలమున నన్నుఁ దిను మని దుర్యోధనుం డిచ్చినభక్ష్యములు విష పూరితములు. వానిని నేను దిని విషమును హరించుకొనుచు మైమఱచి యున్నప్పుడు బటువులైన తీఁగలతో నాశరీర మంతయు నేవైపునకుఁ గదలనీయక యంటఁగట్టి నన్ను గంగమడువునఁ ద్రోయించెను. అంతట నాకు స్మృతి వచ్చెను. వెంటనే నన్నుం గట్టినతీఁగెలను ద్రెంపితిని. నన్నుఁ బాములు కొఱికి నావిషమును హరించెను. కాని, నన్నుఁ గఱచినవే యని వానినిఁ జంప యత్నించితిని. అవి వాసుకితో మొఱపెట్టుకొనెను. అంత వాసుకి వచ్చి నన్నుఁ దనదౌహిత్రునకు దౌహిత్రుంగా నెఱిఁగి నాకు దివ్యరసమును త్రావ సెలవిచ్చెను. నా కీవస్త్రములను నాభరణ ములను నాగు లిచ్చిరి. ఆదివ్యరసమును జీర్ణించుకొనుట కీయెనిమిదిదిన ములును పరుండి సుఖముగా నిదురించి వారు నాకు దారి సూప నాగ

లోకమునందుండి యిదే వచ్చుచున్నా" ననువృత్తాంతం బంతయు సవిస్తర
ముగఁ జెప్పఁగా యుధిష్ఠిరుఁడు భీమునిం జూచి యింక రహస్యముగఁ
జెప్పుము. ఈదినము మొదలు మన మప్రమత్తులమై యొకరినొకరు
కాపాడుకొనుచుండవలయు ననిన నందఱును తమలోఁ దామట్లు యనిరి.
ఇంకను బాండవుల కెన్నివిధములనో దుర్యోధనుండు హానిఁ దలచుచుండ
వాని నెల్ల విదురుం డణఁచిపెట్టుచుండగా నూరకుండిరి. అంతఁ బాండ
వులును దుర్యోధనాదులును వేదశాస్త్రముల నెఱింగినవాఁడును, నస్త్ర
విద్యోపాధ్యాయుండును శరస్తంభమునఁ బుట్టినవాఁడును నగు కృపా
చార్యునియొద్ద విలువిద్యను భీష్మానుమతంబున నేర్చుచుండిరి. అని చెప్పఁ
గా జనమేజయుం డాకృపాచార్యుం డెవండు? అతండు శరస్తంబమున
నెట్లు జనించెను? ఆమహానీయుని దివ్యచరిత్రమును సవిస్తరముగా విని
పింపు మని యడుగఁగా నమ్మహీపాలునకు వైశంపాయనుం డిట్లు చెప్ప
నారంభించెను.

## కృపాచార్యులవృత్తాంతము

పూర్వకాలమున గౌతముం డనుమహర్షి యొకఁడు తపోనిష్ఠా
గరిష్ఠుఁడై యుండెను. ఆతనికి శరద్వంతుండను కుమారుండు జనించెను.
వాఁడు తనపుట్టువు శరములతోడఁ గల్గుటం జేసి, వేదశాస్త్రముల
నంతగా నధ్యయనమును జేయక ధనుర్వేదమున నాసక్తుండై, యితర
బ్రహ్మచారులు తపస్సు మొదలగునిష్ఠలచే వేదములను సాధించువిధమున
నధికతపస్సును జేసి సర్వాస్త్రములను సంపాదించుచుండెను. వాని ప్రభావ
మునకు మహేంద్రుండు వెఱచి శరద్వంతునితపమును జెఱచునిమిత్తము
జానపది యను దేవకన్యను వానియొద్దకుఁ బంపెను. అంత నాసుందరి
శరద్వంతుని యాశ్రమముం జేరి తనవిలాసములతో నడయాడుచుండ
దానిసర్వావయవసౌష్ఠవమున కచ్చెరువోయి శరద్వంతుండు తనచేతి
వింటిని నమ్ములను జారవదలి దానినే మదనపరవశుండై మోహించి
వీక్షించుచుండ నచటఁ గాకివెదురు మొదలగువానిగుబు రొకటి
క్రింద నుండఁగా వానివీర్యము స్ఖలితమై యాశరగుల్మమునఁ [గుబురున]
బడెను. దాని నాముని యెఱుంగఁడు. పిదపఁ గొంతసేపునకు మనస్సును
దిగిచికొని శరద్వంతుండు తన తపోబలంబున జ్ఞానియగుటం జేసి జితేంద్రి

యుండై యాదేవకన్యాసంపర్కముచే నాతపోవనమును దూషితమైన
దానిఁగా నెఱింగి యచ్చోటువాసి వేఱొక్కస్థలమునకుఁ దపస్సునిమిత్తమై
యరిగెను. శరస్తంబమున వారిరేతస్సుబిందువులు రెండై పడుటచే
నం దొక్కబిందువు మగశిశు వయ్యెను. రెండవది యాఁడుశిశువాయెను.
ఇట్లాశిశువు లిరువురు నచ్చోట శర స్తంబమునఁ బెరుగుచుండిరి. ఇట్లుండ
నొక్కనాఁడు శంతనుండు నిజసైన్యముతో వేఁటకుఁ దఱలి యావనం
బున వేఁటాడుచుండ నాతనివెంట వచ్చినవారిలో నొక్కఁ డాశిశువులను
వారిసమీపమున నున్నశరశరాసనములనుం జూచి యీయిరువురు శిశు
వులును ధనుర్వేదమును జక్కఁగా నేర్చినమహనీయుని పుత్త్రుఁడును పుత్త్రి
కయునుంగా నుందు రని యెఱింగి వారిని వారిసమీపమున నుండిన శర
శరాసనములను శంతనునకుఁ జూపెను. ఆశంతనుండును వారిని మిక్కిలి
మక్కువతోఁ దననగరునందుఁ బెంచునట్లుగా నియమించె. వారిలో
మగవాఁడు కృపుఁ డనియు, నాఁడుశిశువు కృపి యనియుం బేరొకనఁ
బడిరి. శరద్వంతుఁడును నావృత్తాంతము నంతయును దనదివ్యజ్ఞానం
బునఁ దెలిసి వా స్తిపుకమున కేతెంచి పుత్త్రునకు సకాలమున బ్రాహ్మణో
చితకర్మమగు నుపనయనసంస్కారమును గావించి వానికి సకలవేద
శాస్త్రాదులను బోధించి ధనుర్వేదమును నాదాన, సంధాన, మోక్ష,
ఉపసంహారము లనునాల్గువిధములతో సాంతముగఁ జెప్పి తాను మరలఁ
దపోవనంబున కేఁగెను. ఆకృపుఁడు ధనుర్వేదపారంగతుండైన తండ్రి
యగు శారద్వతునొద్ద విలువిద్యను నేర్చియుండి కౌరవులసంస్థాన
మున నుండుటంజేసి కురుకుమారుల కెల్ల భీష్మానుమతిని ధనుర్విద్యా
గురుండయ్యెను. ఈతం డాకారణంబునఁ గృపాచార్యుం డనఁబరఁగెను.
ఇట్లు కురుకుమారు లెల్లరును గృపాచార్యునియొద్ద విలువిద్య నేర్చు
చుండ భీష్ముండు వారి నెల్లర శస్త్రాస్త్రవిద్యలయందు లోకములోనున్న
యితర రాజకుమారులకంటె నధికపాండిత్యము గలవారినిగఁ జేయు
నిమిత్త మాకాలమున ధనుర్విద్యలో నుత్తముం డనఁబడిన ద్రోణాచార్యుని
రావించి వానితోఁ గురుకుమారులం జదివించె. అనఁగా విని జనమే
జయుండు తనకు ద్రోణాచార్యుని చరిత్రమును సవిస్తరముగాఁ జెప్పు
మనఁగా వైశంపాయనముని యాజనమేజయున కిట్లు చెప్పందొడంగెను

## ద్రోణాచార్యుని వృత్తాంతము

పూర్వము భరద్వాజుం డను ఋషి గంగాద్వారమునకు స్నానార్థము పోఁగా నచ్చోటికి మున్నే జలకేళినిమిత్తము వచ్చి క్రీడ సలిపి గట్టునఁగూర్చుండియుండు ఘృతాచి యను నప్సరసను నప్పుడు దానికట్టుబట్ట దొలఁగియుండఁగా జూచెను. అంత నాఋషి దానియం దనురక్తుండై కామపరవశుండు కాఁగా నాతనివీర్యము స్ఖలితమయ్యెను. దాని నొకద్రోణమున భద్రపఱుపఁగాఁ గాల క్రమమున నాకలశము నందుఁ బుత్త్రుం డొకఁడు పుట్టెను. ఆకుమారుండు ద్రోణము (దొనెవలె నుండు పాత్రము)న జనించెను గావున ద్రోణుండనఁబడెను. ఈద్రోణుండు పెరిగి పెద్దవాఁడై వేదములను వేదాంగములను లెస్సఁగా నధ్యయన మొనర్చి, యగ్నిదేవునివలన నుదయించిన యగ్నివేశుం డను మహానీయునకు శిష్యుండై యాగ్నేయము మొదలగు నస్త్రములను గ్రహించెను. ఆయస్త్రమును ద్రోణునితండ్రియగు భరద్వాజుం డగ్నివేశున కొసంగెను. ద్రోణుం డగ్నివేశునకు శిష్యుండుగా నున్నప్పుడు భరద్వాజునకు సఖుండైన పృషతుఁ డనువానికుమారుఁడు ద్రుపదుం డనువాఁడును నగ్నివేశునకు శిష్యుండై యుండె. అప్పుడు ద్రోణుఁడును ద్రుపదుఁడును నిరువురు నొకేయాచార్యునియొద్ద శిష్యులై యుండి చెలికాం డ్రయిరి. పదంపడి పృషతుఁడు కాలగతిం జెంద నాతని పాంచాలరాజ్యమునకు ద్రుపదుఁడు రాజయ్యెను. భరద్వాజుండును దనపుత్త్రుండైన ద్రోణాచార్యుని వివాహము చేసికొను మని నియమించి లోకాంతరమునకుఁ జనెను. అంత ద్రోణాచార్యుండు తండ్రి యనుమతి చొప్పునఁ గృపాచార్యునిచెలియలు కృపి యనుదానిం బెండ్లాడి దానియందు నశ్వత్థామ యను కుమారునిం గనెను. ఆకుమారుండు పుట్టుచుండఁగనే యుచ్చైఃశ్రవమునుంబోలె బెద్దయఱపు నఱచుటంజేసి యశరీరవాణి వీఁడశ్వమువలె బలముగలిగి దెసలెల్ల మాఱు మ్రోగున ట్లఱచుటంజేసి *యశ్వత్థామ యను పేరితో వెలయు ననెను.

---

* అశ్వత్థామ = అశ్వముయొక్క బలమువంటి బలముగలవాఁడు
స్థామము = శరీరబలము.

ఇట్లు ద్రోణుండు కుటుంబియై కుటుంబమును భరించునిమిత్తము ధనము నార్జింప యత్నించి పరశురాముఁడు విప్రులు గోరినదానినంతయు వారి కొసంగుచున్నాఁడని యెఱింగి పరశురామునియొద్దకేఁగి ధనము నడిగెను. అప్పుడు పరశురాముఁడు ద్రోణున కిట్లనియె. "ఓభారద్వాజా! విప్రులకంతయుఁ గోరినది కోరిన ట్లొసంగితి. వనమునకుఁ బోఁదలఁచి భూమియంతయుఁ గశ్యపునకిచ్చితి. నాయొద్ద నస్త్రములుతప్ప వేఱొండు లేదు" అని చెప్పఁగా ద్రోణుం డాయస్త్రముల నన్నింటినిఁ దన కొసంగు మనియె. అంతఁ బరశురాముండు వల్లెయని ద్రోణున కాసర్వాస్త్రముల యొక్క ప్రయోగోపసంహారములనన్నిటిని విధ్యుక్తముగ నుపదేశించెను. పదంపడి ద్రోణుండు తానును ద్రుపదుఁడును నగ్నివేశునిశిష్యులమై యుండునపుడు చెలికాండ్రమై యుంటిమిగదా! ఆతం డిప్పుడు భూపాలుండై యున్నవాఁడు కావున నిప్పు డాతనియొద్ద కేఁగి ధనమును యాచించెద నని యట కేఁగి తనచెలికానిని ధనమును యాచించెను. ద్రుపదుఁడు రాజ్యగర్వమున ద్రోణునిపూర్వసఖ్యమునే యెఱుంగనివాఁడువోలె దిరస్కరించి పంపెను. అంత ద్రోణుం డాయవమానమును సహించి మరల హస్తిపురంబునకు వచ్చి కృపాచార్యునియింట గూఢముగ నుండెను.

ఇట్లుండ నొక్కనాఁడు కురుకుమారు లెల్లరు పురము వెలుపలి ప్రదేశమునఁ జెండాట యాడుచుండ నాచెండు సమీపమున నుండిన బావిలోఁ బడెను. ఆబాలు రందఱును బావిని సమీపించి దానిని దొంగి చూచుచుండిరే కాని యెవ్వరును దానిని బావినుంచి పైకెత్త లేకుండిరి. అప్పు డచ్చోట విలాసముగ సంచరించుచుండిన ద్రోణాచార్యుని వారందఱును జుట్టుకొని యెవ్విధముననైనను బావిలోఁ బడిన చెండును పైకిఁ దీసి యిమ్మని వేఁడిరి. అప్పుడు ద్రోణాచార్యుండు కురుకుమారుల కిట్లనియె. బాలకులారా! మీరందఱును శౌర్యధైర్యగాంభీర్యములకుఁ బేరెన్నికగన్న భరతవంశమునఁ బుట్టినవారు. మఱియును విలువిద్యయందుఁ బేరెన్నిక గన్న కృపాచార్యునిశిష్యులరు మీలో నొక్కరైనను బావిలోఁ బడినచెండును పైకెత్తుటకు సామర్థ్యము లేకయున్నారే? చూడుఁడు. మీరు చూచుచుండఁగనే యీనా వ్రేలి

యుంగరమును బావిలోఁ బడవేసెదను. పదంపడి నాయుంగరమును చెండును రెంటిని నాయస్త్రవిద్యాప్రభావంబునఁ బై కెత్తెదను. నాకు భోజనము పెట్టింపుఁ డని వ్రేలియుంగరమును బావిలో వైచెను. అప్పుడు యుధిష్ఠిరుండు ద్రోణున కిట్లనియె. ఓముసలిబ్రాహ్మణుఁడా! కృపాచార్యునసుమతిం బొంది శాశ్వతముగ భోజనమును బడయఁ గలవు. అని చెప్పఁగా ద్రోణాచార్యుం డదె నాసామర్థ్యమును జూడుఁడు. ఈవిద్య నెవ్వరును నేర్చినవారు లేరు. బాణములచేతనే చెండును వెలుపలికిఁ దెప్పింతునని చెప్పి వింట నొక్కబాణమును సంధించి దానితో బావియం దున్న చెండును గ్రుచ్చిపట్టి, పిమ్మట మఱియొకబాణమును మొదటిబాణమును బట్టుకొనునట్లు చేసి యిట్లే యొకబాణమును మఱియొకబాణముతో నంటఁగట్టి బాణములతోఁ ద్రాటిని జేసి యాశరముల త్రాటితో వారిచెండునెత్తి పైకిఁదీసి వారిచేతి కిచ్చెను. అంత వారందఱును బరమాశ్చర్యభరితులై వ్రేలియుంగరమును పైకిఁ దీయు మనిరి. అంత ద్రోణాచార్యుండు ధనస్సున బాణము నభిమంత్రించి యాబాణమును బ్రయోగించి యుంగరము నంటుకొనునట్లు చేసి దానిమూలమున నుంగరమును బావినుండి పైకెత్తింపఁ గలిగెను. అంత నాకుమారు లందఱును నాతనిశక్తికి నద్భుతము నొంది వారందఱు నొక్కుమ్మడి ద్రోణాచార్యునకు మ్రొక్కి యిట్లనిరి. స్వామిా! ఈయాశ్చర్యమును మే మెందును గానము. మీా రెవ్వరు? మీాకు మే మేమి చేయవలయును? అని యడుగఁగా ద్రోణుండు "మీారు బాలురరు. నావృత్తాంతమంతయును మీాకేల? ఈజరిగినసంగతి నంతయును మీాతాత భీష్మునకుఁ దెలుపుఁడు. ఆరాజు నన్న రయఁగలఁడు" అనెను. అంత నాకుమారు లందఱును నాయాశ్చర్యమును భీష్మునకుఁ దెలిపిరి. భీష్మఁ డతనిని ద్రోణుంగాఁ దలంచి యామహానీయుఁడే తమ కురుకుమారులకు ధనుర్వేదాచార్యుండయి యుండదగినవాఁ డని యూహించి యాతనిని మర్యాదతో నగరునకు రప్పించి యామహానీయుండు హాస్తినాపురమునకు రాఁ గారణ మేమని యడుగఁగా భీష్మునకు ద్రోణుం డిట్లనియె.

మున్ను నే నగ్నివేశమునియొద్ద ధనుర్విద్య నభ్యసించుచున్న కాలమునందు నాకుఁ బృషతునిపుత్త్రుఁ డిప్పటిపాంచాలదేశపురాజు ద్రుపదుఁడు సహాధ్యాయియై యుండెను. ఇరువురమును నగ్నివేశమునియొద్ద ధనుర్విద్య నభ్యసించుకాలమున మిక్కిలి చెలిమిగల్గి యాసనశయ్యాది విహారంబులయం దేకమనస్కులమై మెలఁగుచుంటిమి. అప్పుడు ద్రుపదుఁడు తాను పృషతున కనుంగుఁబుత్త్రుం డగుటఁ జేసి యాతనియనంతరము రాజ్యాభిషిక్తుండయి ప్రజల నేలుకాలమునఁ దనరాజ్యమున సకలభోగములను ధనకనకవస్తువాహనములను నాయధీన మొనర్చెద నని చెప్పి యుండె. నేనును నట్టి శుభదినము లెప్పుడు వచ్చునా యని తలపోయుచుండి మాతండ్రి పరలోకగతుం డగునప్పుడు నా కాజ్ఞ నొసంగినమేరకుఁ గులరూపగుణములతో నొప్పు కృపాచార్యునిసోదరిని వివాహమై దానియం దశ్వత్థామ యను పుత్త్రుం బడసితిని. ఆబాలుండు తన యీడువా రావుపాలను ద్రావుచుండఁ దనకు నావుపాలను దెచ్చి యిమ్మని యేడ్చెను. అంత వానియేడ్పు నుడుపలేక పరిశుద్ధప్రతిగ్రహమున గోవును సంపాదించునిమిత్త ముద్దేశించి నే నున్న దేశమున నెచ్చోటను మంచి యావును సంపాదింప లేనైతిని. మఱియు నాకుమారుని సావాసకాండ్రగు ధనవంతులకుమారు లావుపాలం ద్రావి సంతసించుచుండ నాకుమారున కావుపాలకు మాఱుగ పిండిని నీటఁ గలిపి యిదియే యావుపాలనుచుండ దానిని వాఁడు ద్రావి చిఱుతవాఁడు గావున సంతసించుచు నాపిండిపాలను ద్రావి నేనును నావుపాలు ద్రావి వచ్చితి నని తోడికుఱ్ఱవాండ్రతోఁ జెప్పుకొనుచుండును. నాయాశ్రమములోనివా రీసంగతి గుర్తించి యాతం డొక్కకుమారున కావుపాలను దెచ్చి త్రాగింప లేనంతటినిరుపేద యని నన్నాడిపోయుచుండిరి. దానిని విని నా పేదఱికమునకును దౌర్భాగ్యమునకును నన్ను నేన నిందించికొనుచు నేమియుం జేయఁజాలక మనస్సునఁ గుందుచు, చిన్ననాఁటనుండి సేవాధర్మ మెఱుంగనివాఁడ నగుటం జేసియుఁ బ్రతిగ్రహ మొల్లనివాఁడ నగుటం జేసియును ధనుర్విద్య నభ్యసించుకాలమున నాకుసహాధ్యాయియై మిక్కిలి చెలిమితో నుండినద్రుపదుండు పాంచాలరాజ్యమునకు రాజై యుండు టెఱింగి "ధన్యోఽస్మి" యనుకొని భార్యాపుత్త్రులం

ద్రోణుఁడు కౌరవపాండవుల కొన్ని పాంచాలపురమున కేగితి. అంతట నొక్కనాఁడు రాజదర్శనం బును జేసికొని కపటముగాని సరసంపుఁజెలిమి దోఁప ద్రుపదునిం జూచి యిట్లంటిని. నెచ్చెలీ! చిన్ననాఁటిచెలికాఁడ నని నీయెడ కిప్పుడు వచ్చితిని. నీరాజ్యభోగములు నాయధీనము లని యగ్నివేశమునియాశ్రమంబున మనమిరువురము సహాధ్యాయులమై వర్తించుచుండఁ జెప్పియుంటివి కాదే? ఆమాటలను స్మరింపుమని వచించితిని. అంత నారాజు తన కప్పుడు లభించినరాజ్యమదముచేఁ గన్నుఁ గానక నన్నుఁ బరిహాసించుచు నిట్లనియె. ఓబాపఁడా! నీకుబుద్ధి యింకను వచ్చిన ట్లుండ లేదని యూహింతు చెద. ఏ మంటివి? నీకు నేను జెలికాఁడనా! అది యెవ్విధమున నగును? ఆలోచింపఁగా నంతయు నసంభవముగ నున్నది. తారతమ్యజ్ఞానము లేనియిట్టిపలుకులు పలుకఁ దగవు. రాజసభలో బ్రాహ్మణుఁడ వైన నీవు పలుగాకివలె మాటలాడకుము. బిచ్చగాండ్రగు నిరుపేదబ్రాహ్మణులకును సంపన్ను లగురాజులకును నెన్నఁడైనఁ జెలిమి ఘటించునా? వేదాధ్యయనసంపన్నునకు వేద మనఁగా నెట్టిదో యెఱుఁగని వాఁడును, రథికునకు నరథికుఁడును, పండితునకు మూర్ఖుఁడును, శూరునకు భీరుఁడును, ధనపతికి దరిద్రుఁడును, రాజునకు యాచకుఁడును జెలికాఁడగునే? సమానత్వము లేక వీరికిఁ జెలిమి యేనాఁడును గలుగనేరదు. రాజనయిన నాకును నిరుపేద వగు నీకును జెలిమి యేసామ్యమునఁ గలుగును? అస్త్రవిద్యాభ్యాసకాలమున సామర్థ్యనిమిత్తమైనస్నేహ ముండెను. ఎన్నఁడో బడియందుఁ జదువుచున్నప్పుడు కుదిరినచెలిమి, కాలాంతరమునందు సైతముండఁ గలదా? అయ్యది నానాఁట నశించును. ఇంతేగాక నారాజ్యభోగములు నీయధీనము లగును గాకయని నేను నీతో నుడివిన ట్లనుచున్నావు. అట్లెప్పుడును జెప్పియుండను. నేను నిన్నెఱుంగనే యెఱుంగను. అట్లుండ నారాజ్యభోగములు నీయధీనము లెట్లుచేయగలను? ఒకరాత్రి యన్నము కుడువఁబెట్టెదను. ఇఁక నీయిష్టమని చెప్పఁగాఁ గోపపరీతమానసుండనై భార్యను బుత్త్రునిఁ దోడ్కొని గుణవంతు లగుశిష్యులు వెంబడింప నీకురుదేశమును బ్రవేశించితి. ఇచ్చోటి కిప్పుడు నీవు చెప్పిపుత్తెంచిన నేతెంచితి. నీయభిమతమును నిర్వర్తించెద. ఏమిచేయుదును? ఆజ్ఞయిమ్ము. అని చెప్పఁ

గావెదకఁ బోయిన తీఁగ కాళ్లయందుఁ దాన చుట్టుకొనినట్లు భీష్ముండు మనమున మిక్కిలి సంతసించి ద్రోణాచార్యున కిట్లనియె.

## ద్రోణాచార్యుండు కురుకుమారులకు భీష్మానుమతంబున విలువిద్య నేర్పుట

ఆచార్యా! వినుము. మాయెడ సంపూర్ణకటాక్షము నుంపుము. కురుకుమారుల సౌభాగ్యమున నీవీదేశముఁ జొచ్చితివి. మా రాజ్యమెల్ల నీయధీనమై యుండును. నీకు వలసినధనధాన్యములం గొని యనుభవింపఁ గోరినభోగముల నన్నిటిని ననుభవింపుము. నీతలంపు లన్నియు నీడేఱెను. ఇంత యేల? మాకు నీవ రాజవు. నీయాజ్ఞ దొప్పున మే మెల్లరము వర్తించువార మని చెప్పి యుచితరీతి నాచార్యుం బూజించి ధనధాన్యములు మున్నగు ననేకపదార్థములతోఁ గూడిన యుత్తమ మగు నింటిని, ధనమును, సొమ్ములను, సేవకులను నొసంగి పంపెను. అంత నొక్కనాఁ డాచార్యుండు పరమానందభరితుఁడై యుండు నొక్కసమయమున భీష్ముండు పాండుకుమారులను ధృతరాష్ట్రునికుమారులను నందఱను శిష్యులనుగా సమర్పించెను. ద్రోణాచార్యుండు మిక్కిలి యానందమున మునిఁగి వారి నెల్లం జీఱి యిట్లనియె. మీరు నావలన విలువిద్యను సాంతముగ నేర్చినపిదప నా కొక్క కార్యమును జేయవలసియుండును. అన దాని వినియును నందఱూరకుండిరి. అంత నర్జునుఁడు మాత్ర 'మాచార్యా! మీయాజ్ఞ నేను శిరసావహించి యొనర్చెద' ననియె. ఆమాట కాచార్యుండు మిగుల సంతోషించి యర్జునునిఁ బలుమాఱు కౌఁగిలించికొని ముద్దాడెను. వాని నాచిఱుతప్రాయంపు ధైర్యసాహసపు మాటలకే యానందాబ్ధి నోలలాడెను. తనతలంచినకార్య మప్పుడ సాధింపఁబడె నని మనసున నూరటఁజెందెను. అంత యుధిష్ఠిరుఁడు మొదలగు పాండవులును, దుర్యోధనుఁడు మొదలగు ధార్తరాష్ట్రులును, మఱియును ధనుర్విద్యాభ్యాసమునిమిత్తము హస్తినాపురమున కేతెంచియున్న వృష్ణ్యంధకాది రాజకుమారులును, సూతపుత్త్రుం డగు కర్ణుండును నందఱును ద్రోణాచార్యునియొద్ద దివ్యములును మానుషములును నగునస్త్రములను బ్రయోగోపసంహారములతో నతిలాఘవమున నభ్యసించు చుండిరి.

కర్ణుం డెప్పుడును దుర్యోధనపక్షపాతియై సమయము వచ్చినప్పు డెల్లను బాండవులను బరిహాసముచేయుచు నవమానించుచుండె. అస్త్రములను జులకనగా, సౌష్ఠవముతో నాచార్యోపదిష్టమార్గమునఁ బ్రయోగించుట మున్నగు నస్త్రవిద్యాకౌశలమున నెల్లవారికంటె నర్జునుండు సమర్థుండై యుండుటం జూచి యర్జునునిఁ దనకు సమానునిఁగ నాచార్యుండు తలంచుచుండె. ద్రోణుఁడు నీటిని దెచ్చునిమిత్త మశ్వత్థామకుఁ గుంభమును (ఇది వేగముగ నీరునిండింపఁదగిన పెద్దమూతి గలపాత్రము) నితరులగు శిష్యుల కందఱకును గమండలువులను (ఈపాత్రకు మూతి చిన్నది. నీరు దీనిమూతిమూలమునఁ బాత్రలో నాలస్యముగ నిండును) నిచ్చిపంపి నీటి నెవ్వరు వేగముగఁ గొనితెత్తురో వారికి రహస్యములను బోధించుచుండును. అర్జునుండు దాని నెఱింగి తన కిచ్చినకమండలువున వారుణాస్త్రమును బ్రయోగించి వేగమ నీరు నిండించికొని యశ్వత్థామతోడన యాచార్యగృహమును జేరి యశ్వత్థామతో విద్యారహస్యములను దెలియుచు, నస్త్రసాధనములయం దెప్పుడు నాసక్తమనస్కుండై యుండెను. అట్లుండ నశ్వత్థామ కర్జునునితో విద్యామాత్సర్యంబు జనించెను. అంత నర్జునుండు చీఁకటియం దస్త్రప్రయోగము నెఱుంగకుండవలయు నని వంటలవానితో నర్జునున కెన్నఁడును జీఁకటిలో నన్నముఁ బెట్టకు మని పుత్త్రుఁడు దిట్టముచేసియుండె. వాఁడును నశ్వత్థామ చెప్పినట్లే జాగరూకుఁడై చేయుచుండెను. ఇవ్విధమున జరుగుచుండ నొక్కనాఁడు రాత్రి యర్జునుఁడు భుజించుచుండునపుడు వాయుప్రేరితమై దీప మాఱఁగ నర్జునుండు భుజించుచు నభ్యాసవశమునఁ జేతికబళములు నోటఁ జేరుచుండుటను దలపోసి యభ్యాసమున నన్నింట నిట్లే క్రమము తప్ప దని యూహించి రాత్రివేళలయందును శరసంధానముఁ జేసి యమ్ములను గుఱితప్పక యేయుచుండె. అట్లభ్యాసము రాత్రివేళయందుఁ జేయుచుండుటను ద్రోణాచార్యుం డాతనిధనుష్టంకారధ్వనిమూలమునఁ దెలిసి నిదురలేచి వానివిద్యాసక్తిని గొనియాడి కౌఁగిలించుకొని, శిరస్సు మూర్కొని నీకు సమానుం డగు వేఱొండువిలుకాఁడు జగంబున లేకుండఁగ నీకు విలువిద్యయం దుండుసర్వరహస్యములను బోధించెద నని వానికిఁ దుములయుద్ధప్రకారమును, రథములు గుఱ్ఱములు నేనుంగులు

నుండఁగ నేలపైనుండి సమరము చేయువిధమును, గదాదిసాధనము
లతో యుద్ధముఁ జేయుతీరును సకలరహస్యములతో బోధించెను.

### ఏకలవ్యుం డనువాఁడు ద్రోణు నారాధించి విలువిద్య నేర్చుట

దేశములో నున్న రాజకుమారు లందఱును ద్రోణాచార్యుని
వలన సకలాస్త్రశస్త్రవిద్యలను సర్వరహస్యములను గఱచు
చున్నా రని యనేకరాజకుమారు లాతనియొద్దకు శిష్యులుగఁ బోవు
చుండఁగా హిరణ్యధన్వుం డనునిషాదరాజకుమారుం డేకలవ్యుం డను
వాఁడు ద్రోణాచార్యునికడ కేతెంచి భక్తితో నమస్కరించి తనకు విలు
విద్య నేర్పవలసిన దని ప్రార్థింపఁగా, ద్రోణాచార్యుండు వానిని నిషా
దుంగా నెఱింగి వానికి విలువిద్య గఱప ననెను. అంత నేకలవ్యుండును
వినయముతో నాచార్యపాదంబులకు మ్రొక్కి వనమునకుం బోయి
యచ్చోట ద్రోణాచార్యునిప్రతిమ నొకదానిని స్థాపించికొని దాని
యందు గురుభావన నుంచి దానియెదుట వింట నమ్ములను గూర్చి విద్యా
భ్యాసమును జేయుచుండెను. ఇవ్విధంబున వాఁడు విలువిద్యయందు
విస్తారపాండిత్యమును గడించి ద్రోణునిశిష్యులలో నందఱికంటె నధికుఁ
డయ్యెను. ఇట్లుండ ద్రోణశిష్యు లందఱు నావనమునకు వేటకై
యేగిరి. అప్పుడు వేటకుఁ బోయినవారిగుంపునుండి తప్పించుకొని యెట్లో
పోయిన యొకవేటకుక్క కృష్ణాజినమును ధరించినట్టియు, జడలు దాల్చి
నట్టియు, ధూళిధూసరితాంగుఁడైనట్టియు, నేకలవ్యునిరూపముఁ జూచి
మొఱుఁగుటయు, నతం డాధ్వని విని యొకేసారి దానిముఖమున
నాఁటున ట్లేడమ్ముల నేయఁగా నయ్యది మఱింత మొఱుగుచు రాజ
పుత్త్రులగు వేటకాండ్రను తనముఖమునఁ గాడనేసినశరములతో వచ్చి
కలిసికొనెను. అప్పుడా రాజకుమారు లాయేకలవ్యుని శరసంధానసౌష్ఠవ
మునకును శబ్దవేదిత్వమునకును మెచ్చుచు నావనమున నానిషాదుని
యునికిపట్టు వెదకుచుఁబోయి యెట్లో వానిం గనుంగొనిరి. అప్పుడాయె
ఱుక వికృతవేషధరుండై యుండుటం జేసి వానిని రాజకుమారులు గుర్తె
ఱుంగనేరక 'నీ వెవ్వండవు? ఎవనికుమారుండవు? ఎవనియొద్ద విలువిద్య
నభ్యసించితి' వని యడుగఁగా నేకలవ్యుండు వారి కిట్లనియె. 'అయ్య

లారా! నే నొక నిషాదరాజకుమారుఁడను. ఏకలవ్యుం డనువాఁడను. ద్రోణాచార్యుని గురునిఁగా భావించి యామహత్త్వమున విలువిద్యఁ గఱచుచున్నా' ననెను. అంత వారు వానివృత్తాంత మెల్ల నెఱింగి మరలి హస్తినాపురంబునకుఁ జనిరి. ఈసమాచారము నంతను ద్రోణాచార్యునకుఁ దెలిపిరి. అర్జునుఁడు మాత్ర మేకలవ్యుని విద్యానైపుణ్యమును దలంచుచు వాఁడు తనకంటె నెక్కువ విద్య నేర్చియుండు నని తలపోసి ద్రోణునితో నిట్లనియె. 'ఆచార్యవర్యా! మీ రొకప్పుడు లోకములో నుండు ధానుష్కులందఱకంటెను, మీఁదుమిక్కిలి మీశిష్యు లందఱకంటె నా కెక్కుడు విద్యను బోధించి నన్నందఱకంటె సమర్థునిగఁ జేసెద నని చెప్పియుంటిరి. ఇప్పుడు చూడ నేకలవ్యున కధికవిద్య నేర్పి వానికి నాకంటె శరసంధానకౌశలమును బోధించి యున్నారే' యనెను. అంత ద్రోణాచార్యుండు రెండవవారి కెఱుకపడక యర్జునునిఁ దోడ్కొని యరణ్యంబునకుఁ బోయి యనవరతశరసంధానాభ్యాసియు, జటావల్కలధారియు, మృగచర్మధారియునై తేజస్సుతో విరాజిల్లుచున్న నిషాదరాజపుత్త్రుని నేకలవ్యుం జూచిరి. అంత నేకలవ్యుండు సశిష్యుఁడై వచ్చిన ద్రోణాచార్యుని నెదుర్కొని యాసనాద్యుచితోపచారంబుల నొనర్చి నమస్కరించి నేను మీశిష్యుండ నని చెప్పి యెదుట నిలువంబడెను. అంత ద్రోణాచార్యుండు నీవు నాశిష్యుండ వగుదేని గురుదక్షిణ నిమ్మని యడిగెను. అంత వాఁడు గురువున కియ్యఁదగనిపదార్థం బొకటి గలదే? ఈశరీర మంతయు భవదధీనము. మీ రేది కోరెదరో దాని నొసంగెద ననెను. అంత ద్రోణాచార్యుం డట్లు యగు నేని నీదక్షిణాంగుష్ఠమును (బొటనవ్రేలిని) దెగనఱికి యిమ్మనెను. వాఁడును వెంటనే కొంకక తనబొటనవ్రేలిని గుడిచేతిలో నిదానిని దెగఁగోసి గురువునకు దక్షిణగా సమర్పించెను. అంత నేకలవ్యుండు కుడిబొటనవ్రేలు లేనివాఁడు కావున విల్లును ధరించునపు డెడమచేతివ్రేళ్లతో ధరించుచు శరసంధాన మప్పుడు కుడిచేతితక్కినవ్రేళ్లతో సంధింపవలసివచ్చుటం జేసి పూర్వంపులాఘవము లేకుండెను. అట్లు ద్రోణాచార్యుం డర్జునుని నిమిత్త మేకలవ్యునినేర్పును దగ్గించినవాఁడై యర్జునునితో నుల్లసమాడుచు హస్తిపురంబునకుఁ బోయెను. ఇట్లు పాండుకుమారు లెల్ల

ధనుర్విద్యాప్రభావంబునను నితరాయుధముల ప్రయోగంబునందును నేర్పరులై వెలసిరి. వారలలో యుధిష్ఠిరుండు రథికులలో శ్రేష్ఠుఁ డయ్యెను. భీమదుర్యోధనులు గదాపరిశ్రమమున నత్యధికులై యొకరి నొకరు మించునట్లు మత్సరయుతులైరి. నకులసహదేవులు కత్తితోఁ బోరాటమునందు సమర్థులైరి. అశ్వత్థామ సర్వయుద్ధరహస్యములను దెలిసి యందఱికంటె నధికుఁ డయ్యెను. అర్జునుఁడు ప్రపంచములో నుండు మేటివిలుకాండ్ర కందఱికన్న బుద్ధియోగమునందును, శరసంధాన వేగమునందును, శస్త్రాస్త్రవిద్యా వేదిత్వమునందును నత్యధికుఁడై ప్రఖ్యాతిఁగాంచెను. భీముని బలాతిశయమును నర్జునుని ధనుర్విద్యాతిశయమును దెలిసి దుర్యోధనాదు లోర్వ లేక తమలో నెల్లకాలమును చింతించుచుండిరి. ఇట్లర్జునునికంటె నేకలవ్యుని శరసంధానలాఘవమును ద్రోణాచార్యుండు తగ్గించి యర్జునుని నందఱికంటె మేటివిలుకానిగాఁ జేసి సత్యప్రతిజ్ఞుం డయ్యెను. అర్జునుఁడు తనకంటె మించిన ద్రోణశిష్యుం డొకఁ డేకలవ్యుఁ డనువాఁ డున్నాఁడే యను మనస్స్పర్ధ లేనివాఁ డయ్యెను.

### అర్జునుండు కృత్రిమపక్షిశిరముఁ దెగనేయుట

అంత ద్రోణాచార్యుండు తనయందఱు శిష్యుల లక్ష్యవేధిత్వము నెఱుంగఁగోరి యొకనాఁడు శిల్పులచేత నొకగ్రద్దను జేయించి శిష్యులతిశ్రమమున చూచునట్లు దాని నొకవృక్షముపై నుంచి యందఱ నా చెట్టుసమీపమునకుఁ గొనిపోయి వారితో నిట్లనియె ఓ రాజకుమారులారా! ఈచెట్టున నుండు భాసపక్షిని గమనించి చూడుఁడు. దానిగుర్తు పత్రములసందునఁ జక్కఁగా దదేకధ్యానముతో గమనింపుఁడు. అట్లు లక్షించి ధనుస్సున బాణమును సంధించికొని యుండుఁడు. నేను జెప్పిన వెంటనే దానితలఁ దెగవ్రేయుఁడు. అని వారి కెల్లరకు నాచార్యుండు తొలుత హెచ్చరిక చేసెను. అంత నొక్కొక్కరాజకుమారుని వరుసగాఁ బిలిచి యాచార్యుండు పరీక్షింపఁ దొడంగెను. వారిలో మున్ను యుధిష్ఠిరుని రావించి ధనుస్సున బాణమును సంధించి యుంచుకొను మనియెను. అట్లాతండు సంసిద్ధుఁడు కాఁగా నాచార్యుండు పక్షిని

బాగుగఁ గుర్తించి చూచెదవా? యనెను. అంతట యుధిష్ఠిరుండు చూచుచున్నా ననెను. అంత నాచార్యుండు వెండియు నతని కిట్లనియె. ఇపుడు నీవు చెట్టును, భాసపక్షిని, నన్నును, నీసోదరుల నందఱను జూచుచున్నావే యనఁగా యుధిష్ఠిరుండు చూచుచున్నా ననెను. దానిని విని యాచార్యుండు నీదృష్టి చెదరెను. నీవీ పక్షిశిరమును దెగవ్రేయ లేవనెను. అవ్విధమున శిష్యులందఱు నట్లే యడుగఁబడిరి. అందఱును యుధిష్ఠిరునట్లే యుత్తరముల నొసఁగిరి. అప్పు డాచార్యుండు వారెల్లరును బక్షిశిరమును లక్షింప నేరకున్నారనియు దానిశిరమును వారు క్రిందఁబడవేయఁజాల రనియు నందఱం దొలఁగించి యర్జునునిఁ బిలిచి యిట్లనియెను. అర్జునా! నీవు వృక్షమును, భాసమును, నన్ను, నీసోదరులం జూచితే? యన్నెను. అంత నర్జునుండు నాకంటికి భాసము దక్క మఱి యేవియుం గానరా వనెను. మఱియు భాసము నొక్కదానినే లక్షించి యున్నావా? యనఁగా తనకు దానిశిరము తప్ప మఱియేదియును దనలక్ష్యమునకు గోచరము కాలేదనెను. అంత నాచార్యుండు బాణమును దానిపైఁ బ్రయోగింపు మనుచుండఁగనే యర్జునుండు మున్నే శరమును వింటియందు సంధించి యుంచికొనియుండుటను, వెంటనే బాణమును బ్రయోగించెను. కృత్రిమపక్షిశిరము దానం ద్రెవ్వి క్రిందఁ బడియెను. అంత ద్రోణుండు వానిలక్ష్యబుద్ధికి మిక్కిలి సంతసించి వానిని శిష్యులసమక్షమునఁ గొనియాడి, కౌఁగిటం జేర్చి యితఁడు నిశ్చయముగ ద్రుపదుని యుద్ధమున గెలువఁగలవాఁ డని మనమున నిర్ణయించుకొనెను.

## ద్రోణాచార్యుం డర్జునునకు బ్రహ్మశిరోనామకాస్త్రము నుపదేశించుట

అంతఁ గొంతకాలమునకు భారద్వాజుండు గంగాస్నానమునకు యమునానది కేఁగెను. ఆచార్యునివెంబడి శిష్యు లందఱును బోయియుం డిరి. ఆచార్యుండు యమునాజలములయందుఁ గ్రుంకు లిడుచుండఁగా నాతనితోడ నొకపెనుమొసలి పట్టుకొనెను. ఆచార్యుండు తా నప్పుడు దానిపట్టు వదలించుకొనుటకు శక్తుఁ డయ్యును శిష్యుల నందఱను బిలిచి దానివలనిబాధను దప్పింపుఁడనెను. అందఱును దానిపై శరముల

నేసిరిగాని యెవనిబాణములును గుఱితో దానిపైఁ దగిలినవి కావు. అంతట నర్జునుం బిలిచి దానిం గొట్టు మనెను. అర్జునుండు శరములను సంధించి తనబాణము లొక్కటియును గురువుతోడం దాఁకక మొస లికే తగిలి యది చచ్చునట్లు లక్ష్యమును సరిగా గుర్తించి యైదుబాణ ములను దానిపైఁ బ్రయోగించి దానినిఁ జంపెను. అంత ద్రోణుండు మకరవినిర్ముక్తుండై యర్జునునిం జేరి వానిలక్ష్యశుద్ధికి శిష్యు లందఱిలో మేలైనసామర్థ్యమును గొనియాడి చేరువకుఁ బిలిచి, 'యర్జునా! నీ విప్పుడు గావించిన కార్యమును జూచితిని. నీనేర్పునకు మెచ్చితిని. దుర్ధర మగు బ్రహ్మశిరోనామకాస్త్రమును నీకు సమంత్రకముగా నుపదేశించెద. ప్రీతిమైఁ గొనుము. దీనిని సామాన్యులపైఁ బ్రయోగించినచో నిది లోకము నెల్ల దహించును. ఎవ్వఁడైనను మానవాతీతుఁ డగు శత్రువు నిన్ను బాధించినయెడల వానిపై దీనిని బ్రయోగింపుము. దీనిని గ్రహించునపుడు నీవు పవిత్రుఁడవై యుండవలయును. ఇప్పుడే నీ కుప దేశించెద. అని చెప్పఁగా నర్జునుండు యమునానదియందుఁ గ్నాతావ గాహుండై శుచిర్భూతుండై యాచార్యునకు నమస్కరించి రెండుచేతులను జోడించుకొని యాచార్యునిముందు నిలువఁగా నర్జునునకు ద్రోణా చార్యుం డప్పుడే యాయస్త్రముయొక్క ప్రయోగమును నుపసంహార మును నుపదేశించెను. అర్జునుండును నామహాస్త్రమును గురుముఖమున భక్తితో నుపదేశము గొనెను. అంత ద్రోణుం డిమ్మహానీయాస్త్రప్రభా వంబున లోకమున నీకు సమానుఁ డగుధానుష్కుం డన్యుం డుండ నేరఁ డని ప్రీతిపూర్వకముగ నాశీర్వదించెను.

## కుమారాస్త్రవిద్యాసందర్శనము

అంత నొక్కనాఁడు ద్రోణాచార్యుండు ధృతరాష్ట్రుని కొలువు కూటమున కేఁగఁగా నచ్చోట సాత్యవతేయుండును, భీష్మ విదుర కృప బాహ్లిక సోమదత్తాదు లగు రాజన్యులును, బ్రహ్మర్షులును నుండిరి. ఆసభలో నుండువా రెల్లరును వినుచుండ ద్రోణాచార్యుం డిట్లనియె. కురురాజేంద్రా! ఇన్నినాళ్లుగఁ గురుకుమారు లందఱును నాయధీనులై యుండి విలువిద్య నేర్చిరి. ధనుర్విద్యయందు వారిప్రావీణ్యమును బరీ

క్షింపవలయు ననఁగా నామాటకు ధృతరాష్ట్రుండు సంతసించి యాచార్య వరునితో నిట్లనియె. విప్రవర్యా! మాయెడఁ బరమ కారుణికుండవై మాకు మహోపకార మొనర్చితివి. కుమారుల యస్త్రవిద్యాప్రావీణ్యమును దెలియుటకు స్థలమును సమయమును నీవ నిర్దేశింపుము. దానికిఁ దగిన యేర్పాట్లు గావించెద. కుమారులయస్త్రవిద్యానైపుణ్యంబును గన్నులారఁ జూచుటకుఁ గోరెద. నీయేర్పాటుచొప్పున విదురుండు స్థలశోధనము సమయనిర్ధారణము నేర్పుతోఁ జేయును. అని చెప్పి యాచార్యుని సత్క రించి పంపి విదురుం జూచి యాచార్యునియభిమతంబున సకలంబును సమ కూర్పు మని నియమించెను. విదురుండును ధృతరాష్ట్రుని యుత్తరువును బొంది రాజాస్థానంబు వెలుపలికి వచ్చి యుత్తము లగుశిల్పుల రావించి స్థలశోధనంబుఁ జేయించునప్పు డెగుడుదిగుడు లేక భూమి నంతయు సమముగఁ జేయించి కూలివారల నియమించి యాభూమియం దున్న తాలను, అప్పలను, ముండ్లను దీసివేయించి, పొదలను జిన్న గుబురు లను నన్నిటిని దోఁకివేయించి, యావ్యాయామస్థలమున కుత్తర భాగమున దారిఁ గల్పించి ప్రేక్షకు లుండుటకుఁ దగిన యొకభవన మును నిర్మింపించి యందు రాజులకును రాజస్త్రీలకును నితర పౌరుల కును వారివారియంతస్తులకుఁ దగినట్లు మంచెల నమర్చెను. ఇవ్విధ మున వ్యాయామరంగస్థలము సర్వాలంకారసమన్వితంబై, పచ్చని యాకులతోరణంబులతో నొప్పారి యొకసుముహూర్తమున రాజకుల బ్రాహ్మణుండు శాస్త్రీయమైన బలివిధాన మొనరించి యచ్చోట నానా విధాయుధంబుల సమకూర్చుట కాజ్ఞలనొసంగి యేర్పాటు చేయించెను. అంత నొకసుముహూర్తము గలదినమునందుఁ గుమారుల యస్త్రవిద్యా నైపుణ్యంబుఁ బరిశీలింప నిర్ణయింపఁబడెను. ఆదినమునం దూయెల పల్లకీలయందును, నూగులాడని పల్లకీలయందును నెక్కి భీష్మ, కృప, విదుర, సోమదత్తాదులు మున్ను నడువఁగా గాంధారియుఁ గుంతియును మఱియు ననేక రాజస్త్రీలునుం గూర్చుండి వ్యాయామరంగస్థలమునకుఁ జనుదెంచిరి. వా రందఱును నానారత్నములతో శోభిల్లుచున్న యావ్యాయామరంగస్థలంబునఁ దమకుఁ బ్రత్యేకముగ నియమింపఁబడి యుండు మంచెలపైఁ గూర్చుండిరి. గాంధారియుఁ, గుంతియును దామెక్కి

వచ్చిన పల్లకీలనుండి దిగి తమకుఁ బ్రత్యేకముగ సమర్పఁబడియుండు మం చెల నడిగి తెలిసికొని వానిపైఁ గూర్చుండిరి. ఆసమయమున వేడుకఁ జూచునిమిత్త మరుదెంచియుండు బ్రాహ్మణాదినానాజనముల కోలాహలం బును మంగళవాద్యములధ్వనులును బ్రళయకాలమున క్షుభితమైన సము ద్రధ్వని ననుకరించెను. అంతఁ దెల్లని వస్త్రములను, ధవళములగు జన్ని దములను, శుక్లమాల్యములను, శుక్లగంధములను, ముసలితనమున నెర సినతెల్లని తలవెండ్రుకలును, మీసములునుంగల్గి యశ్వత్థామతోఁ గూడి కొని యంగారకునితోఁగూడిన యాదిత్యబింబమువోలె, నిసుమంతయైన మేఘముల బొడకానరాని యాకసంబుమాడ్కి ద్రోణుఁడు రంగమధ్య మున కరుదెంచెను. వెంటనే పురోహితులు పుణ్యాహరవములతో సభను భూనభోంతరములను నిండించిరి. పిదప రాజకుమారులు మైమరువులను, నంగుళిత్రాణములను, విల్లు నమ్ములను, నమ్ములతో నిండియున్న యమ్ములపొదులను ధరించి వివిధాయుధములను గేలంబూని తమలోఁ బెద్దవాఁడైన యుధిష్ఠిరుని ముం దిడుకొని వరుసగా నందఱును రంగమును బొచ్చిరి. అంత వారందఱును నాచార్యునానతి వడసి తమ తమ పేరులతో గుర్తువేయఁబడిన బాణముల ప్రయోగలాఘవసౌష్ఠవములు ప్రకాశింప నానాగతులతో నొకప్పుడు గజములను, వేఱొకప్పు డశ్వములను, మఱియొకప్పుడు రథములను నారోహించి యతివేగమున రంగమధ్యమున వివిధచిత్రగతులం దిరుగుచుఁ జలలక్ష్యములను గుఱి తప్పక కొంద ఱేయుచుండిరి. భూమిపై నిలుచుండి మల్లులవలె బాహు యుద్ధపుఁ బ్రావీణ్యమును చూపిరి. మఱికొందఱు మండలప్రచారం బుల్లసిల్ల గదాయుద్ధమునఁ బాండిత్యమును గౌశలమును దెలుపుచుం డిరి. వీరు తమ విద్య నేర్పును లాఘవమును దృఢముగ ధనుస్సును గ్రహించుశక్తియును, దూరమున నుండువస్తువును గొట్టుసామర్థ్యమును చూపుచుండ నందఱును బరమాశ్చర్యభరితులైయుండిరి. రంగప్రేక్షకులు కొందఱు బాణములు తమపై నెక్కడఁ బడునో యని భీతిల్లుచుఁదలలు వాల్చిరి. మఱికొందఱు ధైర్యముదో వానివంక నే చూచుచుండిరి. అంత భీమదుర్యోధనులు గదాపాణులై మదాతిరేకమున నొండొరుల విధారించుచు నొక్కొక్కశిఖరముతో వెలయుకొండలఁబోలె రంగమధ్య

మునకుఁ దమ నేర్పుఁ జూపుట కేతెంచిరి. వా రిరువురును మదించినగజములువోలె ఘీంకరించుచు, మండలప్రచారమునఁ గుడియెడమప్రక్కలఁ దిరుగుచుఁ దమగదావిద్యాపాండిత్యమును బ్రేక్షకులకుఁ జూపిరి. అప్పు డా రాజకుమారులవిద్యాప్రావీణ్యమునంతను విదురుండు ధృతరాష్ట్రునకుఁ బూసఁ గ్రుచ్చినట్లు వినిపించుచుండెను. గాంధారికిఁ గుంతియు నావృత్తాంతములను దెలుపుచుండెను. అప్పుడు ప్రజలలోఁ గొందఱు దుర్యోధనునిపక్షపాతులై వానిని బ్రోత్సహించు హెచ్చరికమాటల నాడిరి గొందఱు భీమసేనునివంకవారు వానిని బ్రోత్సహించుమాటలతో నుబ్బఁ బెట్టిరి. ఇట్లుండ నాచార్యుండు ప్రేక్షకులకలకలమును విని యశ్వత్థామను బిలిచి వారిరువు రింకను బోరాడినచోఁ గోలాహలము విశేషించును గావున రంగమధ్యమునకుఁ జని వా రిరువురవిద్యావిలాసంబులఁ జూపుట చాలు నని నివారింపఁ బంపెను. అశ్వత్థామయు నట్లు చేయఁగా నాచార్యుండు రంగమధ్యమును బ్రవేశించి వాద్యధ్వనుల నాపి రంగము నలువంకలం జూచి ప్రేక్షకులతో నిట్లనియె. మహానీయులారా! ఇప్పటికి శిష్యులవిద్యావిలాసములను జూచితిరి గదా! ఇంక నాకుమారునింబోలువాఁడును, నాశిష్యులలో నతిసమర్థుం డగువాఁడును నగు నర్జునునిధనుర్విద్యావిలాసంబులం జూడుఁ డని చెప్పి యర్జునుని రంగమధ్యమునకు రమ్మని యానతిచ్చెను. అప్పు డర్జునుం డాచార్యుని యనుమతిం గొని మైమఱువు దొడిగి, వింటి నమ్ములను నమ్ములపొదులను దాల్చి రంగమధ్యమున కరుగఁగనే మంగళ వాద్యములు మ్రోగెను. అప్పుడు ప్రేక్షకులు తమలో నీతండే పాండురాజు కుమారులలో మధ్యముఁడు. మహేంద్రప్రసాదమునఁ గుంతీతనయుండై జనించినవాఁడు, పరమధార్మికుఁడు, దయావంతుఁడు, దాంతుఁడు, మహాజ్ఞానియని పలు తెఱంగులఁ బొగడుచుండిరి. ఈకలకలరవంబులు రంగమున నన్ని దెసలను వ్యాపించినవి. కుంతీదేవి యీమాటలను విని సంతోషబాష్పములను రాల్పఁగా నాకన్నీటిధార లాదేవి వక్షస్స్థలమును జెమ్మగిల్లఁ జేసెను. అంత ధృతరాష్ట్రుం డీకలకలధ్వనికిఁ గారణ మే మని యడుగ, విదురుం డిట్లనియె. ఇప్పుడు రంగమధ్యమునకు పాండురాజకుమారమధ్యముండు తన యస్త్రవిద్యాకౌశలంబును జూపుటకు వచ్చియున్నవాఁడు,

వానిని ప్రేక్షకులు కొనియాడు వచనంబులచే నీ కలకలధ్వానంబులు చెలరేఁగినవి. త్రేతాగ్నులంబోలు కౌంతేయులు తమధర్మవిక్రమతేజంబులచేఁ గౌరవకులంబును ప్రకాశింపఁజేసి రనియు, నేనును ధన్యుఁడ నయితి ననియు ధృతరాష్ట్రుం డనెను. అంతట రంగమధ్యమున నర్జునుండు తనవిద్యాప్రభావము మెఱయునట్లాగ్నేయాస్త్రమును వింట సంధించి దాన నగ్నిని రప్పించెను. వాయవ్యాస్త్రసంధానమున వాయువు నుత్పత్తిచేసెను. మేఘాస్త్రమును వింట సంధించి మేఘపరంపరలను సృజించెను. భౌమాస్త్రమున భూమిఁ జొచ్చెను. పార్వతాస్త్రమునఁ గొండ లనేకములతోఁ గప్పఁబడి యంతర్ధానాస్త్రప్రయోగమునఁ గానరాకుండెను. మఱియు నున్నట్టుండి క్షణమున నత్యున్నతాకారుఁడును, రెండవక్షణమున నతివామనమూర్తియు, నొకప్పుడు రథమధ్యస్థితుండును, మఱియొకప్పుడు రథాగ్రస్థితుండును భూతలమును జొచ్చినవాఁడునై యగపడును. ఇంతేగాక తనవివిధాస్త్రవిద్యాప్రభావంబున నేపాటిగాలి సోఁకినను జలించుసుకుమారవస్తువులను జలింపనీకయు సూక్ష్మవస్తువులఁ గుఱి తప్పకుండఁగను మహాపదార్థములను గదలుచుండునప్పుడును సౌష్ఠవమున నొకేబాణమునఁ గొట్టును. మఱియు సంచలించుచు గుండ్రముగాఁ దిరుగుచున్న యొకలోహమయమైన పందిమోమున నొక్కబాణమును నేసినవిధమున నైదుబాణములను నేసి తనవిద్యామహిమమును జూపెను. ఆవుకొమ్ము నొక్కదానిని త్రాట ప్రేలఁగట్టియుండిరి. దానిపై నొకబాణమైనను పృథపోక గుఱి తప్పకుండ నిరువదియొక్క బాణములను బ్రయోగించి ప్రేక్షకుల కాహా యనిపించెను. ఇంతేకాక కత్తిసాడి నైపుణ్యమును గదాయుద్ధమును మండలప్రచారభేదంబులను గాన్పించి రంగములో నున్నవారి నందఱ నాశ్చర్యాబ్ధి నోలలాడించెను. అంతఁ గొంతసేపటికి రంగద్వారప్రదేశమున నశనిపాతమువోలె మహాధ్వనితో భుజములఁ దట్టును రంగమధ్యప్రేక్షకు "లిది యేమి భూమి పగులునా" యనుచు ద్వారప్రదేశమును జూచుచుండఁ బాండవులు ద్రోణాచార్యు మరుగునకుఁ బోవ నయ్యాచార్యుండు నక్షత్రపంచకాత్మకంబైన హస్తనక్షత్రములతోఁ గూడిన చంద్రునింబోలె విరాజిల్లెను. అశ్వత్థామను

ముచ్చిళుకొని దుశ్శాసనాదు లగు ధార్తరాష్ట్రులు గదాపాణియైన దుర్యోధనునొద్ద కేఁగి పరివేష్టింప, నప్పటిస్థితి వీక్షింపఁగా నతండు రాక్షససంహారకాలమున దేవతలచేఁ బరివేష్టింపఁబడిన మహేంద్రుం బోలియుండెను.

### కర్ణుఁడు రంగమునకు వచ్చుట

అంత సహజకవచకర్ణకుండలమండితుండును, బాలసూర్యుని వంటివాఁడును, పొడవైనశరీరముగలవాఁడును, విశాలములైన కన్నుల తీరుగలవాఁడును, వృషస్కంధుఁడును, మహాబలశాలియును, ధనుస్సును నమ్ములపొదియుఁ గలవాఁడునునగు కర్ణుండు రంగమధ్యంబునొచ్చి నలుదెసలం గలయంజూచి ద్రోణాచార్యునకును, కృపాచార్యునకును నమస్కరించి సోదరత్వము నెఱుంగక మేఘము గర్జించినట్లు మహాధ్వనితో నర్జును నాక్షేపించి యిట్లనియె. ఓరీ యర్జునా! నీవే ధనుర్విద్యావిలాసమున నిపుణుండవని తలంపకుము. నీవు చూపినవిద్యల నెల్ల నేనును నేర్తు. ఈరంగమధ్యమున నేను వాని నెల్ల నిప్పుడ చూపెదను. ఇంత మాత్రమున నీవుతప్ప నితరు లీవిద్యల నేర్చినవారు లేరని యీప్రేక్షకుల భ్రమపెట్టవలదు అని చెప్పెను. అంతరంగమున నుండువా రెల్లను వీనివిద్యానైపుణ్యమును జూచుట కువ్విళ్లూరుచుండిరి. వెంటనే యర్జునున కొకతెఱంగునఁ గోపంబును సిగ్గును జనించెను. దుర్యోధనునకుఁ బ్రీతి పుట్టెను. అంతట ద్రోణానుమతిని బొంది కర్ణుం డర్జునుండు చూపిన యస్త్రచాతుర్యము నంతను రంగమున నుండు ప్రేక్షకుల కద్భుతంబు వొడమునట్లు చూపెను. అంత దుర్యోధనుండు కర్ణుని దానును దమ్ములును గౌఁగిలించికొని మహాబాహూ! నీకు స్వాగతమగుఁగాక! నా సౌభాగ్యమునం జేసి యీసమయమున నీవిచ్చటికి వచ్చినవాఁడవు. నాతోఁ జెలిమి చేయుము. నాతమ్ములతో నీవుం గూడి కౌరవరాజ్యమును యథేష్టముగ ననుభవింపుము. నాశత్రువుల నెల్ల విధ్వంసము గావింపుము. మావారల కెల్ల హితం బొనర్పుము. అని చెప్పఁగాఁ గర్ణుం డందుల కొప్పుకొని తా నప్పుడర్జునునితో ద్వంద్వయుద్ధము సేయుట కనుజ్ఞ నిమ్మని యాచార్యు నడిగెను. అప్పు డర్జునుఁడు ధార్తరాష్ట్రులమధ్యమున నున్న కర్ణున కిట్లనియె. కర్ణా! పిలువనిపేరంటమునకు వచ్చి కాఱులపులను

ప్రేలకుము. ఇట్టివాఁడు పొందులోకములను నాచే వధింపఁబడి పొందె
దవు అనఁగా వానికిఁ గర్ణుం డిట్లనియె "ఫల్గునా! ఈరంగము శూరుల
కందఱకు సమానముగ నుండును. ఇట్టిపొగరుపోతు మాటలాడ
వలదు. శరములఁ బ్రతివచనముల నిమ్ము. ఈసూర్యుండు సూచుచుండఁగనే
తీవ్రబాణముల నేసి నీతలఁ దునిమెద" నని పౌరుషముతో నర్జునునకుఁ
బ్రతివచన మొసంగెను. అర్జునుఁ డంతట గురువునాజ్ఞఁ గైకొని యన్నద
మ్ములచే నాలింగితుండై యుద్ధోన్ముఖుండై రంగమధ్యమున కేతెంచెను.
కర్ణుండును దుర్యోధనాదులచే నాలింగితుండై సమరసన్నాహంబున రంగ
మధ్యమునకు భుజములఁ దట్టుచుఁ జేరెను. ఇంద్రుఁ డీద్వంద్వయుద్ధముఁ
జూచునిమిత్తము మేఘవాహనము నెక్కి యాకసంబు నలంకరించెను.
వియత్తలంబు మేఘావృతంబై యుండఁ బ్రేక్షకులకుఁ గర్ణార్జునుల ముఖం
బులు గొంతసేపు కానరాకుండెను. అప్పుడు సూర్యుఁడు పుత్రస్నేహం
బున మేఘమధ్యమునుండి తనతీక్ష్ణకిరణములను గర్ణముఖంబునఁ బ్రస
రింపఁజేయఁగా నారంగమునఁ గొంతవడికిఁ గర్ణుఁడు కానవచ్చెను.
అంత దుర్యోధనాదులు కర్ణునిప్రక్కన నిలుచుండిరి. భీష్మద్రోణకృపు
లర్జునునిప్రక్కన నిలుచుండిరి. మఱియు రంగమునఁ బ్రేక్షకులై
వచ్చినస్త్రీలును రెండుతెగ లైరి. కొందఱు కర్ణునిపక్షము నభినందిం
చిరి. మిగిలినవా రర్జునునిపక్షమునం దభిమానముఁ జూపిరి. కుంతి
యిరువురివృత్తాంత మెఱింగినది గావునఁ గర్ణార్జునులకు ద్వంద్వయుద్ధ
మని వినినతోడనే దేహ మంతయుఁ జెమ్మగిల్లి భీతి వొడమి మూర్ఛ
పోయెను. అంత విదురుం డాదేవిని సేదఁదేర్చుటకుఁ బరిచారికల
నియమించెను. వెంటనే కొంతసేపటి కామె మూర్ఛదేరి యూఱ
డిల్లెను. అంత నింద్రునివాహనము లగు మేఘములు తొలంగెను.
సూర్యరశ్మి రంగస్థలముపైఁ జక్కఁగా వెలుఁగ నారంభించెను. అర్జుని
ముఖకమలము వికసించుచు రంగప్రేక్షకులకును గుంతికిని సంతోషం బావ
హింపఁజేసెను. అప్పుడు సర్వవిధము లగు యుద్ధరహస్యముల నెఱింగిన
శారద్వతుండు కర్ణునిసమీపించి యిట్లనియె. కర్ణా! వినుము. నీయెదుట
యుద్ధమునకు వెనుదీయక గట్టాయితంబై మహేంద్రునిఁబోలె నిలు
చున్న సవ్యసాచి పాండురాజు ధర్మపత్ని యగు కుంతికి సూనుండు నీకుల
గోత్రములఁ జెప్పుము. నీవును రాజవగుదు వేని యాతనితోడ నీరంగ

మధ్యమున ద్వంద్వయుద్ధము సేయందొడంగుము. రాజు లితరులతోడ ద్వంద్వయుద్ధము సలుపరాదు. అని చెప్పఁగాఁ గర్ణుండు సౌరుష మెల్లఁ దగ్గి దీనవదనుండై యాసభలోఁ దనతల్లిదండ్రులకులమును వారి పేరులను చెప్పుటకు సిగ్గుజెందెను. అప్పుడు వర్షబిందువులు పడఁగాఁ గమలంబు చెన్నుదఱుగుచాడ్పున వానిముఖవికాసము కొంతచెడి యుండుటం జూచి దుర్యోధనుండు కృపాచార్యున కిట్లనియె.

## దుర్యోధనుండు కర్ణున కంగరాజ్యాభిషేకంబుఁ గావించుట

శాస్త్రకోవిదులు ముత్తైఅంగులయినవారు రాజనామముతో వెలయుదు రనెదరు. వారు సత్కులప్రసూతులును, శూరులును, బహు సేనలుగలవారునుగనున్నారు. అయినను నర్జునుండు రాజుగానివానితో యుద్ధముఁజేయరా దందురేని యిదె యిప్పుడ కర్ణుని నంగరాజ్యమునకే నభిషేకించెద నని చెప్పి దుర్యోధనుఁడు మంత్రవేత్తలగు పురోహిత బ్రాహ్మణులను రావించి యచ్చోటికి బంగారుసింహాసనము నొకదానిని దెప్పించి కర్ణుని దానియం దాసీనుంగాఁ జేసి, పుష్పాక్షతలతోఁగూడిన వియు, మంత్రపూతములునగు దివ్యసలిలంబులను బంగారుకలశముల తోఁదెప్పించి యానీటితోఁ గర్ణునికభిషేకంబు గావించె. వెంటనే కర్ణుండు రాజోచితఛత్రచామరములతో జయజయధ్వానంబుల దిక్కులు పిక్కటిల్ల రాజ్యలక్ష్మితోఁ గూడినవాఁడై మిక్కిలి సంతోషించెను. అంతఁ గర్ణుండు దుర్యోధనునిఁ జూచి యిట్లనియె. రాజశ్రేష్ఠుఁడా! నీ వీసకలరాజసమక్షంబున నాకొసంగిన రాజ్యదానమునకు నేను నీ కేప్ర త్యుపకారమును జేయువాఁడను? అని యడుగఁగా దుర్యోధనుండు నీవంటిపరాక్రమశాలిమైత్రిఁ గోరి యిట్లు చేసితిననెను. అంతఁ గర్ణుం డంముల కొడంబడఁగా వా రిరువురును బరమానందమునఁ దేలియాడిరి. అంత సూతుండు రథము దిగి మిక్కిలి యానందముతో రంగస్థానమును జేరి కుమారుండై నకర్ణుం డంగరాజై నందుల కాతని నభినందింపవచ్చెను. అప్పుడు కర్ణుండు వానియెడలఁ దండ్రిభావముచూపి నమస్కరించెను. అప్పుడు సూతుఁడు పుత్రుని లేవనెత్తి రాజ్యాభిషేకసేచనమునఁ దడిసిన

వెంట్రుకలను దన యానందబాష్పములతో నభిషేకించి యిరువురును
బ్రీతిమై నుండఁగాఁ బుత్రుని సూతుండు కౌఁగిలించుకొనెను. అప్పుడు
భీమసేనుండు కర్ణుని సూతపుత్రునిఁగా నెఱింగి యిట్లనియె. సూతపుత్రా!
కర్ణా! నీకు నర్జునునితో ద్వంద్వయుద్ధము చేయఁదగునే? వంశక్రమా
గతం బగు సారథికార్యము ములుగోలఁ జేతఁ బూని యొనర్పుము.
యాగశాలలో నగ్నియందు వేల్చునిమిత్తము తెచ్చియున్న హవిస్సు కుక్క
కర్హ మగునే? అవ్విధంబున మహానుభావు లగు క్షత్రియుల కుచితమైన
యీయంగరాజ్యసింహాసనము నధిష్ఠించుటకు నీవు తగుదువే? అని
తిరస్కారముతోఁ బలుకఁగాఁ గర్ణుండు మిక్కిలి కోపముతో వాని
నేమియు నన నేరక వేడినిట్టూర్పులు వటలుచు గగనంబున నున్న
సూర్యునిదిక్కు మొగంబై యూరకుండెను. అప్పుడు దుర్యోధనుండు పద్మా
కరంబు వెలువడుమత్తగంధసింధురంబుఁ బోలె సోదరులమధ్యమం దుండి
పొడసూపి భీమున కిట్లనియె. వృకోదరా! నీ కిట్లు పలుకుట దగదు.
రాజులు బలవంతులైనవా రెవరైనను వారితో నెల్ల యుద్ధము సేయ
వలసియుండును. శూరులజన్మమును, నదులజన్మమును, నేఱులజన్మమును
నెవరికైనను నెఱుఁగఁదగునా? సర్వలోకములను గాల్చి పవిత్రముఁ జేయు
నగ్నిహోత్రుం డుదకంబునఁ గాదె పుట్టెను. మహేంద్రుని వజ్రాయు
ధము దధీచియెముకను బుట్టదే? భగవంతుండగు కుమారస్వామి కృత్తిక
లకుఁ గుమారుఁడనియు, గాంగేయుండనియు, నగ్నికిఁ బుత్రుండనియు,
గుహుండనియు, శరవణభవుం డనియు సుప్రసిద్ధుఁడుగ నుండఁడా?
ద్రోణాచార్యుండు ద్రోణమునఁ గాదె జనించినది? శారద్వతుండు
శరస్తంభమునఁ బుట్టుట నెఱుంగమే? భూపరిపాలన నిమిత్తము సత్క్ష
త్రియులు విప్రులవలనఁ బుట్టరే? క్షత్రియకుమారు లగు విశ్వామిత్రా
దులు తపంబు పెంపునఁగాదే బ్రాహ్మణోత్తము లైరి. ఇం తేల? మీపుట్టు
కలక్రమము నందఱెఱింగినదే కదా? దివ్యలక్షణలక్షితుండును, సహజ
కవచకర్ణకుండలుండును నగు నీకర్ణుండు సామాన్యప్రకృతి పురుషుండు
గా నేరఁడు. తనబాహుబలమున నీయంగరాజ్యమునకే కాక, సకల మహీ
రాజ్యమున కర్హుండగు నే నిప్పుడు కావించిన యతని రాజ్యాభిషేకంబు
నంగీకరింపనివాఁడే వానికి సహాయుండనై యుండునాతో నిప్పుడు
ద్వంద్వయుద్ధమును జేసి జయమునో పరాజయమునో రెంట నొక్క

దానిని బొందుఁగాక యని చెప్పెను. దుర్యోధనుం డిట్లుపలుకుచుండఁగనే రంగమున హాహారవంబులు కలిగె. వీరల కిది యుద్ధమునకుఁ గాలము కా దని తలఁచెనో యనునట్లు సూర్యుం డస్తాద్రిగతుం డయ్యె. దుర్యోధనుఁడు కర్ణునిచేతులను దనచేతులం బట్టికొని కరదీపములు వెలుఁగఁ, బరిచారకులు వింజామరలు వీచుచుండ, సేవకుఁ డొక్కఁ డాతపత్త్రంబు పట్టఁగా నిజసదనంబునకుఁజనియెను. పాండవులు భీష్మద్రోణకృపవిదురాదుల తోడఁ దమతమ నిలయంబులకుం జనిరి. జనులు కొందఱు ఫల్గునుని నుతించిరి. మఱికొందఱు కర్ణునిఁ గొనియాడిరి. వేఱొకకొందఱు దుర్యోధనునిఁ గీర్తించిరి. ఇట్లు జనులు నోటి కొకమాటగా రంగస్థలమును వీడి యందఱును దమతమయిండ్ల కేఁగిరి. కుంతీదేవి సహజకవచకర్ణకుండలమండితుండైన కర్ణునిఁ దనపుత్త్రునిఁగ నెఱింగి తనలో నానందించుచుండె. దుర్యోధనుండు తనకు శూరుం డగుకర్ణుండు సఖుఁ డయ్యెనుగదా యని యర్జునునివలన వెఱపుడిగి యొమ్మునఁ జేయిడి ముదితాత్ముండై నిదురవోవుచుండె.

## కౌరవపాండవులు గురుదక్షిణార్థంబు ద్రుపదుం బట్టఁ జనుట

అంత నొక్కనాఁడు ప్రభాతసమయమున నాచార్యుండు శిష్యుల నెల్ల రావించి నాకు గురుదక్షిణ యిం డనిన నంద ఱాచార్యునకు మ్రొక్కి యెదుర నిలిచి మీ కెద్ది యిష్టంబు సెప్పుం డనిన విని యవివేకకారణదారుణైశ్వర్యావలిప్తుండైన ద్రుపదు నొడిచి పట్టితెండు. ఇదియ నాకు గురుదక్షిణ యని పంచిన రాజకుమారు లెల్ల ద్రుపదుం గట్టి గురునకుఁ దెచ్చి సమర్పింతు మని యుల్లాసమున రథంబు లాయితము సేయువారును, గవచములను దొడుగువారును, దారుణఖడ్గాది సాధనముల ధరించువారును, వింటిని నమ్ములను దూణీరంబులను ధరించువారును నై యొకనికంటె మఱియొకఁడు ద్రుపదునిపై యుద్ధమునకు సమకట్టి యాచార్యునితోఁ గూడికొని పోవుచుండ నర్జునుం డా యాచార్యున కిట్లనియె. వీ రందఱును దాము ద్రుపదుం బట్టి తెత్తుమని యొకరికి ముం దొక రుత్సాహముతోఁ బోవుచున్నవారు. వీరిలో నొక్కండైనను ధ్రుపదుం బట్టి కట్టికొని తేలేఁడు. వీ రెల్లరు ముందు

పోయి పౌరుషమును జూపి వచ్చిన పిదప మేము పోయి యాతని నోడించి సాహసమునఁ బట్టి మీకు సమర్పించెదము. అని చెప్పి పాంచాలపురమున కర్ధక్రోశంబునఁ దనయన్నదమ్ములతో విడిసియుండెను. కౌరవకుమారులగు దుర్యోధనదుశ్శాసనులును, యుయుత్సువికర్ణులును, జలసంధసులోచనులు మున్నగువారు కర్ణుని ముందిడికొని పాంచాలపురముం జేరి రాజమార్గమున వీరాలాపంబు లాడుచుం బోవుచుండుట ద్రుపదుం డెఱింగి సర్వసేనలను సమకూర్చుకొని సోదరసహితుండై వచ్చి కౌరవసేనను దలపడియెను. ఇట్లిరువాగులవారును జేతులుకలిపి యుద్ధోన్ముఖులైరి. అప్పుడు ద్రుపదునిసైన్యము విజృంభించి కౌరవసైన్యమును గొట్టి తరుముచుండెను. కౌరవులు శత్రుసైన్యవిజృంభణమునకు వెఱచి పాఱుటకు యత్నించిరి. అప్పుడు ద్రుపదసైన్యమున భేరీభాంకారరవములును దుందుభినిస్వనంబులును దెల్లుగ దెసలు బీటలువాఱ విజృంభించెను. అంతఁ గర్ణదుర్యోధనాదికురుకుమారులు ద్రుపదుకయిని నంప వానఁ గురియించిరి. అప్పుడు ద్రుపదుండు వీరావేశంబునఁ గౌరవసైన్యంబు సొచ్చి మేఘంబులు కమలములపై బోరన వర్షధారలఁ గురియించునట్లు కౌరవకుమారులపై ననేకశరజాలంబులు గురియుచుండఁగాఁ గాంపిల్యనగరములోని వీరభటులు ఖడ్గముసలగదాద్యాయుధసమేతులై కౌరవభటుల నానావిధప్రహారణంబుల నడచిరి. ధార్తరాష్ట్రులును గొంతసేపు వెనుదీయక ద్రుపదునిసైన్యమును దట్టుపుగు బాణసమూహములఁ బ్రయోగించి యెూహటించిరి. ఇవ్విధమునఁ గౌరవులు బాణపరంపరలు గురియుచుండఁగా ద్రుపదుండు చిత్రశీజల్లుల కెగుర మహావృషంబుసూడ్కిఁ దల దాఁచుకొనుచు శత్రుసైన్యమును నతిలాఘువమున శరపరంపరలఁ బ్రయోగింపఁగా గౌరవకుమారుల కవచముల నా బాణములు చించి చెండాడెను. కౌరవులు ద్రుపదుబాణములపరంపరకు నిలువ లేక చిక్కుపడిరి. ఇవ్విధంబునఁ గురుకుమారులందఱును కుమారస్వామిబాణములచేఁ గొట్టుపడిన సురారికుమారులు వోలె వెఱచఱచి పాండవు లున్నచోటికిఁ బోఁగా నర్జునుం డాచార్యునకుఁ బ్రణమిల్లి గురువునాజ్ఞం గొని, ధర్మజునకు నమస్కరించి జ్యేష్ఠానుమతిం బడసి వార లందఱ నక్కడ నుండం బనిచి తా నొక్కఁడుగాఁ జని ద్రుపదునిఁ బట్టి కట్టి తెచ్చెద నని విజృంభించి మహాసంరంభం

బున భీమసేనుండు తనవాహిని కగ్రేసరుండు కాఁగా మాద్రేయు లర్జు
నునిరథమునకుఁ జక్రరక్షకులు కాఁగా ద్రుపదుసైన్యము సమీపంబున
కేఁగెను.

## అర్జునుఁడు ద్రుపదుం బట్టి కట్టి తెచ్చుట

అంత మహామకరంబు సముద్రములను సల్లకల్లోలము చేయు
రీతి భీముండు గదాపాణియై ద్రుపదుగజములఁ గొట్టసాగెను. ఆయేనుఁ
గులును వజ్రాయుధంబున ఱెక్కలు నఱుకఁబడఁగా విగతచేతనంబు
లైనకొండలువోలెఁ దలలు వగిలి నెత్తురు కేఱులు కాఁగా గ్రిందఁ
గూలెను. మఱియును గుఱ్ఱపుదళమును బదాతివర్గమును రథసమూహ
మును గోపాలుఁడు గోవులను దండమునంబోలె గదాప్రహారణంబులఁ
గొట్టుచుండెను. ఇవ్విధంబున భీముగదాభిఘాతంబున ద్రుపదుసైన్య
మంతయు నివ్వెఱపడి చూచుచుండెను. అంత నర్జునుఁడు గురువు నభిమ
తంబుఁ దీర్చునిమిత్తము ద్రుపదుసైన్యముపై విజృంభించి రథములరా
పాడి, యేనుంగులఁ బీనుంగులు గావించి, గుఱ్ఱములఁ గూల్చి, పదాతులం
బిలుకుమార్చి, ప్రళయకాలపుటగ్నింబోలెఁ బ్రజ్వరిల్లుచు ద్రుపదురథ
మును జుట్టిముట్టు యంపసోనలు గురియింప సత్యజిత్తుతోఁ గూడిన
ద్రుపదుండు పరాక్రమాతిశయంబున మహేంద్రునిపై విజృంభించు శంబ
రునిచాడ్పున నర్జునునిపైకిఁ దనరథంబుఁదోలించిన నమ్మహారథుపై నర్జునుం
డనేకధారాపాతంబులవడువున శరధారలం గురిపించెను. అంత నర్జునుశర
ధారలమధ్యమున ద్రుపదుం డదృశ్యుం డగుటయుఁ బాంచాలసైన్యం
బున హాహారవంబులు చెలఁగెను. అంతసత్యజిత్తుండు ద్రుపదుని సంరక్షించు
నిమిత్త మెదిరించి శత్రుసైన్యమును బాణపరంపరల నొప్పించుచుండ
నయ్యిరువురు పరస్పర విజయకాంక్షతోఁ బోరుచుండు నింద్ర
బలుల ననుకరించిరి. అంతఁ గొంతసేపటికి సత్యజిత్తు నర్జునుండు నివా
రించి వానిపైఁ బదిబాణములు ప్రయోగించెను. అంత సత్యజిత్తు పార్థుపై
నూఱుబాణంబులు వేయఁగా నర్జునుఁడు వానినన్నింటిని సన్నిబాణము
లతో నడుమన తునియునట్లుగొట్టి వానిధనుస్సు విఱిచి యంతతో వాని
తావలకుఁదోలి ద్రుపదుపైఁబరాక్రమించెను. అంత సత్యజిత్తు సంతటితోఁ

బోక వేఱొకవిల్లుగొని యర్జునునిపైకిఁ గవిసి వానిరథ్యములను సారథిని నొచ్చునట్లు కొట్టఁగా నర్జునుండు క్రోధమూర్తియై చెలరేఁగి వానిధనుస్సును మరల భగ్నముగావింప, వాఁడు మఱియొండు ధనుస్సుఁగొని యర్జునునిపైనురవడించె.అట్లురవడించుటయుఁ బార్థుండు వేగమున నావిల్లునుం గూడఁ దునిమి, వెంటనే సత్యజిత్తురథధ్వజమును గూల నేసి, యశ్వంబుల యమలోకంబున కనిచి, సారథి నంతకుపురి కతిథిగాఁబంపి, చక్రరక్షకులఁ జిందరపందర లగునట్లు చెండాడుటయు సత్యజిత్తు యుద్ధమునకుఁ బరాఙ్ముఖుం డయ్యెను. అంత నర్జునుండు పాంచాలపతిం గవిసి యాతనిధనువుదునిమి టెక్కెమును గ్రిందఁబడఁ ద్రొబ్బి, యైదమ్ములనాతని రథగథ్యములను వధింప, ద్రుపదుండు వేఱొకధనుస్సును నమ్ముల పొదిని గ్రహించుచుండఁ బార్థుండు సింహనాదంబు చేసి చేత ఖడ్గముం బూని ద్రుపదురథంబుపైకిఁ గవిసి నొగలపైకి లంఘించి రథమధ్యంబు సేరి పాంచాలసైన్యంబు వెఱచఱచి వెన్నిచ్చి పాఱుచుండ నాద్రుపదుం బట్టికొని వానిసైన్యమును దుత్తుమురు సేయుచున్న భీమసేననకులసహదేవులం జూచి, యీపాంచాలపతి మనకు బంధువు. ఈతనిసైన్యమును జంపవలదు. ఆగుఁడు. ఇదె మనవచ్చినకార్యంబు సఫలం బయ్యె. వీని మనయాచార్యుసన్నిధానమునకుం గొనిపోయి యాతనియభిమతంబు మేరకు నితనిని గురుదక్షిణగా సమర్పించి ధన్యుల మయ్యెదముగాక యని వారిని ద్రుపదుసైన్యవధోద్యోగము నుండి నివారించి యాపాంచాలపతిం బట్టి ద్రోణాచార్యునకుఁ గానుకగా సమర్పించెను.

అంత గర్వముడిగి తమకు వశుఁడై యున్న ద్రుపదుని ద్రోణాచార్యుండు సూచి తనపూర్వవైరమును దలపోసి, యోపాంచాలరాజా ! నీకాంపిల్యపురంబు మాచేఁ జిక్కెను. ఇంతట నైన నన్ను నీపూర్వసఖుండనగు ద్రోణుండు నని యెఱుంగుదువే? పూర్వసఖ్యంబును నీకనైనఁ బాటించి వర్తింతువే? యని యుల్లసం బాడి మఱియు నిట్లనియె. రాజా! వెఱవకుము. మేము బ్రాహ్మణులము. పరమశాంతమూర్తులము. పసితనమునం దగ్నివేశునియాశ్రమంబున సహాధ్యాయులమై మెలఁగుచుండిన కారణంబున నాకు నీయెడఁ బహువిశ్వాసమున్నది.ఇప్పుడును బాల్యమునందు వలెనే నీతోడి చెలిమి నపేక్షించియుండువాఁడను. నేనెల్లప్పుడును రాజ్యా

ముందు రాజులతోఁ జెలిమిగలవాఁడను. ఇప్పుడు నీ రాజ్యమెల్లను మా యధీనమైయుండుట నీకు రాజ్యము లేదు. నీవు రాజ్యము లేని రాజుగా నుండుటం జేసి మాబోఁటివారి చెలిమికిఁ దగియుండవని మే మిప్పుడు గెల్చిన నీ మహావద్రాజ్యమున సగముతోఁ జెలిమిఁ బాటించునిమిత్తము నీకు మరల నర్ధరాజ్య మొసంగెదము. గంగకు దక్షిణదేశమునకు నీవును, గంగోత్తర దేశమునకు నేనును ప్రభువులమై పాలించుదము. ఇవ్విధంబున మాతోడి చెలిమి నీ కభిమతంబే? యని చెప్పఁగా విని యాభూసురవర్యా! శూరులకును శాస్త్రజ్ఞులకును నగు మీవంటివారి కిట్లు కరుణఁ జూపుట యొకవింత కానేరదు. నేను నీతో శాశ్వతసఖ్యమును నెఱపెదను. మిక్కిలి ప్రీతితో మెలఁగెదను. అని చెప్పుచుండఁగనే ద్రోణాచార్యుండు ద్రుపదు బంధనంబులనుండి వదలించి యథేచ్ఛముగ విడిచిపుచ్చె. అంత ద్రుపదుండు చర్మణ్వతీనది హద్దు గలిగి గంగకు దక్షిణపార్శ్వంబున మాకంది కాంపిల్యనగరములు రాజధానులుగా దక్షిణపాంచాలదేశమునకు మాత్ర మధిపుండై పాలించుచుండె. అప్పటినుండి ద్రుపదుండు తాను క్షత్రియబలమున ద్రోణాచార్యుని గెలువ లేనని నిశ్చయించుకొని బ్రాహ్మబలమున నతని సాధించువాఁడై సంతాన మప్పటికి లేనివాఁడు కావున పుత్త్రలాభము నపేక్షించి బహుదేశసంచారముఁ జేయుచుఁ దపస్వులగు మునిచంద్రుల సేవించుచుండె. ద్రోణాచార్యుండును నర్జునుని పౌరుషకార్యమునకుఁ బరాక్రమమునకు మెచ్చి పాంచాలరాజ్యమును గంగోత్తరప్రదేశమున నహిచ్ఛత్రమను పట్టణంబు రాజధానిగా నియమించుకొని యేలుచుండెను.

## ధృతరాష్ట్రుఁడు ధర్మరాజును యువరాజుం జేయుట

అంత నొక్కసంవత్సరము గడచెను. కురుకుమారులలో జ్యేష్ఠుం డగు ధర్మరాజు ధృతిమంతుఁడును, స్థైర్యవంతుఁడును, సహిష్ణువును, ననృశంసుఁడును, నకుటిలుఁడును, భృత్యులయెడ ననురాగసౌహార్దములు గలవాఁడునై నేర్పును నోర్పును గలిగియుండుటను ధృతరాష్ట్రుండు బాగుగ గమనించి యాతండు ప్రజలను నేర్పుతోఁ బాలించునని తలంచి యతనిని యువరాజుం జేసెను. అంత ధర్మపుత్త్రుండు ప్రజారంజనము గలుగు

నట్లు రాజ్యమును బాలించుచు వినయసదాచారగుణములఁ దనతండ్రియగు పాండురాజునకంటె నధికుండని ఖ్యాతిఁబొందెను. భీమసేనుండు బలరామునకు శిష్యుండై గదాయుద్ధపరిశ్రమమునందును, ఖడ్గసాధనవ్యాయామమునందును, రథములందుండి యుద్ధముఁ జేయుటయందును నిపుణత్వమును బొంది ద్యుమత్సేనునికైవడి మిక్కిలి శరీరబలమును బొంది పరాక్రమవంతుండై యన్నదమ్ముల కనుకూలప్రవర్తనుండై యుండెను. అర్జునుండు ధనుస్సును గట్టిగాఁ బిడికిటఁ బట్టుకొని, యెదిరి వ్రేళ్లపై నెంతగొట్టినను ధనుస్సును వీడకయు, బాణములను వేవేగ ధనుస్సునందు సంధానము గావించి ప్రయోగించునప్పుడతిలాఘవమును, సౌష్ఠవమును గానుపించుచుండుటయు, వివిధాయుధములను వాడునప్పుడు మిక్కిలి చాతుర్యమును గాన్పించుచుండుటయు మున్నగువానియందెల్ల నసమానపాండిత్యము గలిగియుండుట యెఱింగి యీ కారణములచేతనే యొకప్పుడు ద్రోణాచార్యుండు పార్థునకు మెచ్చి బ్రహ్మశిరోనామకాస్త్రమును సమంత్రకముగ నర్జునున కుపదేశించియుండుట, నాయుపదేశమును గొనినందులకు *గురుదక్షిణగా నర్జునుండు తనతోడ నెప్పుడైనను నెదురై యుద్ధము సేయవలసివచ్చినప్పుడు మర్యాదతో నూరకుండక యుద్ధము చేసి తీరవలయునని కోరెను. అంత నర్జునుండు గురువునకు సాష్టాంగదండప్రణామముల నాచరించి గురునియభిమతంబు సేయ నీయకొనెను. అంత నాచార్యుండు శిష్యునకుఁ బ్రియంబుగ నాశీర్వదించెను. ఇవ్విధంబున ద్రోణాచార్యుల యాశీర్వచనమహిమమున దేజోవంతుండై వెలయుచున్న యర్జునుండు బహుకాలమునుండి కౌరవరాజ్యమునకు విపత్తును గలిగించుచున్నవాఁడును, మూఁడేండ్లు యాగముల నొనరించి విఖ్యాతియశుండై పాండురాజునకును గూడ లొంగనివాఁడును నగు విపులుండను సౌవీరరాజును, సోదరయుతుండైన దత్తామిత్రుని యుద్ధమున మార్కొని చంపెను. పదంపడిఁ దా నొక్కరుండ రథారూఢుండై చని కౌరవరాజ్యమున కపకారములు గలిగించుచు

* తెనుఁగుభారతమున యుద్ధమున దన్నెదిరిపోరాడరాదని యున్నది. సంస్కృతమే సమంజసము. ఏలయనఁగా నర్జునుం డెన్నిపర్యాయములో ద్రోణునితో యుద్ధము చేసినటుల నిదర్శనము లున్నవి.

ప్రాగ్దేశవాసు లగు పదివేవురు రథికుల నొక్కమ్మడి పార్థుండు తలపడి నుఱుమాడి నానాపార్శ్వములయం దుండుశత్రురాజులతోఁ బోరాడి గెలిచి వారలను గౌరవరాజ్యమునకుఁ గప్పములును గానుక లును నొసంగునట్లు దిట్ట మొనర్చి యపరిమితధనముం గొని హస్తినా పురముఁ జేర్చెను. కవలును మహాసీయుం డగు ద్రోణాచార్యునియొద్ద విశిఖాస్త్రప్రయోగోపసంహారంబుల నేర్చి యతిరథు లను కీర్తిగలవారై కౌరవరాజ్యమునకు శత్రువులుగా నుండురాజవరు లనేకులతోఁ బోరాడి వారివలన విస్తారధనముం గొనివచ్చి కౌరవరాజ్యంపు బొక్కసముల నిండించిరి ఇవ్విధమున సోదరులు తమశౌర్యప్రతాపంబులచేఁ గౌరవ రాజ్యమును రక్షించుచుండఁగా యుధిష్ఠిరుండు ధర్మమార్గమున గౌరవరాజ్యప్రజల నేలుచు సుఖమై యౌవరాజ్యపదవిని నధిష్ఠించి యుండె.

## కణికుఁ డనుమంత్రి *ధృతరాష్ట్రునకు నీతినిఁ జెప్పుట

ఇవ్విధంబునఁ బాండురాజపుత్రులు నలుదెసల విఖ్యాతపురుషులై తేజరిల్లుచుండ ధృతరాష్ట్రుండు వారియభివృద్ధిని నోర్వలేక కణికుం డను వృద్ధబ్రాహ్మణమంత్రిని నేకాంతమునఁ బిలిచి యాతనితో నిట్లాలో చించెను. పాండవులు దినదినప్రవర్ధమానులై రాజ్యముయొక్క నలు దెసలయందు విఖ్యాతపురుషు లగుచున్నారు. నాకు వారియెడ నసూయ పొడముచున్నది. వారితోఁ గలసియుండుట మేలా? లేక, వారితో నిగ్రహించి మనుట మేలా? ఏది యుపాయమో లెస్సఁగా నాలోచించి తగినయాలోచనను నాకుఁ జెప్పు మనఁగా ధృతరాష్ట్రునకుఁ గణికుం డిట్లనియె.

కౌరవరాజా! సావధానుండవై నాపలుకులను వినుము. రాజెల్ల ప్పుడును దండవిధానము నవలంబించి పౌరుషమును బ్రకటించుచుండ వలయును. తన్మూలమున సర్వజనులు వానికి విధేయులై సక్రమముగ సకలకార్యముల నొనర్తురు. తనయవయవముల నన్నింటిని ముడుచుకొని యుండుతాఁబేటిచాడ్పున నీతిపరుం డగురాజు తనలోపములను గప్పి

*ఇది తెనుఁగుభారతమున దుర్యోధనున కుపదేశించినటు లుదాహరించియున్నది.

పుచ్చికొని పరరంధ్రాన్వేషణపరుండై శత్రువు లడుగంటునట్లు మెలఁకువతో వర్తిల్లవలయును. అట్లు నిరవశేషంబుగాక శత్రువులలో నెవఁడేని యొక్కఁడు మిగిలినచో వాఁడు సగము నఱుకఁబడి పెఱసగము కాలవశమువలనఁ జిగిరించి విస్తరిల్లు ముండ్లపొదచాడ్పున రణమునవశ్యంబు గలిగించువానింబోలె నేదైన హానిఁ దప్పకచేయుచుండును. కావున నపకారియగుశత్రువు కాలబలమువలన ధనపౌరుషబలములచేఁ బరాక్రమవంతుండై యుక్కుమీఱియున్నను వానిని దరి వేచియుండి మొదలంటఁ బెఱికి నశింపఁజేయవలయును. మఱియును బగతుండు బలహీనుఁడని లక్ష్యముంచక యుపేక్షచేయఁగూడదు. ఏలయనఁగాఁ గాలక్రమంబున నతఁడు బలవత్సహాయుండై రాజ్యమున నుండు దృఢదుర్గముల నాక్రమించుకొని వనమున నెచ్చటనో యొక్కపుల్ల నాశ్రయించియున్న యగ్నిహోత్రుండు కాలవశమున వాయుప్రేరితుండై విజృంభించి వనము నెల్లఁ గాల్చురీతి విస్తరిల్లి దృఢముగ నాఁటుకొని యెంతచెఱుపైనను జేయును. శత్రువు శరణని కాపాడు మని కాళ్లమీఁద బడినను వాని రక్షింపరాదు. ఒకానొకప్పుడు పగతుఁడగు రాజు తనకంటె బలాధికుఁ డయ్యెనేని రాజు చెవిటివానింబోలె, గ్రుడ్డివానింబగిది సమీపమున నెయ్యది పలుకఁబడినను, నెయ్యది యాచరింపఁబడినను నేమియు నెఱుంగనివానిఁబోలె నుండి, వేఁటకాఁడు వనంబున వేఁటకుఁ బోయినప్పుడు మాయనిద్రపోయి పొంచి మృగములకు మచ్చికఁ గలిగించి యవి సమీప వర్తులు కాఁగాఁ దటాలునవానిని నొడిసిపట్టుకొని వధించురీతిఁ దానణఁగి యేమియు నెఱుంగనిబాలిశుఁబోలె నుండి కపటము నవలంబించి తగినసమయము రాఁగ విజృంభించి పగతుని రూపుమాపవలయును. బలీయములగు దుర్గముల నాక్రమించికొని శత్రువులనైశ్వర్యమును హరింపవలయును. మఱియు నప్పుడప్పుడు గూఢచారు లగు వేఁగువాండ్రమూలమున శత్రువునకుఁ దన ప్రతాపమహిమలను దెలుపుచుండవలయును. వేఁగులను శత్రువు నాప్తజనులతోఁ గలిసికొనునట్లు మంతనంబొనర్చి యాతనిగూఢవర్తన మెల్లఁ దెలిసి రాజప్రమాదుఁడై ధైర్యమును బూనియుండవలయును. శత్రువులయుత్సాహమును భగ్నపఱుపవలయు నన్నచో రాజు తనగూఢచారులమూలమునం దనశౌర్యము నపరోక్షముగఁ

ప్రకటించుచుండవలయును. ఒకప్పుడు రాజున కపకృతి గావించిన శత్రువును దానముచే జయింపవలయును. శత్రువుయొక్క బలమునకుఁ గారణము లగు నమాత్యులను, రాష్ట్రమును, కోటను, సైన్యమును, ధనాగారములను, ప్రకృతిపంచకమును, సామము, దానము, భేదము, దండము, ధనము, విషము, వహ్ని యను నేడును రూపుమాయునట్లు యత్నించుచుండవలయును. ఈయుపాయములలో సమయానుకూలమైనదాని నుపయోగించి శత్రువును గ్రుంకుడువ్రేళ్లతోఁ బెఱికివైచి నశింపఁజేయవలయును. ఇవ్విధమున వేరుతోఁ బెకలింపఁబడి క్రిందఁబడియున్న వృక్షమునఁ గొమ్మలు, పత్రములు వోలె నశించిన శత్రువుయొక్క యనుచరులుండినను వారు తమంతట నశింతురు గాని హాని చేయలేరు. ఇంతే కాక శత్రువును నానావిధ కపటోపాయములను బన్ని మొదలు లేకుండఁ జెఱుపవలయును. లోకమువైపున విరక్తుంబోలె నగ్నిం దఱికొల్పి హోమాదులయందు నిమగ్నుండై కాషాయదండములను ధరించి, జడలు దాల్చి లోకమునకును శత్రువునకును నమ్మకము గలిగింపవలయును. అని చెప్పఁగా ధృతరాష్ట్రుఁడు కణికు నిట్లడిగెను. ఓనీతిశాస్త్రజ్ఞుఁడా! శత్రువును సామ దాన భేద దండ విషవహ్నులచే నెట్లు నశింపజేయఁగలమని యడుగఁగా రాజునకుఁ గణికుండు వెండియు నిట్లనియె. మహారాజా! ప్రమాణములఁ జేసి కాని, ద్రవ్యము నిచ్చి కాని, సామవార్తల నాడి కాని, యాశఁ బుట్టించి కాని, వందనాదులచేఁగాని విశ్వాసముఁ బుట్టించి విషముఁ బెట్టియో, లేక యగ్నియందు వేసియో స్వరూపనాశమును గలిగింపవలయును. శత్రువువిషయమునఁ దనకుఁ గ్రోధ మతిశయముగ నుండినను, శత్రువు తనకు నానావిధములుగ హానినే చేయుచుండినను గార్యసాధకుఁడును నీతిపరుఁడు నగు రాజు వానిని మనస్సునకుఁ దెచ్చుకొనినవానింబోలెఁ దోఁపింపక నవ్వుచు హితవచనము లాడుచుండవలయును. ఒకసమయమునఁ గావించిన హానివలన శత్రువు మొదలంట నశింపకుండెనా, యపుడు వానియెడల నీతిపరుఁడు వెంటనే దయను దెలిపి తానేమియు నెఱుంగనివానింబోలె నుండుచు వానికిఁ గలిగినహానికిఁ దానును వగచుచు నానావిధములగు శాంతివచనములను, ధర్మోపన్యాసములను బోధించి తనయెడ శత్రువునకు

విశ్వాసము నశింపకుండ వర్తింపవలయును. ఇవ్విధంబున శత్రువున
కూడ డంపుఁబలుకులాడుచుఁ దాను ధర్మమార్గము నవలంబించియున్న
వానింబోలె వర్తిల్లినచో నెంతటి గుణప్రకృతి తనచేఁ గావింపఁబడినను
నాదోష మంతయు మేఘమును గప్పఁగాఁ బర్వతములు గానరానిచంద
మునఁ గపటధర్మప్రవర్తనమున వెలికిఁ దెలియకుండును. మఱియు నెవఁ
డైనను శత్రువు బలిష్ఠుఁడై చంపుట కలవిగాకుండెనా, వాఁ డున్నయిం
టిని వాఁడు పరుండి యుండఁగా నగ్ని నిడి దహింపవలయును. ధనములేని
వానిని, నాస్తికుని, దొంగను దేశమున నుండనీయక తఱిమికొట్టవల
యును. తన్ను నమ్మియున్న శత్రువునకు మాటలచే సహాయకమును జూపుచు
ఫల మొసంగక పూచియుఁ గాయలు కాయకయుండు చెట్టువలె వానికి
నాశఁగల్పింపవలయును ఒకవేళ ఫలము సంభవించినచో దానిని వాని
ననుభవింపనీయక యెన్నియో యంతరాయములను గల్పింపవలయును.
అప్పటికి లభించినచో వాని నపక్వపాకమున నొసఁగవలయును.
మఱియు బహువిధోపాయములను గల్పించి చెట్టునను గాచియుండు
కొమ్మను వంచి క్రమముగాఁ బక్వఫలములను గోయుచున్నట్లు దిన్నగా
శత్రువునకు గలబలమునకు నాశము గల్పింపవలయును. మఱియు
నీతిజ్ఞుఁ డగు రాజు తాను దుర్బలుఁడైనను బగవాని నెట్లో [illegible]
కాలమునుబుచ్చుచు, శక్తిపొడమఁగనే తా [illegible] యున్న వానిని హఠా
త్తుగ బండపైని గుండను బగులగొట్టినట్లు కొట్టి సంహరింపవలయును
గాని యూరక కృపఁ జూపరాదు. మఱియును శత్రువుల హెచ్చు
తక్కువల నాలోచించి సామదానభేదదండములలో దేని నెప్పుడు
ప్రయోగింపవలయునో యప్పుడు దాని నుపయోగించి గెలుపుఁగొన
వలయును,

నీవడిగియుండిన సామాద్యుపాయ ప్రయోగములవిషయమై నీ
కొక దృష్టాంతపూర్వకమగు కథను వక్కాణించెదను వినుము. దీని నీ
ప్రశ్నకు సమాధానము స్పష్టమగును. పూర్వమొక్క నిర్జనారణ్యం
బున నక్క యొక్కటి మిక్కిలి నేర్పుతో పులి గుంపు వ్యాఘ్రమూషిక
వృకనకులములతోడ సఖ్యముచేసి సుఖముగానుండెను. ఒకనాఁ డా మృగాల
మొక్కనాఁడు జింకలగుంపునకు మేతకై బయలుదేరియుండిన యువ

జింకను జూచి తాను దానిమాంసము నెట్లైనం దినఁ దలపోసెను. కాని తా నల్పజంతు వగుటచే దానిని బట్టుకొన లేక యొకనాఁడు వ్యాఘ్రమూషక వృక నకులము లొక్కచోఁ జేరి యాలోచించుచుండఁగ నానక్క వ్యాఘ్రముతో నిట్లనియె. పులిఱేఁడా! ఈజింకలరాయఁడు ప్రాయమున మిక్కిలి బుద్ధిమంతుఁడును, వేగవంతుఁడును నగుటం జేసి మనకుఁ జేతికిఁ జిక్కకున్నాడు. దీనిం బట్టి దీనిమాంసమును మనమంద ఱము నోరార భక్షింపవలయును. దీనిని మనము పట్టుట కొకయుపా యముఁజెప్పెద వినుము. ఇది యలసి నిద్రించుచుండఁగా నెలుకను దీని పాదములను దెగఁగొఱుకునట్లు నియమింతము. అంత పాదములు వ్రణితములై యిది మేల్కొని లేవలేకుండును. అప్పు డోశార్దూల రాజా! నీవు దీని నొక్కదెబ్బతో సంహరింపుము. అంతటఁ బోతరించి యుండు నీమృగముయొక్కమాంసమును మన మెల్లరము విభజించుకొని భక్షింతము. అని చెప్పఁగా నాకూడిన మృగములన్నియు నక్కలరాయని యుపాయమునకు సంతసిల్లి యట్లచేయుదమనెను. అంత నవి యన్నియు సమయమును గనిపెట్టి యుండి యొకనాఁ డామృగ మొకచోటఁ బరుండి నిదురించుచుండఁగా నక్క చెప్పిన ట్లెలుకయు శార్దూలము రెండును దానిని వధించినవి. అప్పుడు సృగాలము వానితో నిట్లుచెప్పెను. నే నీమృగశవమును గాచియుండెదను. మీరెల్లరును సమీపమునఁ బాఱు చుండునదియందు సుస్నాతులై శుచిత్వముతోఁ రండు. అంత మనమెల్ల రము కండక్రొవ్విన దీనిమాంసభక్షణము గావింత మనెను. అట్లు చెప్పి నక్కమిగిలినమృగముల నన్నిటిని మోసగించి తానే యామాంసమంత యును భక్షింపవలయునని యోచించియుండెను. అంత నక్కతప్ప మిగి లినమృగము లన్నియుఁ గలిసి స్నానమున కేటికిఁ బోఁగా వానిలో శార్దూలము వేగముగా మృగశవమును సృగాలమును నుండుచోటున కేతెంచెను. అప్పుడు నక్క మిక్కిలి దీనవదనముతోఁ జింతిల్లుచుండుటను దెలిసి వ్యాఘ్రము నక్కతో నిట్లనియె. ఓజంబుకమా! నీవేల యిట్లు దీనుఁడవై యున్నావు? స్నానార్థము మేము పోవునప్పు డుండిన యుత్సా హము నీనొసట నిప్పుడు గానను. కారణమేమి? అని యడుగఁగా నక్క పులితో నిట్లనియె. ఓవ్యాఘ్రరాజా! వినుము, నే నేమి చెప్పు

దును. నీవు స్నానార్థము పోయినవెంటనే యెలుక నాయొద్ద కేతెంచి యిట్లనియె. ఓసృగాలమా ! వ్యాఘ్రి మనఁగ నేమో బలిమి గలజంతు వని తలంచితిమి. కాని, యీపులి యెంతమాత్రపుజంతువు? అల్పుల మైనమనము సాధించినపదార్థమును భక్షింప యత్నించుచున్నది.అనిచెప్పి పోయెను. మహాబలపరాక్రమశాలి వగు నీవు దూష్యమైన యీకుత్సి తంపుఁగూడు గుడువవలసివచ్చెను గదా యని వగఁగూరి యున్నాను. అని చెప్పఁగా నాపులి యోనక్కలరాయఁడా ! అటులైనచో నా భుజపరాక్రమముననే యనేకమృగములను జంపి భుజింపఁగలను గాని యీకుత్సితంపుఁగూడు నా కేల యని చెప్పి యడవిలోనికిఁ జొచ్చెను. అంత నెలుక రాఁగా దానితో నక్క యిట్లనియె. ఓయెలుకా! వినుము. నీకంటె మున్ను ముంగిస యిచ్చోటికి వచ్చి యీమృగకళేబరము నాఘ్రా ణించి చూచి యీవిషప్రాయమైన మృగమాంసము నాకిప్పుడు వలదు. ఎలుక వచ్చుచుండఁగనే దాని నొక్కపెట్టఁగొట్టి యాహారించెద. అంతట నా యాఁకలి దీరఁగలదు. అందులకు నీ వొడంబడవలయు నని నాకుఁ జెప్పి మరల వచ్చెద నని చెప్పిపోయె ననఁగా మూషకము మిక్కిలి భీతిల్లి తనకలుఁగులోనికిఁ జొచ్చి, మరల వెలుపలఁ దల సూపకుండెను. అంతఁ దోడేలు సుస్నాతమై శుచిత్వముతో వచ్చుటయు నక్కదాని కిట్లనియె. ఓతోడేలా! వినుము. వ్యాఘ్రము నీదెసఁ గోపించియున్నయది. ఏమి కారణమో తెలియదు. అది యింకఁ గొంతసేపునకుఁ దనవారిఁ గొని యిచ్చోటికి రానున్నది. ఇఁక నెట్లు వర్తించిన నీ కపాయము లేకుండునో యూహింపుము. అని చెప్పఁగాఁ దోడేలు చేయునది యెఱుంగక 'ఛీ, యీమాంసమున కేల యాశించితిని ? దీనివలన నాకే హాని వాటిల్లున ట్లున్నది. కావున దీనియపేక్షను విడిచి యెందేనియుఁ బోయి బ్రతికియుండెద' నని చెప్పి యామృగమాంసమును వదలి పోయెను. అ ట్లుండ ముంగిస వచ్చెను. అప్పుడు నక్క ముంగిసం జూచి 'యోముంగిసా ! పెద్దపులియుఁ, దోడేలును, మూషికమును నాతో నీమాంసము నిమిత్తము పోరాడి నన్ను గెలువలేక పాఱినవి. నీ చేత నైనచో నన్ను గెలిచి మాంసమున భాగముఁ గొనుటో, మాంసము నెల్లఁ గొనుటో యొనర్పుము' అని కయ్యమునకుఁ గాల్గ్రు గీఱెను.

అప్పు డాముంగిస యోమృగాలమా! పెద్దపులియుఁ దోడేలును నీతోఁ బోరాడ లేక యోడిరవే? నే నెంతవాఁడను నీకు? నా కీమాంసము వలదని తానయిచ్చినమై నెచ్చోటికో యరిగెను. అంత నక్క మిక్కిలి సంతస మున నామృగమాంసము సంతయును మెక్కి సుఖముండెను. కావున దుర్బలుఁడైనరాజు నక్కవలె భయపడువానికి భయముఁజూపి, శూరునకు వందనము లాచరించి, లోభికి ద్రవ్య మొసఁగి, సమానునకును దక్కువ వానికిని బరాక్రమమునఁగనుపఱచి యెల్లవారిని దనవశులనుగఁ జేసికొని సుఖింపవలయును. ఐశ్వర్యమును గోరురాజు తనకుఁగొడుకైనను, సోదరుఁ డైనను, తండ్రియైనను, గురువైనను శత్రు వగు నేని వానికి నానావిధ ముల హాని చేయవలయును. అహంకారమునఁ దగినదానిని దగనిదానిని నెఱుంగక గర్వ మిన్ను గానక తనబలమును నెదిరిబలమును గుర్తింప లేక ప్రవర్తించు గురు వైనను శిక్షింప నర్హుండు. రాజు సంశయింపఁ గూడనివారియెడ నైనను సందేహించి ప్రవర్తించుచుండవలయును. అట్లు వర్తింపఁడేని వారికి జనువు మెండై యొకవేళ జనులు తిరుగఁబడిరేని రాజపదవికే ముప్పు దెత్తురు. ఇట్లుండ సంశయింపవలసినవారిని గుఱించి వేఱుగఁ జెప్పవలయునే? విశ్వసింపఁ దగనివారల నేనాఁడును విశ్వ సింప రాదు. విశ్వసింపఁ దగినవారిని నైతము పూర్ణముగ విశ్వసింపఁ గూడదు. యోగ్యులైన గూఢచారులను లెస్సగఁ బరిశీలించి యట్టివారిని శత్రురాజ్యములయందును, దేవాలయములయందును, రాజమార్గముల యందును, నుత్సవాదులు జరుగుచుండ, నూరేగింపునందలి జనులయం దును, చలిపందిళ్లయందును, నరణ్యములయందును, బర్వతసమీపముల యందును, నదీతీరములలోని స్నానఘట్టములయందును, మంత్రులమధ్య యందును, బురోహితబ్రాహ్మణులందును నునిచి వారిమూలమునను, మఱి యును బాషండజనంబులవలనను, తాపసులమూలమునను, గోపాలికాది వేషధారులవలనను సకల విదేశములయందలి వృత్తాంతములను నరయు చుండవలయును అదియునుంగాక చతుర్విధపురుషార్థములకుఁ బరస్పర విరోధము గలుగకుండ వానిఫలముల ననుభవించుచుండవలయును. రాజు గర్వింపరాదు. అసూయపడరాదు. పరిశుద్ధుఁడై యుండవలయును. ఇవ్విధ మునఁ బ్రజలతోను శుచులైన విప్రులతోను నతిశాంతుఁడై యుక్తా

యుక్తముల నాలోచింపవలయును. మఱియుఁ దాను దీనుఁ డగుస్థితి సంభవించె నేని యెట్టిసాహసము నైనను జేసి తనపదవిని గాపాడుకొన వలయును. ఎన్నివిధము లైనయుపాయములఁ జేసియుఁ గడతేర కున్న చో నతిసాహసము నవలంబించి తీరవలయును. అట్లు చేయుటయే పౌరుషము. అట్లు ప్రాణిహింసక కార్యముల నాచరించి శుభములను నైశ్వర్యమును బొందె నేని పుణ్యకర్మముల నాచరించి తొల్లింటి హింసాకృత్యముల వలనఁ గలిగినపాపములను బోఁద్రోవవచ్చును. పరమర్మములను భేదింపక దారుణకార్యములను జేయక మత్స్యఘాతకునిఁబోలె హత్యలఁ గావింపక యర్థార్జనమునఁ గృతార్థుండు కానేఁడు. కావున సర్వకార్యముల యందును నలసత లేకుండవలయును. సంగ్రహమునందుఁగాని, విగ్రహమునందుఁగాని యుత్తమసంపదఁ గోరువాఁ డసూయాపరుఁడై పనులను జేయుచుండవలయును. పగవానితో సంధి కుదిరినది గదా యని ఱొమ్మునఁ జే యిడి నిదురింపగాదు. అట్టివాఁడు చెట్టుకొనకొమ్మయందు నిదురించి మేల్కాంచువానింబోలె నాపదలను దప్పక పొంది చెడును. బాలశత్రువు నుపేక్షింపరాదు. అట్లుపేక్షించినచో వాఁడు తాటిచెట్టు ప్రమాణమునఁ బెరిఁగి హానిచేయును. మఱియును దఱి వేచియుండి శత్రుసైన్యము వ్యాధిపీడితమై యుండునపుడు గాని, యాఁకలికి దప్పికి నోర్వలేక డస్సియున్నపుడు గాని తనసైన్యమును దానిపై విజృంభింపఁజేసి గెలుపుఁగొనవలయును. ఏ కార్యమునుగాని చేయునప్పుడు నిరవశేషముగ నొనర్పవలయును. శత్రువులయొక్క కాని, ప్రజలయొక్క కాని, పనులను సశేషముగ నిల్పివేయుచుండవలయును. పూర్ణముగ నెఱవేర్చినయెడల మరలఁ గార్యార్థులై వారు మనల ననుసరింపరు. ఇంతేకాక తాను సంకల్పించినకార్యము పర్యవసానమునందుఁ దప్పఁ దదితరసమయములందు మంత్రులవంటి యాప్తవర్గమున కైనఁ దెలియ నీయక యుండవలయును అట్టికార్యముల తెఱంగులను సఖులు నైత మెంతమాత్ర మెఱుంగకుండ గోప్యముగా రక్షింపవలయును. శాంతితో మెలఁగువారితో సంధిఁ గావింపవలయును. కలహకారులతోఁ గలహించి ముల్లుముల్లునఁ దీయునట్లు నిష్కంటకముగ రాజ్యమును జేయుచుండవలయును. శత్రులవలన భయము లేనన్నినాళ్లును నీతిపరుఁడైనరాజు తాను భీతిల్లి యుండువాని

వలె నటించి భయము గలుగుచుండఁగనే పరాక్రమించి శత్రువును మొదలంట నశించునట్లు గొట్టవలయును. దండోపాయమున లొంగి వచ్చినశత్రువు నేనాఁడును నమ్మి వర్తింపఁ జనదు. వాని నెప్పుడును గరుణింపరాదు. అట్లు కరుణించినచో గర్భ మశ్వతరిని జంపువిధమునఁ గొంత కాలమునకుఁ దన్నుఁదాన హింసించుకొనువాఁడగును. ఎప్పుడును గార్యములయందు ముందే యాలోచించి జాగ్రత్తపడుచుండవలయును. ఎప్పటి కేదియవసరమగునో దానిని చేయుదమని మాంద్యముతో రాజేనాఁడును వర్తింపరాదు. దేశకాలముల నాలోచించి పురుషార్థములను నాల్గింటిని బరిశీలించి వర్తింపవలయును. బాలునైనను శత్రువును నుపేక్షింపరాదని మున్నే చెప్పియుంటిని. అట్టిశత్రువును వృద్ధిమార్గము నవలంబింపనీయక వాని కుపకృతులు గావించెడివానివలె నటించుచుఁ గోరికి దీర్ఘకాలమునకు ఫలింపదా యను పేరాశను వానికిఁ గలిగించుచుండవలయును. సమయ మాసన్నమైనచో నుష్ణచప్పనిమాటలాడి కార్యమునకు విఘ్నము చెప్పవలయును. ఆటంకములకుఁ దగిన హేతువుల నప్పుడు చెప్పవలయును. ఆయాటంకములు సకారణము లని వాని నప్పుడు నమ్మించి యుచితకాలమున వానిని ధ్వంసము చేయవలయును. అపకారులను, మ్రుచ్చులను, దాయాదులను నమ్మకముఁ దోఁపించు నాటంకములతోఁ జూపునకు సత్యములవలెఁ గాన్పించుమాటలఁ జెప్పి ధన మొసఁగి వారిని నిశ్శేష మగునట్లు రూపుమాయింపవలయును. కావున సకలవిధముల నపకారు లగుశత్రువులను, జ్ఞాతులను, బంధువులను నేమఱుపాటు లేక స్వశరీరమును రాజ్యమును సప్తాంగములనుగాపాడుకొనుటకై స్థలాంతరములకుఁ దోలఁగించి నిశ్శేషముగ వధింపవలయును. నీకుఁ బాండుపుత్త్రులు బలవంతు లగుదాయాదులు. కావునఁ గొనకు హాని రాకుండ సర్వకల్యాణములను బడసి సుఖివై యుండునిమిత్తము ప్రస్తుతముననే దీర్ఘాలోచన చేసి పశ్చాత్తాప మెంతమాత్రము లేకుండ, నిర్భయుఁడవై నిన్నును నీపుత్త్రులను రక్షించుకొను మనిచెప్పి కణికుఁడు ధృతరాష్ట్రుని సెలవుఁ బొంది తనయింటికిఁ బోయెను. ధృతరాష్ట్రుండు పాండవుల శౌర్యధైర్యగాంభీర్యాదివర్తనములనే తలపోయుచుఁ జింతాక్రాంతుఁడై యుండెను.

### దుర్యోధనుఁడు తండ్రితోఁ దనమనోదుఃఖముఁ జెప్పుకొనుట

ఇటులుండ నొక్కనాఁడు దుర్యోధనుండు కర్ణశకునిదుశ్శాసనులతోడ నాలోచించి యెవ్విధముననైనను బాండవులకుఁ జెఱుపు చేయుటకుఁ దీర్మానించుకొని ధృతరాష్ట్రునెలవుఁబొంది పాండవులను గుంతీసమేతముగ వారణావతంబున వారలనిమిత్తముగ నెవరికిం దెలియనీయక పురోచనుఁడను శిల్పాచార్యునిచేఁ గట్టింపఁబడియుండిన లక్కయింటఁజేర్చి వారందుఁ గొన్నినెలలు కాపురముండ నొక్కనాఁ డా యింటికి నిప్పుపెట్టి కాల్పించుటకు నిశ్చయింపఁగ వారాయింట నొకనిషాదినిం దానికొడుకుల నైదుగురును బురోచనుని నిదురపోవుచుండువానిని గాల్చి తత్పూర్వమే విదురుఁడు సెప్పి పంపఁగా వచ్చి యాయింటియందుండి చేరువవనమునకు భూమిలోనే సొరంగ మొకదానిని నిర్మించికొని యుండి తన్మూలమున వెడలి వనముం జేరిరి. వీరు వనముఁ జేరుసమయమునకు విదురుం డచ్చోటికి వీరిని గుర్తించుట కొకపురుషుని నియమించి యుండెను. ఆపురుషుండు తన్ను విదురుఁడు పంపె ననియు గంగలో సకలవస్తుసంపూర్ణంబైన యోడ నొకదానిని దాను సంసిద్ధపఱచి తెచ్చి యున్నాననియు నాయోడ నెక్కించి గంగను దాటించి యావలివైపున వనమునఁ దమ్ము వదలి రమ్మని విదురుఁడు తనతోఁ జెప్పియుండె ననియు నందు కానవాలుగాఁ గొన్ని సంకేతపుమాటలను ధర్మపుత్రునకుఁ దెలుపుమని పలికెననియుఁ జెప్పఁగా వానిమాటయందు విశ్వాసముంచి పాండవులు వానివెంట నరిగి యోడనెక్కి గంగలోఁ గొంతదూరము ప్రయాణమై యమ్మహానదీ దక్షిణతీరంబునందలి వనమునఁ గొంతకాలము వసించి యుండిరనిచెప్పఁగా జనమేజయుండు విని వైశంపాయనునితో నిట్లనియె. మునీంద్రా! పాండవులు తనకు విధేయులై తన పంపున రాజ్యమేలుచు సమస్తశత్రురాజులను జయించుచు ధనకనకవస్తువాహనములను గానుకలుగను గప్పములుగను గొనితెచ్చి కౌరవభాండాగారములను నింపించుచుండిరిగదా? మఱియు నందఱును వినయాదిసద్గుణములను, శత్రువులయెడఁ బరాక్రమమును, బంధువులయెడఁ బ్రీతియును, గురువులయెడఁ బరమభక్తియును, బరిజనులవిషయమున దయాళుత్వమును గల్గి

వర్తించుచుండ ధృతరాష్ట్రుండు వారలను వారణావతంబున కింత యసూయాపరుండై లక్కయింట నివసింపఁ బంపి, వారి కచ్చోట నింతహాని కలిగినచో నెట్లు సహించి యుండెఁ? విదురభీష్ములు దీని కియ్యకొనిరే? ఈ వృత్తాంతము నంతయు సవిస్తరంబుగ నానతిమ్మని యమ్మునీంద్రు నడుగఁగా నాతం డారాజేంద్రున కిట్లనియె. రాజా! వినుము. దుర్యోధనుఁడు పాండవుల కనేకాపకారములను జేయుచుండినను వాని నెల్ల విదురు నాలోచనముం జేసి తప్పించుకొనుచు నప్రమాదులై సుఖముతోఁ బ్రజల కనురాగము గలుగునట్లు రాజ్యపరిపాలనంబుఁ గావించుచుండిరి. అట్లుండఁ బురజను లెల్లరును ధర్మపుత్త్రుని పాలనకాలమునందుఁ బ్రేమ ప్రీతులై తమకు యుధిష్ఠిరుఁడే రాజైనచో సర్వసంపదలును సమకూరు ననియు, దేశమునఁ బీడ లెవ్వియు సంభవింపనేర వనియు, నాతండు దక్క రాజ్యాభిషేకమునకుఁ దగు మహాపురుషు డెవ్వం డనియు, భీష్ముండు నిష్ఠతో బహుకాలము క్రిందనే బ్రహ్మచర్యవ్రతపరాయణుఁడై రాజ్యపాలనాకార్యములయందు విముఖుఁడై యుండుచున్నాఁ డనిరిగాఁ, గావున నాతం డీరాజ్యము నెన్నండు నాశింపఁ డనియు, ధృతరాష్ట్రుఁడు పుట్టు గ్రుడ్డియగుకారణమున రాజ్య మేలుట కనర్హుం డనియు, నీ కారణంబుననే సుమా తొల్లి పాండురాజు మూర్ధాభిషిక్తుండయి ప్రజలఁ బాలించెననియు, నిప్పుడు ధర్మరాజు రాజయ్యెనేని గాంగేయుని, నాంబికేయుని, విదురుని, దుర్యోధనాదులను నపరిమితవిశ్వాసముతో దయతో భక్తిపెంపున నరయుచు వారి నఖిలరాజ్యభోగములయందుఁ బాల్గొల్పు ననియు, నీకారణంబులచే యుధిష్ఠిరుండే రాజగుటకు సర్వవిధముల నొప్పియున్నాఁ డనియుఁ దలంచుచు నీకౌరవరాజ్యమునకు యుధిష్ఠిరుఁడే రాజగు నని నిశ్చయించియుండిరి.

## దుర్యోధనుండు ధృతరాష్ట్రుని సమీపించి తనమనోదుఃఖముం దెల్పుట

దుర్యోధనుండు ప్రజలయభిప్రాయమునంతయు లెస్సఁగా గుర్తించి కర్ణశకునిదుశ్శాసనులతో దీర్ఘాలోచనము సలిపి పాండవులయెడ నసూయ తనమనమున నిండుకొనఁగా నొక్కనాఁడు తండ్రియొద్ద కేకాంతమునఁ బోయి యాతనియొద్దఁ గూర్చుండి యి ట్లనియె. నాయనా!

వినుము. ప్రజ లెల్లరు ధర్మరాజును రాజుం గావింప నిశ్చయించుచు న్నారు. యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకమహోత్సవయత్నము ప్రజల మనంబు నాకర్షించినది. అట్లు సమకూఱినచో మాకుఁ గాని, మావంశము వారికిఁగాని రాజ్యము లేక యనాథుల మయ్యెదము. ఈకష్టంపు బ్రతుకు కన్న నీచమొం డనుభవమున నుండనేరదు మఱియును మేమును రాజవగునీకుబిడ్డలమై వారొసఁగుదానికి వేచి యుండి వారికరుణాపాత్రుల మగుట దగియుండునే? నీవే రాజవైయుండి ప్రజలఁ బాలించియుంటి వేని నీయనంతరము క్రమముగ రాజ్యపాలనాధికారము మాకుం గలదు. ఈసందర్భమునందు భావికాలమున మాకేయాపద కలుగ కుండునట్టు లిప్పుడే తగుదానిని దలపోసి తీర్మానించుట మేలు అది యెటులంటి వేని చెప్పెద. వినుము. ఏదో యుపాయమును బన్ని పాండవులను హస్తినా పురమున నుండ నీయక వారణావతంబునఁ గుంతితో నివసింప నేర్పాట్లు గావింపుము. అట్లొనర్చిన నీపుత్త్రుల మగు మాకు సకలకల్యాణములు సేకూఱును. ఈకార్యమును నవశ్యముగఁ జేయవలెనని యనఁగా ధృత రాష్ట్రుండును, గణికుండు చెప్పిననీతులను మనస్సునకుఁ దెచ్చికొని దుర్యో ధనునిమనోదుఃఖము నాలోచించి కొడుకున కిట్లనియె. కుమారా! వినుము. తొల్లి నాతమ్ముండు పాండురాజు ప్రజలయం దనురాగము గలిగి ధర్మపరుండై యెల్లవేళలయందును వారియెడఁ గడుఁ బ్రేమతో మెలఁగు చుండెను. అన్న యగు నాయెడ భయభక్తులతో గౌరవమున కెంతయు లోపము లేక వర్తించెను. పెక్కు లేల? భోజనాసనవిహారశయనాద్యదు లను సైతము నాయనుజ్ఞ లేకుండ దేనిని జేయ నొల్లఁడు. అట్టి వినయ తత్పరుం డగు వానికుమారుం డగు ధర్మపుత్త్రుం డిప్పుడు తండ్రికంటె నూఱుమడుంగు లెక్కువగా నాయెడ మిక్కిలి భయభక్తులతో వర్తించు చున్నవాఁ డని రాజ్యమున నున్న ప్రజ లంద ఱెఱుంగుదురు. మఱి యుఁ బాండురాజు ప్రజలను దనకుమారులమాడ్కి నాదరించుచుండుట చే నాతనియెడ నుండుప్రీతివిశ్వాసములను బ్రజ లిప్పు డాతనియనంతర మాతనికుమారునియెడను గలిగి మెలఁగుచున్నవారు. నీయభిప్రాయము నామనస్సున నున్నను నిది మిక్కిలి దూష్యమైనది యగును. అంతే కాక యది నిశ్చయముగఁ బాపకార్య మగును. దానం జేసి యేమియు నన నేర కూరకుండువాఁడను. మఱియు నొక్కటి వినుము. మన యొక్క

టిరియై పాండవులకు హాని దలఁచితి మేని వారియం దత్యంతానురా
గమున వర్తిల్లుచుండు ప్రజ లెల్లరును మనకుఁ గీడు రోయుదురు. మఱి
యును ధర్మాసక్తు లగు భీష్మద్రోణకృపవిదురులు మనలను దూషింపక
మానరు. ఆలోచింపఁగా నీయాలోచన యెట్లొనర్ప నగునా యని
మనమునఁ దలపోయుచున్నా నని చెప్పఁగాఁ దండ్రికిఁ గుమారుం డిట్ల
నియె. నాయనా! ప్రజలందఱును వారియెడ ననురాగముతో నున్నారు
గానఁ బ్రజలు మనకుఁ గీడుఁ దలంతు రని మనకార్యమును మనము
చక్కఁబెట్టుకొనకుండుట యగునే? మనము ప్రజలకు బహువిధముల మేలు
చేయుదము. దానఁ బ్రజలు మనయెడ ననురాగమున వర్తింపఁగలరు. ఇంక
నేఁడు మొదలు ప్రజల కనుకూలము లగుకార్యము లొనర్చుటకుఁ బ్రారం
భించి వారియనురాగమునకు మనము పాత్రుల మయ్యెదము. మంత్రు లెల్ల
రును నాయెడ నిప్పటికే పక్షపాతులై యున్నవారు. ఇఁకను భీష్మాదులు
మనల నిందింతు రని కదా నీకు వెఱపు. భీష్ముండు పాండవులకును మన
కును మధ్యస్థుండు. వారియెడఁ బక్షపాతము కలుగు నేని మనయెడ
నైత మాతని కాపక్షపాత మేల యుండదు? అశ్వత్థామ చిఱుతనాఁటి
నుండియు నర్జునుతోని మచ్చరించుచు నాకుఁగడుంగూర్చియుండు. దానం
జేసి ద్రోణకృపులును నశ్వత్థామభావము ననుసరించి నాయెడనే పక్ష
ముగలవారై వర్తిల్లుదురు. ఇవ్విధమున నేఁ జెప్పినవారందఱును మన
కనుకూలురుగ నున్నవారు. ఇఁక విదురుఁ డెల్లప్పుడును బాండవుల
యెడఁ బక్షపాతమును గలిగియు నొక్కరుండై మిగిలి యేమి చేయఁ
గలఁడు? కావున నామాటల నాదరించి పాండవులను వారణావ
తంబున నివసించుటకుఁ బంపుము. ఈకార్యమునం దప్రమాదుండవై
యత్నము లిప్పటినుండియె జరుపుము. నామనోవ్యథ నుడుపుము. రాజ్య
మంతయు నాయధీనమైనపిదపఁ గ్రమ్మఱఁ బాండవులను గుంతితో హస్తినా
పురమునకు రప్పించెదను. అని చెప్పఁగా దుర్యోధనుని దురుద్యోగ
మున కెట్టకేలకు ధృతరాష్ట్రుం డియ్యకొని పాపవ్యవసాయమునకుఁ బూ
నెను. అప్పటినుండి దుర్యోధనుం డెల్లవారిని బహువిధపారితోషికముల
సత్కరించుచుండె. అంత ధృతరాష్ట్రుండు దూరాలోచనపరుండు గామి
మీఁద రాఁగలహానిని దలంపనివాఁడై యెట్టకేలకుఁ బాండవులను
వారణావతపురమునకుఁ బంపుట కుద్యుక్తుఁడై మంత్రుల రావించి

వారిని బాండవులకు వారణావతపురముయొక్క రామణీయకమును వర్ణింప నియోగించెను. వారును ధనలోభులై ధర్మపరులును నీతిమంతులును నైన పాండవులయొద్దకు వేర్వేఱుపనులుండు నెపంబునఁ బలుమాఱు పోవుచు నాపురము కన్నుల కింపుగా నుండుననియు, విశేషించి మహాదేవుతిరునాళ్ల సమీపించియున్న దనియు, నిట్లు నానావిధముల నొక్కొక్కరును వారితో వర్ణించి వారిని వారణావతపురమునకుఁ బ్రయాణోన్ముఖులనుగా నొనర్చిరి. ఇట్లు వారి కభీష్టంబు పరోక్షముగఁ బుట్టున ట్లొనర్చి యొక్కనాఁడు వారలఁ దనప్రత్యక్షమునకు రప్పించి వారితో ధృతరాష్ట్రుం డిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు పాండవులను వారణావతంబున కంపుట

కుమారులారా! జను లెల్లరును వారణావతంబు శృంగారపురమై సొంపుమీఱి యున్న దని చెప్పుచున్నారు. మీఁదు మిక్కిలి యిప్పుడు చంద్రశేఖరున కుత్సవము మహావిభవమున జరుగఁగలదు. మీ కభిమతం బేని మీ రన్నదమ్ములు గుంతీసమేతులై వలసినపరిజనముం దోడ్కొని పోయి యందుండి యుత్సవదర్శనార్థము వచ్చెడివిప్రులకును నతిథిసపర్యలం జేయుచుఁ గొన్నినాళ్లచ్చోటన విలాసంబుననుండి పదంపడి హస్తిపురమునకు రండని చెప్పఁగా ధర్మరాజు తాను బలహీనుఁడ నని గుర్తించి తండ్రిమాటలయం దాదరమును గాన్పించి మాఱుపలుకక వల్లె యని భీష్మ బాహ్లిక సోమదత్త విదుర ద్రోణ కృపాచార్య గాంధారీ భూరిశ్రవఃప్రభృతుల నాలోకించి మాతండ్రి ధృతరాష్ట్రుండు మమ్ము వారణావతపురమునకుఁ బొండని సెలవిచ్చెను. కావున నాతనిసెలవున మే మచ్చోటికిఁ బరివారసమేతముగ నేగుచున్నాము. ఇదె మీ కెల్లరకును సాష్టాంగనమస్కారములు చేయుచున్నాము. మమ్మును మీ రెల్ల రాశీర్వచనములం దెల్పుఁ డని దీనతతోఁ బలుకఁగా వారు "ఓ పాండవులారా!" యని ప్రసన్నవదనులై యిట్లనిరి. మీ రెచ్చటనుండినను నన్నివేళలయందును మీ కభ్యుదయములు గలుగుఁగాక యని దీవింప నాదీవనలఁ గైకొని ప్రయాణసన్నాహమును గావించిరి. అంతకు మునుపే దుర్యోధనుండు తనకాప్తుఁడగు శిల్పాచార్యునిఁ బురోచనుఁ డనువానిం

బిలిచి యొంటరిపాటున నతని చేయి పట్టి యొక్క విజనస్థలంబునకుఁ దోడ్కొనిపోయి యచ్చోట నిరువురును గూర్చుండి యోపురోచనా ! నే నీరాజ్యమునకు రాజనైతి నేని యీ రాజ్యభోగభాగ్యములలో నీకును బాల్గలిగింపనే ? కావున నిప్పుడు ముఖ్యకర్తవ్యమును దెలిపెద. నీకంటె నా కనుఁగుండు విశ్వాసపాత్రుండు కలఁడే ? కావున నే నొకగోప్యమైన దానిం గోరి నిన్ను బాసి నెఱవేర్పఁబంచెద. నాకుఁ బ్రియ మొనర్పుము గోప్యమును వెలిపుచ్చక యనుష్ఠింపుము. పని వినుము. మాతండ్రి ధృతరాష్ట్రుండు పాండవులను వారణావతపురమున నుండుటకు నియోగింపనున్నాఁడు. వారును మాతండ్రి యభిమతమున కియ్యకొనిరి. నీవు వేగమునఁ బోవఁగల గుఱ్ఱములను బూన్చిన రథము నెక్కి వారికి ముందు వారణావతపురమునకు బోవలయు. అచ్చోట వారుండుటకుఁ దగిన గృహమును నగ్నిసందీపకములగు లాక్షాసర్జరసాదివస్తువులతో నెవ్వరెఱుంగకుండ మంటితోడ నేతిఁ జేర్చి మిశ్రము చేసి నగర సమీపమున నిర్మించి యాచతుశ్శాల మగు గృహమునకు సున్నపుఁ బూఁత బూయించి చూచువారలకు మనోజ్ఞముగ నుండున ట్లొనర్పుము. అందుఁ బాండవు లేవురును వసించునప్పుడు గృహోపకరణముల నన్నింటిని సమృద్ధముగఁ గూర్చి యందఱును మెచ్చున ట్లొనర్పుము. వా రాగృహమునందు నమ్మకము గలిగి కొంతకాలము వసించినపిదప నొక్కనాఁడు వారు ప్రమత్తులై రాత్రి నిదురించుచుండ ద్వారమున నగ్నిం దరికొల్పి వచ్చునది. అంత వా రందు మడియుదురు. నాహృదయవేదన యంతటితో నంత మొందును. ఇట్లొనర్చుచో మనకు నింద పొసఁగదు. శత్రువినాశనము తనంతన యగు అని చెప్పఁగాఁ బురోచనుండు దుర్యోధనుని మాట కియ్యకొని యవశ్యమట్లు చేసెద నని చెప్పి రథారోహణము చేసి వేగంబ వారణావతపురంబున కేఁగి దుర్యోధనాభిమతంబున తన్నిర్దిష్టకార్యమున నప్రమాదుఁడై వర్తించుచుండె. పాండవులును హస్తినాపురమునుండి వారణావతపురమున కేఁగువారలై మేలైనగుఱ్ఱములను బూన్చిన రథముల నెక్కుటకు మున్నుగా భీష్మ ధృతరాష్ట్ర ద్రోణ కృప విదుర బాహ్లీక సోమదత్తాదులకు మ్రొక్కి వారు కౌఁగిలించికొని మూర్ధాఘ్రాణంబు నేసి యాశీర్వాదిం

పఁగాఁ, బదంపడి కౌరవవృద్ధాంగనలకు నమస్కరించి యందఱసెలవు గొని దైన్యము దేటపడునట్లు పోవుచుండిరి. వారల వెన్నంటివచ్చువారలై కొందఱు ధూర్తబ్రాహ్మణులు ధృతరాష్ట్రునివలన భయ మెంతమాత్రమును దలంపక యయ్యయ్యో! ఈగ్రుడ్డిరా జెంతసాహసికుఁడు? దురాత్ముఁడై పాపములకు వెనుదీయక యెట్టియనుచితము లగుకార్యములనైనను జేయుటకు సంసిద్ధుఁడయ్యెనే? పాండవు లన్నదమ్ములలో నెవ్వరైనను దన కేవిధమైనహాని నైనను దలంచిరే? సర్వజనానందకరంబుగఁ బాండురాజు పాలించుచున్న రాజ్యము ధర్మపరులును, నీతికోవిదులును, బరాక్రమవంతులును నగు నాతనికుమారులు పొందుట యేమి తప్పో? తెలియరాదు. ఇట్టియన్యాయమును గనుఁగొనక దురాత్ముండై యీయంధరాజొనర్చుచుండఁగా ధర్మజ్ఞుం డేల యుపేక్షించియున్నవాఁడు? ఈపాపిరాజ్యమున మన ముండఁదగదు. ధర్మపుత్త్రుం డెచ్చోటికిఁ బోవుచుండునో మనమును నచ్చోటి కేగవలయునను చుండ యుధిష్ఠిరుండు వారలతో నిట్లనియె. ఓభూసురులారా! ధృతరాష్ట్రుఁడు మాకేమగడ. కావున నామహనీయుండు మాకు నిర్దేశించినస్థలమునకే మేగువారము. మీరందఱును మాకు మిత్త్రకోటియందుఁ జేరినవారలు కావున మాకుఁ బ్రదక్షిణముగవచ్చి మాకు శుభములు సేకూఱునట్లాశీర్వదించి మఱలి హస్తిపురంబున మీమీనెలవుల కరుగుఁడు. అని చెప్పఁగా వారు పాండవులకు నానావిధాశీర్వాదములొసంగి మఱలి నగరమునకుఁబోయిరి. అంత వెంటవచ్చినవిప్రులును దారియంపు వచ్చిన యితర పౌరజనులును మఱలఁగా సర్వధర్మజ్ఞుల నెఱింగిన విదురుండు వీరితో మఱికొంతదూర మేగి పాండవులచుట్టును నున్నవారును వినినను నెఱుఁగఁ దగనియట్లు పాండవశ్రేష్ఠునితో దుర్యోధనకృతకపటమును సూచించువాఁడై యిట్లుమఱుఁగుమాటలు కొన్ని యుపదేశరూపముగఁ బలికెను.*

---

దీనికి సంస్కృతమూలము :—

*శ్లో. ప్రాజ్ఞః ప్రాజ్ఞం ప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞ మిదం వచః, ప్రాజ్ఞం ప్రాజ్ఞః ప్రలాపజ్ఞః ప్రలాపజ్ఞం వచోఽబ్రవీత్. యో జానాతి పరప్రజ్ఞాం నీతి మార్గానుసారిణీమ్, విజ్ఞాయ చ తథా కుర్యాత్ ఆపదం నిస్తరేద్యథా. అలోహం నిశితం శస్త్రం శరీరపరికర్తనమ్, యో వేత్తి న తు తం ఘ్నంతి ప్రతిఘాతవిదం ద్విషః.

ఇతరులశక్తిని, దన్నుం గాపాడుకొనం దగిననీతియును, సమయో
చితమును నెఱుంగునట్టిమనుజుండు తనకు వచ్చినకీడులను, రాంగల
కీడులను దొలంగు నుపాయములు తెలిసి యట్లులు చేయుచుండవలయు.
మఱియు నుక్కు మొదలగు లోహములచేతం జేయంబడకయే, మిక్కిలి
వాడిగలిగినవియు, నొడలిని నఱుకునవియు నగు నాయుధముల స్వరూ
పము నెఱింగి దానికి బదులు చేయంజాలునట్టి వానిని శత్రువులు సాధింపం
జాలరు. అని తెలిపి, "ఓ యుధిష్ఠిరుండా! నామాటల నెప్పుడును మఱు
వక గమనించి యుండుము. మోసమున విశ్వాసమును బుట్టించి పగతుఱ
నుఱుమాడవలయు నను రాజనీతిశాస్త్రమును బాగుగ గుర్తించి ప్రవ
ర్తించు శత్రువులయాలోచనమును విమర్శించి తగినట్లు దానికిం బ్రతీకార
మును నేర్పుతోం జేసి తాము సురక్షితులుగ నుండవలయును. వార
ణావతపురమున మీకని నిర్మింపంబడియుండు గృహము లక్క, నేయి
మున్నగు వేగ దాహకరపవస్తువులతో మిశ్రములగు పదార్థములతో
నిర్మింపం బడి యుండునది యనియు, మీ ప్రక్కలనే మెలంగుచుండంగల
మనుష్యుం డొకండు మీశత్రుపరిజనుండనియు, మీ కాపద గలిగింప
నియుక్తుం డైనవాం డనియుం దఱివేచి వాం డాయింటి కగ్నిం దఱి
కొల్పు ననియు నిశ్చయముగా నెఱుంగుము. అని తెలిపి, మఱియు
నాతనితో "ధర్మజా! *వేంటనిమిత్త మరణ్యములకుం బోవుచు నామార్గ
ములనెల్ల విమర్శనబుద్ధితో బాగుగ నెఱింగి నాకు సమానుం డగు చెలి
కాండొకండు నిర్మించి చూపినట్టి రెండువైపులద్వారము గల సొరంగము

* శ్లో. కక్షఘ్న శ్శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలౌకసః,
న దహేదితి చాత్మానం యో రక్షతి స జీవతి.

శ్లో. నాచక్షు ర్వేత్తి పంథానం నాచక్షుర్విందతే దిశః,
నాధృతిర్భూతి మాప్నోతి బుధ్యస్వైవం ప్రబోధితః.

శ్లో. అనాప్తైర్దత్త మాదత్తే నరశ్శస్త్ర మలోహజమ్,
శ్వావిచ్ఛరణమాసాద్య ప్రముచ్యేత హుతాశనాత్.

శ్లో. చర న్మార్గాన్విజానాతి నక్షత్రై ర్విందతే దిశః,
ఆత్మనా చాత్మనః పంచ పీడయన్నానుపీడ్యతే.

మూలమున బయటికరుగుడు. మరల బురప్రవేశాపేక్ష లేకుండ నుండుఁడు. అట్లు బయలునకుఁబోయి యాకాశమునందు నక్షత్రముల మూలమున దిక్కులం దెలిసి యాయరణ్యమునసే మీ రెచ్చోటికైనం బోయి ధైర్యమువలంబించి యేయుపాయమునసైనను బ్రస్తుతాపాయము నుండి తేలుకొనుఁడు. కాని, యావారణావతమున నున్న లక్కయిండ్ల లోనికిఁ బోకుండ నుండఁజనదు. వివేకము లేనివానికి సన్మార్గము పట్టు వడదు. దిక్కులు దోఁపవు. ధైర్యము లేనివానికి సద్బుద్ధి గలుగనేరదు. కావున మీకుమీరే సహాయులై నావంటిహితుఁడుతోడ్పడఁగా ధైర్య వివేకములతో నన్నింటియం దప్రమత్తులరై ప్రవర్తిల్లవలయునని గూఢా ర్థము నీయఁగల వచనములభావమును దేటపఱుపఁగ ధర్మపుత్త్రుండా దానినెల్లఁ దెలిసి దా నప్రమత్తుఁడనై మెలఁగెద నని విదురునకుఁ బ్రత్యు త్తరము చెప్పెను. అంత విదురుండు మఱలిపోయెను. భీష్మాదులును మఱలిపోయిరి. అంతఁ గుంతీదేవి ధర్మరాజుం జూచి యిట్లనియె. నీతో విదురుం డెద్దియో మాకెవ్వరికిఁ దెలియని సంగతిని జెప్పెను. నీవును నద్దానికిఁ బ్రత్యుత్తర మొసఁగితివి. మీ కిరువురకును జరిగిన సంభాష ణము మాతోఁ జెప్పఁగూడునేని మాకుఁ దెలియఁజెప్పుము. మేమంద అము నావృత్తాంతమును వినఁగోరుచున్నాము. అనఁగా ధర్మజుండు తల్లికిట్లనియె. తల్లీ! పోయినస్థలమున నగ్నిభయము గలిగినచోఁ దప్పించు కొనుఁడనియు, మార్గములన్నియు నేర్పరులై యరయుచు జీవింప వలయుననియు, జితేంద్రియులరై రాజ్యమును సాధించుకొనుఁడనియు విదురుఁడుసెప్పఁగ నేనందులకు సంతసిల్లి యట్లే వర్తించెదనంటిని యని కుంతికి ధర్మజుఁడు ప్రత్యుత్తరముఁ జెప్పెను. తర్వాతఁ బాండవులు ఫాల్గున శుక్లాష్టమి రోహిణీనక్షత్రయుతమై యుండఁగా వారణా వతముం జేరిరి. అప్పటికే పాండవు లాయూరునకు వచ్చువారని తెలిసి యాపురజనులు వందిమాగధజృంభములు భూసురులు మున్నగువారు మంగళవాద్యములతోఁ బాండవుల కెదురువోయిరి. పురమునఁ బచ్చని తోరణములు గట్టి వీథులందుఁ గలయంపులు చల్లి తెల్లనిమ్రుగ్గులు తీర్చి వివిధపుష్పమాలికలతో గృహద్వారము లలంకరింపఁబడియుండెను. అప్పుడు యుధిష్ఠిరుండు తమ్ము నెదుర్కొన వచ్చిన వారణావతపౌర

జనులమధ్యయందు సురలమధ్యమున నుండు మహేంద్రునిమాడ్కిఁ దేజ
రిల్లెను. భూసురులు పాండవుల నాశీర్వదించిరి. అంత వారి నందఱను
యుధిష్ఠిరుండు యథోచితసత్కారంబుల గౌరవించెను. అంతటఁ దమ్ము
లును దానును బురప్రవేశము గావించిరి. యోగ్యు లగు భూసురుల
యిండ్లకును, నుత్తమ వైశ్య శూద్ర గృహములకుఁ బోయి వారల
బహూకరించి రాఁగాఁ బురోచనుండు తనకుఁగాను నిర్దేశించి
యుండు గృహమును దల్లియును సోదరులు వెంబడిరాఁగా యుధిష్ఠి
రుండు ప్రవేశించెను. ఆగృహమునందుఁ బురోచనుండు తమకుఁ బంపిన
భక్ష్యభోజ్యములను గొనుచుండిరి. అట్లాయింటఁ బాండవులు పది
దినము లుండినపిదపఁ బురోచనుండు ధర్మరాజుతో నిట్లనియెను. అయ్యా!
యీ నూతననిర్మితగృహములోఁ బ్రవేశింపుఁడు. అని దానిమేలిమి
గుణంబుల నభివర్ణించెను. అంత ధర్మరాజు మిక్కిలి జాగరూకుఁడై తన
కాయింటిగుణము లన్నియును మునుపే విదురునిహెచ్చరిక చేతఁ దెలి
సియు, బురోచనుండు చెప్పుచుండఁగా దానియొక్క శృంగారవిభవముల
కును శిల్పినిర్మాణచాతుర్యమునకు నాశ్చర్యము నొందెను. అటువెంటనే సోదరు
లతోను దల్లితోను నాయింటఁ బ్రవేశించెను. అప్పుడు ధర్మరాజు డాయింట
లాక్షాదిదాహకవస్తువులచే నిర్మింపఁబడియుండు సకలగృహోపకరణ
ములగంధమును భీమున కెఱిఁగింపఁదలంచి యాతనితో నిట్లనియె. భీమ
సేనా! యీగృహనిర్మాణమున కుపయుక్తములయిన సకలవస్తువులును
లాక్షాసర్జరసాదివస్తువులు. ఇవి వేగమున నిప్పంటుకొనుశక్తిగలవి. దానం
జేసి వేగమున నీగృహమగ్నిహోత్రున కాహుతియై పోవుట కనేకసదుపా
యములతోఁ గూడియున్నది. దీనిగంధ మెంత నెత్తావి గలిగియున్నదో
యాఘ్రాణింపుము. మఱియు నమ్మి మన మేమఱియున్నప్పుడు మనతోఁ
జెప్పి యీగృహమును దగులపెట్టునిమిత్త మీపురోచనున కాజ్ఞను దుర్యో
ధనుండు నేసియున్నవాఁడు. వాఁడు సమయమును గనిపెట్టి యీయిం
టినిఁ బరశురామప్రీతిగ నర్పింపఁగలఁడు. విదురుం డీయర్థమునే మనము
హస్తినాపురము వెలువడి వారణావతపురమునకు వచ్చుచున్నప్పు డెవ్వ
రెఱుంగకుండ మఱుఁగుభాషలో నాతోఁ జెప్పియుండెను. కావున
మనమందఱము జాగరూకులమై మెలఁగవలయును. అని చెప్పఁగా

ధర్మజునితో భీమసేనుం డిట్లనియె. ధర్మపుత్త్రా! అట్లు శంకించుచు నిం దేల యుండవలయును? మనము తొలుత నున్న గృహమునకే పోవుదము రమ్ము. అనఁగా యుధిష్ఠిరుండు భీమసేనున కిట్లనియె. తమ్ముఁడా! మన మేవిధమున నైనను నీయింటనే మిక్కిలి జాగరూకులమై మెలఁగి మనలను జంపుటకు యత్నించుచున్న వారినే యేమరించి తప్పించుకొనుట నేర్పుగాని వేఱొండెద్దియుఁ గర్తవ్యము కాదు. అట్లు మనము చేయకున్నచోఁ బాపి యగు నీపురోచనుండు మమ్ములను బలాత్కారమున నైనను దహించి వేయును. ఈయింట మనము కాల్పఁబడితి మని యెఱింగెనేని కౌరవులపితామహుండు భీష్ముండు కౌరవులఁ గోపగించును. ఏది యెటు లున్నను, మన మీగృహమునందుండియే తప్పించుకొనిపోవుట నేర్పు గాని వే ఱుపాయ మెద్దియు నేర్పు కానేరదు. కావున మనము వేఁటను నిమిత్తముచేసికొని పగ లంతయు నీసమీపారణ్యమునందు దారు లన్నియును దెలిసికొందము. ఇతరు లెవ్వరెఱుంగకుండ లక్కయింట్లకును వనమునకు సొరంగము త్రవ్వించి యాపద వొడమిననాఁ డొరు లెఱుంగకుండ నాసొరంగమునఁ బ్రవేశించి యరణ్యమును జేరి తప్పించుకొందము. అని చెప్పి యాతీరునఁ బాండవులు పవలెల్లను వేఁటలాడుచు రాత్రు లెల్లను మిక్కిలి జాగ్రత్తతో నుండిరి.

అంత హస్తినాపురమునందు దుర్యోధనాదిదుష్టులు నలువురి దుర్మంత్రమును నెఱుంగుచు సజ్జను లగు పాండుపుత్త్రుల కెప్పుడు హితమాచరించువిదురుండు తనకుఁ బరమాప్తుఁడును, సొరంగములను త్రవ్వ నేర్చినవాఁడును నగు ఖనకు నొక్కనినిం జీఁటి వానిని వారణావతపురమున నున్న పాండవులకడకుఁబంపఁగా వాఁడచ్చోటికి కరిగి తన్ను వారలు గుర్తించునట్లు విదురుండు సెప్పినకొన్ని సంకేతవచనములఁ దెలిపి దుర్యోధనాదిదుష్టచతుష్టయము వా రనుజ్ఞసేయఁగా నీదురాత్ముం డగు పురోచనుం డీకృష్ణచతుర్దశినాటిరాత్రి యీలక్కయింటిని గాల్చుటకు సంసిద్ధుఁడుగ నున్నవాఁడు. అప్పుడు మీ కేమాత్రము హాని కలుగకుండ నీయింటిమధ్యమునుండి యూరివెలుపల నున్న యొకసొరంగము నిర్మించి దానిమూలమున మీ రారాత్రి తప్పించుకొని మెలఁకువతో నేడకేనియుం బొమ్మని హెచ్చరిక చేయుటకు నన్ను విదురుండు

పంపఁగా వచ్చితిని అనఁగా బాండవులు వల్లె యనిరి. అప్పు డాఖనకుండ గృహామధ్యమున నొకబిలమును ద్రవ్వి యొరు లెవ్వరును నెఱుంగకుండ దానిద్వారమునఁ గవాటమును గూఢముగాఁ గల్పించి దానిని బాండవు లకుఁ జూపఁగా వారు దానిని జక్కఁగ గుర్తించి మెలఁకువతో మెలంగ చుండిరి. ఇవ్విధమునఁ బాండవులు వారణావతంబున లక్కయింటిలో నొకసంవత్సర కాల ముండిరి. అంతఁ బురోచనుండును వారు నమ్మకము నున్నారని గుర్తించి సంతసించియుండెను. అప్పుడొకనాఁడు ధర్మపుత్త్రుండ దమ్ములంబిలిచి యీపురోచనుండు తనయెడ మనము మిక్కిలి విశ్వా ముతోఁ బ్రవర్తించుచున్నామనియు, నీయింటివిషయమున మన కేశం యును లేదనియును దలంచియున్నవాఁడు కావున మనము వానికంటె మున్న మేల్కని యాకృష్ణచతుర్దశినాఁటిరాత్రి వానితో నీలక్క యిండ్లను గాల్చి యెటకేనియుఁ బాఱిపోవుద మనఁగా నందఱును నట్ల చేయుదమని కృతనిశ్చయులై యుండిరి.

## లక్కయిండ్ల దహనము

అంతఁ గృష్ణచతుర్దశీదినము రాఁగా నాఁడు కుంతీదేవి పురంబున నున్న బ్రాహ్మణులకును బ్రాహ్మణస్త్రీలకును నిష్టాన్నదానంబులం దుష్టిసేసి దేవతార్చనగావించి యున్నెడం బురోచనుఁ డంపిన నిషాదవనిత సపుత్త్రయై బహువిధవన్యఫలంబులు దెచ్చియిచ్చుచుం గుంతీదేవిం బాయక సేవించి పాండవకృత్యంబులు నిత్యంబును నెఱిఁగించుచుండెడు నది నాఁటి రాత్రి యుత్సవంబునం గాలచోదితయై తానునుం దనయేవురుకొడుకులు విశేషించి కల్లుద్రావి మైమఱచి లక్కయింట నొక్కచోటఁ బరుండి నిద్ర పోయియుండె. అంత నర్ధరాత్రసమయంబున నెల్లవారును నిదురించు చుండ భీమసేనుండు లేచి మున్ను పురోచనుం డున్నచోట వానిశయన గృహద్వారంబున ఘోరానలంబు దరికొలిపి, వెంటనే దల్లిని నన్న దమ్ములను బిలంబులోని కనిచి యాయధము లున్నయింటితోఁ గూడ లక్కయింటి నంతయును బరశురామప్రీతి యొనర్చి ఖనకునకుం దమ కుశలగమనం బెఱింగించి సొరంగమును జొచ్చి యాందారియం దెవ్వరికిఁ దెలియక యడవిఁ జొచ్చి పోవుచుఁ దల్లియును సోదరులును వేగంబున నడువఁ జాలకునికిం దెలిసి తల్లిని భుజ మెక్కించికొనియె. ధర్మపుత్త్రుని

నర్జునునిఁ జేతంబట్టుకొనియె. కవలవారిని నొడియందుఁ బెట్టుకొనియె, ఇట్లు భీమసేనుండు తనవారిం దోడ్కొని యరణ్యంబున నాఁటిరాత్రి కటికి చీఁకటియందు గంగానదీసమీపమునకుఁ బోవుచుండెను. ఇంతకు మున్నె కరినగరమున నుండు విదురునిచేతఁ బ్రేరితుండై యొక యోడ నడపు స్థపతి సకలపరికరములతో నిండినదియు, వానగాలి చలి మొదలగుబాధలు లేనిదియును నగు నొకయోడను గంగలోనఁ గొనివచ్చి నిలిపి గట్టునకు వచ్చి యాసమీపారణ్యమునఁ బాండవుల వెదకి వారలయిక్కఁ గని చక్కటి కరిగి మ్రొక్కి యయ్యలారా! నేను విదురానుమతంబున మిమ్ము గంగానదిని దాఁటించునిమిత్త మరుదెంచితిని. అందుల కడియాల ముగ విదురుండు మీతో నిట్లనుమనెను.*

అంత వానిని విదురుఁ డంపినవాఁ డని బాగుగ నెఱింగి వాని వెంటఁ బోయి యాయోడ నెక్కి యాగడియలోన గంగం దాఁటి యావలితీరముఁ జేరినంతన వాఁడు వారి నాశీర్వదించి వారియడియాలములైనమాటలం గొని మఱలఁ గరిపురి కరిగి సరగ విదురునకుఁ దనపని వినిపించి యుడుగరలం గొనెను.

అంతఁ బాండవు లారాత్రి కొంత యుండునప్పు డాయోడ దిగి దక్షిణదిక్కును బట్టి నక్షత్రములవలన మిగిలిన దెసల నెఱుంగుచు నతి వేగమునఁ బోవుచు మహారణ్యమున నలయుటవలన భీమసేనునితో యుధిష్ఠిరుం డిట్లనెను. భీమసేనా! నిదురలేమిని, దిక్కు తెలియక దారి డొంక యనక, ఱాయి రప్ప గుర్తింప నేరక, దుర్గములమధ్య నడుచుట చేతను మిక్కిలి బడలియున్నవారము. నీవు దప్ప నిప్పట్టున మ మ్ముద్ధరించువారు లేరు. ఇంతకంటె వేఱొక్కకష్ట మున్నదే? ఈయడవిలోన దిక్కు దోఁచకున్నది. ఇఁక నొకయడుగైనను బెట్టఁజాలకున్నాము. పాపియైన పురోచనుం డింతట నైనం గాలి చచ్చియుండునో లేదో? ఏమి చేయవచ్చును? మనలో నీవ బలాఢ్యుఁడవు. మున్నుపోలె మమ్మును నీవు మోచికొనిపొ మ్మనఁగా భీమసేనుండు వారల నెల్ల మోచికొని మదించినయేనుఁగుంబోలె నరణ్యం బెల్ల నదురుచుండఁ గొంతదూర

*శ్లో. కక్షఘ్న శ్శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలౌకసః,
న హంతీత్యేవ మాత్మానం యో రక్షతి స జీవతి.

మేఁగి యొక్కచోట నందఱ డించి వేఱొక్కచోటఁ బ్రచ్ఛన్నులై
యుండ నీరుపట్టు వాఁడమి కుంతి గాని కిట్లనియె. పుత్రా! నేను నీతి
పరులును, గుణవంతులును, బలాక్రమవంతులును నగు పాండవులకుఁ
దల్లినై కొనకు నీళ్లు లేక దాహముచే నీయడవియం దసువుల బోఁ
గొట్టుకొనవలసి వచ్చెనే? ఏమి చేయుదు ననెను. అంత భీమసేనుండు
వారల నందఱను మఱల నెత్తికొని కొంతదూర మరిగి యచ్చో
నొక మఱ్ఱిచెట్టు క్రింద వారల మఱల డించి కూర్చుండఁబెట్టి మీరంద
ఱిచ్చోటఁ గొంతతడవు పరుండియుండుఁడు. నేను బోయి మీకు వలసి
నంత నీరు ద్రావఁ దెచ్చెదను. సమీపమున హంసలయొక్కయుఁ,
గారండవములు మున్నగు జలపక్షులయొక్కయు నీటిచప్పుళ్లు వినవచ్చు
చున్నవి కావున సమీపమున సరోవర ముండునట్లు తోఁచుచున్నది.
నేను మాత్ర మచ్చోటి కేఁగి మీకు వలసినంత నీరుఁ దెచ్చెద నని
యుధిష్ఠిరుననుమతిని బొంది యాకొల నుండు చోటి కేఁగి యలుపు
దీఱ స్నానముఁ జేసి వలసినంత నీరు కడుపారఁ ద్రావి యుత్తరీయమున
నీటిని సంగ్రహించి రెండుకోసులదూరమున నున్న తల్లి కొసంగం
దలంచి యతివేగమున వచ్చి భూమిపైఁ బరుండి నిదురపోయిన
తల్లిని నన్నదమ్ములం గాంచి యిట్లు చింతించెను. అయ్యయ్యో! వీరి
నీకష్టములపా ల్సేసిన దైవము నే మనవలయును? సుకుమారములగు
మెత్తని పఱుపులపైన నానావిధోపచారములఁ జేయుచుండినను నిదుర
రాని వీ రిపుడు పైపంచెలను బఱచుకొని తమచేతు లంపిగాఁగొని
యీయరణ్యమున నీకటికినేలయందు సుఖనిద్రను బొందియున్నవారు.
అలసియుండుటచే మైమఱచునట్లు వీరికి నిదుర పట్టినది. అయ్యో!
దైవమా! వీరికష్టములను జూచుచుండ, నే నెంతపాపమును
జేసితినో? ఈ మాతల్లి యాదవులలో మేటియైనవాఁడును,
లోకోత్తరుఁడును నగు వసుదేవునంతటి మహనీయునకుఁ జెలియలై,
విచిత్రవీర్యునకుఁ గోడలై పాండురాజునకు ధర్మపత్నియై, మహాదేవత
లగుధర్మవాయుమహేంద్రులను మంత్రబలమున నుపాసించి మమ్ముంగని
ప్రఖ్యాతిఁ గాంచి యాగర్భశ్రీమంతురాలైన సుకుమారిగదా! ఇట్టి
మహాదేవి నిండియున్న పరిచారికాజనసమేతములయిన మేడలను వదలి

జనశూన్యమైన వనమునఁ గఠినమైన యీ కాలినేలయందుఁ బరుండి నిదు
రించుట యెట్టి కఠినాత్మునైనను గంట నీరు పెట్టనీయదే? మఱియు
ముల్లోకములనైనను నేలఁ గలశక్తి గలిగి హంసతూలికాతల్పములపైఁ
బరుండియుండ వందిమాగధులు కైవారములుసేయ నిదురించు నీపురు
షోత్తముఁడగు ధర్మపుత్త్రుండును, నరోత్తముఁడని పేర్కొనఁబడిన నరుం
డును నశ్వినీదేవతలంబోలె సుందరులై, ముద్దులఁగొలుపు శరీరచ్ఛాయతోఁ
బ్రకాశించు నీకవలును వీరందఱును నీకఠినప్రదేశములలో నీ
కాలము నిద్రించుచున్నవారు. వీని నన్నింటి నిప్పు డేల తలంపవలయును?
ఎవనిజ్ఞాతులు విషములును గులపాంసనులును గారో యట్టివాఁడును,
ఎవనిజ్ఞాతులు ధర్మనిరతులగువా రనేకులుందురో యట్టివాఁడును సుఖిం
చును. మా కుండునట్టిజ్ఞాతులు దుష్టులు, కులపాంసనులు, అధర్మాసక్తులు
కావున మేమెట్లు సుఖింతుము? అని చెప్పి తనలో దుర్యోధనుని సంబో
ధించుచు, 'ఓరీ ద్రోహీ! దుర్యోధనా, నీవు మా కెల్ల కాలమును హానియే
పనివడి చేయుచున్నావు. మాకు దైవసాహాయ్యమున్నది. కావున నెట్లో
బ్రతికి బయలుపడుచున్నాము. ఇప్పుడు మే మెందుఁ జొఱఁగలము?
నీకోర్కె నెఱవేరెను గదా? నీయదృష్టము బాగున్నది కావున నీయుధి
ష్ఠిరుండు నిన్నుఁ జంపుటకు నా కనుజ్ఞ యీయకున్నవాఁడు. ధర్మ
పుత్త్రుని యాజ్ఞయైనతోడనే నీవారలతో నీ వే మగుదువో కదా? వాని
యనుమతి లేకుండుట నీవు బ్రతికియుండఁ గలిగితివి.' అని యనేక
విధములుగఁ గ్రూరంపుమాట లాడి తా నపు డేమియును జేయనేరక
గుటకలు మ్రింగుచు, వేడినిట్టూర్పులు నిగుడించుచు నలసి నేలపై నిదు
రించుచున్న యన్నదమ్ములను దల్లినిఁ జూచి శోకపరవశుఁడై, యయ్యయో!
వీ రెంత యలసియున్నవారో? మేల్కొని యాపదఁ దరించుట
కాలోచన సలుపవలసినప్పుడు గాఢనిద్రతో నున్న వీరల నిపుడు
మేల్కొలుపుటకు నాకు మనసొప్పదు. తమంతట లేచినపుడే
దాహశాంతికై నీరు ద్రావుదురని నిశ్చయించి కొంత యారడిల్లి జాగ
రూకుఁడై యుండెను.

ఇట్లు వారణావతంబున నుండుచున్న పాండవుల యునికిపట్టును పౌరు లెల్లరు గాంచి యయ్యయ్యో! పరమనీచుఁ డైనదుర్యోధనుఁ డింతటిపాపమున కొడిగట్టెను! ఇట్టిపాపులు లోకములఁ గలరా? ధృతరాష్ట్రుం డిందులకు సమ్మతమును జూపెను. అని యందఱు వందురుచు వేఁకువగుడు నిప్పును జల్లార్పఁగ వచ్చి అచ్చోటఁ బీనుఁగుపెంటలై పడి యున్న పురోచనుని నిషాదిని దానియైదుగురు కొడుకులనుం జూచి పాండవులు కుంతితో నిందు సమసి రని నిశ్చయించి, వారలను వధింప నుద్యమించుచున్న దురాత్ముం డైన పురోచనుండును జచ్చెను. అంతయును దుర్యోధనుని కృత్రిమంపుఁ జేఁత లని యాడిపోసికొనిరి. ఆసమయమునఁ బౌరులతోఁ గూడి ఖనకుఁ డగ్నిని జల్లార్చువానిం బోలె నా బూది నంతటిని నిటునటు ద్రోయువాఁడై సొరంగద్వార మెవరికిని గానరాకుండ నాబూదితో దానికవాటమును జక్కఁగా మూసివైచెను. అంతఁ బౌరు లావృత్తాంతమును ధృతరాష్ట్రునకుఁ జెప్పవుత్త మని నిశ్చయించి తగినదూతలను హస్తిపురమునకుఁ బంపిరి. వారు హస్తిపురమేగి ధృతరాష్ట్రునితో లక్కయిండ్లును, నాయుధము లున్నశాలయుఁ గుంతీసమేతు లగు పంచపాండవులును దగ్ధులై రనియు వారితోఁ బురోచనుఁడును నాదావాగ్నియందు మడసె ననియుం జెప్పిరి. ఆఘోరంపు మాటలను ధృతరాష్ట్రుండు వినుచుండఁగనే గుండె లవిసి మూర్ఛిల్లెను. అంతఁ గొంతవడికి నతఁడు తెప్పిరిలి దుఃఖము నణఁచికొని వర్తమానమంతయును భీష్మవిదురగాంధారులకుఁ దెలుప నందఱును బట్టరాని యేడ్పు నేడ్చిరి. వెంటనే నగరిపురోహితబ్రాహ్మణులను బిలిచి పాండవులకును గుంతికిని నౌర్ధ్వదైహికక్రియలను నెరవేర్చుట కనుజ్ఞ నొసంగెను. అంతట వా రగ్నికార్యముల నన్నింటిని జేయునప్పుడు ధృతరాష్ట్రుఁడును గౌరవులతోడ వారలకుఁ దిలోదకములను వదలెను. విదురుఁ డంతయు నెఱింగియు రహస్యము వెలువడకుండ వారితోఁ గలిసి సమానముగ దుఃఖించెను.

### హిడింబుఁడు పాండవులఁ జంపుటకు హిడింబను బంపుట

అంత నయ్యరణ్యంబున భీముండు నిద్రాపరవశులై యున్న వారిని మేలుకొలుపుట కియ్యకొనక వారిం జూచి మనోవేదనతో దుర్యోధనుని

క్రౌర్యచింతను దలపోయుచుండునవసరమున నల్లనిశరీరముగలవాఁడును, గ్రూరుఁడును! మనుష్యమాంసేచ్ఛగలవాఁడును, మహాబలపరాక్రమ శాలియును, బింగాక్షుండును, దారుణాకారుఁడును, నిడుదలై వాఁడిమి గలపండ్లు గలవాఁడును, వ్రేలాడుచుండుకడుపును బిక్కలును గల వాఁడును, నెఱ్ఱనిసూదులవంటిమీసలును, నిక్కపొడుచుకొనియుండు కలవెంట్రుకలును గలిగి భయంకరాకారుం డయినహిడింబుం డనురక్కసుం డాఁకలికోర్వలేక యాయరణ్యమునందుఁ గ్రుమ్మరుచుండువాఁ డొక్క సాలవృక్షము నారోహించియుండి భయంకరములగు తనవెంట్రుకలను జలిపించుచు నెత్తిని వ్రేళ్లతోఁ గోకుకొనుచు, మిక్కిలి భయావహము లైనయావులింత లిడుచుఁ బాండవులవైపుననే చూచుచు మనుష్య వాసనను జూచి తనచెలియ లగు హిడింబ యనుదానిం బిలిచి యిట్లని నియె. చెలియలా! నాకభిమతంబైన మనుష్యమాంసాహారము బహు కాలమునకు సిద్ధించినది. నాకోఱపండ్లతో వారిమెడలయందుండు మాంసమును గొఱికి, వారినరములఁ ద్రెంచి, నురుగుతో మిశ్రమైన వారివేడినెత్తుటిని గడుపారఁ ద్రావెదను. కావున నీవు వేగమునఁ బోయి వా రెం దున్నను, నందఱను జాలరివాఁడు వలయం దున్నచేపలను బట్టి వధించునట్లు వధించి యాశవములను వేగముగ నిట కీడ్చుకొని రమ్ము. వెఱవవలదు. వారిమాంసములను మన మిరువురము కడుపార భుజించి విలాసముగఁ జిందులు ద్రొక్కుదము. అనిచెప్పఁగా హిడింబయు నట్ల యని పాండవు లున్నచోటికి వచ్చి నిదురించుచున్న ధర్మార్జుననకుల సహదేవులను జాగరూకుఁడై వారికిఁ గాఁపుగా మేల్కొనియుండు భీమసేనుం గాంచి వానినూత్నయౌవనసౌందర్యంబున కచ్చెరువోయి మన్మథబాణములతోఁ గొట్టఁబడి మనస్సున నిట్లు తలపోసెను. వీ రెవరో అతిసుకుమారులై యున్నవారు. వీరియెడ దారుణమగు కృత్య మొన ర్చుటకు నాకుఁ జేతు లాడవు. మేల్కొనియుండు నీమన్మథవిగ్రహమును మోహించి యుండుట వానిని వరించి యిష్టోపభోగసుఖముల నను భవించెద. సోదరస్నేహమునకంటెఁ బ్రియునిస్నేహ మధికము గాదా? వీరు సుఖించియున్నచో నేనును బహుకాలము సుఖింతు నని మనస్సున నిశ్చయించె. మిక్కిలిసొంపైనరూపమును దాల్చి దివ్యాంబరములతోను

నాభరణములతోను నలంకృతయై లజ్జావనతవదనయై మెల్లనిదరహాస చంద్రికలను భీమునిపై వెదఁజల్లుచు వానిని సమీపించి యిట్లనియె. మహానుభావా! నీ వెవ్వడవు? నీదేశ మెయ్యది? ఈనిర్జనారణ్యంబున కేలవచ్చితివి? ఈనిదురించుచున్నవా రెవ్వరు? మిక్కిలి సుకుమారిగా నుండు ముసలి దెవ్వతె? ఈయరణ్యమున నాకు సోదరుండును నతిక్రూరమానసుండును నగు హిడింబుం డను పేరుగలరక్కసుం డొక్కఁడున్నాఁడు. ఈచోట విశ్వాసముతో మీ రేల నిదురించుచున్న వారు? నాసోదరుండు మీమాంసములను దినుట కాసక్తుఁడయి మిమ్ము వధించి తనయొద్దకు మీకళేబరములను లాఁగుకొనిరమ్మనెను. ఏతన్నిమిత్తమున నే నిందుల కేతెంచితి. సోదరానుజ్ఞ మెయిఁ గ్రూరకర్మాచరణమున కేతెంచియు నీతరుణసుందరరూపముఁ జూచి కామమోహితనై సోదరునియాజ్ఞ మేరకుఁ గ్రూరకృత్యమును జేయ నొల్లకయున్నాను. నే నిప్పుడు నీతో యథార్థమును బల్కితిని! నీవుదక్క నన్యునిఁ బతిఁగా వరింపను. కామపరవశనై వలచివచ్చిన వనితను వదలకుము. నాయందిష్టోపభోగముల భోగించి నన్నేలుము. నేను కామగమనము గల దానను. రాక్షసునివలనిభయము మీ కెవ్వరికిని గలుగకుండునట్లు మిమ్మాకాశమార్గమునఁ గొనిపోయి మనోజ్ఞమైన ప్రదేశమునఁ జేర్చెదను. అచ్చోట నాతోడ సరసగోష్ఠినుండుము. మన్మథరాజ్యమున నన్నేలింపుము. అనఁగా భీమసేనుండా రాక్షసకామిని కిట్లనియె. అసురీ! నీమాటమేర కిప్పుడు నేను వర్తింపఁదగదు. అలసి సుఖులై నిదురించుచున్నసోదరులను దల్లిని రక్కసుపాల్సేసి నేను గామాతురుండనై నిన్ను నిలచి నీయం దైహికభోగముల ననుభవింపఁదగునే? ఆవృత్తాంతము వప్పుడు నిలుపు మనఁగా భీమసేనునకు హిడింబ వెండియు నిట్లనియె. నీమనంబున వీరికి రాక్షసునివలన భయము లేకుండ రక్షించెదను. వీరలను మేల్కొలుపు మనఁగ భీముండు సుఖనిద్రితులైయున్న వారిని మేల్కొలుపుటకు నాకు మనస్సు దోఁపదు. నీసోదరుఁడును రాక్షసుఁడును నగు హిడింబునివలన నాకెంతమాత్రమును భయము లేదు. నేను యక్షరాక్షస గంధర్వాదులలో నెవ్వనినైనను నతివేగమునఁ బట్టికొని రూపుమాయించునట్టి పరాక్రమశాలిని. ఇఁకను దోఁచినట్లు నీ విచ్చటనే యుండు

టయో, లేక, వానియొద్దకుఁ బోవుటయో, యదియునుంగాక, వాని నిప్పటికి రావించుటయో యేదియో యొక్కదానిని నొనర్పుము. అని చెప్పెను. వీరివృత్తాంత మిటులుండఁగా నక్కడ హిడింబుఁడు తనలోఁ దా నిట్లనుకొనుచుండె. హిడింబ యిప్పటికిఁ బోయి బహుకాలమైనది, ఇంతకును రాదయ్యెను. అని మనంబునఁ దలపోసి తా నారోహించి యుండిన సాలవృక్షమునుండి దిగి రూక్షతామ్రాక్షుండై పాండవులను సమీపించుచుండఁగా, వానిని దూరమున నుండి హిడింబ చూచి యీదురాత్ముం డతికోపసుఁడై వచ్చుచున్నవాఁడు. మీ రేల యిచ్చో టన యుండెదరు. మిమ్మందఱ మోచికొని యాకాశమార్గమున నెట కేనియు సురక్షితమైన ప్రదేశమునకుఁ గొనిపోయెద నని చెప్పఁగా భీమసేనుండు దాని కిట్లనియె. రక్కసీ! భీతిల్లవలదు. నను మార్కొని యీ రాక్షసాధముఁడు బ్రతికిపోనేరఁడు. వాని కంత్యకాలము సమీ పించి యిట్లు మావైపునకుఁ గ్రోధమూర్తియై వచ్చుచున్నవాఁడు. వీఁ డొక్కరుండ కాఁడు. వీనిబంధువులగు రాక్షసు లందఱు వత్తురుగాక! అందఱను గాలుపురికి నతిథులుగాఁ బంపి నీకు ముదం బొనర్తు. కొంత సమరప్రకారము చూచుచుండుము. నీవు చూచుచుండఁగనే వీనిం జంపెద. ఏనుఁగుతొండముఁబోలు నాబాహువులను జూడుము. ఇనుప గుదియలవంటి నాతొడలను వీక్షింపుము. బలిష్ఠమును విశాలమును నగు నాఱొమ్మును బరికింపుము. మహాబలసమన్వితుండనగు నేను నీముంగల నీసోదరునిపై మహేంద్రుంబోలె విక్రమించెదను. మనుష్యమాత్రుండగు వీఁ డెంతటివాఁడని నన్ను నలఁతిగాఁ జూడకుము. అని చెప్పఁగా భీమసేను నకు హిడింబ యిట్లనియె. ఓశూరాగ్రేసరుఁడా! వీఁడు మనుష్యులయెడ దారుణకృత్యంబులను జేయువాఁడు గాన దానిం బలుమాఱు చూచి యుండుటం జేసి నే నింత చెప్పితిని అని చెప్పి హిడింబ యూరకుండె. అయ్యవసరంబున నయ్యసుర మిక్కిలి రోషముతో భీకరాకారముఁ దాల్చి వారిని సమీపించి దివ్యకుసుమమాలికల ధరించినదియై, దివ్యాం బరములను సుందరసుకుమారమనుష్యరూపమును దాల్చియున్న హిడిం బను వీక్షించి యిది కామమోహితయైన దని యెఱింగి కన్నులనుండి నిప్పులు రాల గ్రుడ్ల నతిభీకరముగఁ ద్రిప్పుచు, నో హిడింబా! నేను

బేరాఁకలితో నుండఁగా నాకుడుపున కాటంక పెట్టువాఁ డెవఁడు? నీ వేల యీసుందరాకారముదాల్చి యొరుల కాసఁ గొల్పుచున్నదానవు? పూర్వులగు రాక్షసులసచ్చరిత్రముల కెల్ల నవమానముఁ దెచ్చుదానవు పోలె నిప్పు డీనరుల నాశ్రయించి నాకు విరోధ మాచరింపఁ దలంచెదవు? ఇదె యీపెట్టున వీరలను నిన్నును రూపుమాపెద నని భీమునిఁ బోరునకుఁ జీఁటుటయు వాఁడును యుద్ధమునకుఁ గట్టాయితుండై యోరీ రాక్షసాధమా! ఏమంటి వేమంటివి? ఆఁగు మాఁగుమని యదల్చి నవ్వుచు నిట్లనియె.

## భీముఁడు హిడింబాసురునిఁ జంపుట

ఓరీ ని న్నిప్పుడ హతునిఁ గావించి యీయడవిని నిష్కంటకము చేసెదను. పరువెత్తక నిలువు మని భుజము లప్పళించిన వాఁడును బోరాటమున కెదురునిలిచి సన్నద్ధుండయ్యెను. అప్పు డారక్కసుండు భీమున కిట్లనియె. మానవాధమా! ఈకాఱుకూఁతలవలనను, నిన్ను నీవు నుతించుకొనుటవలనను ఫల మేమి? ఆడిన ట్లొనర్చి పొగడికొనినఁ గదా శూరుండవు. జాగుసేయకుము. నీబలపరాక్రమము లధికము లని పొగరుమాట లాడకుము. నాతో నెదిరి పోరాడ నారంభింతు వేని యప్పుడ కదా యెవరిపరాక్రమ మధిక మని తెలియును. ఇదే మున్ను నిన్ను వధించి నీ వేడినెత్తు రాని, పిదప నీ నిదురించువారిని జంపి వారి నాహారించికొని పదంపడి నిన్ను మోహించియున్న యీ హిడింబను జంపెదను. అని వచించి క్రోధం బినుమడింప నొడ లెఱుంగక భీమసేనునిఁ బట్టుకొనునిమిత్తము చేతులు సాచుచు వచ్చుచుండఁగ భీమసేనుండు తటాలున గొప్పమృగము నవలీలగఁ బట్టుకొను విధమున నొడిసిపట్టుకొని యెనిమిదివిండ్లదూరము జరజర లాగికొనిపోయెను. అంత హిడింబుండు వృకోదరుని గట్టిగఁ గౌఁగిలించి పెల్లఱ పఱచెను. ఆ యఱపునకుఁ దనసోదరులును దల్లియు నిదుర మేల్కొనిన వారికి నిద్రాభంగ మగు నని తలంచి వానిపట్టు తప్పించికొని మఱలి నొడిసిపట్టి మఱికొంత దూరము లాగికొనిపోయెను. అంత రక్కసుండు శత్రువు సామాన్యుండు కాఁ డని తలపోసి మఱింత

విక్రమింపఁగా నప్పు డయ్యిరువురును నఱువదేండ్లయేనుఁగులఁబోలెఁ బోరాడుచుండగా వారిపాదఘట్టనమున కదరి చెట్లును, దీఁగెలును గూలుచుండెను. ఆసమరంపువిజృంభణమునకు మేల్కాంచి కుంతియుఁ, బాండవులును సమక్షమున నున్న హిడింబంజూచి దానిశృంగారాతిశయమున కచ్చెరువొందుచుండఁ, గుంతి దానితో మెల్లన యిట్లనియె. అవ్వా! నీ వెవ్వనిదానవు? ఎచ్చోటినుండి యెచ్చటి కేఁగుదానవై యిచ్చోటి కేతెంచితివి? నీరూపసౌందర్యములను జూడ నీ వీవనదేవతవో, లేక, అచ్చరకాంతవో యని శంక గలుగుచున్నది. నీవృత్తాంతము సవిస్తరముగ మెల్లన నుడువుము. అని యడుగఁగఁ గామరూపమున నున్నయారాక్షసాంగన కుంతి కిట్లనియె. దేవీ! మిక్కిలి దట్టమై సూర్యరశ్మియుఁ జొచ్చుట కసాధ్యమైన చెట్లగుబుళ్లతో నొప్పారు నీవనమునందు నాయన్న యగు హిడింబుండనువాఁడును, నేనును వసించుచున్నారము. మాయన్న మిమ్ము నందఱను జంపి తన కాహారముగాఁ దెమ్మని నన్ను నియోగింపఁగా వాని యాజ్ఞమేరకు నే నిచ్చోటి కేతెంచి మహాబలపరాక్రమశాలి యగు నీకొమరుని విశాలవక్షమును, దీర్ఘబాహువులను, సుందరాకారమును గాంచి, మదనపరవశనై మాయన్న నాకు నియమించి పంపిన కార్యమును జేయలేనిదాననైతి. అంత నీకొమరునియందు నాకుఁ బతిభావ ముప్పతిల్లెను. అటుపై లజ్జావనతవదననై నాభావమును నీపుత్త్రునకుఁ దెలుపుచుంటిని. ఇంతలోన, నేను రాక మసలితి నని నాసోదరుండు హిడింబుండు తాన యిచ్చోటి కేతెంచెను. వాఁడు వచ్చుటయు, నేను వలచిన నీకుమారుఁడగు మహాబలుఁడు వాని నల్ల యా దూరపుఁబ్రదేశమునకు లాగికొనిపోయెను. అంత నిప్పుడు వారిరువు రొండొరుల గెలుచుతలంపులతో ఘోరాకారంబులు గలిగి పెనఁగుచున్నవారు. అని చెప్పఁగా విని యుధిష్ఠి రార్జున నకుల సహదేవులు వా రిరువురును బోరాడుచుండు ప్రదేశమునకుఁ బోయి కొంతదూరమున నుండి చూచుచుండిరి. అవ్విధముగ వా రిరువురు పరాక్రమవంతములైన రెండు సింహములమాడ్కిఁ బోరాడుచుండఁగాఁ గార్చిచ్చుపొగతోఁ దుల్యమగు నేలదుమ్ము పై కెగసి చుట్టుకొనఁగా వా రిద్దఱును మంచుఁ గ్రమ్ముకొనిన రెండుకొండలువోలె నుండిరి,

అంతఁ గొంతవడికి హిడింబునిపరాక్రమ మతిశయించుటను జూచి యర్జునుండు భీమసేనునితో నోశూరశేఖరా! ఈ రేఁద్రిమ్మఱితో నింత సేపు పోరి యలసితివి కాఁబోలును, భీతిల్లకుము, అనుమతి యొసంగుదు వేని వీనితో నేఁబోరి వేగ వీనిఁ గ్రిందఁబడఁద్రోచెద ననఁగా భీమసేనుం డర్జునా! తొందరపాటు వలదు. నాబాహుబలమునకు లొంగినవాఁడు నన్నుఁ బడఁద్రోయంగలఁడే? వాఁడు నాచేఁ జిక్కి మఱల బ్రతికి పోఁగలఁడే? అని చెప్పఁగా నర్జునుండు భీమసేనునకు మఱల నిట్లనియె. ఇచట వీనితోఁ బెనంగుచుఁ గాలయాపన మేల చేసెదు? మనము వేఱొకచోటికి వేగంబ పోవలదే? కాబట్టి యిచ్చోట నాలస్యము చేయరాదు. మఱియుఁ దూర్పుదెస యెఱ్ఱవాఱుచున్నది. సంధ్యా కాలము సమీపించినది. రౌద్రవేళయందు రాక్షసులు మాయావులై విజృంభింతురు. అప్పుడు వీరికి బలము వృద్ధియగును. కావున వీనితోడఁ జెఱలాటము మాని విజృంభించి వేగమున వీని వధింపుము. అని చెప్పఁగా విని యప్పవనసూనుండు మదాతిరేకంబున విహరించుచుఁ బ్రళయ కాలపుఁ బ్రభంజనునిచందంబునఁ జెలరేఁగి వానిని సర్పమును గరుడుం డొడిసిపట్టువిధమునఁ జేతఁ బట్టుకొని గిరగిర నూఱుమాఱులు ద్రిప్పు చుండ మఱల నర్జునుం డోభీమసేనా! వీనిఁ దెగటార్చుట నీ కసాధ్య మేని వానిని వదలుము. ఇదె యాశీవిషతుల్యంబులైన నాలుగమ్ముల వానిశిరస్సును ఖండించెదననిన, భీముండు కడుం గనలి యాహిడింబునిఁ గ్రిందవైచి వానిని బశువును వధించుమాడ్కి వధించుచుండ వాఁడు తడిసినదుందుభిమ్రోఁతవలె మహానాదంబుఁ జేయఁగ భీమసేనుం డాహిడిం బునిశరీరమును దన రెండుచేతులఁ బైకెత్తి నడుము పెళ్లున విఱిచి చిత్రవధంబున వానిం జంపెను. అంత విజయియైన మారుతిని సోద రులును దల్లియును బొగడిరి. అర్జునుండు భీమసేనుని విక్రమమును మిక్కిలి కొనియాడి యిచ్చటికి సమీపమున నేదో యొకగ్రామ మున్నట్లు తోఁచుచున్నది; ఇచ్చోట మనము దారసిల్ల వలదు; దుర్యోధ నుండు తన వేఁగులవారిమూలమున మనల నరయుచుండును; మన మెవరికిఁ దెలియకుండ నెచ్చటి కేనియు వేగమునఁ బోవలయును అని చెప్పెను.

అంత నందఱును వేవేగఁ గుంతిని దోడ్కొని పోవుచుండ హిడిం బయు వారిని వెంబడించి పోవుచుండెను. దానిరాకనుజూచి భీమసేనుండు ఓహిడింబా! రాక్షసులు మోహినీరూపము దాల్చి వైరిని సాధింతురు. నీవు మమ్ము ననుసరింపకుము నీ వెం దేనియుం బోయి బ్రదుకుము. కాకున్న నీసోదరునిఁ బంపినచోటికి నిన్నును బంపెదను. అని చెప్పుచుండఁగాఁ, బరమకారుణికుం డగు ధర్మపుత్త్రుండు భీమున కిట్లనియె. కోపముచేఁ బర వశుఁడవయి యుండినను స్త్రీహత్య నేనాఁటికిని జేయరాదు. అది యధ ర్మము. దేహమును గాపాడుకొనుటకంటె ధర్మమును గాపాడు టత్యుత్త మము. చంపుట కర్హుఁడగు రాక్షసునివధించి ధన్యుఁడవైతివి. వాని చెలియ లని దీని నొక్కరు వధింతురే? ఇది యొకవేళ యలిగెనేనియు మనల నేమి యును జేయనేరదు. దానిని వధించుట యనుచితము. ఈయుద్యమము వలదు వల దని వారించెను. ఇంతలో హిడింబయు నయ్యుధిష్ఠిరునకును గుంతీమహాదేవికిని మ్రొక్కి యిట్లనియె. దేవీ! లోకమున స్త్రీలకుఁ బురుషుల కంటెఁ గామ మధికముగ నుండునుగదా? నేను గామాతురనై నాబంధు మిత్త్రాదులను రాక్షసధర్మమును వదలి నీపుత్త్రుని వరించితి. ఆతండు న న్నేలండేని తనుత్యాగంబుఁ జేయుదాన. ఎన్నియుపాయములఁ బన్నియైన నను నాపత్సమయమున నన్యులకుఁ బ్రాణరక్షణము నేయుటకంటెఁ బరమ ధర్మ మెందుగలదే? మహాత్ములు ధర్మమును నిరాకరించిరేని, దానికన్న వేఱొం డాపద గలదే? ఎట్టికార్యము నొనర్చియైనను బ్రాణరక్షణముచేసి పుణ్యముం గట్టుకొండు. ఇది యుత్తమధర్మము గాని దూష్యముగాదు. కావున నన్ను మీరు మూఢురాలని తలఁచియో, భక్తురాలని యెన్నియో, కాకున్న యాశ్రయించినదాన నని యూహించియో నాయెడ విశ్వసించి నాయభిమతమును దీర్పుఁడు. నేను మీపుత్త్రునిఁ దోడ్కొని పోయి నాయిష్టోపభోగములను సుఖముగా ననుభవించి మఱల మీయుండుతావునకుఁ జేర్చెద. నామాట నమ్ముఁడు. నన్ను రక్షింపుఁడు. మీ కాపద లెవ్వి యేనిఁ గలవేని వానిని నాతో వచింపుఁడు. నేను, వానినుండి మిమ్ముఁ దప్పించెదను. మి మ్మందఱను నేను మోచికొని దుర్గమారణ్యములలో విషమప్రదేశముల నవలీలం దాఁటించి త్వరిత గతి నేగెడుదానను. అని చెప్పఁగా యుధిష్ఠిరుం డాహిడింబ కిట్లనియె.

ఓహిడింబా! నీవు మాతో యథార్థమును బలుకుచున్న దానవు. నేన
నీకుఁ జెప్పు హితమును వినుము. నేను నియమించుమర్యాద గలదానవై
వర్తిల్లుము. భీమసేనుఁడు నిన్నుఁ జేపట్టును. స్నానాహ్నికములను దీర్చి
శుచివై యుండుభీమసేనునితో నీవు శృంగారపు వనములయందు
యథేచ్ఛాసంచారిణివై విహరించుచు రాత్రికాలములయందు నిత్య
మతనిని మాయునికిపట్టునకుఁ దోడ్తెచ్చుచుండవలయును. అని చెప్పి
దానితోఁ బొందుట కీనియమముల నంగీకరించునట్లు భీమసేనుని యుధిష్ఠి
రుండు సమాధానపఱచెను. అంత భీమసేనుఁడును దానికిఁ బుత్త్రుఁడు
కలుగువఱకు దానితో సిష్టోపభోగముల ననుభవింతునని ప్రతిజ్ఞ సేసెను.
అంత హిడింబయు నదేసమయమునుగావించి భీముందోడ్కొని యాకాశ
మార్గమున ననేక పర్వతశిఖరములయందును, గుహాలయందును, నదీసరో
వరతీరములయందును, నానావిధ రమణీయ వృక్షచ్ఛాయలయందును,
విజనంబులై మనోజ్ఞంబులైన పొదరిండ్లయందును విహరించుచుఁ గొన్ని
నాళ్లకు గర్భముఁ దాల్చి భీమసేనునివలన మహాబలుండును, విక్రమ
శాలియు, వేగవంతుండును, మాయావియునునై విరూపనేత్రములును,
గొండగుహావంటి వక్త్రమును, సునిశితములైన కొనలు గలిగి పైకి నిక్క
పొడుచుచున్న వీనులును, నెత్తుని పెదవులును, నిడుదనాలుకయును, దీర్ఘ
నాసయు, విశాలవక్షమును, బెద్దవియై వంకరగనుండుపిక్కలును, వాడికోఱ
లునుగలిగి ఘోరధ్వని సేయుచు నందఱను భయపఱచు నొకకుమారునిం
గనెను. వాఁడు పుట్టుచుండఁగనే కామరూపధరుండై పుట్టి వెంటనే
తారుణ్యమును, సకలశస్త్రాస్త్రవేదిత్వమును మితిలేనిపరాక్రమమును గలిగి
తల్లిదండ్రులు మొదలగువారికి మ్రొక్కి వారియెదుట నిలిచెను. అంత
హిడింబ వానితలయందొక్క వెంట్రుకయైన లేకుండుటంజూచి యయ్యో!
యిదేమి యాశ్చర్యము? వీనితల ఘటమువలె నుత్కచమై యున్నదనియె.
దానింజేసి యాకుమారుండు ఘటోత్కచుండు *నాఁబరఁగె. అంత వాఁడు
తల్లిదండ్రులకు నమస్కరించి యందఱకుం బ్రియుండై నిలిచి వారితో

---

* 'ఘటసాదృశ్యా ద్ఘటశబ్దే నాత్ర శిరః ప్రతీయతే. ఉత్కచః = కేశహీనః హేత్వాశ్చర్యే. వికేశస్థూలశిరస్కత్వాదస్య ఘటోత్కచ' ఇతి నామా బ్రవీదిత్యర్థః. అనఁగా వెంట్రుకలులేక పెద్దకుండవలె గొప్పశిరస్సుగలవాఁడని

నిట్లనియె. మీ కిరువురకును నావలన నేదైనఁ బని కావలసియుండెనేని, యప్పుడు వెంటనే నన్నుస్మరించినంతమాత్రమున నెదుటఁ బ్రత్యక్ష మయ్యెద నని చెప్పి యుత్తరాభిముఖుండై చనియెను. శక్తినిమిత్తంబుగఁ గర్ణునితో నెదిరించి యుద్ధము సేయువానినిగా వీని నింద్రుండు సృజించె. హిడింబయుఁ దన ప్రతిజ్ఞ దీఱిన దని భీమసేనునిపై నున్నమరులు వీడి కామగమనంబున నెచ్చోటికో యేఁగెను.

### వేదవ్యాసుఁడు పాండవులయొద్దకు వచ్చి హితము నుపదేశించి వారల నేకచక్రపురంబుఁ జేర్చుట

పదంపడి పాండవులు జడలు దాల్చి, నారబట్టలు గట్టి వేదాధ్యయనంబు సేయుచు బ్రాహ్మణబ్రహ్మచారులవేషములను ధరించి జననీసమేతులై క్రమమున మత్స్యదేశమును, త్రిగర్తదేశమును, బాంచాలకీచకదేశములను జొచ్చి దిరుగుచు, మార్గమధ్యమునఁ గుంతిని గొంతసే పొకరెత్తికొనియు, నాహారమునకు వేఁటాడియు బహుదూరము దాఁటిపోయిరి. అట్లు పోవుచుండ నొక్కచోట వారికి వేదవ్యాసమునీంద్రుండు గాన్పించెను. ఆమునీంద్రునిఁ జూచుచుండఁగనే వా రైదుగు రన్నదమ్ములును గుంతీదేవితోఁ గూడుకొని సాష్టాంగనమస్కారము లొనర్చి చేతులు జోడించుకొని దూరమున దీనవదనులై నిలుచుండిరి. అప్పు డప్పారాశర్యుండు వారల కిట్లనియె. పాండవులారా! ధృతరాష్ట్రునిపుత్త్రు లధర్మపరులై మీకు మిక్కిలి హాని యొనర్చిరి. దీని నెఱింగి మిమ్మును జూచి మీకు హితమును జెప్పుట కేతెంచితి. దుర్యోధనాదులును మీరును జూడ నాకొక్కరూప. కాని, మీరిప్పుడు దైన్యమును బొందియుండుటచేతను, మీ రతిబాల్యమున నుండువా రగుటను, నాపదలం బొంది పరదేశావాసమును జేయుచుండుటచేతను మీయెడ నాకుఁ బ్రీతి మెండు. ఈయాపదపాలైతిమే యని దుఃఖింపకుఁడు. మీఁదు మిక్కిలి మీకు మే లయ్యెడు. ఇచ్చోటికి సమీపమున నారోగ్యవంతమును, రమణీయంబును నగు నేకచక్ర మను పుర మొక్కటి గలదు.

---

నీలకంఠవ్యాఖ్యార్థము. మఱియు; ఉద్గతాః కచాః కేశాః యస్య స మూర్ధా ఉత్కచః ఘట ఇవ ఉత్కచో మూర్ధా యస్య సః, ఘటోత్కచః' అని సమాసము. కుండవలె వెంట్రుకలులేని తలగలవాఁడు.

ఆపురమున మీ కోరికలు మిమ్ము నెఱుంగ కుండునట్లు కొంతకాల ముండుఁడు. అని చెప్పి వారలం దోడ్కొని యాపురమునకుఁ బోయి వారి నచ్చోట నొకబ్రాహ్మణునియింట నివసింప నియమించి కుంతితో నిట్లనియె. దేవీ! నీపుత్త్రులు విధివశమున బ్రదికిరి. కాకున్న నా పాపాత్మకుత్సితంపుఁ జేఁతలచే వీరందఱు నిప్పటికిఁ బరలోకావాసు లగ నుందురు. ధర్మాత్ముండగు నీయుధిష్ఠిరుండు మహాభుజబలపరా క్రమములు గలిగి యతిరథులగు తమ్ములసాహాయ్యమున నశేష రాజావళిని గెలిచి రాజసూయమహాధ్వరమును నొడ్డోలగంబున నశ్వమేధాది మహాక్రతువులను మహావిభవముతోను విధ్యుక్తప్రకారమున నాచరించి సర్వబంధుమిత్త్రులతోడ మహాసుఖముల ననుభవించును. ఈనామా టను విశ్వసింపుము, కావున నీవు వీర లిట్టు లాపదలపాలై రేయని వగవ వలదు, నేను మఱల నిచ్చోటికి వచ్చి మిమ్మును జూచువఱకు నెలదినము లింద యుండుఁడు. అని చెప్పి వ్యాసుఁ డదృశ్యుం డయ్యెను. * అని చెప్పఁగా విని జనమేజయభూపాలుండు వైశంపాయనమునివర్యున కిట్లనియె. పాండవు లేకచక్రాపురమున నేమిచేసిరి? ఎట్లు బ్రదికిరి? యని యడుగ నమ్మునివర్యుం డానరవరేణ్యున కిట్లనియె.

---

*ఇచ్చట సంస్కృతాంధ్రభారతములకు భేదము పొడసూపుచున్నది. హిడింబ భీమునితోఁ దన మనోభిప్రాయమును జెప్పినప్పుడు తనకు భూతభవిష్య ద్వర్తమానములు దెలియునని చెప్పి దానికి దృష్టాంతముగా నిట్లనియె. "ముందొక్క యాశ్రమము మిక్కిలి రమణీయమై మునిసేవితమై యనేక వటవృక్షములతోను, మేడిచెట్లతోను, పనసచెట్లతోను నిండి శీతలచ్ఛాయ నొప్పారుచుండె. అందు మధురములైన నిర్మలోదకములు శరీరాయాసమును బోఁగొట్టును. అమృతప్రాయ ములై యుండును. కావున వానిం ద్రావినవారికి నాఁకలియు దప్పియుఁ గలుగదు. ఆయాశ్రమము శాలిహోత్రుని తపఃప్రభావమున నేర్పడినది. మీరందుఁ గొన్నినా ళ్లుండుఁడు. మీకడకు వేదవ్యాసమహామునీంద్రుండు రాఁగలఁడు. మీకు హిత మును బోధింపఁగలఁడు." అని హిడింబ భావిని దెల్పినట్లు తెనుఁగుభారతమున నున్నది. ఆతీరునఁ బాండవు లాశాలిహోత్రుని యాశ్రమముఁ జేరి యాకొలని యందు సుస్నాతులై కొంతసే పాక చెట్టునీడయందు విశ్రమించియుండఁగా నచ్చోటికిఁ గృష్ణద్వైపాయనుండు వచ్చి వారికి హిత ముపదేశించి యచ్చో టికి సమీపముననుండు నేకచక్రాపురమునకుఁ బాండవు లేఁగి యాపురమునఁ

ఏకచక్రాపురమున నాబ్రాహ్మణునియింటఁ గుంతీదేవితోఁ బాండవులు మాధుకరముం దెచ్చి బ్రదుకుచు నచ్చోట వారి కెల్లఁ బ్రియంబు నాచరించుచుండిరి. మఱియు వా రేవురును దెచ్చు భిక్షాన్నమును దల్లియెదుటఁ బెట్టుదురు. అంత నాయమ యాయన్నమును రెండుపాళ్లుగఁ జేసి యొకపాలు భీమునకుఁ బెట్టి వేఱొకపాలును దానును దక్కినపాండవులును నతిథులును భక్షించుచుండును. ఇట్లు పాండవు లేకచక్రాపురమున మాధుకరవృత్తిఁబూని వేదాధ్యయనంబు సేయుచు, రమణీయంబు లైన కొలంకులయం దీఁదుచు, వృక్షచ్ఛాయల విశ్రమించుచు, నాబ్రాహ్మణునియింట సుఖమున నుండిరి. అంతట నొక్కనాఁడు ధర్మపుత్త్రుండును, నర్జునుండును, నకులసహదేవులును మాధుకరమునకు బ్రాహ్మణాగ్రహారమునకుఁ బోయిరి. ఇంటఁ గుంతియును, భీముండును

---

గొన్నినాళ్లుండిరని చెప్పి తనదర్శనము మఱల నచ్చోట వారి కగుపర్యంత మాపురమునందే యుండుఁ డని నిర్దేశించెను. మఱియు నాహిడింబను జూచి, యిది భీమసేనునియందు బద్ధానురాగయై యున్నది. దీనిపేరు కమలపాలిక. భీముండు దీని పరిచర్యలకుఁ దనివిఁజెంది దీనియందు మహాబలపరాక్రమశాలి యగు పుత్త్రుం బడయును. వాఁడు మిమ్మును మహాపదలనుండి తప్పించువాఁడై మీయందు మిక్కిలి ప్రీతితో మెలఁగును." అని చెప్పి సాత్యవతేయుం డంతర్ధానమయ్యె నని యున్నది. పిదపఁ గొన్నినాళ్లకు హిడింబ భీమునివలన ఘటోత్కచునిఁ గనె ననియు, బాండవులు శాలిహోత్రునాశ్రమమునఁ గొంతకాల ముండి యనేక శాస్త్రముల నధ్యయనము చేసిరనియు, నామహర్షియాజ్ఞఁ గొని యందుండి తఱలి మత్స్యత్రిగర్తపాంచాలాదిదేశములమీఁదుగా నేకచక్రాపురముఁ జేరి రనియు నున్నది. సంస్కృతభారతమున శాలిహోత్రుని యాశ్రమంపుమాటగాని, హిడింబకు భావిని భూతమును జెప్ప శక్తికల దనిగాని, దానికిఁ గమలపాలిక యను నామాంతరము గాని చెప్పఁబడలేదు. కాని, ఘటోత్కచుండు పుట్టి పాండవుల యనుజ్ఞం గొని యేఁగినపిదప వారు మత్స్యత్రిగర్తాదిదేశముల దాఁటిపోవుచుండ నంత నొక్కచోట వేదవ్యాసుండు పాండవులను జూచి హితమును జెప్పి వారి నేకచక్రాపురమునఁ దాఁ జేర్చి యున్నట్లున్నది. ఈవృత్తాంతమునకు సరివచ్చునట్లు శ్లో. 'ఘటోత్కచస్య చోత్పత్తిరత్రైవ పరికీర్తితా, మహర్షేర్దర్శనం చైవ వ్యాసస్యామితతేజసః.' అని పర్వానుక్రమణికశ్లోక మున్నది. ఈశ్లోకము మేరకు ఘటోత్కచుఁడు జన్మించినపిదప వ్యాసదర్శనము చెప్పఁబడినది.

నుండిరి. అట్లుండ నొక్క యేడ్పుధ్వని యా బ్రాహ్మణుని యింటిలోపల నుండి బయలువెడలెను. అప్పుడు కుంతి భీమునితో నిట్లనియె. భీమసేనా! మన మీవిప్రునియింట బహుకాలముగ నుండుచున్నాము. నిలుచుటకు నీడలేని మన కీబ్రాహ్మణుడు మన ముండుటకుఁ దనయింటి నిచ్చెను. కావున నీతండు మనకు మహోపకారి. ఈయుపకారమునకు మనము ప్రత్యుపకార మొనర్పవలయును. ఆతని కెద్దియో యాపద సంభవించిన ట్లున్నది. ఆయాపదనుండి యావిప్రునిఁ దరింపఁజేయుట నీకుఁగర్తవ్యము. నేనును నీతని కెద్దియైన నుపకారముఁ జేయవలయు నని మదిఁ దలఁచుచుండుదాన. దానికిఁ దగిన ట్లిప్పు డొకయాపద సంభవించెను. ఒకఁడు చేసియుండు నుపకారమును మఱువక దానికిఁ బెక్కుమడుంగు లెక్కువ యైన ప్రత్యుపకారము చేసి కృతజ్ఞతఁజూపుటయే నేర్పు. ఇప్పు డీయాపద యేదియో దానిని విచారించి వచ్చెదను. అందులకుఁ బ్రతీకారము దుష్కరమైనను నీ వొనర్పుము. అనఁగా భీమసేనుండు తల్లిమాటల కిష్ట పడెను. అంతఁ గుంతీదేవి కుమారుని యనుమతంబున నావిప్రుని గదిలోని కేఁగి కొడుకుం గూఁతును భార్యను సమీపమునందుఁ గూర్చుండఁబెట్టి కొని దుఃఖపరవశుండై యున్న యా బ్రాహ్మణుని నేమియు నడుగనేరక యూరక కొంతసేపు వారికి సమీపమునఁ గూర్చుండియుండెను.

అప్పు డా బ్రాహ్మణుం డిట్లనుచుండెను. అయ్యయో! సంసారుల జీవనము లోకమునం దనర్థకముగను, దుఃఖభరితముగను, బరాధీనముగను, ననేకాపదలకు భాజనంబుగను నున్నది. ఈమార్గమున వర్తించువారిని దుఃఖపరంపర లావరించుకొనుచున్నవి. ధర్మార్థకామముల ననుభవించువాఁడు వానివియోగమునఁ బరమదుఃఖమును బొందును. మోక్షమును బొందిన సుకృతి యాదుఃఖముల నెఱుంగఁ డని చెప్పుదురే కాని యాపదవిని బొందుట మిక్కిలి దుష్కరము. అర్థము నానావిధములను దుఃఖమునకు మూలము. వినుఁడు. అర్థము నార్జించుటయందు దుఃఖము సంభవించును. సంపాదించినయర్థమును గాపాడుటయందు మఱింత దుఃఖ మున్నది. కాపాడియుంచిన ధనపిశాచముచేఁ గలుగు దుఃఖ మన్నింటికంటె విపరీతము. ఆలుబిడ్డలతోఁ గూడి యుండువాని కెవ్విధమునను సుఖోపాయమైన జీవనము గన్పట్టదు. అని తనలోఁ దాను విసికికొని భార్యం జూచి

రో తెలివిలేనిదానా ! మన కన్నివిధముల మేలు గలుగఁ గలయూరికిఁ బోవుద మని నేను మున్నే నీతో నెన్నిమాఱులో చెప్పుచుండినను నీవు నాతో "నే నిందుఁ బుట్టితిని. ఇందుఁ బెరిగితిని. నాతల్లిదండ్రులను వదలి వేఱొక్కచోటఁ గాపురము చేయలే నని చెప్పుచుంటివి. నీతల్లిదండ్రులు స్వర్గతులై బహుకాలమైనది. ఈయూర మనకైనబంధువు లెవరును లేరు. ఇన్నినాళ్లు మన మేహేతువుంబట్టి యిట నుండవలసివచ్చినది ? నా మాటలు నాలకింపక బోవుటచే నీయనర్థం బిప్పు డనుభవింపవలసి వచ్చెను. ఇప్పుడు మన మేమి చేయఁగలము? నిన్ను నేను నాతలిదండ్రుల యిష్టానుసారము పెండ్లియై నీయందు సంతానమును బడసితిని. మన మిన్నినా ళ్లనోన్యమ్ముగ వర్తించితిమి. నీవు నాయం దనురాగముతో సకలోపచారములను నా కొనర్చితివి. భోజనశయనాదుల యందుఁ జెలివై వర్తించితివి. పోషణయందుఁ దల్లివలె రక్షించితివి. కావున గృహస్థుఁడనగు నాకు దేవసమ్మతవు సహధర్మచారిణివియు నగు నిన్ను నాప్రాణరక్షణముకొఱకు నారాక్షసునివాత ద్రోయు టెట్లు ? మఱియు నీపుత్త్రునిఁ బంపవచ్చు నంటిమేని, వీఁడు మనకుఁ బిండోదకముల నొసఁగి పుణ్యలోకములకు దారితీయువాఁడు. వీఁడు పుట్టి మన పితరులఋణమును దీర్చినవాఁడు ; మఱియుఁ బున్నామనరకమునుండి తప్పించిన మహోపకారి. అట్టి యీచిఱుతవానిఁ జూచి చూచి పాపమనక నే నెట్లు దయాశూన్యుండనై యారాక్షసుని కాహారముగఁ బంపుదును? మఱియు నీకొమార్తెనంపి కులమునకుఁ బుట్టియున్న యీతెవులును దొలఁగించుకొనవచ్చునంటి మేని, పాప మిది యాఁడుఁగూఁతురు. దీనివలనమనము దౌహిత్రలాభమును బొంది సుఖింపఁగలము. కొందఱు మునులు పుత్త్రునకంటెఁ బుత్త్రిక నూఱుమడంగు లధికమని వాక్రుచ్చిరి. అట్టి కులవిస్తారకుల నీనాఁడు నాకు సంభవించిన యీయాపదకొఱకు నేను బరిత్యజింప నొల్లను. ఇక్కన్నియ వేఱొక్కనికుటుంబమును వృద్ధి చేయుటకై నాయొద్ద నిల్లడగా నుంపఁబడినది. కన్యాదానము చేసినచోఁ దలిదండ్రులకుటుంబముల రెంటిని నుద్ధరింపఁ జాలునది. కొడుకులఁ గని భర్తృవంశమును, దండ్రివంశమును నుద్ధరించునది. ఈకూఁతు నె

ట్లాయసురున కాహారముగా నప్పగింతును? పుత్త్రుఁ డిరువదియొక్క వంశ
ములను నేడుగోత్రములయందు నూటయొక్క పురుషులఁ గడతేర్పఁజాలు
వాఁడు. *చిఱుతవాఁడు నైన యీకసుఁగందును నాయసురనోరి కెరగా
నే నీ నేరను. కావున వాని కాహారముగ నేను పోవుదును. అని యిట్లు
తాన చచ్చుటకు నిశ్చయించుకొనిన బ్రాహ్మణు నుద్దేశించి యాతనిభార్య
యిట్లనియె. ప్రాణనాథా! నివారింపఁదగని యాపదలు వచ్చినప్పుడు
దుఃఖింపక పురుషుఁడు ధైర్య మవలంబింపవలయును. ఇప్పుడు నీ
వేల దుఃఖించెదు? భార్యనై నేను మీగృహస్థధర్మములను జరిపి, కొడు
కును గనుటయును, కూఁతుఁ బడయుటయును, గామమును దీర్చుట
యును మొదలగుపను లన్నింటికి నుపయోగించితిని. నీవు పోయినంతన
న న్నందఱు చులకనగఁ జూతురు. మాంసఖండము నేలఁబడియుండె నేని
దానిని బక్షు లపేక్షించువిధమునఁ బతి లేనిసతిని దుష్టు లెల్ల రపేక్షిం
తురు. కావున సత్ప్రవర్తనము దుష్కర మగును. అంతియ కాక వీరి
కాహారాదులను సంపాదించి తెచ్చి పోషించుట నాకు మిగులఁ గష్ట
మగును. ఒకవేళ నెవ్విధముననైన బోషించితి నేని యనాథబిడ్డలను
శూద్రులు వేదమును గోరునట్లు హీనకులులును, దురభిమానులగు దురా
త్ములును బ్రార్థించుచుండ వారిని కాదని నే నెట్లు యోగ్యుల కీనేర్తును? ఒక
వేళ నేను బట్టుపట్టి యీకున్నను యజ్ఞశాలలో నుండుహోమద్రవ్యమగు
హవిస్సు నేమాత్ర మవకాశముఁ జేసికొనియైనను గాకులు గొనిపోవు
నట్లు నన్నే మఱచి దుష్టులు గొనిపోవుదురు. వంశపరంపరగా వచ్చుసద్వృ

---

* తండ్రిగోత్రము ౧, తల్లిగోత్రము ౨ తోఁడఁబుట్టినవానిగోత్రము 3, భార్యగోత్రము ౪, కూఁతుగోత్రము ౫. మేనయత్తగోత్రము ౬, తల్లితోఁబుట్టినపినతల్లి పెదతల్లిగోత్రము అనునవి యేడుగోత్రములసియు; అందుఁ దండ్రిగోత్రమునఁ దాను తప్ప నిరువదినలువురును ౨౪, తల్లిగోత్రమునం దిరువదుగురును ౨౦, భార్యగోత్రమునందుఁ బదునార్గురును ౧౬, తోఁడఁబుట్టినదానిగోత్రమునఁ బన్నిద్దఱును ౧౨, కూఁతుగోత్రమునఁ బదునొక్కరును ౧౧, మేనత్తగోత్రమునఁ బదుగురును ౧౦, తల్లితోఁడఁబుట్టినయాఁడువారి గోత్రమున నెనమండ్రుగురును ౮ చేరి నూటయొక్క పురుషుల నుద్ధరింప జాలువాఁడు.

త్తికి హానిరాకుండ నే నెట్లు చేయనేర్తు? మఱియును నీపసివానికి విద్య నారంభించి వాని కుపనయనాదివేదోక్తసంస్కారములను జేసి వానిని వేదాధ్యాయినిగాను, శస్త్రాధ్యాయిఁగాను నేనెట్లు చేయగలను? కుమార్తె దుష్టులచే నపహరింపఁబడినను, గుమారుఁడు దుష్ప్రవర్తకుఁ డైనను నాయవమానమును నేను సహింపలేక యప్పుడ యీ ప్రాణములను విడ నాడుదును. అంత నీచిఱుతవారు నశింతురు. ఇది నిశ్చయము. నీనిశ్చయ మునఁ గుటుంబమంతయు నశించును. నేనొక్కతె వానివాతఁ బడిపోయి నను నీవన్నియును సరిచూచుకొన నేర్తువు. సంతానమును, సతియును, స్నేహితుఁడును, సొత్తును నివి యన్నియును పురుషున కైహికాముష్మిక ఫలసాధనములై యాత్మహితముకొఱకని కాదె

*శ్లో. ఆపదర్థం ధనం రక్షే ద్దారాన్ రక్షే ద్ధనైరపి,
ఆత్మానం సతతం రక్షే ద్దారైరపి ధనైరపి. (మనుస్మృతి.)

మున్ను మనువు వక్కాణించెను.

కులమంతయు నొక్కట నిడి తన్నొక్కట నిడికొన్నచోఁ దనకది తుల్యము కానేరదు. ఇంకొకరహస్యము చెప్పెద వినుము. నేను రక్క సున కాహారమై పోదు నేని, వాఁడు నన్ను వధించినచో స్త్రీహత్యా పాతకము తనకు వచ్చునను ధర్మము నొకవేళ పరిశీలించి విడిచినను విడిచి పుచ్చును. లేదా, నన్ను మ్రింగునేని నా కేలోపమును లేదు. ఇన్నినాళ్లు నీతో సర్వభోగముల ననుభవించితిని. ప్రియముల నెల్లఁ బ్రీతితోఁ బొందితిని. వ్రతముల నెల్ల విధ్యుక్తముగ నాచరించితిని. కులము నుద్ధ రించునిమిత్తము కొడుకుం గూతుం గంటిని. మఱియు నాయనంతర మున నీవు వేఱొక్కవనితను బెండ్లియాడి యగ్నికార్యములకు లోపము గలుగక గృహస్థధర్మమును నెఱవేర్ప వీలగును నీవు లేకున్నప్పుడు నేను మఱియొకని వరించుట దూష్యము. ధర్మవిరుద్ధము. నన్నంపుము.

*ఆపత్కాలమును దాఁటునిమిత్తము ధనమును సంగ్రహించి కాపాడవలయును. అట్టిధనము వెచ్చించి యైనను భార్యను రక్షింపవలయును. అట్టిభార్యను ధనమును బోఁగొట్టికొని యైనను తన్నుఁ దాను రక్షించుకొనవలయును.

నేనా యసురకు బలి నగుదు. నీవు వేఱొకస్త్రీని బెండ్లాడి యీబిడ్డలను
బోషించుచు విధ్యుక్తమగు గార్హస్థ్యధర్మమును నడపుచుండుము.
అని తెంపరియై పలికిన భార్యను బ్రాహ్మణుఁడు కౌఁగిలించుకొని కన్నీరుఁ
గార్చుచుండ నాభార్యయును నేడువఁ దొడంగెను.

ఇవ్విధంబున నేడ్చుచుండు తల్లిని దండ్రిని జూచి కూఁతు రిట్లని
చెప్పెను. ఇట్లు మీ రిరువురు నేల శోకింపవలయును? నే నొకయుపాయ
మును జెప్పెద. తగియున్నచో దాని నాచరింపుఁడు. రక్కసునకు
నే నాహారమునై పోయెదను. ఇది యుచితము. ఎప్పటికైన నన్నొరుల
కొసఁగి వీడవలసినది యవశ్యముగ నున్నదికదా? విడువవలసినదానను
న న్నిప్పుడే విడువుము. అట్లొనర్తువేని కులమునకు మే లగును.
సంతానమున సంకటముల దొలఁగించికొని సుకృతులలోకమును బొంద
వలసినది గదా? కడుపునఁ బుట్టిన బిడ్డలు తలిదండ్రుల కుభయలోకముల
యందును నాపదలఁ దొలఁగింతురు. అది వారిధర్మము. తండ్రితాతలకు
నావలనఁ గలుగు దౌహిత్రలాభమువలని పుణ్యలోకములు, నే నవివా
హితనై యపత్యములను బొందక మరణించితి నేని నశించు నని శంకింప
కుము. నీవుమాత్రము బ్రదికియుంటివేని యనేకపుత్త్రపౌత్త్రదౌహిత్త్రు
లను బొంది వంశమును వృద్ధిపఱచెదవు. అట్లు వృద్ధియైన వంశమువలనఁ
బితరులకుఁ బుణ్యలోకములు తఱుఁగనివి కలుగును. తల్లిదండ్రులు
లేనిచో నేనును నాతమ్ముఁ డగుసీపసిబాలుఁడును నీతిమార్గమునఁ బెనుపఁ
బడక చెడుదుము. నేను రక్కసునకు బలియగుట దేవపితృప్రీతి గాకు
న్నను నీవు వదలు నువ్వులనీళ్లచేఁ దప్పక పుణ్యలోకములు గలుగఁ
గలవు. పుత్త్రుఁడు తనకంటె వేఱు గాఁడనుటచేతను, భార్య సహధర్మ
చారిణి యగుటచేతను వారలను విడనాడ రాదు. కావున జాగుసేయ
కుము. వంశమునకు హితముగా నాపంపు ననుష్ఠింపుము. అని చెప్పిన
నాతలిదండ్రులు మిక్కిలి దుఃఖముతో నుండిరి. అప్పు డైదేండ్లబాలుఁ
డొక్కఁడు చేతఁ జిన్నపుల్ల నొకదానినిఁ బట్టుకొని యిటునటు సంచరిం
చుచు నవ్వుచు వారల నోదార్చువానివోలె మీ రేల చింతిలుదురు?

ఆక్రూరరాక్షసుని నే నీపుల్లతోఁ బొడిచి మీకు శోక ముపశమిల్ల జేసెద ననఁగా, వాని తేనెలొలుకు తొక్కుమాటలకు వా రానందించు చుండిరి.

అప్పుడు కుంతీదేవి సమయముఁ జూచి వారిని సమీపించి చింతా సముద్రమధ్యమున నున్నవారలఁ దనతేనియలొలుకు పలుకుం దేల్చి నిశ్చయించి వారితో నిట్లనియె. భూసురవర్యా! ఈ దుఃఖమునకు గతం బేమి? నాకు సాధ్య మగు నేని మీదుఃఖము నపనయించెద. నాకుం జెప్పఁదగిన దేని చెప్పు మనఁగా బ్రాహ్మణుఁ డిట్లనియె. దేవీ! సహజసా ధువుల కివ్విధమైన తలంపులు గలుగుచునే యుండును. మాకష్టము మానవమాత్రులకు నివారింప సాధ్యమైనది కానేరదు. అయినం జెప్పె దను. ఈపురమునకు సమీపమున ననుదినము మనుష్యమాంసమును దిని మదించి యుండు బకుండను రాక్షసుం డున్నవాఁడు. ఈయూరివారి కే విధమగునాపదలను రానీయక వాఁడు రక్షించును. వాఁ డవ్విధమున మా రిని గాపాడునిమిత్త మీపురములోఁగాపురముండువా రిలువరుస ప్రకార మిరువదిబారువులబరువుగల శాల్యన్నమును రెండెనుపోతులను గొని పోవు మనుష్యుని ననుదిన మాహారముగ నిచ్చుట కొడంబడిరి. ఆవరుస క్రమమున నీదినమువంతు మాదైనది. ఈనిర్బంధమును దొలఁగించుకొ నుట కెవ్వరైనను యత్నించి రేని యాఁపొలసుదిండి వారల నెల్ల నొక్క పెట్టఁ బైఁబడి కబళించును. కావున నీయూరివా రెల్ల రందులకు వెఱచి చేయునది లే కూరకయున్నారు. ఈదేశపురాజు వేత్రకీయగృహ మనుచోట నున్నాఁడు. మాకు వీనిబాధఁ దొలఁగించుయత్నమే యారాజు చేయఁడు. దుర్బలుఁ డైనయారాజు దేశమున నుండు మాకు నెల్లప్పుడు నీయాపద దాఁటరానిది. కుత్సితుఁ డగురాజుదేశమున నుండు ప్రజలెల్ల భయముల ననుభవించి తీరవలసినదే కదా? ఆప్రజలలో బ్రాహ్మణులు రమణీయవృక్షములందుఁ ద్రిమ్మరులుగా జీవించు పక్షులం బోలినవారు. వా రుత్తమరాజపరిపాలితదేశములలో నుండఁదగినవారే కాని యనిశ ముపద్రవముల కాకర మగు దేశములలో నుండఁగలరా?

మఱియు బ్రాహ్మణుండు మొదట రాజాశ్రయమును సంపాదింపవల
యును. పిదప ననుకూలయు, రూపశీలగుణసంపన్నయు నగు దారను
బరిగ్రహింపవలయును. అవ్విధమున సుఖజీవనము చేయవలయును.
ఈరక్కసున కెరగా మాలో నెవ్వరము పోఁగలము. ఈ గ్రామమున
బ్రాహ్మణులకు నుత్తమరాజాశ్రయము లేదు. మఱియు నధికధన మార్జిం
పమి నెవ్వని నైనం గొని యీ కార్యమును నెఱవేర్ప లేము. మే
మొండొరులను విడువఁ జాల కందఱము నా రాక్షసునివాతఁ బడిమ్రందె
దము. ఏమి చేయుదమూ? యని దైన్యముతో నున్నా ననఁగా నా
విప్రునకుఁ గుంతి యిట్లనియె.

విప్రశ్రేష్ఠా! వినుము. నీయాపత్సముద్రమును నీవు దాఁటుటకే
నొకయుపాయము నూహించి చెప్పెదను. నీకుఁ గుమారుఁ డొక్కఁడు.
కూఁతురు నొక్కతె. వారలఁగాని భార్యనుగాని పంపఁదగదు. నాకేవురు
పుత్రులుగలరు. నీకుఁ బ్రియం బొనర్చుటకై యొక్కనిఁ బంపెదను.
అనుచుండఁగనే కుంతి కాబ్రాహ్మణుండిట్లనియె. దేవీ ! నీచెప్పినమాట
నీకుఁదగియున్నది. వేఱొకరికిఁ దలఁపనైన నలవియే ? బ్రాహ్మణార్థం
బుగఁ దన్నుఁగాని తనకొడుకును గాని వదలుటకు సాహసించిన
ధర్మబుద్ధియు, సాధుస్వభావమును గల వనితలు లాఁతివా
రుందురే? అయిన నామాట వినుము. మీరు బ్రాహ్మణాతిథులైమా
యింటినీడలో నున్నవారు. అట్టివారికి నాదేహము నైన నర్పించి పుణ్య
మునఁ బోవుదును గాని నాకొఱకు మీ రసురవాతఁ బడుటకు నే
నొప్పను. దీనిం దలంచినమాత్రమునఁ బాతకములలో నెల్ల మేటి
యగు బ్రహ్మహత్యామహాపాతకము సంఘటిల్లును. నేను బోయితి నేని
యాత్మహత్య గల్గదా యంటి వేని సమాధానమును వినుము. ఆత్మహ
త్యను బుద్ధిపూర్వకముగ నేఁ జేయను. హత్యఁ జేయువాఁడు రక్క
సుండు. దానం గలుగు మహాపాతకము వానిని జెందును. తన్ను రక్షిం
చుకొనుటకు బుద్ధిపూర్వకముగఁ జేయు బ్రహ్మహత్యకుఁ బ్రాయశ్చిత్తం
బును లేదు. ఆపదసమయమునం దయినను దమయింట నీడకై వచ్చి

శరణార్థులైయుండు బ్రాహ్మణులను దనకు న్యాయముగ రక్కసునివాతఁ బడుట కంపుట దూష్యము, నతిక్రూరము నని యాపద్ధర్మము నెఱింగిన శాస్త్రజ్ఞులు వక్కాణించెదరు. భార్యాపుత్త్రాదిసమేతుండనై నేనే యా యసుర కాహారంబుగాఁ జని యసువులఁ బోనాడుదునుగాని, నా నిమిత్త మీబ్రాహ్మణాతిథులను నాపాపాత్ముచేఁ జంపించు ప్రయత్నమున కేనాఁడును నేఁ బాల్పడనేరను. అట్టితలంపు నామనస్సున నైతము సంభవింపదు అని చెప్పఁగా నాబ్రాహ్మణునకుఁ గుంతీదేవి యిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! వినుము. బ్రాహ్మణుల నెట్లయినను గాపాడవల యు నని నాకు మనస్సున విశేషమైన యాతురత గలిగియుండుటచే నా పుత్త్రునిఁ బంపఁ దలంచితిని. వాఁడు సామాన్యుఁడైన మనుష్య మాత్రుండు గాఁడు. వాఁడు మిక్కిలి బలవంతుఁడు. అదియునుంగాక మంత్రసిద్ధుండు. వాఁ డారాక్షసున కాహారము గానేరఁడు. అంతియ కాక వానితోఁ బోరాడి వానిని వధించి రాఁగలఁడు. ఇది నిశ్చయము. కావున నాపుత్త్రుం బంపెద నని నేను ధైర్యముతో నొడంబడితిని. కాని, మనఃపూర్వకంబుగ వీనిని రాక్షసున కాహారంబుగాఁ బంపఁదలం చినదానను గాను. అట్లగుటచేత నీయుపాయమును నీతోఁ జెప్పితి. లోకమున నూర్వురు పుత్త్రు లున్నవారును నెవ్వరును నొక్కనినైన బుద్ధిపూర్వకముగఁ జావునకుఁ బంపరు. ఈవిషయ మీరాయూర నెవ్వరి కిం జెప్పకుము. వీఁ డిదివఱ కెందఱినో రాక్షసుల జంపి యున్నవాఁడు. మీకు మృత్యువైయుండు నీరాక్షసుని వాఁడు చంపి వేగంబ పురమున కరుదెంచును. గురువున కీవిషయము తెలిసె నేని యాతండు నివారిం చిన గురునాజ్ఞను గాదని నాకొడు కీకార్యమును జేయ నొల్లఁడు. గురువు వల దనునేని యాకార్యమును జేయరాదు కాదే? చేసిన హాని కలుగదే? యని చెప్పెను. అంతబ్రాహ్మణుండు సకుటుంబముగ సంతు ష్టుండై కుంతివాక్యమును, విశాలహృదయమును, దనకు మహోప కారముఁ జేయఁదలంచిన, యాదేవియత్నమును గొనియాడెను. అంతఁ గుంతియును నాబ్రాహ్మణుఁడును, బకాసురునిమిత్తముగ సంభవించిన

యాపద నంతయు భీమసేనుం బిలిచి చెప్పి యటుపై నాయాపదనుండి తమ్ము నివారింప వేఁడఁగా భీమసేనుండు వారు చెప్పిన ట్లొనర్చెద నని యొడంబడెను.

ఇంతలో యుధిష్ఠిరార్జుననకులసహదేవులు భిక్షఁదెచ్చుటకేఁగిన వారు భిక్షం గొనివచ్చిరి. అప్పుడు యుధిష్ఠిరుఁడు భీమసేను ముఖము నానందభరితముగా నుండుటతెలిసి తల్లిని రహస్యప్రదేశమునకుఁ బిలిచి భీమసేనుండు సమరోత్సాహిగఁ గాన్పించుచున్నాఁడు. కారణ మేమి యనఁగా యుధిష్ఠిరునకుఁ గుంతి యిట్లనియె. మనభీమసేనుఁ డిప్పుడీయింటి బ్రాహ్మణున కుపకార మొనర్చుటకు నాచే నియమింపఁబడెను. మన ముండుట కిన్నినాళ్లు సెలవు నిచ్చి యుండిన బ్రాహ్మణున కేదైన నుప కారమును జేయవలయు నని తలంచియుంటిని. అది యిన్నినాళ్లకు సమ కూఱెను. వారి కొకయాపద సంభవించెను. ఈపురమున కామడదూర మున బకాసురుఁ డనురక్కసుఁ డున్నాఁడు. వాఁడు ప్రతిదిన మీపుర మువారి ననేకులను జంపి తినుచుండఁగా వీ రందఱు నొక్కటై వానితో నొక నియమ మేర్పాటుగావించికొనిరి. ప్రతిదిన మొకబండిలో నిరువదిబా రువులశాల్యన్నమును రెండెనుపోతులను వీనిం దోలికొనిపోవు నొక మనుష్యుని నాహారముగాఁ బంపున ట్లానియమము. ఆమేరకు నీపుర వాసు లిలువరుసగాఁ బంపుచుందురు. ఈదిన మీబ్రాహ్మణునివంతు వచ్చి నది. అసుర కాహారముగఁ బోవలసివచ్చెనే, తమలో నెవరు పోదమని ఖిన్నులై యుండఁగా నేను మనభీమసేనుని వాని కాహారముగఁ బంపెద నని యొడఁబడి వారి నూరడిలఁజేసితిని. బ్రాహ్మణార్థ మీకార్య మొన ర్చుటవలన మనకు శాశ్వతపుణ్యలోకములు గలుగును. అనిచెప్పఁగాఁగుంతీ దేవికి యుధిష్ఠిరుఁ డిట్లనియె. తల్లీ! ఇది యేమి కార్య మని యొడంబడి తివి? పుత్త్రత్యాగము వేదవిరుద్ధమైనకార్యము. వానిబాహుబలము నాశ్రయించి కదా మన మిప్పుడు జీవించియున్నారము. పాపాత్ముఁడైన దుర్యోధనునిచే నపహరింపఁబడిన మనరాజ్యమును మఱలఁగొనుటకువాని బాహుబలమునే నేను నమ్మియుండువాఁడను. ఇంత సాహసకార్యము నెవ రైనను జేయుదురే? పరులనిమిత్తము నీకొడుకును నీవు విడుచుట తగు

నా? మఱియును వీనిబాహుబలమునకు వెఱచియే కదా దుర్యోధనుండు రేయింబవళ్లు నిదుర లేక శకునితోఁ గుత్సితమార్గముల నాలోచించు చుండును. మన మిప్పుడు లక్కయిండ్లలో దహింపఁబడక పురోచనాది దుష్టులనుండి తప్పించుకొని రాఁగలిగిన దంతయును వీనిబాహుబలసామర్థ్యముననే కదా? వీనిబాహుబలము నాశ్రయించి ధార్తరాష్ట్రులను యుద్ధమునందు వధించి రాజ్యలాభమును బొందవలయు ననునాశ నంతయు నివ్విధమున నిరాశ గావింతువే? వానిని త్యజింపవలయు నని నీకెట్లు తలంపు గలిగెను? వ్యసనపరంపర లావరించుచుండఁగా నీకుఁ జిత్తస్థైర్యము లేక బుద్ధిపాటవము నశించెను. అని చెప్పఁగాఁ గుంతీదేవి ధర్మపుత్త్రు ననునయించుచు నివ్విధమున సమాధానపఱిచెను. ధర్మతన యా! నీవు మనవృకోదరుని విషయమునఁ జింతింపవలదు. ఈబ్రాహ్మణుని యింట మనము దుర్యోధనాదులకుఁ దెలియక సుఖముగ నున్న వారము. బుద్ధిమాంద్యమువ నీకార్యమునకు నేను వృకోదరుని నియ మించినదానను గాను. ఈ బ్రాహ్మణునియింట మన మిన్నినాళ్లుండు టను వారి కేదైనను బ్రత్యుపకారమును జేయఁదలఁచి యుంటిని. ఈ కార్యమును మన వృకోదరుఁ డొనర్చినను వానికి హాని కలుగ నేరదు. ఈకార్యము నొనర్చినవారమైె వారికిఁ బెక్కుమడంగు లుపకారమును బ్రతిగా నొనర్చినవార మయ్యెదము. ఒకరు చేసిన యుపకారమునకుఁ బెక్కుమడుంగు లెక్కువయైన ప్రత్యుపకార మొనర్చువాఁడె కృతజ్ఞుఁ డనఁబడు నని నీకుఁ దెల్లంబె కదా? మన మున్నయింటి యీబ్రాహ్మణునకు బకాసురుం డనునసురవలనిబాధ తీర రానివ్యసనముగ నున్నది. అట్టివ్యసనమును నివారించునిమిత్తము భీముఁడు నియమింపఁబడుట యుచితమైయుండు. భీమసేనుం డనన్య సామాన్యుండు. మనలను లక్కయిల్లు వెలువరించినప్పుడు వానిధైర్య మును సాహసమును బలమును వీక్షించితివిగాదే? మఱియు నాఁటి రాత్రి హిడింబుని వధించుసమయమున వానికార్యమును బలమును దెలిసియున్నవాఁడవే కదా? మఱియు వాఁడు పుట్టినకొన్నినాళ్లకు

నేను వానిని నాయొడియందుఁ బెట్టుకొనియుండఁగాఁ బెద్దపులి యొకటి మమ్ము సమీపించెను. అప్పుడు నేను దొందరపడి యొడిలో నున్న శిశువైన భీమసేనుని మఱచి ప్రాణాతురనై పరువెత్తితిని. నేను లేవఁగనే నాయొడియం దుండి నల్లఱాతిపైన భీమసేనుండు పడెను. వీనిదేహస్పర్శమున నానల్లఱాయి తునియలయ్యెను. వానిబల మసామాన్యము. అతఁడు పదివేలయేనుఁగులబలము గలవాఁడు. చక్రపాణి యగు భగవంతునితోఁ బోరాడ సామర్థ్యము గలపరాక్రమశాలి. బ్రాహ్మణున కుపకారమును జేయవలసినసమయము సంభవించినది. కావున సమయమున విప్రుని నుద్ధరించితి మనుబుద్ధితో నీకార్యమునకు భీమసేనుని నియమించితిని గాని, వేఱొండులోభమునఁ గాని, యజ్ఞానమునఁగాని నియమించినదానను గాను. ఈకార్యముచేత బ్రాహ్మణునకుఁ బ్రత్యుపకారమును దుష్టశిక్షణపూర్వసకలజనసంరక్షణమును నను ధర్మమూలములగు రెండు మహాఫలములను బొందఁ గలుగుదుమని బుద్ధిపూర్వకముగ నిట్లు నియమించితిని. క్షత్రియుఁడు విప్రవిషయమున నేయుపకార మొనర్చినను బుణ్యలోకములను, క్షత్రియవిషయమున వానివధను దప్పించి రెండులోకములయందు విస్తారమగుకీర్తిని, వైశ్యునకు దుఃఖనివారణము గావించి సాయపడి సర్వజనానురంజనమును, శరణుఁజొచ్చిన శూద్రుని నాపదనుండి తప్పించి రాజపూజితమై యైశ్వర్యయుక్తమైన యుత్తమవంశమునందుఁ బుట్టుటయును బొందు నని పూర్వము మహనీయుండైన వేదవ్యాసమునీంద్రుండు వక్కాణించియుండె. కావున నే నవిచారమునఁ గాక బుద్ధిపూర్వకముగనే భీమసేను నీకార్యమునందు నియమించితిని. అని చెప్పఁగా విని యుధిష్ఠిరుండు తల్లి కిట్లనియె. అమ్మా! పరిశీలింపఁగా నీయాలోచన మిక్కిలి సమంజసమైనది. పరమకారుణికురాలవై బ్రాహ్మణునియాపదను దప్పించుబుద్ధితో మనభీమసేనుని బకునకాహారముగఁ జేసి సర్వకంటకుఁడగు నాయసురను వధించుటయందు సదాలోచనాపరురాలవై పంపుచున్నావు గావున, నతం డారక్కసునిఁ జంపి విజయము గొనుట నిశ్చయము. ఈవృత్తాంతము నూరనెవరికిం దెల్పకుండు నట్లా

భూసురునకుఁ దెలుపు మని చెప్పి తల్లి నియామమునకు యుధిష్ఠిరుండు పరమసంతోషముతో ననుమతి నిచ్చెను.

## భీముండు బకాసురుం జంపుట

అంత నారాత్రి గడవఁ బ్రభాతం బయ్యెను. అప్పుడు భీమసేనుం డాబ్రాహ్మణునిం బిలిచి యిట్లనియె. *విప్రవరా! వినుము. నాకు రాత్రి యెల్లఁ గూడు లేదు. కడుపు పేరాఁకట నకనకలాడుచున్నది. నాకు శరీరము మిక్కిలి బడలియున్నది. రక్కసునితోఁ బోరాడుటకుఁ దెంపును నుత్సాహమునుగలిగింపఁగల రసయుక్తమగుదివ్యాహారము మొదట నాకొసఁగుము. నేను దానిని భుజించి బలియుండనై యారాక్షసుని నీదినము యమాగారమున కతిథినిగాఁ జేసి నీకుటుంబమునకును నీయేకచక్రపురవాసులకును నపరిమితానందమును జేసెద నని చెప్పఁగా నాబ్రాహ్మణుండును నాతనిచుట్టములును వేవేగ విస్తారమైన భక్ష్యభోజ్యములతో రసయుక్తమైన యపరిమితాహారములను నేతికుండలను పెరుఁగుభాండములను దక్షిణమె కొని తెచ్చి యీయఁగా భీమసేనుండు వాని నెల్ల నారగించి తృప్తుండై వివిధాన్నములతో నిండినదియు రెండుమున్న పోతులం బూన్చినదియునగు బండినెక్కి పురమునకు దక్షిణపువైపునంజని యెండి యెండనిమాంసపు దుర్గంధముతో ననహ్యమైన బకుం డుండుతావునకుఁ జేరక దూరమున నున్న యమునాతీరమున బండిని విప్పి యమునాజలములయందుఁ గాలు సేతులు గడిగికొని బకుని పేరెలుంగునఁ దనస్థానంబు

---

* ఈవిషయము సంస్కృతభారతమున నిప్పుడు లభించు నానావిధప్రతులలో నెక్కడను గానరాదు. కాని యాంధ్రభారతమున నన్నయభట్టారకుఁ డీభాగమున కాంధ్రీకరణము గావించెను. అయినను నానందపూర్ణమునీంద్రుఁడు రచించినమహాభారతవ్యాఖ్యయగు "రత్నావళి"యందు ఈభాగమునకు వ్యాఖ్య కానవచ్చుచున్నది. కావున నీకథాభాగము నన్నయభట్టారకుఁడు మహాభారతాంధ్రీకరణముఁ జేయుచున్నకాలములోని ప్రతులయందును, రత్నావళి వ్యాఖ్యకర్త భారతవ్యాఖ్య నొనర్చుచున్నకాలములోఁ బ్రతులయందును, మూలగ్రంథమునఁ నుండియుండును. ఏకారణముననో యీ భాగము వానిలో శైథిల్యము నొందియుండును. అయినను దీని కిందువచనము చేసితిమి.

నకు రమ్మని చీరుచు వాఁడు తన్నుఁ జేఱునంత కూరకయుండ నేల యని యాబండి నెక్కి యందున్న యాహారమును దినుచుండెను. బకుఁడును దన్నొకసామాన్యునిగాఁదలంచి యీమనుష్యుఁడు చీరుచున్నాఁడే యని కన్నుల నిప్పులురాల్చుచు, నిక్కవొడిచినవీసులతోను, వడివేయుచుండిన మీసములతోను, భీకరమైనవిరూపమును దాల్చి తనమహాకాయము తోఁ గోపఘూర్ణితమానసుండై బొమలు ముడివెట్టి పెదవులను గఱచుచు భయంకరమైనకోఱలతో నున్న నోరు దెఱచి నేల యదురుచుండఁ బరుగెత్తికొనివచ్చి తనకుఁ గాఁ దెచ్చినయాహారమును గజకబళము లంతలుగాఁ జేసి నోటఁ గూరుకొనుచు, మ్రింగుచున్న భీమసేనుని రూక్షవీక్షణంబులను జూచి యీపొగరుపో తెవ్వఁడు? నాకుఁగా నేకచక్రాపుర పౌరులు వండినయాహారమును నాయెదుట నిట్లు నిర్భయముగఁదినుచున్నాఁడు? అంత కాలయమును జూచుటకు సిద్ధముగనున్నవాఁడు. అని యదలించిపలుకఁగా భీముండాపలుకులువిని వానిముఖమునుజూచి నవ్వుచుఁ గొంతసేపుండి,మఱియుఁ గొంతసేపు వానిముఖమునైనంజూడక యలక్ష్యముగా శకటమున నున్న యన్న మంతయును భుజించుచుండ బకుండు ఘోరమైన యొకయఱ పఱచి భయంకరముగఁ దనరెండుబాహువుల నెత్తి భీముని వధించునిమిత్త మతివేగమున వచ్చుచుండె. అప్పటికి భీముండు చలింపక బండిలో నన్నమును గదలక మెదలక కుడుచుచుండె. ఇవ్విధంబునఁ దనయాటోపమునకు భయంకరధ్వానమునకు మను జుండు బెదరలే దని బకుం డతిక్రుద్ధుండై భీమునిఁ దనరెండుచేతులతో వీపునఁ జఱచెను. భీముం డాప్రహారమును సరకుచేయక భోజనాసక్తుండై యుండఁగా బకుండు కోప మినుమడింప సమీపమున నున్న యొకమహావృక్షమును మొదలంటఁ బెఱికి వానిపై విసరివైచెను. అంతకుఁబూర్వమే భీముండు కుడుపు ముగించి యేటిదరికిఁజని చేతులు కాళ్లు గడిగికొని యాచమించి పోరునకు సంసిద్ధుఁ డగుటయు నారాక్షసుఁడు విసరివేసిన చెట్టు భీమునిపైకి రాఁగా వాఁడు దానినొడిసిపట్టుకొనెను. అంతటఁబోక యారాక్షసుండు వేఱొకమ్రాకుఁ బెకలించుకొని భీమునిపై వేయుటయు భీముండు దానిని దనచేతిమ్రానితో రెండుతునుక లగునట్లు గొట్టెను.

ఇట్లెన్ని వృక్షములను వైచినను భీముండు తనచేత నున్న చెట్టుతో వానిం గొట్టి భగ్నములఁ గావించుచుండెను. ఇట్లిరువురును గొంత సేపు చెట్లతో యుద్ధమును సలుపఁగా సమీపమున నుండు చెట్లన్నియు నశించి బయలయ్యెను. అంత బకాసురుండు భీమసేనుంజూచి యిట్లనియె. ఓరీ మానవాధమా! నే నెవరని తలంచి నాతో యుద్ధసన్నద్ధుఁడవై వచ్చితివో యెఱుంగను.నన్ను బకాసురుండని యెఱుంగవేమో?చక్కఁగానిలుపుము. మల్లయుద్ధమున నిన్ను యమలోకముం జూడ నంపెద. అని చేతులు చాచి భీముని గట్టిగాఁబట్టికొనెను. అప్పుడు భీమసేనుండును రక్కసుని మెదలకుండ నుండునట్లు దృఢముగఁ బట్టుకొనెను. అంత నాయిరువురు మల్లరంగములోని మల్లులంబోలెబరస్పరజయకాంక్షులై యొకరినొకరుకూలఁద్రోయుచు,విసరివైచుచు, జరజరలాగుచు,భుజములందట్టుచుఁ,దొడల నప్పళించుచు మల్లయుద్ధమును జేయుచుండ వారలపాదముల తీవ్రస్పర్శంబున సమీపవృక్షములు ప్రహరింపఁబడి నుగ్గునూచలై పోవుచుండెను. అంత వాయుపుత్త్రుండు కొండొకవడికి విజృంభించి యారక్కసుఁబాగరడంచి వాని నేలనడిమి మోఁకాళ్లం గుమ్మి కుడియెడమచేతులతో నా రక్కసునడుమును గంఠము నవలీలగాఁబైకెత్తి మోఁకాలిచే వీఁపు విఱుగునట్లువొడిచెను. అంత పిశితాశనుండు నోటముక్కునేత్రములయందు నెత్తురువెడల భయంకరారావుండై మృతుం డయ్యె. ఆఘోర మగు నఱపును విని భయకంపితగాత్రులై బకాసురునిబంధువులు సమీపించి నలుదెసలం జూచుచుండ నాకుంతీతనయుండు వారలంజూచి యిట్లనియె. రక్కసులారా! తెలియ వినుఁడు. ఇఁక నెవరైనను మనుష్యమాంసాపేక్ష గలవారై మానవులను హింస చేయుదు రేని వారి కెల్ల నీబకునిగతియే కలుగు నని తెలియుఁడు. అని భయంకరమైన యెలుఁగుతో బెదరింపఁగా వారుభీతిల్లి తమతమనివాసంబులఁ కేఁగిరి. నాఁటఁగోలె నేకచక్రాపురనివాసులు రక్కసులపీడ తొలఁగి సుఖులై యుండిరి. భీమసేనుండును బకునికళేబరము నీడ్చుకొనివచ్చి పురబహిర్ద్వారంబునవైచి

యేటియందు సుస్నాతుఁడై యా బ్రాహ్మణునియింటికిఁ బోయి తాను గావించిన బకవధవృత్తాంతము నంతయును యుధిష్ఠిరునకు విన్నవించెను. మఱునాఁడు ప్రభాతమున నేకచక్రపురజనులు కొందఱు ఊరివెలుపట గైరికాదిధాతులోహితంబైన బకునిపర్వతముఁబంటికళేబరము నెత్తుటితో గడ్డకట్టి భయంకరముగ నుండుటను జూచి యాశ్చర్యమును బొంది యూరిలోని కరిగి యందఱకుం దెలిపిరి. అంత నూరివా రాబాలవృద్ధముగ నచ్చోటికి కేతెంచి యామృతకళేబరమును జూచి యీదుష్టాత్ముని జంపిన మహానీయుం డెవ్వండో యని యాతనిం బొగడుచు నానందసముద్రమున నోలలాడుచు దేవతలకు మ్రొక్కుచు నిలువేల్పులఁ దలంచుచు నేఁడెవరి కిలువరుస యని యెఱుఁగఁగోరి యా బ్రాహ్మణునియొద్ద కేఁగియడుగఁగా నాతఁడు తనయింట నతిథులై యున్న విప్రకుమారులచరిత్ర నంతయును వెలిపుచ్చఁ దగ దని యెంచి మఱుగున వారితో నిట్లనియె. నిన్న నేను బకాసురునకు బలి కావలసివచ్చెనే యని చింతిల్లుచుండ నొకయోగసిద్ధుండగు బ్రాహ్మణుండు నాయొద్ద కేతెంచి నాదుఃఖము నంతయును నావలన విని యారక్కసున కన్నము తాను కొనిపోయెద నని నన్నూఱడించి తన్నాదుష్టుం డేమియుఁ జేయం జాలఁ డని నాకు భయ ముడిపి యన్నరాశితో బండినిఁ దోలుకొని బకుం డున్న ప్రదేశమున కేఁగెను. అమ్మహానీయుఁడే మనపురమున కీమేలుం గావించి యుండు నని నే నూహించెద ననఁగా పురజను లందఱును సంతసించి బ్రాహ్మణోత్సవమును జేసిరి. పాండవులును నావేడుకం జూచుచు నాయింటనే నివసించియుండి రని వైశంపాయనుండు జనమేజయమహారాజునకుఁ జెప్పఁగా నాతండు పరమానందమునఁ దేలెను.

అంత జనమేజయభూపాలుండు వైశంపాయనునితో నిట్లనియె. అయ్యా! మా పెద్ద లట్లు బకుని సంహరించి ఏకచక్రపురవాసులకు సంతోషమును గలుగఁ జేసినపిదప నెచ్చోటి నెట్లు వర్తించిరి యని యడుగఁగా నా తాపసేంద్రుం డా రాజేంద్రున కిట్లనియె.

రాజేంద్రా! పావనమూర్తు లయిన పాండుపుత్త్రు లాయేకచక్ర పురమున నావిప్రునియింట వేదపారాయణము సేయుచు మాధుకర వృత్తితో జీవించుచుండఁగా దేశసంచారమును జేయుచుండు పరదేశపు భూసురుం డొక్కఁ డొకనాఁడు వీ రున్న యింటికి విశ్రమార్థియై రాఁగా నాయింటిబ్రాహ్మణుం డా బ్రాహ్మణు నభ్యాగతపరిచర్యలచేఁ బూజించి తన యింట నిలుపుకొనెను. అప్పుడు కుంతీదేవియును బాండవులును నాయ భ్యాగతవిప్రుని సమీపించి పరదేశవృత్తాంతములను నానా రాజచరిత్రము లను బలుపత్తనంబుల రామణీయకంబులను నాతండు చెప్పుచుండఁగాఁ, గుతూహలమున వినుచుండిరి. ఆతం డట్లుపన్యసించుచుండ సందర్భోచిత ముగఁ బాంచాలరాజగు ద్రుపదునకు శిఖండి యను కుమారుని పుట్టుక యును, యజ్ఞకుండమునుండి ధృష్టద్యుమ్నద్రౌపదుల జననంబును, ధృష్ట ద్యుమ్నుండు ద్రోణాచార్యునొద్ద ధనుర్విద్యాగ్రహణం బొనర్చి మహా శూరుం డగుటయును, మహావిభవముతో జరుగఁగల ద్రౌపదీ స్వయం వరము మున్నగువృత్తాంతములను జెప్పఁగాఁ బాండుపుత్త్రులును గుంతీ దేవియును నావిప్రుం జూచి ధృష్టద్యుమ్నద్రౌపదీజననము లాశ్చర్యకర ముగనున్నవి. ఆ సంగతినంతను సవిస్తరముగా వివరింపుఁ డని వేఁడిరి. అంత వారల కవ్విప్రుం డిట్లనియె.

పూర్వ మొక్క మహానీయుం డైన విప్రుండు భరద్వాజుం డను వాఁడు గంగాద్వారమునకు స్నానార్థమై యేగెను. అంత నమ్మునీంద్రుం డచ్చోట ఘృతాచి యను నచ్చరను నానదీతీరంబున నున్నదాని వాయుచలితవస్త్రయైనదాని నూరుమూలంబునఁ జూచి కామంబున రేతస్స్ఖలనంబు నొందెను. ఆరేతస్సొక ద్రోణమునఁ బడఁగా నందుఁ బుట్టిన ద్రోణుఁడును పృషతపుత్త్రుఁ డగు ద్రుపదుఁ డను క్షత్త్రియుండును బాల్య మునుండి చెలికాండ్రై యగ్నివేశమునితో వేదవేదాంగములను ధనుర్వేద మును జదువుచుండిరి. పదంపడి పృషతుఁడు పరలోకగతుం డయ్యెను.

అంత వానిపుత్త్రుఁడు ద్రుపదుండు పాంచాలదేశమునకు రాజయ్యెను. ద్రోణుండు తండ్రియనంతరము కులశీలరూపయౌవనవతియైన కన్యక నొక్కదానిం బెండ్లాడి కుటుంబభరణార్థము ధనార్థియై సర్వధనములను బ్రాహ్మణులకుఁ బరశురాముం డిచ్చుచున్నాఁ డని యెఱిఁగి యాతని యొద్ద కేఁగి ధన మపేక్షింపఁగా నాపరశురాముండు దానము చేసినది పోఁగా నవశిష్టంబులై యున్న బ్రహ్మాస్త్రము మున్నగు దివ్యాస్త్రములను గొన్ని యాయుధములను సమంత్రకములుగ సప్రయోగోపసంహారముగ నొసంగఁగాఁ గొని ధనము నిమిత్తము తనబాల్యసఖుండైన ద్రుపదుఁడు పాంచాలదేశప్రభువై యున్నాఁడని యాతని కడ కేఁగి తనవచ్చినకార్యమును దెలియఁజేయఁగా ద్రుపదుండు రాజ్యమదమున ద్రోణునిఁదిరస్కారముతోఁ బలికెను. ద్రోణుం డతిరోషమున హస్తినాపురప్రవేశము గావించి యచ్చోట భీష్మానుమతంబునఁ గురుకుమారులకు సకలాస్త్రవిద్యలను నేర్పి తనకు గురుదక్షిణగా ద్రుపదుతో యుద్ధముచేసి వానింగట్టితెచ్చియిచ్చునట్లు వేఁడెను. అంతఁ గురుకుమారులలో ధార్తరాష్ట్రులు పాంచాలపతిం గట్టి తెత్తు మని వీరాలాపంబులాడి పాంచాలపురమునకుఁ జని ద్రుపదుచేఁ బరాభవ మొంది వానిం దేఁజాలరైరి. పదంపడి పాండుపుత్త్రుండగు నర్జునుండు ద్రుపదుపై విక్రమించి పోరాడి వానిం గెలిచి వానిరథము నెక్కి బంధించి తెచ్చి గురునకు దక్షిణగ సమర్పించెను. అంత నాచార్యుండు ద్రుపదు నుల్లసమాడి కొంతసేపటికి నీకనైన మాచెలిమి నీ కిష్ట మగునే యని యడిగి రాజుగానివాఁడు మాకు చెలికాఁడు కాఁదగినవాఁడు కాఁడని వానిరాజ్యమును చెఱిసగ మొనర్చి గంగకు నుత్తరదేశమును శర్మణ్వతీ నది సరిహద్దుగాఁ దాను గైకొని గంగకు దక్షిణదేశమును గాంపిల్యనగరము ప్రధానముగాఁ జేసికొని ద్రుపదునిఁ బాలించునట్లు నియమించికొని వానిని విడిచిపుచ్చెను. ద్రుపదుం డోడి తా నేమియుం జేయనేరక క్షాత్రబలంబున ద్రోణవధ మసాధ్య మని యెఱింగి, ద్రోణవధమునకొక పుత్త్రుని నర్జునునకు నొసంగ నొకపుత్త్రికను బ్రాహ్మబలమునఁ బడయుటకు నిశ్చయించి నానాఋష్యాశ్రమంబుల సేవించి తిరుగువాఁడొక్కనాఁడు గంగాయమునాసంగమస్థానమున నిర్మలతపోనుష్ఠానము

లతో నొప్పు మునినివాసముఁ జొచ్చి యచ్చోటఁ గాశ్యపగోత్రులును శమదమాదిగుణయుతులును నెడతెగక వేదపారాయణమును జేయుచుండువారును సూర్యారాధనతత్పరులును నగు యాజుఁడు, ఉపయాజుఁడు నను నన్నదమ్ము లిరువురను గని, యుపయాజుని నయ్యిరువురిలోఁ దపోబలాధికునిగ నెఱింగి కొంతకాల మాతని సేవించియుండె. అట్లుండి యొక్కనాఁ డమ్మునికి ద్రుపదుండు కాళ్లొత్తుచు నుండి యొంటరిపాటున నిట్లనియె. మునిచంద్రా! ద్రోణాచార్యుండు నన్నవమానించెను. ఆతనిని నేనుగాని రాజులలో నెవ్వరుగాని మార్కొని చంపఁజాలము. కావున నాకు వానిం జంపఁగలకుమారుఁడు నీదయవలనఁ గలుగవలయు నని కోరుచున్నవాఁడను. అట్లయ్యెనేని నీ కర్బుద సంఖ్య గల యావులను, మఱియు నీవు కోరిన సకలపదార్థములను నొసంగెదను. అనఁగా నాయుపయాజుండు తనకు ఫలాపేక్ష లే దనియు, నిట్టి కర్మములకు యాజకుఁడై తా నుండ ననియుఁ జెప్పి యూరకుండెను. అంతట ద్రుపదుఁ డంతటితోఁ బోనొల్లక యుపయాజునకు మఱింత మెప్పు పుట్టునట్లు సేవ లొనర్చుచుండెను. అంత నొకసంవత్సర కాలమైన నుపయాజుండు ద్రుపదునిఁ బిలిచి నీవు బహువిధముల నాకు సేవ లొనర్చుచుండినను నీయభిమతంబు యోగ్యమైనది కాకుండుటంజేసి యాకర్మమునకు యాజకుఁడనై యెంతమాత్ర ముండ నేరను. అయిన నొక్క యుపాయము సెప్పెద. అట్లు చేయుము. మాయన్న యాజు నాశ్రయింపుము. ఆతని కర్బుదగోవుల నిమ్ము. బహుధనముల నతని సంతృప్తుఁ జేయుము. పూర్వ మొకనాఁడు మే మిరువురము వనమున సంచరించుచుండ నతండు క్రిందఁబడియున్న ఫలము నొక్కదానిం జూచి యది పడియున్న స్థలము పవిత్రము గా దని యాలోచింపక దానిం గ్రహించె. మఱియును మే మిరువురము గురుకులవాసముఁ జేయుచు వేదాధ్యయనమును జేయుకాలములో మడి మైల యని విచారింపక దేనినైనను, భిక్షాన్నము రసవంత మని, కంటి కింపై నాలుకకు రుచియై తోఁచినదాని నెల్ల నోరూరఁ దినుచుండును. కావున నతండు కేవలఫలాపేక్షాపరుండై యుండును. అట్టివారు వానివలనిదోషములను నింద్యములుగా గ్రహింపక వర్తింతురు. కావున నాఋషి నీ విచ్చుదానిం గొనును.

నీయభిమతం బీడేర్చును. అనిచెప్పఁగా ద్రుపదుండు యాజాశ్రమము నకుఁబోయి యమ్మునిం జూచి నమస్కరించి యెనుబదివేలయావులను గానుకగా నొసంగి యాతనితో నిట్లు మనవి చేసికొనెను.

"క. భారతవంశాచార్యుఁడు, భారద్వాజుండు నా కపాయము సేసెన్
ఘోరాజి నతని నోర్చున,పారపరాక్రము సుపుత్త్రుఁ బడయఁగ వలతున్."

భరద్వాజకులోద్భవుఁ డగు ద్రోణాచార్యుండు బ్రాహ్మణులలో నుత్తముఁడు. బ్రాహ్మాదిదివ్యసాధనములను బరశురామునివలనఁ బడసిన తేజోవంతుఁడు. కౌరవులకు ముఖ్యాచార్యుండు. మదరత్నిధనుర్ధరుఁడు. ఆయాలుమూరలనిడివి గల ధనుస్సు నెక్కువెట్టి శరజాలములను గురి యించుచుండఁగా నాతనియెదుట నెంతటిశూరుండును నిలువలేఁడు. ఊరక చెప్ప నేల? ఆతండు క్షత్త్రియక్షాత్రముగఁ బుట్టిన రెండవపరశు రాముఁడో యనున ట్లొప్పువాఁడు. కావున నట్టి బ్రహ్మతేజోమూర్తికి వెఱచి యతనికంటె నధికమైన బ్రహ్మతేజస్సు గల ని న్నుపాసించి, యాత నినిఁ జంపఁగలపరాక్రమశాలి యైన కుమారునిఁ బడయ నిశ్చయించి నిన్ను సేవింప వచ్చితిని. నాయెడ ననుగ్రహించి యాద్రోణుం జంపు నంతటిశూరుఁడైనపుత్త్రునిఁ బడయునట్లు చేయుము. నీ కర్బుదగోవుల నిత్తును. అని చెప్పఁగా యాజుం డందులకు సమ్మతించి నీయభిమతం బీడేర్తు నని చెప్పి, యాగోపకరణముల సమకూర్చి యుపయాజుని సహా యునిఁగాఁ గొని పుత్త్రకామేష్టి కుద్యమించె.

## ధృష్టద్యుమ్నద్రౌపదులజననము

అవ్విధమున యాజుం డిష్టిని గావించుచు హోమాంతమున హవి స్సును గేలందాల్చి ద్రుపదుభార్యను సౌత్రామణియైన కోకిలాదేవిం బిలిచి దీనిం గ్రహింపుము. నీగర్భమున నొకకుమారుండును, నొకకూఁతురును బుట్టువా రనెను. అంత నాద్రుపదుదేవి మునివర్యా! నేనిప్పుడు కొంత మైలపడియున్నదానను. ఇదె నామేని చందనాదులం గడిగికొని శుచినై యిప్పుడే యరుదెంచెదను. కొంతసేపు ప్రతీక్షింపు మనిన నాయాజుండు "నేను యాజకుఁడను,నా కుపయాజుఁ డుపయాజియునుగా సంసిద్ధమైయు న్నహవిస్సు నీయభిమతం బొడఁగూర్పకుండునా"యని ద్రుపదుభార్యతోఁ

జెప్పి యాదేవి మగిడివచ్చువఱకు గాఁగక 'యోదేవీ! నీవు వచ్చిన రమ్ము. రాకున్న నూరకుండుము' అనిచెప్పి యాహవ్యము నగ్నియందు వ్రేల్చెను. అంత నయ్యగ్నికుండమునుండి శరీర మంతయు నగ్నిశిఖ లెగయుచు, దివ్యకవచమును ధరించి, తలయందు దేదీప్యమానంబులైన మణులతోఁ జెక్కఁబడిన కిరీటము నొక్కటి దాల్చి, చేతులయందుఁ గరవాలమును గొప్పవింటిని బూని, యగ్నితేజస్సుతో సమానమగు తేజస్సుగల పుత్త్రుఁ డొకఁడు రథారూఢుఁడై వెలువడి సింహనాదమును జేయుచుఁ దనయిచ్ఛమై నరిగెను. ఈకుమారుండు పాంచాలురకుఁ గీర్తిని నలుదెసల వ్యాపింపఁజేయు మహాశూరుఁడు. ద్రుపదుని భయమును విషాదమును బోఁగొట్టును. ద్రోణుని వధించునిమిత్తము పుట్టె నని యశరీరిణి యొక్కటి యాయాగసభలో నున్నవారి కెల్లరకును వినునట్లు చెప్పెను. పదంపడి యాప్రజ్వలించుచున్న యాగాగ్నియందుండి కులపవిత్రయు, నసితోత్పలకోమలామలవర్ణయు, నుత్పలగంధియు, వికసితతామరసపత్త్రనేత్రయు, మృదునీలదీర్ఘశిరోజయునై యొక్కకుమారి నిజగాత్రమునుండి రుచిరసౌరభమును నలుదెసల వ్యాపింపఁజేయుచు నతిమనోహరరూపముతో వెడలివచ్చెను. అంత నీపుత్త్రికవలనఁ గౌరవులకు మహాభయమును, ననేకరాజులకు వినాశంబును గలుగుననియును, దేవకార్యముచిత కాలమున దీనిచే నెఱవేర్పఁబడుననియును నాకాశవాణి వినిపించెను. అంత నాపుత్త్రుఁడును, బుత్త్రికయు జనించిన నిమిత్తమునఁ బాంచాలురందఱు నానందపరవశులై యుండిరి. కాని, వారలయానందమును భూదేవి యోర్వ దయ్యెను. ద్రుపదుభార్య కోకిలాదేవి శుచియై యేతెంచి యాపుట్టినయిరువురకుఁ దన్నుఁ దల్లిగా ననుగ్రహింప యాజోపయాజుల నిర్వురఁ బ్రార్థింపఁగా, వారు ద్రుపదునకుఁ బ్రీతిగా నట్ల యగుఁ గాక యనిరి. అంత నచ్చోటఁ గూడియుండిన బ్రాహ్మణు లాకుమారుని ధృష్టత్వమునను, నమూల్యములగు కవచకుండలములతోఁ బుట్టినవాఁడగుటను వానికి ధృష్టద్యుమ్నుం డని పేరు పెట్టిరి. (ధృష్టుఁడు అనఁగా ధీరుఁడు. ద్యుమ్న మనఁగా ధనము. ధీరుఁడై యమూల్యములయిన కవచ కిరీటములతోడఁ గూడఁ బుట్టుటచే ధృష్టద్యుమ్నుఁ డనఁబడెను.) ఆ కూఁతురు కృష్ణవర్ణ యగుటంజేసి దానిని గృష్ణ యను నామముతోఁ

బిలిచిరి. అవ్విధంబున ద్రుపదుఁడు తాను గోరినసంతానమును బొంది యా
జున కర్బుదగోవులను దక్షిణగా నొసంగి, బ్రాహ్మణుల నపారధనంబులతో
సత్కరించి, యాబిడ్డలతోఁ గాంపిల్యనగరము ప్రవేశించి కొన్నినాళ్లు
సుఖమైయుండి, కుమారు నస్త్రవిద్యాప్రవీణునిఁ జేయునిమిత్తము ద్రోణు
నకు శిష్యునిఁగా నొప్పగింప నయ్యాచార్యుం డతనికి విద్య నేర్పకున్నచోఁ
దన కపకీర్తి కలుగునని తలంచి, దైవవశమునఁ గాఁగలదానిని నివారింప
నెవరికి శక్యమని నిశ్చయించి యాద్రుపదపుత్త్రున కస్త్రవిద్య నెల్ల నుపదే
శించెను.* మఱియు ద్రుపదునకు యజ్ఞమునం దగ్నికుండమున ధృష్టద్యు
మ్నునివెంబడిఁ బుట్టిన ద్రౌపది యనుకూఁతురు వివాహము గావించుటకుఁ
దగినవయస్సు గలదయ్యెను. కాని, యాతండు దానిని నర్జునున కిచ్చి
పెండ్లిచేయవలయు ననునిశ్చయముతో నుత్పత్తి గావించికొనియుండుట
నిప్పుడు పాండవు లెల్లరును లాక్షాగృహమున దహింపఁబడి సమసిరని
బ్రాహ్మణులవలన విని, యొక్కనాఁడు తనయాప్తబంధుజనమంత్రిపురో
హితపౌరజనులను బిలిపించి యిట్లనియె. అయ్యారో! కుంతీతనయుం
డర్జునుం డల్లుఁడగునని యుల్లమం దలరుచునుంటిని. ఎటులైన నాశూరుని
వేఁడి వాని కీకన్య నిచ్చి వివాహము చేయుద మని తలపోసియుంటిని.
దైవ మీయాశను నిరాశం జేసె. నే నొనర్చిన పుత్త్రకామేష్టియందు
యాగఫలమై పుట్టిన యీకూఁతు నెవ్వని కొసఁగుదు? దీనికిఁ దగినవరుం
డెవ్వం డొకో? యని చింతాక్రాంతుండై యుండ నారాజున కత్యం
తాప్తుండగు పురోహితుం డిట్లనియె. మహారాజా! పాండవునికై నీవు
చింతింపకుము. వారినిగుఱించి బహువిధంబు లగునిమిత్తములు నయం
బునఁ జూచితి. వారి కెగ్గు లేదు వారెల్లరు సుఖులై యున్నవారు.
తొల్లి దేవేంద్రుండు కొండొకకాలం బదృశ్యుండై యుండిన నతనిం
గానక శచీదేవి శోకింపంబోయిన, నుపశ్రుతిం జేసి బృహస్పతి యాదేవిని

---

* ఈ పైనికథాభాగము సంస్కృతభారతములలో లేదు. లేకున్నను నన్నయభట్టా
రకుఁ డీభాగమునకుఁ దెనుఁగు గావించి యున్నాఁడు. భారతమున కానందపూర్ణ
మునీంద్రుం డొనర్చినవ్యాఖ్యయందు మాత్రము ఈభాగమునకు వ్యాఖ్య గానిపించు
చున్నది. కావున పూర్వకాలపు భారతపుసంస్కృతప్రతులలో నీకథాభాగ ముండి
యుండును. ఇప్పటికాలపువా రీభాగము నేల వదలిరో ?

దేవేంద్రు నచిరకాలమున నే పొడఁగాంచెద వని యూఱడించి పంపె నని వేదంబులయందుఁ జెప్పఁబడెను. కావున నే నుపశ్రుతిం జూచితి. ఇది తప్పదు. పాండవులు దహింపఁబడి పరలోకగతులు గారు. పరమానందం బున నున్నవారు వార లెందున్నను నిందుల కేతెంతురు. నీవును స్వస్థచిత్తుండవై స్వయంవరము నీపురమున సాటింపుము. కన్యాదా నమునందు రాజులు సర్వసాధారణముగ దీని నొనర్చుట వారికి శాస్త్ర విధ్యుక్తధర్మము. అనఁగాఁ దనకు మాన్యుం డగునప్పురోహితువచనం బున నూఱడిల్లి, ద్రుపదుండు నేటికి డెబ్బదియేనవదినమునఁ బుష్యమాస పంచమినాఁడు *రోహిణీనక్షత్రయుత మైయుండుకాలమున స్వయంవర మని చాటం బంచి, యలంతివారికి మోపెట్ట సాధ్యముకాని యొకమహా ధనుస్సును, ఆకసమునఁ దిరుగుచుండునట్లుగా నొక్కసువర్ణమయమైన మత్స్యయంత్రము నేర్పఱచియున్నవాఁడు. కావున నాస్వయంవరనిమి త్తము భూమిలో నుండు రాజు లెల్లరును మాత్సర్యమునఁ గాంపిల్య నగరమునకు నేగుచున్నవా రని ద్రుపదువృత్తాంత మంతయును నాయ భ్యాగతుం డగు బ్రాహ్మణుండు సెప్పఁగా విని, యాచార్యుని జయించు వాఁడొక్కండు పుట్టె నే యని విని కొంతచింతిల్లి, కానున్నది కాక మాన దని కొంతయూఱడిల్లి, ద్రౌపదీస్వయంవరమునకు వారు గమ నోన్ముఖులు కాఁగా వారియభిప్రాయంబు కుంతీదేవి యెఱింగి ధర్మపుత్త్రు నితో నిట్లనియె. పుత్త్రా! మన మీయేకచక్రాపురమున బహుదినము లుంటిమి. ఇంకనుం గొన్నిదినము లిచ్చోట నే యుంటి మేని మాధుకర వృత్తియుఁ గొనసాగ నేరదు. పాంచాలదేశమునకుఁ బోవుట నీ కిష్టమే? ఆదేశములు సుభిక్షము లనియుఁ, గాంపిల్యనగరము రమణీయంబనియు, ద్రుపదుండు బ్రాహ్మణప్రియుం డనియును విందు ననఁగా యుధిష్ఠిరుండు తల్లివచనమున నేకీభవించి యమ్మా! నీయాలోచనము నాకును సమ్మ తము. నాసోదరు లేమందురో యెఱుంగ ననియె. అంత వా రంద ఱందు లకుఁ బోవుదము. మీయంపువిధమునఁ జేయంగలవార మని యొడంబడి తమయున్నయింటిబ్రాహ్మణునకుఁ జెప్పి వీడ్కొనిరి.

---

* ఈవిషయమునఁ గొంతచర్చ యావశ్యకము. ఇది ద్రౌపదీవివాహఘట్టము foot note నందుఁ జర్చింపఁబడియున్నది.

ఆయవసరమున వేదవ్యాసమునీంద్రుండు వారలకు దర్శనమొసంగిన, వారెల్లరును నామహానీయునకు మిక్కిలి వినయముతో మ్రొక్కికేలుదోయి మోడ్చి దూరమున నిలుచుండియుండ, నమ్మహాత్ముండు తగిన యాసనమునఁ గూర్చుండి వారు గావించినపూజలం గైకొని వారల నందఱను తనసమీపమున నాసీనులం గావించికొని వారలతో నిట్లనియె. మీధర్మప్రవర్తనమును, నస్త్రవిద్యయందలి నేర్పును, విప్రారాధనంబును గొఱంత లేక జరుగుచున్నవి కదా? మఱియు మీ కొకరహస్యమును జెప్పెద. సావధానమనస్కులరై విని దాని ననుష్ఠింపుఁడు. అది యేది యనఁగాఁ బూర్వము మునికన్యక యొక్కర్తు సకల సుగుణములతోను, సుందరశరీరముతోను గూడుకొనినదయ్యును దనపూర్వజన్మదౌర్భాగ్యమునఁ దనకుఁ దగినపతిం బడయనేరక పతిం గోరి చంద్రశేఖరు నుద్దేశించి తీవ్రతపమును జేసెను. ఆయంగన తీవ్రతపమునకు మెచ్చి మహాదేవుండు ప్రత్యక్షంబై వరము వేడుమనియె. అంత నాకన్యక మహాదేవున కిట్లనియె. జగదీశ్వరా! నాకు సర్వగుణాలంకృతుండగు పతి నొసఁగు మని యేను మాఱులు కోరెను. అంత మహేశ్వరుండు నీ కేవురుభర్తలగుదు రనఁగా నాకన్యక, దేవా! నాకొక్కరుఁడే పతి యగున ట్లొనరిమ్ము. ఒకస్త్రీకిఁ బతులనేకు లగుట ధర్మమా? యని వెండియు విన్నవింప, నాపినాకి యోకన్యకామణీ! నీవైదుమాఱులు పతి నొసంగు మని యడుగుటం జేసి నీకైదుగురు పతు లగుదు రంటిని. ఇది తప్పదని చెప్పి యదృశ్యుండయ్యెను. ఆకన్యక యీజన్మమున ద్రుపదునకుఁ గూఁతురై పుట్టియున్నది. మీరైదుగురును దానికి భర్తలు కాఁగలరు. కావునఁ గాంపిల్యపురమునకు స్వయంవరము నెపమునఁ జనుఁడు. నిశ్శ్రేయసము కలుగును. అని చెప్పి యప్పారాశర్యమునీంద్రుం డంతర్ధానము నొందెను.

అంతఁ బాండుపుత్త్రులు తల్లితో రేయింబవళ్లు ప్రయాణము సల్పువా రొక్కనాఁ డర్ధరాత్రంబున గంగయందు సోమశ్రవం బను తీర్థంబున స్నానముం జేయ యత్నించిరి. అప్పుడు రాత్రి యగుటయుఁ, జీఁకటియందు వెలుతురు దోఁచుటకును, రక్షించుకొనుటకు నొకకొఱవిని నర్జునుండు కేలఁబట్టుకొని ముందట నరుగుచుండెను. అప్పు డాగంగాతీరమున వారల కాళ్లయడుగుల చప్పుళ్లు విని యచ్చోటఁ దనయంగనామణులతో

జలక్రీడ లాడుటకై వచ్చియుండిన యంగారపర్ణుండను గంధర్వుండు మిక్కిలి వింటినారి మ్రోయించి యిట్లనియె. సాయంసంధ్యాకాలము నెనుబది యర్ధనిమిషము (లవము) లయినపిదప మిగిలిన రాత్రి యెల్లను యక్షరాక్షసగంధర్వాదులసంచారమునకును, మిగిలినకాల మంతయు మనుష్యసంచారమునకును విహితకాలమై యుండు. ఇది శాస్త్రసమ్మతము. కావున గంధర్వులమగు మాకు సంచారయోగ్యమైన యీకాలమునందు సంచరించు మానవులను మేము ధిక్కరింతుము. అందువలన రాత్రికాలమున స్నాన మాడరాదని పెద్దలు సెప్పుదురు. కావున నేను మీకు హెచ్చరిక చేసినపిదప నైనను మమ్ము మీకు సమీపింపక దూరముగఁ బొండు. నే నంగారపర్ణుం డను గంధర్వుండను. కుబేరసఖుండను. నన్ను మీ రెఱుంగరా? ఈవనము నా పేరఁ బ్రసిద్ధమై యంగారపర్ణ మనఁబడును. నే నిందు విలాసినులతో విహరించుచుండుదు. ఈకాలమున నీవనమును దేవతలుగాని, రాక్షసులు గాని, గంధర్వులుగాని చొచ్చుటకు వెఱతురు. మీ రేల నిర్భయులై యిట్లు వచ్చుచున్నారని యడుగఁగా నందుల కర్జునుం డిట్లనియె. దురాత్మా! సముద్రమును హిమవత్పర్వతప్రాంతదేశమును నిమ్నగా నదియు నంరఱ కన్ని వేళల సేవ్యంబులై యుండు. ఇవి యొకరుని యవి యనఁ దగునే? గంగను బొడగాంచినప్పు డది రాత్రికాలమైనను భోజనానంతరమున నైనను స్నానము చేయవలయు నను టయు త్తమము. పూర్వ మీగంగ హిమవత్పర్వతమునందుండి యేడు పాయలైపాఱి క్రమముగా సముద్రమును సంగతమయ్యె. ఆయేడు పాయలును వరుసగా యమున, ప్లక్షజాతి, సరస్వతి, రథస్థ, సరయువు, గండకి, గోమతి యను పేర్లతోఁ బ్రఖ్యాతిగాంచె. ఈయేడింటిలో దేనియందు సుస్నాతులైనను వారు సర్వపాపములనుండి విముక్తులగుదురనియు, నీమహాగంగయే పితృలోకమున దాఁటుట కలవిగాని వైతరణి యనుపేరితో వెలయు ననియు, స్వర్గలోకమున మందాకిని నాఁబరగుననియుఁ దొల్లి శ్రీకృష్ణద్వైపాయనుండు మాకు వినిపించియుండెె. కావున నిచ్చోటనున్న యుపద్రవములును నేఁటి లును నీవు పడసినవియా? పుణ్యభాగీరథి యీలోకప్రజల కందఱకును

సేవించుట కర్తవ్యమైనది. దీనిని నీపడసినదానినిగాఁ జెప్పుట తగవు కాదు. కావున నిచ్చోట మ మ్మాటంకపఱచుట నీకు ధర్మము కాదు. దుర్బలులు నీకు భయంపడి తొలఁగుదురు కాని, సర్వాస్త్రవేదులమై బలిష్ఠులమైన మేము నీబెదరింపు మాటలకుఁ దొలఁగము. అనివార్యము నసంబాధము నైన యీపుణ్యనదియందు స్నాన మాచరింపక మే మూరక చనువారమే ? యనిన నర్జునుమాటల కంగారపర్ణుం డలిగి ధనుష్టంకార మొనర్చి యమ్ముల నేయఁ దొడంగెను. అర్జునుండును దనచేతి యందలి కొఱవితో వానిశరవృష్టి నెదుర్కొనుచు నయ్యవి తమ్ముఁ దాఁక కుండునట్లు రక్షించుకొనుచుండెను. అప్పు డర్జునుం డంగారపర్ణున కిట్లనియె. ఓరీ గంధర్వా ! మమ్ము సకలాస్త్రవిద్యావిశారదులనుగ నెఱుంగక సామాన్యమనుష్యులను వెఱపించునట్లు వెఱపించు టెల్లను నుఱుగు నీటిపైని బహుకాల ముండక నశించునట్లు నశించును. గంధర్వులు మాయాబలంబున మనుష్యులకంటె నధికు లని యెఱుంగుదు. కాని యిప్పుడు నా యాగ్నేయాస్త్రప్రయోగమున నీమాయ నెల్ల నడంచి నీ మదమడఁగింతు. ఈయస్త్రమును బూర్వ మగ్ని దేవుండు తన కుమారుండైన యాంగీరసున కొసంగె. ఆంగిరసుం డనఁబరగిన బృహస్పతి భరద్వాజుఁ డను మునికి దానిని మిక్కిలి దయతో నొసంగెను. భరద్వాజుండు ద్రోణునకుఁ బ్రీతుండై యమ్మహాస్త్ర మాతనికి నొసంగెను. అంత నయ్యాచార్యుండు నా కనురక్తుండై ప్రయోగోపసంహారముల బోధించి యుపదేశించె. అని చెప్పి యయ్యాగ్నేయాస్త్రమును సమంత్రకముగ నభిమంత్రించి దాని నయ్యంగారపర్ణునిపైఁ బ్రయోగింప నయ్యది వాని రథమును భస్మీభూతంబు చేయఁగా, నాగంధర్వుండు విరథుండై క్రిందఁ బడి మూర్ఛిల్లెను. అంత నర్జునుండు వానితలవెంట్రుకలనుబట్టి యన్నలు దమ్ములును దల్లియు నున్నచోటికి లాగుకొనివచ్చుటయు, నంతకు మున్న వానిభార్య కుంభీనసి యనునది ధర్మజు శరణుఁ జొచ్చి తనకుఁ బతిదానము చేయు మని వేఁడఁగా నాకృపాళుండు సవ్యసాచిం బిలిచి యుద్ధమున దోడినవానిని, గీర్తిహీనుని, స్త్రీసనాథుఁడై మెలఁగువానిని, బరాక్రమరహితునిఁ జంపరాదు. వీనిభార్య మనలను శరణని పతిదానము వేఁడుచున్నది. కావున నితండు స్త్రీసనాథుఁడు. ఆహేతువుచే వీనిని

వధింపక విడచిపుచ్చి రక్షింపుము. అని చెప్పఁగ నర్జునుం డంగారపర్ణుం జూచి దీనులయెడఁ బక్షపాతియైన ధర్మజుండు నీకుఁ గరుణించి నిన్ను విడిచిపుచ్చు మనియె. ఇదే నీబంధమోక్షణము సేసెద. కావున నిఁక సుఖముగా జీవింపు మని చెప్పి వానిని విడిచిపుచ్చెను. అట్లు చావు దప్పి కన్నులొట్టవోఁగా నంగారపర్ణుం డర్జునునిశౌర్యమునకు మెచ్చి "యయ్యా! నీచే నేను యుద్ధమున నోడితిని. ఇఁకను నా కీయంగారపర్ణ నామముసెల్లదు. మఱియు నాగ్నేయాస్త్రదగ్ధమైనరథమునకు మాఱుగా మాయచే నొకరథమును సృజించెద. దానిని జిత్రరథ మని యందురు. తన్నిమిత్తమునఁ జిత్రరథుండను నామముతో వెలసెద. నన్నుఁ జంపక నా ప్రాణముల నాకు మఱల నొసంగినమహానీయుండవగు నీకు నే నే మీయఁ గలను? చాక్షుషి యను పేరితో వెలయు గాంధర్వమాయావిద్యను నీ కుపదేశించెదను. పూర్వము మను వీవిద్యను జంద్రున కొసఁగెను. చంద్రుండు విశ్వావసువున కొసంగె. విశ్వావసునిఁ బ్రార్థించి దాని నేఁ బొందితిని. మూఁడులోకములలో నున్నయేపదార్థము నైనను జూడఁ గోరుదు వేని *యీవిద్యామహిమంబునఁ జూడఁ గలవు. అపాత్రుల కీవిద్య యుపదేశింపఁ దగదు. అట్టివారి కిది ఫల మొసంగనేరదు. ఆఱు నెల లొంటి కాలిపై నిలిచి తీవ్రతప మాచరించి దీనిం బొందవలయును. ఈవిద్యామహిమమునంగాదే మేము దేవతలకును లొంగక సంచరింపఁ గలిగినవారము. మఱియు నీకుఁ బ్రత్యుపకారంబుగా గంధర్వలోకము నందుఁ బుట్టి వేగవంతములును, నెప్పటికి ముదిమిఁ జెందనివియు, దివ్య వర్ణయుతములు నగు నశ్వముల మీయన్నదమ్ముల కందఱకుఁ బ్రత్యేక ప్రత్యేకముగ నూఱేంటినొసంగెద. పూర్వకాలమున దేవేంద్రుండు వృత్రాసురునిపై వజ్రాయుధమును బ్రయోగించెను. అప్పు డావజ్రాయుధము వానికఠినశరీరమును దాఁకి పలుతునియలయ్యె. అప్పు డాశకలము లుత్తమ పదార్థముల నావహించె. *బ్రాహ్మణులయొక్క హవిర్దానాదిక్రియలై కొన్ని వెలసినవి. క్షత్రియులయెడ రథములుగను, వైశ్యులయెడ దానాదులుగను, శూద్రులయందు సేవగను దక్కినతునియలు వర్తిల్లినవి. అందు

* అవి బ్రాహ్మణులయెడ వేదములుగను, క్షత్రియులయెడ నాయుధములుగను, వైశ్యులయెడ నాఁగలిగను, శూద్రులయెడ శుశ్రూషగను వెలసిన వని కొందఱనెదరు.

క్షత్త్రియులరథభాగ మగు రథ్యములలో వజ్రభాగము కలిసియుండుటచే నాయుత్తమాశ్వములకును, బడబకును జనించిన దివ్యాశ్వములు వధించుట కలవిగాక తమ కిచ్చవచ్చినవర్ణములను గైకొనుచు మితిలేని వేగంబుతో నడిగినవారికోర్కెల నిచ్చుటకు శక్తములైనవి. వాని నీ కొసంగెద. నిన్నుంగూర్చి యష్టే లగునశ్వముల నిచ్చెదం గైకొమ్ము" అనఁగా నర్జునుండు నీవు నా కెంత గూర్చువాఁడ వైనను విద్యను, ధనమును, శుభమును నే నన్యులవలన గొననేరను. అని చెప్పఁగా నర్జునున కంగారపర్ణుం డిట్లనియె. అర్జునా! నీవు సత్పురుషుండవు. నీసోదరు లెల్లరును సజ్జనులు. నే నెల్లప్పుడు సత్పురుషసాహచర్యమునఁ బెరిగినవాఁడను. యోగ్యజనులచెలిమి ప్రీతిదాయకమగుటంజేసి మీచెలిమిని గోరియుండెదను. నీకుఁ బ్రత్యుపకారముగ గాంధర్వి యను విద్య నుపదేశించెద; కొనుము. ఒరులవలన విద్యను గ్రహింప నంటివేని నీయాగ్నేయాస్త్రమును నేను గోరియున్నవాఁడను. కావుననావిద్యను నీకొసంగి నీవిద్యను నేను గ్రహించుట సమంజసంబగు. అటులే నీవును నీవిద్యను నాకిచ్చి నావిద్యను నీవు గ్రహించుటయు నుచిత మగును. అని చెప్పఁగా నర్జునుండు గంధర్వరాజున కిట్లనియె. గంధర్వపతీ! నీకోరిన కోరిక నొనర్చెద. నాయాగ్నేయాస్త్రమును నీ కుపదేశించెదను.నీయొద్దనుండి నీవిచ్చుహయములను గొనియెదను. నీతో శాశ్వతమైనచెలిమి చేసెదను. అది యట్లుండనిమ్ము. వేదములఁ జదివినవారమును శూరులమును నగు మమ్ము నీవే కారణమున నింతకుఁ బూర్వమదలించి యాడితివి. అని యర్జునుం డడుగఁగా నంగారపర్ణుం డిట్లనియె. తాపత్యశ్రేష్ఠా! కురువంశసచ్చరిత్రమును, మీరు పాండురాజపుత్త్రులగుటయు, జగద్విఖ్యాతశూరుం డగు ద్రోణాచార్యశిష్యులగుటయు, మీరు క్రమమున ధర్మవాయుమహేంద్రాశ్వినులప్రసాదజనితు లయి దేవాంశములు గలవారనియు, నతిపరాక్రమవంతు లనియు, సకల సద్గుణముల కాశ్రయులనియు నాకు నారదుఁడు మున్నగుమహర్షులు సెప్పఁగా వినియుంటిని. అయిన మీరు గుర్వనుజ్ఞాతులరయ్యును వివాహమును చేసికొనక యగ్నిహోత్రహోమరహితులయి యుత్తమబ్రాహ్మణపురస్కారము లేక యుండుటంబట్టి మిమ్ము ధిక్కరించితి. మఱియు నేను నాభార్యల మధ్య నుండఁగా మిమ్ముఁ జూచుటను, గంధర్వుల

మగు మాకు రాత్రి శౌర్య మెక్కు డగుటను గ్రోధముం బూనితి. ఎంతటివారైన నంగసామర్థ్యమున నుండఁగా నన్యపురుషులు కనఁబడి రేని వారికిఁ గ్రోధమును, మాత్సర్యమును నధిక మగుట సహజమైయుం డును. దానంజేసి నేను దగు నిది తగ దిది యని యాలోచింపక నీకుఁ గ్రుద్ధుండనై నియతబ్రహ్మచర్యవ్రతాచరణమున నుండు నీచే నోటుపడితి. పురోహితుని ముందిడుకొని వచ్చువానిని, బ్రహ్మచర్యవ్రతనిష్ఠుని నేవేళ లయందైనను యక్షరాక్షసగంధర్వాదు లేమియుం జేయఁజాలరు. అంతే కాక వారు వానిం దోడరి రేని యవశ్య మోడుదురు. అట్లుగాక కేవలకామపరతంత్రుఁడై క్షత్రియుండగునేని మాచేఁ జిక్కి ప్రాణముల తో మఱల లేఁడు. క్షత్రియుఁ డవశ్యముగా వేదవేదాంగములను సర్వ శాస్త్రములను జదివి, శమయుతుఁడును, శీలాదిసదాచారములతో వెల యువాఁడును, సత్యవచనతత్పరుఁడును నగు నుత్తమబ్రాహ్మణునిఁ బురో హితుఁగా వరించుకొనవలయును. అట్టి కులబ్రాహ్మణుఁ డుపదేశించుసన్మా ర్గములయందు నిశ్శంకముగఁ బ్రవర్తించునేని యారాజు సకల నిశ్శ్రేయ సములం బొందును. కేవలపరాక్రమమున మాత్రము రా జన్నింటిని సాధింపనేరఁడు. తాపత్యకులవరేణ్యులరగు మీ రిఁకనైనను దగినపురో హితుని వరించుకొని యయ్యాచార్యోపదిష్టమార్గములఁ బ్రవర్తింతు రేని, సర్వసుఖములను జెందుదు రనఁగా విని యయ్యర్జునుం డంగారపర్ణుం జూచి,మిత్రమా! కుంతీపుత్త్రులమగు మేము తాపత్యుల మెట్లైతిమి. దానిని సవిస్తరముగ వివరింపు మనఁగా నయ్యంగారపర్ణుండు పార్థున కిట్లనియె.

## తపతీసంవరణోపాఖ్యానము

అనుంగుఁజెలికాఁడా! తనదివ్యతేజమున సర్వలోకములను వెలిఁ గించుచుండు సూర్యునకు సావిత్రి జనించినపిదప నతితపస్వినియును, సుందరాకారము గలదియును నగు తపతి యను కుమార్తె పుట్టెను. ఆతపతి దినదినప్రవర్ధమానయై శీలాదిసద్గుణయుతయై లోకములో నుండు పలుతెగలసుందరాంగులలో మిన్నయై వెలయుచుఁ, గొంతకాల మునకుఁ బెండ్లియాడుగలది కాఁగా, సూర్యుం డీకన్యకకుఁ దగినవరుం డెవ్వండా యని తలపోయుచుండెను. అప్పుడు భరతకులోత్పన్నుఁడు

ను, ఋక్షుఁడనువానికిఁ గుమారుండును నై సదాచారసంపదలచేతను, నియతమగుతపస్సులచేతను ననుదినము ప్రభాతకాలమున సూర్యారాధనమును జేయుచుఁ, దనతపోనిష్ఠవలనఁ బొందిన దివ్యతేజస్సుచే నితరకాంతుల నన్నింటిని నావరించుటంజేసి సంవరణుఁ డనునామముతో వెలయుచుఁ, జెలులయెడఁ జంద్రునివలెఁ జల్లనివాఁడై యరులయెడ నర్యముఁబోలెఁ దీవ్రార్చులఁ బ్రసరింపఁజేయుచుఁ, బ్రజారంజనముగ రాజ్యమును బరిపాలించుచుండెను. తపనుం డతనిసుజనత్వ మరసి తన కూఁతు నాతని కొసఁగఁ దలపోసియుండెను. అట్లుండ నొక్కనాఁ డాసంవరణుండు వేటకై వనంబున కరుగఁగా, నొకపర్వతప్రదేశమున బహుదూరము పోయి యలసిన వానిగుఱ్ఱము దాహమునకు నీరు లేక, ప్రాణంబు సైతము చిక్కకపోవుటంజేసి గతాయు వయ్యెను. అంత సంవరణుండు పాదచారియై మఱలి పురంబునకు వచ్చువాఁడు మార్గమున నొక్కచోట నొక్కసుకుమారి జవరాలిం గని దానియందుఁ దగులము గలవాఁడై, దానికటాక్షశృంఖలాబద్ధుండువోలెఁ గదల మెదల నేరక, దానియం దుంపఁబడినమనస్సు గలవాఁడై దానినే తెప్పవాల్పక చూచుచుఁ దనమానసమున నిట్లు వితర్కించె. ఇక్కన్య వైకుంఠము నుండి భూమిపై సంచరించుటకు మాఱురూపముతో వచ్చిన పాలకడలి కూఁతురోయనియుఁ, దనశరీరసువర్ణచ్ఛాయాపుంజమున నీపర్వతప్రదేశము నంతయు వెలిగించుచుండుటంజేసి సూర్యునిఁబాసివచ్చిన తదీయ కిరణములలో నొక్కకిరణమోయనియు, ననుగ్రహపూర్వశీతలనిర్మల కాంతిచే మనస్సునకు సంతోషింపఁజేయుటచే భూమికి విలాసార్థముగవచ్చిన చంద్రరేఖయో యనియుఁ దలఁచెద. దీనిసర్వావయవసౌష్ఠవము చూడ భూలోకమున నుండు పెఱవనితలకెవరికైనం గలదే? దేవగంధర్వయక్ష మానవకాంతలయందలి సౌందర్యముల నొక్కటిగాఁ గూర్చి కమలభవుం డొనర్చెను గాఁబోలు దీని నని తోఁచెడి. నేను బుట్టినదిమొదలింతదనుక నిట్టిసుందరిని జూచి యెఱుఁగను. దీనింజూచి నేత్రము లానందించి నా జన్మమును ఫలవంతమొనర్చెను. దీనిం జూచిన కన్నులతో వేఱెద్దానిని జూడ నా కిచ్చ పుట్ట దని యనేకవిధముల మనస్సునం దాలోచించి, దానియంద చూడ్కి నిలిపి మన్మథుని పంచబాణములకు గుఱియై, మన

స్సునఁ బొడమినమోహమును నిలుపనేరక యావరవర్ణినిని సమీపించి యిట్లనియె.

"ఆ. ఎఱుఁగఁ జెప్పు మబల యెవ్వరిదాన వి,ట్లేల యున్నదాన వేకతంబ
క్రూరవనమృగములు గ్రమ్మరుచున్నయీ, విజనవిషమశైలవిపినభూమి."

నీమోహనాకారంబుఁ జూచి నామనస్సు నీయందు లీనమైనది. కావున నీవును నాయం దనురక్తవై నాయభిమతముఁ దీర్చునిమిత్తము నన్నుంగూడి యానందాబ్ధితరంగముల నోలలాడుమని చెప్పఁగ, నా సుందరి యతనికేమియుం జెప్పక మేఘములచాటున నడంగు క్రొక్కాఱు మెఱుపుతెఱంగున దృష్టిమార్గము గడవఁగా నదృశ్యురాలయ్యె. ఇట్లు కానరానియక్కన్యకను వనమునందు నలుదెసల వెదకి, యమ్మానవపతి మానము లేనివాఁడై లజ్జను వదలి భూతలంబునం బడి యేడ్చుచుండ, నభినవయౌవనవిలాసమునఁ దేజోవంతమై మన్మథరూపమునుంబోలు నతనిరూపముఁ జూచి యక్కన్యకయు మదనబాణపీడితయై తనస్వరూపంబు నామహీపాలునకుం జూపి, తియ్యనిమాటలతో నిట్లేల మోహగతుండవయితి వని యడిగిన, దానికి సంవరణుం డిట్లనియె.

చ. ధరణి నతిప్రతాపబలదర్పమునన్ విను నేన పెద్ద నె
వ్వరికిని మున్ భయంపడనివాఁడ భయార్తుఁడ నైతి నిష్ఠ పం
కరుహదళాయతాక్షి దయఁ గావుము నన్ను భవన్నిమిత్తము
ర్ఖరతరపంచబాణహతిఁ బంచతఁ బొందక యుండునట్లుగాన్.

కావునఁ బ్రాణములఁ గాపాడుము. నీకు వశుండ నయ్యెద. గాంధర్వవివాహమున నాతోఁ గలయు మని చెప్పఁగా విని యక్కన్యక సంవరణున కిట్లనియె.

క. భువనైకదీపకుం డగు, సవితృనకుఁ దనూజ మఱియు సావిత్రికి నే
నవరజ నవినయవర్జిత, నవనీశ్వర వినుము తపతియను సురకన్యన్.

నాయందు నీకుఁ బ్రీతి కలదేని మదీయజనకు నడుగుము. ఆతండు నన్ను నీ కిచ్చును. ఇంతులకు స్వాతంత్ర్యము లేమి నీ వెఱుంగుదువు కాదే? కావున జపతపోనియమ నమస్కారములచే నాదిత్యు నారాధింపుము. అని చెప్పి తపతి సూర్యమండలముఁ జొచ్చె. అంత సంవర

ఋండు మఱల మూర్ఛవోయి పడియుండ నాతనియమాత్యుం డేతెంచి చల్లని నీళ్లతో ముఖమును దడపఁగా మూర్ఛదేఱె, మంత్రి నొక్కరుని మాత్రము సమీపమున నుండ నియమించి, మంత్రితో నేతెంచిన తక్కటిపరిజనము నంతను బురంబునకుఁ బంపి యాకొండ ప్రదేశమునఁ బాఱుచుండు నొక్కయేటిదరి నునికిగాఁ గొని యందు నిత్యము స్నానముచేయుచు, నాహ్నికక్రియల నెఱవేర్చుచు,సూర్యారాధనతత్పరుండై సూర్యునిదెస మోముఁద్రిప్పి చేతులు జోడించి క్రోధలోభరహితుఁడును,గమలభవప్రభావుఁడును, దురితదూరుఁడును, దనపురోహితుఁడును నగు వసిష్ఠమహాముని నతిభక్తితోఁ దలఁపఁగాఁ, దనకుఁ బ్రభు వగు సంవరణుకడకు హితమతితో నమ్మహాముని యరుదెంచెను. ఇట్లు సంవరణుండు తలంచిన పండ్రెండవదివంబున వచ్చి సంతతోపవాసవ్రతనిష్ఠుండై కృశీభూతశరీరుండై యున్న శిష్యుండైన సంవరణుం జూచి, యా రాజు తపనసుత యగు తపతియందు బద్ధానురాగుండై యుండుటను దన యోగమహిమంబున నెఱింగి, సంవరణునిమనోభీష్టంబు నెరవేర్తు నని యతనికిం జెప్పి, యాకసంబు దెసఁ బ్రయాణమై యాదిత్యమండలము సమీపించి సూర్యునకు నమస్కరించి తననామోచ్చారణంబు సేసి తన్నుఁ దెల్పఁగా, నర్యముండు మునివర్యా! భవదాగమనప్రయోజనంబు సెప్పుము. దుష్కరంబైనను నెఱవేర్తుననఁగా, నత్తపనునకు నత్తాపసవర్యుం డిట్లనియె. దేవా! సావిత్రికంటెఁ గొండికయైన నీకూఁతుఁ దపతిని భూలోకమున సంవరణునకు భార్యగా వరించి వచ్చినవాఁడను. ఆరాజు ధర్మమార్గము నవలంబించి నిర్మలయశస్సు నార్జించి యున్నవాఁడు. కావున నాతండు నీదుహితకుఁ దగినవగుం డనఁగా, మార్తాండుండు మునివరా! ధర్మమూర్తియే యగు సంవరణుండు వరుఁడనియు మునిశ్రేష్ఠుండగు నీ వాతనిపురోహితుండవై కన్యారత్న మగు నాకూఁతుఁ దపతినిచ్చి వివాహముచేయు మనఁగా, నే నొండు పలుకఁగలవాఁడనే? ఈవివాహమునకు లోప ముండునా? యని చెప్పి,నాయనుంగుఁ గూఁతుఁ దపతిని నీతోడఁ బంపెద. తోడ్కొని చని సంవరణునకు శుభముహూర్తమున వివాహ మొనర్పింపుము. అని చెప్పి తపతిని మునివెంటఁ బనిచెను.

ఇవ్విధంబున వసిష్ఠుండు సూర్యమండలమునందుండి తపతిం దోడ్కొని యంతవఱకుఁ బండ్రెండు దినములుగ సూర్యు నారాధించుచు నుపవాసవ్రతమును సలుపుచున్న సంవరణునికడ కేతెంచి యక్కన్య నతని కొసంగె. పదంపడి సంవరణుండు భాస్కరానుగ్రహమునఁ బొందిన తపతిని వసిష్ఠునియనుమతిం బెండ్లియాడి, సర్వమహీరాజ్యపాలనాది కార్యములను మంత్రియందు నిలిపి పండ్రెండేఁడు లాతపతితో నాపర్వత నదీప్రాంతములయం దిష్టోపభోగంబుల ననుభవించుచుండె. ఇట్లు మదనపరవశుండై సంవరణుం డుండ యాగాదిదేవహితకార్యములను జేయమి నతనిరాజ్యమునఁ గాలవర్షములు గురియ వయ్యెను. రాజ్య మంతయుఁ గాటకముపాలయ్యెను. ప్రజలు నీరుపట్టుచేతను, నాఁకలి చేతను మలమలమాడి నశించిరి. కొందఱు పుత్రకళత్రాదుల నెడఁబాసి దేశాంతరముల కేగిరి. పశువులు కాపాడువారు లేక నశించినవి. ఇవ్విధమున రాజ్య మంతయు బహువిధక్షోభమున కిరవు కాఁగా, మహానుభావుం డగువసిష్ఠుండు లోకహితార్థంబు రాజగు సంవరణుని సమీపించి పురమునకుఁ దపతీసమేతుంగాఁ దోడ్కొని వచ్చి యామహీపాలుచే శాంతికపౌష్టికకర్మములను జేయించెను. దానంజేసి యింద్రుండు తృప్తుండై సంవరణునిరాజ్య మెల్లెడల సంతతధారాపాతంబుగా వర్షముఁ గురియించెను. దేశము నాక్రమించియుండిన కాటకము తొలఁగెను. సస్యవృద్ధి యయ్యెను. దేశాంతరములకుఁ బోయినప్రజలుతమదేశమునకు మరలవచ్చిరి. ప్రజ లపరిమితానందముతోనుండిరి. పదంపడి సంవరణుండు వసిష్ఠుం డానతిచ్చినచొప్పునఁ బండ్రెండేండ్లు యాగము లనేకముల నొనర్చి ధర్మపరాయణుండై మహీరాజ్యము నప్రమత్తుండై యేలుచుండెను ఆసంవరణునకుఁ దపతియందుఁ గురు వనురాజు పుట్టె మీవంశమునకు మూలపురుషుండై వర్తిల్లె. ఆకారణమున మీరు తాపత్యులనఁబడితిరి. అని చెప్పఁగా విని యర్జునుం డఙ్గారపర్ణునితో వెండియు నిట్లనియె. చెలికాఁడా! మావంశపుఁబూర్వరాజులకుఁ బురోహితుండైన వసిష్ఠమహామునిచరితంబును నాతనిమహిమంబును విన వేడుక జనించినది. కావునఁ దచ్చరితంబు నానతీయవే యనఁగా, నప్పార్థున కంగారపర్ణుం డిట్లనియె.

## అంగారపర్ణుం డర్జునునకు వసిష్ఠమహిమ చెప్పుట

అర్జునా! మహాత్ముం డగు వసిష్ఠునిదివ్యచరితంబు నుడువుట నావంటివాని కలవియగునా? అయినను నాసామర్థ్యంబుకొలఁది యెఱింగినంత నుడివెదను. ఆలకింపుము. వసిష్ఠమహాముని బ్రహ్మమానసపుత్త్రుండు. మహాపతివ్రతలలో మిన్నయైనయరుంధతి యామునిభార్య. అరిషడ్వర్గములలోఁ బ్రథమములగు కామక్రోధములను దేవతలు గూడ గెలువలేకయుందురు. అట్టి రెంటిని నామహానీయుండు తన బహుకాలతీవ్రతపమున గెల్చి వానినిఁ దనకాలిబంట్లుగఁ జేసికొని యుండెను. ఈమహానీయునితో విశ్వామిత్త్రుండు మత్సరించి యతిక్రోధమూర్తియై యీమహానీయునికొడుకుల నూఱుగుర నొక్కపెట్టి చంపెను. అట్లు పుత్త్రశోకతప్తమానసుం డయ్యును, నతిశాంతచిత్తుండై యావిశ్వామిత్త్రునకు మాఱెద్దియుఁ జేటు తలఁపఁడయ్యెను. అంతియ కాక చచ్చినకుమారులను మఱల బ్రతికించుటకు విశేషతపస్సామర్థ్యంబు కలిగియు సముద్రుండు చెలియలికట్టను బోలె యమునాజ్ఞ నుల్లంఘింపఁ డయ్యెను. మఱియు నీమహానుభావుం డిక్ష్వాకువంశపురాజుల కెల్లను బురోహితుండై యుండెను. ఈమునిచంద్రుని సదాలోచనముచే నారాజు లనేకయజ్ఞములను జేసి యిహపరలోకములలోఁ బెక్కుశుభములను బొందిరి. రాజులు తమకుఁ దపస్వియైన యుత్తమబ్రాహ్మణునిఁ గులపురోహితునిగాఁ జేసికొనినచో నాతనియాశీర్వచనబలమున వార నేకనిశ్శ్రేయసములను బడయుదురని యిదివఱకుఁ జెప్పియుంటిని గదా! అట్లే మీరును సర్వసుగుణముల నుత్తముం డగు తపస్వియైనబ్రాహ్మణుని నొక్కనిఁ బురోహితుంగాఁ గొని వాని సదాలోచనమున మెలఁగుచు మీరాజ్యమును మఱల సాధించికొని సుఖింపుఁ డనఁగా విని, యోప్రియుఁడైన చెలికాఁడా! వసిష్ఠవిశ్వామిత్త్రుల కేకారణమునఁ బగ గలిగెను? తెలియునట్లుపన్యసింపు మనఁగా నర్జునున కంగారపర్ణుం డిట్లనియె.

పూర్వకాలమునఁ గాన్యకుబ్జదేశమునకుఁ గుశికవంశమునఁ బుట్టిన గాధియనుప్రతాపశాలి రాజై యేలుచుండెను. ఆమహానీయునకు నతిపరాక్రమవంతుఁడును, దేజోవంతుండును నగు విశ్వామిత్త్రుండను కుమారుండు పుట్టెను. విశ్వామిత్త్రుండు తనతండ్రియనంతరము మహీరాజ్య

మున నేలికయై ప్రజ లందఱును సకలసంపదలతోఁ దులదూఁగునట్లు పాలించుచుండెను. ఆవిశ్వామిత్రుం డొకనాఁడు రాజోచితమైన వేఁటకుం దఱలి వనప్రవేశము గావించి యం దనేకమృగములం జంపి బహుదూరంబు చని యలసి నీరువట్టి యాయాసమునఁ జెంత నున్న వసిష్ఠునాశ్రమంబున విశ్రమించువాఁడై చనెను. అంతఁ దపోధనుం డగు వసిష్ఠుండు విశ్వామిత్రునిరాక కభినందించి యాతని శుశ్రూషలకు శిష్యులం బుచ్చి వారిచేఁ బాద్యము నిప్పించి యనేక శీతలోపచారములఁ జేయించి కుడువఁ జెప్పెను. అంత రాజును దపస్వీమాటను జవదాఁట నేర కియ్యకొనెను. వెంటనే వసిష్ఠుండు తనహోమధేనువైన నందినిం బిలిచి యిట్లనియె. నందినీ! ఈరాజు సకలపరివారముతో మనయాశ్రమమున కిప్పు డతిథియై యున్నవాఁడు. ఆతనికిని నతని పరిజనములకును వలయునన్ని భోజనపదార్థములను నభిమత మధురమ్మైనవానిం బెట్టు మనఁగా నందినియుఁ బరివారసమేతుండైన రాజునకు వలసినన్ని భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయాదిసకలపదార్థములను రుచ్యము లయినవానిని, మఱియు ననేకవిధరత్నాభరణములను, ధరించుట కుపయుక్తములై చిత్రవిచిత్రములై యమూల్యములగు దుకూలవస్త్రములను దత్క్షణము వర్షించెను. అంతట వసిష్ఠమునీంద్రుం డాపదార్థములను విశ్వామిత్రునకును, దదీయపరివారమునకును గుడువఁబెట్టి వారు సంతుష్టులైయుండ, వారివారి కుచితములగు నాభరణంబులఁ దొడుగ నిచ్చి యుచితవస్త్రములను ధరింప నొసంగఁగా నందఱును నానిర్జనారణ్యమున మహనీయుం డగు వసిష్ఠుండు తమ కిట్టి యభిమతంబు నెల్ల సమకూర్పఁ గలిగెనే యని యత్యాశ్చర్యభరితమానసు లైరి. విశ్వామిత్రుండును మునిసపర్యల కచ్చెరువొంది యీమహనీయుఁ డిట్లు తమ కాతిథ్య మొసఁగునట్లు వీలు కలిగించినదియు, సున్నతములై చిక్కనితోడలుగల కాళ్లును, సొంపైన మెడయందు వ్రేలాడు గంగడోలును, దీర్ఘమై కొనను జెండువంటి వెంట్రుకలఁ జెన్నుమీఱు తోఁకయును బలిసినచతుస్స్తనంబులతో వ్రేఁగైనపొదుంగును, విశాలములగు చెవులును, నొసలును, సొంపైన కొమ్ములును, జంద్రకాంతివంటి తెల్లనిమేనును, మండూకనేత్రములును గలిగి మనోరమమై సర్వసద్ధేనుశుభలక్షణములతో నొప్పాఱుచున్న యా

నందినిని గొనిపోవ నెంచి వసిష్ఠుని సమీపించి యిట్లనియె. ఓమునీంద్రా! నీ కర్బుదధేనువులను నింకను నారాజ్యము నంతను నొసంగెద, ఈ మొదవును నాకిమ్ము. అనఁగా నారాజునకు మునిరా జిట్లనియె. రాజేంద్రా! ఈ ధేనువు నాకు దేవతారాధనములకును, పితృపూజలకును, నతిథిసత్కారములకును, యాగాదిసపర్యలకును నుపయుక్త మగును. కావున దీని నొసంగనేర, అర్బుదగోవులును, మఱి నీరాజ్య మెల్ల నైన నా కేల? యనఁగా విశ్వామిత్రుం డవ్వసిష్ఠునితో నేను క్షత్రియుఁడను, నీవు తపస్స్వాధ్యాయసాధనములతో నుండువిప్రుండవు. శాంతిదమములతో నుండు భూసురుల రగు మీకు వీర్య మెక్కడిది? శూరుండ నగు నేను బరాక్రమించి దీనిం గొని యేఁగెదను. నాకులధర్మమును వదలి యూరక పోమ్మన్నఁ బోవుదునే? కావున నందినిని బలాత్కారమునఁ దోలుకొని పోయెదను, అని చెప్పఁగా నతనికి వసిష్ఠుఁ డిట్లనియె. నీవు భుజబలపరాక్రమసంపన్నుండవు. నీయిచ్ఛ మెయి వర్తింపుము. అని చెప్పఁగా విశ్వామిత్రుండు తనసేవకులను బంపి నందినిని గట్టి తోలుకొనిరమ్మనెను. అంత వా రాధేనువుం జుట్టుముట్టి యెటు పోనీయక నిర్బంధించుచుండ నయ్యది వారికిఁ జిక్కక తప్పించుకొనుచు నాశ్రమము నలువైపులను వారల నీడ్చి యలజడిపెట్ట యత్నింపఁగా దానిని వారు కఱ్ఱలతోఁ గొట్టిరి. అంత నప్పటికిని నందిని వారికిఁ బట్టువడక యంభారవంబు సేయుచుఁ దోఁక పైకెత్తుకొని పఱచుచు వసిష్ఠుసన్నిధానము నకుఁ జేరి యిట్లనియె. స్వామీ! నన్నుఁ గట్టి తోలుకొని పోవుటకు వచ్చుచున్న యీవిశ్వామిత్రుని సేవకులకు నేను బట్టువడకున్నను, వారు న న్నేవిధమున నైనఁ దోలుకొని పోవలయు ననుయత్నముతో నా యొడలి నంతయుఁ గఱ్ఱలతో బాదుచున్నారు. నే నీకష్టములను బడుచుండ నా కొడయండ వగు నీ వూరకుండుట పాడియే? యనిన వసిష్ఠుండు నందినితో, శమదమాదిసంపన్నుండనయిన నేను బలపరాక్రమసంపన్నునితో నోర్వఁ గలనే?॰ నందినీ! నే నేమి నీ కుపకరింపఁగలను? తపస్సుఁ జేసికొనుచుండు విప్రుఁడను, శాంతితత్పరుండ నగు నేను శరీరబలము గలరాజుల నెదిరింపలే నని నీ వెఱుంగవా? కావున వారలతో నీ కిష్ట మగునేనిఁ బొమ్ము. అనఁగా అంత నందిని, మహానుభావా! నీతీరుఁ

జూడ నాయాశ్రమంబు నీకు లేన ట్లున్నది. యథార్థముగ నీయభిప్రాయ మెట్టి దియో? యని యడుగ వసిష్ఠుఁడు నిను నే విడువనేర. వీర్యముఁ జూపి క్షత్రియు నెదిరింప నేర. దాన నాతపోభంగ మగును. కాన, నీ వోపు చేని యిచ్చుట నుండుము. ఇదే నీదూడను బలవంతపఱచి కట్టి తెచ్చు చున్నవారు. అని చెప్పఁగా ఋషివర్యుఁడు తనకు నెల వొసంగు నని తలంచి పట్టపగలింటిసూర్యునిమాడ్కిఁ దీక్ష్ణవీక్షణములను వారిపైఁ బ్రసరింపఁజేసి నిప్పుకణంబులను గురియింపఁదొడంగెను. అప్పుడు దాని తోఁకయం దుపప్లవులును, బొదుఁగున శకద్రావిడులును, యోనిప్రదేశ మున యవనులును, గోమయమున శబరులును, మూత్రమున శరభు లును, బ్రక్కలయందుఁ బౌండ్రకిరాతకాంభోజసింహళబర్బరవశ చివుక పుళిందచీనహూణకేరళులును, నురుగున వివిధమ్లేచ్ఛులును వివిధాయుధ పాణులై పుట్టి, విశ్వామిత్రునిసైన్యములోనివారి నొక్కొక్కరి నార్గు రేడ్గురుగాఁ బట్టికొని యొకనినైనను వధింపక యాసైన్యమునంతను వసిష్ఠాశ్రమమునకు మూఁడామడలదూరప్రదేశమునకు వెడల నడఁచు టయు, విశ్వామిత్రుం డద్యోమయమైన చిత్తము గలిగి మునిచేష్టితము నకు విస్మయ మంది క్షత్రబలమును నిందించి, బ్రహ్మతేజోబలమే బల మని బలాబలవిశేషము నంతను బరిశీలించి యిట్లని నిశ్చయించెను.

"ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్"

తపోబలమునకు వేఱొక్కబలము సాటి రా దని క్షత్రియోచి తంబులైన భోగములనెల్ల విడనాడి విరక్తుండై దారుణపర్వతప్రాంతముల యందును, వనాంతరములయందును, దీవ్రతపంబు బహుకాల మొనర్చి యత్తపోమహిమంబున గుణాధికుండై దివ్యశక్తిని బ్రహ్మర్షిత్వమును బడసెను. ఆవిశ్వామిత్రుం డిక్ష్వాకుకులసంభవుం డైనకల్మాషపాదుం డను రాజునకు యాజకత్వం బపేక్షించి తత్పురోహితుండైన వసిష్ఠుతో బద్ధవైరుం డయి వసిష్ఠున కెట్టకేని చెఱుపు తలంచుచున్నంత నొక్క నాఁడు కల్మాషపాదుండు వేఁటకుం జని రమణీయంబైన వనంబునందు బహుదూరగతుండై యలసి వసిష్ఠునాశ్రమంబు సొచ్చి పోవుచుఁ దన కెదురుగా వచ్చుచుండిన వసిష్ఠు నూర్గురిపుత్త్రులలోఁ బెద్దయు, బహుతప స్సంపన్నుండును నగు శక్తి యను మునీంద్రుం గని దారి తొలంగు మని

రాజా దురహంకారమున నిర్లక్ష్యపఱచుటయుఁ, గల్మాషపాదునితో నాశక్తి యిట్లనియె. రాజా! ఏకాలమున నైనను రాజులు విప్రులకు తెరువు తొలఁగుదురు. సర్వధర్మములను దెలిసిన నీకు నేను ధర్మబోధమును జేయు నేల? యని చెప్పి తాను దొలంగకుండె. అవ్విధమున ధర్మమార్గపు వడవడి మేరకు శక్తియును, నభిమానకోపంబులం జేసి కల్మాషపాదుండును దొలంగరైరి. అంతఁ గల్మాషపాదుండు మిక్కిలి కనలి శక్తిని చబుకుతోఁ గొట్టెను. అప్పుడు శక్తిమహాముని వేదనాభరంబునఁ గల్మాషపాదునిఁ జూఱచుఱఁజూచుచు రాక్షసుని విధమునఁ గృపారహితుండవై నన్నుఁ గొట్టితివి. ఇది మొదలు మనుష్యమాంసమును భక్షించుచు దేశములందుఁ ద్రిమ్మరివై యుండుమని శపించె. అవ్విధమున ఘోరశాపమునకు భీతిల్లి కల్మాషపాదుండు శాపమోక్షణరీతిని బ్రార్థించుచుండఁగాఁ గల్మాషపాదశక్తి మహామునుల పరస్పరకోపసంభాషణంబుల నెఱిఁగి విశ్వామిత్రుం డచ్చోటి కదృశ్యుండై వచ్చియుండి కింకరుఁ డనురాక్షసునిఁ గల్మాషపాదుశరీరము నావహించి యుండునట్లు నియమించి యుండె. అంతఁ గల్మాషపాదుండు శక్తిశాపమునను, దన్ను రాక్షసుఁ డావహించియుండుటచేతను నొడలెఱుంగక పోవుచుండఁ ద నొక్క విప్రుండు మాంసముతోఁ గూడినయన్నముఁ గుడువఁబెట్టుమనికోరఁగా రాజు వల్లె యని నగరుఁజొచ్చి బ్రాహ్మణుని నందొక్కచో నుండ నియమించి రాక్షసావేశపరత్వమున విప్రునితో నాడిన మాటను మఱచి యర్ధరాత్రమునకుఁ దెలివి రాఁగా నప్పుడు పోయి వంటలవాని లేపి యాచించియున్న బ్రాహ్మణునకు మాంససహితాన్న మిడు మనఁగా నావంటలవాఁ డిదియపరరాత్రముగదా! ఈవేళయందు మాంసము లభించునా? ఏమిచేయనగు? అనఁగా నప్పుడు రాజు మనుష్యమాంసమునైనను వండిపెట్టు మని యాజ్ఞాపించెను. అంత నా వంటవాఁడు నరవధస్థానమునకరిగి యామాంసమును దెచ్చి వండి బ్రాహ్మణునకుఁ గుడువఁబెట్టెను. ఆబ్రాహ్మణుండు తనదివ్యజ్ఞానమునఁ దన కిడినమాంసము మనుష్యమాంసమని యెఱింగి నాకభోజ్యమైన నరమాంసము నీరాజు కుడువఁ బెట్టెఁ గావున నరపిశితమును గుడుచుచు దేశముల వెంబడి సంచరించుచుండుమని కల్మాషపాదుని శపించె. అవ్విధమునఁ గల్మాషపాదుండు రాక్షసావేశ

మునను నిరువురిశాపమునను మనుష్యులంబట్టి వధించుచు మనుష్యమాంస మును దినుచు దేశసంచారమును గావించుచు నొక్కచో శక్తిమహా మునినిం గని నీశాపమున నే నిట్లయితి ననుచు నాతనిని బెద్దపులి పశు వునుంబోలెఁ బొదివి పట్టి వధించి యాతనిమాంసమును భక్షించెను. అంత వసిష్ఠకుమారుండైనశక్తిమరణమును విని విశ్వామిత్రుం డానందిం చెను. కల్మాషపాదుని నావహించియున్న రాక్షసునితో మిగిలిన వసిష్ఠ పుత్రులను సైత మిట్లే మెసవు మని యాజ్ఞాపించెను. అంత రాక్షసుండు కల్మాషపాదుమూలమునఁ గ్రమక్రమముగా వసిష్ఠపుత్రుల నందఱను మ్రింగెను. ఇవ్విధమున విశ్వామిత్రుఁడు ప్రేరేపింపఁగాఁ గల్మాషపాదు నావహించిన రాక్షసుఁడు తనపుత్రుల నందఱ వధించెనని వినియు శమదమాదిసాత్త్వికగుణప్రధానుండు గావున నావిశ్వామిత్రునకుఁ బ్రతిహానిఁ జేయ నొల్లక యపారచింతాభరంబునఁ బ్రాణముల శరీరమునందు నిలుపలేక యాత్మహత్య మహాపాతక మైనను వెనుదీయక ప్రయత్నించి మేరుశిఖర మారోహించి దానినుండి యొక్కపెద్దబండపైఁ బడెను. అట్లు పడిన యామునివరేణ్యున కాతని తపోమహత్త్వమున నాబండ మిక్కిలి మృదుశయ్య యయ్యెను. అంతటితో నూరకుండక యమ్మునివరేణ్యుం డగ్నిని జక్కఁగాఁ బ్రజ్వరిల్లఁజేసి దానియందు దహింపఁబడుదునుగాక యని చొచ్చెను. కాని యాతని కాహుతాశనుండు మంచుగడ్డవలె నతిశీతలుఁడయ్యెను. మఱియు నెట్టిన నీయపారదుఃఖమును సహింపలేక శరీరత్యాగమునకు సముద్రమునందుఁ బడెను. కాని, సముద్రుం డాతనిని జంపనేరక వేగవంతమైన యలలఁ గలిగించి వానివేగమున నొడ్డున కామునిశరీరమును బ్రాణములతో నెట్టుచుండెను. అంత వసిష్ఠుండు తనకు మరణ మాసన్నము గామి నెఱింగి యెట్లో క్రమ్మఱ నాశ్రమము నకుం జని పుత్రుల నెల్లం దలఁచుకొని శోకించి కొంతకాల మయ్యనపిదప మఱల మరణయత్నతత్పరుండై వానకాలపునూతనోదకప్రవాహము పెంపున గట్టుల నుండుమహావృక్షములను బెకలించుచుఁ దీరద్వయము నొరసికొనుచుఁ బ్రవహించుచున్న యొక యేటిం జూచి తనదేహము బటువులైన పెక్కుతీఁగెలతో బంధించుకొని యాయేటిప్రవాహమున నైనను శరీరమును ద్యజింపలేనా యని పడెను. ఆయేఱు మెల్లన తన

యలలతాఁకుడుచే నామహాముని దేహమును బంధించియున్న పాశము
లను విడిపించి యాతని నొకతీరమునం దొక్కచోటఁ జేర్చెను. అంత
వసిష్ఠముని యాయేఱు తనపాశములను వదలించుట బట్టి యప్పటినుండి
యాయేఱు విపాశ యనఁబడు నని దానికిఁ బేరు వెట్టెను. కాని, పుత్త్ర
శోక మంత కంత కధికమగుచుండఁగా నంత నిలువక ప్రవాహపూరిత
మగు వేఱొక నదియందుఁ బడెను. ఆనదియు నగ్నింబోలు నామహానుభావుం
డగు వసిష్ఠుని తేజస్సునకు వెఱచి నూఱుతెఱఁగులఁ బాఱఁగ నాముని
దానికి శతద్రు వని నామకరణముచేసి యేవిధమునను దనకు శరీరత్యాగ
వేళ యాసన్నము కా లేదని నిశ్చయించి మరలి యాశ్రమమును జేరు
టకుఁబోవుచుండఁగాఁ దనవెంబడి నుదాత్తానుదాత్తస్వరితప్రచయముల
నెంతమాత్రము పొల్లుపోక వేదాధ్యయనఘోషము చెవుల కింపు
పుట్టింపఁ దనకుమారుండు శక్తివోలె మధురముగ వేదములఁ బఠించు
చున్నవాఁ డెవం డొకో యని తిరిగిచూచెను. అంత శక్తిభార్య దృశ్యంతి
యనునది మామతో నెవరునుగారు తా నని యెలుంగిచ్చి సమీపించి
మునివర్యా, నాగర్భమున నీకుమారుండగు శక్తియొక్క పుత్త్రుండున్న
వాఁడు. వీఁ డనవరతవేదాధ్యయనశీలుండైన శక్తి వేదఘోషమునువిను
చుం బండ్రెండేడులు గర్భముననుండి సకలవేదంబులు నేర్చినవాఁడనఁగా
వసిష్ఠుఁడు పౌత్త్రముఖమును జూచి యేను కృతార్థుండ నగుదు నని
మరణ వ్యవసాయనివృత్తుండై నిజాశ్రమమున నుండునంత నొక్కనాఁడు
రాక్షస రూపధరుండై రౌద్రాకారంబున వచ్చు కల్మాషపాదుం జూచి యా
దృశ్యంతి వెఱచిన దాని నోడకుండు మని మునివరుండు వానిని హుం
కారమున వారించి మంత్రపూతంబులైన కమండలుజలంబులా రాక్షసు
శరీరముపైఁ జల్లెను.

### వసిష్ఠుఁడు కల్మాషపాదునకు శాపమోక్షము చేయుట

అంతఁ గల్మాషపాదుండు తా నప్పటికిఁ బండ్రెండేండ్లుగా ననుభ
వించుచుండిన శాపమునుండి విముక్తుండై తన పూర్వరూపము నొంది
సూర్యునింబోలెఁ బ్రకాశించుచు వసిష్ఠునకు సాష్టాంగదండప్రణామంబు
లాచరించి చేతులు జోడించుకొని యెదుట నిల్చి మహాత్మా! నేను సౌదాసుఁ

డనునామాంతరమున వెలయు కల్మాషపాదుఁడను. ఇప్పుడు నీయనుగ్రహమునఁ గృతార్థుండ నయితి. ఏమి చేయుదు? అనతిమ్మని ప్రార్థింపఁగా నమ్మునిచంద్రుండు వాని కిట్లనియె. రాజా! ఇంతటితోనైనను విప్రుల నవమానింపక ధర్మయుక్తుండవై ప్రజాపాలనముఁ జేయుము. నీవు స్వపురమునకుఁ బొమ్ము. అనఁగా నాకల్మాషపాదుం డాఋషిపుంగవునితో నీయానతిమెయి ధర్మమున వర్తిల్లెద. సంతానహీనుండనగుటచేఁ బితరుల ఋణమును దీర్పనేరక వంతతో నుందును. నాయం దనుగ్రహించి నాకోరినపుత్త్రుం దయసేయుము. నాపురికి విచ్చేయు మని యెంతో ప్రార్థింప వసిష్ఠుండు పరమశాంతుండు కావున వానివేఁడికోలు నంగీకరించె. అంత నొకానొకసమయమున నుచితకాల మాసన్నము కాఁగాఁ గల్మాషపాదుండు వసిష్ఠుని నమరావతికి సమానమైన తనపురియగు నయోధ్యకొడ్డోలగంబునఁ బ్రజ లెల్ల సంతోషించుచుఁ జూచుచుండ నానావిధోపచారములతో రప్పించి యొక్కనాఁడు తనభార్య యగు మదయంతి నమ్ముని యిష్టోపభోగంబుల ననుభవించునట్లు నియమించె. పిదప నాసూనృతవాక్కైన యాఋషివర్యుం డయ్యంగనామణితోఁ గ్రీడించి యప్పరమపతివ్రత గర్భము ధరించునట్లొనర్చెను. వెంటనే వసిష్ఠుండు కల్మాషపాదునిచే సత్కరింపఁబడి తనయాశ్రమమును జేరెను. మదయంతియుఁ దనగర్భమున నున్న కుమారుం డెన్నినాళ్లకును వెలువడకుండఁగా రోసి గర్భము నొక్కఱాతితోఁ గొట్టెను. అంతఁ బండ్రెండేండ్లకొక్కకుమారుని అశ్మకుఁ డనువానిని (అశ్మమనఁగా ఱాయి, ఱాతితోఁ గొట్టఁబడెను గాన వాఁ డశ్మకుఁ డనఁబడు) గనెను. అంత వాఁడు దినదినప్రవర్ధమానుండై తేజరిల్లుచు పౌదన్యపురమును రాజధానిగాఁ గొని ప్రజల నేలుచుండె. వసిష్ఠుండును దనయాశ్రమమును జేరినపిదపఁ దనకోడలు ప్రసవింపఁగా నుత్పన్నుండయిన కుమారునకు వేదోక్తజాతకర్మనామకరణాదిసంస్కారములఁ గావించి మనుమనిఁ బెంచుచుండె. ఆకుమారుఁడు గర్భమునను్నప్పుడు మరణవ్యవసాయమున నున్న వసిష్ఠుని నాయుద్యమమునందుండి మరలించుటం జేసి పరాశరుం డని పిలువంబడి, తనతండ్రి నెఱుంగమి వసిష్ఠునే తండ్రి యని పిలుచుచుండఁగా వానితల్లి యొక్కనాఁడు చింతతోఁ గన్నీరుఁ గార్చుచు వాని కిట్లనియె. పుత్త్రా!

యీఋషివర్యుండు నీతండ్రికిఁ దండ్రి. నీకు తాత గావలయును. నీతండ్రి యొక రాక్షసునిచే హతుఁ డయ్యెను. అని చెప్పఁగా విని యా కుమారుం డలిగి యట్టి యధర్మమున కెడ మిచ్చినలోకమునెల్ల దహింతు ననఁగా వసిష్ఠుండు వానితో వత్సా! ఇది తపస్వులకుఁ దగ దని నివారించె. అని యంగారపర్ణుం డర్జునునితో నక్కథ నిట్లు వివరింపఁదొడంగెను.

ఓ చెలికాఁడా! వినుము: అవ్విధమున సకలలోకవినాశమునకుఁ బ్రతిన నూనిన మనుమని వారించి వసిష్ఠుండు వానితో నిట్లనియె. పరాశరా! పూర్వమునఁ గృతవీర్యుఁ డను రాజనేకయాగముల నొనర్చి వేదవిదులును, యాజ్ఞికులును నగు భృగుసంతతివారి కనేకవిధముల నొసంగి ధర్మపరుఁడై బహుకాలము ప్రజలను నేలుచుఁ గాలగతిం జెందెను. అంతఁ గొన్నినాళ్లకు కృతవీర్యునివంశమునఁ బుట్టినరాజుల కొకకారణంబున నధికధనము ను వెచ్చించి యొకకార్యమును నెఱవేర్పవలసి రాఁగా వారు భార్గవులం బిలిచి తొల్లి కార్తవీర్యుండు వారల కిచ్చియున్నధనమును యాచించిరి. అంత భార్గవులు రాజులధనము నీయక కొందఱు భూమిలోఁ బాతిపెట్టిరి. మఱికొందఱు తమయొద్ద నుండినచో రాజులు నిర్బంధించిరైనను, గొనిపోవుదు రని నానావిధ దానముల నితరబ్రాహ్మణుల కొనర్చి వెచ్చించిరి వేఱొకకొందఱు వారికివెఱచి తమయొద్ద నున్న వారి కొసఁగిరి. అట్లుండ నొకసమయమున వేఱొక కారణమున నారాజులు భూమినిఁ ద్రవ్వుచుండఁగా నచ్చోట భార్గవులు పాతియుంచినధనము కానరాఁగా భార్గవు లొనర్చిన దాపఱికమున కా రాజులు మిక్కిలి క్రుద్ధులై వారి నెల్లర వధించిరి. గర్భస్థులైనవారినిగూడ హింసించి చంప నారంభించిరి. ఈ ఘోరహత్యలకు వెఱచి భార్గవాంగనలు హిమవత్ప్రాంతమందు దాఁగిరి. వారిలో నొక్కభార్గవాంగన రాజులు తన్నుఁ జంపి గర్భమున నుండు శిశువును వధింతు రని తలపోసి గర్భస్థుఁడైన యర్భకునిఁ దనతొడయందు దాఁచియుంచెను. ఆవృత్తాంతము రాజులకుఁ దెలియఁగా నాభార్గవాంగనను దఱుముచు నావనితయూరువునందున్న శిశువును హింసింప రాఁగా నామె వెఱపుచేఁ బరువెత్తుచుండెను. అప్పు డాతొడయం దున్న యర్భకుఁడు తొడఁ జీల్చుకొని మధ్యందినమార్తాండునింబోలెఁ దేజోవంతుఁడై వెలుం

గుచు వెలువడుటయు నా వెంబడించుచున్న రాజభటు లామిఱుమిట్లు గొలుపు ప్రకాశమున కంధులైరి. అంత వారెల్లరు దిక్కులు దెలియక యెటు పోవుటకును దారి దెలియక యాభార్గవాంగనను శరణుచొచ్చి యిట్లనిరి. ఓపరమపావనీ, నీపాదములఁ బడియెదము. ఇఁక నిట్టి ఘోర కార్యముల నొనర్పము. అంధుల మైన మాకు దృష్టి నొసంగుము. మమ్ము రక్షింపు మనఁగా నాభార్గవవనిత వారి కిట్లనియె. ఓనరపాలు లారా! మీరు మాకు సకలవిధములఁ జెఱుపుల నేచేయుచుండఁగా మీకు వెఱచి నే నీశిశువును నాయూరువునందు డాఁచియుంటిని. అం దీశిశు వుండఁగా మావంశమునకు హితమాచరించునిమిత్తము వేదములన్నియు సాంగముగా నాశిశు వధిగమించెను. అవ్విధముగ నాయూరువునం దీతండు నూఱేఁడు లుండెను. ఇప్పుడు మీచెడుకార్యమునకు రోసి నా తొడను భేదించుకొని వెలువడి వచ్చెను. ఈతండు తనపితరులను మీ రీవిధమున వధించుచున్నారని తెలిసి దుఃఖితుఁడై మీయెడఁ గడు నలిగి మిమ్ముం జుఱచుఱఁజూచుడు, వాని రూక్షవీక్షణములను దివ్యతేజంబునను మీ రంధులరైతిరి. నాచేసినది యొం డెద్దియును లేదు. మీ రాబాలునిఁ బ్రార్థింపుఁడు. ఆతండు కరుణించినచో మీకు దృష్టి మరల రాఁగల దని నుడివెను. అంత నారాజు లామునిని వేఁడిరి. అప్పు డాబాలుఁడైన ఋషిపుత్త్రుండు వారిం గరుణించి చూపుల నొసంగెను. వెంటనే యా రాజులు స్వస్థులై మునిశక్తిని గొనియాడి తమయిక్కల కేఁగిరి.

### పితృదేవత లౌర్వుని శాంతచిత్తుం జేయుట

అంత నౌర్వుండు కార్తవీర్యునిసంతతివారు తనతండ్రుల కన్యాయము గావించిరనియు, లోకము ధర్మశూన్య మయ్యె ననియుఁ గావున నీలోక మంతయు నశింపఁజేయుదు ననియుఁ బ్రతిజ్ఞ చేసి తండ్రులకుఁ దాతలకుఁ బ్రీతిఁగాఁ దపం బాచరించి తపోబలంబున లోకములఁ గాల్చుచుండె. అంత వానిపితృదేవత లౌర్వునకుఁ బ్రత్యక్షమై యిట్లనిరి. వత్సా! లోకనాశమునకుఁ బూనుట తగదు. క్రోధ ముడుగుము. లోకమునెడఁ బ్రసన్నుండ వగుము. కార్తవీర్యసంతతివారు మాకుఁ జేయుచుండిన చెఱుపులకుఁ బ్రతి చేయలేక శక్తిహీనులమై మే ముం

డినవారము కాము. తపోబలముచే మా కాయుష్యు వృద్ధియగు
చుండెను. అంత నీలోకమున బహుకాల ముండుటకుఁ బ్రాణములు
విసికినవి. అయినను బ్రాణహత్య బహుపాతక మని తలపోయుచుంటిమి.
అంతట నీరాజులు ధనాపేక్షతో మాయొద్ద నుండుధనముఁ ని మ్మనఁగా
దాని నీయనిచో నీరాజు మనకు హాని చేయునని నిశ్చయించియే మే
మాతనికి ధన మొసంగుటకు నిరాకరించి దానిని భూమియందుఁ బాఁతి
తిమి. అది కారణముగ రాజవిరోధమును గల్పించికొంటిమి. కావున మే
మీశరీరములను వదలుటకు నిమిత్తమాత్రము వారైరి గాని, వారు
మమ్మును వధించి మా కేకష్టమును గలిగింపలేదు. మేము పుణ్యలోకము
లందు నున్నాము. కావున పర్యవసానమునకు మేము మాశరీర
ములు విడుచుటకు వారు నిమిత్తమాత్రులై రని లోకులకు తెలియదు.
మాకుఁ దపోబలమున వారిని నిగ్రహింప శక్తి గలదు. మఱియు
నెవ్విధముననైనను స్వర్గముఁ జేరవలయు నని యున్నవారము. స్వర్గ
గమనోన్ముఖులమైన మాకు ధన మేల? మాకుఁ గావలసినచోఁ గుబేరుం
డెంత ధనము గావలయునో యంత మా కొసంగఁ గలఁడు. కావున
రాజులయెడఁ గ్రోధ ముడుగుము. సర్వలోకములు సంతుష్టములై సుఖ
పడుట మా కభిమతంబు. అని చెప్పఁగా నాపితృదేవతల కౌర్వుం
డిట్లనియె. తండ్రులారా! ఈ రాజులకు వెఱచి మాతల్లి గర్భస్థుండనైన నన్ను
దనయూరువునందుఁ జేర్చి రక్షించుచుండినను దాని నెట్లో వీరు తెలిసి
కొని మాతల్లిని వధింపఁబూనఁగా మాయమ్మ వీరికి భీతిల్లి పఱచుచుండ
నాయదురుపాటున నామెయూరులనుండి నేను నేలఁ బడితి. అప్పు
డీరాజులు మీ కపకారము చేసి మిమ్మును వధించి రని తెలిసి వీరివినాశ
మునకుఁ బ్రతిన వట్టితి. అంత నాయీక్రోధము సహేతుక మయినందు
లకు వీరు మిమ్మును జంపినదే గాక భార్గవపత్నులగర్భస్థు లయిన యర్భ
కులను గూడ వధింపఁబూనుటయే నిదర్శనము. దుష్టులయిన యీరాజు
లను మీరు శక్తుల రయ్యును వారింప రైతిరి. లోకమున జనులు పాప
కారు లగుచుండఁగా వారి నెవ్వండును నిరాకరింపకున్నచో నందఱును
బాపాచారు లగుదురు. లోకమునఁ బాప మణఁగ నేరదు. శక్తుఁడయ్యును
బాపములను నిరాకరింపనిచో వాఁడును బాపియే యగును. నే నెఱిం

గియు నూరకుంటి నేని నేనును బాపాత్ముండ నగుదు. నన్నుఁ బాపము సంక్రమించును. కాఁబట్టి నాక్రోధము వారియెడ సహేతుకము. సహేతుక మగు క్రోధాగ్నికిఁ దగుచర్యఁ గైకొనపిచో నయ్యది వానిని దహించు. మీకోరిక ననుసరించి లోకులకు హాని రాకుండఁగను, నా ప్రతినకు భంగము కాకుండఁగను, నాకు హాని యెంతమాత్రము కలుగ కుండఁగను నాలోచించి చెప్పుఁడు. నే నట్ల చేయుదును. అని చెప్పఁగా నౌర్వునకుఁ బితృదేవత లిట్లనిరి. వంశవర్ధనా! నీక్రోధాగ్నిని నీళులం ద్రోయుము. అటులేని లోకములు సుఖించు. ప్రపంచమున రసపదార్థము లన్నియుజలమయములు. దానంజేసి నీక్రోధాగ్ని వానిని గాల్చుటం జేసి నీప్రతిజ్ఞాభంగము కానేరదు. అనఁగా నౌర్వుండు వారిచిత్తానుసారముగ దనక్రోధమును సముద్రమునఁ బడవైచెను. అప్పటినుండి యాయౌర్వాగ్ని బడబాముఖమున సాగరజలంబులను ద్రావుచుండును. ఇవ్విధమునఁ బితృదేవత లౌర్వుని శాంతాత్ముం జేసి నిజలోకముల కానందముతో నేఁగిరి. ఈ యౌర్వుని చరిత్రమును వానిక్రోధమునకుఁ గారణమును, వానిపితరులు వాని నెట్లు శాంతాత్ముం జేసినవిధమును నంతయును వసిష్ఠుండు తనపౌత్త్రుఁడగు పరాశరునకుఁ జెప్పి యాతనిని శాంతింపఁజేసె నని యంగారపర్ణుం డర్జునునకు వసిష్ఠమహిమను, పరాశరుమాహాత్మ్యమును నుడివెను. పరాశరుఁ డివ్విధమునఁ దత్కాల శాంతుఁ డయ్యెను దనతండ్రి రాక్షసునిచే వధింపఁబడి మరణము నొందె నని తలపోయునప్పు డెల్ల దుఃఖాత్ముం డగుచు రాక్షసుల నందఱను సంహారింతు నని సత్రయాగము నొక్కదానిం జేయఁబూనెను. పరాశరుని రెండవప్రతిజ్ఞను నివారింపఁగూడ దని తాత వసిష్ఠుండు మిన్నకుండె. అంత నాముని యాగంబు ప్రారంభించి మూలమూలలలో నున్న రాక్షసు లందఱును నాహ్వానించి యాగాగ్నియందు బాలు రనక వృద్ధులనక ఘోరముగఁ ద్రోయుచుండె. అప్పుడు వారివినాశమున కోర్వ లేక అత్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు మున్నగు మహర్షులు పరాశరునిచేఁ గావింపఁ బడుచున్న సత్రయాగశాల కరుదెంచిరి. త్రేతాగ్నులతో నాలవయగ్నిమాడ్కి వెలుంగుచున్న యప్పరాశరుం గని రాక్షసప్రళయమునకు దుఃఖితుండై పులస్త్యుం డిట్లనియె. పరాశరా!

నీయజ్ఞము విఘ్నము లేక కొనసాగుచున్నదా? ఏమియుం దెలియని వారును, నేరముచేయనివారును నగు రాక్షసుల నగ్నిగుండంబునం ద్రోయించుచు సంతసించుచున్నవాఁడవా? నావంశస్థు లగువారి కీవింత చెఱుపు నొనర్తువే? విప్రులకుఁ గ్రోధ మనుచితము కానేరదు. వారికి శాంతియే ముఖ్యధర్మము. రాక్షసుం డొక్కఁడు నీతండ్రిని వధించె నని యెల్ల రాక్షసులపై నలుగ వలదు. నీతండ్రి శక్తి యొసంగినశాప మత నికే హాని యొనరించె. అమ్మహాతపస్విని రాక్షసమాత్రుం డొక్కండు భక్షింపఁగలఁడే? విశ్వామిత్రుఁ డాకార్యమునకు నిమిత్తమాత్రమయ్యె. నీతండ్రి సోదరులతో దేవలోకమున సుఖమై యున్నవాఁడు. వసిష్ఠుం డీవృత్తాంతము నెల్ల నెఱుఁగును. ఇప్పు డీయగ్నిగుండంబునకు మంత్రా హూతులై బలాత్కారమునఁ ద్రోయంబడుచు వ్రేల్వఁబడుచున్న రాక్ష సులు వారికర్మవశమున నిందుఁ బడి భస్మీభూతు లగుచున్నవారు. దీనికి నీవు నిమిత్తమాత్రుఁడవు. కావున శాంతించి యింతటనైనను యాగము నుపశమింపఁజేయుము. అని చెప్పఁగా నప్పరాశరుం డందులకుఁ బితా మహుండైన వసిష్ఠునభిమతం బెఱింగి వెంటనే యాగము నుపసంహరింపఁ జేసి యాగాగ్నిం గొనిపోయి హిమవత్పర్వతప్రాంతంబుల దిగవిడిచె. ఆ యగ్ని యిప్పటికిని నచ్చటితరులతాగుల్మములను, పాషాణరాక్షసాదు లను బ్రతిపర్వమునందును భక్షించి నిర్మూలంబుగావించుచుండు. అని యంగారపర్ణుం డర్జునునకుఁ దపతీసంవరణోపాఖ్యానమును, వసిష్ఠువృత్తాం తమును, గల్మాషపాదుచరిత్రమును, భరద్వాజుం డైన యౌర్వునిమహిమ మును జెప్పఁగా విని యర్జునుఁ డంగారపర్ణునితో వెండియు ని ట్లనియె. కల్మాషపాదుండు తనకు సంతతి గావించుకొఱకు తనభార్యయగు మద యంతిని వసిష్ఠునితో సంగమింప నియమించె నంటివి. అది యేమి కారణం బునఁ బరమధర్మజ్ఞుం డయినవసిష్ఠుం డగమ్యాగమనమున కిష్టపడియె? అని యడుగఁగా నర్జునున కంగారపర్ణుం డి ట్లనియె.

మిత్రమా! ఆకర్ణింపుము. శక్తిశాపమునఁ గల్మాషపాదుండు రాక్షసకృత్యములం జేయుచు మైమఱచి వనములయందుఁ బేరాఁకట నకనకంబడుచు భార్యతో సంచరించుచు నొక్కనిర్జనారణ్య మునందుఁ గామపరతంత్రులయిన యొకబ్రాహ్మణదంపతులం గనెను.

అంత నీరాక్షసునకు వారు వెఱచి పఱచుచుండఁగా గల్మాషపాదుండు వారివెంట నంటి వారిలో విప్రుని బలాత్కారమున నొడిసిపట్టుకొని నంత, వానిభార్య కల్మాషపాదునితో నిట్లనియె. నరేంద్రా! లోకము నంతయును దనప్రకాశమున వెలిగించుచుండు సూర్యునివంశమునఁ బుట్టినవాఁడవై సంతానకాంక్షినై ఋతుకాలమునందు నాభర్త్రుసమాగమమును గోరి ప్రియునితో నేకాంతమున నీవిజనారణ్యమునందు యథేష్టసుఖములం దేలియాడుచుండ నామనోరథ మీడేరుటకుఁ బూర్వ మీపాపము నొడిగట్టుకొనకుము. నాభర్తను వదలి పుణ్యమునఁ బొమ్ము. మాయెడఁ గనికరింపుము. అని యెంత వందురుచున్నను శాపోపహతుండు కావునఁ గల్మాషపాదుం డాపరిదేవనమును సరకుగొనక కృపారహితుండై పెద్దపులి యాఁబోతుంబోలెఁ బొదవి యాబ్రాహ్మణుని జీల్చి రక్తమును ద్రావి, మాంసమును గబళించి, చర్మమునునూడ్చి యెముకలను బాఱవైచి చనెను. అంత నాబ్రాహ్మణి విషాదంబునఁ గోపించి యోరీ రాజాధమా! నాదీనాలాపంబులను వినక, నాయభిమతం బీడేరుటకుఁ బూర్వమే దాని కాటంకముగా నేఁ జూచుచుండఁగనే నాభర్త నిట్లు వికసనముచేసి భక్షించిన నీకును నీభార్యాసంగముకాల మెప్పుడగునో యప్పుడు నీవు చచ్చెదవుగాక యనిచెప్పి మఱియు నిన్నివిధమున రాక్షసుఁడవై రాక్షసకృత్యములఁ జరింపు మని శపించిన శక్తిమునితండ్రి నీభార్యతో సంగమించి నీ కపత్యమును గలిగించువాఁడనెను. వసిష్ఠునకు నీభార్య యగు మదయంతియందుఁ గలుగుపుత్త్రుఁడే నీకు వంశకరుం డగుఁగాక యని శపించి భర్తృకళేబరమున కగ్నిఁ దరికొల్పికొనుచు నయ్యగ్నిం జొచ్చి దేహత్యాగం బొనర్చె. అంతఁ గొంత కాలమునకుఁ గల్మాషపాదుండు వసిష్ఠానుగ్రహంబున శాపవిముక్తుండై తన పురికేగి ప్రజాపాలనంబు గావించుచుండ నొక్కనాఁడు భార్యం బిలిచి సంగమతత్పరుండు కాఁగా మదయంతి బ్రాహ్మణపత్నిశాపము నెఱింగి యుండుటం జేసి సంగమము నివారించెను. అంతఁ గల్మాషపాదుండు పుత్త్రాపేక్ష గలవాఁడు కావున వసిష్ఠునొద్ద కేఁగి యమ్మునివర్యునే తదర్థముగఁ బ్రార్థించెను. అప్పు డాఋషిశ్రేష్ఠుండు తన దివ్యజ్ఞానమున నంతయు నెఱింగి కల్మాషపాదునభిమతంబున కియ్యకొని యట్లు వర్తించె. తాపసశ్రేష్ఠ

లేవి యొనర్చినను దోషము గానేరదు. అనఁగా విని యర్జునుండు సంతసిల్లి యో చెలికాఁడా! మే మెవరినిఁ బురోహితునిఁగా వరించిన శ్రేయమగును? అట్టిపుణ్యాత్ముని, సుగుణరాశిని దెలుపవే యనఁగా నాగంధర్వపతి పాండవమధ్యమున కిట్లనియె. ప్రియసఖా! వినుము. ఈవనమున నుత్కోచకమను తీర్థరాజం బొండు కలదు. అందు దేవలభ్రాతధౌమ్యుం డనుమహర్షి శమదమాదిసాత్త్వికగుణములతోఁ దపం బాచరించుచుండు. ఆమహనీయుని మీరు వరించినచో మే లగు నని చెప్పఁగా నందులకిష్టపడి గంధర్వునాలోచనమునకుఁ బ్రీతుండై యయ్యంగారపర్ణున కాయాగ్నేయాస్త్రమును సమంత్రకముగ నుపదేశించి దాని ప్రయోగోపసంహారములను బోధించి వానితో ని ట్లనియె. చెలికాఁడా! నీవు మా కీయఁదలఁచిన యశ్వరాజములను నీయొద్దన యుండనిమ్ము. పని గలయప్పుడు వానిం దెప్పించుకొనెదను. నీవు శ్రేయస్సుఁ జెందుదువుగాక యని యతనిఁ బుత్తెంచెను.

### పాండవులు ధౌమ్యునిఁ బురోహితునిగ వరించుట

పిదపఁ బాండవులు భాగీరథీతీర్థమును వదలి యుత్కోచతీర్థముం జేరిరి. అచ్చోటఁ దపోనిష్ఠాపరుండై యుండు ధౌమ్యుం గాంచి మ్రొక్కి యమ్మహనీయునిఁ దమకుఁ బురోహితుంగా వరించి తమకు శుభములు సేకూరున ట్లనుగ్రహింపవేఁడిరి. అంత నామహనీయుండు తన్నుఁ బురోహితునిఁగా వరించువారి ప్రజ్ఞాపరాక్రమబలోత్సాహముల నుపలక్షించి నిఖిలవేదార్థతత్త్వజ్ఞుండును, బరమశాంతిమూర్తియును గావున వెంటనే వారి కతిథిసత్కారములను గావించి వారియభిమతంబున కియ్యకొనెను. అంత నప్పాండవులు ధౌమ్యమహర్షి తమకుఁ బురోహితుండై యుండుట కొప్పుకొనుచుండఁగనే తమకు మహీరాజ్య మెల్లఁ జేకూరె నని తలంచిరి. అప్పు డాయాశ్రమముమీఁదుగాఁ గొందఱు బ్రాహ్మణులు కాంపిల్యనగరమునకు ద్రౌపదీస్వయంవరమహోత్సవసందర్శనకుతూహలులై పోవుచుండ, వారిం గని తామును ధౌమ్యసమేతులై తల్లిం దోడ్కొని యావిభవమును వీక్షించునపేక్షతోఁ బోవుట కుద్యమింపఁగా నావిప్రులు విప్రవేషధారులైన పాండవులఁ జూచి యో బ్రహ్మచారులారా! మీ రెచ్చోట

నుండి యెచ్చటి కేఁగుచున్నా రనఁగా వారిలో యుధిష్ఠిరుండు బాట సారులైన బ్రాహ్మణుల కిట్లనియె.

భూసురవరులారా! మే మేకచక్రాపురమునుండి ప్రయాణ మైతిమి. ద్రుపదపుర మగు కాంపిల్యమున కేఁగుచున్నవారము. అనఁగా నాభూసురు లిట్లనిరి. మేమును ద్రుపదుపురమునకే యేఁగెదము. యా గాగ్నికుండమునుండి కవచఖడ్గాదియుద్ధోపకరణంబులం దాల్చి వెలువడి వచ్చినవాఁడును ద్రోణవధార్థమందుండి యుత్పన్నుండైన ధృష్టద్యుమ్నుని వెంట నగ్నికుండమునుం వెలువడివచ్చిన జగన్మోహనాకార యగు ద్రౌప దికిఁ గాంపిల్యపురమున స్వయంవరమహోత్సవము జరుగనున్నయది. ఆ మహోత్సవసందర్శనలాలసులై రాజు లనేకు లచ్చోటికి వచ్చువారు. మఱియు లెక్కలేని స్తుతిపాఠకులు * నియోధకులును, మాగధులును, నటులును, వైతాళికులును, సూతులును వత్తురు. ఆసమయమున ద్రుప దుండు స్వయంవర మహోత్సవసందర్శనాగత విప్రులకు బహుగోవులను ధనములను ధాన్యములు నొసఁగి భక్ష్యభోజ్యాది నానావిధ పదార్థ ములతో దివ్యాహారమును బ్రాహ్మణులకు సంతృప్తిగా సంతర్పణము గావించును. మీరును మాతోఁ గలసి రండు. అందఱము గలసి పోయి యా రా జొసంగుసత్కారముల నందికొని యుత్సవవిలాస మును గన్నులకుఁ బండువుగాఁజూచి మఱలుదము. అతి సుందరాకార ములతో నుండు మీలో నొక్కరుని నాకృష్ణ వరించును గాక! యని చెప్పఁగా వారలకు ధర్మరా జట్లు చేయుద మనియె.

అంత నప్పాండవులు భూసురులం గలిసికొని కుంతీ సమేతులై దక్షిణపాంచాలదేశమున నుండు కాంపిల్యనగరమునకుఁ జనువా రొక్క చోటఁ గృష్ణద్వైపాయనమునీంద్రుం గని యమ్మహానీయునకు యథావిధిగ సత్కారముల నొనరించి ప్రీతిపూర్వకం బయినయమ్మునీంద్రునను జ్ఞఁ బడసి యచ్చోటు వాసి వేదపారాయణముఁ జేయుచు శృంగారవనం బులను రమణీయంబులైన సరస్సులను విలాసముగాఁ జూచుచు మెల్లనఁ

* నియోధకులు = మల్లురు, మాగధులు = వంశస్తుతిపఠనశీలురు, నటులు= మాఱువేషములను దాల్చినవారు, వైతాళికులు = మంగళపాఠకారులు, సూతులు= పౌరాణికులు.

గాంపిల్యనగరముం దఱిసిరి. అప్పు డాపురమున నానాదేశాగతులైన రాజులకు విడిదలగా సమర్పఁబడిన యనేక ప్రదేశంబులం జూచుచు నొక్క కుంభకారునిల్లు తమకు విడిదిగాఁ జేసికొని మాధూకరాన్నమును గొనితెచ్చి భుజించుచుండ వారి నెవ్వ రెఱుంగ రైరి. ద్రుపదుండును మనంబున నయోనిజ యగు తనకూఁతు నర్జునున కిచ్చి వివాహము గావింపవలయు నను దృఢనిశ్చయమును నానాదేశాగతులగు రాజులకు వెల్లడింపక యెవ్వరికి మోపెట్టుట కసాధ్య మైనయొకవింటిని దెచ్చి యావింటి నెక్కుపెట్టి తానాకాశమార్గమున నిర్మించియుండు మత్స్యయంత్రము నావింట సంధించిన బాణంబున భేదించు శూరునకుఁ దన పుత్త్రి నిత్తు నని చాటించియుండెను. దానిని విని కర్ణసమేతులగు దుర్యోధనాదిధార్తరాష్ట్రులును నింకను ననేక రాజకుమారులును, మహానుభావులగు ఋషివర్యులు పెక్కండ్రును స్వయంవరదర్శనలాలసులై రాఁగా ద్రుపదుఁడు వారి నెల్లర సగౌరవంబుగ సత్కరించి వారి వారిని దగినస్థలములయం దుండ నియమించెను. అప్పు డంతకు మున్న ద్రుపదుపురమున కీశాన్యదిగ్భాగమున స్వయంవర మంటపము నిర్మింపఁబడియెను. అయ్యది బహువిధము లైన రమణీయవస్తువులతో నలంకరింపఁబడిన పెక్కు మేడలు గలిగి, యగాధమైన యగడ్తయు నున్నతంపుఁ బ్రాకారంబునుం గలిగి, చందనోదకసిక్తమై పుష్పదామోపశోభితమై, నానావిధ సుగంధవాయుప్రచారము గలదై, పచ్చనితోరణములతోను, గస్తూరీమిశ్రితములైన కలయంపులతోను, ముత్యాలముగ్గులతోను, సుఖారోహణసోపానములతోను గూడిన యెత్తైన మంచెలతో నలంకరింపఁబడి, సర్వలక్షణసమంచితంబై యొప్పుచుండె. దివ్యమును, మహనీయంబును, రమణీయంబును నైన యట్టి స్వయంవరశాలకు నానాదేశాగతరాజసింహులను దపస్వులైన బ్రాహ్మణోత్తములను రావించి తగుమంచెలపైఁ గూర్చుండఁబెట్టి కొన్నిదినములు వారల నందఱను నృత్యగీతవాద్యంబుల నానందపఱచుచుండెను. శ్రేష్ఠు లగువిప్రుల మధ్యమునఁ గలిసియుండిన పాండవులు ద్రుపదుని, వానిరాజ్యసమృద్ధిని జూచి సంతసిల్లిరి. ఇట్లు పదునాఱుదినములు గడవఁగా, కడపటిదినమునందు ద్రౌపది మంగళస్నాన మాచరించి సర్వాభరణభూషితురాలై సువ

సనమున దాల్చి కనకపుష్పమాలిక నొకదానిఁ జేతఁగొని స్వయంవర మండపమధ్యమునకు వచ్చుటయు, ద్రుపదపురోహితుఁ డగు సోమకుండు తత్పూర్వమే దర్భలను నగ్నిచుట్టుం బఱచి శాస్త్రవిధానంబున నగ్నిని వేల్చి యాకన్యకను దీవించెను. ద్రౌపది స్వయంవరమండపముఁ జొచ్చుడు నానావిధవాద్యధ్వనులును, జయజయనిస్వనంబులును జెలరేఁగె. అట్టి యవసరంబున బోరన మ్రోగుచుండు జనులకలకలమును వాదిత్రనాదం బును వారించి, ధృష్టద్యుమ్నుండు మండపమధ్యమున నిల్చి మూఁగిన రాజలోకంబు నెల్లం జూచి యగ్నిసమీపంబున గంధపుష్పధూపదీపార్చి తంబైన వింటిని నమ్ములను వైహాయసంబైనలక్ష్యంబును వారలకుంజూపి యిట్లనియె. ఈవింటిని మోపెట్టి యైదుబాణములతో వైహాయసంబైన యీమత్స్యయంత్రమును బడఁ ద్రోయునట్టి కులరూపవంతుఁడగు మహానీ యుఁడు నాచెలియ లగునీబాలకుఁ దగిన పతి యగును. అట్టివాని కీబాల ధర్మపత్ని గాఁగలదు. ఇది యొక మునిశక్తిచేతఁ బొందినవిద్య. కావున విలువిద్యయందు నేర్పరు లైనశూరులు తమనేర్పు నీరంగమధ్యమునఁ జూపి యందులకు బహుమానముగా లలితమగు యశమును, శుభమును బడయుదురుగాక! అని మేఘగంభీరధ్వనితో నాడి తన చెలియ లైన ద్రౌపదిం జూచి యోకల్యాణి! ఇదె చూడుము. నీస్వయంవరోత్సవ మున కఖిలజలధివేలావలయితమహీతలంబునం గల రాజకుమారు లెల్ల వచ్చియున్నవారు. అల్లదె యామంచెలపై ధైర్యోత్సాహములు పెనఁగొనుచుండ వెలయుచుండు ధృతరాష్ట్రనందను లగు దుర్యోధ నుఁడు, దుశ్శాసనుఁడు, దుర్ముఖుఁడు, దుష్ప్రధర్షణుఁడు, వివింశతి, విక ర్ణుఁడు, యుయుత్సుఁడు, వాయువేగుఁడు, భీమవేగుఁడు, ఉగ్రాయు ధుఁడు, బలాకి, కరణాయువు, విరోచనుఁడు, కుండకుఁడు, చిత్రసేనుఁడు, సువర్చుఁడు, కనకధ్వజుఁడు, నందకుఁడు, బాహుశాలి మున్నగు నూర్గురు నున్నవారు. వారిచేరువ సహజకవచకుండలధరుం డై యపర సూర్యుండు నానిజప్రభాపటలంబులతో వెలయు కర్ణుం డున్నవాఁడు. ఆవైపున బుత్రసమేతు లగు శల్యవిరాటులును, నొకవంక శకునియు, వృషకుండును, బృహద్బలుఁడును నగు గాంధారరాజులును, వేఱొక వంక సర్వాస్త్రకోవిదు లగునశ్వత్థామయు, భోజరాజనందనుండును

నున్నవారు. వారిం జూడుము. ఇదిగో యాదవరాజు లగు నక్రూర సాత్యకిసాంబసంకర్షణప్రద్యుమ్న కృష్ణకృతవర్మానిరుద్ధయుయుధాన ప్రముఖులును, సుకుమార సుశర్మ సుదక్షిణ సుషేణ సేనాబిందు చంద్రసేన సముద్రసే నౌశీనర చేకితాన శిశుపాల జనమేజయ జయద్రథ బృహద్రథ సత్యవ్రత చిత్రాంగద శుభాంగద భగీరథ భగదత్త పౌండ్రకవాసుదేవవత్సరాజులును నీస్వయంవరశాలను నిండియున్నవారు. వేదాధ్యయననినాదముఖరులై తపోనిరతు లగుబ్రాహ్మణకుమారులును వచ్చియున్నవారు. వీరి నెల్లరను జూడు మని వారిని బ్రత్యేకప్రత్యేకముగఁ జూపి యోకల్యాణీ! గంధమాల్యాద్యలంకృతమై యింతకు మున్ను పూజితమైన యీవిల్లును మోపెట్టి యం దైదుశరములను సంధించి వైహాయసం బైనయీమత్స్యయంత్రమును గ్రిందఁ ద్రోయఁ గలబలరూపకులవీర్యసంపన్ను ని మెడయందు నీచేత నున్నసితపుష్పదామమును వైచి యాతని వరింపుము అని బోధించెను. అంత నచ్చో మూఁగియున్న సర్వరాజకుమారులును, పాండుపుత్త్రులును జగన్మోహనాకారంబుతో వెలయుచుండునదియును, మన్మథుని పంచబాణేతరమై యాఱవసాయకంబు నా నొప్పారునదియును, ధవళవిభూషణదామానులేపనయును, దర్శనీయానవద్యాంగియును, తామ్రతుంగనఖియును, బద్ధపలాశాక్షియును, నీలకుంచితమూర్ధజయును, పీనపయోధరయును, సుశ్రోణియును, సుభగయును, క్రోసెడుదూరమునకు వీచుచున్న నీలోత్పలగంధసదృశశరీరగంధము గలదియును, శరీరకాంతిచే మానుషస్త్రీలను మించినదియు, దేవదానవయక్షులచే నైతము కోరఁదగిన దివ్యరూపముగలదియును నగుపాంచాలరాజకన్యకయెడ ననురాగంబుతోఁ జూచుచుండిరి. మఱియు నమ్మహోత్సవమును బ్రీతితోఁ జూచునిమిత్త మేతెంచిన దివిజఖచరగరుడగంధర్వకిన్నరుల విమానములు వియత్తలంబున విలసిల్లెను. పణవవీణావేణురణితానుసారమై రసగీతరవ మెల్లదెసల నెసఁగెను. నానావిధతూర్యధ్వనులు సాగరఘోషము ననుకరించెను. అప్పుడు స్వయంవరరంగమధ్యస్థజనులకుఁ గడుఁబ్రీతిగా దివ్యకుసుమమాలికలయు, దివ్యానులేపములయుఁ జల్లని నెత్తావిగల మారుతము వీఁచెను. అంత దట్టమైన భస్మరాశిమధ్యమున నగ్నికణంబులువోలె

బ్రాహ్మణులమధ్యమున మెఱయుచుండు పాండుకుమారులను శ్రీకృష్ణుండు గుర్తించి యిదిగో మనకుంతీపుత్త్రులు వీరే యిచ్చోటికి వచ్చియున్న వారని బలరామునకుఁ దెలుపఁగ నతండు ప్రియముతో వారలదెసఁ జూచుచుండెను,

అంత నారాజనందనులు పాంచాలరాజపుత్త్రిని వీక్షించి కందర్ప బాణబాధితులై యన్యోన్యస్నేహముల నైనం దలఁపక తాము ద్రౌపదిం గొనిపోవలయు నని యొండొరులు స్పర్ధ చేయుచుఁ దమ్మును దమసామర్థ్యంబు నెఱుంగక యర్థిత్వమున నావిల్లు మోపెట్టఁ దొడంగి యూడు గఱచి వలకేల వింటికొప్పును బెనఁచి, బలవంతముగనైనను విల్లు వంప నోపక లజ్జితులై తలలు వాంచి యావలకుఁ జనిరి. అవ్విధంబున రాజకుమారులనేకులు భగ్నోత్సాహులు కాఁగాఁ, గర్ణుండు స్వయంవరమంటప రంగస్థలంబుఁ జేరి వింటినెత్తి మోపెట్టి యల్లెత్రాటియందు శరసంధానముఁ గావించుచుండె, అప్పుడు చెంతనున్న రాజలోక మెల్లఁ గర్ణుఁడు ద్రౌపదిం గొనిపోవు ననుచుండిరి. అంత రంగమధ్యమందు వైతాళికాది జనులు కర్ణుకులగోత్రములఁ గొనియాడిరి, ద్రౌపదియు దానిని విని సూతపుత్త్రుని నేను వరింప నని పెద్దయెలుంగున నందఱును వినునట్లు వలుకఁగాఁ గర్ణుండు క్రోధహాసములతో నాదిత్యుం జూచుచుఁ గ్రమ్మఱి పోయెను. అంతటఁ జేదిరాజగు శిశుపాలుఁడు మగధరాజైన జరాసంధుఁడు మద్రాధిపతి యగు శల్యుఁడు, వీరు మువ్వురు క్రమముగ రంగమధ్యమున కేతెంచి వింటి నెత్తలేక యుత్సాహము చెడి నిరాశులై మఱలిరి. శ్రీకృష్ణానుమతంబున యదువృష్ణిభోజాంధకరాజకుమారులాధనుస్సును జేరక యూరకుండిరి, ఇవ్విధంబున నానారాజనందనులందఱును విముఖులు గాఁగ స్వయంవరశాలయందుఁ గలకలధ్వనులు పెల్లు రేఁగుచుండఁగా బ్రాహ్మణమధ్యమునం దుండి వెలువడి పాండవమధ్యముం డాధనుస్సును డాయవచ్చెను.

### అర్జునుండు మత్స్యయంత్రమును దెగ నేయుట

అప్పుడు కొందఱు విప్రులు వానియుత్సాహంబున కచ్చెరువడి తమలోఁ దా మిట్లనిరి. విలువిద్యయం దెల్లప్పుడు సాధనము చేయుచుండు

సీరాజపుత్రులకే యశక్యమైనదియు, బలవంతులగు శల్యజరాసంధశిశు పాలాదులకే యసాధ్యమైనదియు నైన నీవింటియందు శరసంధానము నిప్పు డీబ్రాహ్మణవటుండు తాను జాపలముననో, యుత్సాహముననో లేక గర్వముననో చేయఁ బూనుచున్నవాఁడు బ్రాహ్మణుల కెల్లఁ దల వంపుగా వీఁడేల యీమహాకార్యమునకుఁ బూనవలయును? అనిరి. మఱి కొందఱు వీఁ డీరాజకుమారు లందఱకంటె విలువిద్యయందు నేర్పు గలవాఁడు, ఘనుఁడు కాకున్న నిందఱసమక్షమున నీఘనకార్య మున కడుగైనఁ బెట్టునా? యనిరి. అంత నయ్యర్జునుండు నవ్వింటి సమీపంబున కేతెంచి సభకు మ్రొక్కి, సభాపతులకు వందనము లాచరించి, తన ధనుర్విద్యాగురుం డగునాచార్యుని స్మరించి భావ మున నమస్కరించి శ్రీకృష్ణుం దలపోసి వింటికిఁ బ్రదక్షిణంబు గావించి దానికి దండప్రణామం బొనర్చి యక్రమంబున దానిం గేలఁ బూని పూర్వపరిచితం బైన విల్లు మోపెట్టినట్లు లాఘవముతో మోపెట్టి జను లాశ్చర్యంబునం బొదలుచుండ నేనమ్ముల నమ్మత్స్య యంత్రంబు నాక్షణంబ యురుల నేసినఁ జూచి బ్రాహ్మణక్షత్రియ ప్రముఖు లయిన జను లెల్లరు విస్మితులయిరి. సకలజనసంతోషనినాదంబులు నింగి ముట్టెను. దేవదుందుభులు మ్రోసెను. కిన్నరులు పాడిరి. గంధర్వులు పుష్పవర్షములఁ గురియించిరి. అప్సరస లాడిరి. వందిమాగధులు స్తుతిం చిరి. విప్రులపరిమితానందమున నుత్తరీయముల విదిల్చిరి. ద్రుపదుండు సంతోషాశ్చర్యములతో నానందబాష్పములు రాల్చుచుండ దూరమున నుండే యర్జును దెసఁ జూచుచుండెను. వెంటనే ధర్మరాజు నకులసహదేవు లతో నిజనివాసమున కేఁగెను.

సీ. "ధరణీశనందనుల్ దన్నతిప్రీతితోఁ, జూచుచు నుండంగ సుందరాంగి
తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ, కమనీయగజరాజగమనలీలఁ
జనుదెంచి సురరాజసన్నిభు నభినవ,యౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ, దనచేతిసితపుష్పదామకమునఁ
ఆ. బొలఁతి ముదముతోడఁ బూజించె........"

అంత స్వయంవరాగతరాజు లెల్లరును ద్రుపదుండు తనకూఁతు నతని కిచ్చి వివాహముగావించు నని మాత్సర్యమునుం బూని దాని

సహింపక యలిగి, క్రోధముతోఁ గూడినమనస్సులతో నిట్లనిరి. ఈదుష్టుం డగు ద్రుపదుండు మనల మాఱి నెక్కించి ఫలకాలమునఁ గ్రిందఁ ద్రోయించుపగిది మనల నెల్ల బంధుప్రీతితో రావించి సత్కరించియు రాజకుమారులలో నొక్కని కైనఁ గన్య నీయక మన కెల్ల నవమానము సేసెను. *స్వయంవరము క్షత్రియునకే కాని బ్రాహ్మణులకుఁ గలదా? అట్లుండఁగా నీకన్య బ్రాహ్మణు నెట్లు వరించు? కావున నిప్పు డీదురాత్ముం డైన ద్రుపదునిఁ బొదివి వధింతు మేని లోకమున నికమీఁద రాజులను స్వయంవరమునకు రప్పించి కన్యకను వేఱొండువర్ణమువారల కీయకుండును. ఇట్టి యకార్యముల నికమీఁద నెవ్వరును జేయకుందురు. రాజకుమారుల నెవ్వరిని నీకన్య వరింపదేని దీని నీయగ్నియందుఁ ద్రోయుదము. చపలత్వమున విప్రుండు తన కుచితముకాని కార్య మొనర్చినను మనము వానిఁ జంపరాదు. "బ్రాహ్మణో న హంతవ్య" యను ధర్మమును బాటించి యీ బ్రాహ్మణవటువును విడిచిపుత్తము. మనరాజ్యమును మనసకలద్రవ్యమును స్వమానప్రాణరక్షణములకేకదా? యని పలు తెఱంగుల వీరాలాపంబు లాడి కవచతూణీరంబులం దాల్చి, ఖడ్గాది యుద్ధోపకరణములఁ గేల నమర్చికొని యంద ఱొక్కుమ్మడి ద్రుపదుం

---

* ఈస్వయంవరదినము పుష్యశుద్ధరోహిణి యని సంస్కృతభారతమున నున్నది. కాని పంచమితిథిని గాని, మఱేతిథిని గాని నిర్ణయించి చెప్ప లేదు. తెనుఁగు భారతమున పుష్యశుక్లపంచమి రోహిణీనక్షత్రయుతమైన దని తేటగా వ్రాయఁబడియున్నది. ఇది యసంగత మని కొంద ఱనెదరు. ఎట్లనఁగా; పుష్యమాసమున వచ్చు పూర్ణిమనాఁడు పుష్యనక్షత్రము విధిగా వచ్చును. అట్టిపుష్యమికి ముందు ౫-వ నక్షత్రమగు రోహిణి పదిదినము లుండు పంచమితో నెట్లు కలియు ననియుఁ, గావున నిది యసంగత మనియు వారి వాదము. ఇందు అమరము—"పుష్యయుక్తాపౌర్ణమాసీ పౌషీమాసే తు యత్ర సా, నామ్నా స పౌషో మాఘాద్యాశ్చైవమేకాదాశాపరే." అని యుండుటవలన నీతిథి పొరపాటని యాక్షేపకులు నుడువుచు, దీనిని ఋషి పొరపాటునఁ జెప్పినదియుఁ, బరంపరాగతంబైన పొరపాటైనదియు నెఱుఁగ రాద నెదరు. మంగళకరము అగు నక్షత్రతిథ్యాదులను జేర్చుట శుభ మని చెప్పియుండిన నుండవచ్చును గాని, యసంగత మనుటకు సందియము కలుగదు. ఇట్లు వ్రాయుటకన్న పుష్యమాసదశమిరోహిణి యనుట యుక్త మని యాక్షేపకు లాలోచనను జెప్పుచున్నారు.

జుట్టుముట్టిరి. అంత ద్రుపదుండు భీతుండై బ్రాహ్మణులమఱుఁగుఁ జొచ్చెను. పైఁ బడుచున్న రాజలోకము నెదిరించి భీమార్జునులు వారించు చుండిరి. అంత నారాజులు శరాసనంబున శరంబుల సంధించి శరవర్షమును ద్రుపదుపైని విప్రులపైని గురియించుచుండిరి. అప్పుడు భీమసేనుండు సమీపమున నున్న యొకమహావృక్షమును బెకలించి ప్రళయకాలదండ ధరునిమాడ్కి నాశరముల నెల్ల నావృక్షముతో నివారించుచు నర్జును మోలి నిలుచుండియుండె. అంత శ్రీకృష్ణుండు బలరామునితో నిట్లనియె. ఈతాటిప్రమాణివంటివిల్లు కేలఁ దాల్చియుండువాఁడు నిక్కంబుగ మన యర్జునుండు. వానిచెంత వృక్షమును చేత నవలీలం బూని శత్రువుల నెదిరించుచుండువాఁడు మనభీమసేనుండు. వీరు గాక యీ యమాను షకార్యముల నొనర్చువా రెవరైన నితరు లుందురా? మత్స్య యంత్రము నర్జునుండు తెగనేసినప్పుడ బ్రాహ్మణులమధ్యమునందుండి సింహగతితో నేఁగిన కమలపత్ర విశాలనేత్రుఁడును, వినీతుఁడును, గౌర వర్ణుఁడును, సుజ్వలచారునాసుఁడును నైన యతండు ధర్మపుత్త్రుండు. అగ్నిహోత్రుని వెంటం జనిన కుమారస్వామి వోలె వానివెంటఁ జనిన సుందరమూర్తు లిరువురును నకులసహదేవులు. అని దృఢముగ నూహ జనించినది. పాండవులు లక్కయింటినుండి తప్పించుకొనిరని యొక వార్త యింతకుమున్నే వినియుంటిని. అని చెప్పఁగా బలరాముండు, 'మనము వీరినిఁ గుంతినిఁ జూచి బహుకాల మయ్యెను. పాప మా లాక్షాగృహ దాహమున వీరు చావక బ్రదికినది మిక్కిలి యానందముఁ గల్గించు చున్నది' అని శ్రీకృష్ణమూర్తితో బదులు చెప్పెను.

అంత నక్కడ క్షత్త్రియకుమారులు ద్రుపదుని విప్రులను మార్కొని వారిపై సునిశితనారాచములఁ బ్రయోగించుచుండిరి. అప్పు డర్జునుని ద్రుపదుని సంరక్షించునిమిత్తము విప్రులు పూనికొని రాజులసైన్యముపై జాల రువ్వుచును గృష్ణాజినముల వీచుచును మేమును బోరాడె దము. భీతిల్లవల దనుచుండఁగా నర్జునుండు వారిని వారించి యోవిప్రులారా? మీ రెల్లరును విలాసముతోఁ జూచుచుండుఁడు. మీ రెల్లరు నేమయ్యెదరో! మంత్త్రోచ్చారణంబున నాగు లట్లు నాతీక్ష్ణశరంబుల నీ రాజలోకము నంతను మరల్చెద నని చెప్పి శుల్కజితమైన యామహా

ధనుస్సును బూని నారి మ్రోయించి తనచెంత భీమసేనుండు సాయ
పడి నిలుచుండఁగా కర్ణాదిశూరుల నెదిరించి పోరునకు సన్నద్ధుం
డయ్యెను. రాజకుమారులును ద మ్మెదిరించి యుద్ధసన్నద్ధుండై యుండు
వాఁడు విప్రుఁ డయినను వధార్హుం డని ధర్మపరిశీలనముం జేసి శల్య
కర్ణులు భీమార్జునులకట్టెదుట నిలిచి, యోవిప్రులారా! మీ రొనర్చిన
యీ మహాకార్యమునకు విఱ్ఱవీఁగుచు శూరులమగు మాతోఁ బెనఁగు
టకు సంసిద్ధుల రైతిరి. మీ కిదిగో మాఱు చేసెద మని వీరాలాపము
లాడుచు ధిక్కరించి యెదుట నిలిచిరి. దుర్యోధనాదులు విప్రులతోఁ
బోరాడ నుద్యమించిరి. అర్జునుండు కర్ణుని మార్కొనెను. అంత వా
రిరువురు నొకరినొకరు గెలుచుతలంపున నొకరిపై నొక రంపవాన
గురియించిరి. వానిని బరస్పరప్రతిబాణములతో నడుమన త్రుంచిరి.
అప్పు డర్జునుండు కర్ణునిపై శౌర్యమును జూపుటయుఁ గర్ణుం డెట్లో
నేర్పున నావిజృంభణమునుండి తెప్పిఱిల్లుకొనుచుఁ బూనికతో యుద్ధ
మును గావించుచుండ నిరువురపోరును గన్నులారఁ జూచుచుండిన యుద్ధ
విద్యావిశారదులు, నేర్పు నెఱుంగఁగల పాఱులును నర్జునుని స్తుతించు
చుండిరి. కర్ణుఁ డతనినేర్పున కాశ్చర్యపడి యోవిప్రవరా! నీధైర్య
శౌర్యములకును, నస్త్రకౌశల్యమునకును మెచ్చితి. నీవు దేహధారియైన
సాక్షా ద్ధనుర్వేదంబవో, పరశురాముండవో, యింద్రుండవో, కాకున్న
నాదిపురుషుండ వైన నారాయణుండవో యని తలపోసెద. నిశ్చయ
ముగ నన్ను మార్కొనుట కిప్పు డన్యరూపమును దాల్చి వచ్చియున్న
వాఁడవు. కాకున్న సామాన్య విప్రుల కీయుద్ధనైపుణ్య మెట్లు గలు
గును? మహేంద్రుండును, బాండవమధ్యముం డగునర్జునుండును దక్క
మిగిలిన యీలోకములోనుండు రాజకుమారులలో నన్ను లక్ష్యపఱుపక
పోరాడువారు గలరా? నీస్వరూపమును గప్పిపుచ్చక వెల్లడింపు మని
కోరఁగా నర్జునుండు తన్ను వెలిపుచ్చుకొనుట కిష్టములేక కర్ణా! నేను నీ
విప్పుడు పేర్కొన్నవారిలో నొక్కండనైనం గాను. సమరసాధనంబు
లగు బ్రహ్మాస్త్రాదిదివ్యాస్త్రములను గురుముఖంబునఁ బడసి యుద్ధకౌశల
మును బడసియున్న ద్విజుండను. ఎదుట శూరుండవై నిలిచి పోరుము.

లేదా! తొలఁగి చనుము. అని చెప్పఁగాఁ గర్ణుండు బ్రహ్మతేజం బజేయ
మని మార్కొని పోరాడక మిన్నకుండె.

అంత నొకవైపున శల్యభీమసేను లిరువురును నఱువదేండ్ల
యేనుంగులువోలె నొకరిపై నొక రుఱవడించుచు, వీరాలాపంబులాడుచు
రణరంగము సొచ్చి క్రచ్చఱ మీఱఁ గచ్చ బిగియించి భుజాస్ఫాల
నంబు చేసి మహోత్సాహంబు మెఱయఁ బరస్పరవిజిగీషమైఁ దల
పడి తొలుదొలుత బిఱుసుదనమునకుఁ గడఁగక చిత్రముగఁ దిరుగుచు
మొగ్గవాలుచుఁ బట్టినపట్లు తప్పించుకొనుచు మాఱుపట్టుచుఁ జిక్క
కుండ బాహువులఁ బెనఁగాడుచుం గొండొకవడిఁ గడపి యొకరి నొకరు
నేలఁ ద్రోయుచు నతిఘోరంబుగ స్ఫుటస్ఫుటఛటచ్ఛటనినాదంబులు
నిగుడ నొకరి నొకరు మోఁకాళ్లం గ్రుమ్ముచు, పిడికిళ్లం బొడుచుచు
నేలం దట్టుచుఁ దొడల నప్పళించుచుఁ బోరాడుచుండిరి. అంతఁ గొంత
సేపటికి భీమసేనుండు తనచేత నవలీలగాఁ బట్టువడినశల్యుని వధింప
నొల్లక దిగ్గన పైకెత్తి చటుక్కు మనఁ గ్రిందఁబడవైచెను. అంత
దూరమున వేడుకఁ జూచుచుండువిప్రులు నవ్విరి. రాజకుమారులు వెల
వెలంబోయిరి. ధృష్టద్యుమ్నద్రుపదులు భీతిఁ దొలంగిరి. అంత శల్యుండు
డస్సి భీమునితోఁ బోరు సలుపుట మానుకొనెను. అంతకు మున్నర్జును
నకుఁ గర్ణుం డోడె నని యంద ఱెఱింగియుండిరి. కావున నప్పుడు
యుద్ధరంగమున నుండినరాజు లందఱు శంకించి యీశూరు లెవ్వరో
యెఱుంగవలయును. సామాన్యవిప్రులుగారు సుమా వీ రని యెంచిరి.
కర్ణు నెదుర్కొని సమరంబుఁ జేయువారు భార్గవరాముఁడు, భార
ద్వాజుఁడు, పాండవుం డగు నర్జునుండు, దేవకీపుత్త్రుం డగు శ్రీకృష్ణుండు,
శారద్వతుండయిన కృపుండు వీరు దక్కఁ దక్కినవా రోపుదురే?
అవ్విధముననే కౌరవులలోఁ బాండుసూనుం డయిన భీమసేనుండును,
ధృతరాష్ట్రసూనుం డగు దుర్యోధనుండును, యదుప్రవరుం డగు వసు
దేవసూనుం డయిన బలదేవుండును దక్క శల్యు నెదుర్కొనఁ
దక్కినరాజు లెవ రోపుదురు? ఇప్పు డిట్టులైన సమరమును జాలింతము.
ఎగ్గు లెన్ని యొనర్చినను బ్రాహ్మణుల సంరక్షించుట కదా రాజధర్మము.
అని రాజు లూరకుండిరి. అంతఁ గొంద ఱివ్విధమున నైనను వీరితోఁ

కోరి వీరి నవశ్యము గెలుచుట యుచిత మనిరి. అప్పుడు దేవకీపుత్త్రుం డయిన శ్రీకృష్ణుండు బ్రాహ్మణవేషధారు లగువారు పాండురాజపుత్త్రు లని నిశ్చయించి యో క్షత్త్రియులారా! యీ బ్రాహ్మణులు రాజులతో ధర్మయుద్ధమును జరిపి గెలిచిరి. కన్యకను శుల్కముగాఁ గొనిరి. ఇందు దోష మేమి? పోరుడుగుఁ డని చెప్పఁగా వాసుదేవునాజ్ఞను జవ దాఁటనేరక రాజులు యుద్ధమును నిలిపి బ్రాహ్మణులం బొగడుచు నిజదేశంబులకుఁ జనిరి.

## భీమార్జునులు ద్రౌపదిని గుంతికి నివేదించుట

అంత భీమార్జునులు నిజవీర్యంబునఁ బడసిన ద్రౌపదిం దోడ్కొని బ్రాహ్మణపరివృతులై రాజమండలంబు వెడలి పౌర్ణమినాఁడు మబ్బు విడియగాఁ బ్రకాశించు సూర్యచంద్రులువోలె తేజోవంతులై వెల యుచుఁ దమవిడిసియుండు కుంభకారగృహంబునకుఁ జనిరి. అంతకు మున్న కుంతీదేవికొడుకులు స్వయంవరమంటపమున కేఁగి బహుకాల మయ్యెను. అచ్చోటఁ గౌరవులవలన వారి కేమి యపాయము ఘటి ల్లెనో యని చింతఁ బొంది ధార్తరాష్ట్రులవలనను రాక్షసులవలనను వారి కపాయములు గలుగకుండ రక్షోఘ్నమంత్రముల నుచ్చరించుచు వ్యాసమహర్షి యాడినమాటలు వృథ పోనేర వని మనస్సున ధైర్యముఁ బూనుచుండఁగా యుధిష్ఠిర నకుల సహదేవు లిల్లు చేరిరి. అంతఁ గొంతవడికి భీమార్జునులును ద్రౌపదీసమేతు లయి వెడిదికి వచ్చుచునే యమ్మా! మే మొకభిక్ష గొని తెచ్చితిమి అని చెప్పఁగా నాశూర మాత లోపలనే యుండి వీరిని వీక్షింపకయే తెచ్చినదాని నందఱును సమముగా ననుభవింపుఁ డని చెప్పి వెనువెంటనే ద్రుపదునికూఁతురును, సకలాభరణభూషితురాలును, మోహినీదేవతయుంబోలె నింటినంత టిని దనమేనికాంతితోఁ బ్రజ్వరిల్లఁ జేయుచుండిన ద్రౌపదినిం జూచి యాడినమాటకుఁ దత్తరపడి దోష మొనర్చితి నని భీతిల్లి ధర్మమునకు వెఱచి యావరవర్ణినిఁ దనచేతఁ బట్టికొని ధర్మపుత్త్రుకడ కేఁగి యిట్ల నియె. వత్సా! ధర్మజా! భీమార్జును లీకొమ్మను దెచ్చి యమ్మా! భిక్షముఁ దెచ్చితి మని నుడివిరి. నే నీకన్యకం జూడక మీా రేవురు దాని ననుభ

వింపుఁ డంటిని. నానోట నసత్యంబేనాఁడును వెలువడినది కాదు. మీ రంద ఱీకన్య ననుభవించినచో నయ్యది యధర్మంబగును. అనుభవింప కున్నచో నాకనృతదోషము గలుఁగును. విమర్శించి ధర్మమార్గము నవలంబించి ప్రవర్తింపుము. అని చెప్పఁగా ధర్మపుత్త్రుండు కొంతసేపాలోచించి కుంతి నుపశమింపఁజేసి యర్జునునిఁ బిలిచి యిట్లనియె. ఫల్గునా! శుల్కజిత యైన యీకన్యకను నీ వగ్నిసాక్షికముగ వివాహమాడుము. అని చెప్పఁగా నర్జునుండు ధర్మముల నెల్ల నెఱింగియున్న నీ విట్టి యధర్మంపుఁ బలుకు లాడఁదగునే? తొలుత నీకు వివాహము కావలయును. పిదప భీము సేనుఁడు పెండ్లి చేసికొనవలయును. నామాట యాపలిదికదా? యనెను. ధర్మలోపకర మయిన కార్య మెవరు చేయుదురు? మే మందఱమును నీ శుభాంగియు నీయానతిమేఱకు వర్తిల్లువారము. దేని నెవ్విధమున నాచ రించినచో ధర్మమునకు లోపము కలుగక, కీర్తి చేకూఱునో దానిని విధింపుము. అవ్విధమున మేమును వర్తిల్లెదము. అని చెప్పుచుండఁగా నాసోదరుల కందఱ కేకాలమున నాకన్యపై వలపు తగులుటయు నందఱును దానివిలాసంబులకు మోహితు లగుటయుఁ దనకును నట్లె దానియం దనురాగము పొందువడుటయు ధర్మపుత్త్రుం డప్పుడు వేద వ్యాసునివాక్కును దలపోయుచు మన మేవుర మీకన్యకను వివాహ మాడుద మనెను. అంత నాజ్యేష్ఠునిమాటల కందఱు నానందించిరి. అప్పుడు వసుదేవనందనుం డయిన శ్రీకృష్ణుండు పాండవు లొక్కకుంభ కారుని గృహమునం దున్నవా రని యెఱింగి యాయిల్లు వెదకి తెలిసి కొని యచ్చోటికేఁగి మహాపరాక్రమవంతులై తేజోమూర్తులగు తమ్ములు దన్నుఁ బరివేష్టించియుండ సుఖాసీనుండై యుండు ధర్మనందనుని పాదరావ లోకంబున వీక్షించు యాతనికిని గుంతీమహాదేవికిని మ్రొక్కియుండఁగఁ గృష్ణా! మే మీచోట రహస్యముగ నెవ్వరికిఁ దెలియక విప్రవేష మున నుండ నీ వెట్లు మమ్ము గుర్తించి యీచోటికిఁ రాఁగలిగితివి? యని ధర్మపుత్త్రుం డడుగఁగా వాసుదేవుండు మునిమునినగవులు నగుచు నిట్ల నియె. నరేంద్రా! అగ్నిహోత్రుఁ డెంతగూఢముగ నున్నను సహజకాంతిని వేడిమిని వీడఁడు. ఈదినమున నాస్వయంవరమంటపమునం దా ధమమానుషశక్తిని జూపఁగలపరాక్రమవంతులు పాండవులు దక్క నితరు

లమున రాజలోకములో నస్యులు గలరే? విధివశమునఁ బాపాత్ముండగు దుర్యోధనుని దురాలోచనము నెఱవేరకుండెను. లగ్గయ్యె. అగ్నిభట్టారకునింబోలెఁ దేజోవంతులై ధీశక్తిచే శ్వశ్రేయసములను బొందుదురు. మీ రివ్విధమునఁ బ్రచ్ఛన్న వేషములతోడి ప్రవర్తనమును నస్యులెఱుంగకునికి లగ్గు. పోయి వత్తు మని చెప్పి యాదేవకీనందనుండు రౌహిణేయుంగూడి కుంతీనందనుల యనుజ్ఞఁగొని శిబిరమునకుఁ జనియె.

అట రాజనగరునందు ధృష్టద్యుమ్నుండు విప్రులతోఁగూడ నేఁగిన ద్రౌపదిని స్వయంవరమున గెలిచిన బ్రాహ్మణుం డెవ్వండో? వాఁ డెచ్చటి వాఁడో? పురమునం దెచ్చోట విడిసియుండునో? ఆ బ్రాహ్మణుండు ద్రౌపది నెచ్చోటికిఁ గొనిపోవునో యని విచారపరుండై యాబ్రాహ్మణ సమూహముతోఁ దానును గోప్యముగాఁ జని యాకులాలగృహమున నొక్కచోట డాఁగియుండె. రామకృష్ణులు శిబిరమునకుఁ బోఁగా భీమార్జుననకులసహదేవులు మాధుకరమునకుఁ బోయి యన్నముఁ దెచ్చి ధర్మపుత్త్రునకుఁ గుంతికి నివేదించిరి. అంతఁ గుంతి ద్రౌపదిం జూచి దేవీ! యీయన్నమునఁ గొంత బలులకును, బ్రాహ్మణాతిథులకును, కవళగాండ్రకును బ్రత్యేకించియుంచుము. మిగిలినదానిని రెండుభాగములొనర్పుము. అం దొక్కపాలు నీపదివేలయేనుఁగులంతబలము గల యీ భీమసేనునకుం బెట్టుము. వెఱపాలి నానలుగురకు వలసినంతఁ గుడువఁ బెట్టుము. శేషాన్నమును మన మిరువుర ముపయోగింత మనెను. యాజ్ఞసేనియుఁ గుంతి చెప్పిన ట్లొనర్చెను. అంత వారందఱును భుజించిరి. అంత సహదేవుండు శుచ్యర్థము నేలపై దర్భలువిదిర్చెను. దానిపై నందఱును దమతమకృష్ణాజినములను బఱచుకొని పరుండిరి. కుంతీదేవి వారి కందఱకును ముందుగఁ బవ్వళించెను. ద్రౌపది దర్భాసనమున నసహ్యపడక వారిపాదములకడ నెంతమాత్రము వంత లేక సంతుష్టస్వాంతయై పవ్వళించెను. అంత వారన్నదమ్ములు వేడుకతో నానావిధవ్యూహభేదనంబులను, ననేకాస్త్రప్రయోగోపసంహారసంవిధానములను, ఖడ్గాద్యాయుధసాధనములతో సమరసమయములయందు యుద్ధము చేయవలసినప్రకారమును నొకరితో నొక రుపన్యసించుటయు నితరులు వినుచుండుటయు, నందులకుఁ బ్రతిగా వేఱొకరు చెప్పుటయు నింకొకరు

దానికి సమాధానములఁ జెప్పుటయు నంతయును విని ధృష్టద్యు
మ్నుండు వీడు విప్రవేషమున నుండుక్షత్రియులే కాని విప్రులు కానేర
రని దృఢమనస్కుండై తత్క్షణము తండ్రిపాలి కరిగి యీ వృత్తాంత
మంతయుఁ జెప్పుట కుద్యమింపఁగా ద్రుపదుండు కొడుకుతో నిట్లనియె.
వత్సా! మనకృష్ణను జంత్రమును దెగనేసి తోడ్కొని పోయినవా
రెవరో? వారు హీనకులులు గారే? వా రెచ్చటి కేఁగిరో? వారి
వృత్తులు మన కవమానము తేవుగదా? పాండుపుత్త్రులు బ్రతికియుందు
రొకో? మత్స్యయంత్రము నురులఁగొట్టిన యాతం డొకవేళఁ
బార్థుఁడే యైయుండ నోపునే? వివరించి నామనస్సుకలవరమును దీర్పు
ము. అనఁగాఁ దండ్రికిఁ గుమారుం డిట్లనియె. రాజేంద్రా! వినుము,
అవ్విధమున మత్స్యయంత్రము నా స్వయంవరశాలలోఁ దెగనేసిన దేవ
సమానుం డైన పురుషుండును, నాతనివెంట మహాబాహుబలముతో
నొప్పారుచుఁ బోయినవాఁడును వీరిరువురును మనకృష్ణను దోడ్కొని
మనయూరివెలుపలనున్న యొకకుంభకారగృహమున కేఁగిరి. అచ్చోట వీరి
వంటివారు మువ్వురు తేజోమూర్తు లగు ప్రత్యేకపురుషులతో మాట
లాడుచున్న యొకవృద్ధాంగన యుండఁగా నాదేవికి వీ రిరువురును
మ్రొక్కిరి. కృష్ణ నాయవ్వకు మ్రొక్కు మనఁగా నక్కన్యకయు నట్ల
చేసెను. వారిలో నలువురు భిక్షాన్నంబును గొనితెచ్చి యాముదుసలి
ముందటఁ బెట్టిరి. అప్పు డాయవ్వ ద్రౌపదిం బిలిచి యాయన్నమునఁ
గొంత బలివిధానమునకును గొంత బ్రాహ్మణాతిథులనిమిత్తమును, గబళ
గాండ్రకును బ్రత్యేకింపు మనెను. పెఱభాగమును రెండుపా ల్లొనర్పు
మనెను. ఒక్కపాలు మత్స్యయంత్రము నేసినపురుషుఁడు గాక వానితో
వచ్చిన వేఱొకనికిఁ గుడుపఁబెట్టు మనెను. శేషించినదాని నాపురు
షులు నలువురును నాయవ్వయును ద్రౌపదియును భుజింపవలయు నని
నిర్దేశించెను. అంత మనబాల యాయవ్వ నిర్దేశించిన ట్లొనర్చెను. అంద
ఱును భోజనానంతరమున దర్భలు క్రిందఁ బఱచుకొనిరి, వానిపైఁ గృష్ణా
జినములను బఱచికొని దానిపైఁ బవ్వళించిరి. కృష్ణయు, వారిపాదతల
ప్రదేశమున నొక్క దర్భాసనముపైఁ బవ్వళించెను. పుట్టిననాఁటంగోలె
భోగినియై సుఖముల ననుభవించుచు నాగర్భశ్రీమంతురాలై యున్న

ద్రౌపది యచ్చోట నుండుటకే విధమైన వంతయును బొందినట్లు తెలియ
దయ్యెను. వారు విలాసమున నానావిధసేనావ్యూహములను బన్నుట,
భేదించుట, వివిధాయుధప్రయోగములను చేయువిధానములను నానా
స్త్రములను యుద్ధకాలమునం దెట్టిసమయములయందుఁ బ్రయోగించుట
యుపసంహరించుట మున్నగు విధానములను మాటలాడుకొనుచుం
డఁగా వింటిని. నాకుం జూడ వారు క్షత్రియు లని తోఁచుచున్నది.
వారు రహస్యముగా స్వవిషయములను మాటలాడుచుండునపు డా
లోచింపఁగా వా రేవురును బంచపాండవు లని యే యూహ కలుగు
చున్నది. పాండవులు లక్కయిండ్లు కాలఁగా వా రెట్లో తప్పించుకొని
పాఱి రని వినియుంటిమి గదా? యని చెప్పఁగా విని ద్రుప
దుండు తనయభిమతం బీడేఱె నని సంతోషించి వారియానవాళ్లను
జరిత్రను జక్కఁగా నెఱింగివచ్చుటకు వెంటనే తన కులబ్రాహ్మణుని
వారుండుచోటున కంపెను. అంత నాపురోహితబ్రాహ్మణుండును రాజా
నుమతంబున వెంటనే పాండవు లుండు కుంభకారుగృహంబున కేఁగి
వారితో నిట్లనియె. ఆర్యులారా! పాంచాలపతి మీవృత్తాంతము నంత
సవిస్తరముగా నన్నుఁ దెలిసికొనిరమ్మని మీయొద్దకుఁ బంపెను. మత్స్య
యంత్రమును గూల నేసినశూరుం గాంచి యారాజు మిక్కిలి
యానందపరవశుఁడై యున్నవాఁడు. మీ కులగోత్రనామములను
మాకుఁ దెల్పి మా కుల్లాసమును గల్గింపుఁడు. ఈవరకు మారాజు
పాండురాజున కనుంగుఁజెలికాఁడు. ఎవ్విధముననైన నాతని కుమారు
డయిన యర్జునునకుఁ దనకూఁతు నిచ్చి వివాహము గావింపవలయు నని
తలపోసియుండెను. అని చెప్పఁగా ధర్మనందనుం డంతయు విని భీమ
సేనుం బిలిచి యీద్రుపదుపురోహితున కర్ఘ్యపాద్యాదుల నొసంగి
యర్చింపుము. అనఁగా నాతం డట్లొనర్చెను. పురోహితుండును వా
రొనర్చిన బూజలం గైకొని యుచితాసనంబునఁ గూర్చుండి యుండఁగా
ధర్మపుత్త్రుం డాతని కిట్లనియె. అయ్యా! స్వయంవరశాలలో గంధపుష్పా
క్షతలతో నర్చింపఁబడియుండిన ధనుస్సు నెక్కువెట్టి యైదుశరములతో
మత్స్యయంత్రమును దెగనేసినవానికిఁ గన్యక నిత్తు నని శపథ
మును మీరా జొనర్చియుండె. కాని కులగోత్రనామములను విచారింప

లేదు. తన నియమముచొప్పున నీతం డాయంత్రము నేసి కన్యకం బడసె. ఇఁకను విచారింప నేల? మఱియును హీనకులుండును, విలువిద్యను బాగుగ నేర్వనివాఁడును నితరరాజకుమారుల కలవిగాని యామత్స్య యంత్రమును దెగవేయఁగలఁడే? మీరాజు సభియత మీఁదేరె నని తలంపుము. అని యిట్లు చెప్పుచుండఁగనే పాంచాలభూపతియొద్దనుండి దూతయొక్కఁడు వచ్చి ధర్మనందనునితో నిట్లనియె.

## పాండవులు ద్రుపదనగరమునకుఁ బోవుట

మహానీయులారా! మిమ్ము నందఱను మారాజు తోడ్కొనిరమ్మని మీ కందఱ కన్నిరథంబులను దివ్యాశ్వంబులను బూన్చినవానిని బంపి యున్నవాఁడు. కృష్ణసహితులై మీ రెల్లరును నగరున కరుదెంచు నది. మీకు రసవత్తరములగు భక్ష్యభోజ్యములతో నగళ్లయం దన్నము సంసిద్ధము గావింపఁబడి యున్నది. అని చెప్పఁగా నప్పాండవులును రాజయోగ్యంబులయి రత్నాంచితంబులైన కాంచనరథంబు లెక్కి కుంతీదేవిని గృష్ణను నొక్కరథం బెక్కించి వారిరువురుఁ దమవెంటరా ద్రుపద రాజనగరు నొత్తెంచిరి. అంత ద్రుపదుండును వారల కనేకవిధంబులైన వస్తువులతిప్రీతి నిచ్చి పంపఁగా వారు వానిలో నన్యవర్ణోచితమైన వస్తువులను గ్రహింపక క్షత్రియోచితంబులైన యసిచర్మకార్ముకబాణ తూణీరరథవరూథవాజివారణంబులఁ బరిగ్రహించి తన్ను సమీపించు చుండు నప్పాండవుల యజినోత్తరీయములను, నతిసంభృతబ్రహ్మతేజము లను నాజానులంబిమహాబాహువులను, నత్యున్నతభుజశిరస్సులను, విశాల నేత్రములను, వెడఁదఱొమ్ములను, నెడతెగక సలుపుచుండు వ్యాయామ ములచే సారముగలిగిన దృఢకఠినాంగములను, ద్రుపదుండు వీక్షించి సుత భ్రాతృసుహృదమాత్య బంధుజనులతోడను బరమ విద్వన్మహీసురుల తోడను నెదురేగి వారల నత్యుత్తమక్షత్త్రవరులఁగా నెఱింగెను. అంత వారిం దోడ్కొని వారలకని యలంకరించిన మంటపమునకురాఁగా వార లశంకితులై క్షత్రియోచితంబులైన మహోన్నతాసనంబులం గూర్చుండిరి. అప్పుడు ద్రుపదుండు వారల క్షత్రియు లని స్పష్టముగ నెఱింగియు దానిని దృఢపఱచుకొనునిమిత్తము వారలలో ధర్మపుత్త్రుమొగమై యిట్ల

నియె. అయ్యా! మీరు క్షత్త్రియులరో, బ్రాహ్మణులరో, యదియునుం
గాక వేషధారులై భువి సంచరించుచున్న మంత్రసిద్ధులరో, మఱియు
నీద్రౌపదిని బరిగ్రహించునిమిత్తము స్వర్గమునందుండి యేతెంచిన దేవ
తలో యెఱుంగము. మాకు సంశయము గలుగుచున్నయది. మీకుల
రూపెఱింగినఁగాని యీకన్యకకు విధ్యుక్తవివాహంబుఁ గావింపనేరము.
అనఁగా నారాజునకు ధర్మపుత్త్రుఁ డిట్లనియె. రాజా! సంశయముఁ వలదు.
మేము క్షత్త్రియులము. పాండురాజప్రియపుత్త్రులము. నే నందఱిలో
నగ్రజుండను. వీఁడు భీముఁడు. వాఁడు కవ్వడి. వారు కవలు. ఈవృద్ధ
స్త్రీకుంతీమహాదేవి. అని తన్నునుం దమ్ములనుం దల్లిని నెఱింగించి
మీసుకుమారియైన పుత్త్రిక నొకకొలనునుండి వేఱొకకొలనికిఁ
గొనిపోఁబడు తామరతీఁగవోలె మీగృహమునందుండి మాగృహము
సేరెను. నీవు మాకు ముఖ్యగురుండ వనఁగా ద్రుపదుం డానందలహరిం
దేలియాడుచు నత్యుత్సాహంబున నానందబాష్పములు నేత్రములయం
దుండి జాఱిపడఁగా డగ్గుత్తికపడి యెట్టకేల కిట్లనియె. ధర్మమూర్త
లారా! పావనులారా! నాపుణ్యంబున లాక్షాగృహదాహంబువలన విము
క్తుల రయితి రని సంతోషించితిని. అనఁగా ధర్మతనయుండు వారణా
వతంబునందుండి యరులబారిఁ దప్పించుకొనిన వృత్తాంతం బంతయుఁ
జెప్పఁగా విని ధృతరాష్ట్రదుర్యోధనుల నిందించి సామవచనంబులఁ
బాండవుల నూఱడించి క్రమ్మఱ వారలకు రాజ్యమును సాధించియిచ్చు
నట్లు ప్రతిజ్ఞఁ జేసి వారిం బూజించి వారల నొకయుత్తమభవనము
నందు సత్కారపూర్వకముగ నుండ నియమింపఁగా నందుఁ బాండు
పుత్త్రులును గృష్ణసహితయైన కుంతీమహాదేవియు సుఖ ముండిరి.

అంత నొక్కనాఁడు పుత్త్రమిత్త్రబాంధవబ్రాహ్మణపరివృతుండయి
ద్రుపదుండు సుఖాసీనులయి యున్న పాండవుల కిట్లనియె. అయ్యలారా!
వినుండు. మాభాగ్యవశంబున నాయభిమతంబుమేరకు మత్స్యయం
త్రమును దెగనేసినవాఁడు క్షత్త్రియవంశములలోఁ బేరెన్నికగన్న శంతను
వంశోద్భవుండును, మహేంద్రవరప్రసాదజాతుండును, నభిజనపాత్త్రుం
డును, శుభచారిత్త్రుండును నగు నీయర్జునుం డయ్యె. కావున నీతం
డిప్పుడు నాపుత్త్రికి వరుఁడయ్యెను. వేగంబ వారిరువురకును బాణిగ్రహణ

మహోత్సవంబు యథావిధిగఁ జేయుచువాఁడను. అని చెప్పఁగా విని ధర్మపుత్త్రుం డిట్లనియె. రాజా! అది యెట్లు నీ వర్జునునకు మున్ను వివాహము చేయువాఁడవు? నేను బెండ్లియైనపిదప భీమసేనుండు పెండ్లియాడ వలయు. వెండియు నర్జునునకు వివాహయోగ్యకాల మగును. మాకు ముందే యర్జునునకు నీ వెట్లు వివాహము చేయఁదలపెట్టుదువు? అనఁగా ధర్మజునకు పృషదుం డిట్లనియె. రాజేంద్రా! అది యట్లగునేని ఈకన్యకను నీ కొసంగి నేను బెండ్లిచేసెదను. నీవ దీనికిఁ దగుభర్తవు గమ్ము. ధర్మ మెవ్వరికి ననుల్లంఘనీయము. అనఁగా ధర్మతనయుండు రత్నముల నందఱును గ్రహింప యోగ్యులు. నీపుత్త్రిక స్త్రీరత్నము ఆరత్నమును మే మెవ్వరమును గ్రహించెదము. ఇది మామాతృవచనము. ఆ నియమము మా కనుల్లంఘనీయము. అని చెప్పఁగా ద్రుపదుం డామాటలకు విస్మితుండై ధర్మతనయున కిట్లనియె. సత్యసంధా! ఒక్కపురుషునకుఁ బెక్కుఱు భార్యలు గల రను టెందును గలదు. కాని, పెక్కుఱ కొక్క భార్య యగు టేయుగములయందును నెక్కడలయందును విని యెఱుంగము. నీవు లౌకిక వైదికధర్మస్వరూపములను బాగుగ నెఱింగినవాఁడవు. మీఁదుమిక్కిలి ధర్మమూర్తివరప్రసాదజాతుండవు. నీ వాడిన మాట యధర్మం బని పలుకుటకు జంకుదుము. అయిన నిట్టిదాని నిదివఱకు విని యెఱుంగము. దీని నింక నీవును నేనును గుంతీమహాదేవియును ధృష్టద్యుమ్నుండును విచారించి యెల్లి నిశ్చయింత మనెను.

## వేదవ్యాసుఁడు ద్రుపదుకడ కేతెంచుట

అంత నల్లనిజింకతోలు ధరించినవాఁడును, సూర్యునితేజస్సువంటితేజస్సు గలవాఁడును, బ్రహ్మసమానుఁడును, నాశాపాశము లుడిగినవాఁడును మహాత్ముఁడును నగు కృష్ణద్వైపాయనమహాముని యచ్చోటికి విచ్చేయుటయు నందఱును నెదు రేగి యామహనీయుని పాదకమలములకు మ్రొక్కి యథావిధి యర్చింపఁగ నమ్మునిచంద్రుం డాపూజలం గైకొని నిర్దిష్టోత్తమాసనాసీనుం డై వారలం గూర్చుండ నియమింప నందఱు నుచితాసనములఁ గూర్చుండిరి. ఇట్లు వేంచేసియుండు వ్యాసభట్టారకుండు పాండవులకుశల మడిగి హితము లై చెవుల

కింపైనమాటల నందఱు వలరించుచుండ నామునీంద్రునకు ద్రుపదుండు ప్రత్యేకముగ వందనములు సమర్పించి యిట్లు విన్నవించెను. 'లోకులందఱు ధర్మమని యంగీకరింపఁదగిన పలుకులు గలయీధర్మరాజు తానును దన సోదరులును నాకూఁతును బెండ్లి చేసికొనవలయునని పలుకుచున్నవాఁడు. మహర్షులకుఁ దెలియని ధర్మాధర్మములు లేవుగదా? ఇంతకు మును పే యుగమునందైనను నొక్కవనితను బలువురు పెండ్లి యాడి కాపురము చేసినదికలదా? అప్పు డగువా రధర్మమును బలికిన మాత్రమునసే వేదములకును, లోకాచారమునకును విరుద్ధముగఁ బ్రవర్తింపఁదగునా? కావున నీకుఁ దక్క నితరుల కిట్టి ధర్మసంకటములు కలుగునెడ ధర్మము చెడకుండ నిర్వహింప నగునే' యని పలికెను. ఆ సమయమున ధర్మరాజు ద్రుపదునిసమక్షమున వ్యాసు మొగమై 'యో మహానుభావా! నవ్వులకైనను, నాటలయందైనను, నధర్మవిషయమున నాలుకయును, మనమును నా కెప్పటికిని దగులుట లేదు. కావున నీయంగనను మే మేవురమును బెండ్లి చేసికొందుము. అట్లొనర్పవలయునేకాని యితరవిచారములు చేయఁదగవు. అధర్మమున నెప్పుడేనియును బ్రవేశింపని నామనస్సు పాంచాలియం దనురక్తమయినది. మా కేవురకు నీకన్యక ననుభవింప మాతల్లియనుజ్ఞ కలదు. గురువులలో నెల్ల తల్లి మేటిగురువు; కావున నట్టిపెద్దలపల్కును శిరసావహించి యాచరింపవలసినది ప్రథమ ధర్మము. మఱియును నేతన్నిమిత్తమునఁ బూర్వాచారమును గలదు. తొల్లి గౌతమవంశమునఁబుట్టిన జటిల యనుమునికన్య *యేడ్గురుఋషులకు ధర్మపత్ని యయ్యె; మఱియును దాక్షాయణి యను మునికన్య యొక్కతె ప్రచేతసు లను నేకనామమున వ్యవహరింపఁబడుచున్న వారగు పదుగురు మునులకు బత్ని యయ్యె ననియుఁ బురాణములయందు వినుచున్న వారము.' అనఁగా ధృష్టద్యుమ్నుండు మునివరేణ్యునితో నిట్లనియె. బాదరాయణీ! చిఱుతవాఁ డగు నర్జునుండు పౌరుషంబున సాధించి తెచ్చినకన్యను సర్వధర్మములఁ దెలిసినవాఁడును, సోదరులలో జ్యేష్ఠుండును నగుధర్మరా జెట్లువివాహమాడఁదగును? వీరికెల్లఁ గృష్ణయొక్కర్తె యెట్లు

---

*గౌతమవంశమునఁ బుట్టినజటిలుని కూతురు తన తపఃప్రభావమున నేడ్గురు ఋషులకు నొక్కతెయ భార్య యయ్యె నని యాంధ్రభారతము.

భార్యా గాఁగలదు? ధర్మసూక్ష్మ మెట్టిదియో యెఱుంగఁజాలకున్నవాఁడ.
అనుచుండఁగనే మహర్షితోఁ గుంతి యిట్లనియె. సాత్యవతేయా! ధర్మజుఁ
డుచితంపుఁ బలుకు లాడెను. నాపలుకున కనృతదోషంబు రాకుండ
ధర్మనిర్ణయము చేయుము. అని చెప్పఁగా నప్పారాశర్యుండు కుంతి
నూఱడించుచు సోమకుని (ద్రుపదుని) మోమునందుఁ జూడ్కి నిలిపి
యాతనితో నిట్లనియె. ఓయి రాజా! ధర్మతత్త్వమును లెస్సఁగా నెఱిం
గిన యీ ధర్మరా జధర్మమగుమాట నాడఁడు. దేవతామూర్తియైన
యీ కుంతి తెలియక దబ్బరలు పలుకదు. వీరిమాటలును, దేవతల తాత్ప
ర్యమును నొకటియే కాని వేఱు కానేరదు. కావున నన్యథా యాలో
చింపక నీ వీ యేవురకును నీకూఁతు నీశుభాంగి నిచ్చి పెండ్లిచేయుము.
ఇది ధర్మ్యము. వీరి వృత్తాంతమంతయు దివ్యము. దాని నంతయు వినఁ
గోరుదువేని వివరంబుగాఁ జెప్పెద నని యాద్రుపదు చేయి పట్టుకొని
యేకాంతస్థలమునకుఁ గొనిపోయి యం దాసీనుండై యతనిని దనసమీ
పంబునఁ గూర్చుండ నియమించి యతని కి ట్లనియె.

## * నాళాయన్యుపాఖ్యానము

పూర్వము నాళాయన యయిన యింద్రసేన యను పేరు గల
పరమపతివ్రత మౌద్గల్యుఁ డను మునికి భార్య యయి యుండఁ గర్మ
వశమున నాతనికిఁ గుష్ఠవ్యాధి ప్రాప్తించెను. అక్కతమున నతనిశరీరము
లోని మాంస మంతయుఁ గృశించి రక్తశూన్యమై యెముకలును, నర

---

* ఈకథ ప్రక్షిప్త మని భారతవ్యాఖ్యాత నీలకంఠభట్టాచార్యుఁడు విడిచి
యున్నాఁడు. ఆనందపూర్ణ మునీంద్రుండు వ్యాఖ్యానము చేసియున్నాఁడు. నన్నయ
భట్టారకుఁడు తెనిఁగించియున్నాఁడు. చంపూభారతము మున్నగు భారతకథలను
వ్రాసిన గ్రంథకర్తలకావ్యములలో నీయాఖ్యాన మున్నది. కావున వచనభారత
రచయితలందఱును దీని కాంధ్రవచనమును రచియించిరి. కావున నే నిం దీకథను
బొందుపఱచితిని. మఱియొకవిశేషమున్నది. నాళాయని యైనయింద్రసేన మౌద్గల్యు
నిచే విడువఁబడి యాదేహమును వదలి యొకరాజర్షి పుత్త్రికగాఁ బుట్టి పతినిమిత్తముగ
నీశ్వరునిగుఱించి తపస్సు చేసె నని తెనుఁగుభారతమున నున్నది. సంస్కృతమున
శరీరాంతమును దాల్చినట్లగపడదు. మౌద్గల్యుండు దేహత్యాగమును జేయునప్పు డా
కల్యాణినిఁ జూచి "భవిష్యసి నృలోకే త్వం రాజపుత్రీ యశస్వినీ, పాంచాలరాజస్య

ములును, జర్మమును మాత్రము మిగిలియుండెను. ఇట్టి ముదుసలియు, రోగియుఁ, గంపుగల యొడలు మొగము గలవాఁడును, నతిదుఃఖజీవి యును, నతికోపియును, వీడిపోవుచుండు తోలును, గోళ్లును గలవాఁడు నైన యాపతిని వెక్కసింపక మిక్కిలి మక్కువతో నుపచరించుచు, నతండు భుజింపఁగా మిగిలిన యన్నమును నాతని విస్తరియందే తానును నాపరమపతివ్రత యగు నింద్రసేన భుజించుచుండెను. ఇట్లుండఁగా నొక్కదినమున నతండు భుజించుచుండఁగా నాతనిపెద్దవ్రేలు ముడిఁగి యూడి యాతనియన్నమునందుఁ బడెను. అట్లన్నములోఁ బడిన పతి వ్రేలిని నేవగించుకొనక నాళాయని దాని నెత్తివైచి మిగిలినయన్నమును బ్రియముతోఁ దినెను. దానిని భర్త చూచి భార్యయం దనురక్తుండై దాని పతిభక్తికి మెచ్చి భార్యతో నిట్లనియె. ఓశుభాంగి! నీపతిభక్తికి మెచ్చితి. నీ కిష్టమైనదానిం గోరుము. ఇచ్చెద ననఁగా నప్పరమపతివ్రత తనకుఁ బ్రసన్నుఁడయిన పతితో నిట్లనియె. ప్రాణనాథా! నాకుఁ గామ భోగములు తనియవు! కావున నీవు స్వతపోమహిమచే నీవికృతస్వరూ పమును వదలి సుందరయౌవనరూపములు గలవైయైదుగురు పురుషుల వివిధరూపములం దాల్చి కామోపభోగముల నన్ను సంతోషింపఁ జేయుము. అనఁగా నాఋషియు పత్ని కిష్టమైన నానావిధదివ్యదేహము లను దాల్చి యాయింద్రసేనతోడ ననేకరమ్యవనప్రదేశముల విహ రించుచు మహేంద్రలోకమున కేఁగి యందు దేవర్షులు పూజింపఁగా సూర్యరథము నెక్కి వియద్గంగాజలముల నిరువురును దీర్థమాడి, చంద్రు నిశీతకిరణములు సోఁకుచల్లని ప్రదేశములలోఁ గొంతకాల ముండి

సుతా ద్రుపదస్య మహాత్మనః. భవితారస్తు తే తత్ర పతయః పంచ విశ్రుతాః, తైస్సార్థం మధురాకారైః చిరం రతిమవాప్స్యసి." యనుటయే యాధారముగ నున్నది. అయినను విద్వాంసులు కొందఱు నాళాయని రెండవశరీర మెత్తి యాశరీర ముతో మహాదేవునారాధించి వరమును బడసినట్లు నన్నయవ్రాసినదానినే క్రమముగా భావించి, యీనాళాయన్యుపాఖ్యానమునందు మన కిప్పుడు లభించియుండుపాఠ మున బహుకాలపాఠభేదముచేఁ గొన్ని శ్లోకము లీప్రకరణమున వదలిపోయియుండ వచ్చుననుచున్నారు. అయిన నీయుపాఖ్యానకథను వ్రాయుటలో నన్నయభట్టారకుని యాంధ్రభారతానుసరణము గావింపఁబడినదని పాఠకు లెరుఁగుదురుగాక!

కైలాస మేరుగిరిదరులయందు యథేచ్ఛావిహారములను జలుపుచు, మఱి యొండు గిరిరూపమును ధరించినచో నింద్రసేన తాను నదీరూపమున దాల్చియు, నాఋషివర్యుండు కల్పవృక్షరూపి కాఁగా నాళాయని కల్పలతయై, మఱియును దా నేరూపమును దాల్చినను దత్తదుచిత రూపయై ముద్గలునకుఁ జిత్తానువర్తియై మెలఁగుచుండ బహుప్రదేశ ములలో ననేకసంవత్సరములు దానితో నిష్టసుఖోపభోగముల ననుభ వించి తనివిఁ జెంది తపం బాచరింపఁ దలపోయఁగా భర్తకు భార్య యిట్లనియె. తపోధనా! నేను గామోపభోగముల నింకను దనియ కున్నదాన. ఇంకం గొంతకాలము నాయిష్టానువర్తివై యుండు మనఁగా ననన్యకాంత యగున త్తరుణితో మౌద్గల్యుం డిట్లనియె. ప్రేయసీ! ఇట్టి స్థిరములు కాని కామోపభోగములయందుఁ గాలము గడపుచో నాకు శాశ్వతపదవి నొసంగుతపస్సునకు విఘ్నము కలుగుచున్నది. నీ వింకను దనివిఁ జెందినదానవు కాకుండుటచే మనుష్యలోకమునఁ బాంచాల పతికిఁ బుత్త్రివై జనించి సుందరాకారు లగుపాండవు లైదుగురిని బతు లనుగాఁ బడసి వారియందు సర్వభోగముల ననుభవింపు మని బ్రహ్మత్వ మును బొందెను. అంత నాయింద్రసేన కాలవశమున శరీరమును వదలి కాశిరాజకుమార్తియై జనించి యతిసౌందర్యవతి యైనను దౌర్భాగ్య మునఁ బతిం బడయనేరక వగచి మహాదేవునిఁ గూర్చి తపంబుఁ జేయఁ దొడంగెను. ఆశుభాంగి తపస్సు చేయునప్పుడు గ్రీష్మకాలమున నాహా రము లేక పంచాగ్నిమధ్యమున శశిశేఖరుని ధ్యానించుచుండఁగా నా దేవదేవుం డాకృశాంగి తపస్సునకుఁ బ్రీతుం డై యామెయందు నిలిచి యో వరాంగీ! నీవేమికోరి తపం బిట్లు తీవ్రముగఁ జేయుచున్నదానవు? వర మడుగుము. ఒసఁగెద ననఁగా నాతపస్విని మహాదేవునితోఁ బతి నొసంగు మని యైదుమాఱులు ప్రార్థించెను. అంత నీశ్వరుండు దాని నుద్దేశించి,

"భవిష్యతి చ తే జన్మ మనుష్యేషు వరాంగనే,
భవిష్యతి చ తే భీరు పతయః పంచ విశ్రుతాః."
"మహేంద్రవపుషస్సర్వే మహేంద్రసమవిక్రమాః,
తత్రస్థా స్సుమహత్కర్మ సురాణాం త్వం కరిష్యసి.

ఓ వరాంగనా! నీకు మఱియొకజన్మము మనుష్యులలోఁ గలుగఁ

గలదు. ఆజన్మమందు నీకైదుగురు (జగద్విఖ్యాత) పతు లగుదు రనియు వారు మహేంద్రుని తేజస్సు గలశరీరములును, వానిపరాక్రమమును గలవారై యుందురనియు, నీవు భూలోకమునుండి దేవకార్యమును నెఱవేర్చెదవనియు వరము నొసంగఁగా నాకన్యక లోకేశా, "ఒక్కతెకనేకులు పతు లగుట ధర్మమే? ఒక్కతెకు భర్త యొక్కఁడే యని శాస్త్రములు విధించినవి. ఆపత్సమయమున సంతానార్థము భర్త యనుమతించినచో వేఱొకనిని బొందనగును. మూఁడవవానినిబొందినఁ బ్రాయశ్చిత్తము విధింపబడియున్నది. నాలవవానితో సంగమించిన యది పతితురాలగును. అయిదవవానిం బొందిన, దానిని గులట యందురు. ఇవ్విధమునఁ బెద్దలు నుడువుదురు కావున నోమహానుభావా! యీధర్మసంకటమునందుండి నాకు మోక్షము కలిగింపుము. అని ప్రార్థింపఁగా శంకరుఁ 'డో కల్యాణీ! నీవు పతిదాన మొసంగు మని యైదుమాఱు లడిగితివి. అట్లగుట నీ కేవురు పతు లగుదు రని వక్కాణించితిని. ఇది తప్పదు. వరముఁ బొందుటం జేసి యిది దూష్యమును, ధర్మవిరుద్ధమును, గానేరదు' అని చెప్పఁగా నాకన్యక వెండియు మహాదేవునితో నిట్లనియె. "ఓపార్వతీశా! నాకుఁ బతు లైదుగు రగుదు రేని నాకు వారియందుఁ బ్రత్యేకసంగమమును, నిండుకౌమారం బెల్లప్పుడును, బతిశుశ్రూషాపరత్వమును, నందఱయందు సమభోగేచ్ఛయుం గలుగ ననుగ్రహింపు' మని ప్రార్థింపఁగాఁ బినాకి దానికోరిన ట్లొసంగి, గంగాతీరమున మహేంద్రుం డున్నవాఁడు. వానిని నాయొద్దకుఁ దోడ్తెమ్మని యాజ్ఞాపింపఁగా నక్కన్యక శంభునకుఁ బ్రదక్షిణపూర్వక నమస్కారంబు లాచరించి గంగాతీరమున కరిగెను.

## పంచేంద్రోపాఖ్యానము

ఆసమయమున వైవస్వతుండు (యమధర్మరాజు) లోకమునందలి ప్రాణులను జంపుట మాని నైమిశారణ్యమునందు సత్త్రయాగదీక్షం బూని యుండెను. కావున లోకమున జనులు చావు లేక యుండిరి. దీని కోర్వక యింద్రాదిదేవతలు బ్రహ్మకడ కేఁగి, 'పితామహా! మర్త్యు లగు మానవులు చావు లేమి నమర్త్యులైరి. వారికిని మాకును దారతమ్యము లే దయ్యె' నని యేడ్చిరి. అంతఁ బరమేష్ఠి దివ్యజ్ఞానమునఁ దెలిసి

'ఓయీ దేవతలారా! యముండు సత్రయాగము నింతకుఁ జాలించెను. తన తొల్లింటి నియమితకార్యమును బ్రారంభించి చేయుచున్నవాఁడు. మీరు వేడుకవలదు. మీకును మనుష్యులకును నెప్పటియట్ల భేద ముండఁ గలదు. మీరు మీస్థలముల కేఁగుఁడు. మఱియు నావైవస్వతునియంశము నందును భూలోకమున మీయంశమునందును, నేవురు మనుజులు పుట్టి పరాక్రమవంతులగుచు నా వైవస్వతునియుద్యోగమునకుఁ దోడ్పడు చుందు' రనియెను. అందున కింద్రాదిదేవతలు సంతసించి మందాకినీతీరమున మఱలిపోవుచుండఁగా నానదీతీరమున నొక్కకన్యక ఘోరముగ నేడ్చు చుండఁగా దాని కన్నీరు గంగలోఁ బడి కనకకమలము లగుచుండఁ దానింజూచి వెంబడించుచున్న దేవతలు దేవేంద్రునితో నాకన్యకను సమీ పించి దానిరోదనమునకుఁగనికరించి, మహేంద్రుండు 'నీవెవ్వతెవు? నీదుఃఖ కారణం బేమి? యని యడుగఁగా నాకన్యక పురుహూతున కిట్లనియెను. పురందరా! నే నెవతె నని, నాదుఃఖకారణమును నీ వెఱుంగఁగోరు దేని నావెంబడి నరుదెమ్ము. అని చెప్పఁగా నింద్రుండు దానిమాటల కొడంబడి దానిని వెంబడించి పోవుచుండెను. అట్లు పోవుచుండఁగా హిమవత్పర్వతగుహాలలో నొక్కదానివాఁకిట నొక్కరత్నసింహాసనముపై నొకసుందరాంగితో వరుణరూపము ధరించి జూదమాడుచున్న మహా దేవుం గని వరుణుండ కా యని తలపోసి వానిపైఁ గోపముం బూని యిట్లనియెను. ఓరీ యీచరాచరజంతుజాలములతో నిండియుండు నీ బ్రహ్మాండ మంతటికిని నేను బ్రభువను. ఈ వజ్రాయుధమును చేతఁ బూని యీముల్లోకములను నేను రక్షించుచున్నవాఁడ. నేను బురందరుఁడను. అట్టి నన్నుఁ జూచి నీవీ రత్నసింహాసనముపైఁ గూర్చుండి యొక్క యంగనామణితో జూదమాడుచుండుట నీకుఁ దగునా? ఇట్లు నీవు నే నెల్లిదమైతినే? అనఁగా నాపలుకులను రుద్రుం డాలించి క్రుద్ధుండై రౌద్రమగు తనస్వరూపముతో నిట్లనియెను. 'ఈదురాత్ముండు నాకా వించు క్రీడారసమునకు భంగముఁ గావించెను. కావున నోకన్యకా! నీవు పోయి యీదుష్టుని నాసమీపమున కీడ్చుకొని ర' మ్మనెను. అంత నా కన్యక పురుహూతునిచెంత కరిగి వానిని దాఁకుడు బురందరుండు ప్రజ్ఞ తప్పి నేలఁబడి మూర్ఛిల్లెను. అప్పుడు వానిశరీరమును జూచి చంద్రశేఖరుం

డిట్లనియె. ఓరీదురాత్మా! నీవు నాయెదుట వెఱ పొకింతయును లేక యహంకారపు మాటలాడితివి. నీవు యథార్థముగఁ బరాక్రమశాలి వగుదు వేని యీకొండశిఖరము నెత్తు మనఁగా నాపాకశాసనుండు మూర్ఛదేరి యాకొండశిఖరము నెత్తఁబోయి దానిని రెండుబద్దలుగాఁ బగులఁగొట్టెను. ఆశిఖరంపు రెండుపాయలమధ్యను జూడఁగా నీమహేంద్రునివంటివారు వయోరూపలావణ్యముల సరియగుచు నలువురుగాన్పించిరి. అంత మహేంద్రుండు వారియాకారముల నిపలకించి యచ్చెరువడి నేనేల యీనాల్గురూపముల నొందితి నని తలపోయుచుండెను. అప్పుడు శంకరుఁడు వారి నేవురను వీక్షించి మీ రేవురును భూలోకమున దేవకార్యముకొఱకు మనుష్యయోనులయందుఁబుట్టుఁ డని యానతిచ్చెను. మఱియు నప్పు డింద్రుండు దేవా! నేను మనుష్యయోనియందుఁ బుట్ట లేను. నాకు మాఱుగా నాయంశమునఁ బుత్త్రునిఁ బంపెద ననెను. అప్పుడు విశ్వభుక్కు, భూతధాముఁడు, శిబి, శాంతుఁడును, నింద్రపుత్త్రుఁడును నందఱుం గలసి వార లేవురును ధర్మ, వాయు, ఇంద్ర, అశ్వినులు తమకు దేహములు కలుగఁ జేయఁగా ధర్మజ, భీమ అర్జున, నకుల, సహదేవు లను నామముల జనియించిరి.

అంత బ్రహ్మాదిదేవతలచేఁ బ్రార్థింపఁబడిన శ్రీమన్నారాయణదేవుని సితాసితకేశములయంశమున బలదేవుండును శ్రీకృష్ణుండును వసుదేవ నందనులై రోహిణీదేవకీదేవులగర్భమునందుండి యీలోకమున నవత రించిరి. దేవకార్యనిమిత్తముగనే యాదినారాయణుండు పురుషోత్తముఁ డీ మనుష్యస్వరూపము నెత్తి భూలోకమునందు యాదవులలో నవత రించెను. ఈయింద్రు లయిదుగురికిని నొక్కతె భార్య యగునట్లు శ్రీ మహాలక్ష్మియంశమున నాళాయని యగు నింద్రసేన యపరజన్మమందు కాశిరాజసుతయై జనించి దివ్యసుందరరూపముదాల్చియుఁ దన దౌర్భాగ్య విశేషంబున నాజన్మమునందుఁ బతిం బడయ నేరక మహాదేవుని గూర్చి తపం బొనర్చి యాతనివరమున నీజన్మమున నీ కయోనిజ యైన కూఁతురై పుట్టి యిప్పు డీ యైదుగురికిని ధర్మపత్ని కాఁగలదు. ఈకన్యక దైవయోగమున యాజోపయాజులమహిమచే ద్రౌపదిగాఁ బుట్టెను. కావున్న నగ్నిని వ్రేల్చినమాత్రమున నిట్టి జగన్మోహనమూర్తి

యుదయించునే? మఱి యీకన్యక శ్రీదేవియంశము గలది కాకున్న దీని కింతటి దివ్యసౌందర్యమును, దనచుట్టు క్రోసుదూరమువఱకును దివ్యసుగంధవ్యాపనంబును దీని కబ్బునే? ఇది వీరిపూర్వజన్మవృత్తాంతంబు నాతపోబలంబున నెఱింగినదానిం జెప్పితి. నీవు విశ్వసింప వేని దివ్యదృష్టి నొసంగెద. వారిపూర్వరూపములను దిలకింపుము. అని వేదవ్యాసుండు ద్రుపదునకు దివ్యదృష్టి నొసంగెను. అంత నాసోమకుండు తనకట్టెదుట దివ్యకిరీటములఁ దాల్చి, సూర్యాగ్నితుల్యతేజస్సులతోఁ, దాటిచెట్టంతపొడవులు గల యున్నతశరీరములతో, దివ్యవస్త్రాభరణములను పుష్పమాలికలను ధరించి, యేకాదశరుద్రులయు ద్వాదశాదిత్యులయు దేహములతోఁ దుల్యములైనశరీరములతో నుండు పూర్వేంద్రులను, నింద్రాంశజుండై యింద్రుం బోలియున్న యర్జునుని, దివ్యసుందరియు వారి కనుగుణయు నైనయాకన్యకనుం జూచి పరమాశ్చర్యభరితమానసుం డై బాదరాయణునియడుగులకు మ్రొక్కియుండె. అంత వేదవ్యాసుండు ద్రుపదునకు వెండియు నిట్లనియె. ఓపాంచాలపతీ! దైవయోగం బిట్టిది. దీనిని దప్పింప నెవరికిని శక్యము కానేరదు. వీ రైదుగురును నీకన్యకను బెండ్లియాడుట ధర్మము. మఱియు నొకనిదర్శనమును జెప్పెద వినుము. నితంతుం డనురాజర్షి యొక్కఁడు పూర్వకాలమున నుండెను. వానికి బహుపరాక్రమశాలురును, వీర్యవంతులును నగు సాల్వేయుఁడు, శూరసేనుఁడు, శ్రుతసేనుఁడు, స్వారుఁడు, అతిసారుఁడు నను వార లేవురు పుత్త్రులుండిరి. వారన్యోన్యస్నేహమున విఖ్యాతిఁగాంచి పెరుగుచుఁ బెద్దవారైరి. వారేవురు నొశీనరపతికూఁతు నజిత యను దానిం బెండ్లాడి, దానియందు వేర్వేఱ సంతానములను బొంది సుఖులై యుండిరి. కావున నిట్టిపూర్వాచారము కలదు. వీరి కేవురకును భార్యగా దైవయోగమున జనించిన యాసౌందర్యతిలక వీరికి నిచ్చి పేరోలగంబున వివాహము గావింపుము. అని వివరింపఁగా ద్రుపదుండు తృప్తుండై వేదవ్యాసునితో ని ట్లనెను. మునివర్యా! ఈవృత్తాంత మేమియుఁ దెలియమిం జేసి యజ్ఞానంబునఁ దర్కించితి. దైవ మట్లు విధించియున్నది. మహానీయుండ వగునీవును నికార్యమున కనుకూలముగ నియోగించితివి. పాండవు లేవురును నాకూఁతుఁ గృష్ణను బెండ్లాడుదురుగాక! అని సమ్మతించెను. అంతఁ గృష్ణద్వైపా

యనుండు ధర్మరాజుం జూచి యీదినము *పుష్యమినక్షత్రమునం జంద్రుం
డున్నవాఁడు. ఇది శుభయోగయుతము. ఈశుభదినమున మీ రేవురును
గృష్ణను బెండ్లిచేసికొనుఁ డని సెలవొసంగెను. అవ్విధమున వేదా
వ్యాసుండు నిశ్చయించి సెల వొసంగఁగా ద్రుపదుఁడు మిక్కిలి యను
రాగముతోఁ బాంచాలముఖ్యపట్టణ మగు కాంపిల్యనగరమునం దష్ట
శోభనములు జరుగఁ జాటించి వివాహమహోత్సవమును బ్రారంభించెను.
అప్పుడు పురమంతయు సందు గానరాక యరఁటిచెట్లు, పోక గుత్తులు,
లేఁత రావిచిగుళ్లు మున్నగువానిచేత నలంకరింపఁబడెను. మఱియుఁ
బౌరులు ప్రతిగృహద్వారములను జందనోదకములచేత నలికి, ముంగిళ్ల
యందుఁ గర్పూరముచేతను, ముత్యాలచేతను ముగ్గులుపెట్టిరి. సౌందర్య
వతు లగు విలాసినీజనులు తమకు నియమింపఁబడినకార్యములయందు
జాగరూకలై మెలఁగుచుండఁగా, వివాహోత్సవసందర్శనార్థంబుగ
నాగతానేక రాజన్యసుహృద్బాంధవులచేతను, మఱి సంతతాశీర్వాదనినా
దంబుల భూనభోంతరాళంబుల ధ్వనింపఁ జేయుచున్న భూసురులచేతను,
మిక్కిలి రమణీయంబై యుండు ద్రుపదునిమందిరంబునం దీశాన్యభాగం
బునఁ జిత్రవిచిత్రములైన వస్త్రములచేతఁ గట్టఁబడిన మేలుకట్లయందు
వ్రేలాడుచున్న ముత్యాలసరులచేతను, దివ్యపరిమళములను నానాదిశల
వెదఁజల్లుచుండు పుష్పమాలికలచేతను శోభాయమానమై యుండునది
యును, మేలైన యాకుపచ్చని పట్టువస్త్రములచేఁ జుట్టఁబడిన స్తంభం
బులు గలదియును, బ్రత్యగ్రములయందు లేఁజిగుళ్లు గలిగి యక్షతలతో
విరాజిల్లు, గంగాది పుణ్యనదీతీర్థములచే నిండిన సువర్ణకలశములతో
వెలయుచున్నదియు, లాజలును ఘృతమును గలబంగారుకలశ

---

* ఇచట మునుపు వివరించినపుష్యశుద్ధరోహిణివిషయము కొంత చర్చించె
దము. ధర్మరాజునకు జననాదిసంవత్సరములు ౩౦ నెలలు ౮ అయినప్పుడు స్వయం
వరము జరిగినందున నిది చాంద్రమానప్రకారము రౌద్రిసంవత్సరమును, బార్హస్పత్య
మానప్రకారము భావనామసంవత్సరమును నగు. పుష్య శుద్ధ ఏకాదశి బుధవార మని
యేర్పడినది. ఇందున నాదినము ఏకాదశిగడియలు ౩౮, రోహిణిగడియలు ౫౮, నై
యున్నది. ఇందునకు గణితమును సూచించిన గ్రంథబాహుళ్య మగును. ఇది ద్వాపర
యుగాంతమునకు ౨౭౫౮౫ దినములకు ముందుగాఁ గడచినదానిని సూచించితిని.

ములును, సమిధలు, దర్భలు, సన్నికల్లు మున్నగువానిచే రమ్యమైనది యును, నూతన మగు గోమయమువలెఁ బచ్చనైన మరకతమణులకాంతి సమూహములచేఁ బూయఁబడిన బంగరుతిన్నెమీఁద నుండునగ్నికుండము నందు జలించుచున్నవివాహాగ్ని కలదియునైన యాపెండ్లిపందిరి పాండవపురోహితుం డగు ధౌమ్యుఁడు మున్నగు ననేకవిద్వన్మహీసురనివ హంబుతో నిక్కలి ప్రకాశించెను.

## ద్రౌపదీవివాహమహోత్సవము

అవ్విధంబున ద్రుపదరాజు పెండ్లిమంటపమును బలుతెఱంగుల శుభాలంకారములతో శోభాయమానము గావించి, మంగళద్రవ్యముల సమకూర్చి పెండ్లివేడుకను గన్నులారఁజూచి యానందించుచుండఁగాఁ బాండవు లయిదుగురును మంగళస్నానములు గావించి మేలైనవస్త్రము లను సాభరణములను ధరించి యావివాహవేదిఁ జేరిరి. అంత నపూర్ణేందువదన యగు ద్రౌపది సఖీపరిచారికాజనంబులు జలకమాడింప నత్యంత విదగ్ధపుణ్యాంగనావిరచిత లలితవస్త్రాభరణాద్యలంకృతాంగియై కమనీయకాంతాసహస్రంబుతో మెల్లన ద్రుపదునాజ్ఞమెయి నావివాహ మంటపమున కేతెంచె. భూసురేంద్రపరివృతుం డైన ధౌమ్యుఁడు పుణ్యాహమును వచియింపించి మొదట ధర్మనందనుని ద్రౌపదిని బెండ్లిపీటపైఁ గూర్చుండ నియమించి వివాహప్రయుక్తమంత్రాహుతులచేఁ బ్రదక్షిణావర్తితదీప్తశిఖానలమున విధియుతముగ హోమము గావించి యగ్నిసాక్షికముగఁ బాణిగ్రహణముఁ జేయించెను. వ్యాసవచనమును, బూర్వజన్మవరమునుం గారణముగా దానికిఁ గన్యాత్వము దూషితంబు గాకుం డుటవలన భీమార్జుననకులసహదేవులు నలువురును గ్రమంబుగ ద్రౌపదిని యథావిధిగఁ బెండ్లియాడిరి.

అప్పు డప్పాండవు లేవురకును ద్రుపదుండు పాంచాలిం బరమోత్సవమునఁ బెండ్లిచేసి యయ్యేవురకును వేలువేలుగ వెలలేని మణిఖచిత ములైన యాభరణములను, నపరిమితంబులైన యర్థరాసులను, నానావిధ వస్తునివహంబులను, నూఱేసి కనకరథములను, వేయేసియశ్వములను, నూఱేసి భద్రగజంబులను, బదేసివేల దాసీజనంబులను, నూఱేసివేల పాడియావులను నగ్నిసాక్షికముగ నొసంగి బలపరాక్రమవంతు లైన

పాండురాజపుత్త్రు లల్లు రగుటకు నెంతయు సానందించి యిఁక నాక వాసు లగు దేవత లైనను దన్ను గెలువ లేరని విశ్వసించి చింత దక్కి యుండెను. చతుస్సముద్రములకు మధ్యనుండు సామ్రాజ్యలక్ష్మికి మూలం బైన ద్రౌపది యంత నంతఃపురమున కరిగి, యాయంతఃపురస్త్రీలు తన్నుఁ గొలుచుచుఁ బరివేష్టించియుండఁగా నుత్తమాసనమున సుఖోపవిష్టు రాలై యున్నకుంతిమహాదేవికి సాష్టాంగవందనము లర్పించి చేతులు జోడించికొని యెదుట నిలుచుండియుండఁగా నప్పు డాపాండురాజమహిషి కోడలిసత్ప్రవర్తనమునకు సంతుష్టయై యిట్లనియె. ఓలలితాంగీ! మహేం ద్రుని శచీదేవియు, నగ్ని దేవుని స్వాహాదేవియుఁ, గుబేరుని భద్రా దేవియు, వసిష్ఠఋషిని నరుంధతియుఁ, జంద్రుని రోహిణియు, శ్రీమహావిష్ణువును నాదిలక్ష్మియు, నలుని దమయంతియుంబోలె నీవును నీపతులయందుఁ బ్రీతియు భక్తియు నొప్పఁగా మెలంగుము. దీర్ఘాయువు గలవారును, బలపరాక్రమసంపన్నులును నగుపుత్త్రులం బడయుము. గురువృద్ధబాంధ వాతిథిజనుల నెప్పుడుఁ బూజింపుము. సతతాన్నదానముం జేసి భూసు రులఁ దృప్తులం గావింపుము. భూలోకప్రదేశములగు కురుజాంగలాది సకలదేశములకు రాణివై విలసిల్లుము. నీభర్తలు రాజసూయాశ్వమేధ యాగముల నొనర్పఁగా నీవును వారివెంబడి దీక్షఁ బూని భూదానాద్య శేషదానములను బాత్రు లగువారి కొసంగి ధర్మపత్ని యనఁ బ్రఖ్యాతిఁ జెందుము. పెండ్లికాలమున నీ విప్పుడు మంగళద్రవ్యములతో నలంక రింపఁబడి శోభిల్లుచుండ నిన్ను నేను జూడఁగలిగిన యానందముకంటెఁ జెప్పఁ నదుంగు లెక్కఁడగు పరమానందమును వేవేగ వీరులగు పుత్త్రులం గని సంతుష్టస్వాంతవై యున్న నిన్నుఁ జూచి, పడయుదాన నని ప్రియపూర్వకంబుగఁ గోడలిని నాశీర్వదించె. అట వాసుదేవుండు కాంపిల్యపురమునందు ద్రౌపదినిఁ బాండవు లేవురును బెండ్లాడిరని యాక ర్ణించి వారేవురకును నానారత్నఖచితభూషణములను, ననేక కాంచన వస్తునివహంబులను, నానాదేశవిచిత్రవస్త్రంబులను, ననేక కరితురగ రథరత్నశిబికావిలాసినీసమూహములను బ్రీతిపూర్వకముగఁ గొనిరాఁగా ధర్మపుత్త్రాదులు వాని నెల్ల నావసుదేవనందనునకుం బ్రియంబగు నట్లు నాదరణపూర్వకంబుగ గ్రహించిరి. అంత వారు ద్రౌపదియందుఁ

గొఱఁతలేని యిష్టసుఖోపభోగంబుల ననుభవించుచు శ్రీకృష్ణునితోడ ద్రుపదుపురంబున నానందముతో వసించుచుండిరి.

అంతకుఁ బూర్వము స్వయంవరమునకు వచ్చిన రాజులు మత్స్యయంత్రమును దెగనేసి ద్రౌపదినిఁ బడసినవాఁడును, సమరమునఁ గర్ణు నోడించినవాడును నర్జునుం డనియును, శల్యుని గదాయుద్ధంబున నోడించినవాఁడు భీమసేనుం డనియుఁ, బాండవు లేవురును లక్కయిండ్లలోఁ గాలి చావక సుఖులై యున్నవారనియు, దుష్టాత్ముండైన దుర్యోధనుండు వారి కెట్టియెగ్గొనర్పఁ బూనినను దైవసహాయ్యంబు గల వారెట్లో యాపదఁ దరించినా రనియుఁ, బాండవు లేవురును గుంతీమహాదేవితో విప్రవేషధారులై యెచ్చటనుండియో స్వయంవరమున కేతెంచి సకలరాజలోకమధ్యమునందు ద్రుపదునియమనము మేఱకు వర్తించి తమసామర్థ్యమును జూపినందుల కద్భుతపడి ధర్మాత్ములును, న్యాయప్రవర్తకులును నగు వారి కేకీడును జెంద దని పాండుసుతులఁ బొగడుచు, ధృతరాష్ట్రసుతుల దూషించుచుఁ దమతమదేశములకుఁ జనిరి. దుర్యోధనుండు తన తొంబదితొమ్మండ్ర తమ్ములతోను శకునికర్ణకృపాశ్వత్థామలతోను మఱలి హాస్తినాపురమున కేఁగువాఁడు వేఁగులవారివలనఁ గర్ణునితోఁ బోరి జయించినవాఁడును మత్స్యయంత్రమును దెగ నేసి ద్రౌపదిం బడసిన బ్రహ్మచారియును నిరుపము నొక్కఁ డయిన యర్జునుఁ డనియు, మద్రరాజును బాహుయుద్ధమున నోడించిన బలశాలి యగు విప్రవేషధారి భీమసేనుం డనియు నిట్లు తెలిసి పాండుపుత్త్రైశ్వర్యమున కోర్వలేక చింతాక్రాంతుం డయ్యె. అప్పుడు దుశ్శాసనుండు దుర్యోధనుని దగ్గఱి యిట్లనియె. రాజేంద్రా! విప్రవేషమును వేయకుండినచో నర్జునుండు ద్రౌపదిని స్వయంవరమునఁ బొంద లేడు. మనము వాఁడు యథార్థముగ నర్జునుఁ డని యెఱింగితిమేని వాని నలంతిగఁ బోనిత్తుమే? ఇన్ని మాటలాడినఁ గార్యమేమి? పౌరుషబలముకంటె దైవబల మధికముగదా? వారి కెంతటి దైవసాహాయ్యమో కంటివే? దైవసాహాయ్యము లేకున్న వారికీనాఁడీశుభముఁ గలుగునే? ఇవ్విధంబున వారు తమలోఁ దాము దుఃఖించుచుఁ బురోచనునిం దిట్టుచు మొగములను వ్రేలాడ వేసికొనుచు హాస్తినాపురమునకుఁ బోయిరి. విదురుం డంతకు మున్న ద్రుపదుపుత్త్రి నర్జునుండు

గెలిచికొనుటయు, దానిమూలమునఁ బాంచాలాదు లగు శౌర్యవంతులు వారి కనురక్తులగుటయు, ధృతరాష్ట్రపుత్త్రులును గర్ణశకునులును నిరుత్సాహులై దైన్యమును బోషించుమోములతో నూరుసేరుటయుఁ దెలిసి యంతరంగమున సంతసించి యావద్వృత్తాంతంబును ధృతరాష్ట్రునకు నివేదింపఁగా ధృతరాష్ట్రుండు పొరపాటునఁ బాంచాలి దుర్యోధనుని స్వయంవరకాలమున వరించె నని తలంచి మిక్కిలి యానందపరవశుఁడై యప్పాంచాలికి దన నగరునందుండి వివిధరత్నాభరణములను వెలపొడుగు చీనాంబరములను బంపు మని యాజ్ఞాపించి వెంటనే ద్రౌపదిని హస్తినాపురమునకుఁ దోడ్తెమ్మని నియోగించెను. అంత విదురుండు రాజు భ్రమపడెనని తెలిసి పాంచాలి యర్జునుని స్వయంవరమున వరించెను. పాండవులేవురును బాంచాలిని ధర్మపత్నినిగాఁ బెండ్లాడిరి అని వివరముగాఁ జెప్పెను. అప్పు డాంబికేయుం డావృత్తాంతమంతయును విదురువలన స్పష్టముగా నెఱింగి యతనితో నిట్లనియె. 'నాకు దుర్యోధనాదులకంటె యుధిష్ఠిరాదులపైఁ బ్రీతి మెండు. వారు బాహుబలసంపన్నులు. వృద్ధసేవులు. యుక్తాయుక్త వివేకపరులు. ఇంగితము నెఱింగినవారలు. అట్టివారిప్పుడు ద్రుపదాదులతో సంబంధబాంధవములఁ జేసి బలవంతులైరి. వారెవ్విధముననో క్షేమంబున భూలోకమునం దున్నవా రని మిగుల సంతసించితి' నని చెప్పఁగా విని విదురుఁడు 'భూపాలా! యిట్టి నిండుమనస్సు నీకు సర్వదా యుండవలయు' నని చెప్పి తనయింటి కరిగెను.

## దుర్యోధనుఁడు తండ్రితో నాలోచించుట

ధృతరాష్ట్రుఁ డీరీతిగా విదురునితోఁ బలుకుచుండఁగా విని దుర్యోధనుఁడు తండ్రిని సమీపించి యిట్లనియె. తండ్రీ! ఈవిదురుండు సదా మీయొద్దనే యుండును. అతం డొకనిముసమైనను మిమ్ము నెడఁ బాయఁడు. కావునఁ గడుపులో నుండు నెట్టి మాటనైనను జెప్పుకొనక వెఱచియుండును. ఇప్పు డెట్లో యాతండు లేనిసమయము నా కబ్బెఁగా నావ్యథను వినిపించెదను. విదురుఁడు నీయొద్ద నుండునపుడు నాకు శత్రువులగు పాండవపుత్త్రుల నుతించుచుండును. నీవును నాతనివచనముల నూఁకొనుచుందువు. ఇది ధర్మమగునా? ఎవ్విధముననైనను శత్రువులను బలహీనులఁగఁ జేయుటయేకదా మనకుఁ గర్తవ్యము. కాఁబట్టి మనకు హాని

కాకుండ నిప్పటికిఁ దగినయాలోచనమును విచారించుదము. అనఁగాఁ గొడుకునకుఁ దండ్రి యిట్లనియె. కుమారా! నేను లోలోన నీయట్లే యాలోచించుచుందును. మన మిరువురమును భిన్నాభిప్రాయములు గల వారలము కానేరము. అయినను విదురునిమాటల కెదురాడ లేక యతఁడు చెప్పుచుండు దాని నూఁకొనుచుందును. వానిముందఱఁ బాండవులను బొగడుచుండుదును. నీకును గర్ణునకును దోఁచెడు నాలోచనలను జెప్పుము. అనఁగాఁ దండ్రికిఁ గొడు కిట్లనియె. పాండవు లీవివాహసంబంధముచేత బలవంతు లైరి. ద్రుపదుఁడు ధనసంపన్నుఁడు, పౌరుషబలములు రెండును గలవాఁడు. అట్టివానియండ వీరి కిప్పుడు గలిగినది. కావున నిప్పుడు నిపుణులును, దాంత్రికులును నగు మాయావులను బాంచాలపురమునకుఁ బంపి ద్రుపదునకుఁ బాండవులకును, ధృష్టద్యుమ్నునకుఁ బాండవులకును బరస్పరకలహములను జనింపఁ జేసి పాంచాలపురమునందుండి పాండవులను వెడలఁగొట్టున ట్లుపాయములు పన్నవలయును. ద్రుపదుఁడును వానిబంధువులును మంత్రులును నందఱును బాండవులను ద్యజించునట్లు తంత్రములఁ గావింపవలయును.

మఱియు ద్రౌపది యనేక భర్తృక గావున దానికిఁ దనభర్తలపైఁ బ్రీత్యనురాగములు నశించునట్లు గావించుట మిక్కిలి సులభమైన కార్యము. అక్కార్యమునకు వలసినమోసకత్తెలను బంపి ద్రౌపదికి భర్తలపై ద్వేషము జనింపఁజేయవలయును. వారికి హస్తినాపురము మరలఁ జేరవలయునని యాశ యుండును. ఆయాశను నెఱవేర్చుట కిప్పుడు వారికి సహాయసంపద యేర్పడినది. కావున వారియొద్దకుఁ గొందఱఁ బంపి హస్తినాపురవాస మసహ్యమని చెప్పుచుండునట్లు చేయవలయును. అట్లును గాదేని రహస్యముగ భీమసేనుని వధింతము. ఆయైదుగురిలో వాఁడొక్కండే బలపరాక్రమశాలి. భీమసేనుఁడు సహాయుఁడుగా నర్జునుండు సమరోన్ముఖుం డగునేని యింకను వేఱ చెప్పనేల? అగ్నికి వాయువు సహాయపడినట్లే యగును. భీమసేనుండు లేనిచో నర్జునుని యస్త్రవిద్యా నైపుణ్యము కర్ణునిముందు పనికిరాదు. భీముండు చంపఁబడెనేని యానలువు రన్నదమ్ములును మనకు దాసులై యుండెదరు. అప్పుడు వారలను మనము యుక్తితో నిచ్చోటికిఁ బిలిపించి సులభముగా మనము వారిని నిగ్రహింప

వచ్చును. అని చెప్పి ధృతరాష్ట్రుని సమీపించియున్న కర్ణుని మొగము వంక చూచి యీయుపాయములలో నేది కర్తవ్యమో యాలోచించి చెప్పు మనఁగా నప్పుడు కర్ణుం డిట్లనెను. నీవు చెప్పిన యుపాయములలో నో దుర్యోధనా! యొక్కటియైనను నాకుం జూడఁ గర్తవ్యముగాఁ దోఁపదు. ఈయుపాయము లెవ్వియును వారికి హాని గలిగింప నేరవు. ద్రుపదుండు ధర్మపరాయణుండు. అట్టివానికి ధన మొసంగి మహా శూరులును ధర్మాసక్తులును నగు పాండవుల విడువు మన్నచో నది సాగనేరదు. మఱియు ద్రౌపదికిని బాండవులకును విరోధమును బుట్టింప వలయు నంటివి. ఇదియును సాగనిపని. ఎట్లంటేని పంచపాండవు లద్దేవి యందు సమానురాగులై యున్నవారు. ఇంతేకాక వారు దరిద్రులై యుండునపుడే వారి శౌర్యధైర్యగాంభీర్యములను జూచి వరించిన పాంచాలరాజకన్యక యిప్పుడు వారి మంచి వేషములను, శాంతమనస్సును జూచుచుండుం గావున వారి నెంతమాత్రమును ద్యజింపదు. మఱియు స్త్రీలకుఁ బెక్కండ్రు పతులభోగము పరమానందదాయకము. తమ తండ్రితాతలనాటి హాస్తినాపురరాజ్యముపై వారి కప్రియము పుట్టించునట్లు వేఁగువారిచేతఁ జెప్పింపవలయు నంటివి. ఈమాటలకు మోసపోవునంతటి వెట్టివారే వారలు? రహస్యముగా యుక్తులు పన్ని భీమసేనుని వధింపఁ దలంచితివి. మున్నెన్ని నీవు చేసినను నవి యన్నియు విఫలములైనవి నీ వెఱుంగవా? కావున నిట్టు గూఢముగ భీమసేనుం జంపలేము. చతురుపాయములలో సామదానభేదముల వలన వారిని జీలదీసి రూపుమాయింపలేము. మన మిప్పుడు వారి కంటె సైన్యబలము గలిగి బలవంతులమై యున్నాము. వారికి యాదవులు గాని, చైద్యులు గాని, మాగధులు గాని తోడ్పడుటకు మున్నే వారిపై దండెత్తిపోయి వారితో ముఖాముఖిగఁ బోరాడి వారిని నిర్జించుట కర్తవ్యము. ఏల యంటివేని శ్రీకృష్ణుఁడు వారికి మేనమామ కుమారుఁడు. వాఁడు యాదవసేనల సమకూర్చుకొని వారికి బాసటయై నిలిచెనా యప్పుడు వారి నోడించుట మన కసాధ్య మగును. ఆవసుదేవ సుతుఁడు వారివిషయమునఁ దనసర్వధనప్రాణములను భోగములను త్యజించువాఁ డని మన మెఱుంగనిది కాదు. చేదిపతి శిశుపాలుఁడు

హారికిఁ బిన్నతల్లి కుమారుఁడు. వాఁడును మాగధుఁడైన జరాసంధుఁడును వారికి సాయపడుదు రనుట కెంతమాత్రము సంశయము లేదు. ఇవ్విధమున వార లందఱ కీవర్తమానము తెలిసి యందఱును గలిసికొని యేక ముఖు లగుటకుఁ బూర్వమే మనము వారిని గయ్యమునకుఁ జీఱి సమరమున నందఱను బాహాటముగ వధించుట కర్తవ్యము. మఱియు నిది ధర్మమార్గము. శౌర్యమును జూపి కాదే భరతుండు రాజ్యమును సాధించినవాఁ డయ్యెను. మహేంద్రుండు బలవిక్రమములవలననే కదా త్రైలోక్యరాజ్యము నధిగమించెను. శూరులు శౌర్యమును జూపియే కదా శత్రుసంహారమును జేయుదురు. పరాక్రమముచే సాధించిన రాజ్యము ప్రశంసింపఁ దగినది. కావున యుద్ధోపాయముకంటె నుపాయాంతరము నా కొండు కానరా దనెను. అంత రాధేయుపలుకుల నన్నింటిని ధృతరాష్ట్రుండు విని, 'సకలాస్త్రవేదియు శూరుండు నైన రాధేయునకు నీవచనము లొప్పును. ఇ వన్నియు మన కాప్తులగు భీష్మ ద్రోణ విదురులతోఁ జెప్పి లెస్సఁగా నాలోచింతము. వారితో నాలోచించి తెంపునకుఁ బూనుకొంద' మని వారిని రావించి వారి కీభావము నంతయు వెల్లడించెను.

## భీష్మద్రోణులు దుర్యోధనునకు హితము సెప్పుట

అంత భీష్ముం డిట్లనియె. నాకుఁ బాండవులు ధార్తరాష్ట్రులును నొక్కరూప. వీరి కీరాజ్యము పితృపితామహాగతమైనది. ఆకారణమున నీరాజ్యమునఁ బాండవులు సగపా లనుభవించుట కర్హులు. వారల నిప్పుడిచ్చోటికి రప్పించి వారి సగపాలును బంచి వారివశము చేయుట సద్ధర్మము. అట్లు చేయ రేని మీ రెల్లరు నపకీర్తిపా లగుదురు. ఇది నిశ్చయము. దుర్యోధనా! రాజులు తమకీర్తిని గాపాడుకొనవలయును. వారి కది ముఖ్యధర్మము. అపకీర్తిపాలైనవాఁడు బ్రదికియుండియును జచ్చినవాఁడే యగును. ఇట్లు పెద్దలు వక్కాణించెదరు. మీరు వారి కెన్ని దౌష్ట్యము లొనరించినను నవి యెవ్వియును వారికి హానిఁ గలిగింపలేక పోయెను. అందు వారు చెడరు. లక్కయిండ్లలోఁ గాలి చచ్చినవాఁ డొక్క పురోచనుఁడే సుమా? పురోచనుఁడు లక్కయిండ్లఁ గాల్చి తాను జచ్చె నను నింద వానిపై నెవరును మోపరు.

అది పురోచనదోషముగా నెవరును దలంపరు. అన్నిటిని నాలోచించి విశాలమనస్కుఁడవై పాండవులం బిలిపించి వారి యర్ధరాజ్యమును వారి కొసంగి కీర్తిఁ బొందుము. కీర్తిని గాపాడుకొనుము. కీర్తియే పరమమైనబలము. ఎంతకాల మొకనికీర్తి లోకములయం దుండునో యంతకాల మామహాపురుషుఁడు చచ్చియును బ్రదికియున్నవాఁడే. నష్టమైన కీర్తిగలవాఁడు బ్రదికియుండియును జచ్చినవాఁడే యగు. కుంతి తనపుత్త్రులందఱితో లక్కయింట్లయందుఁ గాల్పఁబడి నశించె నన్నది మొదలు నా కెవరిముఖమును జూచుట యసహ్యమైనది. భీష్మాభివర్ధితమైన వంశమువారు, పరస్పరాసూయాపరాయణులై యొకరికొక రిట్లు ద్రోహముఁజేసి, మోసమునఁ జంపి రనుమాట వినుటకంటెఁ గష్టతరమైనది వేఱొం డుండునే? కురుకులోచితచిరంతనధర్మమును సుస్థిరముగ స్థాపింపుము. సత్కీర్తిని బొందుము. ఇప్పుడు వారు జీవించి యున్నారని వినుటచే నిన్నాపాదించినకిల్బిషము నశించినది. వజ్రపాణియైనను భాగిత[illegible]కుఁ బిత్ర్యమైనయంశమును బంచి యీయవలయును. పాండవులను దర్శించుట నాకుఁ బరమసమ్మతము. వారి కర్ధరాజ్య మొసంగి లోకమున సత్కీర్తిఁ గాంచి సుఖి వగుము. అధర్మమున నార్జించినరాజ్యము నేలుచుండునప్పుడు మనశ్శాంతి యుండనేరదు. ధర్మయుతమైన కార్య మొనర్చుట నాకుఁ బ్రియమును, ధర్మ్యమును. మీకు క్షేమమును గోరుదునేని పాండవులను వేగమె రప్పించి కౌరవరాజ్యమున వారిపిత్ర్యాంశమైన సాబా లొసంగునది. అని చెప్పఁగా ద్రోణుం డిట్లనియె. ఎవరైనను హితముఁ జెప్పు మని యడిగినచో నాయుపదేశింపఁబడు హితము ధర్మార్థకామములను త్రివర్గమును, కీర్తిని సమకూర్చునదిగా నుండవలయును. కావున నాకుఁ దోఁచిన హితము నుడివెద. మీకుఁ బితామహుండైన భీష్ముఁ డానతిచ్చినతీరునఁ బాండవులఁ దోడ్తెచ్చి వారి యర్ధరాజ్యమును వారి కొసంగుట ముఖ్యము. కావునఁ బ్రస్తుతము మీరు ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదిపాంచాలకుమారులకుఁ గుంతీమహాదేవికిఁ బాండుపుత్త్రులకు ద్రౌపదికిఁ బ్రత్యేకప్రత్యేకముగ నుత్తమవస్త్రములను నూతనకనకాభరణములను నిచ్చి దుశ్శాసనునిఁగాని వికర్ణునిఁగాని కాంపిల్యపురమునకుం బంపుము. వారచ్చోటికిఁ బోయి వారలతోఁ బ్రియవచనము లాడి

వారి యోగక్షేమములనరసి యందుఁ గొన్నినాళ్లుండి వారికి మనస్సమ
ధానముగఁ దగుమాటలాడి వారి నెవ్విధముననైనను హస్తిపురమ
నకుఁ దోడ్తెమ్మనుము. పిదపఁ బ్రస్తుతరాజ్యమున సగము ధర్మజు
మునఁ బంచి యీయవలయును. నీవు పాంచాలపురమునకుఁ బంపువా
ద్రుపదునిబంధుత్వమును గొనియాడవలయును. ద్రుపదుని మెప్పించి వా
నెలవుపైఁ బాండవులను ద్రౌపదిని హస్తినాపురమునకుఁ దోడ్తేరవలయు
ఇది కర్తవ్యమనఁగా ధృతరాష్ట్రునకుఁ గర్ణుం డిట్లనియె. నరేంద్రా! వీఁడె
కాలమును మీరాజ్యసంపదయందు వలసినంతఁ గొని తినుచు సుఖవ
మఱిఁగియున్న యీముదుసళ్లిరువురును సదా శత్రువులను శ్లాఘించు
యందే కాలమును వినియోగించెదరు. పరహితమును గోరుచు నీయ
వృద్ధి కాటంకపఱచుచు మాటలాడుచుండెదరు. శత్రువులకు మేఁ
సేయు సూచనలను, మీకు హానిగలుగు నాలోచనలను మిక్కిలి కపట
పాయమునఁ జెప్పుచు నహితమును హితమువలె బోధించెదరు. వీ
యాలోచనలు దురాలోచనలు, గ్రహింపఁదగనివి. వీరియాలోచన
మేరకు వర్తిల్లినచో శుభములు పొందకున్నను నశుభములు మాత్రమ
కలుగక మానవు. మఱియు శుభాశుభములు సంభవించుట దైవాధీనము
దీని కొక యితిహాసము గలదు. చెప్పెద నాకర్ణింపుఁడు. తొల్లి
మగధదేశము నంబువీచుఁ డనురా జేలుచుండెను. ఈతని రాజధాని రా
గృహము. కొంతకాలమున కీతఁడు సర్వావయవములు విచిన్నములై
కాఁగా రాజ్యభారమును నిర్వహింపలేక కార్యతంత్రమునంతయుఁ దన
మంత్రియగు మహాకర్ణి యనువానిస్వాధీనము చేసెను. అంత నామంత్రి
విచ్చలవిడిగా రాజధనమును స్వోపయోగమున విశేషముగా వెచ్చిం
చుచు ధర్మమునఁ బ్రజల నేలఁ డయ్యెను. మఱియు నివ్విధమునఁ దాను
మహాధనికుఁడై ధనమదమును రాజ్యమును సైతము తా నపహరించికొన
యత్నముచేసెను. కాని యాయంబువీచునికి దైవబల మధికముగా
నుండుటచే మహాకర్ణియాటలు సాగవయ్యెను. కావున దైవబలము గల
మనకు వీ రెట్లెట్లు మాటలాడినను మన శత్రువుల నెంత శ్లాఘించు
చుండినను రాజ్యము మనయందే స్థిరమై వెలసియున్నది. వీ రిప్పుడు
మనకు హితమును బోధించి రని తలఁపరాదు. ఇందుల కిప్పుడు మహా

కర్ణవృత్తాంతమును మీకుఁ జెప్పితిని గదా! యనుచుండఁగనే ద్రోణుండు కర్ణున కి ట్లనియె. సూతపుత్త్రా! నీ వేతలంపున నీ యితిహాసమును వినిపించినదియు మే మెఱింగితిమి. దురాత్ముండ వగు నీవు పాండవుల కెగ్గు చేయఁబూని మాకు దోషము నారోపించెదవు. మాకంటె నిప్పు డీకౌరవులకు విశేషము నీవ కదా హితము కోరుచుండువాఁడవు. పెక్కు మాట లేల? మాయాలోచనమేరకు రాజు ప్రస్తుతము నడువనిచోఁ దప్పక యిడుమలఁగుడుచును. పిదప నిది వృథాశోకమునకు హేతువగును. కౌరవులు చెడుదు రనుచుండఁగా ధృతరాష్ట్రునకుఁ గార్యాలోచన పరుండును నీతియుతుండునైన విదురుండిట్లనియె. మహారాజా, మేమందఱ మెన్ని హితవచనములను జెప్పినను నీవు విననిచో, మేమేమి చేయఁ గలము? కురుపితామహుండైన భీష్ముండు ప్రియమును హితమును బోధించెను. ద్రోణుఁడు నవ్విధముననే చెప్పెను. వీరు చెప్పిన వన్నియు నహిత ములని రాధాసుతుం డనుచున్నవాఁడు. ఎవ రెన్ని మాటలాడినను నీకు భీష్మ ద్రోణులకంటె హితబోధము చేయువా రన్యులుండరు. ఈపురుషసింహు లిరువురును మిక్కిలి మేధావంతులు, విద్యావంతులు వయోవృద్ధులు. మఱియును వీ రిరువురును మీకును బాండుపుత్త్రులకును సమముగాఁ గూర్చువారు. మఱియు దశరథరామగయులంబోలె సత్యనిరతులు, ధర్మ పరాయణులు. ఇట్టిమహనీయులు నీకుఁ గీడు రోయుదురే? ఇదివఱ కెన్నఁడైనను నీ కపకృతిం జేసిరే? ఇరువురును బ్రజ్ఞాశాలురు. పురుషశ్రేష్ఠులు. వీరియాలోచనమునఁ గపటము లేదు. పక్షపాతబుద్ధితో నెన్నఁడును వర్తించినవారు కారు. నీకును దుర్యోధనాదు లగు పుత్త్రులెట్లో పాండవులు నట్లే పుత్త్రులుగారా? దుర్యోధనాదులు నీపుత్త్రులును, పాండవులు పాండురాజుపుత్త్రులగుటచే నీకు నీపుత్త్రులయెడఁ బ్రీతి మెండుగా నుండునని భావించి నీయెదుట నిచ్చకపుమాటల నాడువారి మాటలను హితముగాఁ దలంపకుము. వా రాడునవి నీకు హితములు గావు. అట్లే యాచరింతువేని యచిరకాలముననే నీకులమునకు ముప్పు వాటిల్లుట నిస్సంశయము. ఇంకను జెప్పెద నాకర్ణింపుము. అంతరముల నాలోచింపక తెగఁబడి చేయుకార్యము శ్రేయస్సును గలిగింపదు. వీరియాలోచనమున నీవు వర్తించుట నీకు శ్రేయస్కర మగును. నీ వేమని తల

పోవుచున్నవో మేము చెప్పజాలము. అయిన నిప్పుడు ప్రస్తావవశమునఁ జెప్పవలసినదానిని జెప్పెదను. పాండవులు మహాబలసంపన్నులు. వారిలో నొక్కొక్కరిని ననేకసద్గుణము లాశ్రయించియున్నవి. అర్జునుని దివ్యాస్త్రకోవిదత్వమున వానిని మహేంద్రుండును మార్కొని పోఁరాడలేఁడు. భీమసేనుఁడు నాగాయుతబలుండు. వీ రిరువురు సకల నీతిశాస్త్రముల నెఱింగి ధర్మపరాయణుఁడును, సత్యవచనుఁడును, శాంతమూర్తియును, ధైర్యశాలియుఁ, బరాక్రమవంతుఁడును నగుధర్మపుత్త్రుని కనుసన్న మెలఁగుచుందురు కవలును సమరగోప్యములందలంతులుగారు. వీ రందఱును నొక్కరూపై యామహాత్ముఁ డగు ధర్మనందనుఁడు నడుపఁగా వానిమాట నెంతమాత్రము జవదాఁటక నడచుచుందురు. అట్టి నిశ్చితప్రజ్ఞాశాలుర నని మార్కొని గెలుచుట గలదే ? అదియునుంగాక బలపరాక్రమసంపన్ను లగు బలరామకృష్ణులు వారికిఁ దోడునీడలై వర్తించెదరు. పాండవులకు వారు సదా హితముఁ గోరుచుందురు. జగదీశ్వరుం డగు జనార్దనుఁడే వారి పక్షమున నుండఁగా వారిని నీవు గెలువ నగునే ? యుద్ధమునం దపరాజితుఁ డగు సాత్యకి మున్నగు యదుప్రవరులు వారిని వెన్నంటి వర్తింతురు. వృష్ణిభోజులు పరాక్రమవంతులని వేఱ చెప్పవలయునే. వీరెల్లరు శ్రీకృష్ణునాజ్ఞ వర్తించువారు. శ్రీకృష్ణుం డున్నపక్షమున వీరెల్ల రుందురు. శ్రీకృష్ణమూర్తి యేపక్షమున నుండునో యాపక్షమున గెలు పవశ్యమగును. జయ మాపక్షమున సిద్ధమని నమ్ముము. మఱియుఁ గౌరవరాజ్యమునకు విరోధియు నతిశూరుండు నైన ద్రుపదుండు సపుత్త్రకుండై పాండవులకు సఖ్యసంబంధములచే వారిపక్షమున నవలంబించుటకు సంశయమే ? కావున విక్రమమునఁ బాండవుల నోర్వలేము. సామము నుపయోగించి వారియెడఁ బ్రియము నాచరింపుము. సామమున సాధింపఁదగినది దండముచే నసాధ్య మగును. లక్కయిండ్లలో వారిని దహింపఁబూనితి వని నీ కపకీర్తి కలిగియున్నది. ఆబురదను వారిని బ్రసన్నులం జేసి వారి యనుగ్రహపునీటఁ గడిగికొని గతకీర్తిని మఱలం బొందుము. హస్తినాపురములోని ప్రజ లెల్లరును వారిని గనులారఁ జూడవలయు నని యున్నవారు. అట్టి బలపరాక్రమశాలురను బ్రజలకుఁ జూపి వారియానందమునకు హేతుభూతుఁడ

వగును. ప్రియముతోఁ బాండవులను రప్పించి వారి పిత్రుధనమగు
కౌరవరాజ్యమున సగము నొసంగి ధన్యుండ వగుము. దురాత్ము లగు
కర్ణశకునిదుర్యోధనులవచనముల వినవలదు. దానం గార్యము చెడును.
దుర్యోధనునిమిత్తమున వంశనాశ మగు నని మున్ను చెప్పియుంటిం
గాదే? కర్తవ్యము నాచరించి కీర్తిఁ బొందుము. అనఁగా విదురునకు ధృత
రాష్ట్రుం డి ట్లనియె. విద్వాంసుఁడైన భీష్ముఁడును, భగవత్స్వరూపుఁ
డును ఋషియును నైన ద్రోణుండును నీవును నాకు శ్రేష్ఠమైనదియు,
సత్యమయినదియు నగు హితమును బోధించితిరి. నాకుఁ బాండుపుత్త్రు
లును, నాపుత్త్రులును సమానులే? ఓవిదురుఁడా! ఆసజ్జనులను వారితల్లి
తోడ నిచ్చోటికి నీవు పోయి తోడ్కొని రమ్ము. వారితోఁగూడ దేవ
రూపిణి యగు కృష్ణను సైతము తోడితెమ్ము. మహాభాగ్యమువలన వా
రందఱు లక్కయిండ్లయందు మడియక బ్రదికిరి. పాంచాలియు వారికి
భార్యయగుట మహాభాగ్యము. ఇట్లగుటచేత నాదుఃఖము నశించినది
యనెను. అంత ధృతరాష్ట్రానుమతిం గొని విదురుండు ననేక రత్నాభరణ
ములను మేలైనవస్త్రములను వివిధములైన యుపాయనములనుం గొని
పాంచాలనగరమున కేగెను. అచ్చోట ధృష్టద్యుమ్నాదిసుతసమేతుండగు
ద్రుపదుని, వాసుదేవసహితులగు పాండవులను దగుచొప్పున నారసి
యన్యోన్యక్షేమసమాచారంబులఁ దెలిసి, ధృతరాష్ట్రుండు పాండవులకుఁ
బంపిన యమూల్యవస్త్రాభరణాదులను వారి కొసంగి కుంతీకృష్ణలకుఁ
బ్రత్యేకోపాయనముల నంతఃపురంబునకుఁ బంపి పాండవులను బ్రియ
పూర్వకముగ నాలింగనాదుల సంతసింపఁజేసి ధృతరాష్ట్రునకు మాఱుగఁ
బ్రత్యేకముగ క్షేమముల నారసి, కౌరవులచేఁ బంపబడిన ధృష్టద్యు
మ్నాదులకానుకలను వారల కొసంగి వినయముతో మంత్రివర్గముతోఁ
గూడుకొనియుండు ద్రుపదమహారాజు మొగంబై వారలందఱితో నిట్లనియె.
మహారాజా! పాంచాలపతీ! వినుము. ఆంబికేయుండును గాంగేయుం
డును నీతోడిబంధుత్వమునకు మిక్కిలియానందించి మిమ్మును గొనియాడు
చు మీ క్షేమముల నారయు నిమిత్తము నన్నీపురమునకుఁ బంపిరి. నీ
ప్రియసఖుండును మహావిద్వాంసుఁడును నగు భారద్వాజుఁడైన ద్రోణా
చార్యుండు తనకు మాఱుగా నిన్ను నన్నుఁ గౌగిలించి మీకుశలమును

నడుగు మనెను. కౌరవుల కందఱకును మీతోఁ గలిగిన యీసంబంధ ముచేఁ దాము ధన్యులమైతిమని దలంచుచున్నవారు. పాంచాలి పాండుపుత్త్రులకు భార్యయై, మీతోడి సంబంధము వారికి రాజ్యలాభమున కంటె నానందమును గలిగించియున్నది. మఱియుఁ బాండవులు హస్తిపురమును వదలి బహుకాల మయ్యెను. కౌరవులును నగరవాసులును నందఱును వీరిని జూడవలయు నని యపేక్షతో నున్నవారు. పాంచాలిని సకలాంతఃపురస్త్రీలును జూడఁగోర్కి గల్గియున్నవారు. కావున ధృతరాష్ట్రమహారాజు కృష్ణాకుంతీసమేతు లగు పాండవులను నీయనుమతినిఁ బడసి నన్ను హస్తిపురమునకుఁ దోడ్తెమ్మని యాజ్ఞాపించెను. నీ కీ కార్య మిష్ట మగునేని యీసంతోషవార్తను ధృతరాష్ట్రున కిపుడే చెప్పి పంపెదను. సర్వజనుల కానందము పొడమునట్లు వీరిని హస్తిపురమునకుఁ బంపుట కానతిమ్ము. అనఁగా విదురునకు ద్రుపదుం డిట్లనియె. మహనీయా ! కౌరవులతోడి బంధుత్వమునకుఁ బరమానందమునఁ దేలియాడుచున్నవాఁడను. ధృతరాష్ట్రమహారాజునాజ్ఞ మేరకు నీవంటిదూరాలోచనపరుఁ డీకార్యమునకు రాఁగా వేఱొండు జరుగునే ? అయినను, నిందులకు బలరామకృష్ణు లేమనెదరో ? వీరు సర్వకాలములయందును బాండవులకు హితముఁ గోరుచుందురు. మఱియుఁ బాండవులును మహాప్రాజ్ఞులు, ధర్మనిరతులు, పురుషసింహులు. వారినిశ్చయ మెట్టిదియో యనుచుండఁగా ద్రుపదునకు యుధిష్ఠిరుం డిట్లనియె. మహారాజా ! మే మందరము భవదధీనులము. మీరాలోచించి మాకుఁ గర్తవ్యము నెట్లు నిర్ణయింతురో యట్లు నడుచుకొనువారము. అనఁగా నాసభాసదులకుఁ జనార్దనుం డిట్లనియె. ఇప్పుడు విదురుసందేశమును మన మంగీకరించి పాండవులను హస్తిపురమునకుఁ బంపు టుచితము. మాన్యుండును బాండవుల మేలు నన్నివిధములఁగోరువాఁడు నగు ద్రుపదునాలోచన మెట్టిదియో యనఁగా నాపాంచాలపతి యప్పు డిట్లనియె. పాండుపుత్త్రులు నా కిప్పుడు సంబంధముచేత ముఖ్యులైరి. కాని యీజగన్నాథునకు వారు చిన్ననాఁటం గోలె ముఖ్యులు. వీ రెల్లర క్షేమములను యుధిష్ఠిరునకంటె దవ్వులనుండి యారయుచుండును. కావున కృష్ణానుమతంబె తన కభిమతం బని యొఱుకపఱచి ద్రుపదుం డుండెను. అంత ద్రుపదుం డనుమతింపఁగాఁ

పాండవులు కృష్ణాకుంతీసమేతులయి రామకృష్ణులు వెంటరాఁగా విదురునితో హస్తిపురమునకుఁ బ్రయాణమైరి. అంతకు మున్న వీరిరాకను విదురుఁ డంపిన దూతమూలమున ధృతరాష్ట్రుం డెఱింగి వీరి నెదుర్కొనుటకు వికర్ణచిత్రసేనులను ద్రోణకృపాచార్యులను సంతోషముతో నంపెను. ఎదురువచ్చినవారిం బాండవులు కలిసికొని పరమానందముతో హస్తిపురమునఁ బ్రవేశించుచుండఁగాఁ బౌరులు వారిం జూచి యిట్లనిరి. ఈపురము వీరిరాక కనియే ధృతరాష్ట్రుం డి ట్లలంకరించెను. పురమందలి ప్రజల నెల్లఁ దనబిడ్డలవలె రక్షించు పాండురాజు పురప్రవేశము గావించుచున ట్లీధర్మాత్ముం డగు యుధిష్ఠిరుండు తమ్ములతోఁ గూడి ధర్మపత్నియగు ద్రౌపదిని వెంటఁబెట్టుకొని కుంతీదేవి తమ్మనుగమింపఁగా హస్తినాపురమును జొచ్చుచున్నవాఁడు. ఈవీరిపురప్రవేశోత్సవదినమునకంటె మనకు సంతోషదినంబు వేఱొం డుండునా? మన మొనర్చినదానములు తపములు హోమములు సత్ఫలముల నొసంగు నేని యీధర్మాత్ముండైనయుధిష్ఠిరుండు చిరకాలము మనకుఁ బ్రభువై యీపురమును రాజ్యమును నేలుఁగాక యనిరి. అంతఁ బాండవులు పౌరజనులదీవనలిట్లు గొనుచు నగరు ప్రవేశించి ధృతరాష్ట్రునకును భీష్మునకును మఱియుం గల పెద్దలకును మ్రొక్కులిడి వారిదీవనలను బొంది సుఖులై యుండిరి. అట్లుండ నొక్కనాఁడు ధృతరాష్ట్రుండు పాండవులను బిలిచి లోకసాక్షియగు శ్రీవాసుదేవు సమక్షమున నిట్లనియె. పుత్త్రులారా! మీకును దుర్యోధనాదులకును విగ్రహము కలుగకుండ నీకౌరవరాజ్యమున సగపాలు మీ కిప్పు డొసంగుచున్నవాఁడ. మీ రిప్పటినుండి ఖాండవప్రస్థమున నుండి సుఖమున మీభాగము నేలుచుండుఁడు. మీరు సోదరులొక్కటిగా నంద పోయి వసింపుఁడు. అని చెప్పఁగా యుధిష్ఠిరుండు వల్లె యని యందలిపెద్దలకు నమస్కరించి తమ్ములను భార్యను వెంటఁబెట్టుకొని తమకు రామకృష్ణులు సాయపడఁగా ఖాండవప్రస్థ మను ఘోరవనమును జేరిరి. అంత వాసుదేవుఁడు మహేంద్రునిఁ దలంచెను. మహేంద్రుండు వీరలతలం పెఱింగి విశ్వకర్మం బంచె.

### పాండవు లింద్రప్రస్థపురముఁ జేరుట

ఆదేవశిల్పి వేదవ్యాసుండును, పాండవులపురోహితుం డైన

ధౌమ్యుఁడు మున్నగు బ్రాహ్మణోత్తములును సూత్రమునుబట్టి శాంతిక విధులను జేయఁగా మిక్కిలి ప్రశస్తమైన రమణీయస్థలమునందుఁ బట్టణము నిర్మింపఁబడెను. అది యెత్తైనచుట్టుగోడలతో విరాజిల్లుచు, నిగనిగని తెల్లసున్నపుగారలతో నుండుప్రాసాదములతో వెలయుచు, నాప్రాసాద శిఖరముల రేఖలకాంతులు మిక్కిలి ప్రకాశమానములై నలుదెసల వ్యాపించి వానిసమీపమున నాకాశసముద్రమునందుఁ బఱువులెత్తుచున్న మేఘములలో నుండు మెఱపులసమూహమును బరిహసించుచున్నవో యనున ట్లుండెను. మఱియుఁ బ్రాకారపుగోడలచుట్టును బాతాళ మను నగడ్త వలయితంబై యుండెను. మఱియు నప్పురద్వారము గరుడాకార విరాజితంబై వెలసెను. ఆపట్టణము నానావిధాయుధశాలలును, భాండాగారములును, నెత్తైనగోడలుం గలిగి చిత్రవిచిత్రపునిర్మాణములచే నలరారుచుండు రాజాస్థానములును, విశాలములై నవీథులును, ననేకదేవాలయములునుగలిగి వెలయుచుండెను. మఱియు నప్పురవరంబు ననేకస్థలములందు రమణీయంబులైన యుద్యానవనములు సర్వకాలములయందు సర్వర్తుశోభాయమానంబులై జనాకర్షకంబులయి కన్నులకింపులయి వెలయ మహేంద్రునియమరావతింబోలె నింద్రప్రస్థ మనుపేర వెలసెను. అట్టిపట్టణ మధ్యమునందుఁ బాండవు లేవురును నివసించుట కొక్కవిస్తీర్ణ మైన నివేశనమునందు నగళ్లు నిర్మింపఁబడియెను. ఆపట్టణమునందు వాసము చేయునిమిత్తము సకల వేదశాస్త్రపారగు లగుబ్రాహ్మణోత్తములును, సర్వభాషల నెఱింగి క్రయవిక్రయములను విస్తారముగఁ జేయఁగలిగిన ధనదోపమానులగువైశ్యులును, బలుతెఱంగులగు శిల్పనైపుణ్యముగల శిల్పాచార్యులును, వినయవినమ్రులై శుశ్రూషాపరాయణులగు సచ్ఛూద్రులును నానాదేశములనుండి వచ్చి చేరిరి. ఆపురవరం బివ్విధమున నానాజనసంకీర్ణంబై రమణీయములైనయుద్యానవనములతో వెలయుచు, నాక్రీడావనములయం దామ్రామ్రాతకనీపాశోకాదిమహావృక్షములును, నారంగపనస నింబదాడిమీనారికేళాదిఫలవృక్షములును, నిత్యపుష్పోపేతములగు కరవీరపారిజాత నాగపున్నాగాదిశృంగారంపుఁ జెట్లును, సాలతాలతమాలవకుళాదిభూజములును సుపుష్పఫలభారములు గలిగి యచ్చోటిచూతవృక్షముల లేఁతచిగుళ్ళను మెక్కి మదించి పంచమస్వనంబుల విటీవిటులకు

విరహావేదనం గలిగించు పికములును, జెట్లయందలి దోరపండ్లను మెక్కి-
వీనుల కింపుగాఁ గూయుశారికాశుకమిథునంబులును, నాకసంబున మొగు
ళ్లావరింపఁగనే తమపింఛములను విప్పి నృత్యముఁ జేయుచు షడ్జస్వనం
బులఁ దమనాయిక లైన యాఁడునెమళ్ల నానందింపఁజేయుచుండు
జొట్టుపులుఁగులును, నాదర్శవిమలము లగు గృహములును, వివిధలతా
గృహములును,చిత్రగృహములును,గృతకాద్రులును,నిర్మలోదకములతో
నిండినవాపులును, సూర్యోదయ మగుచుండఁగనే వికసించి తమకెంజాయ
నలువైపుల నొంపారఁ బ్రసరింపఁజేయు పద్మములతో నిండిన సరో
వరములును నొప్పారుచుండ ధర్మపుత్త్రుండు తన జననీసోదరకళత్రము
లతోఁగూడి శృంగారంపుసౌధముల భూసురశుభాశీర్వాదనినదములును,
మంగళగీతాలాపంబులును, వందివైతాళికాదిజనస్తోత్రపాఠధ్వనులును
జెలంగ శుభముహూర్తమున నప్పురప్రవేశము గావించి ధర్మమార్గమున
రాజ్య మేలుచు, సుఖమున నుండఁగా నొక్కనాఁడు దేవకీనందనుండు
కుంతీనందనుల వీడ్కొని ద్వారవతికిం జనెను. అని చెప్పఁగా జనమే
జయుండు మిక్కిలి హర్షముతో విని యవ్వలి పాండవులవృత్తాంతమును,
బాండవులు దమకు ధర్మపత్ని యైన ద్రౌపదితో విరోధము లేక వర్తిం
చినవిధమును నడుగఁగా నక్కథకుం డాశ్రోత కిట్లనియె.

అవ్విధంబున నప్పాండవు లింద్రప్రస్థపురమును దమ యర్ధరాజ్య
మునకు రాజధానిగాఁ గొని బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనమును ధర్మ
మార్గమునఁ జేయుచుండఁగా వారిరాజ్యము నానాఁటఁ బెంపుసొంపారి
వర్ధిల్లుచుండెను. అట్లుండ నొక్కనాఁడు దేవముని నారదుం డాకస్మిక
ముగ నింద్రప్రస్థపురమునకు ధర్మతనయుం జూడనేతెంచెను. అంతట ధర్మ
తనయుం డాదేవర్షికిఁ దమ్ములుం దానును నెదురేగి దోడ్కొనివచ్చి
యర్హాసనమున నాసీనుం జేసి యర్ఘ్యపాద్యాదుల నర్చించి యందఱతో
సాష్టాంగనమస్కారము లాచరించి తన రాజ్యమంతయు నమ్మహర్షి యధీన
మని విన్నవించెను. అంత నాజగడాలమారిముని వారిసపర్యచేఁ బ్రీతుండై
వారలనందఱను సుఖాసీనులం జేయఁగా వా రంతిపురమున నున్న పాంచా
లినిరావించి యమ్మునివరునకు మ్రొక్కుమనఁగా నావరవర్ణినియు నట్లు
వినయమున నామునికి మ్రొక్కియుండె. అంత నారదుండు కృతాంజలియై

యున్న యాజ్ఞసేనిని దీవించి యంతిపురమున కంపి వృకోదరాదులగు పాండవులు వినుచుండఁగా యుధిష్ఠిరునితో నిట్లనెను. యుధిష్ఠిరా! మీా కేవురకును యాజ్ఞసేని యొక్కతె భార్యయై యున్నది. కావున దీని నిమిత్తమున మీాలో మీా కెంతమాత్రము విరోధము గలుగకుండ నొక్క నియమము నేర్పఱచుకొని యట్లు వర్తించుట యుత్తమము. అవ్విధమున సంకేతప్రకారము నడతురేని మీాకు సౌహార్దము పెంపొందును. ఈవిషయమునం దెట్టి స్నేహితులకును స్పర్ధ కలుగుట సుప్రసిద్ధముగాదే? పూర్వమున నిట్లే సుందోపసుందు లనువా రిరువు రన్నయుం దమ్ముం డును సర్వకాలసర్వావస్థలయందు మిాఁదుమిక్కిలి భోజనాసనశయన రాజ్యభోగాదులందు నొక్కటిగా వర్తించుచుండిరి. అట్టివారు తిలో త్తమ యను సుందరాంగినిమిత్తమునఁ గామపరతంత్రులై యొకరి నొకరు సంశయించి తుదకు నొండొరులతోఁ బోట్లాడి చచ్చి రనఁగా విని ధర్మ తనయుం డో ఋషివర్యా! సుందోపసుందు లెవ్వరు? తిలోత్తమ యెవ్వతె? ఆస్త్రీకారణముగాఁ బరస్పరము వారి కెట్లు విరోధము సంభ వించినది? సవిస్తరముగాఁ జెప్పవలయు నని ప్రార్థింప నాజగడాలమారి ముని యిట్లనియె.

## సుందోపసుందోపాఖ్యానము

తొల్లి దితికుమారుం డయిన హిరణ్యకశిపువంశమున నికుంభుం డను దానవుండు పుట్టెను. ఈసుందోపసుందు లనువారు వానిపుత్త్రులు. ఈరాక్షసు లిరువురు నెల్లప్పు డొండొరుల నెడఁబాయక మిక్కిలి మైత్రితో మెలఁగుచుండిరి. ఇట్లుండ వీరికి ముల్లోకములను గెలువ వలయునను తలం పొకటి జనించెను. తమతలంపు కొనసాగుటకుఁ దాము తపోమహిమ గలవారు కావలయు నని నిశ్చయించి వింధ్యపర్వతప్రాంత ములకుఁ బోయి యచ్చోట విజనారణ్యమునందు జడలు దాల్చి నార చీరలు గట్టి పాదాంగుష్ఠముపై నిలిచి నిరాహారులై శరీరశోషణమును జేసి, చేతులు పైకెత్తికొని దీర్ఘకాలము తపస్సుఁ జేసిరి. వారి తపోమహిమ వలన వింధ్యగుహాలయం దగ్ని పుట్టి యరణ్య మంతయును బొగ లెగయ సాగినవి. దీనికి దేవతలు భయంపడి వారితపస్సునకు విఘ్న మాచ

రించుటకు వారికట్టెదుట రత్నరాసులును, నారీరత్నములును దోఁచున ట్లొనర్చిరి. వా రందుల కాశింపక తపస్సునందే చలింపని మనస్సు గల వారై యుండిరి. దేవతలు తమయుద్దేశ మివ్విధంబున విఫలమయ్యెను మరల వారి కింకొకవిధమున భంగము గావింప యత్నించిరి. ఆయుద్య మమునం దొకరాక్షసుఁడు సుందోపసుందులతల్లులను భార్యలను గొడు కులను శూలహస్తుఁడై యీడ్చుచుండ వారియాభరణము లొకవంక నేల రాలుచుండ, వారికట్టుపుట్టంబులు వీఁడి పోవుచుండ వా రయ్యో మమ్మిట్లు రాక్షసుం డెవండో బాధించుచుండఁగా మీ రిట్లు మిన్నకుండుట తగునా? మీ రొనర్చుతపస్సంతయు మా క్షేమములకే కదా? మమ్మిట్లు వీఁ డన్యాయముగ బాధించుచున్నాఁడే. మా కిఁక దిక్కెవ్వ రని వారు సుందోపసుందులయెదుట మొఱపెట్టుకొనుచుండునట్లు దోఁపఁజేసిరి. ఆయన్నదమ్ము లిరువురు నప్పటికిని చలింపక తపోనిష్ఠాగరిష్ఠులై మెలఁగు చుండుటచేఁ బరమేష్ఠి వారికిఁ బ్రత్యక్షమై యోసుందోపసుందులారా, మీతపస్సునకు మెచ్చితిని. వరముల వేఁడుఁడు. అనఁగా నద్దేవునకుఁ జేతులు జోడించి వా రిట్లనిరి. దేవా! మాతపస్సునకు సంతసించితి వేని మాకు నానావిధమాయలను బన్నుటకును, సర్వాస్త్రప్రయోగోపసంహా రము లతిలాఘువమునఁ గలుగుటకును, నసమానమైనబలపరాక్రమములు మాశరీరము నావహించుటకును, గోరినస్వరూపముల నెత్తుటకును, నమరత్వమును మే మొందుటకును నను గ్రహింపు మని వేఁడిరి. అంతఁ బర మేష్ఠి వారింజూచి మీరు ముల్లోకములను గెలుచునిమిత్తము గదా యింత ఘోర తపస్సులను జేసితిరి. మీకోరినట్లు మూఁడులోకములును మీచేఁ జయింపఁబడుఁగాక. మీ కమరత్వము నిచ్చుటకు వీలుపడదు. మీరు కోరిన మిగిలినవరముల నన్నింటిని మీ కొసఁగితి ననఁగా వా రిరు వురును దమలోఁదమ కెప్పుడు మైత్రి యుండు ననుతలంపునఁ దమకుఁ బరస్పరము దక్క నన్యు లెవ్వరివలన నవధ్యత్వము నను గ్రహింపు మనఁగా బ్రహ్మ యాకోరిక నొసంగి తనలోకమునకుఁ జనెను. అంత వా రెవరి చేతను దమకుఁ జావు లే దని నిశ్చయించుకొని పరమోత్సాహతత్పరులై తమపురముఁ జేరి జడలను నారచీరలనువైచి మంచివస్త్రములను దివ్యా భరణములను సుగంధమాల్యములను ధరించి తమ బంధుమిత్రాదులతోఁ

గూడికొని యానందించుచు నకాలకౌముది యనుమహోత్సవము నొనర్చిరి. ఆయుత్సవదినములలో వారు తమ బంధుమిత్రపరిజనములతో వలసినంత మధురాహారములను గుడుచుచుఁ, బానీయంబులను ద్రావుచు, యాచకుల కనేకదానముల నిచ్చుచు, యథేచ్ఛావిహారపరులై యిష్ట సుఖోపభోగంబుల ననుభవించుచుఁ బరమానందభరితచేతస్కులై యుత్సవాంతమునందు మంత్రులును బంధువులును దమ్ముఁ బరివేష్టించి కొలుచుచుండ వారితో నాలోచించి ముల్లోకములను గెలుచుటకు నిశ్చయించుకొనిరి. అంత నాతలంపుతో నానావిధాయుధపాణులయిన శూరులతోఁ గూడిన సేన నమర్చికొని తాము ను గవచశిరస్త్రాణతూణీర ములను దాల్చి ధనురాదిసమరసాధనముల ననేకములం గొని భేరీ భాంకారము లొకవైపునను, మంగళాశీర్వచనములు వేఱొక వైపునను భూనభోంతరాళంబులు నిండఁగా నొకదినము నిశాసమ యమున మఘానక్షత్రమునఁ జంద్రుం డుండువేళను శుభముహూర్త మున దండయాత్ర వెడలి కామగమనమున నాకసంబున కేగిరి సర్వసైన్య ముతో మహేంద్రు నమరావతీపురమును ముట్టడించిరి. అంత నావృత్తాం తము నంతయును దేవత లెఱింగి నాకలోకమును నమరావతీపట్టణ మును వీడి యందఱును బ్రహ్మలోకమునకుఁ బాఱిరి. అప్పుడు సుందోప సుందులు దేవలోకము తమకు వశపడె నని తలంచి దానిని దమవశము గావించుకొని యంతరిక్షమునఁ దిరుగాడుచు ననేకభూతకోట్ల నులు మాడి వెంటనే పాతాళలోకమునకుఁ బోయిరి. అచ్చోట నాగరాజుల నెల్ల నోడించి, సముద్రమధ్యమం దుండుమ్లేచ్ఛుల నందఱను జయించి భూలోకమునంతయు నొకమాఱు జయింప యత్నించి యిట్లని యాలో చించిరి. "ఇది కర్మక్షేత్రము. ఈ కర్మక్షేత్రమున నుండు బ్రాహ్మ ణులు యాగాదుల నొనర్చి యాహావిర్భాగముల నగ్నిముఖమున దేవ తల కందిచ్చెదరు. దాన దేవతలు పుష్టులై విపులయభివృద్ధి గావిం తురు. అవ్విధమున దేవతలును భూదేవతలును బరస్పరాభివృద్ధికార్య ములను జేసికొనుచు సుఖించుచున్నారు. కావున మొట్టమొదట నీయభివృద్ధి నాటంకపఱుపవలయును. ఈ నిరోధమునిమిత్తము భూలోక మున నుండు భూసురగణమును, సర్వమునులను, దపస్వులను నొక్క

మాఁజు వధింపవలయును" అని సర్వసైన్యముల కాజ్ఞ నొసంగిరి. తామును వారికిఁ దోడ్పడఁగా దానవు లందఱును భూసురులను రాజర్షులను వధించునిమిత్తము వారియాశ్రమములఁ బ్రవేశించి వారియగ్నిహోత్రములఁ జల్లార్చి, యజ్ఞశాలల నూడ బెఱికి, యజమానులను నధ్వర్యులను వధించి తమ కుండు కామరూపధారణమహిమమున నాభూసురులకును, రాజర్షిసంఘములకును నేనుంగులుగ, బెద్దపులులుగ, సింహములుగఁ గాన్పించి వారి కతిశాంతితత్పరులకు బహువిధాపాయములను గావించుచుండిరి. వారికి బ్రహ్మవరప్రసాదంబునఁ బరమతపోధనులగు తపస్విలశాపము లేమియును జేయలేకపోయెను. సుందోపసుందులకు భీతిఁ జెంది బ్రాహ్మణులును రాజర్షులును బలుదెసలకుఁ బాఱిరి. దేవకార్యములు పితృకార్యములు యాగాదికర్మములు, వేదపారాయణములు, సకాలమున నాచరింపఁబడుచుండు సంధ్యావందనాది నిత్యకర్మములును నడంగెను. భూలోకమునఁ గృషి శూన్య మయ్యెను. గోరక్షణము రహితమయ్యెను. వ్యాపారము లంతరించెను. భూతలం బంతయు నెటు చూచినఁ గపాలంబులును, నెముకలరాసులును, మేదోమస్తిష్కంబులును నను వీనిలో నిండెను. ఇవ్విధమున భూలోకమంతయు నతిబీభత్సముగను రౌద్రముగను దోఁపఁగా, సూర్యచంద్రనక్షత్రములకు గతిదప్పెను. అంత సుందోపసుందులు తమలోఁ దాము పూర్వ మనుకొనినట్లు ముల్లోకములను జయించినవారై కురుక్షేత్రమును దమ కునికిపట్టుగాఁ జేకొని యథేచ్ఛానువర్తులై తమ కెదురు లేక యుండిరి. అంత దేవతలును, బ్రహ్మర్షిగణంబులును బ్రహ్మలోకమునకుం బోయి యేకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, బ్రమథగణంబులును, వైఖానసవాలఖిల్యమునివరులును దన్నుఁ బరివేష్టించికొలువఁగా సుఖాసీనుండై యున్న పితామహునకు మ్రొక్కి సుందోపసుందుల ఘోరచేష్టితములను మొఱ్ఱో యని విన్నవించిరి. అంత నప్పితామహుం డొక్కముహూర్తకాల మాలోచించి విశ్వకర్మను బిలిచి లోకములో నుండు సుందరులందఱిలో మిన్నయై, శృంగారవతియై, యెట్టిజితేంద్రియునైనను వలపించుశక్తిగలదైన యొక్క మోహనాకారమును సృజింపుమని యానతిచ్చెను. విశ్వకర్మ వెంటనే సకలభువనములయందలి యతిసౌందర్యపదార్థములలో నొక్క

క్క_డానియందును దిలప్రమాణము (నువ్వుగింజంత) ప్రత్యేకముగ సంగ్ర హించి తిలోత్తమ యను నొకమోహనాంగిని సృజించెను. త్రిభువన సౌందర్యసారమే శరీరముగాఁ గల యామోహనస్వరూపిణి బ్రహ్మ ముందట నిలిచి యాపరమేష్ఠికి మ్రొక్కి హస్తములు జోడించుకొని, పితా మహా! నేనేమిచేయవలయును? అనతిష్ఠు. అనఁగా బ్రహ్మ యామోహంపు మొలక కిట్లనిరెు. తిలోత్తమా! నికుంభునికుమారులు సుందోపసుందు లనువారు నావరప్రభావమున మదించి ముల్లోకములకును జెఱుపును జేయుచున్నవారు. నీవు వారుండుచోటునకేఁగి వార లిరువురకును నీయందుఁ బ్రత్యేకమోహము జనించునట్లొయ్యారము సూపుము. అని చెప్పఁగా నాత్రిలోకసుందరి రుద్రాదిత్యదేవర్షిగణపరివృతుం డగు బ్రహ్మకుఁ బ్రదక్షిణము గావింప దానిసౌందర్యముఁ జూచునిమిత్తము బ్రహ్మ చతు ర్ముఖుం డయ్యెను; ఇంద్రుండు సహస్రాక్షుం డయ్యెను; దేవతలును దిలోత్తమ యొక్క మోహనస్వరూపముం జూచి దానియెడఁ గాముకు లైరి. అంత నాశృంగారవతి తన సింగారంపుఁజేష్టలఁ జూపుచు నొయ్యారము తళు కొత్త వింధ్యపర్వతప్రాంతమున కేఁగి యందుఁ ద్రిభువనములయందును నిస్సపత్నులై గతవ్యథులై, దేవగంధర్వయక్షరక్షోగణములందుండి కొల్లఁ గొట్టఁబడిన నానావసురత్నములతోఁగూడి పరమతుష్టులై, సహస్రస్త్రీలు నృత్యగీతములఁ గావించుచుండ నానందపరవశులై మద్యపానప్రమత్తులై రక్తాక్షులై విహరించుచున్న యాసుందోపసుందులం గాంచి యొకతెగ యొయ్యార మిగురొత్తఁ దన జిలుఁగుపయ్యెదచెఱఁగుతో శరీరము నంతయుంగప్పికొని విలాసమున నదీతీరమున నుత్పన్నములైన కర్ణికారపుష్ప ములను దనలేఁతచిగుళ్లవంటివ్రేళ్లతో విలాసమునఁ గోయుచు నల్లల్లన వారి సమీపింప నాతలిరుబోఁడింజూచి సుందోపసుందు లిర్వురును దాని మోహ నాకారమునకు బ్రమసి మైమఱచి యతిసంభ్రమంబున దాని కుడిచేతిని సుందుండును, నెడమచేతి నుపసుందుండును బట్టుకొని యొకరితో నొక రిట్లనిరి. వారిలో సుందుం డుపసుందునితోఁ "దమ్ముఁడా! ఇది నాభార్య. నీకు వదినె. కావున నీకుఁ బూజ్యురాలు." అని పలికెను. అనఁగా నుపసుం దుండు సుందునితో నన్నా! ఇది నాభార్య. నీకు మఱఁదలు. కావున నీవు దీనిం దాకఁజనదు. అని యుల్లాసంపుఁబలుకుల నుల్లసమాడుచు నత్తలో

దరింజూచి యోసుందరీ! మాలో నీవెవ్వరిం గోరెద వనఁగా నామోహ
నాంగి మీలో నెవ్వరు బలపరాక్రమాతిశయులో వారిని నే వరింతు
ననెను. అంత నాయన్నదమ్ము లిరువురును దమలో నేను దీని గ్రహింతు,
నేను దీని గ్రహింతు నని బలోన్మాదమున, దానియందు బద్ధానురాగులై
తమపుట్టుకనాఁటనుండి యుండుమైత్రి నెంతమాత్రము దలంపక యొక
రితోఁ నొక్కరు మత్సరించి గదలతోఁ బోరి పరస్పరప్రహారముల నిద్ద
ఱును గతాసువులై యిరువురు సూర్యులు నేలఁబడిరో యనునట్లు నెత్తు
రేఱులై ప్రవహించుచుండ నేలం గూలిరి. అచ్చోట నున్న వారిపరిజను
లందఱును వారి ఘోరంపుయుద్ధమునకు వెఱచి వారీసుందరికారణం
బుగఁ జత్తు రని దృఢనిశ్చయులై యెల్లవారును పాతాళలోకముఁ
జొచ్చిరి. అంత బ్రహ్మదేవుండు తిలోత్తమకు దర్శన మొసంగి దానివిలా
సంపునేర్పునకు మెచ్చి దానికి ముల్లోకములయందు నడ్డు లేనిసంచార
మును వర మొసంగి తనలోకమున కేఁగెను. అని నారదుండు పాండ
వులకును సుందోపసుందులవృత్తాంతమును జెప్పి మీరును ద్రౌపదివిష
యమున మీకెట్టిభేదమును గలుగకుండునిమిత్త మొక సంకేతమును
జేసికొనుఁడు. దానంజేసి నియమవంతులగు మీకేనాఁడును భేదము
కలుగనేరదు. మీమేలుఁ గోరి నే నీయాలోచనమును జెప్పుచున్నా
నని హితోపదేశముఁ జేయఁగా నమ్మునికిఁ బాండవు లిట్లనిరి. మునీంద్రా!
మే మొక్కొకయేఁడు ద్రౌపదితో నొక్కొక్కరు కాపురము చేయు
చుండెదము. అప్పుడు యాజ్ఞసేని యొవరియింట నుండునో యాయింటికి
మే మితరుల మెవ్వరము పోకుండ నుందుము. అట్టు లొకవేళ నాకస్మిక
ముగ నరిగితి మేని యందులకుఁ బ్రాయశ్చిత్తముగాఁ బండ్రెండునెలలు
వనమున బ్రహ్మచర్యమును జరిపెదము. తీర్థయాత్ర గావించెదము. అని
దేవర్షి యగు నారదునిసమక్షమమున సంకేతము*చేసికొనిరి. అంత నార

* ఈసంకేతము నొకప్పుడు తప్పి యర్జునుఁడు తీరయాత్రఁ జేయవలసివచ్చి
నది. ఈతీర్థయాత్రానియమము పండ్రెండువత్సరములకాల మని ప్రస్తుతసంస్కృత
భారతప్రతులలో నున్నది. కాని, నన్నయభట్టారకుఁ డీనియమకాలము పండ్రెండు
మాసము లని నిర్ణయించియున్నాఁడు. ఇంకను భారతకథాప్రతిపాదకగ్రంథము లగు
చంపూభారతాదిగ్రంథములలో నొక్క సంవత్సరమే యీతీర్థయాత్రాకాల మని

డుండు వారిమనోనిశ్చయమునకు సంతసిల్లి మీమ్ము నీక భేదించువా రెవ్వరుండ రని చెప్పి యిష్టమగు దేశమునకుఁ బ్రయాణమై పోయెను.

ఇవ్విధమున దేవర్షిసమక్షమునఁ బాండవు లేవురును సంకేతమును జేసికొని యెవ్విధమైన ప్రమాదము కలుగకుండ నొక్కొకరేఁడొ

---

చెప్పఁబడియున్నది. మఱియు భారతంపు మఱియొక ప్రకరణమున నాతీర్థయాత్రను గూర్చి చెప్పుచు నీతీర్థయాత్రాకాలము స్పష్టముగా నొక్కసంవత్సరమే యని తెలుపఁబడియున్నది.

శ్లో. తతో నిమిత్తే కస్మింశ్చిద్ధర్మరాజో యుధిష్ఠిరః,
వనం ప్రస్థాపయామాస తేజస్వీ సత్యవిక్రమః.
ప్రాణేభ్యోఽపి ప్రియతరం భ్రాతరం సవ్యసాచినమ్,
అర్జునం పురుషవ్యాఘ్రం స్థిరాత్మానం గుణైర్యుతమ్,
స వై సంవత్సరం పూర్ణం మాసం చైకం వనేఽవసత్.

అని యున్నది. కావున నర్జునునితీర్థయాత్రాకాల మొక్కసంవత్సరమే యని నిర్ధారితమైనది. కాన పండ్రెండుసంవత్సరములు కావు. కాఁబట్టి యీప్రకరణమున నుండు శ్లో. "స నో ద్వాదశ వర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్" అనుదానిని "స నో ద్వాదశ మాసాంస్తు" అనియు నులూపీసంగమప్రకరణమున శ్లో. "బ్రహ్మచర్యమిదం భద్రే మమ ద్వాదశ మాసిక" మ్మనియు నుండి యుండవచ్చునని యొకరు దిద్దిరి. మఱియు "స వై సంవత్సరం పూర్ణం మాసం చైకం వనేఽవసత్" అను దానిని మాత్రము దిద్దుటకు వలనుపడదని వారే చెప్పిరి. అంతేకాక తీర్థయాత్రాకాలము పూర్తియగుటకు మునుపే యులూపీసంగమమయ్యెను. బ్రహ్మచర్యవ్రతనియమము తప్పెను. ఇందులకు సమాధానము నిట్లు కొందఱు చెప్పుదురు. వ్రతభంగమగునని సంశయించి యులూపి కోరినమేరకు సంగమింపనిచో నులూపి ప్రాణత్యాగమును జేయునే యను ధర్మసూక్ష్మమును బరిశీలించి దానిప్రాణసంరక్షణమే వ్రతభంగమునకంటె ధర్మమని నిర్ణయించి దానిసంగమము నంగీకరించినట్లు చెప్పియున్నది. ఇట్లుండ నియమసంవత్సరకాలములోపుగాఁ జిత్రాంగద నర్జునుండు వరించి పెండ్లియయ్యె ననుట సంగతము కాదు. కావున వ్రతనియమకాలము సంవత్సరమే యనియు నాకాలము కాఁగానే పదమూఁడవమాసమునఁ జిత్రాంగదార్జునులవివాహ మయ్యెనని నిర్ణయింపవలసియున్నది. నన్నయభట్టు తన యాంధ్రభారతమున నిట్లే చెప్పియున్నారు. ఆనందపూర్ణమునీంద్రుని వ్యాఖ్యయందు నిట్లే యున్నది. ఇప్పటి సంస్కృతభారతప్రతులలో తీర్థయాత్రావ్రతకాలము పండ్రెండుసంవత్సరములకాలమని యుండు టూహ్యము.

క్కరియింట యాజ్ఞసేనితోఁ గాపురము సేయుచు వర్తించుచుండఁగా నొక్కనాఁ డొక విప్రుని యావులను దొంగలు దోలుకొనిపోఁగా నా విప్రుండు యుధిష్ఠిరు నగరున కేతెంచి నగరుమొగసాల నిలిచి యాక్రందించుచుండఁగా నర్జునుండు వానిదుఃఖకారణ మడిగెను. అంత వానికావిప్రుం డిట్లనియె. విజయుఁడా! వినుము. మీవంటిధర్మమార్గప్రవర్తకులును, వర్ణాశ్రమధర్మములను నడుపుచు వానిని రక్షించుచుండు మహానీయు లగురాజోత్తములు మాయాశ్రమములను గాపాడుచుండ యజ్ఞశాలమధ్యయందు మంత్రములచేఁ బవిత్రమై యగ్నియందు వ్రేల్వఁబడుటకు సంసిద్ధమైయుండు పురోడాశమును గాకులపహరించుకొనిపోయినట్లు నాహోమమున కుపయుక్తము లగు నావులను దొంగ లెవరో తోలుకొని పోయిరి. అని ఘోషించినను నిచ్చోట నాయేడ్పును వినువారెవ్వరును లేకున్నవారు. నాయఱపు పులి లేని గుహాద్వారమున నక్కకూఁతవలెఁ బరిణమించియున్నది. బ్రహ్మస్వము మ్రుచ్చులపాలైనది. ధర్మకర్మములకు హాని యయ్యె. నాదుఃఖమును దైన్యమును గనిపెట్టి నా యావులను వెదకి తెప్పించి నా కిప్పింపవలయును. ప్రజలయాదాయమున నాఱవపాలును గొని వారిని హాని చెందకుండ రక్షింపని నృపాలుండు పాపముల కాకరం బగును. అని పెద్దయెలుంగున నేడ్వఁగా నర్జునుండు వాని నోడక నిలువు మని వచించి వాని కభయదానం బొసంగి చోరులు పోయినమార్గమును సూచించునిమిత్త మావిప్రునిఁ దనవెంట రమ్మని నిలువరించి ధనుర్బాణములఁ గొనునిమిత్తము నగరిలోపలి కేఁగ నాయుధాగారంబున ధర్మతనయుండు ద్రుపదుపుత్త్రితో నేకాంతమున నుండువాఁడుగాఁ దెలిసి కొంతవిచారించి యప్పుడాయుధశాలం బ్రవేశించినఁ దమసమయభంగ మగుటకు వెఱచి తడసినచో విప్రకార్యభంగ మగునని యోచించి పిదప నేదెట్లైనను విప్రకార్యమత్యంతముఖ్యముగాఁ దలంచి యెట్టులైన నాయుధశాలకేఁగి యాయుధములనుగొనివచ్చి విప్రకార్యము నొనర్తు నని నిశ్చయించుకొనెను. సమయభంగ మయ్యెనేని యొక్కయేఁ డరణ్యములనుండి తీర్థయాత్రలను సలిపెదను. ఎవ్విధముననైనను విప్రకార్య మవశ్యముగఁ జేసెద నని కృతనిశ్చయుఁ డయ్యెను.

అంత ధర్మనందన ద్రౌపదీమందిరములోఁ జొచ్చి ధర్మపుత్త్రుని యను మతిం గొని యాయుధములను జేకొని విప్రునివెంటం జని చోరులను చోరులతోఁ బోరాడి వారిని సమయించి విప్రుగోవులను గ్రమ్మఱ విప్రున కొసంగి, నగరు సేరి పెద్దలకు నమస్కరించి వారి స్తుతిపాత్త్రుం డయ్యెను. అంత ధర్మనందనునియొద్ద కేఁగి 'నరేంద్రా, ద్రౌపదియు నీవును నేకాంతమున నుండఁగా మన సంకేతనియమమునకు లోపము కలిగెఁగాన నేను దీర్ఘయాత్ర సలిపెదను. బ్రహ్మచర్యవ్రతావలంబి నయ్యెద. సెలవొసంగు' మనఁగా నాకఠినంపు వచనములచేఁ గర్ణరంధ్రములు సూదువడఁగా యుధిష్ఠిరుం డర్జునున కిట్లనియె. అర్జునా! పెద్దవారు భార్యలతో నేకాంతమున నుండఁగాఁ బసివా రాగృహమునఁ జొచ్చుట దోషము కానేరదు. వెండియు విప్రకార్యార్థముగా నిప్పు డిది యయ్యె. దీనివలన సుకృతము ఘటిల్లినది. ఇందుఁ బాపము లేదు. నామాటయం దాదరము నీకుండునేని, నీవిప్పు డీతీర్థయాత్ర చనవలదు. ఉడుగుము. అని చెప్పఁగా నర్జునుం డన్న కిట్లనియె. మహాత్మా! మర్యాదకు భంగము గలుగఁగా మన మందఱను శిక్షించెదము. అట్టిశిక్షకుల మగు మన మొక సాకు గల్పించికొని ధర్మ మాచరింప కుండుట గూడదని నా కెన్ని మాఱులో నీవే యుపదేశించియున్నవాఁడవు. ఎట్లైనను నేను కృతనిశ్చయుండనై యున్నాఁడను. నన్నాటంక పెట్టవలదు. అని ధర్మసుతు నొడంబఱిచి పార్థుం డరణ్యవాసయోగ్యమైనజడలను ధరించి నారచీరలను గట్టి వనమునకుఁ దఱలెను.

## అర్జునుండు తీర్థయాత్ర పోవుట

అప్పు డాయర్జునునితో వేద వేదాంగ పారంగతులును నధ్యాత్మచింతాసక్తులును నగు భూసురులును, బిచ్చ మెత్తి దేహయాత్ర నడపు పరమభాగవతులును, ననేకపుణ్యకథలను నేర్పుతోఁ జెప్పు పౌరాణికులును, రాఁగా దేవర్షిగణసేవితుండైన మహేంద్రుంబోలెఁ బ్రకాశించుచు ననేక నదీనదములను, బహువృక్షలతాసంకీర్ణములై పుణ్యాశ్రమంబులకుఁ దావలంబై యుండు గహనప్రదేశములను దాఁటుచు ననేకపుణ్యతీర్థములయందు స్నాన మాచరించి తీర్థశ్రాద్ధముల నొనర్చుచు, దేవపితరుల

ప్రీత్యర్థము దానాదుల నర్హులగువారి కొసంగుచుఁ బోవువాఁడు కొన్ని
నాళ్లకుఁ గ్రమముగా గంగాద్వారంబుఁ జేరెను. అప్పు డచ్చోటఁ గూడి
యాపుణ్యనదీజలంబుల స్నానమాచరించి సర్వకిల్బిషములను దొలంగఁ
ద్రోలి పరమనిష్ఠాగరిష్ఠులగు మునిజను లచ్చోట నగ్నిం బ్రణయించి యం
దాహుతులు వేయుచుండుటను గని పరమానందభరితుండై యాపాక
శాసనసుతుం డాపుణ్యనదీజలంబులఁ దానును సుస్నాతుండై దేవతల
కొఱకు దేవతర్పణములను, పితరులకొఱకుఁ బితృతర్పణముల నొసర్చి
యగ్నియందు వ్రేల్చుట కుద్యమించి వచ్చుచుండఁగాఁ డత్పూర్వము
గంగయందుఁ గృతావగాహుండుగ నున్నప్పుడు వీనిరూపరేఖలం గని
మదనపరవశ యైన యొక్క నాగకుమారి యులూపి యనునది యర్జు
నుని నీటియందుండి వెలువడి రానీయక తటాలున నొడిసి నీటిలో
నికిఁ దివిచికొని నాగలోకమునకుఁ జని యం దొక్క దివ్యభవనము
నందుఁ జేర్చె. అచ్చోట నర్జునుఁడు తనమున్ను సన్నిహితుండై యుండిన
యగ్నిహోత్రుని విధ్యుక్తముగ నర్చించి యగ్నికిఁ బ్రీతిగా హోమము
వేల్చి యానాగకన్యకను జూచి, 'యిది యేటిసాహసము? నీ వెవ్వతెవు?
నీతండ్రి యెవఁడు? ఈదేశ మేది?' యని యడిగెను. అంత నర్జునునకు
నాగకన్యక యిట్లనియె. మనోనాథా! కద్రూపుత్త్రుల కులములలో
నైరావతకులమునఁ బుట్టిన కౌరవ్యుఁ డనునాగరాజునకుం గూఁతురను.
ఉలూపి యనుదానను. ఈగంగానదియందు స్నానార్థంబు నీవుచొచ్చినది
మొదలుగ నీమన్మథస్వరూపమును జూచి నేను మన్మథుబాణములకు
గుఱియైతిని. మానాగులసామర్థ్యంబున ని న్నిటకుఁ దేఁగల్గితిని.
నీయందుఁ దగిలియుండు నామనస్సును రంజింపఁజేయుము. నాతో సంగ
మించి నాయం దపత్యమును బడయుము. అనఁగా నర్జునుం డానాగ
కన్యక కిట్లనియె. ఓయులూపి! వినుము. నే నొక్క కారణంబున బ్రహ్మచర్య
వ్రతమును బూని సర్వతీర్థములను సేవించుచు దానవ్రతపరాయణుం
డనై యుండువాఁడను. ఈనియమంబున నుండు నాకు వ్రతభంగ మగు
కార్యమును దలపెట్టు మనుట నీ కధర్మంబు. కావున నీకోర్కెఁ దీర్ప
నిప్పుడు సమయముగాదు. వ్రతభంగ మొనర్తునేని నా కసత్యపాతకం
బావహిల్లు ననఁగా నర్జునునకు నాగకన్యక యెండియు నిట్లనియె. పాండు

పుత్రా! మీయన్నదమ్ములకు ద్రౌపదినిమిత్తమైన నియమమునకు, నీ యిప్పటి బ్రహ్మచర్యవ్రతపరాయణత్వమును నే నెఱుంగనిదానను గాను, కాని, నాయభిమతంబు నిప్పుడే నీవీడేర్పవలయు కాకున్న నన్నావహిల్లిన మదనతాపమున నాశరీరము భస్మమై పోవును. అన్నిధర్మములలోఁ బ్రాణదానమువకంటె మే లొండేదియుఁ గానరాదు. ఆయుత్తమ ధర్మమును బూని నాయభిమతం బీడేర్చి నాకుఁ బ్రాణదాతవై పుణ్యమునఁ బొమ్ము. ఇఁక నన్నుఁ గాపాడుమని నీకుఁ బ్రత్యేకముగఁ జెప్పనేల? నాతో సంగమించి నీయందుఁ దగిలియున్న నామనస్సును నానందమునం దేల్పుము. కాకున్న నే నిప్పుడే పరలోకమున కేఁగుదాన. ఇది సత్యము. దీనివలన నీకును నన్ృతదోషము గలుగదు. నేను దీననయి నీశరణుఁ జొచ్చియున్నదానను. ఆర్తత్రాణమే కదా పాండవులకుఁ బరమోత్కృష్ట ధర్మము? అని దీనవదనయై యర్జునునిపాదములను రెంటిని గట్టిగఁ బట్టుకొని తన కథయము నొసంగు మనెను. అప్పు డప్పాండవమధ్యముఁడు ధర్మమును లెస్సగాఁ బరిశీలించి యులూపియభిమతం బీడేర్చి యారాత్రి యందుండి మఱునాఁడు ప్రభాతం బగుడు నయ్యులూపి తనకు దారిఁ జూపుచురాఁగా గ్రమ్మఱ గంగాద్వారమును జేరెను. అంత నయ్యులూపి తనయభిమతం బీడేర్చిన యయ్యింద్రసూనునకు జలజంతువు లెల్ల వశము లగునట్లు వర మొసంగి నాగలోకమునకుఁ జనెను. అయ్యులూపి యర్జున సంగమమువలనఁ జూలు దాల్చి యిరావంతుఁ డను పుత్త్రుం బడసెను.

అంత నర్జునుండు తాను నాగలోకమున కేఁగుటయుఁ దన కులూపితో నిర్బంధసంగమ మగుటయు మున్నగు వృత్తాంతము లన్నియుఁ దనవెంటవచ్చిన బ్రాహ్మణులకుఁ జెప్పి వారికి సంతోషమును గలుగఁ జేసి యచ్చోటువాసి హిమవత్ప్రాంతంబులకుఁ జని యచ్చోటనుండు నగస్త్య వనమును నున్నతం బైనపర్వతశృంగంబును వీక్షించుచు, హిరణ్యబిందు తీర్థమునకుఁ బోయెను. అందు గోదాన, భూదాన, తిలదాన, హిరణ్య దానము లాదిగాఁ బెక్కుదానములు చేసి యజ్ఞముచేయు బ్రాహ్మణోత్తములకు వేలకొలఁది గోవుల నిచ్చి యచ్చోటనుండి తూర్పుదిక్కునకుఁ బోయి యుత్పలినీనదిని, నైమిశారణ్యంబును, నంద, ఉపనంద, కౌశికి,

గంగ, గయ, యమున మున్నగు మహానదులను సేవించి యచ్చోట నుండు భూసురులకు వేనవేలు గోదానములఁ జేసి యచ్చోటనుండి యంగ వంగ కళింగదేశములయందలి పుణ్యక్షేత్రములను దర్శించి తీర్థములయం దవగాహనంబుచేసి దేవపితరులకుఁ దృప్తిగాఁ దర్పణములను శ్రాద్ధములను గావించునంతవఱకుఁ దనవెంటవచ్చిన యాకళింగభూసురలకు సెలవిడ వారు వెంటనే దఱలిపోయిరి. పదంపడి యర్జునుండు తూర్పుసముద్రతీరమునఁ బురుషోత్తమునిసేవించి మహేంద్రపర్వతమును జూచుచు దక్షిణగంగ యని చెప్పఁదగిన గోదావరి మున్నగు మహానదుల యందు స్నాన మాచరించుచు, సముద్రతీరమున రమణీయములైన యేలకితీఁగలతోఁపులచే రమ్యములైనవియు, గాలివలనఁ గదలుచున్న యలలచేత మనోహరములైనవియు సముద్రమునందలి పగడపుఁ దీఁగెలవరుసలు గలవియునైన యిసుకతిన్నెలయందు విలాసముతో విహరించుచు నర్జునుండు దక్షిణసముద్రతీరమునకుఁ బోయి పాపములను బాదుచేయునట్టి కావేరీసముద్రసంగమస్థానమున బ్రాహ్మణుల కపార ధనముల నొసంగి పుణ్యాత్ముండై పదుమూఁడవమాసమున మణిపుర మనునగరమును బ్రవేశించి యచ్చట దివ్యతీర్థస్నానములను గావించి యాయూరునకుఁ బ్రభువును, ధర్మజ్ఞుఁడును నగుచిత్రవాహనుఁ డను రాజుకుమార్తె చిత్రాంగద యను విలాసవతిని సాకస్మికముగఁ జూచి దానిసౌందర్యమునకు, మనోజ్ఞత్వమునకు, సౌభాగ్యమున కచ్చెరువడి దానియందుఁ దగులమును నారాజునకుఁ దెల్పువాఁడై తా నర్జునుం డగుట వాని కెఱిఁగించి వానికూఁతురగు చిత్రాంగదయందుఁ దాను బద్ధానురాగుండై యుండుటను సూచింపఁగా నతం డిట్లనియె. పాండుపుత్త్రా! నాకూఁతు నీ కిచ్చుటకంటె విశేష భాగ్యము మా కబ్బునే? నేను గృతార్థుండనైతి. కాని, యొకవిన్నపంబు కలదు. దానిం జెప్పెద. సావధానుండవై యాకర్ణింపుము. మాకులము నందుఁ బూర్వము ప్రభంజనుం డనురా జనపత్యుఁడై బహువ్రతములను జలుపుచుండి చంద్రశేఖరునిఁ గూర్చి దీర్ఘకాలము తపస్సుఁ జేసెను. అంత శివుండు వానికిఁ బ్రత్యక్షుండై ప్రభంజనా! నీ తపస్సునకు మెచ్చితి. నీ కొక్కపుత్త్రుండు పుట్టును. ఇంక నీకులము

వారి కెల్ల నిట్లే యొకొక్క పుత్త్రుఁడు గలిగి యవిచ్ఛిన్నముగా వంశ
పరంపర సాగుచుండును. అని చెప్పి యదృశ్యుం డయ్యెను. ఇప్పుడు
నా కీకూఁతురు జనించెను. ఇది దక్క నా కన్యసంతానంబు లేదు.
దానంజేసి యీ దుహితయందుఁ బుట్టు కుమారుఁడు మాకు వంశ
కరుఁడు కావలయును. వానిని నీవు నాకుఁ బుత్త్రుంగా నిచ్చుట కొడం
బడుదువేని యీశుల్కమున కంగీకరించి దీనిం బెండ్లియాడుము.
అనఁగా నర్జునుండు వాని కిట్లనియె. రాజా! నీయభిమతం బట్లగునేని
యవ్విధంబున నొనర్తు ననెను. అట్లు పుత్త్రికాకరణమున నొసంగిన
చిత్రాంగద నర్జునుండు పెండ్లియై మూఁడువాసరము లాసుందరితో
సుఖోపభోగంబులఁ దేలియాడి యచ్చోటు వాసి దక్షిణసముద్రతీర
ముల సేవించుచు మహర్షులతోడను, వెంట వచ్చిన భూసురవర్యుల
తోడను గూడి యాసమీపమున సముద్రమును జూచుచు నచ్చోట
సౌభద్రమను తీర్థమునందు స్నానము చేయుటకు యత్నింపఁగా నర్జు
నుం జూచి యచ్చోట నుండు భూసురు లిట్లనిరి. ఓచంద్రవంశతిలకమా!
ఆఁగుము. మామాట లాలకించి యీతీర్థస్నానమున కుపక్రమింపుము.
ఈతీర్థ మెవ్వరికిని జొర నశక్యము. ఇదియే కాదు. దీనితో నీసముద్ర
తీరమున నైదు తీర్థములు పాపహరము లున్నవి. వీనియందు స్నానా
ర్థమై దిగువారిని నిందుండు భయంకరములగు మొసళులు వారిని లోనికి
లాగుకొనిపోవును. ఆభయమువలన నీతీర్థములలో నిప్పటికి నూఱేం
డ్లుగా నెవరును స్నాన మాచరించుట లేదు. ఇవి పుణ్యతీర్థములయ్యును
ఋషిశ్రేష్ఠులు వీనియం దుండు మొసళులవెఱపుచే వీనియందు స్నాన
మాచరించుట వదలిరి. ఇవి సౌభద్ర, పౌలోమ, కారండవ, ప్రసన్న,
భారద్వాజము లనుపేళ్లతో వెలయును. ఇవి దుష్టులచే గ్రహింపఁ
బడిన రాజులసంపదలవలె సత్పురుషులసంబంధము లేక యున్నవి.
అనిన విని యర్జునుండు సకలతీర్థములయం దవగాహనము గావింప
వచ్చిన నా కీతీర్థములయందు స్నాన మాచరింపకుండుట పౌరుషము
కాదని భావిని విచారింపక త్వరపడి దానియందు (సౌభద్రమందు) డిగి
స్నానముచేయఁగా నీళ్లు మిక్కిలి కదలుచుండుట నెఱింగి యం
దున్న గొప్ప మొసలి వేగముగాఁ బరుగెత్తివచ్చి మహాబాహుం

డును దీర్ఘకాయుండును నైన యర్జునునిపాదముం బట్టికొనఁగా నతండు దానిని మహాబలమున నీడ్చుకొని గట్టుఁ జేర్చి నీటికిదూరముగాఁ బాఱవైచెను. అంత నా మొసలి తన మకరరూపమును వదలి యర్జునుఁడును నచ్చోట నుండు బ్రాహ్మణులును నచ్చెరువడి చూచుచుండఁ జక్కని సుందరరూపమును ధరించెను. అప్పు డప్పాండునందనుండు దానివేడిచూపులకు, వెడఁదకన్నులకు సొగసైన నెమ్మోమునకు, సర్వావయవసౌందర్యమునకును మెచ్చి దానితో నిట్లనియె. ఓసుందరీ! నీ వెవ్వతెవు? ఏకారణమున మొసలివై యిప్పు డీరూపమును ధరించితివి? అని యడుగఁగా నాశుభాంగి యర్జునున కిట్లనియె. నేను వర్గ యను నప్సరసను. నా చెలికత్తెలు సౌరిభేయి, సమీచి, వస, లత యనువారలు నాయట్లె యీతీర్థముల నున్నవారు. వారలకు శాపమోక్షణంబు గావించి నన్ను రక్షించినట్లు వారిని నైతము రక్షింపవే యో మహానుభావా! యనఁగా దానికి నర్జునుఁ డిట్లనియె.

ఓ సుందరీ! మీా రెవ్వరు నేమికారణమున భయంకరమైన మకరరూపముల ధరించితిరి? అని యడుగఁగా వర్గ మిక్కిలి సంతోషముతో నర్జునున కిట్లని విన్నవించెను. మహానుభావా! వినుము. మే మేవ్వురమును నఖిలలోకపాలకులపురములఁ జూచుచు, భూలోకముం జేరి యొక్కమనోహర మగు వనమధ్యమున సుందరాకారుండును నుగ్రతప మాచరించుచుండువాఁడును, శాంతస్వభావుఁడును నై రెండవ యగ్నిహోత్రుం బోలె వెలుంగుచుండు నొక్క బ్రాహ్మణునిం గంటిమి. అంత మే మాభూసురుతపమునకు విఘ్న మాచరింపఁ దలంచి వాని కట్టెదుట ననేక హేలావచనముల నాడితిమి. వానికి మాయందుఁ దగులు కలుగునట్లు పాటలఁ బాడితిమి. వివిధనాట్యములఁ జేసితిమి. మే మెన్నివిధముల నాతనిమనస్సుఁ ద్రిప్పఁ జూచినను నాతండు నిశ్చలుండై నీరసుండై యుండెను. అత్యంత దృఢమనస్కు లగువారికి మనోదార్ఢ్యము లేనివారివలె వనితలయెడ నేల తగులము కలుగును. అట్టి వారికి స్త్రీసమాగమములును గడ్డిపోచలును నొక్కరూప. మే మాతనికిఁ గామవికారము కలుగుకార్యములను జేయఁగా నవి యాతనికిఁ గోపకారణము లయి యాతండు మా కలిగి మ మ్మేవ్వురను ఘోరము

లగు మొసళ్లు గం డని శపించెను. అంత మేము మాయుత్సాహము తఱిగి యాతనిపాదములం బడి మహానీయా! వనితలయపరాధంబునకుం దపస్వు లింత కనలుదురే? తెలియక గర్వించి మోహాంధలమై యొన ర్చినయపరాధముల సహింపుము. నీవు జితేంద్రియుఁడ వని తెలియక యెట్లో నిన్ను మోసపుచ్చి మేము కొన్నిదినములు నీవలన నైహిక సుఖముల ననుభవింపఁ దలంచితిమి. మా కిట్టిశాపము ననుభవించుట కంటె మరణము మేలు. మహానీయు లగువారు స్త్రీ లెట్టియపరాధము లొనర్చినను మన్నింతు రని పెద్దలు సెప్పుదురు. బ్రాహ్మణుల కపరాధ ములను మనమునఁ దలంచు మూఢులకు దైవసంకల్పముచేఁ బాప ములును నపకీర్తులును సంభవించును. కావున మాయజ్ఞానమును సైరించి మాకు శాపవిమోచనము ననుగ్రహింపుము. బ్రాహ్మణుఁడు సర్వభూత దయాళుండు గాఁడే? కావునఁ బరమశాంతుఁడ వగు నిన్ను శరణుఁ జొచ్చితిమి. అని చెప్పఁగా మా కాతాపసోత్తముం డిట్లనియె. సుదతు లారా! నాయాడినమాట ఫలింపక తీరదు. శాపమును మీ రనుభవించి తీరవలయును. మీరు ఘోరమకరములై నూతేఁడులై సపిదప నెవ్వాండు మీచేఁ బట్టువడి మిమ్ముఁ గొలనినుండి వెలువరించునో యామహాసత్త్వుఁడే మీశాపవిమోచనమునకుఁ గారణ మగును. అనిచెప్పఁగా విని యట్టిదీర్ఘ బాహువులు గల మహానీయుం డెవ్వం డొకో యనుచు వచ్చుచున్న మాకు ముల్లోకముల సంచరించుచుండువాఁడును, బ్రహ్మమానసపుత్త్రుండు నగు నారదుఁ డెదురుపడగా మే మాతనికి వినమ్రులమై మ్రొక్కితిమి. అంత నమ్మునీశ్వరుండు మాదీనవదనములం జూచి మీ రేల యిట్లు దుఃఖ పడుచున్నవార లని యడిగి మావృత్తాంతమంతయు మాచే విని, బ్రాహ్మణకోపమును, విధిప్రేరణమును ద్రిప్పుట కెవరికిని శక్యముగాద నియు, దక్షిణసముద్రతీరమునఁ బ్రసిద్ధములైన పంచతీర్థములను మీశాపకాలమగు నూతేం డ్లాక్రమించియుండు రేని సకలజనుల స్తోత్ర పాత్రుండును, బురుషశ్రేష్ఠుండును నగు పాండవమధ్యముండు సర్వతీర్థ ములను సేవింపఁ గోరికతో వచ్చి మీ కాతపస్వి చెప్పినట్లు శాపవిమోచ నముం జేయుననియుఁ జెప్పి యదృశ్యుం డయ్యెను.

అంత మేము నారదుమాటలచొప్పున నీరాక నెదురుచూచుచు నీయయిదు తీర్థముల నాక్రమించి యుంటిమి. ఇప్పుడు నేను నీచే శాపవిముక్తిఁ బొందితిని. నాకు నిజరూపము గలిగెను. నాచెలులకు శాప మోక్షణనిమిత్తము నీ వాతీర్థములకుఁ బోయి క్రమమున స్నానము గావింపుము. మకరరూపములతో నున్న యాయప్సరసలకు నిజస్వరూప ములు గలిగింపుము. ఆతీర్థములఁ బవిత్రము లొనర్పుము. విచ్ఛేయుము అని ప్రార్థించె. పదంపడి యర్జునుండు వర్గాభిమతము చొప్పున మిగిలిన నాల్గుతీర్థములకుఁ బోయి క్రమమున వానియందు స్నానము గావించి యయ్యప్సరసలకు శాపవిమోచనము గావించి తీర్థములను బవిత్రము లనుగ నొనర్చెను. అంత నాయప్సరస లేవురును దమయెడ దయా ళువై తమ శాపవిమోచనము గావించిన యర్జునునియెడ మిక్కిలి ప్రీత మనస్కులై యర్జునుని దీవించి సంతోషముతో దేవలోకమున కరిగిరి. అదిమొదలుగా నాపంచతీర్థములును నారీతీర్థము లని పేర్కొనఁబడెను.

అంత నర్జునుండును మరల మణిపురమునకుఁ జని రాజ్యలీల సుఖ ముండి చిత్రాంగదయందు బభ్రువాహనుం డనుకుమారుం బడసి, వానిని జిత్రవాహనునకు వంశకరుఁగానిచ్చి వానియొద్ద సెలవుపుచ్చుకొని గోకర్ణక్షేత్రమును సేవించి పశ్చిమసముద్రతీరమునఁగల పుణ్యక్షేత్ర ములను, దీర్థములను జూచుచు వానియం దవగాహనంబు గావించి యచ్చోటికి సమీపమున నున్న ప్రభాసతీర్థమున కరిగి యందుఁ గృత స్నానుండై యారాత్రి యొకవటవృక్షము క్రిందఁ జిటిపొటిచినుకులు రాలుచుండఁ బరుండి గదుఁ డనుయాదవునివలనఁ దాను వాసుదేవుని చెలియలైనసుభద్ర తిలోత్తమకంటె రూపవతి యనియు, మంచిగుణ ములు గలది యనియు మున్న వినియున్నవాఁడు గావున, నాగజగమ నను జూచుతలంపు గలిగి, యెటులైన నాసుందరిని సాధింప నుపా యము నాలోచించుచుఁ, బ్రభాసతీర్థమునకు ద్వారావతి యనతిదూర మున నున్న దని యెఱింగి యచ్చోటునకుఁ బోయినచో నీలమేఘమును వంటిశరీరము గలవాఁడును, కమలనాభుండును, రాజీవాక్షుఁడును వసుదేవసుతుండును, దనకు నెచ్చెలియునగు శ్రీకృష్ణుని దర్శనము గావించికొని పాపములను బోఁగొట్టుకొని జన్మము సఫలము చేయుదు

నని, యూహించి సుభద్రను గైకొనుట కుపాయముగా యాదవులకు యతులయం దాదర మని యూహించి కపటయతివేషధారియై *వాసుదేవుండు తనవేషమున కేమి తలంచునో యని వితర్కించుచు నాజగన్నాథుం దలంచుచుండె.

అంత ద్వారకాపురమునందు సత్యభామ కేళీగృహంబునందు శయ్యపైఁ బరుండి యుండిన శ్రీకృష్ణమూర్తి తనలో దేనినో తలపోసి యూరక నవ్వఁదొడంగెను. అప్పుడు నవ్వుచున్న భగవంతునితో సత్యభామ యిట్లనియె. మనోనాథా! నీ విప్పుడు సుఖానఁ బాన్పుపై శయనించియు నేలొకో కొంత చింతిల్లెదవు? మఱియుఁ గొంతవడికి నవ్వెదవు? దీనికిఁ గారణమును నాతోఁ జెప్పఁ దగు నేని యానతిమ్ము. నన్నుఁ జూచి నారూపము చక్కఁగా లేదని నవ్వెదవో యని సంశయించెదను. అనఁగా సత్యకు భగవంతుఁ డిట్లనియె. సత్యా! ఒక రహస్యమును వినుము. మామేనత్తకొడు కర్జునుం డొకకారణమునఁ దీర్థయాత్ర గావించి వ్రతసమాప్తియై ప్రభాసతీర్థమును జేరి యచ్చోట నొక వటవృక్షంపునీడయందుఁ జిటిపొటిచినుకులు రాల నందేఁ బరుండి యొంటులైనను మనసుభద్రను దాను బెండ్లాడ నుపాయము నూహించి యతివేషమున ద్వారకాపురికి ప్రవేశించి నా కెఱింగించి సుభద్రం గొనిపో నున్నవాఁడు. వానిభావము నే నెఱింగియుండుటచే నాచిత్రమునకు నవ్వుచుంటినే కాని వేఱొం డెద్దియును గానేరదు. యథార్థ మెఱుఁగఁ

*అర్జునుండు యతివేషముతో ద్వారకయందు సుభద్ర సేవింపఁగా నుండుకథ ప్రక్షిప్త మని కొందఱియభిప్రాయము. కాశీదేశసంస్కృతభారతములో నీకథ లేదు నే నీవచనభారతమును వ్రాయుటకుఁ బూనుకొనునప్పుడు నాయొద్ద బహుకాలమున నున్న యాంధ్రలిపిసంస్కృతభారతము శ్రీపురాణం హయగ్రీవశాస్త్రులుగారి యాదరమున ముద్రింపఁబడినది. దానిలో నీకథాభాగ మాదిపర్వము పూర్తియైన పిదపఁ బ్రత్యేకముగా ప్రక్షిప్తకథగాఁ జేర్పఁబడియున్నందున దీనిరామణీయకత దీనిని దెనిఁగించినాఁడను. మఱియు దీనిని నన్నయభట్టారకుఁడును తెనిఁగించియున్నాఁడు. ఇంకను భారతచంపువు మొదలైనభారతార్థప్రతిపాదకగ్రంథములలో నియ్యదియున్నది. ఈ దేశపుసంస్కృతభారతగ్రంథములు ప్రాచీనతాళపత్రములలో నున్నవానియందును నీకథాభాగము కానవచ్చుచున్నది.

గోరుదేని యిదె నీకు దివ్యదృష్టి నొసంగెద నని సత్యభామకు దివ్య జ్ఞానము నొసంగి వటవృక్షపునీడఁ జటిపొటిచినుకులలోఁ దడియుచు నున్న యర్జునుం జూచెను. అంత రాత్రి గడచి ప్రభాతం బగుడు వేఁగులవాండ్రు తీర్థయాత్ర పూర్తి గావించి యర్జునుండు ప్రభాస తీర్థంబునకు వచ్చియున్నవాఁడని యెఱుకపఱుపఁగా భగవంతుఁ డంతయు నెఱింగియు నేమియు నెఱుంగనివాఁడువోలె నాకర్ణించి యట్లగు నేని నేను బోయి యర్జునునిఁ జూచి వత్తు నని ప్రయాణమై ప్రభాస తీర్థము చేరెను. అటు లతఁడు చేరి, యప్పు డచ్చోనున్న పార్థుం జూచి క్షేమముల నారసి యాజగన్నాథుం డర్జునా! ఇదియేమి మాఱువేషమును ధరించియున్నావు? అని యడుగఁగా నప్పార్థుండు దేవకీసుతునితో నిజాభి మతంబుఁ దేటపడఁ జెప్పెను. వాసుదేవుం డాయుద్యమమును శ్లాఘించి యర్జును సునికికి రైవతకాద్రి తగుస్థలమని నియమించి తత్పూర్వము తన సమ్మతమున నలంకరింపఁబడియున్న యాపర్వతప్రాంతముల కర్జునుం దోడ్తె చ్చెను. అంతకుఁ బూర్వజన్మమున వా రిరువురును నరనారాయణు లను మహార్షులగుటం జేసి పూర్వజన్మస్నేహమును నిరువురునుఁ గొంతఁ దలపోసి యచ్చోట నిష్టవినోదంబుల సరసంపుఁబలుకులాడి మంచిఫలములను నమృతోపమానము లగు నాహారంబులను భుజించి యాదినమును రాత్రియు నచ్చటనే కడపి యప్పుడు గీతనృత్యములవినోదముల నానం దించి మెత్తనిశయ్యలపై నిరువురును బవ్వళించి యాహ్లాదకరము లగు కథలను నితిహాసములను దేలియాడి నిదురవోయి ప్రభాతమున మంగళ వాద్యధ్వనుల మేల్కాంచి నిత్యకృత్యములఁ దీర్చిరి. అంతఁ గొంతసేప టికి జనార్దనుండు యతిరూపముతో నున్న యర్జును నచ్చో నుండ నియ మించి యాతనికి సకలోపచారములును నడుచు చుంటకుఁ దగిన వసతు లేర్పఱచి వెంటనే ద్వారక కేతెంచి సుఖముతో నుండెను. అంతఁ గొన్ని దినములకు యాదవు లందఱును గూడి రైవతకమునందు మహో త్సవమును జేయ నుద్యమించిరి. ఆయుత్సవముయొక్క వేడుకఁ జూచు నిమిత్తము వసుదేవోగ్రసేనాక్రూరాదివృద్ధులును, రామకృష్ణులును, ప్రద్యు మ్నాది యాదవకుమారులును, దేవకి మున్నగు వృద్ధవనితలును, రేవతీ రుక్మిణీ సత్యభామా జాంబవతీత్యాద్యంతఃపురపుణ్యాంగనలును, సుభద్ర

మున్నగు కన్యకాజనంబులును రాఁగా వారలలోఁ దిరుగులాడు
చుండినసుభద్ర నర్జునుండు చూచి కామునిశాతశరాహతుఁడై యేమియుం
జేయలేక యూరక గుటకలు మ్రింగుచుండెను. అంత నా రైవతకోత్స
వంబు వినోదంబునఁ బ్రవర్తిల్లి సమాప్తంబగుటయు మహోత్సవసందర్శ
నాగతయాదవస్త్రీపురుషు లెల్లరును ద్వారకకుఁ దిరిగి వెళ్లిరి. సుభ
ద్రయు రైవతకాద్రికిఁ బ్రదక్షిణ మొనర్చి తానును వారివెంటఁ జనియె.

### అర్జునుండు ద్వారకాపురంబుఁ జేరుట

అంత నర్జునుండును రైవతకమును కృష్ణానుమతంబున వదలి
ద్వారకసమీపోద్యానమును జేరియుండెను. అచ్చోటి కొక్కనాఁడు
బలదేవాదియాదవు లాతోటయొక్క రామణీయకముఁ జూచు వేడ్కతో
రాఁగా నచ్చోట నుండునట్టివాని నర్జునుని యతివేషమున నున్న
వానిం జూచి కపటసన్న్యాసి యనక యథార్థయతి యని యందఱును
నమస్కరించి యాయతి యేయేపుణ్యతీర్థములఁ గ్రుంకు లిడెనో, యేయే
పుణ్యక్షేత్రంబుల దర్శించెనో ద్వారావతియం దెన్నినా ళ్లుండఁదలం
చెనో యని విధేయులై భక్తితో నడుగఁగా నాయతి వారికిఁ దగినరీతి
సదుత్తరముల నొసంగి తాను జాతుర్మాస్యల నచ్చోట జరుపుటకు నిశ్చ
యించియున్నాఁడ ననఁగా నప్పుడు బలరాముం డయ్యతియందు సుప్రీతుం
డై యాయతి యచ్చోటఁ జాతుర్మాస్యలను నడుపుటకు నిశ్చయించి
యుండుట దనకుఁ బ్రీతిఁ గొల్పఁగా నాతని నచ్చోట నుండుట
కేర్పాటు చేయుద మని తలపోయుచు సమీపమున నున్న శ్రీకృష్ణు
నితో నాసందర్భమును సూచించి సుభద్రాంతఃపురసమీపమున నొక
శృంగారంపుఁబూపొదరి ల్లుండఁగా నచ్చోట నాతనియునికి తగు నని
నిశ్చయించి శ్రీకృష్ణునితోఁ జెప్పఁగా నప్పు డాబలభద్రునకు జగ
న్నాథుం డిట్లనియె. ఈయతి మిక్కిలి రూపవంతుఁడుగ నున్నవాఁడు.
మనసుభద్రయు సౌందర్యాతిశయము గలది. ఎంతటి మహానీయు
లైనను జితేంద్రియులై యుండు టరుదు. ఇది కడపట నెట్లు పరిణ
మించునో యని సంశయింతు ననఁగా రేవతీరమణుఁడు రుక్మిణీరమణునితో
నిట్లనియె. కృష్ణా! ఊరక మహానీయులను శంకింపరాదు. వీ రుండుటకు
సుభద్రమందిరమే తగినది. అచ్చోట వీరికి విడిది యేర్పఱచుట లెస్స

యనఁగా నాజనార్దనుండు బలరామునిమాట నిరాకరింపఁదగని దని తనయసమ్మతమును గాన్పించినఁవాడువోలె నుండి తుదకెట్లో సమ్మతించి యాకపటసన్న్యాసిని నచ్చోటఁ జేర్చి వాని రహస్యవృత్తాంతమును రుక్మిణీసత్యభామలకు మాత్రము దెలిపి వెంటనే సుభద్రం బిలిచి యిట్లనియె సుభద్రా! ఈదేశాతిథియగు యతీశ్వరుని నీతోఁటలో విడియించితిమి. అతనికి వలసిన సకలోపచారములను జేయుచు నీచెలులతో నీవాతని కధీనవై యుండుము. ఈతనికి భోజనమజ్జనాదులను విచారించుటయందు నప్రమత్తురాలవై మెలంగుము. పూర్వము యాదవకన్యకలు యతుల కుపచారములను జేసి శుభముల నొందిరి. అని చెప్పఁగా సుభద్రయు నందుల కియ్యకొని యాయతికి సకలోపచారముల యందుఁ గొఱంతవడకుండ నమర్చెద ననెను. అట్లు సుభద్ర తన్నత్యాదరమునఁ జూచుచుండ నాకపటంపు సన్న్యాసి యాప్రమదావనంబున మదనానలంబు నోర్వలేక దాని రూపరేఖావిలాసములనే మనస్సునఁ దలపోయుచు నాకన్యక సౌందర్యాతిశయమునకు ద్రౌపదియొక్క సౌందర్యమును మఱచియుండెను. ఇవ్విధంబున నర్జునుండు తనకుఁ దీర్థయాత్రా సమయము గడచినను సుభద్రా సౌందర్యగుణాబద్ధచేతస్కుండై యింద్రప్రస్థపురమునకుఁ బోవలయు నని తలంపకుండెను.

### యతివేషమున నున్నయర్జునుండు సుభద్రయొద్ద నుండుట

అంత సుభద్ర పూర్వము గదుఁ డనుయాదవుండు తనతో నర్జునుని పుట్టుకయును, నాతని లావణ్యాతిశయమును, విలువిద్యయందలి నేర్పును, నతనిపరాక్రమమును జెప్పఁగా వినియుండెను. మఱియును శ్రీకృష్ణుం డాతని సుగుణములను నలువురిలో వర్ణించుచుండుటను విని యుండెను. ఇంతేకాక యాదవబాలురు దీవింపఁబడునపుడు వారి నాశీర్వదించుపెద్ద లర్జుననివంటి మేటివిలుకాఁడవు కమ్మని దీవించుచుండఁగా వినియుండుటచే సుభద్ర యప్పార్థునియందుఁ దవిలిన మనస్సు గలదియగుటచేఁ గురుజాంగలదేశములందుండి వచ్చువారి నెల్లర వాని శౌర్యగుణాతిశయముల నడిగి తెలిసికొనుచుండుటను వాని యాకార సౌష్ఠవము నెల్ల గుర్తెఱింగియుండుటను నాకపటసన్న్యాసిని నిత్యము చూచుచుండుటను, వానియం దాయర్జునుని యంగసౌష్ఠవమును నాజా

సుబాహుత్వమును బరికించి యీతం డాయర్జునుండే యగునా యని పలుమాఱు తలపోయుచుండెను. ఇట్లుండఁగా నొకపర్వసంధి దినమునం దర్జునుం డేకాంతమున నుండఁగా సుభద్ర పరిచర్య నంతయుం దీర్చి మీ రే యే దేశముల సంచరించితిరి ? ఏపుణ్యక్షేత్రములను గంటిరి? ఏతీర్థములయందు స్నాన మాచరించితిరి ? మీరు చూడని దేశము లున్నవా ? ఇంద్రప్రస్థమును గంటిరా ? అందు మాకు మేనత్త యగు కుంతీ మహాదేవి నెఱుంగుదురా ? ఆయమకుఁ గుశలమా ? ధర్మపుత్త్రా దులు సుఖులై యున్నారా ? వారిలో నెగుభుజంబులవాఁడును, సింహ మధ్యుఁడును, వెడదకన్నులవాఁడును, వెడలుపైన ఱొమ్ముగలవాఁడును, మోఁకాళ్లవఱకు వ్రేలాడుచుండు చేతులుగలవాఁడును, నీలంపు మెఱుఁగుచాయ మేనివాఁడును, బవిరిగడ్డమువాఁడును, బరాక్రమ వంతుఁడు నగు నర్జునుని నెఱుంగుదురా? యనఁగా నమ్మోసంపు సన్న్యాసి యాసుకుమారి కిట్లనియె. పాండవులును గుంతీమహాదేవియును ద్రుపద రాజకూఁతురును నింద్రప్రస్థమున సుఖ మున్నవారు. అర్జునుండు మాత్రము తల్లికిని నన్నదమ్ముల కెఱుక లేకుండ ద్వారకాపురమున యతివేషముతోడ సుభద్రయెదుట నున్నవాఁడు. అని చెప్పఁగా విని సుభద్ర సిగ్గునొంది తలవాంచి నేలం జూచుచుండె. అంత నర్జునుండు దానియెడఁ బ్రీతుండై యోవరాంగీ! నేనే యర్జునుండను. నీకు నాయెడ నుండు మోహమునకంటె నాకు నీయెడఁ బెక్కు మడుంగులు మోహము గలదు. ఒక శుభదినమున సుముహూర్త మందు నిన్నుఁ బెండ్లియాడి సావిత్రితోఁ గూడిన సత్యవంతునిఁబోలె సుఖింపుదు నని చెప్పి తన లతాగృహమున కేఁగెను. సుభద్రయు శృంగా రమునయొక్క లాలిత్య మచ్చుపడునట్లు లజ్జావనతవదనయై యుండె. వీ రిరువురి మనోభావములను శ్రీకృష్ణుం డెఱింగి యప్పటినుండి యర్జ నునకు భోజనాద్యుపచారములఁ గావించునిమిత్తము రుక్మిణీదేవిని నియమించె. అంత సుభద్ర తనమోహనాంగునితోఁ దనకుఁ బ్రత్యక్ష దర్శనమును దెలిసి మదనవికార మతిశయింప నున్మాదినియుంబోలె భోజనాసనశయ్యాదులకు విముఖయై దురంతమగు వంతఁ గుందుచుండె. దేవకి యట్లు మదనోన్మాదినియై యున్న కూఁతుఁ జూచి, ముద్దరాలా!

వేల యిట్లు వందురెదవు? నీమనోభీష్టమును మగవారితోఁ జెప్పి నీయభిమతం బీడేరునట్లు చేసెద నని కూఁతువాంఛను వసుదేవునకుఁ దెలిపెను. ఆ వసుదేవుండు నుగ్రసేనాక్రూరాదిహితులతోడఁ జెప్పి వాసుదేవు ననుమతిం బొంది బలరామునకుఁ దెలియనీయక యానాఁటికిఁ బదియవదినమున సుభద్రార్జునుల వివాహోత్సవమును నిశ్చయించి యంతర్ద్వీపమునందు బండ్రెండుదినంబులు రేపవలు మహోత్సవము జరుగఁ జాటించెను. అంత నమ్మహోత్సవమునకు ద్వారావతియందుండు జను లాబాలగోపాలము వెడలి పదియోజనముల నిడివిగల యా యంతర్ద్వీపమున కేఁగిరి. అంత నాకపటసన్యాసి మాటను విని సుభద్ర జనార్దనుని సమీపించి, యన్నా! నీవును నంతర్ద్వీపమున కేఁగుచో నాయతికి సేవ లొనర్చుట కష్ట మగును. కావున నీవిచ్చోటనే యుండుట శ్రేయస్కర మనఁగా ముద్దుచెలియలి కా కపటనాటక సూత్రధారుఁ డిట్లనియె. సుభద్రా! ఈసమయమున నాసన్యాసికి సకలోపచారముల నమర్చుటకు నీవు దక్క నన్యు లోపరు. కావున యతిసేవయం దప్రమత్తురాలవై కీర్తిని ధర్మమును నెఱవేర్చుచు నాతని యాజ్ఞను దలందాల్చి చేయుచుండవలయు నని వచించి మంగళధ్వనులు వినుచుండ జనార్దనుం డంతర్ద్వీపమహోత్సవమున కేఁగెను. అచ్చోట మహోత్సవము జరుగుచుండఁ గాంతలు తమరమణులతోఁ గూడికొని రమణీయ ప్రదేశంబుల విహరించుచు వేడ్క మీఱ ననేకసుఖముల ననుభవింపుచుండిరి.

### అర్జునుండు సుభద్రం బెండ్లియగుట

ఇట ద్వారావతియం దర్జునుండు సుభద్రను బెండ్లాడుటకు నదియ తగుసమయ మని తలంచి యాతరుణి తనకుఁ బరిచర్య లొనర్చుచుండ దానితో నేకాంతమున నిట్లనియె. ఓశుభాంగీ! కన్యకను దాన మొనర్చుటకుఁ దండ్రి యన్న మున్నగువారు తగినవారు. అట్లు వా రిచ్చిన కన్యాదాన మగ్నిసాక్షికముగఁ బ్రవర్తించు నేని వారిరువు రప్పటినుండి దంపతు లనఁబడుదురు. పతికి భార్య ప్రియురాలై యనువ్రతయై నెగడియుండుట విఖ్యాతంబగు సద్ధర్మము. కావున నిప్పుడు వా రెవ్వరును నిన్ను నా కిచ్చి పెండ్లిగావించుటకు వీలు కనుపడదు.

కావున మనము గాంధర్వంబునఁ బెండ్లి చేసికొందము. ఈవిధమగువివాహ
మునందుఁ బ్రియురాలును బ్రియుఁడును మంత్రములేకయే సంగమించు
దురు. ఇట్టివివాహము క్షత్రియుల కర్హము. కావున మన మీవిధమున
నీరాత్రి వివాహము చేసికొందము. నీయభిమతం బే మని యడుగఁగా
సుభద్ర యేమియుఁ జెప్పక యూరకుండి భగవంతుఁ డగు శ్రీకృష్ణుని
ధ్యానించుచుఁ గంట నీరు పెట్టుకొనెను. అర్జునుం డీ తనతలం పె ట్లీడే
ఱునో యని తలపోయుచు నింద్రుం దలంపఁగా నా సురపతి యానాఁటి
రేయి నారదుని వసిష్ఠుని నింకను గొందఱు దేవర్షులను దోడ్కొని
యరుంధతీ శచీదేవులతోఁ గొంద ఱప్సరసలతో నచ్చోటికి విచ్చేసెను.
జగన్నాథుం డంతర్ద్వీపంబున సుభద్రతలం పెఱిఁగి నిద్రాపరవశుఁడై యుం
డిన బలరాముని వదలి తా నొక్కరుం డక్రూరుని, సాత్యకిని, గదుని
దోడ్కొని వసుదేవదేవకీరుక్మిణులు మున్నగువారు తనవెంట రాఁగా నా
రాత్రి యచ్చోటికి విచ్చేసెను. అట్లు వచ్చినజగన్నాథునిఁజూచి మహేం
ద్రుండు తనపుత్త్రుం డగు నర్జునునకు సుభద్ర నొసంగి వివాహము
గావింపవలయు నని ముందు క్షేమప్రశ్నరూపముగ ముందలించెను.
అంత జగన్నాథుం డామహేంద్రువచనము నంగీకరింపఁగా యాదవు
లందఱును పాకశాసనుం జూచి సురపతీ! కృతార్థులమైతిమి. ఇంత
కంటె మా కుచితసంబంధ మున్నదే ? ఇయ్యది మహాప్రసాదం బనిరి.
పిమ్మటఁ బరమాత్ముం డర్జునునకు మంగళస్నానములఁ గావింప నియ
మించి యట్లు పార్థుఁడు సేయఁగా నాతనిని దివ్యమాల్యములచేతను
వస్త్రములచేతను, రత్నాభరణములచేతను నలంకరించి వివాహమంట
పమునకుఁ దోడ్తెచ్చెను. ఆసమయమున నరుంధతియు శచియు దేవకీ
రుక్మిణులు మున్నగు పేరటాండ్రు పేరంటములు గావింప సుభద్రను జలక
మాడించి యమూల్యాభరణములచే నలంకరించి యా వధువును బిలుచు
కొనివచ్చి పెండ్లిమంటపమున నున్న వరుని ప్రక్కఁ గూర్చుండఁ
బెట్టిరి. వివాహము కాశ్యపుచేత జరిపింపఁబడెను. నారదవసిష్ఠాది
మహర్షులు సదస్యులై యుండిరి. లోకపాలు రెల్లరును వివాహకాల
మున విచ్చేసి యుండిరి. ఇంద్రోపేంద్రు లాపెండ్లిని నిర్వహించిరి. అంత
నెల్లవారును బరమానందమునఁ దేలిరి. ఆ దంపతుల యనురూపదాంప

త్యమునకు దేవతలు సంతసించి యాదవుల వీడ్కొని జనార్దను వినుతింబఁడసి నాకంబునకుఁ జనిరి. యాదవులును భార్య సెల వొంది యంతర్ద్వీపమునకుఁ బోయిరి. అంత వాసుదేవుం డర్జునునితో నిట్లనియె. పార్థా! నీ విచ్చోట నిరువదిరెండు దినము లుండుము. పిదప సైన్య సుగ్రీవ మేఘపుష్పవలాహకము లను నాల్గు గుఱ్ఱములను బూన్చిన యీ తేరునందు సుభద్ర నెక్కించుకొని యింద్రప్రస్థమునకుఁ బొమ్మని చెప్పి తానును నంతర్ద్వీపమున కేఁగి శాంతచిత్తుండై యుండె. ఆకృష్ణుని నియమితదినములు కాఁగా నర్జునుండు సుభద్రతో నేను నిష్ఠతో సలిపిన మహావ్రతము నీదినమున సంపూర్తి గావించెద. బ్రాహ్మణ సమారాధనకు వలసిన భక్ష్యభోజ్యచోష్యలేహ్యపానీయములతో నన్నంబు సమకూర్పుము. ఎల్లవారికి సంతర్పణమును దెలుపుము. సైన్యసుగ్రీవాదిహయములఁ బూన్చిన శ్రీకృష్ణుని రథమునందు వివిధ యుద్ధోపకరణముల నాయితంబు చేసికొని రమ్మని చెప్పెను. సుభద్రయు నర్జును నానతిమెయి సర్వమును సిద్ధపఱచి రథమును గట్టాయితంబు చేసి యందుఁ దా నెక్కి యర్జునునితో 'నోమహాశూరా! ఇదిగో రథము సంసిద్ధమై యున్నది. రమ్ము. మనము కురురాజ్యమునకుఁ బోవుదము.' అనఁగా నర్జునుండు సుభద్ర చెలికత్తెలను దేరెక్కించుకొని సుభద్రతో వేగమున నింద్రప్రస్థపుదారిఁబట్టి యరుగుచుండె. అంత ద్వారావతియం దుండినవా రిది యేమి? అర్జునుండు సుభద్ర నపహరించికొని పోవుచున్నవాఁడు. వీనిని మార్కొని యెట్లైనను సుభద్రను విడిపింపవలయు నని యాదవశూరులు కొంద ఱర్జునునిపై శరవర్షములఁ గురిపించిరి. అప్పు డర్జునుండు తన శరసంధానవేగంబునఁ దన్నెదిరించినవారిమద మడంచి యెట్లో తప్పించుకొని రైవతకపర్వతమును దాఁటి పోవుచుండెను.

అంత వా రందఱు నర్జునువిక్రమంబును, ద్వారావతియందు యాదవశూరులెవ్వరును లేనిసమయమున నాతఁడు సాహసంబున సుభద్ర నపహరించికొని పోవుటయు సభాపాలున కెఱింగించె; నాతం డంతర్ద్వీపమున నున్న యాదవుల కీవృత్తాంతం బెఱింగించెను. అప్పుడు వా రంద ఱెక్కడివా రక్కడఁ దారు చేయుచుండినపనుల వదలి యర్జునునిదౌష్ట్య

ములు దూఱుచు సేనను గట్టాయితపఱచి యర్జునుని వెన్నంటి వాని మదం బడిపి సుభద్రను దోడ్తెత్త మనుచుండఁగా బలదేవుండు వార లను వారించి వాసుదేవుని యభిప్రాయము నెఱింగివత్త మని శౌరిని సమీపించి యిట్లనియె. కృష్ణా! చూడుము పాండవుం డెంత సాహస మొనర్చెనో, వాఁడు మన కెట్టియపచారమును గావించెనో. నీ వేల యి ట్లూరకున్నవాఁడవు? ఈయవమానమును సహించి యూరకుండుట కంటెఁ జావు మేలు. అనుమతి యొసంగుము. లోకము నగౌరవముఁగ నిప్పుడ చేసివచ్చెద. అని సరోషంబుగఁ బల్కుచుండ నాకపటనాటక సూత్రధారి యన్నకు ధర్మార్థము లచ్చుపడ నిట్లనియె. అర్జునుఁడు మన కొనర్చిన యపకృతి యేమి? మఱియును వాఁడు మనకు వావిని మేనత్త కొడుకు గావలయును. వానికంటె సుభద్రకు మనము మేలైనవరు నెచ్చటినుండి తేఁగలము. రాక్షసవిధానమున వివాహ మగుట క్షత్రియు లకు సద్ధర్మము. కావున నుత్తమక్షత్రియుఁ డగునర్జునుండు కన్యాదానము సమంత్రకపాణిగ్రహణము నపేక్షింపఁడు. మఱియు మీ రెల్లరు సమకట్టి వానితోఁ బోరుటకు యత్నించుచున్నవారు. వానిని సమర మున గెల్చుటకు శూలికైనం దరమే? కావున మీరు వానిని జయింప లేరు. ఊరకుండఁగ మనసొప్పదేని వాని ననిం దాఁకి యోడి యప కీర్తిపాలై రండు. అందులకు మాఱుగ వానితో సమాధానపడి, వాని నుచితంపుఁ దెఱఁగున సత్కరించుట లగ్గనఁగా యాదవు లందఱును భగవద్వాక్యమును మెచ్చి యానందించిరి.

అర్జునుఁడు సుభద్రం దోడ్కొని యింద్రప్రస్థపురంబున కరుగుట

అంత నర్జునుండు సుభద్ర నపహరించికొని పోవుచుండఁగాఁ దన్నడ్డగించిన యాదవులంగొట్టి సందుచేసికొని మార్గమునందలి విశేషము లను రథము వేగమునఁ బోవుచుండఁగా సుభద్ర కత్యుత్సాహంబుతోఁ దెలుపుచు నింద్రప్రస్థపురముం జేరి భూసురులకును దల్లికిని నన్నల కును మ్రొక్కి ద్రౌపదియంతిపురంబునకుఁ జనెను. అంత నప్పాంచాల రాజపుత్త్రి ధనంజయుంజూచి 'ఫల్గునా! ద్వారావతియందు సుభద్రతో సర సంపుఁబలుకులఁ బలుకుచు నంద యుండక యిప్పారమున నిప్పుడు రానేల?' అనియు, 'రాజులు నూతనప్రియులు గారా? ఎంత దృఢమైనను బంధము

బహుకాలమైనచో శిథిలమగువిధమున నెట్టిప్రీతియును దీర్ఘకాలమున బుష్టమై చనును.' అని పరిహాసంపుఁబల్కులుపల్కి పాంచాలి నర్జునుం డను నయించి వెంటనే గోపికారూపంబున సుభద్రను గుంతీద్రౌపదులకు నమస్కరింపు మని సైగ చేసెను. అప్పుడు సుభద్ర యర్జునుని కనుసన్న నెఱిఁగి యవ్విధమునఁ బాండురాజమహిషికి మ్రొక్కఁగా నాపుణ్యయువతి కోడలిశిరము మూర్కొని కడుఁబ్రీతితో దీవించెను. అంత నా యాదవ యువతి వెంటనే పాంచాల రాజపుత్త్రికి నమస్కరింపఁగా నాదేవి తాను వెంటనే లేచి జనార్దనుని చెలియలినిఁ గౌఁగిలించుకొని ప్రియమున నాశీర్వదించెను. ఇవ్విధమున వారందఱును సంతసంబున మెలఁగుచుండిరి. అంత వాసుదేవుండు బలభద్రసమేతుండై మహాదాత యని ఖ్యాతిఁ జెందిన యక్రూరుండును, దేవగురుశిష్యుండైన యుద్ధవుండును సత్యక, కృతవర్మ, సాంబ, ప్రద్యుమ్న, చారుదేష్ణ, సారణ, గదాదు లగు యాదవులును వెంటరాఁగా సుభద్రకు నరణముఁగొని యింద్రప్రస్థమును సమీపించుటయు నీవృత్తాంతము ధర్మనందనుం డెఱింగి వారి కెదురుగా నకులసహదేవులను దన తమ్ములఁ బంపి రామకృష్ణులను సకల యాదవులతో మహేంద్రు నమరావతింబోలె వెలయుచుండు నింద్రప్రస్థమును బ్రవేశింపఁజేసి యొడ్డోలగమునఁ బురజను లావైభవమును గొనియాడుచుండ నగరు సేరిరి. అంత ధర్మనందనుండు తనకు నమస్కరించి బలరామకృష్ణుల లేవనెత్తి కౌఁగిలించుకొని వారిశిరము మూర్కొని ప్రీతిఁ జూపుచుండె. రామకృష్ణు లుచితముగా నమస్కారాభివందనములచే నచ్చోటివారిని సత్కరించి తాము తెచ్చిన సర్వాలంకారములతో విరాజిల్లు భద్రగజములు వేయింటిని రథ్యసారథిసమేతములగు కాంచనరథములు వేయింటిని, బాహ్లికదేశజనితములును గాంభోజదేశానీతములును నగు నశ్వముల లక్షను, బాడియావులు పదివేలింటిని, సర్వాభరణభూషితులైన పరిచారికాసహస్రంబులను, మితిలేని యమూల్యములగు రత్నాభరణాంబరములను, లెక్కలేని వాహనములను నరణంబుగా సమర్పించి సుభద్ర యత్తవారి యింటివారినెల్ల నానావిధ వస్త్రములచేతను నాభరణములచేతను బూజించిరి. యుధిష్ఠిరుండు యాదవులు తెచ్చినయరణము నంతయు స్వీకరించి వాని నర్హులైనచోట్ల సమర్పి

వచ్చినయాదవకుమారుల కెల్ల రాజోచితములగు విందు లొనర్చిన వారి కెల్లరకు నుచితప్రతివస్త్రాభరణములను గట్నములుగా సమర్పించి వారి నెల్ల నింద్రప్రస్థపురంబునఁ గొన్నిదినము లుండ వేఁడగా వా రట్లుండి, పిదప బలరాముఁడు తమకు ముందు నడుచుచుండ నెల్లరును ద్వారకా పురికిం జనిరి. జనార్దనుం డర్జునునితో నిష్టాలాపముల నింద్రప్రస్థపురంబు నందుఁ గొన్ని నా ళ్లుండెను.

### అభిమన్యుని జననము

అప్పుడు కృతకృత్యు లగు సుభద్రార్జునులకు మంచికీర్తి గలవాఁడును, వైన్యునితోఁ దుల్యుండును, ననన్యతుల్యపరాక్రమశాలియు, విశాలవక్షుండును, బుణ్యసంపాదకచరిత్ర గలవాఁడును, శత్రురాజులకు భయంకరుండును నగు కుమారుండు పుట్టెను. అప్పుడు ధర్మనందనుండు పదివేలపాడిమొదవులను, బదివేలవరహాలను బ్రాహ్మణార్థంబుగా నొసంగె. జమ్మికొయ్యను నశ్వత్థకాష్ఠముచే మథింపఁగాఁ బుట్టి ప్రకాశించు వీతిహోత్రునివిధమునఁ గౌరవుం డైనయర్జునునివలన యాదవి యగు సుభద్రయందుఁ బుట్టి మహాతేజోవంతుం డై యున్న యాకుమారునకు భయరహితత్వమును, మన్యుసహితత్వమును హేతువులుగా నభిమన్యుం డని* నామకరణము గావించిరి. ఆపాండురాజపౌత్రుండు శుక్లపక్ష చంద్రునిమాడ్కి దినదిన ప్రవర్ధమానుం డై వాసుదేవునకు మిక్కిలి ప్రీతి పాత్రుం డయ్యెను. అంత నుచితకాలంబున వానికి జాతకర్మనామకరణ చౌళోపనయనాదిక్షత్రియోచితసంస్కారములను ధౌమ్యుఁ డొనర్చెను. ఆ ఋషివర్యునియొద్ద సాంగోపాంగముగ వేదాధ్యయనము గావించెను. అంతఁ దండ్రి యగు సవ్యసాచియొద్ద మంత్రముక్త, పాణిముక్త, ముక్తాముక్త, అముక్తములను నాల్గుపాదములును, నాదాన, సంధాన, మోక్షణ, వినివర్తన, స్థాన, ముక్తి, ప్రయోగ, ప్రాయశ్చిత్త, మండల, రహస్యము లను పదియంగములతో వెలయు ధనుర్వేదమును

---

* న భీః యస్య సః=అభీః, మన్యువిశిష్టత్వాన్మన్యుః అభీశ్చాసౌ మన్యుశ్చ- అభిమన్యుః. అభీ = భయములేనివాఁడు, మన్యుఁ డనఁగా కోపముఁగలవాఁడు. భయములేనివాఁడును, శత్రువులపైఁ గోపముగలవాఁడును, కావున నభిమన్యుఁ డనఁబడియె. పృషోదరాదిగణపాఠమునఁ బఠితముగాన నీశబ్దము సాధువు.

బ్రహ్మాస్త్రాది దేవతాసాధనములను, వివిధమానుషశాస్త్రములను * నేర్చి యపరసవ్యసాచి యనఁ బ్రసిద్ధుండయ్యె. మఱియును ద్రౌపదికి ధర్మతన

---

* విధిపాదము, మంత్రపాదము, పూజాపాదము, రహస్యపాదము అనునవి నాల్గుపాదములు:—

శిక్ష, విధి, ప్రయోగము, ముష్టి, లక్ష్యము, పాతనము, అస్త్రము, అస్త్రతప శ్చర్య, దేవమానుషాస్త్రముల ప్రమోక్షణములు, ముక్తము లగువాని నుపసంహ రించుట యనునవి పదివిధములు:—అముక్తము, ముక్తాముక్తము, మంత్రముక్తము అనునవి నాలుగుపాదము లని మఱియొకమతము. మఱియు బాణమును పొదినుండి తీసికొనుట ౧, వింటఁగూర్చుట ౨, బాణము విడుచుట ౩, అస్త్రములనఱప తెలివి ౪, అనునవి నాలుగుపాదము లని మఱియొకమతము. శస్త్రము ౧, అస్త్రము ౨, ప్రత్యస్త్రము ౩, పరమాస్త్రము ౪ అనునవి నాల్గుపాదము లని వేఱొకమతము.

విండ్ల భేదములు:—శాంశప్రమాణ మనుపేరు గలిగి యన్నియుద్ధములకు నుప యోగించునది ౯౬ అంగుళముల పొడవుగల శార్ఙ్గమనువిల్లు (అనఁగా అడవిదున్న పోతు ముదురుకొమ్మును నీటిలో నానవేసి పట్టలుగా నొలిచిన రెండుపొడుగైన పట్టలు బయటితట్టును, దానిలోపల రేగుకొయ్యచెక్కలు ౫ గాని, ౬ గాని వజ్రముతో తడిపిన మేకనరములు చుట్టి యెండించి దానిమీఁద నింగిలీకము పూసి వన్నెలు పెట్టి తీర్చినది.)

రెండవది యగుశార్ఙ్గము ౯౦ అంగుళముల పొడవుగలిగి దూరములనుండు గుఱుతులకుఁ దగియుండును. మూఁడవది ౮౪ అంగుళముల పొడవుగలిగి కదలు చుండు గుఱుతులను, కదలని గుఱుతులను బడవేయుటకుఁ దగినది. నాలవది ౭౨ అంగుళములు పొడవుగలిగి సాధారణయుద్ధములకును వేఁటలకును దగినది. విండ్లు ఈనాలుగువిధము లని మాత్రమే యొకమతము.

మఱియు నంటలు వ్రాళ్లు చిమ్ముగల యంటవిల్లు అనునది యొకటి కలదు. దీని కల్లెత్రాళ్లు రెండు. ఇది వెదురుబద్దతోఁ గాని, తడకొయ్యతోఁ గాని, రేఁగు కొయ్యతోఁ గాని చేయఁబడి రెండుత్రాళ్లకు నడుమ నుడుముచర్మముతోఁ గాని దారముతోఁ గాని కలుపఁబడియుండునది.

మఱియు నింకొకవిల్లును గలదు. ఇది మూరెడుపొడుగు గలది. ఇందు జేనెడే బాణములను సంధింతురు. శత్రువు సమీపమునకు వచ్చినప్పు డీవిల్లును బూని యుద్ధము చేయుదురు. అల్లెత్రాడు, పుంఖము, అస్తకము, నళిక, తలత్రాణము, శిర స్త్రాణము, అంగుళిత్రాణము అనునవియును, నారాచము మొదలగు ననేకవిధము లగు నమ్ములు చేయించుట, తీర్చుట, ఏయుట అను భేదములును, మఱియు నీటిపండ లకుఁ దూట్లు పొడుచుట యను సుకుమారలక్ష్యము ౧, మఱియుఁ గొండలను

యునివలనఁ బరప్రహారణజ్ఞానము గలవాఁడు గానఁ బ్రతివింధ్యుఁ డను నామమున వెలయుచుండు కుమారుండు గలిగెను. అనేక సోమయాగ

---

రంధ్రము లగునట్లు తొలఁచుట యనునవి చాల్యలక్ష్యము ౨, రాక్షసులయు, నేనుఁగులయు నొడళ్లు దూఱ నేయు గురులక్ష్యము ౩, గురిగింజకొనకుఁ గట్టి వ్రేలాడ వేసిన వెంట్రుకను నఱుకుసూక్ష్మలక్ష్యము ౪. ఇవి నాలుగును లక్ష్యభేదములు.

విశేషలక్ష్యభేదములు ౧౧. అవి క్రమముగ:—శబ్దమును బట్టి వదలుట ౧, నీటిలోపల అద్దములోపల నేతిలోపల నీడను జూచి గుఱుతులను దెగ వేయు ప్రతిబింబలక్ష్యము ౨, రసలక్ష్యము ౩, గంధలక్ష్యము ౪, చలనలక్ష్యము ౫, భ్రమణలక్ష్యము ౬, దూరలక్ష్యము ౭, వెనుకటిలక్ష్యము ౮, స్పర్శలక్ష్యము ౯, దుర్నిరీక్షణలక్ష్యము ౧౦, స్థిరలక్ష్యము ౧౧.

ముక్తలక్షణము: ఇవి పండ్రెండువిధము లగు నాయుధములు:—ఇషీక ౧, చక్రము ౨, తోమరము ౩, దన్తకణ్టకము ౪, ద్రుఘణము ౫, ధనువు ౬, నళిక ౭, పాశము ౮, భిణ్డివాలము ౯, భుశుంఠి ౧౦, అగుడము ౧౧, శక్తి ౧౨. వీనిని బ్రయోగించుట, ఉపయోగించుట వీనియందు నేర్పునకు ముక్తమని పేరు. ముక్తము అనఁగా విడువఁబడినది. వీనిని బ్రయోగించినపిదప నవి మఱలఁ జేతికి రావు.

అముక్తలక్షణము—వీనియం దాయుధములను చేత నుంచుకొని పోట్లాడుదురు. అముక్త కుపయోగపడునవి యిరువది ఆయుధములు. అవి క్రమముగ:—అసిధేనుక ౧, ఆన్తరము ౨, ఈళి ౩, కున్తలము ౪, గద ౫, గోశీర్షకము ౬, పట్టిసము ౭, పరశువు ౮, పరిఘము ౯, ప్రాసము ౧౦, పినాకము ౧౧, మయూఖిక ౧౨, ముద్గరము ౧౩, ముసలము ౧౪, మౌష్టికము ౧౫, లవిత్రము ౧౬, వజ్రము ౧౭, శతఘ్ని ౧౮, సిర ౧౯, స్థూణము ౨౦.

దండలు ౧౧. అవి వరుసగ—ఎడమయోరభృంగి ౧, కుక్కుటపుదండ ౨, కుడియోరభృంగి ౩, గజదండ ౪, పైసరపుదండ ౫, పాడలికదండ ౬, భృంగిదండ ౭, భృంగిపటలము ౮, మద్దలసంచుదండ ౯, సమదండ ౧౦, సింగపుదండ ౧౧.

పరువడులు ౧౦. అవి క్రమముగ—ఎడమయడుగుపరువడి ౧, ఒంటియడుగుకత్తెర ౨, కదలుపరువడి ౩, కుడియడుగుపరువడి ౪, చిట్టడుగుకత్తెర ౫, జాగినపావు ౬, దాఁటడుగుపరువడి ౭, పావుపావు ౮, పాడలికకత్తెర ౯, సర్పబంధకత్తెర ౧౦.

గతులు ౧౧:—గజగతి ౧, కటకగతి ౨, జంబుకగతి ౩, తాండవగతి ౪, పక్షిగతి ౫, మర్కటగతి ౬, మహిషగతి ౭, మార్జాలగతి ౮, వ్యాఘ్రగతి ౯, శూరిగతి ౧౦, హరిణగతి ౧౧.

ములఁ గావించినపిదప భీమసేనునివలన ద్రౌపదికి సుతసోముఁడను పుత్త్రుఁడు గలిగెను. జగత్ప్రఖ్యాతి గలిగించు తీర్థయాత్రానంతరము

---

గాయమానములు ౧౨:—ఉరిత్రాడు ౧, తోలకరిమెఱుపు ౨, నల్లిముత్తు ౩, నాగబంధము ౪, పదఖండనము ౫, రామబాణము ౬, లోబిత్తరి ౭, విష్ణుచక్రము ౮, వెలిబిత్తరి ౯, విస్సందు ౧౦, సర్పాంకుశము ౧౧, హస్తాభరణము ౧౨.

మొనలు ౧౨: అవి వరుసగా:—అఱిమీటుమొన ౧, అనిమొన ౨, కదలుమొన ౩, చదురుమొన ౪, చాటడుగుమొన ౫, దాఁటడుగుమొన ౬, నెఱిమీటుమొన ౭, పాపపుమొన ౮, పుణ్యపుమొన ౯, లోమొన ౧౦, వెలిమొన ౧౧, సరితాళపుమొన ౧౨.

నఱుకులు ౫:—గుజ్జు ౧, మారణి ౨, దుముకు ౩, నఱుకు ౪, లోదేరి ౫.

పట్టావిసరులు ౧౪. అవి క్రమముగా:—ఉద్ధడ ౧, కథాకు ౨, ఝాటు ౩, టీక ౪, దారు ౫, దారుధారం ౬, దాకరుగపాలు ౭, ధడ ౮, ధాణు ౯, ధాణుకధాలు ౧౦, ధాణుధారు ౧౧, ధారుకధాణు ౧౨, నాట్యము ౧౩, యంత్రము ౧౪.

విన్నాణములు ౩౨. అవి క్రమమున:—ఉద్ఘాటము ౧, కత్తి ౨, కందనము ౩, కర్నాతు ౪, కల్లము ౫, కాసెనిలకడ ౬, కిల్లి ౭, కుమ్మరింపు ౮, కొక్కెస ౯, కొంతుమారు ౧౦, గళకత్తర ౧౧, చేబ ౧౨, చొంగణము ౧౩, జాడింపు ౧౪, డొక్కెర ౧౫, సుబారము ౧౬, నృసింహము ౧౭, పణము ౧౮, పదగళాప్తి ౧౯, పాదనివారణము ౨౦, పెట్లగు ౨౧, బారిబోడుచుట ౨౨, ముత్తరడొక్కెర ౨౩, రాణింపు ౨౪, కింగిణి ౨౫, రొంటివేటు ౨౬, లాగు ౨౭, లొట్టు ౨౮, వింటాలము ౨౯, సంసపీపము ౩౦, సమసీసము ౩౧, నరిబిత్తరి ౩౨ అనునవి. వీనికి సంస్కృతమున వరుసగా వేఱుపేళ్లు గలవు.

మెలఁకువలు ౧౨, అవి క్రమముగ—కదలుదుటు ౧, కరలాఘవము ౨, కలయుమెలఁకువ ౩, ఝుంపు ౪, దండనిలకడ ౫, దిశావదిశలు ౬, దేహపుపారువ ౭, పాదపుపారువ ౮, పిక్కె ౯, లివరాకడ ౧౦, లింగళింపు ౧౧, హస్తపుపారువ ౧౨.

వ్యూహములు ౭. ఇవి ప్రధానములు:—దండము ౧, ధ్వజము ౨, మకరము ౩, వజ్రము ౪, శకటము ౫, శ్యేనము ౬, సూచి ౭.

అవాంతరవ్యూహములు:—పద్మ కూర్మ శృంగాటక గరుడాదులు. ఈ వ్యూహములం గట్టుట, పగల్చుట, అతిభేదములు గలిగియున్నవి. మఱియు, రథగజతురగాదివాహనములను జంతువులను నెక్కియు క్రింద నిలిచియు నేట్లాడు విన్యాసములు నున్నవి.

పుట్టినవాఁడు గనుక శ్రుతసోముఁ డనుపేరితో నర్జునునివలన ద్రౌపదికి నందనుండు వొడమె. పెద్దలపేరును మఱువరా దని నకులపుత్త్రుఁడు

---

అస్త్రములు ౧౧౪. అవి క్రమముగా—అంతకాస్త్రము ౧, ఆంధాస్త్రము ౨, అట్టహాసాంబికాస్త్రము ౩, అర్ణవాస్త్రము ౪, అనలాస్త్రము ౫, అనిలాస్త్రము ౬, అభయంకరాస్త్రము ౭, అసిరత్నాస్త్రము ౮, ఆర్ద్రాశన్యస్త్రము ౯, ఆయుర్నాశాస్త్రము ౧౦, ఆసురాస్త్రము ౧౧, ఐంద్రాస్త్రము ౧౨, ఐషికాస్త్రము ౧౩, కంకణాస్త్రము ౧౪, కంకాళాస్త్రము ౧౫, కందర్పదయితాస్త్రము ౧౬, క్రౌంచాస్త్రము ౧౭, కఠినకర్పరాస్త్రము ౧౮, కల్యస్త్రము ౧౯, కార్తవీర్యాస్త్రము ౨౦, కాలాస్త్రము ౨౧, కాలచక్రాస్త్రము ౨౨, కాలనాశాస్త్రము ౨౩, కాలాస్త్రము ౨౪, కీర్యస్త్రము ౨౫, కూర్మాస్త్రము ౨౬, ఖడ్గాస్త్రము ౨౭, గండభేరుండాస్త్రము ౨౮, గాంధర్వాస్త్రము ౨౯, గరుడాస్త్రము ౩౦, గాయత్య్రస్త్రము ౩౧, చతుఃస్మృత్యస్త్రము ౩౨, జృంభకాస్త్రము ౩౩, త్వష్ట్రస్త్రము ౩౪, తామసము ౩౫, త్రివిక్రమము ౩౬, తిమిరము ౩౭, తృషాస్త్రము ౩౮, తేజఃప్రభ ౩౯, త్రైయంబకము ౪౦, దర్పణాస్త్రము ౪౧, దశకంధరాస్త్రము ౪౨, దారుణము ౪౩, ద్వివిధాస్త్రము ౪౪, దుర్ధర్షము ౪౫, ధర్మచక్రము ౪౬, ధర్మపాశము ౪౭, నందనము ౪౮, నాగాస్త్రము ౪౯, నామత్రయాస్త్రము ౫౦, నారాయణము ౫౧, నృసింహము ౫౨, ప్రమథనము ౫౩, ప్రశమనము ౫౪, ప్రసన్నాంబుదము ౫౫, ప్రస్వాపనము ౫౬, పాశుపతము ౫౭, పైశాచము ౫౮, బ్రహ్మశిరము ౫౯, బ్రహ్మాస్త్రము ౬౦, బల్యస్త్రము ౬౧, బౌద్ధము ౬౨, భగదారుణము ౬౩, భయము ౬౪, భార్గము ౬౫, మదనము ౬౬, మహాకాళ్యస్త్రము ౬౭, మానవము ౬౮, మాయాధరము ౬౯, ముసలము ౭౦, మూకము ౭౧, మృత్యుంజయము ౭౨, మోదకి ౭౩, మోహనము ౭౪, మౌసలము ౭౫, రాజయక్ష్మాస్త్రము ౭౬, రాజాసురము ౭౭, రామాస్త్రము ౭౮, వజ్రాస్త్రము ౭౯, వరుణపాశము ౮౦, వాయవ్యము ౮౧, వారుణము ౮౨, వాసుదేవము ౮౩, విలాపనము ౮౪, విశ్వావస్వస్త్రము ౮౫, విష్ణుశర్మాస్త్రము ౮౬, వైద్యధరము ౮౭, వైనాయికము ౮౮, శక్త్యస్త్రము ౮౯, శఫరాస్త్రము ౯౦, శరభము ౯౧, శాంభవము ౯౨,...... శిఖరము ౯౫, శుష్కాశని ౯౬, శూలవరము ౯౭, శైవము ౯౮, శోషణము ౯౯, సంకర్షణము ౧౦౦, సంతాపనము ౧౦౧, సంమోహనము ౧౦౨, స్తంబేరమము ౧౦౩, సంవర్తము ౧౦౪, సింహాస్త్రము ౧౦౫, సత్యాస్త్రము ౧౦౬, స్వర్ణనేత్రాస్త్రము ౧౦౭, సర్వదైత్యఘాతిని ౧౦౮, సర్వాస్త్రఘాతిని ౧౦౯, స్మృతివినాశిని ౧౧౦, సోమకాసురము ౧౧౧, సోమనసము ౧౧౨, సౌమనసము ౧౧౩, సౌరాస్త్రము ౧౧౪.

శతానీకుఁ డను నామముతో ద్రౌపదీగర్భమున నుదయించెను. సహదేవు కొడుకు కృత్తిక యందుఁ బుట్టెను; కావున కుమారస్వామినామములలో నొకటగు శ్రుతసేనుఁ డను పేరఁ బ్రఖ్యాతి జెందెను. వారందఱు దినదినప్రవర్ధమాను లగుచుండ వారికిఁ గ్రమముగ ధౌమ్యుండు విధ్యుక్తసంస్కారము లగుజాతకర్మ, నామకరణ, చౌళ, ఉపనయనాదుల నొనర్చి సాంగవేదములను జదివించెను. వీరి కందఱకును నర్జునుండు ధనుర్వేదమును నేర్పెను. ఆకుమారులను నీతిపరు లగునట్లు పెంచుచు వారియభివృద్ధి కానందించుచు, ధృతరాష్ట్రు నేర్పాట్లకు లోఁబడుచుఁ, దమ్ములసాహాయ్యమున నానాదేశ రాజులతోఁ బోరి బొక్కసమును విస్తారముగ నిండించుచుఁ ద్రివర్గమునకుఁ బరస్పరవిరోధము లేకుండునట్లు సురలను, భూసురులను దనియించుచు జనులమనస్సు నానాఁట రంజింపఁజేయుచు ధర్మపరిపాలనంబు గావించుచుండె.

ఇట్లుండ నొకప్పుడు కాలుచిచ్చు మంటలతోఁ జెలరేఁగిన పెనుగాలితోడను నెడతెగక కాయుచుండు సూర్యాతపము తోడను నదుల ప్రవాహములు తగ్గి మిక్కిలి దీర్ఘములై పడమర వేసంగిదినములు సమస్త జీవకోటికి భయావహంబులుగా సహింపరాక గ్రీష్మఋతు వేతెంచెను. అట్టి గ్రీష్మకాలమునం దొక్కనాఁ డర్జునుండు శ్రీకృష్ణునితో నిట్లనెను. ఈకాల మత్యుష్ణముగా నున్నయది. ఈదినములలో నతిరమ్యము

అస్త్రోపసంహారదేవతలు. ౪౩.—అవాఙ్ముఖుఁడు ౧, అలక్ష్యవిషముఁడు ౨, కరవీరకని ౩, కామరుచి ౪, కామరూపుఁడు ౫, కృశానుఁడు ౬, జృంభకుఁడు ౭, జ్యోతిషికుఁడు ౮, దశశీర్షుఁడు ౯, దశాక్షుఁడు ౧౦, దృఢనాభుఁడు ౧౧, ధృష్టుఁడు ౧౨, దుందునాభుఁడు ౧౩, ధనుఁడు ౧౪, ధాన్యుఁడు ౧౫, ధృతిమాలి ౧౬, నైకప్రశమనుఁడు ౧౭, నైరాశ్యుఁడు ౧౮, ప్రతిహారతరుఁడు ౧౯, పద్మనాభుఁడు ౨౦, పరాఙ్ముఖుఁడు ౨౧, పితృసౌమనసుఁడు ౨౨, మకరుఁడు ౨౩, మహానాభుఁడు ౨౪, మారణుఁడు ౨౫, మోహనుఁడు ౨౬, యుగంధరుఁడు ౨౭, రభసుఁడు ౨౮, రుచిరుఁడు ౨౯, లక్ష్యవిషముఁడు ౩౦, వరణుఁడు ౩౧, విధూతుఁడు ౩౨, వినిద్రుఁడు ౩౩, విమలుఁడు ౩౪, వృత్తిమంతుఁడు ౩౫, శతవక్త్రుఁడు ౩౬, శతోదరుఁడు ౩౭, సంధానుఁడు ౩౮, సత్యకీర్తి ౩౯, సత్యవంతుఁడు ౪౦, సర్వనాభుఁడు ౪౧, సార్చిమాలి ౪౨, సునాభకుఁడు ౪౩.

లై కొండచఱియలతోఁగూడిన కాంతారములలో మృగయావినో దంబు సలుపుచు, వికసించిన కమలములయందలి పుప్పొళ్లచేఁ బరిమళముల నీనుచున్న యమునానదిమడుఁగునందలి గొప్పయలలతో మెలఁగిన పిల్లతెమ్మెరలచేతఁ జల్లనైన స్థలములయందుఁ గట్టఁబడిన మేడలలో వసించుట మానసోల్లాసకరంబై యుండును. అని యర్జునుండు వాసుదేవు నిష్టపఱచి మిత్రులు, మంత్రులు, నూడిగంపువారలు మున్నగువారలతోఁ గూడి యరిగి రమణీయప్రదేశములయందు సంచరించుచు నొకనాఁడు ఖాండవవనమునకుసమీపమునఁ జందనపుఁజెట్లకొమ్మలు వ్రాలియుండు పువ్వులపొదరింటియందుఁ జంద్రకాంతమణుల యరుగులపైఁ గూర్చుండి సుగంధవాయువులను మనోరంజనముగ ననుభవించుచు, వివిధభక్ష్యభోజ్యములను గుడిచి, గంధమును మై సలందుకొని పుష్పమాలికలం దాల్చి సుఖమున విహరించుచు, ద్రౌపదీసుభద్రలు పుణ్యాంగనల కొసంగు వివిధవస్త్రభూషణములం జూచుచు, నా కాంతార మంతయుఁ బ్రతిధ్వనించుచున్న వేణు వీణా మృదంగాది మధుర నిస్వనముల నాలించుచు, నొక్కరమణీయప్రదేశంబున నిష్టకథాలహరిం దేలియాడుచుఁ బ్రొద్దు పుచ్చుచు సుఖాసీనులై యుండె.

ఇట్లుండ వారియొద్దకు సూర్యునితేజస్సువంటి తేజస్సుగలవాఁడును, గోరోజనపువర్ణము గల మీసలు గలవాఁడును మిక్కిలి పొడవైనయాకారము గలవాఁడును, నారచీరలఁ గట్టి జడలు దాల్చినవాఁడును నగు నొకముసలి బ్రాహ్మణుండు వారిరువురం జేరవచ్చెను. అప్పుడతఁడు వారితో నిట్లనియె. ఓశూరశేఖరులారా! నేనతిభోజనప్రియుండనైన బ్రాహ్మణుండను. జీర్ణశక్తి పూర్ణముగఁ గలవాఁడను. నాకిష్టమైన యాహారమును బెట్టుటకు శక్తుల రేని యారగించెదను. అట్లైన నేను తృప్తుఁడ నగుదును అని చెప్పఁగా నరనారాయణు లిరువురు నాభూసురున కిట్లనిరి. భూసురవర్యా! నీ కెట్టి యాహార మిష్టము? కోరుము. అనఁగా నావిప్రుండు వారి కిట్లనియె. అయ్యా! నే నగ్నిహోత్రుండను. ఇతరాన్నముల నే నొల్లను. ఈఖాండవవనము సర్వకాలములయందు మహేంద్రుండు తక్షకాదికాకోదరసంతానములచే రక్షించుచుండు. దీని భక్షించి

తృప్తిఁ జెందవలయు నని నే నెన్నిమాఱులు యత్నించినను బురందరుం
డప్పుడు సంతతధారాపాతంబుగా వర్షము గురియించుటం జేసి నాయభీ
ష్టంబు కొనసాగుట లేదు. సర్వాస్త్రపరిజ్ఞానము గల శూరులసాహాయ్య
మునఁ గాని నాకీ కార్యము కానేరదు. కావున మీ రట్టిశూరు లని తెలిసి
మీయొద్ద కాహారార్థినై యేతెంచితి. మీసాయ ముండెనేని యీవనం
బును నే నాటంకము లేక దహింపఁగలుగుదు. ఇది నాకోరిన యాహారము.
నాయభిమతంబు నీడేర్చునది యని ప్రార్థించె నని చెప్పఁగా విని జనమేజయ
భూపాలుఁడు వైశంపాయనమునీంద్రునితో మహేంద్రరక్షితం బైన
ఖాండవవనమును నగ్నిహోత్రుం డేల గాల్పదొరకొనె. దీనికి హేతు
వన్యం బొం డుండును. దానిని సవిస్తరంబుగఁ జెప్పవే యని యడు
గఁగా నమ్మునిచంద్రుం డారాజచంద్రున కిట్లనియె.

## శ్వేతకి యను రాజు చరిత్రము

పూర్వ మొకకాలమునఁ బురందరుసముఁ డుల్యుండును, ననేక
యాగములను దానములను జేసి విప్రులను బహుదక్షిణలతోఁ దృప్తిఁ
బొందించినవాఁడును నైన శ్వేతకి యనురాజుండెను. ఈరాజు సతతము
యాగములను జేయుటం జేసి విప్రు లధ్వర్యులై యాగములలో నితర
కార్యములకు నెడతెగక తోడ్పడుచుండిరి. ఇట్లు శ్వేతకి బహుకాలము
యాగ మొనర్ప నాయాగము సమాప్తమై విప్రు లందఱును దమతమ
నివాసముల కపరిమితదక్షిణలం గొని చేరిరి. బహుకాలము ప్రవర్తిల్లిన యా
యాగములలో హోమాగ్నినుండి వెలువడుచుండిన పొగచేత యాజ
కుల కనేకుల కక్షిరోగము గలిగెను. ఆవికలనేత్రులను వదలి రాజు మఱి
కొందఱను వరించి యెట్లో తొలియాగమును బూర్తిచేసెను. పదంపడి
శ్వేతకి మఱియొకయాగమును బ్రారంభింపఁ బూనుకొని భూసురులం జేరి
వారిని బుత్విజులుగ వరింపఁగా వారు దీర్ఘసత్రప్రయాజకత్వమున
కొప్పుకొనక తమవలన నార్త్విజ్యము సాధ్యము కా దనిరి. అంతట శ్వేతకి
వారి కిట్లనియె. మహాత్ములారా! మీ రేల నాయొనర్చుయాగమున నార్త్వి
జ్యమున కొప్పుకొనరు? నేను బలితుఁడను గానేరను. నే నెల్లకాలముల
యందు భూసురులకు సేవఁ జేయుటయందు లోపముఁ జేయువాఁడను

గాను. నన్ను మీ రనాదరణము చేయకుఁడు అనఁగా విప్రు లారాజున కిట్లనిరి. నరేంద్రా! నీవు బహుకాలము యాగాచరణపరాయణుండ వగుటం జేసి యాయాగమున మేము నీకుఁ దోడ్పడి కడు డస్సియున్న వారము. ఆకారణమున నిపు డీ యార్త్విజ్యము నొల్లము. అంతియ కాని యొండెద్దియును లేదు. మాపై నలుగవలదు. నీవు గావించు నెడ తెగని యాగములకు మహేశ్వరుండు దక్క మానవులు యాజకులుగ నుండలేరు. కావున మహాదేవుం బ్రార్థింపు మనిరి. శ్వేతకి వారియాక్రోశ వచనముల కోర్వక కైలాసమున కేఁగి యొకప్పుడు నిరాహారుం డగుచు, వేఱొకపుడు సాయాహ్నంబునఁ గందమూలములను భక్షించుచు, నొకపు డేకపాదుండును, మఱియొకపు డూర్ధ్వబాహుండును నగుచుఁ గొన్నిరాత్రుల నిద్రారహితుండును నై యనేకవిధముల శూలినిఁ బ్రార్థించుచుఁ దపమాచరించెను. అంత మహేశ్వరుండు వానితపంబునకు మెచ్చి ప్రత్యక్షుండై వరముగోరు మనెను. అంత శ్వేతకి వానికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి తా నొనర్చు యజ్ఞమునకు యాజకుఁడై యుండఁ బ్రార్థించెను. అంత శంకరుండు యాజకత్వమునను విప్రు లర్హులు. అయినను ఫలాపేక్షచేఁ దపస్సు చేసి నన్ను మెప్పించుటను గాలాంతరమున నీకోరినదానిని బ్రసాదింతు. మున్ను ద్వాదశవర్షములు బ్రహ్మచర్యమును బూని జితేంద్రియుండవై సంతతాజ్యధారల నగ్నిదేవుం దనుపుము. పిదప నీయభీష్టము నెఱవేఱగలదు. అని చెప్పి యదృశ్యుం డయ్యె. అంతట శ్వేతకి మహాదేవునాజ్ఞాప్రకారము వీతిహోత్రుఁ బండ్రెండేండ్లు సంతతాజ్యహోమములఁ దనిపి మరల కైలాసమున కేఁగి మహేశ్వరుని దర్శింపఁగా నారుద్రుండు శ్వేతకీ! నీతపస్సునకు నియమమునకు మెచ్చితి. యాజనము బ్రాహ్మణునిధర్మము. కావున మే మీ కార్యము నొనర్పరాదు. నీయపేక్షఁ దీర్చునిమిత్తము నాయంశమున జనించిన దుర్వాసుని యాజకునిగాఁ బంపెద. యజ్ఞసంభారముల నొడఁ గూర్పుము. అనఁగా శ్వేతకి పురమున కేఁగి యాగద్రవ్యముల సంసిద్ధపఱచి మఱల మహేశ్వరుని సందర్శించి తనయాటంక మేమియును లే దనఁగా నీశ్వరుండు దుర్వాసుం బిలిచి శ్వేతకియజ్ఞమునకు యాజకకార్యమును నిర్వర్తించి రమ్మని సెల వొసంగఁగా నమ్ముని శివునానతి శిరసా

వహించి యా యాగమునకు విధించియున్న దక్షిణను గొని యజ్ఞమును సమాప్తిసేసి శ్వేతకియనుజ్ఞచే నెల్ల ఋత్విజులను బంపి తానును యథేచ్ఛం జనియె. శ్వేతకియు నభిమతయజ్ఞమును బూర్తిచేసి పురముఁ జేరెను. ఆశ్వేతకి గావించిన యజ్ఞమునం దెడతెగని యాజ్యధారలచే నగ్నిహోత్రుండు తేజోహీనుండై యజీర్ణవ్యాధితో బ్రహ్మకడ కేఁగి తన రోగనివృత్తి కుపాయమును వేఁడఁగా నా పరమేష్ఠి నవ్వుచు, నోవీతిహోత్రుఁడా! నీవు పండ్రెండేం డ్లెడతెగక ఘృతధారల నుపయోగించి యుండుట నీ కీతేజోహైన్యము సంభవించెను. దేవతలు మున్ను నీవు ఖాండవవనమును దహించెద వని నియమించియున్నవారు. దానిని గాల్చితివేని నీవు తొల్లింటిరూపము నొందెద వనెను. ఆవనమున వివిధ భూతములు, నౌషధములు, వనస్పతులు, మహావృక్షములు గలవు. అవి నీచే నారగింపఁబడుచో నీకుఁ దొల్లింటి తేజస్సు కలుగును. అనఁగా నగ్నిదేవుండు వాయువుతోఁ గూడికొని ఖాండవవనమును జొచ్చి దానిని దహింపఁజొచ్చెను. అప్పుడావనపాలకు లావనమునుగాల్చుచున్న యగ్నిపై నేనుఁగుతొండములావుగల నీటిధారలను జల్లిరి. మఱియు ననేక గజములు పాములు తమనోట నీళ్లను పీల్చి యొక్కుమ్మడి యగ్నిపై నుమియఁ జొచ్చినవి. ఇవ్విధమున వీతిహోత్రుని యత్నము లేడుసార్లు కొనసాగక ఖాండవవనంబు దహింపఁబడదయ్యెను. అంత నగ్నిదేవుండు విఫలమనోరథుండై బ్రహ్మపాలి కరిగి తనయుద్యమము నెఱవేఱక తాను పూర్వము వలె రుజతో బాధపడుచుండుటను జెప్పెను. అంతఁ బరమేష్ఠి ముహూర్తమాత్ర మాలోచించి వైశ్వానరున కిట్లనియె. నీకోరిక సిద్ధించుట కొకయుపాయ మున్నది. నరనారాయణు లను దేవమునులు దేవకార్యమును సాధించునిమిత్తము భూలోకమునందుఁ గృష్ణార్జునులుగ నవతరించి యున్నారు. వా రొకప్పుడు ఖాండవవనసమీపమునకు విహారార్థ మేతెంచెదరు. అప్పు డో వైశ్వానరా! నీవు వారిం జూచి నీయభిమతమును నివేదింపుము. నీకార్యము నామహాపురుషులు సాధించెదరు. నీవు ఖాండవవనమును వారిసాహాయ్యమున దహించి నీ తొల్లింటి తేజస్సును బొందెదవు. వారు నీకుఁ దోడ్పడుదు రేని సకలసురలతోడ వేయికన్నులవాఁ డడ్డపడినను నీకార్య మాటంకము లేక సాగఁగలదు. అని

చెప్పఁగా నగ్ని దేవుం డట్లు చేయుదునని వేచియుండి కేశవకిరీటులు ఖాండవ వనమునకు రాఁగా వారిని దర్శించి వారితోఁ దనపడు బాధను దన్నివా రణోపాయమును, దన్నిమిత్తము వారిసాయము వేఁడి తనభావమును వారికిఁ దేటపఱిచెను.

## అగ్ని కృష్ణునకుఁ జక్రమును గాండీవికి దివ్యరథమును రథ్యములను నిచ్చుట

అంత నర్జునుం డగ్నిమాట విని విప్రరూపమున నుండు వీతి హోత్రునితో నిట్లనియె. వైశ్వానరా! నాకు సమరమునందుఁ బురు హూతాది దేవతల నోర్చునంతటి మేలైన యస్త్రములఁ బ్రయోగించుటకు నుపసంహరించుటకు శక్తిగలదు. కాని వాని నుపయోగించుటకుఁ దగిన లాఘవసౌష్ఠవములును, బలిష్ఠమైన ధనుస్సును, నాయాయుధములను నన్ను మోవంజాలిన రథ్యములతోడి రథము లేకున్నయవి. నా సఖుఁడైన కేశవునకుఁ దగిన యాయుధ మిచ్చుటఁ గన్పట్టదు. మా కిరువురకుం దగిన యాయుధములను, సమరోపయుక్తములగు నితరసాధనముల నొసంగుదు వేని వంచనలేక బరాక్రమమును జూపుదుము అనిచెప్పెను. అగ్నిదేవుం డంతట వరుణుం దలంప నాతం డగ్నిముందటఁ బ్రత్యక్షమై పనియడుగ నాతండు వరుణున కిట్లనియె. లోకపాలా! సోముఁడు నీకిచ్చియున్న గాండీవం బనుధనుస్సును, నక్షయతూణీరంబులను, గపిధ్వజముతో వెలయు రథ మును, జక్రమును నాకొక కార్యమునిమిత్తముగ బదులిమ్మనఁగా వరుణుండు వాని నెల్ల వైశ్వానరునకిచ్చి యదృశ్యుండు కాఁగా నయ్యగ్నిదేవుండు వాని నాకేశవార్జునుల కొసంగెను. దానిప్రభావమును జెప్పెద వినుము. ఆగాండీవం బను విల్లు సర్వశస్త్రాస్త్రముల నివారింపఁజాలినది. అది లక్ష సంఖ్యాకము లగునస్త్రములకుఁ దుల్యము. పెక్కువన్నెలతో నొప్పారు చుండును. ఆదివ్యధనుస్సు దేవతలచేతను దానవులచేతను గంధర్వుల చేతను బూజింపఁబడుటకు యోగ్యముగ నుండునది. ఆయక్షయతూణీ రంబులను గపిధ్వజసహితరథమును దొల్లి విశ్వకర్మచే నిర్మితంబై యుత్త మాశ్వములు బూన్పఁబడి సకలలక్షణములతోఁగూడినవి. వాని నుపయో గించుమానవుం డన్నికాలములయందును దేవదానవమనుష్యాదులకు నజ య్యుండై యుండు. పూర్వము దేవాసురయుద్ధకాలమున నారథము

సోమున కుపయోగించెను. అట్టిదానిని వైశ్వానరుం డర్జునున కొసంగెను. అంతటఁ బార్థుండు గాండీవమును నక్షయతూణీరములను ధరించి యా దివ్యాశ్వములతోను, కపిధ్వజముతోను వెలయుచుండు రథము నెక్కి యగ్నిదేవు నభిమతంబుఁ దీర్చునిమిత్తము గాండీవగుణమును సారించి టంకార మొనర్ప సకలభూతములును నాధ్వనికి భీతిల్లెను. ఇట్లు పార్థుం డగ్నికి సాయపడుటకు సంసిద్ధుఁ డయ్యెను. అంత వైశ్వానరుండు శత్రు సమూహమును దాఁకినమాత్రమున భస్మముచేయఁగల యాచక్రమును వాసుదేవున కొసంగి మాధవా! నీపరమసాధనమున నీవు లోకములో నుండు నీశత్రువర్గమును గెలుతువు. నీపంచినపంపు నెఱవేర్చి మరల నీసాధనము నీయొద్ద కేతెంచును అని చెప్పెను. ముం దగ్ని కోరఁగా వచ్చినవరుణుం డగ్నిసన్నిధానమున నున్న జగన్నాథుంజూచి యాతని దర్శనమునకు సంతసిల్లి యామహనీయునకుఁ గౌమోదకి యనుగద నొసంగిపోయెను. అంతఁ గృష్ణార్జును లిరువురును దివ్యాయుధములను బొంది యగ్నితో నిట్లనిరి. వైశ్వానరా! ఇఁకను నీకార్యమున కాటంక ముండదు. నీయిచ్చమెయి ఖాండవమునుదహింపఁబూనుము. మహేంద్రుం డంతటివాఁడు వచ్చినను మా కెదురుగ నిలువలేఁడు. అని తమ కార్య సన్నాహమును వీతిహోత్రున కెఱింగించిరి.

## ఖాండవవనదహనము

అప్పు డగ్నిదేవుండు సంతోషమున నుప్పొంగి తనస్వరూపమును దాల్చి విజృంభించి సర్వభూతములకు భయంకరముగాఁ బ్రళయకాలమో యనునట్లు ఖాండవవనముఁ జొచ్చి యందలి నానావృక్షములను, లతలను, నోషధులను, వనస్పతులను, సకలజంతుజాలములను దహింప నారంభించెను. అప్పు డందలిప్రాణు లాతాపమున కోర్వలేక వనము వెలువలికిఁ బో నారంభింపఁగా నప్పు డా కృష్ణార్జును లిరువురును సన్నద్ధాయుధులైన వాని నడ్డగించుచు వీతిహోత్రున కాహుతి గావించుచుండిరి. కొన్నిజంతువు లెట్లో పోఁగలిగినవైనను దమ మాతాపితరులను భార్యలను బిడ్డలను వదలిపోలేక యందె మ్రగ్గుచుండెను. విహంగమములు పైకెగిరి పోఁగా నయ్యవి యగ్నితాపమునఁ గాళ్లును ఱెక్కలును గాలి తప్పించు

కొని పోనేరక మరల నగ్నికిఁ బ్రీతిగాఁ గొల్పఁబడెను. ఇవ్విధంబున నా వనంబున నున్నభూతజాల మంతయు నగ్ని కాహుతి యగుచుండ వాని క్రొవ్వున నగ్నిహోత్రుండు విశేషజ్వాలతో మండుచుండఁగా లోక మంతయు దీని నకాలప్రళయ మని యెన్నెను. ఈజ్వాలలతాపమునకు సురలును మునులును భయంపడిరి. అంత వా రెల్లఁ గూడికొని మేఘనాథుండైన పురందరుకడ కేఁగి యీదావాగ్నినుండి లోకములను రక్షింప వేఁడిరి. అంత మహేంద్రుండు పర్జన్యునితో ఖాండవరక్షణార్థ మరిగి యపరిమితవర్షమును గురియించెను. అట్లు ధారాపాతముగ వర్షము కురిసినను నాజల మంతయు నాప్రళయాగ్నియం దిగిరి పోవుచుండఁగా నావేయికన్నులవాఁడు కన్ను లెఱ్ఱఁ జేసి మేఘముల నన్నింటి నొక్కమాఱుగ సమకూర్చి ఖాండవవనప్రదేశమున వర్షము గురియుట కాజ్ఞాపింపఁగా నప్పుడు సవ్యసాచి తన గాండీవము నెక్కిడి రెండు చేతులతో నంపములఁగూర్చి ఖాండవవనముపైన నంపపందిరి దట్టముగా వైచి యొక్క నీటిబొట్టైనను వనమునఁ గాని వనముచుట్టు బహుదూరప్రదేశమునఁ గాని పడనీయక వైశ్వానరున కెట్టి యాటంకము కలుగనీయక యావనము నంతటి నాహుతిగా నొసంగెను. అప్పు డావనమున వసించుచుండిన నానాభూతజాలంబు లాయగ్నియందు మ్రగ్గుచుండె. ఖాండవవనరక్షకుం డగుతక్షకుం డావనము వీతిహోత్రున కాహుతియగునట్లు వాసుదేవార్జును లిరువైపుల నగ్నికి సాయపడువారైనా రని తెలిసి మెల్లన వనమును వీడి కురుక్షేత్రముఁ జేరెను. తక్షకునికుమారుం డశ్వసేనుఁడు పార్థుబాణముల కోర్వలేక వనమును దాఁటిపోనేరక తల్లడిల్లుచుండఁగా వానికి వగచి వానితల్లి వానిశిరమును గప్పి వనమును వీఁడి పోఁగా నర్జునుం డలిగి దానిశిరము, తక్షకకుమారుఁడగు నశ్వసేనుతోఁకను బాణప్రహారముల నఱికి వానిశిరమునుగూడఁ దెగనేయఁ దల పోయుచుండ మహేంద్రుండు మాయతుపాను నొకదానిని గల్పించి యర్జునునకు మోహము గలిగించెను. ఆసమయమును గనిపెట్టి యొట్లో యశ్వసేనుఁడు పరశురామప్రీతి గాక ప్రాణములను గాపాడుకొని వెడలి పోయెను. అంత వాసుదేవార్జును లాతుపానును మాయగా నెఱింగి

యంతలో నశ్వసేనుఁడు తప్పించుకొని పాఱిపోయెనే యని వానిని నిరాశ్రయుండును, సంతానరహితుండును నగునట్లు శపించిరి. అంత నర్జునుం డింద్రుపై నలిగి యనేకదివ్యాస్త్రముల నతనిపైఁ బ్రయోగింప నాపురందరుం డర్జునునిపైఁ బర్జన్యాస్త్రమును వదలెను. అప్పు డాపర్జన్యాస్త్రమహిమవలన ఖాండవవనప్రదేశము చుట్టుపట్ల బహుదూర మావరించియుండు భూభాగ మంతయు నిండియున్న జంతుజాలములకు గన్నులు మిఱుమిట్లు గొలుపునట్లు మెఱుములును, భయంకరారావమున మిన్ను విఱిగి తమపైఁ బడునట్లుండు నుఱుములును గలిగి యెడతెగని ధారాపాతంబుగా భయంకర మగునట్లు వర్షింప మొదలిడెను. అప్పుడు గాండీవి యది యస్త్రప్రభావంబునఁ గలిగినవర్ష మని యెఱింగి వెంటనే యాపర్జన్యాస్త్రమునకుఁ బ్రత్యస్త్రమైన ప్రభంజనాస్త్రమును బ్రయోగించెను. ఈపర్జన్యాస్త్రప్రభావంబునఁ జీఁకట్లు గ్రమ్మినట్లు వనము యొక్క యుపరిభాగమునఁ గ్రమ్మియుండిన మేఘములన్నియుఁ బంచబంగాళములై పాఱిపోయెను. వాసుదేవుండును నావననివాసు లగు నానావిధగరుడులను, గంధర్వులను, నురగులను జంపి యగ్నికాహుతిఁ గావించుచుండె. అంత మహేంద్రుండు వేంద్రార్జునులపై నలిగి వజ్రమును, గుమారుండు శక్తిని, నశ్విను లోషధులను, ధాత జోఁకంటిని, బ్రహ్మా పర్వతమును, నంశుమంతుఁడు శక్తిని, మృత్యువు పరశువును, మిత్రుఁడు చక్రమును,నర్యముఁడు పరిఘము, మఱియుఁ దశ్ముంగల భగసవితృ పూషరుద్ర వసుమరుచ్ఛాదిదేవత లందఱును బరాక్రమించి క్రుద్ధులై తమతమదివ్యాయుధములను బ్రయోగించిరి. పిదప నావాసుదేవవాసవులు దేవతలయాయుధములకుఁ బ్రత్యాయుధములను బ్రయోగించి పరాక్రమముతో వానిబలములను వృథపఱచుచుండిరి. అంత దేవగంధర్వగరుడోరగు లందఱును వీరిపరాక్రమమునకువెఱచి యింద్రుని మఱుఁగుసొచ్చిరి. ఆకృష్ణార్జునులసామర్థ్యమునకు, సమరచాతుర్యమునకు వేల్పులును మునులును నచ్చెరువందిరి. అంత నింద్రుండు తనివిఁజెందక యింకనునర్జునుసామర్థ్యంబు నెఱుంగఁగోరి ఱాతివానఁ గురియించెను. దాని నర్జునుండు తనదివ్యాస్త్ర

మహిమంబున రూపుమాయించెను. వెండియు నప్పురుహూతుండుపార్థు పైc మందరపర్వతపుశిఖరము నెత్తివేసెను. కాని దాని నర్జునుండు మహాస్త్రప్రయోగంబునc దుత్తునియలు గావించెను. అప్పుడు ఖాండవవనము నునికిపట్టుగాc జేసికొనియున్న దైత్యులు వాసుదేవార్జునులపైకి రాcగా భగవంతుండు హుంకరించి వారిపైc జక్రము నేసెను. ఆపరమాయుధమా దైత్యుల నందఱను సంహరించి క్రమ్మఱ జగన్నాథుం జేరె. ఇవ్విధమున నెల్లవారును గృష్ణార్జునులకు వెఱచి పాఱుచుండc, బాకశాసనుండు వారి దివ్యాస్త్రకోవిదత్వమునకు మిక్కిలి యానందించుచుండె. అప్పు డశరీరవాణి యింద్రునితో నిట్లనియె. మఘవానుcడా! నీమిత్రుcడగు తక్షకుం డెప్పుడో ప్రాణముల కాశించి కురుక్షేత్రమును జేరెను. ఈకృష్ణార్జునులను గేవలమనుష్యులనుగాc దలపోయకుము. వీరు దేవకార్యార్థముగ నీభూలోకమున నవతరించిన తొల్లింటి నరనారాయణు లను దేవమునులు. వీరి నెవ్వరును జయింప లేరు. పాలకడలినిc ద్రచ్చినవెంటనే జరిగిన ఘోరదేవాసురయుద్ధకాలమున వీరిసామర్థ్యమును నీ వెఱింగినది కాదే? వీరితోడ నిcక సమరమును జాలింపుము. ఖాండవవనదాహనంబు విధిప్రేరితంబు. దాని నాటంకపెట్టశక్యము కాదు. అని తెలియునట్లు వినిపింపcగా నింద్రుండు దేవతాసమూహముతో నాకలోకంబున కేగెను. అవ్విధంబున వారు పాకశాసనాదులc బోరిలో గెలిచి, శత్రువులకెవ్వరికిని దమవైపు నిరీక్షించుటకు నైతము సాధ్యము గానట్లొనర్చి శూరులై నెగడుచుండcగా, నగ్నిహోత్రుండు ఖాండవవనమును దెంపుతో నేయాటంకము లేక దహించుచుండెను. అప్పుడు తక్షకునియింటినుండి మయుcడను దానవుండు వీతిహోత్రునకు వెఱచి తప్పించుకొని పాఱిపోవుచుండ నయ్యగ్నిదేవుండు చక్రపాణిం జూచి, యిదిగో యీదానవుండు పాఱుచున్నవాcడు. వీనిం గొట్టి నాయందుc బడవేయు మని సన్నచేసెను. జనార్దనుం డతనిపైc జక్రప్రయోగమునకు యత్నింపcగా, నామయదానవుండు పార్థు శరణుc జొచ్చెను. అంత నర్జునునిcదన్నుc గావుమని వేడుచుండు మయునియందుc గరుణించి యార్తత్రాణపరాయణుండగు భగ

వంతుఁడు వానిపైఁ జక్రమును బ్రయోగింపకుండెను. అగ్నిహోత్రుం డును వానిదహింపఁడయ్యెను. ఇవ్విధంబున నాకేశవార్జునులసాహాయ్యం బునఁ బదునైదుదినములగ్నిహోత్రుండు ఖాండవవనమును యథేష్టముగ దహించెను. ఆవనమున వసించియున్న ప్రాణికోటియంతయును దహింపఁ బడి వినష్టమయ్యెను. ఆప్రళయమున కాహుతిగాక బ్రదికినవారు తక్షక పుత్త్రుండైన యశ్వసేనుఁడు, మయుఁడు, శార్ఙ్గకులు నలువురుమాత్రమే యనఁగా విని, జనమేజయుండు శార్ఙ్గకు లెట్లు జీవించిరి ? సవిస్తరముగా నుడువుం డనఁగా నమ్మునీంద్రుం డానరేంద్రున కిట్లనియె.

## శార్ఙ్గకోపాఖ్యానము

తొల్లి మందపాలుండను మునీంద్రుండు బ్రహ్మచర్యవ్రతము నతి నిష్ఠతోఁ జలుపుచు జితేంద్రియుండై యనేకవర్షములు భూలోకమునఁ దప మాచరించి యోగబలమున స్వర్గలోకమునకుఁ జనెను. వాఁడచ్చో టఁ బుణ్యాత్ములనుభవించుసుఖానుభవమును బొందలేక మనస్సు మిక్కిలి వగఁ గూరఁగా దేవతలం గాంచి యిట్లడిగెను. పుణ్యాత్ములారా! నేను బహుకాలతపఃఫలంబున నీపుణ్యలోకమునకు రాఁ గంటిని. కాని, నాకు మీ కందఱకుఁ గల మనశ్శాంతి సుఖానుభవము లేక పోవుటకుఁ గారణ మరయ వేఁడెద. ఎఱుంగుడు రేని చెప్పి పుణ్యముఁ గట్టుకొనుఁ డని వేదనతో నడుగఁగా, నాసుర లామహానీయున కిట్లనిరి. తపోధనా! మానవులు పుట్టుచుండఁగనే దేవఋషి పితరులఋణములతోఁ బుట్టుదురు. తపోయజ్ఞదానకర్మాదులఁ జేసి వారు దేవతలఋణము నీఁగుదురు. వివాహమై సత్సంతానప్రాప్తిం జేసి పితరులఋణము నీఁగుదురు నీ వత్యంత తపస్సులచేత దేవఋషిఋణము నీఁగఁగంటివి. మఱి యావజ్జన్మమును నీవు బ్రహ్మచర్యవ్రతమును బూనినవాఁడవగుటచే సత్సంతానప్రాప్తి లేక పోయినది. ఆకారణమున నీకుఁ బితరులఋణమును దీర్చుటకు వలను లేక పోయినది. పితరులఋణమును దీర్పవైతివి. కానఁ బుణ్యలోకములఁ బ్రా

ప్తించియు, సుఖానుభవముగలుగదయ్యె. కావున యింతటనైన భార్యను బరిగ్రహించి సంతానముం బొందుము. అనిన నా మందపాలమునీంద్రుండు పక్షిజాతియందు వేగంబ సంతానోత్పాదనం బగు నని యూహించి సంతానోద్పాదనకాంక్షిగ్రై శార్జ్గకపక్షిరూపమును ధరించి, జరిత యను పెంటిపక్షితో సంగమించి జరితారి, సారిసృక్వ, స్తంబమిత్ర, ద్రోణు లను నామములుగల నలువుర శార్జ్గకుల బ్రహ్మవాదులఁ బొంది, తనయాశ్రమమున కరిగి తనపూర్వభార్య యగు లపిత యను దానితో విహరించుచుండె. జరిత తననలువురు పిల్లలతో ఖాండవవనమున నుండెను మందపాలుండు లపితతో నున్నయొక్కనాఁ డగ్నిభట్టారకుండు ఖాండవవనదహనోత్సుకుండై యేగుచుండఁ, దనదివ్యజ్ఞానమున నాతండు పోవుకార్యము నెఱింగి యావీతిహోత్రు నగ్నిసూక్తములచే నిట్లని స్తుతించెను.ఓయగ్నిదేవుఁడా!నీవు సర్వదేవతలకు హవ్యవాహుఁడవగుటచే నీముఖమున దేవతలు సుఖింతురు. సర్వభూతాంతరాత్ముండవై గూఢముగఁ జరించుమహానీయుండవు నీవు. నీవు దేవలోకమునందును, భూలోకమునందును జఠరాగ్నివై యుదరమునందును రహస్యముగా బ్రహ్మరూపమునఁ బ్రకాశించువాఁడవు. నీవు పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనుపంచభూతములయొక్క స్వరూపమునుదాల్చి సూర్యచంద్రయజమానరూపములతోఁగూడి యెనిమిదిరూపముల నెత్తి యజ్ఞనిర్వాహకుఁడవుగ నున్నావు. పరమయోగు లగువారీప్రపంచ మంతయును నీచే సృజింపఁబడిన దని చెప్పెదరు. కావున నీసకలచరాచరాత్మక మగు ప్రపంచమున కంతటికిని నీవ సృష్టికర్తవు. ఓహుతాశనుఁడా! నిన్నుఁ దలఁచినంతమాత్రమున జీవుల సకలపాపములును నశించును. విప్రులు తమకర్మములు సత్ఫలము నిచ్చుటకొఱకు నీకుఁ బ్రణమిల్లుదురు. నీ వెచ్చోటికేగినను నీభార్య స్వాహాదేవితోను నంగిరసాదిపుత్త్రులతోడను నుల్లాసముతోఁ జరింతువు. మేఘములయందు మెఱుపురూపమున నీవు ప్రకాశింతువు. సర్వభూతములను దహించు పరాక్రమశాలివి, ఓతేజో

వంతుఁడవగు నగ్నిభట్టారకుఁడా! ఈవిశ్వమునంతయును నీవసృజించితివి. చరాచరాత్మకమైన సర్వభూతజాలములకును నీవే విహితకర్మమవు. నీయందుండియే యుదక ముత్పన్నమైనది. శుభాశుభములు నీయందు సుప్రతిష్ఠితములయి యున్నవి. దహనుండ వీవ. ధాత, బృహస్పతి,అశ్వినీ దేవతలు,సూర్యుఁడు,సోముఁడు,అనిలుఁడు ననియెడివీరందఱు నీస్వరూప మూనినవారే!' అను స్తుతివాక్యముల కగ్నిదేవుండు సుప్రీతుండై 'మంద పాలా! నేను నీకొఱ కేమి చేయవలయును? నీకుఁ బ్రీతుండనైతిని' అని యడుగఁగా నమ్మునీంద్రుం డగ్నిదేవున కిట్లనియె. ఖాండవవనమున నా వీర్యమునఁ బుట్టిన శార్ఙ్గకులు నలువు రున్నవారు. నీ వావనమును గాల్చునపుడు వారిని దహింపక రక్షింపవలయును. నీవు సకలధర్మస్వరూ పుఁడవు గావున ని న్నిట్లు ప్రార్థించితి. అని వేఁడఁగా మందపాలున కగ్ని దేవుం డభయహస్తముఁ జూపి చనియె. ఇట ఖాండవదాహసమయమున జరిత భయంకరముగ మంటల నలుదెసలం గప్పుచున్నవహ్నిం జూచి దుఃఖితయై కడు దీనత తోఁప నాశిశువులం జూచి యిట్లనెను. ప్రళ యాగ్నివలె నాలుకలు సాచుచు వహ్ని నలుదెసల నావరించుచున్నది. ఱెక్కలును గాళ్లును రాని యీ నాకూనలకు దిక్కేది ? ఈఱెక్కలు రానిపిల్లలను నే నెట్లు మోచికొని పోఁగలను ? వీరిని విడిచి పోవుటకు నాకా ళ్ళాడవు. వీరిలో జరితారి పెద్దవాఁడు. వీనివలన కుల ముద్ధరింపఁ బడును. సారిసృక్వుఁడు పెంటిఁ బెనఁగి విశేషసంతానము నొంది వంశో ద్ధారకుఁ డగును. స్తంభమిత్రుఁ డతితపస్వి యగును. ద్రోణుఁడు బ్రహ్మ వేత్తయగును. అని యివ్విధముగ వక్కాణించి మందపాలుం డరిగెను గదా! ఇట్టియకారుణికుఁడగు తండ్రియుండునే. ఇంతటి మహనీయులగు కూనలనువదలి నేనెట్లు నాప్రాణరక్షణార్థమై పోఁగలను? ఎట్లులైన నగుఁ గాక! ఈకసికందులవదలి నేఁబోనొల్లను. నాఱెక్కల వీరిఁగప్పి నామోపి నంతఁ గాపాడెద. ఈనలువురిలో నే నెవని వదలుదును ? ఎవనిని రక్షిం తును? నాయూపిరి యున్నంతవరకు వీరిని నాఱెక్కలక్రిందఁ గాపాడె

దను. అయ్యయ్యో! నే నేమి చేయుదు? మందపాలుండు దయావిహీనుండై చనెను. ఏయుపాయమును నాకుఁ దోఁపకున్నది. అని విలపించుచుండఁగా నాపిట్టలు తల్లి కిట్లనియె. అమ్మా! నీ వెటకేనియుం బోయి నిన్ను రక్షించుకొనుము. మాకై నీవును జావ నేల? బ్రదికియుందువేని మావంటిబిడ్డలను గని వంశమును నిలుపుకోఁగలవు. కులప్రతిష్ఠ కాఁగలదు. మహానీయుండైనమాతండ్రియు నసత్యమాడఁడు. మే మెట్లులైనను బ్రదికెదము. మాతోడ నీవును నొకవేళ చావ నేల? అనఁగా జరిత కొడుకులను వదలి పోలేక కొంత యాలోచించి, 'యోబిడ్డలారా! మీ రీచెట్టుక్రింది యెలుకకలుఁగులోనికిఁ బోయి సుఖముండుఁడు! దానియం దుండినయెలుక నొకడేగ యీదినము పట్టికొని పోవుటను జూచియుంటిని. మఱియు దానింజంపి యది భక్షించెను. నెఱవ కీకలుఁగు వేగంబ ప్రవేశింపుఁ'డనిన శార్ఙ్గ లిట్లనిరి. అమ్మా! ఈమానెలవును మేము వదలము. ఆపద సంభవించుచో నక్కడకును నది మన వెంట వచ్చుచున్నది. క్షేమపడవలసియున్నచో నీగూటియందుండియే సుఖించెదము. ఆకలుఁగున నొకయెలుకను డేగ భక్షించియున్నచో, దాన వేఱొండెలుక యుండి మాకది యేల బాధ కలిగింపకుండును? కావున నచ్చోటికేగినచో హాని కలుగుట నిస్సందేహము. ఇచ్చోటనే యుండినచో వాయువు వేఱొకవైపు వీచి యగ్ని మే ముండుగూటిసమీపమునకు రామి మాకు చేటు మూడకుండును. ఆపత్కాలమున సునికిపట్టును వీఁడి వేఱొండుచోటి కేగరాదు. ఇది నీతిధర్మము. సంసారబంధముం జేసి మాయం దున్నప్రీతిని వదలుము. భర్తయుండుచోటి కేగి వేఱుపుత్త్రులం బడయుము. మమ్మగ్ని దహించునేని మేము పుణ్యలోకముల కేగెదము. అగ్నిదేవుండు మాయెడఁ గరుణించెనా! మఱల మాయెడకు రమ్ము. అని చెప్పఁగా విని జరిత పోను గాళ్ళాడక భయంకరమైనదావపావకాగ్నికి వెఱచి యెట్లో తనపిల్లలను వదలి యొటకేనికిఁ జనెను. అంత సమీపించుచున్నపావకుం జూచి నాశార్ఙ్గకు లిట్లనిరి.

వ్యసనకాలము సమీపించుటకు మున్ను లెస్స నాలోచించి దుఃఖ మును దాటుట కుపాయము నూహించువాఁడు వేగమున శుభప్రాప్తిఁ జెందును. ఆపదలు దరియఁగా నెంత యాలోచించినను గట్టెక్కలేఁడు. మన కీప్రాణాపాయదశను దొలంగించుకొన నుపాయ మేది యని తల పోయుచు, నానలువురును బ్రత్యేకముగ నగ్నిహోత్రుని నిట్లు నుతించిరి. ఓయగ్నిదేవుఁడా ! నీవు దక్క మమ్ము రక్షించు దిక్కెవ్వరును లేరు. మాతల్లియెటకేనియుఁబోయియున్నది;తండ్రిని మే మెఱుంగము. ఱెక్కలు మా కింకను రావు. నీవుతప్ప నోధూమకేతువా! మా కెవ్వరును దిక్కు లేరు. పక్షిశాబకుల మగుమమ్ముం గాపాడుటకు నీవే యర్హుండవు. నిన్నుఁ దప్ప మే మెవ్వరిని శరణన్న వారము కాము. ఓదేవా ! శుభస్వరూపివై మమ్మార్తులను గాపాడి పుణ్యమునఁబొమ్ము. ఓజాతవేదుఁడా ! మందపాల ఋషివర్యునిపిల్లలమగు మమ్మీయాపదనుండి తొలగింపుము. నీవే సర్వ దేవాత్మకుఁడవు. అని సారిస్రుక్వుఁడు నుతించెను. ఓయగ్నిదేవుఁడా! ఈ ప్రపంచమునందంతట నీవే యెల్లెడల వ్యాపించియున్నావు. సర్వభూతము లను నీవే ధరింతువు. నీవే భరింతువు. నీ వగ్నివనియు, హవ్యవాహుండ వనియు, శ్రేష్ఠమైనహవి స్సనియు బుద్ధిమంతు లనేకు లనేకవిధములుగ నిన్ను భావింతురు.ముల్లోకములకుఁ ద్రష్టవు నీవు. కాల మాసన్న మగునప్పు డీచరాచరజంతుజాలముల నన్నింటిని వినాశ మొనర్చి, మఱల వానిఁ దేజోవంతములుగ నొనర్చుమహానుభావుఁడవు నీవు. అని స్తంబమిత్రుఁడు నుతించెను. ఈప్రాణుల కందఱకును భుజింపఁదగినయన్నము నీవ. భుజిం చినపిదప వారిలో నంతర్యామివై యుండువాఁడ వీవ. సర్వకాల ములయందును నీవు ప్రాణుల నభివృద్ధిచేయుచుండుదువు. నీయందు సర్వ మును సుప్రతిష్ఠితము. నీవు సూర్యకిరణములను జొచ్చి వానిమూల మున భూమియందుండు నీటిని గ్రహించి మేఘరూపమును దాల్చి మరల వృష్టిం గావించి సకలౌషధులఁ బెంచుచున్నాఁడవు. అట్టినిగ్రహాను గ్రహశక్తి గల నీవు తప్ప మమ్ముఁ గాపాడఁగల దిక్కెవ్వరును లేరు. ఓ పింగాక్షుఁడా! లోహితగ్రీవుఁడా! కృష్ణవర్త్మఁడా! హుతాశనుఁడా! మా

యున్నచోటును దహింప వలదు. ఇట్లు బ్రహ్మవాదియైన ద్రోణుం డను శార్ఙ్గి నుతింపఁగా, నగ్నిభట్టారకుండు మందపాలునిస్తోత్రమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని యాఋషికిఁ జేసినవాగ్దానమును స్మరించి, 'ఓ ద్రోణుఁడా! మీయన్నదమ్ములు నావలన భీతిల్లవలదు. నీవు బ్రహ్మవిదుండవు. నీసూక్తములు నన్ను సంతోషింపఁజేసినవి. పూర్వము మీతండ్రి మందపాలుఁడు మిమ్ము నీసమయమున రక్షింపుమని నన్ను వేఁడియుండెను. కాఁబట్టి మీకుఁ జేటు నేను జేయ నేర. మఱియు మీరింకెద్దానినైనం గోరుఁడు. దానిని మీ కొసఁగెద.' అని చెప్పఁగా ద్రోణుం డగ్నిదేవా! ఈపిల్లులు మమ్ము సదా వేధించుచుండును. వీనిని దహించి పుణ్యమునఁ బొమ్మనఁగా నందుల కియ్యకొని యాపిల్లులఁ దనసప్తజిహ్వలం గాల్చి శార్ఙ్గకులఁ గాపాడెను. అంట మందపాలుండు ఖాండవంబున శార్ఙ్గకు లెట్లుడైరో యని చింతాక్రాంతుఁడై పలుమాఱు వారిని దలంపునకుఁ దెచ్చుకొనుచుండఁగా వానిభార్య లపిత వాని కిట్లనియె. ఓఋషివర్యా! అగ్నిహోత్రుండు నీ కింతకు మున్న వారిం గాపాడెద నని బాస యిచ్చినాఁడు కాఁడా? ఆమాటకు విరుద్ధముగ నాతం డేల ప్రవర్తించును? వారి నేల దహించును? తలపోసి చూడఁగా నీకు వారియెడఁ గల ప్రీతి నాయందు లేదు. కాకున్న నిట్లనిశము వారిని దలంచుచుందువే? కావున నన్ను వదలి నీప్రేయసియగు జరితయొద్ద కేఁగి, నీయనురాగంపుఁగూనలఁ జూచుచుండుమని చెప్పఁగా మందపాలుండు దాని కిట్లనియె. లపితా! వినుము. సంతానార్థము నేను జరితను పెండ్లాడితిని. దానియం దపత్యములఁ బొందితిని. నాకుఁ బుట్టినవారిని వదలి నీయందు మున్ను సంతానము కలుగఁబోవునని వారిపైఁ దగులమును విడుతునే? ఇదిగో వీతిహోత్రుండు ఖాండవదహనోత్సుకుండై మిక్కిలి తేజోమూర్తిఁ దాల్చి యున్నవాఁడు. నేనిం దుండుటకుఁ గాళ్లు కుదుటఁబడక యున్నవి. మన స్సతిచంచలమై యున్నది. నాపిల్లలేమైరో? జరిత యొక్కతె యేమి చేయఁగలదు? పక్షికిఁ బిల్లలను మోచుట కలవాటు లేదు. ఆగూటియం దుండు

పిల్లలు సంపూర్ణముగఁ బిట్టలింకను గాలేదు. అని చెప్పి వేగముగాఖాం డవవనముం దరిసి యంతకు మున్న యగ్నిహోత్రుండు మందపాలు పిల్లలను రక్షించి జరితగూటిని గాపాడుటచే దహనకాలమున గూటియందుండి వెలుపలికిఁ బోయియుండిన జరిత గూటియందుఁ బిల్లలతో క్షేమముగా నుండుటను వీక్షించి, ఓజరితా! ఈపుత్రు లలోఁ బెద్దవాఁ డెవ్వఁడు? కడఁగొట్టువాఁ డెవఁ డని యడుగ భర్తకు జరిత నిష్ఠురోక్తుల నిట్లు నుడివెను. ఋషివర్యా! ఈపిల్లలజోలి నీ కేల? వీరిలోఁ బెద్దవాఁ డెవ్వఁడైననేమి? చిఱుతవాఁ డెవండైన నేమి? నీవును లపితయు క్షేమముగా నుండిన సరి. లపిత నిప్పు డెట్లు వదలి రాఁగల్గితివి? మఱల లపితయొద్ద కేఁగుము. అనఁగా మందపాలుండు తనలోఁదా నిట్ల నియె. హా! ఇట్టిసంతాపము వసిష్ఠునివంటివారికినిఁ గలుగుట తప్పదు. అంతటి ఋషివర్యునిభార్యయైన పరమపతివ్రత యగు నరుంధతివంటి పుణ్యాంగనసైతము భర్తనుసంశయింపకమానదు. ఇదిస్త్రీస్వభావము. సవతులపోరు నుడువఁదరము కా దని, పుత్రులం బిలిచి మీకై నే నగ్ని దేవునిఁ బ్రార్థించి యుంటి. మీకు క్షేమ మగుఁగాక యని వారి నూఱడఁబలికి తాను యథేచ్ఛ నొండొకయెడ కరిగెను. అగ్నిదేవుం డీవిధముగ నిర్విఘ్నముగ ఖాండవవనమును దహించి శ్వేతకివలన దనకుఁ గలిగిన బాధను నివృత్తిసేసికొని యభిమతంబు సమకూఱఁ గృష్ణార్జునులను దీవించి యథేచ్ఛఁ జనియె.

అప్పు డమానుషంబైనదియు, నత్యద్భుతమును నైన యీదుష్కరకార్యమునకు దేవేంద్రుండు సంతోషించి సురగణపరివృతుఁడై కేశవార్జునులను సమీపింపఁగా, వారు వినయముతోఁ దాము పూర్వము నరనారాయణు లను దైవమునులైనను నాసమయమున మనుష్యరూపములను ధరించియుండువారు గావున దేవేంద్రునకుఁ బ్రీతితో నమస్కరించిరి. అప్పు డింద్రుండు వరములఁ గోరుఁ డనెను. అర్జునుండు తన కనేకదివ్యాస్త్రముల ననుగ్రహింపు మనెను. దానికిఁ

పురందరుండు నీ కెపుడు మహేశ్వరుండు ప్రత్యక్షగోచరుం డగునో యపుడు నీయడిగినయాగ్నేయాదిదివ్యాస్త్రముల నొసంగుదు. ఆసమయ మును నేను గనిపెట్టియుండెదను. అని చెప్పెను. అంత శ్రీకృష్ణుండు తనకు నర్జునునితోఁ జెలిమి యెడతెగక యెల్లకాల ముండ ననుగ్రహింపుమనెను. పాకశాసనుం డది యట్లు యగుఁగాక యని చెప్పి, తనతోడి దేవతలతో నదృశ్యుం డయ్యెను. అంత వాసుదేవార్జునులు వీతిహోత్రు సెలవు పొంది తమవెంబడి మయదానవుఁడు రాఁగా యమునానదీతీరమున నుల్లాసమున విహరించుచు నొకరమణీయప్రదేశమునఁ గూర్చుండి చల్లని పిల్లతెమ్మెరలు వీచుచుండ సంతుష్టస్వాంతులై సుఖ ముండిరి.

ఇట్లాదిపర్వములందలికథల నెల్లఁ బాపరహితుఁడైన జనమేజయు నకు మహానుభావుం డగు వేదవ్యాసశిష్యుండును, మహాతపస్వియునైన వైశంపాయనుం డతిప్రియమున నింపుగా వక్కాణించెను.



శ్రీ ర స్తు

శ్రీరుక్మిణీసత్యభామాసమేత శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# వచనమహాభారతము

## సభాపర్వము



శ్లో. నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్.

అక్కథకుండు శౌనకాదిమహామునులకుఁ జెప్పినవిధముగా జనమేజయునకు వైశంపాయనుం డవ్వలివృత్తాంతంబు నిట్లని చెప్పందొడంగెను.

అట్లు యమునాతీరంబున దేవకీనందనునితోడ సరసంపుఁబలుకులు పల్కుచున్న యర్జునునకుఁ బ్రీతితో నమస్కరించి మయదానవుం డిట్లనియె. 'మహానీయా! ఈవాసుదేవుండును దహనుండును నాయెడ మిక్కిలి కోపించియుండినను నవ్యాజమైన నీకృప నాయందుండుటంబట్టి ప్రాణములు రక్షింపఁబడినవి. నీవు నా కేడుగడవు. ప్రాణములఁ గాపాడిన నీకు నే నేమి ప్రత్యుపకార మొనర్పఁగలను? అయినను నేను దానవవిశ్వకర్మను గావున మీ రానతిచ్చిన యొద్దానినైనను నిర్మించి మీకు సమర్పించిపోవుటకుఁ గుతూహలపడుచున్న వాఁడ. నానేర్చినకొలఁది నొనర్చి దానిని మీ కొసంగెద. ఆనతిండు.' అని యడుగఁగా నర్జు

నుండు మయదానవున కిట్లనియె. దానవేంద్రా! నీవెల్ల కాలము మాయెడఁ బ్రీతితో నుండుము. మేమును నీయెడఁ బ్రీతులమై యుండెదము. అంతియ చాలును. అని చెప్పఁగా మయుం డిట్లనియె. మీ రేదేని మీ కిష్టమైనదాని నిర్దేశింపుఁడు. నేను దాని నిర్మించి తెచ్చి మీకు సమర్పింపవలయు నని కడు నపేక్షతో నున్నాఁడను. అటు లతఁడు నిర్బంధింప నప్పు డర్జునుం డీజనార్దనుం డెద్దాని యోచించి చెప్పునో దానిం జేసి మాకుఁ జేర్పు మనఁగా, వాసుదేవుం డంతటఁ గొంత యాలోచించి మయునితో 'దానవశిల్పివర్యా! దివ్యప్రభావిలసితంబును, నానావిధాభిప్రాయములతో విరాజిల్లునదియు, నతిరమణీయంబును నగు నొకసభను ధర్మపుత్రునకుఁగాను నిర్మింపు' మనెను. మయుం డట్లు జనార్దను నభిమతంబుచొప్పునఁ జేయుదు నని సంతోషముతో నిష్టపడెను. అంతట వాసుదేవార్జును లిరువురును నా మయదానవునితో హస్తినాపురమున కేతెంచి ఖాండవదహనవృత్తాంతం బంతయు ధర్మపుత్రునకుఁ దెలిపిరి. అప్పుడు వా రిరువురు యుధిష్ఠిరునితో 'నీమయదానవుఁడు దానవులకు శిల్పాచార్యుండు. ఖాండవదహనకాలమున నీతనిప్రాణములను రక్షించుటచే నర్జునునకుమనస్సంతోషముచేయునిమిత్త మొకయపూర్వమగుసభనొక్కదానిని నిర్మించి తెమ్మని యితనితోఁ జెప్పియుంటిమి.' అనఁగా యుధిష్ఠిరుండు సంతసించి యాతని కుచితసత్కారములం జేసి పంపెను. అంత మయుం డొకశుభదినమునందు మంగళస్నాన మాచరించి బ్రాహ్మణుల కనేకవిధభక్ష్యములతోఁ గూడిన పాయసాన్నసంతర్పణ మొనర్చి, మిక్కిలి రమణీయం బైనసభను నిర్మింపఁ బ్రారంభించి నాల్గుపార్శ్వములయందుఁ బదివేలజేనలు గలుగున ట్లొకప్రదేశము నేర్పఱుచుకొని సభానిర్మాణకార్యమునకు దొరకొనెను.

అంత నొక్కదినము వాసుదేవుండు ద్వారవతికిఁ బోఁదలంచి ధర్మపుత్రునితో 'నేను మీ రున్న యింద్రప్రస్థపురమున కేతెంచి బహుకాలమైనది. మాతల్లిదండ్రులను జూచువేడ్క పొడమినది. సెలవిమ్ము పోయివచ్చెద' నని యాతనికి మ్రొక్కి, కుంతీదేవిని సమీపించి యాయమకు నమస్కరించి యద్దేవిసెలవును బొంది, సుభద్రనగరునకుఁ జని, యాదేవి దేవకీవసుదేవులకుఁ జెప్పిన యుదంతములను గ్రహించి యా

మెను దీవించి, పిమ్మటఁ బాంచాలరాజపుత్త్రిసదనమునకుఁజని యాపుణ్యాంగన సదసద్వివేకమును నుతించి, ధౌమ్యునొద్ద కేగి యామునిచంద్రునకు సాష్టాంగవందనము లాచరించి యాతనిదీవనలం గొని, యాత్రా దానములఁ జేయం దలంచి కృతస్నానుండై శుచిత్వముతో దేవతలను భూదేవతలను గంధపుష్పములచేఁ బూజించి వారికి నమస్కరించి, భూదేవతలకు నానావిధయాత్రాదానంబు లొనర్చి వారు స్వస్తిపుణ్యాహవాచనముల నొనర్చి మంత్రాక్షతలు తన కొసంగఁగాఁ గొని వారికి విశేషదక్షిణల నిచ్చి, తన్నుఁ బాండవులేవ్వరును దారి నంపరాఁగాఁ బ్రయాణమై నగరుమొగసాల దాఁటివచ్చి యంతకు మున్న గదాచక్రాద్యాయుధములతో నమర్పఁబడినదియు, గరుడధ్వజముతో వెలయుచుండునదియు, శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనునాల్గురథ్యములు పూన్చినదియు, దారుక సారథికంబును నగు కాంచనరథం బెక్కెను. అప్పుడు యుధిష్ఠిరుండు దారుకునిఁ గొంతఁ దొలఁగియుండుమని రథ్యములపగ్గములను దాన పూని నొగపై నారోహించి సారథ్యం బొనర్పఁ బూనుకొనెను. పార్థుండు శ్రీజనార్దనునితోఁ దానును రథము నారోహించి యప్పరమేశ్వరునకు వింజామరలను వేయుచుండె. భీమసేనుండును గవలును నుచితపరిజనములు తనవెంట వచ్చుచుండఁగా వారును భగవంతు ననుగమించి వచ్చుచుండిరి. ఇవ్విధంబునఁ బాండవు లెల్లరును దన్ను దారి నంపుటకుఁ గొంతదూరము రాఁగా వారికిఁ దగుమాటలాడి, ధర్మరాజునకుఁ బ్రణమిల్లి, మిగిలిన పాండవులం గౌఁగిలించికొని యందఱను నిలువుం డని యానతిచ్చి దారుకసారథికం బైన రథమును వేగంబ తోలున ట్లుత్తరువునేసి ద్వారకాపురంబునకుఁ జనెను. అంతఁ గౌంతేయు లందఱును శ్రీవాసుదేవుఁడు పోవుచుండఁగా దృష్టికి గోచరించునవఱ కాతని తేరువంకఁ జూచి మగిడి యాదానవారాతిగుణగణముల నుతించుచు నింద్రప్రస్థపురముం జేరిరి. అంత దేవకీనందనుండు కతిపయదినప్రయాణముల ద్వారకాపురిం జేరి తల్లితండ్రి మొదలగువారలకు నమస్కరించి, రుక్మిణీప్రభృతు లగు నంతఃపురాంగనలతో వేడ్క మీఱ విహరించుచుండె.

## మయుండు సభను నిర్మించి ధర్మరాజునకుఁ దెచ్చి యిచ్చుట

మయుండు సభను నిర్మించునిమిత్తము పోవువాఁ డర్జునునితో నాసభను గూర్చి యిట్లు చెప్పియుండెను. అర్జునా! పూర్వము దానవులు బిందుసరోవరతీరమునందు యజ్ఞము లాచరించుచుండఁగా, వృషపర్వుఁడను రాక్షసరాజునిమిత్తము నే నొకసభానిర్మాణముఁ గావింపవలయునని యుద్యమించి, నానావిధమణిమయపదార్థముల సేకరించి యాసరస్సునఁ బదిలపఱచియుంటిని. అవి యందుండెనేని వానితో నాసామర్థ్యమంతయు నుపయోగించి రమణీయమైన సభను నిర్మించెదను. మఱియు నాసరస్సునందు వృషపర్వుండు తనగదను బదిలపఱచియుండె. ఆగద లక్షయాయుధములనైనను విఱుచునంతటి దృఢమైనది. దానిని దెచ్చి భీమసేనున కొసంగెద. అది భీమసేనునకుఁ దగినది. ఇంతేకాక, యచ్చోట దేవదత్తమను శంఖ మొక్కటిగలదు. అది వరుణునిది. దానినూఁదినచో దానినుండి వెలువడు ధ్వానమును విన్న సర్వభూతములును గడగడ వడంకును. అట్టిశంఖమును దెచ్చి నీకిచ్చెద. అని చెప్పి మయుండచ్చోటినుండి తఱలి యీశాన్యభాగంబునకుఁబోయి మైనాకపర్వతమును సమీపించి, కైలాసమునకుఁ బోయి హిరణ్యశృంగమునందు గంగానదినేస్థానమున భగీరథుం డాకసమునుండి ప్రత్యక్షముగావించెనో, యేచోట బ్రహ్మ, నరనారాయణులు, రుద్రుండు, నింద్రుండు మొదలగు దేవతాశ్రేష్ఠు లనేకయుగములు యజ్ఞముల నాచరించిరో, యేచోట రత్నమయములయి, చిత్రవిచిత్రములయి, విశాలములయిన యాగశాలలును, స్వర్ణమయములయిన యూపస్తంభములును నొప్పారుచున్నవో, యట్టిదగు బిందుసరోవరమున నున్న రత్నసామగ్రుల నన్నింటిని గొని దేవతలను బ్రాహ్మణులను వివిధార్చనలచే సంతుష్టులం గావించి, మిక్కిలి మనోహరముగా నాసభచే భూమిదేవి కపూర్వనూతనకాంతిని గావింపఁ బూనుకొనెను. ఆసభయందు వైడూర్యమణిమయము లగు నాకులును, రత్నమయంపు గోడలును నొప్పాఱ, నయ్యది స్వర్ణకమలంబులును, గాంచనమయకూర్మమత్స్యములు మున్నగు జలజంతువులును, బటికంపుమెట్లును గలిగి, తీరములయందుఁ బల్లవ పుష్పఫలములతో నిండిన వివిధవృక్షములతో నుండునదియు, శీతలనిర్మలోదకంబులు గల

సరోవరములును వెలయు, నీయ్యది జలము, ఇయ్యది స్థల మను భేద మొక్కింతయైనఁ దెలియరాక మిక్కిలి నేర్పుతో నిర్మింపఁబడిన నిర్మల మణిమయములగు దూలములతోను, గంబములతోను, గోడలతోను, దిన్నెలతోను, ఆాలు పఱచినస్థలములతోను, గుండ్రములైన ప్రాకారములతోను నొప్పి యపూర్వవిలాసము తళుకొత్త నూతనమైన సభగా నిర్మింపఁబడెను. మనోహరములయిన యింద్రనీలమణులచే నిర్మింపఁబడిన నల్లగలువలచేతను గెంపులచే నిర్మింపఁబడిన యెఱ్ఱదామరలచేతను, వెండితో జేయఁబడిన తెల్లఁదామరలచేతను, హంసలగుంపుతోడను, ముత్యములతోను నిర్మింపఁబడిన క్రొత్తసురుఁగులచేతను, బచ్చలచే నిర్మింపఁబడిన పాఁచితీఁగెలచేతను, బంగారముతోఁ జేసిన తామెళ్లచేతను, వైడూర్య నిర్మితములైన కలువలచేతను, వజ్రమయములయిన మీనములచేతను బ్రకాశించు మణిమయస్థలముఁ జూచి కొల ననియు, పలుగుటాలగోడల కాంతులు కప్పిన జలములున్నచోట్లు చూచి స్థలము లనియు జనులు భ్రమపడునట్లు మయుఁడు సభను నిర్మించెను. మఱియు సకలజనులకు మనోహరములయిన నానావిధములయిన కీలుబొమ్మలు మొదలగునవియు, నెల్లప్పుడు పుష్పఫలములతో నిండినచెట్లు గలవనములును, వికసించిన కమలముల చేతను, గలువలచేతను గన్నులపండువయిన గుంటలును, విచిత్రమైన యుద్యానవనములును, జూరులందు వ్రేలాడుపావురపుగూళ్లును, బదివేల బారల ప్రమాణము వెడలుపును నిడుపును గలిగి సూర్యకిరణములు ప్రసరించుటచే విస్తారమయిన విభూతిగలదియై నానావిధము లగు రత్నకాంతులచే శోభిల్లుచున్న యపూర్వమగు సభామండపమును బదునాల్గు నెలలు నిర్మించి దానిని గొప్పదేహములు గలవారును, మిక్కిలి వేగమును బలమును గలవారును ఆకసమునఁ దిరుగువారును నైన యెనిమిదివేల రాక్షసకింకరులచే మోపించికొని వచ్చి దానిని ధర్మరాజునకును, వృషపర్వునిగదను, దేవదత్తమనుశంఖమును భీమార్జునులకును నొసంగి యుధిష్ఠిరునిచే సమ్మానితుండై మయుండు తరలిపోయెను.

—● ధర్మరాజు తమ్ములతో సభను ప్రవేశించుట ●—

అంత నలుదెసలఁ బ్రసరించుచుండు కీర్తిచంద్రికలు గలవాఁడును, బ్రతాపశాలియును నైన ధర్మరాజొక్కనాఁడు పదివేవురు బ్రాహ్మణు

లకు మృష్టాన్నసంతర్పణంబుఁ జేసి వారిని వివిధభక్ష్యములతోను మాంస
ములతోను పాయసముతోను దృప్తులం జేసి వారికి రత్నపుటుంగరము
లను, వివిధాభరణములను, నానావిధవస్త్రములను, పెల్లనిపుష్పము
లను, బరిమళించు సుగంధములను, ననేకములగు పాడియావులను దానము
సేసి వారి మంగళాశీర్వచనములఁ బడసి పలుతెఱంగుల వాద్యఘోషం
బులు బోరనమ్రోగుచుండ నాయపూర్వమైన సభయందుఁ దనతమ్ములతోఁ
గూడి ప్రవేశించెను.

మఱియు నప్పు డతఁడు మహనీయులగు భూసురులను భక్తితో
నర్చించి వారు కోరిన యనేకదానములు వారికిఁ దనివితీరునట్లొసంగి, యాచ
కులను సంతోషింపఁజేసి బంధువులకును హితులకును మానసోల్లాసము
గావించి, దేవతాస్థానముల నిష్టదేవతలఁ జేర్చి వందిమాగధవైతాళికుల
స్తుతినినాదంబులచే సభ నిండియుండ సుధర్మాసనాసీనుండై యున్న మహేం
ద్రుంబోలె మయసభాధిష్ఠితుఁ డయి ధర్మపుత్త్రుండు ప్రకాశించుచు
నుండెను. అట్లు ప్రతాపముతో వెలుంగుచున్న ధర్మనందనునకు నామహ
నీయుని ప్రతాపశౌర్యములకు వెఱచిన భూమండలములోనున్న నానా
రాజన్యులు దివ్యములైన భద్రజాతియేనుంగులను, గాశ్మీరకాంభోజ
హయంబులను,నమూల్యములైన కనకాభరణములను, స్వయంప్రకాశము
గల మాణిక్యములను, విలాసినీజనములను, దాసదాసీజనులను మున్నగు
ననేక సంపదలను గ్రమముగాఁ గొని తెచ్చియిచ్చి భూలోకగతసూర్యుం
డో యనునట్లుండుయుధిష్ఠిరుం జూచి సంతోషమున నుప్పొంగిరి.
ఇవ్విధంబునఁ బ్రకాశించుచుండు ధర్మపుత్త్రు నంగవంగకళింగాంధ్రపుం
డ్రకకిరాత మగధ మత్స్య మాళవ కేకయకరూశకాంభోజ మద్రపాండ్య
దేశాధిపతులు మున్నగువా రందఱును దినదినాభివృద్ధి గలవాఁడును,
దనతేజస్సును బ్రపంచమునఁ బరిపూర్ణముగ నిండించినవాఁడును, మఱియు
నిర్మితసభాసీనుండును నగువాని ననిశంబు సామంతులై సేవించు
చుండిరి. ప్రద్యుమ్న సాంబ సాత్యకి సుధర్మానిరుద్ధులను యాదవకుమారు
లర్జునుని యొద్ద విలువిద్య నభ్యసించుచుండిరి. అప్పు డసితుండైన దేవ
లుండును, సర్పమాలియును, మహాశిరుండును, అర్వావసుండును, సుమి
త్త్రుండును, మైత్రేయుండును, శునకుండును,బలియు,బకుండును, దాల్భ్యుం

డును, స్థూలశిరుండును, కృష్ణద్వైపాయనుండును, శుకుండును, వ్యాసశిష్యులగు సుమంతపైలజైమినులతో నేనును తిత్తిరియు, యాజ్ఞవల్క్యుండును, ససుతుండగు రోమహర్షణుండును, పాండవులపురోహితుండగు ధౌమ్యమునియు, వాణిమాండవ్యుండును, పర్ణాదుండును, పర్వతుండును, మిక్కిలి యశస్వియగు మార్కండేయుండును, కౌశికుండును, మౌంజాయనుండును, వాయుభక్షుండును, సారికుండును, బలీవాకుండును, సిలీవాకుండును, సత్యపాలుండును, కృతశ్రముండును, జాతుకర్ణుండును, శిఖావంతుండును, ఆలంబుండును, పారిజాతుండును, పర్వతుండును, పవిత్రపాణి యగు సావర్ణుండును, భాలుకియు, గాలవుండును, జంఘాబంధుండును, రైభ్యుండును, కోపవేగుండును, భృగువును, హరిబభ్రుండును, కౌండిన్యుండును, సనాతనుఁడగు బభ్రుమాలియును గాత్రీవానుండును, ఔషిజుండును, నాచికేతుండును, గౌతముండును, పైంగుండును, వరాహుండును, మహాతపస్వియగు శాండిల్యుండును, కుక్కురుండును, వేణుజంఘుండును, కాలాపుండును, కఠుండును మున్నగు మహర్షులును ధర్మాధర్మముల నెఱింగిన విద్వాంసులును, జితేంద్రియులును, నింకను వేదవేదాంగపారంగతు లగుభూసురు లనేకులు నానావిధములగు పూర్వపుణ్యవంతుల సచ్చరిత్రములను ధర్మరాజువీనుల కింపుగాఁ జెప్పుచుండు నిర్మలు లైన విప్రులును రమ్యమయిన ధర్మరాజుసభకుఁ బోయితిమి.

## నారదుండు ధర్మరాజునొద్దకు వచ్చుట

అప్పుడు వేదోపనిషత్తుల యర్థమునంతయు నెఱింగినవాఁడును, దేవగణములచేత నర్చింపఁబడు ఋషివర్యుండును, పూర్వకల్పవిశేషముల నెఱింగిన మహాసీయుండును, సమస్తేతిహాసములను బురాణములను దెలిసినవాఁడును, మీమాంసాశాస్త్రాదికరణోక్త న్యాయముల పూర్వపక్షోత్తరపక్షద్వయములను సిద్ధాంతములను శాస్త్రీయముగఁ దెలిసినవాఁడును, నైక్యసంయోగవియోగనానాత్వసమవాయవిశారదుండును, మహావక్తయును, ప్రగల్భుండును, మేధావియు, స్మృతిమంతుండును, నీతిశాస్త్రవిశారదుండును, గవీశ్వరుండును, దాయభాగాదివ్యవహారవేత్తయును, జ్ఞానకాండములయందు దిది యోగ్య మని శిష్యులకు వివరింపఁగల

శక్తి గలవాఁడును, ప్రత్యక్షానుమానాదిప్రమాణములయొక్క పరిష్కృతసిద్ధాంతములు గలవాఁడును, ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనము లను పేళ్లతో వెలయుపంచావయవవాక్యములయొక్క గుణదోషపరిజ్ఞాతయు, నుత్తరోత్తరవాక్యములను వికల్పము రాకుండ మాటలాడ నేర్పరి యగు బృహస్పతికి సమానుండును, ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థముల నిజస్వరూపమునందుఁ గృతనిశ్చయుండును, ప్రపంచమెల్లఁ బ్రత్యక్షముగ నెఱింగినవాఁడును సాంఖ్యయోగవిభాగజ్ఞుండును, సంధివిగ్రహతత్త్వజ్ఞుండును, సర్వశాస్త్రముల నెఱింగినవాఁడును, గలహప్రియుండును, గానలోలుండును నగు నారదమహాముని మూఁడులోకములను దిరుగుచుండువాఁ డొకదినము పారిజాతుఁడు రైవతుఁడు మున్నగు మహర్షివర్యులతోఁ గూడికొని యాధర్మపుత్త్రుసభకు విచ్చేసెను. అట్లు వచ్చిన నారదమహామునికి ధర్మనందనుండు తమ్ములుం దానును నెదురేఁగి భక్తిపూర్వకంబుగ నాతని కర్ఘ్యపాద్యముల నొసంగి సముచితాసనంబున సుఖాసీనుం జేసి మధుపర్కం బొసంగెను. అంత నా దేవముని యాసత్కారముల నెల్ల దరహాసితవదనుండై కొని మంగళాశీర్వచనములచే వారలం బ్రసాదించి ధర్మార్థకామములతోఁ గూడినమాటలతో నతనికి ని ట్లనియె.

### నారదుండు యుధిష్ఠిరు నడిగినరాజనీతి ప్రశ్నములు

నీయర్థములు ప్రయోజనవంతము లగుచున్నవా? నీమనస్సు ధర్మమునందు సుప్రతిష్ఠితమైయున్నదా? మీవంశమునబుట్టిన రాజశ్రేష్ఠు లేర్పఱచిన పరంపరాప్రాప్తమైనదియును ధర్మములతోఁగూడినదియు నగు శ్రేష్ఠమైనవృత్తి నవలంబించి ధర్మార్థకామము లొకటి నొకటి బాధింపకుండ నుచితకాలములయందు *వానివాని సేవించి సుఖి వగుదువే? వక్తృ

* కాలమునకుఁ బ్రమాణము యామార్ధము. పగలునందు:—అంతఃపుర విషయవిచారణ, ౨ దండనీతివిషయము, ౩ స్నానభోజనములు, ౪ ద్రవ్యార్జన విచారణ, ౫ మంత్రాలోచనము, ౬ అంతఃపురసంచారము, ౭ చతురంగబలావలోకనవిచారణ, ౮ పరాక్రమచింత, రాత్రియందు:—౧ గూఢచారపరిశీలనము, ౨ భోజనము, ౩ సచ్ఛాస్త్రావలోకనము, ౪ గీతనృత్యవాద్యవినోదములు, ౫ నిద్రా

త్వము, ప్రాగల్భ్యము, మేధ, పూర్వోత్తరవచనముల స్మరణము, నీతివిజ్ఞా
నము, విచక్షణత్వము ననునాఱు రాజగుణములుగలిగి ధర్మమును లెస్సగాఁ
బరికించి సామదానభేదదండములును, మంత్రము, ఔషధము, ఇంద్రజాల
మునను సప్తోపాయముల నుచితరీతిగ నుపయోగించి దుష్టులను శిక్షించుట,
శిష్టులను బరిపాలించుట, దూతలను వేగువాండ్రను బంపుట, బంధువులను
సత్కరించుట, ప్రజలమనస్సు రంజిల్లఁ జేయుట, ధర్మమునే చేయుట, యస్త్ర
విద్యాభ్యాసము, అకర్తవ్యములను ద్యజించుట, నిత్యకార్యములం దప్ర
మాదుండవుగ వర్తిల్లుట యను పదింటిని లెస్సగాఁ బరిశీలింతువే? ఎదిరి
కిని దనకును గలతారతమ్యము నెఱింగి వ్యవసాయము, వాణిజ్యము,
యుద్ధము, సేతువు, గజబంధనము, గనులలో రాజాదాయమును
గొనుట, బంగారుగనులను వెదకించుట, నిర్జనప్రదేశములను జనులకు
వాసస్థానములుగాఁ జేయుట యను నీయెనిమిదింటియందును నెమ్మదిగా
నడుచుచుందువే? స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గములను నేడు
ప్రకృతులును మోసగాండ్రగు దూతలకు లోఁబడక నీకు వశవర్తులయి
యున్నవి గదా? మఱియు గూఢమగు నాలోచనము రాజులకు
విజయమును జేకూర్చును. అట్టిరహస్యము నీమూలమునఁగాని నీమంత్రుల
మూలమునఁగాని గుప్తముగా నుంపఁబడియున్నదా? అట్టి రహస్య
రక్షణమునం దప్రమాదముగ మెలఁగుదువుగదా? పాపరహితులును,
శాస్త్రవిధుల నెఱింగినవారును, నీయెడఁ బ్రీతి గలవారును, వంశ పారం
పర్యమునుండి వచ్చువారును, జంకక హితమునే బోధించువారును,మహా
కులీనులునైన బ్రాహ్మణులను రాజకార్యములను నడుపుటకొఱకు మంత్రు
లుగాఁ జేసియున్నావా? మంత్రియొక్కండైనను ప్రజ్ఞాశాలియు, శూరుఁ
డును, శాంతుఁడును, నేర్పరియును నైయుండవలయును. అట్టివారి నేరి
మంత్రులనుగా నియమించినచో వారవశ్యము రాజును రాజపుత్త్రులను
మహాధనికులనుగఁ జేయుదురు. శాస్త్రజ్ఞానము గల మంత్రు లుండు
రాజ్యమును శత్రువులు చొరనేరరు. కేవలము నిద్రావశుండవుగాక జాగ
రూకుండవై ప్రభాతమునకు మునుపే లేచి రాజ్యతంత్రముల నాలోచిం

---

కాలము ౬ శాస్త్రచింత, ౭ కార్యచింత, ౮ పురోహితాదులతో వైదికవిషయ
విచారణము, దేహ యాత్రాస్నానాదివిధులు.

చుచుందువు గదా? ఒక్కఁడవుగాఁ గాని, లేక యనేకులతోఁ గూడి కాని మంత్రము నాలోచింపవుగదా? హితులగు మంత్రులతో నాలోచించి యల్పప్రయత్నమున విశేషఫలముల నొడఁగూర్చు కార్యముల నతివేగమునఁ జేయుచుందువే? కార్యఫలములను బరికించుట కన్యులను నియమింపక నీవ ప్రత్యక్షముగఁ జూచుచుందువే? కార్యాంతమున ఫల పర్యవసానము చెడకుండఁ బరిశీలించుచుందువే? ఆప్తులను లోభులు కానివారిని గ్రమమార్గముల నవలంబించువారిని గార్యములను జేయుట యందు నియమించి ఫలమబ్బునపుడు తప్ప ముందుగఁ బ్రజలకుఁ దెలియకుండునట్లు గోప్యముగఁ గార్యములను నడుపుచుండుదువే? అట్లుకాక నీయుద్దేశము దుష్టులకుఁ దెలిసినచో వారు నీకు హానిఁ జేతురు. దుష్టసంసర్గము చేటులకు మూలము. సర్వశాస్త్రములను ధర్మములను దెలిసినమహనీయులు రాజకుమారులను శిక్షించుచుందురే? అట్టివారిచే శిక్షితు లగు కుమారులు క్రమముగ యోధముఖ్యు లగుదురని యెఱుంగుదువే? మూర్ఖులను నావలికి నెట్టి పండితుని గ్రహింతువే? పండితుఁ డాలోచించి కార్యములను ఫలవంతములనుగను రాజానుకూలములనుగ నొనర్చి రాజునకు శుభమును బొందఁ జేయును. కోట లన్నియు ధనముతోను ధాన్యములతోను సంపూర్ణోదకముల తోను, నానావిధయంత్రములతోను, నాయుధములతోను నిండింపఁబడి యున్నవా? ఆకోటలకు వలసినంత శిల్పాచార్యులును ధనుర్ధరులును రక్షకులయి యున్నారా? శత్రురాజ్యములయందలి మంత్రి, పురోహితుఁడు, యువరాజు, సేనాపతి, ద్వారపాలకుఁడు, నంతఃపురవిచారకుఁడు, కారాగృహాధికారి, భాండాగారాధికారి, రాజాజ్ఞను వెల్లడిపఱచువాఁడు, వాదులయొక్కయుఁ బ్రతివాదులయొక్కయు వాదమును బ్రతివాదమును విమర్శించి న్యాయమును వెలికిఁ దీసి ధర్మమునఁ బ్రవర్తింపఁ జేయువాఁడు, సైన్యమునకు నెలజీత మిచ్చువాఁడు, రాజోద్యోగమున నుండు సైన్యమునఁ దక్క నితరసంస్థలలోఁ బనిచేయువారికి జీతముల నిచ్చువాఁడు, సభాపాలకుఁడు, ధర్మాధికారి, దండనాధికారి, కోటకాపరి, రాష్ట్రాంతమునందలి యెల్లలను బాలించువాఁడు ననువీరిలో మంత్రులను బురోహితులను యువరాజును దప్పఁ దక్కినవారిని బరిశీలించు నిమి

త్తము నీరాజ్యమునుండి యొక్కొక్కరికి ముగ్వురేసి గూఢచారులను
బరస్పరము గోచరము గానీయక వివిధవేషములతోఁ బంపి వారిరహస్య
ములను నాంతరంగికభావములను బరిశీలింతువే? ధీరుఁడు, ధర్మాధర్మము
లను జక్కఁగా నెఱింగినవాఁడు, బహుశ్రుతుఁడు, రాగద్వేషములు లేని
వాఁడు, వినయసంపన్నుఁడు, సత్కులప్రసూతుఁడు, అసూయాపరుఁడు
గానివాఁడు, నిర్దోషి, సరస్వతీదేవి నెలకొన్న ముఖకమలము గలవాఁడు
నగుబ్రాహ్మణుని సన్మానించి పురోహితునిఁగఁ జేసియుందువే? నీవుగావించు
యజ్ఞములయందు నియోగింపఁబడిన యాజ్ఞికుఁడు ప్రయోగమునందు
సమర్థుఁడై తనకార్యములయం దప్రమాదుఁడై యుండునే? అతండు హుత
మును, హోమముచేయఁబోవుదాని నాయావేళల నివేదించునే? ని
న్నాశ్రయించియుండు దైవజ్ఞుఁడు జ్యోతిశ్శాస్త్రమును సాంగముగ నధ్య
యనముచేసి యనుభవమునకుఁ దెచ్చికొనియున్నవాఁడే? గ్రహచారము
లను లెస్సఁగఁ బరిశీలించి శుభాశుభములనిర్ణయములను జక్కఁగా నొన
ర్చునే? సేవకులలో నుత్తమమధ్యమాధముల నేర్పఱిచి వారివారి కుచిత
ములగు నుత్తమమధ్యమాధమకార్యములయందు వారిని నియోగింతువే?
నీజ్యోతిషికులు శాస్త్రజ్ఞానముచే రాజులకును దేశమునకును బీడలను గలి
గించు ధూమకేతువు, పిడుగులు, భూకంపము, ఉప్పెనలు మొదలగు నుత్పా
తములకుఁ జేయవలసిన శాంతికపౌష్టికాదులను నిర్ణయించి చేయించుచు
సమ్మానితులయి వర్తింతురా? కులక్రమాగతులగువారును, నీయొద్దఁదప్ప
నితరులయొద్ద నెట్టికానుకనైనను గ్రహింపక పరిశుద్ధు లగువారిని బరిశీ
లించి యుత్తమోద్యోగపదవులయందు నియమింతువే? మంత్రులుగాని,
నీవుగాని ప్రజాదోషమును గనుఁగొనక శిక్షచే నిరసింపరుగదా? అట్లుగ్ర
శిక్షల విధించినచో యాజకులు పతితుని, స్త్రీలు వ్యభిచారియైన పురుషుని
నవమానించువిధమున రాజు నవమానింతురు. శూరుఁడు, మతిమంతుఁడు,
ధైర్యవంతుఁడు, శుచి, సత్కులీనుఁడు, నీ కనురక్తుఁడు, దక్షుఁడును
నగువానిని సేనాపతిఁగ నియమింతువే? యుద్ధమునందు వెనుదీయక
పోరాడిన నీభటులను నానావిధబహుమానములచే సత్కరించి యన్నవస్త్రా
దులచే వారిని బహువిధములుగఁ బోషించి వారికి నీయందుఁ బ్రేమ
తఱుగకుండునట్లు దయతో రక్షింతువా? సేవకులసమూహమునకుఁ

గొఱంత గాకుండఁ దగినజీతముల నాయాకాలము తప్పకుండ దయచే
సిద్ధముచేసి యిత్తువా? తమకు లభింపవలసిన కాలమునందు జీతము లభిం
పక కృశించుసేవకులదారిద్ర్యమును, దుఃఖమును నేలినవానికి ననర్థము
కీడుగలుగఁజేయును. అట్టివాఁ డింద్రుఁడైనను జెడకమానఁడు. వంశపారం
పర్యముగా నీసేవచేయుచుండు వీరభటులు యుద్ధములయందు నీకుఁగాఁ
బ్రాణములను వదలుచున్నారా? అట్టి యుత్తమవీరులభార్యలను సంతాన
మును బ్రీతితోఁ బోషింతువే? నీసైన్యము నందొక్కండును యుద్ధకార్య
ములయం దాజ్ఞను మీఱి యథేచ్ఛమై వర్తింపఁడుగదా? శరణన్నవానిని,
దుర్బలుని, యుద్ధమున నోడి చేత నాయుధము లేనివానిని నీపుత్త్రుని
రక్షించినట్లు రక్షింతువే? విద్వాంసులను వినయపరులను జ్ఞానసంపన్ను
లను దత్తదుచితదానసత్కారములచేఁ బూజింతువే? నీరాజ్యములో
నుండు ప్రజలను దల్లిదండ్రులు బిడ్డలను రక్షించినట్లు రక్షింతువే? శత్త్రు
వులకుఁ గష్టకాలము వచ్చిన దని బాగుగ గుర్తించి ప్రభు, మంత్ర,
ఉత్సాహము లనుమువ్విధములగు శక్తులతోఁ గూడికొని నీవు గెలువఁ
గల్గుదువో యని లెస్సఁగ నాలోచించి యుద్ధమునకు సన్నద్ధమై యుండు
నదియు మూలబలముగా నుండునదియు నగు సైన్యమున కంతకును
ముందు జీతములనొసఁగి నీశత్త్రురాజ్యమునందు బలిష్ఠులగువారికి ధనము,
రత్నరాశి నొసంగి వారిని వశముచేసికొని యరిషడ్వర్గములను గెలిచి
నిజేంద్రియములను యథేచ్ఛముగఁ బ్రవర్తింపనీయక స్వాధీనపఱచికొని
పరా కెంతమాత్రమును లేక, సమయోచితముగ సామమును, దానమును,
భేదమును, దండమును నను నాల్గుపాయములను వినియోగించి, రథ
ములు, నశ్వములు, గజములు, పదాతులు, యంత్రములు, నౌషధములు,
ద్రవ్యము లను వీనితో నష్టాంగయుతమైన సేనను సమకూర్చికొని శ్రేణి,
ఆటవిక, భృతక, మూలబల మను నాల్గువిధములైన సేనాబలములచేఁ
దాను జక్కఁగా రక్షితుండవై, పరరాజ్యములపై దండువెడలి శత్త్రుశేష
మును గొంచెమైన నుండనీయక వధించి గెలుపుగొన్న రాజ్యమును
నేర్పుతోఁ బాలింతువా? భాండాగారము, గోష్ఠము, వాహనము, ద్వారము,
ఆయుధాగారము, ధనార్జనము ననియెడి వీనియం దధికారు లగు

వారు తమకార్యములను క్రమముగ నిర్వహించెదరా? మంత్రి పురోహిత సేనాపతులు నెల్ల రొక్కటియై నీపై నొండెఁ, బరస్పరము భిన్నులై తమలోఁ దామొండె హాని దలంపకుందురు గదా? వారు దినముయొక్క పూర్వాహ్ణమునఁ బానమునందుఁ గాని, ద్యూతమునందుఁగాని యాసక్తులు గారు కదా? ఆయమునందు నాలవపాలు గాని, మూఁడవపాలు గాని, లేక సగమైనఁ గాని వ్యయ మొనర్పవలయు. అంతకంటె విశేషించి ధనవ్యయమును జేయవు గదా? ఫలమునందత్యాశ గలవారిని, దొంగలను, స్నేహములేనివారిని, వ్యవహారజ్ఞానశూన్యులను, ధైర్యము చాలనివారిని దుష్టులను గొప్పవయిన రాచకార్యములను నెఱవేర్చుటకు నియమింపవుగదా? ఆయవ్యయముల వ్రాయుకరణములు ప్రతి దినము నాదాయవ్యయములను నీకుఁ దెలుపుచుందురే? దోష మెంతయును లేక నీమేలును గోరు భృత్యులకు జీతములను బ్రమాదముననైనఁ దగ్గింపవు కదా? గురువులను ముసలివాండ్రను శిల్పులను గొప్ప వర్తకులను చుట్టాలను నాశ్రితులను సత్పురుషులను పేదఱికముఁ బొందకుండ సకలజనులు నిన్ను స్తోత్రముచేయుచుండ రక్షింతువా? ప్రధానులు, చుట్టములు, మూలబలము, రాచకొమాళ్లు, విద్వాంసులు *డెబ్బదిరెండు వినియోగములవారును, నిన్నుఁ జుట్టి కొలిచి

---

* అంగరక్షకులు ౧, అంతర్వంశికులు ౨, అశ్వవైద్యులు ౩, అశ్వాధికారులు ౪, ఆవసరికులు ౫, ఉగ్రాణపుటధికారులు ౬, ఉష్ట్రాధికారులు ౭, కరదీపికాధరులు ౮, కారవాలికులు ౯, కారుకులు ౧౦, కాంస్యకారులు ౧౧, కార్యజ్ఞులు ౧౨, కాళాంచికులు ౧౩, కుంభకారులు ౧౪, గజవైద్యులు ౧౫, గజాధికారులు ౧౬, గాయకులు ౧౭, గురువులు ౧౮, గోష్ఠాధికారులు ౧౯, ఘటికానిర్ధారకులు ౨౦, చర్మకారకులు ౨౧, చామరికులు ౨౨, చిత్రకారులు ౨౩, ఛాత్రికులు ౨౪, జాలికులు ౨౫, జ్యోతిషికులు ౨౬, తాంబూలికులు ౨౭, తాళవృంతకులు ౨౮, దౌవారికులు ౨౯, దేవతార్చకులు ౩౦, ధనాధికారులు ౩౧-౩౨, నర్తకులు ౩౩, నరవాహకులు ౩౪, నరవైద్యులు ౩౫, పరిమళకారులు ౩౬, పారిహాసికులు ౩౭, పక్షిపోషకులు ౩౮, పాదుకాధరులు ౩౯, పురపాలకులు ౪౦, పురోహితులు ౪౧, ఫణిహారులు ౪౨, భాండారికులు ౪౩, భేరీవాదకులు ౪౪, మల్లాధికారులు ౪౫, మహాప్రధానులు ౪౬, మాల్యకారులు ౪౭, ముద్రాధికారులు ౪౮, మురజవాదకులు ౪౯,

యుండఁగ లోకమంతయు నిన్నుఁ గొనియాడునట్లు ఎల్లప్పుడు కొలువుండుదువా? రాజ్యమునఁ జెఱువులు తటాకములు సదా నీటితో నిండి యుండునా? కర్షకులకు వర్షమే యాధారము గాకుండ వేఱగు నీటి వసతుల నేర్పఱచియున్నావా? కృషికు లన్నమునకు విత్తనమునకుఁ గొఱత లేక సంతుష్టులై యుందురే? వర్తకులకుఁ దక్కువవడ్డితో ధనమును ఋణముగా నిత్తువా? వాణిజ్యమున లోకమునకు మేలు గలుగును. కావున నది నిరాతంకముగ సాగుచున్నదా? కార్యప్రారంభమునందు మెలఁకువ, కార్యము నెఱవేఱుటకు వలయు మనుష్యద్రవ్యసహకారిత్వము, దేశకాలవిభజనము, ఆపద సంభవించినపుడు దానిని గోప్యముచేయుట, కార్యసిద్ధి యను నీయైదును బాగుగ నెఱింగిన సమర్థులు నీకు సహాయులుగ నుందురే? పట్టణములను రక్షించునిమిత్తము గ్రామములను, గ్రామములను రక్షించుటకుఁ బల్లెలను బరాకు లేక రక్షింతువే? నీరాజ్యముయొక్క అన్నిప్రదేశములలో నుండువారు నీ కనురక్తులయి వర్తింతురే? నీవేఁగులవాండ్రు శత్రురాష్ట్రములలో నన్నిభాగములయందును సంచరించుచున్నారా? స్త్రీలు లెస్సగాఁ గాపాడఁబడుచున్నవారు గదా? వారిమాటలకు లోఁబడి సర్వదా స్త్రీలోలుఁడవై యంతఃపురమునందే వర్తింపవుగదా? ప్రతిదినమును బ్రభాతమున రాజోచితవస్త్రాద్యాభరణముల నలంకరించుకొని ప్రజలకు దర్శన మొసంగుదువా? రక్తాంబరధరులై ఖడ్గపాణులైన భటులు నిన్నెప్పుడు గొలిచియుందురే? నీ కనురక్తులను విరోధులను జక్కగా శోధించి వారికి దండధరునివిధమునను ననురక్తులకుఁ బరమశాంతుని విధమునను గానఁబడుదువే? నీ సామంతులలో దుర్బలుని బలవంతుఁడు పీడింపకుండునట్లు కనిపెట్టియుందువే? నిన్నాశ్రయించియుండు బీదలకు వృత్తిని గల్పింతువే? శరీరమును

---

మృగములు ౫౦, రజకులు ౫౧, రాయబారులు ౫౨, వనపాలకులు ౫౩, వందులు ౫౪, వస్త్రాధికారులు ౫౫, వర్షవరాధికారులు ౫౬, వ్యావహారికులు ౫౭, విద్వాంసులు ౫౮, విదూషకులు ౫౯, విపణిరక్షకులు ౬౦, నేత్రాధికారులు ౬౧, వేశ్యలు ౬౨, వైణికులు ౬౩, శిలాచ్ఛేదకులు ౬౪, స్వర్ణకారులు ౬౫, సామంతులు ౬౬, స్తుతిపాఠకులు ౬౭, సూతులు ౬౮, సూదులు ౬౯, సేనాపతులు ౭౦, సౌచికులు ౭౧, క్షౌరకులు ౭౨.

రోగాదుల కాశ్రయించినప్పుడు వాని నౌషధముల సేవించియు లంఘన చికిత్స చేసియు నివర్తించుకొందువే? *అష్టాంగములుగల వైద్యశాస్త్రమునందుఁ బ్రవీణులగు వైద్యులు లోకోపకారబుద్ధితో నెల్లప్పుడు నీ కనురక్తులై నిన్ను సర్వకాలములయందు సేవించుచుందురా? మనో రోగములను బెద్దల సేవించి పాయుచుందువే? లోభ మోహములచే ధన వంతులను బిచ్చగాండ్రను నవమానింపవు గదా? ఆశ్రితులజీవనములను నెగతాళికై నను నడ్డగింపవు గదా? నీరాజ్యపు నానారాష్ట్ర భాగములలో నుండు ప్రజలలో నెవ్వండేని నీశత్రువునొద్ద ద్రవ్యలాభమును జెంది నీతోఁ గలహింపఁడు గదా? నీసామంతరాజు లందఱును నీరక్షణార్థము సమయము వచ్చినప్పుడు నీకై తమప్రాణముల నైనఁ ద్యజించునంతటి యనురక్తులే? విద్యాగుణములను బరీక్షించి విద్వాంసులను బహూకరింతువే? గురువృద్ధ దేవతాపసులను జైత్యములను నశ్వత్థాదిపుణ్యవృక్షములను భూసురులను బ్రతిదినము దర్శించి నమస్కరించుచుందువే? మధురపదార్థములతోను రసవంతములగు మృష్టాన్నముతోను బ్రాహ్మణులకుఁ దృప్తిగా సంతర్పణము గావింతువే? వాజపేయ పౌండరీకయజ్ఞములను దగిన యాజకులఁ బురస్కరించుకొని శాస్త్రమునందుఁ జెప్పియున్న ప్రకార మాచరింతువా? దుఃఖమును గోపమును నీ కాశ్రయములు గాకుండును గదా? మంగళవస్తువులను జేత ధరించిన పరివారము నిన్నెప్పుడును విడువక నీపార్శ్వమునం దుండి సేవించుచుండును గదా? ఇట్టి సన్మార్గావలంబివై యెల్లప్పుడు వర్తింతువే. ఇట్లుండుటవలన నీ కాయుర్వృద్ధి యగును. కీర్తి లభించును. ధర్మ కామార్థములు నీసంకల్పము మేరకు నిన్ను వదల కుండును. ఇట్లు సన్మార్గమునఁ బ్రవర్తించు మహీపాలుఁడు రాజ్య మంతయు నిజాజ్ఞావిధేయంబుగఁ జేసికొని సుఖముగ నుండును. యథార్థముగ దొంగ కానివానిని ధనకాంక్షచే నీమంత్రులు శిక్షింపరు గదా? దొంగయొద్ద ధనమును గైకొని వానిని శిక్షింపక వదలరు గదా? ద్రవ్యమున కాశింపక దరిద్రుని ధనవంతుని నొకన్యాయమునఁ

* కాయచికిత్స ౧, బాలచికిత్స ౨, గ్రహచికిత్స ౩, ఊర్ధ్వాంగచికిత్స ౪, శల్యచికిత్స ౫, దంష్ట్రాచికిత్స ౬, జరాచికిత్స ౭, విషచికిత్స ౮.

పక్షపాతము లేక నీమంత్రులు చూచుచుందురుగదా? మఱియు "పరలోకము లేదు, ఈశ్వరుఁడు లేఁడు" అను చింత, అసత్యము, ఏమఱుపాటు, సోమరితనము, అసర్థజ్ఞులతోడి కార్యాలోచనము, కోపము, దీర్ఘచింత, చేయవలసిన కార్యములయం దాలస్యము చేయుట, బుద్ధిమంతుల నెఱుంగకుండుట, ప్రయోజనములయం దప్రయోజనచింత, రాచఱికపురహస్యములను వెలిపుచ్చుట, నిశ్చయించుకొనిన కార్యములను జేయకుండుట, యుత్సవాదులను జేయకుండుట, విషయాసక్తుఁ డగుట యను నీపదునాలుగును రాజదోషములు. వీనిని నీవు పరిహరింతువుగదా? మఱియు వినుము. వేదములు నీకొనరించు నిత్యాగ్నిహోత్రక్రియాఫలములు. ధనమునకు దానభోగములు ఫలము. భార్యలు రతి సంతానోత్పత్తి యనుఫలముల నొసఁగుదురు. శాస్త్రమునకు సదాచారప్రవృత్తిఫలము. ఇవి నీయెడ ఫలవంతములుగ నుండునే? దూరదేశమునుండి వ్యాపారార్థముగ నీరాష్ట్రమునకు వచ్చినవర్తకులు తాము గావించు క్రయవిక్రయముల విషయమై నీకు సుంకముల నిత్తురే. పట్టణవాసులు రాష్ట్రవాసులు నగు జనులు నీరక్షణమును బొందుచుండుటచేఁ దగినకానుకలను నీకు సమర్పించెదరా? పెద్దలమాటల ననాదరింపక ప్రీతితో నాకర్ణింతువే! వ్యవసాయము మున్నగువానివలన వచ్చు పదార్థములలోఁ గొన్నింటిని నీ వుపయోగించుటకుఁ బూర్వము బ్రాహ్మణుల కొసంగుదువే? శిల్పులకు నాల్గు నెలలకుఁ గొఱఁత గాకుండ ద్రవ్యము నుపకరణములను సేకరించియుంతువే? ఎవఁడైనను నీకుఁ జేసినమేలును మఱువకుందువే? వివేకులయెదుట నామేలు చేసినవానిని బ్రశంసింతువే? అశ్వసూత్రములను, గజసూత్రములను రథసూత్రములను గ్రహింతువే? రాజకుమారు లందఱును విలువిద్యను బాగుగ నభ్యసించుచున్నారా? శత్రువులను జయించునిమిత్తము సర్వాస్త్రసంగ్రహమును, విషయోగపరిశీలనమును గావించియున్నావా? ప్రజల కగ్నివలనిబాధ గాని, విషజంతువులు ఘోరమృగములు మున్నగువానివలనిబాధ గాని, రాక్షసులవలనిబాధగాని కలుగకుండఁ బ్రజారంజనముగ రాజ్యమును బాలింతువే? నోరు లేనిమూఁగలు, కన్నులు కానరాని గ్రుడ్డివారు, వికలాంగులు, కుంటివారు, బిచ్చగాండ్రు, చుట్టాలులేనివారును నీచే రక్షింపఁబడుచున్నవారా? అధికనిద్ర, సోమరితనము,

సకాలమునఁ గార్యముసేయమి, భయము, యోగ్యులయెడఁ గ్రోధము, దుష్టునియెడ మెత్తపాటు వీనిలో నొక్కటియైనను నిన్ను సమీపింపకుండ, జాగరూకుఁడవై మెలఁగుదువే? అని యడుగఁగ యుధిష్ఠిరుండు, నారదుండు ప్రశ్నలమూలమునఁ గావించిన హితబోధచే సంతుష్టుండై యాతనికి సవినయముగ మ్రొక్కి యిట్లనియె. మహాత్మా! నీకృపవలన సకల ధర్మముల నెఱింగితి. నాశక్తికి వంచనలేకుండ యథాక్రమముగ రాజ్య మేలుచున్నవాఁడ. పూర్వరాజులవలె సన్మార్గము నవలంబించి ప్రజారంజనంబుగ రాజ్యమేలఁ దలంతుఁగాని, యట్లొనర్చుటకు నే నంత నేర్పుగలవాఁడనా యని నాసామర్థ్యమును శంకింతును. అని చెప్పఁగా నారదుండు వెండియు నిట్లనియె, యుధిష్ఠిరా! మాటయందు లోకవ్యవహారము ప్రవర్తిల్లుచున్నది. అట్లు జరుగనినాఁడు లోకమంతయు నంధకారబంధురమైయుండ నందు జనులు మునిఁగిపోవుదురు. కావున రాజు తనవాగ్దానము నెఱవేర్చి ప్రజల కానందమును జేయవలయును. అని చెప్పఁగా యుధిష్ఠిరం డమ్మునీంద్రుని శాంతునిగఁ దెలిసి కొంత యూరకుండి యిట్లడిగెను. మహానీయా! ముల్లోకములయందును మీరు చూడనివి లేవుగదా? అయిన నాసభవంటిసభ నెచ్చటనైనం జూచితిరే యని యడుగఁగా నారదుండు ధర్మపుత్త్రున కిట్లనియె. ధర్మతనయా! మనుష్యలోకమున నిట్టి సభ యెందును లేదు. ఉన్నదని వినను. ఇంద్ర యమ వరుణ కుబేరులసభలను బ్రహ్మసభం గాంచితి. వానివిభవమును నీ వాలకింపఁ దలంతువేని చెప్పెదను. అని చెప్పఁగాఁ బాండవజ్యేష్ఠుండు నారద మునీంద్రునితో నిట్లనియె. మహాత్మా! వారి సభాప్రమాణములను నవి యెట్లుండు? వాని నుపాసించువార లెవ్వరు? వీని నన్నిటిని దెలియఁ గోరెద. వివరింపు మని యడుగ నారదమహర్షి యుధిష్ఠిరున కిట్లనియె.

### లోకపాలసభావర్ణనము

ధర్మపుత్త్రా! వినుము. మొట్టమొదట దేవేంద్రునిసభనుగూర్చి చెప్పెదను. అయ్యది నూఱుయోజనముల వెడల్పును, నూటయేఁబది యోజనముల నిడుపును, నైదుయోజనములయెత్తునుం గలిగి యాకాశమున సంచరించును. అది కామగమనశక్తిగలదిగ నుండును. ఆసభ మంచి

రత్నములచేఁ జెక్కఁబడి కాంచనమున నిర్మితమై సూర్యునివలెఁ గాంతితో వెలుఁగుచుండును. రమణీయములైన నందనాదివనములతో నలరారుచుండును. రుచిరము లగు సరోవరములతో వ్యానయానందదాయకముగ నుండును. పుణ్యాత్ములకే కాని యాసభను ప్రవేశించుట కితరులకు శక్యము కానేరదు. ఆసభను మహేంద్రుండు తన తపోమహిమచే సృజించెను. అక్కడ వసించువారికి ముసలితనము లేదు. దుఃఖములు లేవు. రోగములు లేవు. ఆసభయందు ముల్లోకముల రాజ్యలక్ష్మితోఁ గూడుకొని తనరాణియగు శచితోఁగూడ దివ్యకిరీటమును లోహితాంగదాది మణిభూషణములు పలురంగులతోఁ గూడి సువాసనల వెదఁజల్లుచున్న కుసుమమాలికలు విరజోంబరములు ధరించి శ్రీకీర్తిద్యుతులతో మహేంద్రుండు, దివ్యవిమానముల నెక్కివచ్చిన మహాత్త్వము గలవారును పాపరహితులును నగ్నిదేవునివలెఁ బ్రకాశించువారును సోమపానముఁ జేసినకర్మఠులును నగు భృగు పరాశర పర్వత సావర్ణి గాలవ శంఖ లిఖిత దుర్వాసః క్రోధన శ్యేన దీర్ఘతమ.. పవిత్రపాణి, సావర్ణి, యాజ్ఞవల్క్య, భాలుకి, ఉద్దాలక, శ్వేతకేతు, తాండ, భాండాయనాది దేవర్షులును బ్రహ్మర్షులును రాజర్షులును సప్తర్షులుం గొలిచియుండఁ గొలువుండు. మఱియు భూలోకమున నియతవ్రతము లాచరించి మహాత్త్వముఁబొందిన హరిశ్చంద్రుఁడు మున్నగువారును, నింకను శాండిల్య, పరాశర, కృషీవల, వాతస్కంధ, విశాఖ, విధాత కాలులును, కరాళ దంతుఁడు, త్వష్ట, విశ్వకర్మ, తుంబురుఁడు మున్నగునయోనిజులును, సహదేవుఁడు, సునిథుఁడు, మహాతపస్వి యగు వాల్మీకియును, సత్యవాక్యైన శమీకుండును, సత్యసంగరు లగుప్రచేతసాదులును, మునివర్యు లగు మేధాతిథి, వామదేవుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, మరుత్తు, మరీచి, స్థాణువు మున్నగువారును, యజ్ఞములయందు హవిస్సులను మోచికొని దేవతల కొసంగు నిరువదియేడ్వురగ్నులును, గ్రహనక్షత్రములును, విశ్వేదేవులు, అశ్వినులు, ధాత, విధాత, విశ్వకర్మ, అగ్నిషోములు, ద్వాదశాదిత్యులు, ఇంద్రాగ్నిమిత్రసవిత్రర్యములు, భగుఁడు, సాధ్యులు, సంవర్తుఁడు, దేవహవ్యుఁడు, వీర్యవంతుఁ డగు విష్వక్సేనుఁడు, శ్రద్ధ, మేధ, సరస్వతీ మున్నగుబుద్ధిదేవతలును, అర్థము,

ధర్మము, కామము, విద్యుత్తులతో గూడిన జలవాహములగు మేఘములు మరుత్తులు, రూపముదాల్చియున్న ప్రాగ్నిశలు, యజ్ఞములు, దక్షిణలు, యజ్ఞమంత్రములు నోషధులును గొలువ, నతఁ డెంతయు నలరారు చుండును. గురుశుక్రులాసభయందు నెల్లప్పుడుందురు. సిద్ధులు సాధ్యులు చారణులు గంధర్వులు కింపురుషులు కిన్నరులు నప్సరసలు వందిమాగధులు గాయకులు నర్తకులు వినోదప్రదర్శకులు గానుందురు. మఱియు వీ రెల్లరును నసురులప్రాభవము నణఁగఁద్రొక్కి మహనీయుం డని విఖ్యాతి గాంచిన యాశతక్రతువగు దేవరాజుయొక్క స్తుతిగీతముల నెప్పుడును బాడుచుండుదురు. మెరుపువంటి ప్రకాశముతో నెల్లప్పుడు వెలుఁగు చుండు వివిధవిమానములలో నీదేవర్షులును, బ్రహ్మర్షులును రాజర్షులును నగ్నివంటి తేజస్సులతో విరాజిల్లుచుందురు. నే నిప్పుడు నీకు వర్ణించి చెప్పిన మహేంద్రసభ యీతీరున నున్నది. ఇఁకను యమసభను వర్ణించి చెప్పెదను వినుము.

## యమసభావర్ణనము

యమునకుఁ గా నీసభను దేవశిల్పి విశ్వకర్మ సృజించెను. స్వయం ప్రకాశమానమైన యాసభ నూఱుయోజనముల వెడలుపును నంతియ నిడుపునుం గలిగి సమశీతోష్ణమై విరాజిల్లును. ఆసభలో నుండువారికి దుఃఖము లేదు; ముదిమి లేదు; ఆఁకలి దప్పులు కలుగవు. ప్రియాప్రి యములు లేవు. దైన్యగాంభీర్యములు లేవు. వా రెప్పుడు నమృత తుల్యమగు భక్ష్యభోజ్యాదిపదార్థసంపూర్ణత గలవారు. ఆసభ పుణ్య గంధములతో నెల్లప్పుడు పరిమళించు ప్రసూనములు గల వృక్షరాజము లతో నిండియుండును. దేవతలుగాని మానవులుగాని కోరుపదార్థ ముల సమృద్ధితో నాసభ వెలయుచుండును. అందలి వృక్షములు భుజిం చువానికోరిక ననుసరించి వాని కిష్టమైనపండ్ల నొసంగును. మఱియు, నాసభ సూర్యుని కాంతింబోలు కాంతిగలదై మానసోల్లాసకరమై కామ గమనముచే వెలయుచుండును. సూర్యసూనుం డగు వైవస్వతు నచ్చోట దేవర్షులును పరమపవిత్రులగు బ్రహ్మర్షులును గొల్చియుం దురు. మఱియు యయాతియు, నహుషుఁడును పూరుమాంధాతృ సోమక నృగులును రాజర్షియైనత్రసదస్యుఁడును కృతవీర్య అరిష్టనేమి

కృతశ్రవ సిద్ధ కృతవేగ కృతి నిమి ప్రతర్దన శిబి మాత్స్య, పృథులాక్ష,
బృహద్రథ, వార్త, మరుత్త, కుశిక, సాంకాశ్య, సాంకృతి, ధుంధ్రువులును,
చతురశ్వ, సదశ్వోర్మి, కార్తవీర్య, భరత, సురథ, సునీథ, నిశథ, నళు
లును, దివోదాస, సుమనస, అంబరీష, భగీరథ, వ్యశ్వ, సదశ్వ, భద్రాశ్వ,
పృథువేగ, పృథుశ్రవులును, పృషదశ్వ, వసుమనస, క్షుపులును,
రుషద్రు, వృషసేన, పురుకుత్స, ధ్వజి, రథి, ఆర్ష్టిషేణ, దిలీప, ఉశీనరు
లును, నౌశీనరి, పుండరీక, శర్యాతి, శరభ, శుచి, అంగ, అరిష్ట, వేన,
దుష్యంత, సృంజయ, జయ, భాంగాసురి, సుమిత్ర, సునీథ, నిషధ, వహీనర,
కరంధమ, బాహ్లీక, సుద్యుమ్న, బలవన్మధుంధ్రువులును, ఐళ మరుత్తకపోత
రోమ తృణక సహదేవ అర్జున వ్యశ్వ సాశ్వ కృశాశ్వ శశబిందు దశ
రథ రామ లక్ష్మణ ప్రతర్దన అలర్క కక్షసేన గయ గౌరాశ్వ జామ
దగ్న్యలును, నాభాగ సగర భూరిద్యుమ్న మహాశ్వ పృథ్వాశ్వ జనక
సైన్య వారిషేణ పురుజిత్ జనమేజయ బ్రహ్మదత్త త్రిగర్త ఉపరి
చర ఇంద్రద్యుమ్న భీమజాను గౌరపృష్ఠ నయ అనయ పద్మ ముచు
కుంద భూరిద్యుమ్న ప్రసేనజిత్ అరిష్టనేమి సుద్యుమ్న పృథులాశ్వ
అష్టకులును మత్స్యవంశపురాజులు నూర్వురును నీపవంశపురాజులు
నూర్వురును హయవంశపురాజులు నూర్వురును ధృతరాష్ట్రనామక
రాజులు నూర్వురును నెనుబది జనమేజయులును నూఱుగురు బ్రహ్మ
దత్తులును నూఱుగురగు నిరిరాజులును రెండునూర్లభీష్మనామకరాజు
లును నూఱుగురు ప్రతివింధ్యులును నూర్గురునాగులును పలాశనామకు
లగు నూఱుగురురాజులును కాశకుశులనువారు నూర్గురును రాజేం
ద్రుండగు శంతనుండును, మీాతండ్రియగు పాండురాజును, ఉశంగవ, శత
రథ, దేవరాడ్జయద్రథులును, బుద్ధిమంతుఁడును రాజర్షియునైన మంత్రి
సమేతుఁడగు వృషదర్భుఁడును, శశబిందువంశపురాజులలో నొక్కొక్క
రనేకాశ్వమేధముల నొనర్చి విప్రులను భూరిదక్షిణలతోఁ దనియించిన
యసంఖ్యాకులగు రాజులును, ననేకులు బహుశ్రుతులును, నానా
శాస్త్ర పారంగతులును నా వివస్వంతునికుమారుని నాసభలోఁ బరివేష్టించి
యా కొలువుకూటమున నాతని నుపాసించుచుందురు. మఱియు

ఆసభలో నగస్త్యుఁడు, మతంగుఁడు, కాలుఁడు, మృత్యువు, సోమ యాజులు, సిద్ధులు, ననేకయోగశరీరధారులు, నగ్నిష్వాత్తాదిపితరులు, ఫేనపులు, నూష్మపులు, స్వధావంతులు, కాలచక్రము, మూర్తిమంతుఁడైన భగవంతుఁడగు నగ్నిదేవుఁడును వీరు వెలయుచుందురు. పాపకార్యముల నొనర్చిన మానవులును దక్షిణాయనమునందు శరీరత్యాగము చేసినవారును, మృత్యుసేవకు లగుశింశుప, పాలాశ, కాశ, కుశలును గాలనిర్ణయపరులును రూపములను ధరించి యమధర్మరాజును సేవించుచుందురు. పితృరాజసభలో వీరేకాక యింక ననేకపితృదేవత లున్నవారు. వీరికార్యములను వివరించుట కెవ్వరికిని సాధ్యము కానేరదు. రమ్యమగు యమసభ కామగమనము గలది. మనోవేగమువంటి వేగముగలది. శీఘ్రగామి. దానిని జొచ్చుటకు సామాన్యులకు నలవి కానేరదు. దేవశిల్పి విశ్వకర్మ దానిని మిక్కిలి ప్రయాసముతో నిర్మించెను. ఆ యమసభను నిర్మించుటకు విశ్వకర్మ బహుకాలము తపస్సు చేసి యుండెను. అయ్యది స్వయంప్రకాశమున వెలుఁగుచుండును. ఆసభను బ్రవేశించినవా రుగ్రతపస్వులు, సువ్రతులు, సత్యవాదులు, శాంతులు, సన్న్యాసులు, పుణ్యకర్మములను జేసిన శుద్ధులును బవిత్రులును నైన వారు. వా రెల్లరు భాస్వరదేహులు, తెల్లనివస్త్రములను ధరించినవారు. చిత్రాంగదులు, చిత్రమాల్యధరులు, జ్వలితకుండలధారులు, తామొనర్చిన పవిత్రఫలములచేతను, శుభచిహ్నములచేతను వెలయుచుందురు. మహాత్ము లగు గంధర్వులును, నప్సరస్త్రీగణములును, నా సభను సదా నృత్తగీతవాద్యములచేతను, దమయుల్లాసపు నవ్వులచేతను ధ్వనింపఁజేయుచుందురు. పుణ్యగంధములు, రాజితోంకారధ్వనులు నాసభ ననిశము నిండియుండును. దివ్యమాల్యములతో నాసూర్యసూనుసభ విరాజిల్లుచుండును. వేనవేలు ధర్మాత్ము లామృత్యుదేవత నెల్లప్పుడును గొలుచుచుండెదరు. మహాత్ముఁడగు ప్రేతరాజుసభ సర్వదా పైవర్ణనలు గలదై యొప్పుచుండును. ఇట్టిసభయందు బై నుదాహరించిన పురుషు లగు రాజులు, మూర్తిమంతంబు లగు కాశకుశపలాశాదులు, కాలచక్రము, అగ్నిదేవుండును సేవించుచుండఁగా సమవర్తిధర్మాసనముసఁ గూర్చుండి శరీరధారుల శుభాశుభఫలముల నరయుచుండును,

## వరుణసభావర్ణనము

యుధిష్ఠిరుఁడా! వినుము, వరుణునిదివ్యసభ మిక్కిలి కాంతిగలిగి వైశాల్యమునందు యమునిసభయంత ప్రమాణము గలిగి వెలయుచుండును. అయ్యది యెత్తైనప్రాకారములతోను బచ్చువితోరణములతోను నీటియందు విశ్వకర్మచే నిర్మింపఁబడినది. ఫలపుష్పముల గుత్తులతో నొప్పారుచు దివ్యమై రత్నమయములగు వృక్షరాజములతో విలసిల్లుచుండును. ఆవృక్షములచుట్టును జుట్టుకొనియున్నవియు వానియందుండి వ్రేలాడుచున్నవియు నగు లతలసమూహము నీలపీతసితశ్యామలోహిత వర్ణములైన పుష్పములతోఁ గూడుకొని ప్రకృతికి నూతనశోభను దెచ్చుచుండును. ఆసభలో నానావిధములును, చిత్రవిచిత్రవర్ణములతోఁ గూడుకొని యుండునవియును, సుందరములై వీనుల కింపుగా ధ్వని సేయుచుండునవియును నగు · వేనవేలు పక్షు లెగురుచుండును. అది సమశీతోష్ణమై దివ్యములైన తెల్లనిగోడలతో నెత్తై రమ్యములగు నాస్థానములుగల యిండ్లవరుసలు గలిగి వరుణపాలితమైయున్నది. దివ్యము లగు రత్నాంబరములను ధరించి రత్నభూషణములను దాల్చి భార్యాసమేతుండై వరుణదేవుం డాసభలోఁ గొలువుండును. ఆసభలోఁ బరిమళములను వెదఁజల్లుచుండు కుసుమమాలికలను, దివ్యగంధమును, సువాసనాద్రవ్యములను నలందుకొని యాదిత్యు లెల్లప్పుడు వరుణగీతములను బాడుచు నాదేవుని స్తుతించెదరు. ఆసభలో వాసుకి, తక్షకుఁడు, నైరావణుఁడును, కృష్ణ, లోహిత, పద, చిత్ర కంబళ, అశ్వతర, ధృతరాష్ట్ర, వలాహక, మణిమాన, కుండధార, కర్కోటక, ధనంజయ, కందుక, పణిమానులు, బలవంతులగు ప్రహ్లాద, మూషికాద, జనమేజయాది మహాసర్పములు పతాకులును, మండలులును, ఫణవంతులునై సంచరించుచుందురు. వీరును, నింకను బలవంతములును, దీర్ఘకాయములును నగు మహాసర్పము లనేకము లావరుణునిఁ గొలుచుచుండును. విరోచనసుతుం డగు బలి, పృథివినంతయు జయించిన నరకాసురుఁడు, ప్రహ్లాదుఁడు, సంహ్రాదుఁడు, విప్రచిత్తి, కాలఖంజాది దానవులును, మఱియు సుహనుఁడు, దుర్ముఖుఁడు, శంఖుఁడును, మనుఁడు, సుమతి మున్నగుదైత్యులును, ఘటోదర, మహాపార్శ్వ, క్రథన, పిఠర,

విశ్వరూప, స్వరూప, విరూప, మహాశిర, దశగ్రీవ, వాలి, మేఘవాస, దశావర, టిట్టిభ, విటభూత, ఇంద్రతాపనాదినానావిధదానవులు రత్నకుండలధారులై, సువాసనలతో నుండు గంధమాల్యములను దాల్చి, శూరులై యనేకవరములను బడసి మృత్యువువలని బాధలేనివారై ధర్మపాశధరుఁడగు నావరుణదేవుం గొలిచియుందురు. మఱియుఁ జతుస్సముద్రములును, భాగీరథీ కాళిందీ విదిశా శార్ఙ్గి నదులును, వేగవాహినియగు నర్మదానదియు, విపాశా, శతద్రూ, చంద్రభాగా, సరస్వతీ, ఇరావతీ, వితస్థా, సింధూ, దేవనదీ, గోదావరీ, కృష్ణవేణీనదులును, సరిద్వరయగు కావేరియు, కింపునా, విశల్యా, వైతరణీ, తృతీయా, జ్యేష్ఠిలా, మహానదీ, శోణనదీ, చర్మణ్వతీ, పర్ణాసా, సరయూ, వారపతీ, లాంగలీ, శరతోయా, ఆత్రేయీ లోహితీ, మహానాదా, గోమతీ, సంధ్యా, త్రిస్రోతసీప్రభృతులగునదులును, మఱియు ననేకసరస్సులును, వాపీ, కూప, తటాకాదులును, ప్రస్రవణములును నన్నియు స్వరూపములం దాల్చి యావరుణదేవుని సేవించుచుండును. మఱియును దిశలు నాల్గును భూదేవియు, సర్వపర్వతములును, తిమింగిలాదిసమస్తజలచరములు వరుణునిఁ బూజించుచుండును. గంధర్వు లాసభయందు గానము సల్పుదురు. అప్సరసలు నృత్యమాడుదురు. సర్వరత్నఖను లగుపర్వతరాజము లావరుణసభయందు నొకటితో నొకటి భాషించుచు నుల్లాసంబునఁ గాలమును గడపుచుండును. పుత్రులతోను బౌత్రులతోను సునాభుఁడనువాఁడు వరుణమంత్రియై యతనిని సేవించుచుండును. గోనామముతోఁ బిలువఁబడుపుష్కరమాదేవు నత్యాసక్తితో నర్చించును. ఇవన్నియు స్వరూపములం దాల్చి యావరుణదేవునిఁ గొలుచుచు నాలోకమున సంచరించును. నేను లోకసంచారమును గావించునప్పు డారమ్య మగువరుణసభను జూచియుంటిని. ఇఁకను గుబేరసభను గూర్చి చెప్పెద వినుము.

### కుబేరసభావర్ణనము

ఈకుబేరునిసభ తెల్లనిదై ప్రకాశించును. ఇది నూఱుయోజనములనిడుపు గలిగి డెబ్బదియోజనముల వెడల్పును వైశాల్యముఁ గలిగి వెలయుచుండును. ఈసభ వైశ్రవణుని తపోమహిమచే నిర్మింపఁబడినది. కైలాసపర్వతశిఖరమువంటి తెల్లనైన కుబేరునిసభ తనప్రకాశమునఁజంద్ర

కాంతి నధఃకరించును. గుహ్యకులచే నాసభ మోయఁబడి యాకసము నంటి యున్నట్లు కానఁబడుచుండును. అందలి యున్న తసౌధములు మహా మణిమయములై రమణీయములై యుండును. మఱియు నవి స్వర్ణమయము లగుటచే నెత్తై విరాజిల్లుచు నాకసమున సంచరించు మేఘములలోని విద్యుల్లతలువోలె మెఱయుచుండును. ఈసభకుఁ బ్రభువగు వైశ్రవ ణుండు చిత్రవిచిత్ర వర్ణములు గల వస్త్రములను ధరించి, ప్రకాశమానము లైన కుండలములతోఁ గూడిన స్త్రీసహస్రపరివృతుండై సింహాసనముపై నాకసంబున సూర్యుఁడువోలెఁ బ్రకాశించుచుండును. మందారవృక్షము లలోని పుష్పములపైనుండి వీచు సువాసనగల మారుత మాయక్షుల రాజునకు సొంపు గొలుపుచుండును. మఱియు సౌగంధికవనమునందలి సుగంధపుష్పములవాసనయు, నలక యనుసరస్సులోని పుష్పముల సుగంధమును నెల్లప్పుడాధనపతికి హాయి గొల్పుచుండును. వాయువు హృదయానందకరముగను జల్లగాను వీచి యాయక్షేశ్వరునకు సంతసముఁ జేయుచుండును. అచ్చోట దేవతలు, గంధర్వులు, నప్సరోగణము లా మహానీయుని సేవించుచుందురు. రంభా, మిశ్రకేశి, చిత్రసేనా, ఘృతాచీ, మేనకా, పుంజికస్థలా, విశ్వాచీ, ప్రమ్లోచా, ఊర్వశీ, ఇరా, శుచిస్మితా, చారునేత్రా, సహజన్యా, వర్గా, సౌరభేయీ, సమీచీ, బుద్బుదా, లతాదులగు ననేకాప్సరస్త్రీలు నాట్యశాస్త్రప్రవీణలును, గానలోలలు నై యాధనపతిసభ నెల్లప్పుడు శోభాయమానముగఁ జేయుచుందురు. వీరి నాట్యములచేతను, గంధర్వులగానములచేతను ధనపతిసభ యవిచ్ఛిన్న ముగ రమణీయమై తోఁచుచుండును. కిన్నరు లను పేరుగలగంధర్వులు కొందఱు, నరు లను పేరితోవెలయుగంధర్వులు కొందఱు కుబేరసభ నలంకరించియుందురు. యక్షముఖ్యు లగుమణిభద్రుఁడు, ధనదుఁడు, శ్వేత భద్రుఁడు, గుహ్యకుఁడు, కశేరకుఁడు, గండకండువు, మహాబలుఁడు, ప్రద్యోతుఁడు, కుస్తుంబరుఁడు, పిశాచుఁడు, గజకర్ణుఁడు, విశాలకుఁడు, వరాహకర్ణుఁడు, తామ్రోష్ఠుఁడు, ఫలకక్షుఁడు, ఫలోదకుఁడు, హంస చూడుఁడు, శిఖావర్తుఁడు, హేమనేత్రుఁడు, విభీషణుఁడు, పుష్పాననుఁడు, పింగళకుఁడు, శోణితోదుఁడు, ప్రవాలకుఁడు, వృక్షవాస్యుఁడు, చీర వాసుఁడు నననియెడి వీ రెల్లరు యక్షేశ్వరుని సర్వకాలసర్వావస్థలయం

దేమరక కొలుచుచుందురు. భగవత్స్వరూపురాలగు లక్ష్మీదేవి, నల కూబరుఁడు, నేను, నింక ననేకబ్రహ్మర్షులు దేవర్షులాసభ నలంకరించి యుందుము. ఉమాపతియును, శూలధారియుఁ, బశుపతియు, భగుని నేత్రములను బెఱికివైచినవాఁడును, ముక్కంటియు, భగవంతుఁడునగు మహాదేవుఁడు తన్నెప్పుడు భూతసంఘములును, వామనాకారులు, వికలాంగులు, గూనివారు, క్షతజాక్షులు, మహాధ్వనులను జేయువారు, మేదోమాంసములను దినవారును, నుగ్రరూపులును నగు ప్రమథగణములు సేవించుచుండ, నాయాదిధనుర్ధరుండు తనసఖుం డైన ధనపతిని మను చుటకొఱకు వానిసభయం దెప్పుడును బ్రీతిగల్గి విగతక్లమయగు నుమాదేవితోఁ బ్రత్యక్షమై యుండును. హాహాహూహూనామకగంధర్వులును, దుంబురు, పర్వత, శైలూష, చిత్రసేన, చిత్రరథాదిప్రసిద్ధగంధర్వులును ధనేశ్వరు నుపాసింతురు. విద్యాధరాధిపతి యగు చక్రధర్ముఁడనువాఁడు తమ్మునితోఁ గూడి యాగుహ్యకేశ్వరుసభయందు మెలంగుచుండును. కిన్నరు లనేకులును గింపురుషులరాజైన ద్రుముఁడును రాక్షసరాజైన మహేంద్రుఁడును, యక్షాధిపతి యగు గంధమాదనుఁడును, రాక్షసులలో ధర్మిష్ఠుఁడని ప్రఖ్యాతిఁగాంచిన విభీషణుఁడు తన యనుచరులతోను నాయక్షేశ్వరునిఁ గొలిచియుందురు. హిమవంతము, పారియాత్రము, వింధ్యము, కైలాసము, మందరము, మలయము, దర్దురము, మహేంద్రము, గంధమాదనము, ఇంద్రకీలము, సునాభము మున్నగు మహాపర్వతము లన్నియు మేరుపర్వతము స్వరూపములను ధరించి ప్రభు వగు ధనపతిని నుపాసించుచుండును. పారిషదులకుఁ బ్రభు వైన నందీశ్వరుఁడు, మహాకాళ, శంకుకర్ణ, శంకుముఖాదులతోను, గోష్ఠ, కుటీముఖ, దంతవిజయాది తపోధనులతోను, గుబేరుకొలువున నుండును. వీరేకాక యాధనేశ్వరునిసభలో నానావిధపిశాచములు లెక్కకు మీఱి యనేకములు విడువక కొలువుఁ గొలుచుచుండును. భగవంతుఁ డగు నుమాపతి యగు మహాదేవునకుఁ గుబేరుండు నమస్కరించి యాతని ప్రక్కన సింహాసనమునందుఁ గూర్చుండి కొలు వుండును. భూతపతి ధనపతితో నొకప్పుడు చెలిమిచేసిన నాఁటినుండి యవిచ్ఛిన్నసఖ్యముతో

నిప్పటికిని నట్లే యానందమునఁ దనయనుచరులు పరివేష్టించియుండఁగా నాసభయందుండును. శంఖపద్మాదినిధులును నాధనపతిని గొలిచియుండును.

## బ్రహ్మసభావర్ణనము

ఓపాండుపుత్త్రా! బ్రహ్మసభ నింక వర్ణించి చెప్పెదను వినుము. దానిని నున్న దున్నట్లుగా వర్ణించుట కెవరికిని శక్యము కాదు. తొల్లి కృతయుగమునందు భగవంతుఁ డగు నాదిత్యదేవుండు బ్రహ్మలోక మెల్లఁ జూచి భూలోకమున సంచరించుట కేతెంచెను. అప్పు డొకనాఁ డామహాత్ముండు నన్నుఁ జూచి నాతో నాబ్రహ్మలోకముయొక్క యప్రమేయత్వమును, దివ్యత్వమును, ననిర్దేశ్యప్రభావత్వమువలని సర్వభూతమనోహారత్వమును నాకుఁ దెలిపియుండెను. అది బ్రహ్మసంకల్పముచేత నిర్మింపఁబడినది. దాని నిక్కంపుగుణముల నన్నింటిని విని దానిం జూడఁ గోరి యాదిత్యదేవునితో నే నిట్లంటిని. ఎట్టితపస్సులను జేసినవారును నెటువంటిపుణ్యకర్మముల నొనర్చినవారును, నెట్టియౌషధములను సేవించువారును, నేవిధమైన పాపనాశకరము లగు దానము లొనర్చువారును నాపావనమైన బ్రహ్మదేవునిసభను జూడఁగలుగుదురో నాకుఁ జెప్పవలయు ననఁగా దినాధిపతియును, సహస్రకిరణుండును, భగవంతుఁడునునైన యయ్యాదిత్యదేవుఁడు నా కిట్లనియె. నారదా! వినుము. వేయిసంవత్సరములు జితేంద్రియుండవై మిక్కిలి నిష్ఠతో బ్రహ్మవ్రతమును సలుపుము. ఆవ్రతాచరణంబున నీవు బ్రహ్మలోకమున కేఁగి యందలి రమ్యప్రదేశములను జిత్రవిచిత్రములను, మహత్త్వమును జూడఁగలవని చెప్పఁగా, నేను హిమవత్ప్రాంతముల కేఁగి యాదిత్యభగవానుఁ డనుష్ఠింప నిర్దేశించినరీతిని దపమును వేయిసంవత్సరములు సలిపితిని. అంత నన్నుఁ బాపచ్యుతునిఁగా నామహానీయుండైన సూర్యదేవుండెత్తింగి నన్నుదోడ్కొని యాసభకుఁ జనెను. నరేంద్రా! నే నే మని యాసభమహత్త్వమును రామణీయకమును నుడువుదును? అది వర్ణింప నలవిగాని చిత్రవిచిత్రరూపములతో వెలయుచుఁ బ్రతినిమిషమునకు మారుచుండును. దాని యునికిపట్టును వైశాల్యమును నిర్దేశించి చెప్పుట కెవరికిని సాధ్యము కానేరదు. వేయేల? అట్టి యపూర్వసభ నే నెందును జూచియెఱుఁగను.

ఆసభయం దాసీసు లగువారి కాఁకలి లేదు, దప్పిక లేదు. అలసట లేదు. శీతోష్ణకాలముల తీవ్రత వారిని బాధింపదు. వా రెడతెగక సుఖులుగా నుందురు. నానారూపములచే నొప్పారుకాంతిమంతము లగు మణులచే నాసభ నిర్మింపఁబడి స్తంభముల యాధారము లేక నాశరహితమై విరాజిల్లును. ఆసభ తనయప్రమేయప్రకాశమునఁ జంద్రాగ్నులప్రకాశము నధఃకరించుచు సూర్యప్రభను దిరస్కరించుచున్నదో యనునట్లు స్వయం ప్రకాశమానమై యుండును. భగవంతుఁడును పితామహుఁడును నగు బ్రహ్మదేవుఁ డాసభను దేవమాయచేఁ గల్పించి యాసభయం దెల్లప్పుడు వసించుచుండును. మఱియు నాపితామహునిసభయందు దక్షుఁడు, ప్రచేతసుఁడు, పులహుఁడు, మరీచి, కశ్యపుఁడు, భృగువు, అత్రి, వసిష్ఠుఁడు, గౌతముఁడు, అంగిరుఁడు, పులస్త్యుఁడు, క్రతువు, ప్రహ్లాదుఁడు, కర్దమాదిప్రజాపతులు, అథర్వవేది, అంగిరస్సు, సూర్యకిరణము లాహారముగాఁ గల వాలఖిల్యులు, మూర్తిమంతములగు మనస్సు అంతరిక్షము, విద్యలు, వాయువు, తేజస్సు, జలము, భూమి, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మున్నగుప్రకృతివికారములును, నింకను భూలోకోత్పత్తి కెయ్యవి కారణములో యవి యెల్లను, మహాతేజస్వి యగు నగస్త్యుఁడును, వీర్యవంతుఁ డగు మార్కండేయుండును, జమదగ్ని, భరద్వాజుఁడు, సంవర్తుఁడు, చ్యవనుఁడు, మహాభాగుఁ డగుదుర్వాసుఁడును, ధార్మికుఁ డగు ఋశ్యశృంగుఁడును, భగవంతుఁడే యగు సనత్కుమారుఁడును, ననేకయోగులును, మహాతపస్వులును, నసితుఁ డగు దేవలుఁడును, దత్త్వవేత్త యగుజైగీషవ్యుఁడును, ఋషభుఁడు, అజితశత్రువు, మహావీర్యుఁడు, మహామణి మున్నగు మహర్షు లందఱును బ్రహ్మదేవుని స్తుతించుచు నాతని దివ్యపాదములను గొలుచుచుండెదరు. అష్టాంగములతోఁ గూడిన యాయుర్వేదము, నక్షత్రములతోఁ జంద్రుఁడు, వేయికిరణములుగల సూర్యుఁడు, వాయువు, ననియెడి యివి క్రతువులు, సంకల్పము, ప్రాణము అన్నియు స్వరూపములనుధరించి, బ్రహ్మను గొలుచుచుండును. ఇంక ననేకమహావ్రతపరాయణు లాపితామహునిదర్శనము చేసికొనుచుం దృప్తులయియుందురు. మఱియు నర్థము, ధర్మము, కామము, హర్షము, తపస్సు, దమము మున్నగు

నపయు, నానాగంధర్వులును, నప్సరసలలో నిరువది తెగలవారును, నేడుగురు ముఖ్యగంధర్వులును, లోకపాలురును, శుక్రుఁడు, బృహస్పతి, యంగారకుఁడు, బుధుఁడు, శనైశ్చరుఁడు, రాహువు మున్నగు గ్రహాధిపతులు, మంత్రము, రథంతరము, సామము, నశ్విసులు, వైరాజాగ్నిష్వాత్తగార్హపత్యసోమపు లను నలువురు మూర్తిమంతులు, నేకశృంగ, చతుర్వేదకలు లను ముప్వురుం గలిసి సప్తపితృగణంబు లన నెన్నికఁ జెంది తమతృప్తిచే సోమునిఁ దృప్తిబొందించు పితృదేవతలు, విశ్వేదేవులు, సాధిరాజు లను ద్వంద్వదేవతలు, వాయువులు, విశ్వకర్మయు నష్టవసువులు, సర్వహావిస్సులును, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, నథర్వవేదము, సర్వశాస్త్రములును, నితిహాసములు, నుపవేదములు, వేదాంగము లన్నియు, గ్రహములు, యజ్ఞములు, సోమము, సర్వదేవతలు, సావిత్రీ, దుర్గా, తరణీ, మేధా, ధృతి, స్మృతి, ప్రజ్ఞా, బుద్ధి, క్షమా, యశస్సు లగు సప్తవాణులు, స్తుతిశాస్త్రము లగు సామములును, వివిధగాధలును, తర్కయుక్తములగు భాష్యములు, వివిధనాటకములు, కావ్యములు, నాఖ్యాయికలు, కారికలు మూర్తులను ధరించి బ్రహ్మసభ యందు దమకు నియుక్తములైన కార్యములను నొనర్చుచుండు. గురువులను బూజించిన పుణ్యాత్ము లా బ్రహ్మసభయం దనేకులు గలరు. కాలమానము లగుక్షణము, లవము, ముహూర్తము, దివసము, రాత్రి, పక్షము, మాసము, ఆఱుఋతువులు, సంవత్సర పరివత్సర, ఇడావత్సర, అనువత్సర, ఇద్వత్సరము లను నీ యైదుసంవత్సరములు, చతుర్యుగములు వీనితోఁగూడిన కాలచక్రము పరమేష్ఠిసభయం దున్నది. ఇది యచ్చోట నెల్లప్పుడు నాశరహితముగ నుండును. ధర్మచక్రమును గాలచక్రమునుసరించి యుండును. మఱియు నా బ్రహ్మసభను అదితి, దితి, దను, సురస, వినత, ఇర, కాళిక, సురభీదేవి, సరమ గౌతమి మున్నగు దేవమాత లలంకరించియుందురు. రుద్రాణీ, శ్రీ, లక్ష్మీ, భద్రా, షష్ఠీ, పృథివీ, గంగా, హ్రీ, కీర్తి, శచీ, పుష్టి, అరుంధతీ, సంవృత్తి, ఆశా, నియతి, సృష్టిదేవీ, రత్యాదులగు దేవతాకాంతలు బ్రహ్మను బూజించుచుందురు. ఆసభయందు బ్రాహ్మీవిలసితుం డగు బ్రహ్మదేవుండు పద్మాసనస్థుండై తన్నుఁ గొలువవచ్చు రాక్షసపిశాచదానవ

గుహ్యకనాగసువర్ణపశుసముదాయములను, స్థావరజంగమమహాభూత
సమూహములను, నింద్రాగ్నియమనైరృతివరుణవాయుకుబేరేశానులను
లోకపాలు రగుమహనీయులం బలుదెఱంగుల నాదరించుచుండును. ఓ
రాజేంద్రా! మహాసేనుండును నారాయణదేవుండును ననేక దేవర్షులు, వాల
ఖిల్య మహర్షులు, యోనిజాయోనిజు లగు మహనీయులు, స్థావరజంగ
మములగు ముల్లోకములు, నెనుబదియెనిమిది వేవురూర్ధ్వరేతస్కు లగు
మునులు, ప్రజావంతు లగుమునులు బ్రహ్మసభకు విచ్చేసి పద్మాసనా
సీనుండైన యాదేవునకు మ్రొక్కులిడి క్రమ్మఱ దమతమ నెలవులకుఁ
బోవుచుందురు. పరమేష్ఠియుఁ దనదర్శనార్థమై వచ్చిన దేవతలను,
దైత్యులను, నాగులను, విప్రులను, యక్షులను, సుపర్ణులను, గాలేయు
లను, గంధర్వులను, నప్సరసలను దయావంతుఁడై పరమానందమున
లెస్సఁగా నాదరించి వారివారికి వలసినకార్యముల నొనర్చి తృప్తులం జేసి
పంపుచుండును. ఆసభ నొకతట్టు ప్రవేశించువారితోను వేఱొకతట్టు
నిష్క్రమించువారితోను నెల్లప్పు డొప్పుచుండును. ఆసభ బ్రహ్మ
యొక్క స్వయంప్రభతో వెలిఁగింపఁబడి యుండుండు బ్రహ్మర్షుల విగత
శ్రములఁ గావించుచు, ముల్లోకములలో నుండు సభల కన్నింటికంటె
మిన్నయై విరాజిల్లుచుండును. మనుష్యలోకములో నే ననేకసభలఁ
జూచియున్నాను. ఆసభ లెవ్వియు నీసభకు సాటిరావు. ఈ నీసభ భూలో
కములోని మానవసభలలో శ్రేష్ఠమైన దని నారదమహర్షి చెప్పఁగా విని
యాతనికి రాజర్షి యైన యుధిష్ఠిరుం డి ట్లనియె. మునివర్యా! మీ రాన
తిచ్చుచుండఁగా యమసభయందు భూలోకమునేలిన పుణ్యాత్ములగు
రాజులు, వరుణునిసభయందు దానవులు దైత్యులు పన్నగులు నదులు
సముద్రంబులు, కుబేరసభయందు యక్షరాక్షసగుహ్యకగంధర్వాప్సరో
గణములును సాక్షాత్పార్వతీపతియగు మహాదేవుండును, బ్రహ్మసభ
యందు బ్రహ్మర్షులు, సర్వదేవతలు, సకలవేదములు, శాస్త్రములు, కాలాం
గములు, కాలచక్రము, ధర్మచక్రము మున్నగువారితో నొక్కండై
హరిశ్చంద్రుం డున్నాడు. ఆమహనీయున కింద్రసభ నేల వగుట కాతఁ
డెట్టి పుణ్యము నాచరించెనో యనుటయు, నితరు లగురాజు లందఱును
యమసభయం దుండుటకుఁ గారణం బూహింపఁ జాలకున్నాను.

మాతండ్రి పాండురాజు యమసభయం దున్నాఁడు గదా? మీ రిచ్చోటి కరుదెంచుటకు మున్ను మాతండ్రిం జూచి వచ్చితిరే? ఆతఁడు మా కేదియైనను జెప్పి పుత్తెంచెనేని విన వేడ్కఁ గొనియున్నాను. అని యడుగఁగా నాతనికి నారదమునివర్యుం డిట్లనియె. రాజేంద్రా! హరిశ్చంద్రుం డొనర్చినపుణ్యకర్మముల నడిగితివి. వానిని జెప్పెదను వినుము. ఆ మహానీయుండు బలవంతుఁడై సంరాట్పదవిఁ జేకొనెను. ఆతని యాజ్ఞలకు లోకములో నున్న రాజు లెల్లరును దలలు వంచి వినుచుండిరి. వానిని నెఱవేర్చుచుండిరి. ఆరాజు చైత్ర మను తనబంగారు తేరెక్కి శస్త్రాస్త్రప్రతాపములచే సప్తద్వీపవిశాలమైన యీభూమండలము నంతయు జయించెను. ఇట్లు సర్వశైలవనద్వీపములతోఁ గూడిన భూమండలములోని రాజుల నందఱను వశపఱచుకొని రాజసూయయాగము నాచరించెను. ఆయాగమునందు ఋత్విజులకు విధ్యుక్తదక్షిణలకంటె నేనుమడుంగు లధికదక్షిణల నొసంగి వారిని దృప్తిపఱచెను. మఱియు యాగమునకు వచ్చిన నానాదేశబ్రాహ్మణులకు భూరిదక్షిణ లవార్యగను, రత్నములను, విశేషధనము నిచ్చెను. కోరినభక్ష్యభోజ్యపదార్థములచేతను నమృతోపమానము లయిన యన్నములచేతను బ్రాహ్మణసంతర్పణమును గావించెను. ఆ హరిశ్చంద్రుని రాజసూయయాగకాలమున నానాదేశాధీశులు హరిశ్చంద్రు నాజ్ఞమెయి సర్వబ్రాహ్మణులకు భుజించుకాలమున వడ్డనకార్యములం జేసిరి. ఇట్లు విప్రుల సంతుష్టులం జేసి యీమహానీయుండు తేజోవంతుండును, గీర్తిమంతుఁడును, రాజు లందఱిలో నధికుండునై, హవిర్భాగముచే దేవతల సంతోషింపఁ జేసి భూలోకరాజులలో సాటిలేనివాఁడై నెగడెను. ఆరాజసూయ యాగప్రభావమున నాతండు స్వర్గమున కేఁగి పురందరునిచే గౌరవింపఁబడి పవిత్రుండై యున్నవాఁడు. మిక్కిలి నిష్ఠులై నిర్విఘ్నముగ రాజసూయాధ్వరము నొనర్చినవారును, పోరులయందు వెనుదీయక శూరులై పోరి శరీరత్యాగమును గావించినవారును, నధికతపోనిధులును మహేంద్రలోకము నధిగమింతురు. ఆదేవలోకమునందు హరిశ్చంద్రుని వైభవమును జూచి యాశ్చర్యపడి నీతండ్రియైన పాండురాజు మనుష్యలోకసంచారమునకు రా నున్న నన్నుం జూచి రాజసూయయాగము

నాచరించి హరిశ్చంద్రుండు పురందరలోకము సేరుట నాకు వివరించి మహాశూరు లగు తమ్ములపరాక్రమమున దిగ్విజయ మొనర్చి నిన్ను రాజసూయయాగము నాచరింపు మని నీకుఁ దనమాటగా బోధింపు మనెను. నీ వాయజ్ఞము నాచరించితివేని యాఫలమునఁ బాండురాజు దండధరునిలోకము నతిక్రమించును. ఇది మీతండ్రి కోరిక. సత్పుత్త్రులు తండ్రులమాటల నాదరించి చేయుటచే వారును బుణ్యలోకముల ననుభ వింతురు. పాండురాజుసంకల్పము నెఱవేఱునట్లు నీవును రాజసూయ యాగమును సల్పుము. ఆమహాయాగఫలముచే నీవును నీపితృపితా మహులును మహేంద్రలోకమున సుఖము లనుభవింతురు. ఆమహా యజ్ఞమునకు బ్రహ్మరాక్షసు లనేకాతంకములను గావింతురు. అయ్యది నిర్విఘ్నముగఁ బూర్తియయ్యెనేని బహుప్రజావినాశహేతువైన ఘోరయుద్ధము సేకూఱును. ఆలోచించి యేది క్షేమకరమో, దానిని సువిచారుఁడవై జరుపుము. ఓరాజా! నాల్గువర్ణముల ప్రజల రక్షణమం దప్రమత్తుఁడవై మెలఁగుము. నీవును నిష్టకామోపభోగములతో వృద్ధి పొందుము. బహుధనముల నొసంగి విప్రులను సంతుష్టులఁ జేయుము. నీవడిగిన విషయమును నీకు విపులముగాఁ దెలియఁజెప్పితిని. సెలవిమ్ము. ద్వారావతి కేఁగెదను. అని చెప్పి యా నారదమహర్షి తనతో వచ్చిన మునీంద్రులం దోడ్కొని వెడలిపోయెను.

### ధర్మపుత్త్రుండు నారదబోధితుఁడై రాజసూయంబు చేయ నాలోచించుట

ఇవ్విధంబున నారదుండు యుధిష్ఠిరుని సెలవుపొంది యరిగిన పిమ్మట రాజసూయయాగమును జేయుటకు యత్నించి ముందుగఁ దమ్ము లతో నాలోచించెను. మఱియు నాయాగము నిర్విఘ్నముగ సమాప్త మగునేని జనక్షయకారక మగు యుద్ధము సంభవించునే యని యొక వంకను, ననేకరాజర్షులచందమునం దానును నాయాగమును బూర్తిచేసి నచో వారివలెనే దివ్యపదవులను బొందవచ్చునుగదా యనునాశ యొక వంకను, నామహాయాగమును నెఱవేర్చికదా హరిశ్చంద్రుఁడు మహేం ద్రునిసభలో వెలయుచున్నాఁ డనుతలంపు మఱియొకవంకను మనస్సును లాగుచుండఁగా నెట్లో రాజసూయయాగమును దప్పక చేయవలయునని

నిర్ణయించుకొని దానికిఁ దగినప్రయత్నములయందు నియుక్తుఁడయ్యెను. పిదప యుధిష్ఠిరుండు తననిశ్చయమును తనసభయందున్న యాప్తులును మంత్రివర్గమువారు నుండఁగా వారికిఁ దెలిపి సామంతులు తెచ్చియిచ్చిన కానుకలం గొని యొకనాఁడు పేరోలగంబున నున్నప్పు డీనిశ్చయమును వారి కెల్లరకుం దెలిపెను. తనమున సెల్లప్పుడు నాయాగప్రయత్నమునే యాలోచించుచుండుటచే నావిషయమైన వార్తలనే యెల్లప్పుడును ధర్మతనయుండు సెప్పుచుండును. ఇవ్విధంబున యుధిష్ఠిరుండు ప్రజల హితమును గోరుచు నెవ్వరియెడను ద్వేషము లేక యజాతశత్రుఁ డన విఖ్యాతిం గాంచి తనరాజ్యపరిపాలనము శాంతముగను, నభివృద్ధికరంబుగను వర్తిల్లుటకు భీమసేనుని బాహుబలమును, సవ్యసాచి శస్త్రాస్త్రవేదిత్వము, సహదేవుని నీతిధర్మవిచక్షణతయు నకులుని వినయసంపదయు, దనపరమధార్మికత్వమును నొండొంటికిఁ దోడ్పడుచుండ మనుమార్గమున ధర్మోత్తరంబుగాఁ బ్రజల నేలుచుండె. ప్రజ లెద్ది కోరినను వారి కోరికల నెఱవేర్పుమని రాజు తమ్ముల కాజ్ఞాపించుచుండె. ఈకార్యముల నన్నిటినిఁ బెద్ద లందఱు సాధుధర్మము లని పలుమాఱు సెప్పుచుండిరి. ఇవ్విధంబున రాజు ప్రవర్తించుటచే నాతనిరాజ్యమునఁ బీడలు గల్గవు. కలహములు లేవు. నెలకు మూఁడువర్షములు గురియుచుండె. సస్యసమృద్ధి మెండయ్యె. ధాన్యరాసు లపరిమితము లయ్యె. ప్రజలు రాజుల కియ్యవలసిన కప్పముల నాటంకము లేక యిచ్చుచుండిరి. రాజభాండాగారము ధనముతో నిండియుండెను. రాజ్యమున ననేకపరిపాలనాంశములలో నభివృద్ధికార్యములును జేయఁబడుచుండెను. ఆయుధిష్ఠిరుఁడు ధర్మకార్యముల నెన్నియో చేయుచుండెను. ప్రజలు స్వకర్మనిరతులయిరి. వడ్డికిచ్చి జీవించువారు వర్తకుల కపరిమితధనము నల్పవృద్ధికిచ్చి వ్యాపారాభివృద్ధిఁ జేయుచుండిరి. గోవులు లెస్సగాఁ బోషింపఁబడుటచే క్షీరసమృద్ధి రాజ్యమునం దెల్లెడలను దఱుగకుండెను. వ్యవసాయము నానాఁటఁ బ్రబలెను. ఇవ్విధమున యుధిష్ఠిరురాజ్యమునఁ బ్రజలు సంపన్నులై ధనధాన్యములతోఁ దులతూగుచుండిరి. రాజోద్యోగులు ప్రజల నిర్బంధించి ధనమును గొనుట యుధిష్ఠిరునిప్రజ లెఱుంగరు. ప్రజలలో వ్యాధులు లేవు. దొంగలభయము లేదు. వారగ్నిభయము నెఱుంగరు. అకాలమరణ

ములు లేవు. బందిపోట్లను జేసి ప్రజల హింసించువారును గాని, రాజా మన్ననను బొందినయధికారులు ప్రజల కన్యాయములను సలుపుచుండి రనికాని రాజ్యముయొక్క మాఱుమూలలలోనుండువారు సైత మెఱుంగరు. విదేశవర్తకులు యుధిష్ఠిరురాజ్యమున వాణిజ్యమును జలిపి యదుగక యే రాజున కియ్యవలసినసుంకముల నిచ్చి పోవుచుండిరి. ఇవ్విధమున రాజ్యము వర్తకులచేతను రాజులచేతను నానావిధాభివృద్ధిని జెందుటయే గాక విలాసవంతులైన ప్రజలుసైతము రాజ్యాభివృద్ధికరము లగు యత్నములు సలుఁపుటలో నిమగ్నులైరి. ఇవ్విధముగ యుధిష్ఠిరుండు సర్వవ్యాపకుఁడు, సకలగుణవిశిష్టుఁడు, సర్వసహిష్ణుఁడు, రాజవరేణ్యుఁడు నై యుండుటచే మహనీయునిరాజ్యములో నున్న ప్రజలను ధర్మపుత్రుఁడు తల్లిదండ్రులు దమ బిడ్డలనుంబోలెఁ బోషించుచుండెను. కావున బ్రజలాబాలగోపాల మాధర్మజునం దత్యంతానురాగము గలవారై యుండిరి. అట్లుండఁగా నాయుధిష్ఠిరుం డొక్కనాఁడు మయసభయందుఁ గొలువు సేయుచు, మంత్రివర్గమును వీక్షించి తనకు రాజసూయయాగముచేయ నర్హతగలదా? లేదా? యని వారి నడిగెను. అంత రాజునకు మంత్రు లిట్లనిరి, మహారాజా! రాజసూయయాగాంతమున నవభృథస్నాతుండై వరుణగుణమగు దానగుణము నొందిన మహాత్ముఁడు సామ్రాజ్యభార ధురంధరుండు కాఁగలఁడు. ఆయాగమున సామమంత్రములచేత గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులును ద్రిణాచికేతంబులును నగు నాఱగ్నులును యజనంబు చేయంబడును. మఱియు నారాజసూయమునందు దర్విహోమము మొదలయిన యంతర్యాగముల నొనర్చి యాగమును సాంతముగ నెఱవేర్చి యవభృథాభిషిక్తుం డగు యజమానుఁడు సర్వజిత్తనఁబడును, అట్టిక్షత్రియోచితయాగము నాచరించుటకు నీ విప్పుడు సమర్థుఁడవు. దానికి వలయుపరికరము లన్నియు నీ కిప్పుడు గలవు. అచిరకాలముననే యీమహాయాగమును నీ వాచరింపుము. అనఁగా యుధిష్ఠిరుండు రాజసూయయాగము నిర్విఘ్నముఁగ ననుష్ఠింపఁ బడెనేని ప్రజాక్షయకరంబైన ఘోరయుద్ధము సంప్రాప్తమగు నని ప్రజాక్షయమునకు వెఱచి యాలోచించి దనకుండుతమ్ముల బలశౌర్యములును, నీతివివేకములును శత్రురాజుల నణఁచి కప్పములు కానుకలు గొనుట కవకాశము

మున్నగు సామర్థ్యయోగములు దేశకాలపరిస్థితులు నాయవ్యయముల స్థితిగతులు లెస్సగ విచారించి రాజసూయయాగము నొనర్పుటకుఁ గృతనిశ్చయుఁడై మఱియు నిట్లు తలపోయువాఁడై యజ్ఞారంభము కేవలమాత్మనిశ్చయమునఁ జేయరాదు. మంత్రులయాలోచనముఁ గొంటిని, శౌర్యపరాక్రమములు గలతమ్ములతో నుద్దేశమును దెలిపితిని. మంత్రవేత్తలగు ధౌమ్యద్వైపాయనులతో నాలోచించితిని. అందఱును నన్నీయాగము నుపక్రమించి చేయవలయు నని చెప్పుచున్నారు. ఇది ధర్మ్యము. లోకహితము. అయిన నీకార్యమును నిశ్చయించుటకు మహాబాహుండును నప్రమేయుండును ననంతుండును సర్వలోకహితార్థము వసుదేవదేవకులగర్భమునందు లీలామానుషరూపధరుండై యవతరించినవాఁడును, జగన్నాథుండు నగు జనార్దనునితో నాలోచించి వానిసెలవును బొంది యాగోపక్రమము గావించుట లెస్స యని నిశ్చయించి ద్వారకాపురమునకు వేగవంతములైనగుఱ్ఱములను బూన్చినరథములతో దూతల నంపి ద్వారకావాసియగు శ్రీకృష్ణునకు వర్తమాన మంపఁగా నామహానీయుం డింద్రసేనాదులతోడ నతిత్వరితప్రయాణమున నింద్రప్రస్థపురమున కేతెంచెను. అంత వచ్చిన జగన్నాథునకు ధర్మజుఁడు మున్నగువారు స్వాగతం బొసంగి కుశలవార్త లడిగి ప్రీతిం జూపిరి. పిమ్మట జనార్దనుండు మేనత్తయగు కుంతీమహాదేవిని సందర్శించి క్షేమ మారసెను. పిదప నకులసహదేవులు తనకు గురుమర్యాదలను జేయఁగా నతఁడు మిక్కిలి సంతోషించెను. పిదప నాదేవుండు తననెచ్చెలి యగు నర్జునునితోఁ గలసికొని యుల్లాసముతో నాతనిమందిరంబున సుఖియై మార్గాయాసముం దీర్చికొనెను. అట్లు పరిశ్రమను దీర్చికొని యున్న జనార్దనుని యుధిష్ఠిరుం డొకనిర్మలప్రదేశమున సుముహూర్తమునందుఁ గలసికొని స్వప్రయోజనమును దెలుపువాఁడై యిట్లనియె. "జనార్దనా! నాకు రాజసూయయాగము ననుష్ఠింపవలయు నని మనస్సు తహతహపడుచున్నది. ఆమహాకార్య మొక్క నాసంకల్పమునమాత్రము నెఱవేఱనేరదు. నీవు మాత్రము నాకుచితమును బోధింపఁగల వని నీతో నాలోచించి కార్యనిశ్చయముఁ జేసెద నని ని న్నిటకుఁ రావించితిని. సర్వకార్యములను జేయుటకు సమర్థుండును, లోకపూజ్యుండును, సంరా

ట్టును నగువాఁడుమాత్రమే యీ రాజసూయమహాయాగము నొనర్పఁ గలఁడు. నాకు హితులును, నామేలు కోరువారును నన్నీమహాయాగమును జేయుమని పురికొలుపుచున్నారు. సర్వాంతర్యామివగు నీయాజ్ఞ లేనిచో నేనీకార్యమును నుపక్రమించి యొనర్పను. ఏలయనఁగా గొందఱు నాయందలి ప్రియమువలన నే నేది యుక్తమా యని యడిగినను దోషమును గణింపక యుక్తమనెదరు. కొందఱు స్వార్థపరులై నాకుఁ బ్రియములఁ బల్కుదురు. కొందఱు లెస్సఁగా నాలోచించి తమకు హితమని తోఁచినదానిని బోధింతురు. ఇవ్విధమున నొకమహాకార్యమాలోచించునప్పు డొక్కొక్కరు వివిధాభిప్రాయములను జెప్పుదురు. కావున నే నెవరిమాటల నాదరింపను. నీవు కామక్రోధములను వదలి యుక్తమును బోధింతువు. కాన నీయాజ్ఞను శిరసావహించి చేయఁదలఁచి యున్నవాఁడను." అని స్వప్రయోజనమును నివేదింపఁగా నాకుంతీనందనునకు దేవకీనందనుం డిట్లనియె.

### శ్రీకృష్ణుండు ధర్మరాజును రాజసూయమును జేయు మనుట

యుధిష్ఠిరా! ఆలోచింపఁగా నన్నితెఱంగుల రాజసూయయాగానుష్ఠానమునకు నీవ యర్హుండవు. నీ వన్నియు నెఱుంగుదువు. అయిన నే నొక్కటి చెప్పెద. సావధానుండవై వినుము. పూర్వకాలమునఁ బరశురాముఁ డుత్తమక్షత్రియులనెల్ల వధింపఁగా మిగిలిన యైలేక్ష్వాకువంశపు రాజులు తప్పఁ దక్కినవా రెల్ల నుత్తమక్షత్రియులు గారు. ఆయైలేక్ష్వాకువంశపురాజులు క్రమమున నూటయొక్కవంశములవారైరి. మఱియు యయాతిభోజులవంశములు పదునాలుగయ్యెను. ఇట్టిక్షత్రియుల నెల్లర జయించి జరాసంధుడు లోకోత్తరుఁడగు సమ్రాట్టై యున్నవాఁడు. వానిని సకలసంపదలతో నీకాలమున రాజ్యలక్ష్మివరించియున్నది. వానిపరాక్రమం బజయ్యంబు. మహాగర్వితుండును, బలిష్ఠుండును నగు చేదిదేశపురాజు శిశుపాలుండు వానికి సేనాపతియై మిక్కిలి భక్తితో వానినే కొలిచియుండును. మఱియు నపరిమిత భుజబలముగలవారును, మాయాయుద్ధమున నిపుణులును, నజయ్యులును బరస్పరమైత్రి గలిగి యొకరి నొక రెడఁబాయనివారును నైన హంసడిభకు లనువార లాతని యాప్తులు. వారికి రెండుసేనలు గొప్పవి. కౌశిక చిత్రసేన నామములతోఁ

గలవు. వారిసేనలతోను సకలసమరోచితసాధనములతోను నాజరాసంధు నకుఁ గుడియెడమభుజములువోలె వర్తిల్లుదురు. మఱియును వరుణుని బలముతో నుపమింపఁదగిన బలము గలవాఁడును, పడమటిదిక్కునకు రాజైన భగదత్తుఁ డనువాఁడు మీతండ్రి పాండురాజున కనురక్తుండై తనమనస్సున నీకు భక్తుండయ్యును జరాసంధునకు వెఱచి మాటల చేతను గార్యములచేతను వాని కూడిగము సేయుచుండును. పశ్చిమ దక్షిణదేశాధిపతియగు పురుజిత్తుండు నీకు మేనమామ కావున నాతండు నీయందే మిక్కిలి ప్రీతిం జూపుచుండు. చేదిదేశపురాజు పురుషోత్త ముఁడు నేను మున్నే వాని వధింపకునికి గర్వించి యున్నవాఁడు వంగ పుండ్ర కిరాతదేశములకు రాజైన పుండ్రకవాసుదేవుం డనువాఁడు నావలెనే శంఖచక్రములను ధరించి మదంబునఁ జెలరేగుచుండువాఁడు. ఇంద్రసఖుఁ డగు భోజపతియైన భీష్మకుఁడు తనకుఁ బరశురాముని శౌర్య పరాక్రమములు గల సోదరుఁడు తోడ్పడియుండ విద్యాబలగర్వితుండై పాండ్యదేశమును గ్రథదేశమును, గైశికదేశమును గెలిచియున్నవాఁడు. వీనికి మన మెంత ప్రీతి యొనర్చుచున్నను సంబంధుల మైనమనల సరకు గొనక మనకులబలముల నెంచక మన కనిష్టములనే కోరుచుఁ బోతరించి యున్నవాఁడు. వీరందఱును జరాసంధుపక్షమువారు. మఱియు నుత్తర దిశయం దుండుభోజరాజులు పదునెనిమిదివంశములవారు జరాసంధ వశులై పశ్చిమదేశవాసులైరి. శూరసేన, భద్రకర, సాల్వ, పటచ్చర, సుస్థల, కటాద, కుళింద, కుంతి, సాళ్వాయన, పాంచాల, కోసల, మత్స్య దేశస్థులును తమతమదేశములను వదలి వానినే గొలిచియుందురు. జరాసంధుకూఁతు లాస్తి, ప్రాస్తి యనువారల నామేనమామ కంసుఁడు పెండ్లియాడి యదువృష్టిభోజాంధకకుకురవంశస్థులలోఁ దాను శ్రేష్ఠుండ నని పోతరించి బంధువులకు హానిఁ జేయుచున్నంత వా రెల్లరు నతఁడు పెట్టుబాధల కోర్వలేక నాకుఁ దెలుపఁగా నే నాతనిని వధించి కులము నకు దొసఁగు పోఁగొట్టితి. సునాముని బలరాముండు చంపెను. ఇవ్విధ మున జ్ఞాతికార్యమును నెఱవేర్చినకారణంబుగామామేనమామభార్యలు తండ్రిం జేరి యాతనికి మాయెడ ద్వేషమును బోధించుచుందురు. వారి వచనములం జేసి జరాసంధుండు మాకుఁ బలుతెఱంగుల నుపద్రవములఁ

జేసెను. విను మొక్కప్పుడా జరాసంధుండు గొప్పసేనను సమకూర్చుకొని శస్త్రములచేఁ జావులేని హంసడిభకులసాయమున మధురాపురముపై దండెత్తి విడిసెను. వారిపరాక్రమ మమానుషము. ఆముగ్వురును ముల్లోకముల నోడింతురు. అట్టిపరాక్రమవంతులతో నేనును, సంకర్షణుండును, యదువృష్ణిశూరులు పదునెనిమిదివేవురు సాయపడఁగా నెదురుపోరునకు సమకట్టి మూఁడేండ్లు ఘోరయుద్ధమును జరిపితిమి. అట్లు విక్రమించి యోహటించినను మే మమ్మాగధసేనను రూపుమాయింపలేమైతిమి. అప్పుడొక్కనాఁడు సంకులసమరం బగుచు నందు బలరామునిచే హంసుండు లెస్సగా మర్దితుండై మూర్ఛవోయెను. ఆ వాని మూర్ఛను డిభకుఁడు చావుగాఁ దలఁచి యట్టిమిత్రునిఁ గోల్పోయితినే యని దుఃఖావిష్టమనస్కుండై వాఁడు లేనిజీవనము నోర్వలేక యమునానదియందుఁ బడి ప్రాణత్యాగము గావించికొనియెను. అంత హంసుఁడు మూర్ఛఁ దేరి డిభకుని మరణము విని మిక్కిలి సంతాపమును జెంది తనప్రాణమిత్రుఁ డైనవాఁడు చచ్చెనే యని వాపోయి తా నిఁక బ్రదుకరా దని వాఁడు పోయినదారిఁ దానును బోయెద నని యమునయందుఁ బడి శరీరమును వదలెను. ఇట్లన్యోన్యమరణశ్రవణవేదనాభరంబున శరీరంబులఁ దొఱఁగిన హంసడిభకులవృత్తాంతంబున నిస్సహాయుండై జరాసంధుండు వారికై మిక్కిలి పరితాపపడి మఱలి గిరివ్రజపురమున కేగెను. అంతట మే మాజరాసంధునిబాధ కోర్వలేక మధురాపురమును వదలి సాగరమధ్యంబున నుండు ద్వీపమున రైవతకాద్రి నాధారపఱచుకొని మూఁడుయోజనములనిడివియును, యోజనంబు వెడల్పునుం గలిగి నూఱుద్వారములు గల్పించిన కుశస్థలీపురమును దేవతల యమరావతింబోనిదాని నిర్మించుకొని దానికి వీరవిక్రమతోరణమును మహాదుర్గమును గట్టించి యందు మేమందఱము సుఖులమైయున్నారము. ఆదుర్గము నాశ్రయించిన మమ్ము దేవతలుం జెనకఁ జాలరు. యుద్ధవీరు లటుండఁగా స్త్రీలునైన మాదుర్గమున రక్షితలై శత్రువులతో నందుండి భీతిలేక పోరాడఁగలరు. మావీరవరులశౌర్య మాకుశస్థలిపురద్వారముగ నుండును. మాపదునెనిమిదిక్షత్రవంశపుయువకులైనవీరు లాపురమునెల్లప్పుడు కావలికాచియుందురు. మావంశస్థు లిరువదియెనిమిదివేలమంది

సోదరులున్నారు. ఆహుకునకు దేవతుల్యులగు నూర్గురు పుత్త్రులున్నారు. నేను, బలరాముఁడు, యుద్ధమున నాకు సమానుఁడగు సాంబుఁడు, చారుదేష్ణుఁడు, వానిసోదరుఁడు చక్రదేవుఁడు, సాత్యకి మేమేడ్గురమును మహారథికులమును,శూరులమునునై యున్నవారము. మేముగాక మాతో నుండు నన్యులైనశూరులనుబేర్కొనెదను. కృతవర్మ, అనాధృష్టి, సమీకుఁడు,సమితింజయుఁడు, కంకుఁడు, శంకుఁడు, కుంతిభోజుఁడను మహారథు లేడ్గురును, నంధకభోజుఁడు వానికుమారు లిరువురును నీ పదుగురును వజ్రసంహననులు. వీరు వృష్ణితోడ వసించుచున్నారు. ఓభరతశ్రేష్ఠుడా! నీ వీరాజ్యము నంతయు నేల నర్హుండవు. కావున నీవు సమ్రాట్టవగుము. కాని, జరాసంధుఁడు జీవించియున్నంతవఱకు రాజసూయయాగము సలుపుటకు వీలు గాదు. ఏలయనఁగా, నాశూరుం డనేకరాజులను జయించి వారిని నేనుంగులను బర్వతగుహలయందు సింహములువోలెఁ దనగిరివ్రజపురమునందుఁ గారాబద్ధులం జేసి యం దుమాసమేతుండైన మహాదేవు నారాధింప నున్నవాఁడు. వాఁడు ప్రతిదిన మొకరాజును భూతనాథునకు బలిగా నర్పించును. ఆమాగధునకు వెఱచి మేమును మధురను వీడి ద్వారకావాసుల మైతిమి. ఓకౌరవా! నీవు, రాజసూయయాగ మొనర్పఁ దలపోయుదు వేని, మొట్టమొదట వానిని జంపి వానిచేఁ జెఱపట్టఁబడినరాజుల విడిచిపుచ్చవలయును. దీని నొనర్ప వేని నీ వీరాజసూయయాగ మొనర్ప లేవు. కావున రాజసూయయాగ మొనర్చుటకు మొట్టమొదట జరాసంధునివధోపాయముఁ బూనవలయు. అది యత్యావశ్యక మనినఁ గృష్ణునకు యుధిష్ఠిరుం డిట్లనియె.

## శ్రీకృష్ణభీమార్జునులు యుధిష్ఠిరున కుత్సాహంబుఁ గలిగించుట

కమలనాభా! నీ వానతీయఁగా నాసంశయము లెల్లఁ బాసెను. ఇట్లు బోధించి సదాలోచన చెప్పుటకు నీవు దక్క నన్యుండు శక్తుండగునే? రాజులు తమతమ నగళ్లయందుండి సుఖింతురే కాని సామ్రాజ్యవాంఛ వారికి జనింపదు. జనించినను నది సులభము కానేరదు. పరానుభావజ్ఞుఁడు తన్నెట్లు ప్రశంసించుకొనును? పరులచే నుతింపఁబడు వాఁడే పూజనీయుఁడు. ఓవృష్ణికులోద్ధారకుఁడా! భూమి మితిలేనిదైన శా

ల్యంబు గలయది. బహురత్నసమంచితము. దాని నెల్ల నెఱింగిన మేలు
పొంద నగును. నాకు శమమే క్షేమకర మని తోఁచుచున్నది. నేను
బరమశాంతిని వహించుచో నాకు మనస్సు నెమ్మది పడఁగలదు. మనము
రాజసూయముఁ బ్రారంభించినను దానిని బూర్తినొందింపఁజాల మని
యెంచెద. మనవంశస్థులలోనివా రందఱిలో నెవఁడైన శ్రేష్ఠుఁడు
పుట్టకపోవునా? వాఁడేని రాజసూయయాగమును జేయఁడా? యని
యాలోచించి తమకుఁ బిమ్మటివారి కీకార్యముఁ గర్తవ్యముగా వదలు
దురు. నేను నీయసాధ్యకార్యమును వారివలెనే నా పిమ్మటివారికి వదలె
దను. జరాసంధుఁడు రాజుల నెల్లరం గెలుచుచు వారిని దనవశంవదు
లనుగా నొనర్చుచుండఁగా మన మెల్లర మూరకుంటిమి. వానిప్రతాప
మునకు జగన్నాథుండ వగు నీవును వెఱచియుంటివి. నీబాహుపరా
క్రమముచే సురక్షితుల మగు మే మాబలవంతునితోఁ బోరెట్లు సలుపఁ
గలము? బలరాముఁడో, భీముఁడో, లేక యర్జునుఁడో వానిని నోర్వఁ
గల రనుతలంపు నాకుఁ దట్టుచున్నను, నయ్యది మిక్కిలి సంశయాస్పద
ముగఁ దోఁచుచున్నది. ఇంక నే నేమి చెప్పఁగలను? మాకు నీవ
బలమవు. నీయాధారమున మేము మనవలసినవారము. ఇది తెలిసియే
యీ యుద్యమమును బలుమాఱు బుద్ధిమంతులతో విమర్శించుచుం
దును. ఓకేశవా! సర్వకార్యములను నీప్రమాణవచనముల నాధార
ముగాఁ గొని వర్తించెదను. అని చెప్పఁగా వాక్యవిశారదుండగు భీమ
సేనుం డిట్లనియె. అనారంభపరుఁ డగు రాజు పుట్టవలె నశించును. బల
రహితుఁడైనవాఁడు పరాక్రమవంతునితోఁ దొడరిన సమరసాధనములు
లేక యోడిపోవును. దుర్బలుఁడైనను బ్రమాదరహితుఁడై శత్రువును
సాధింపఁదలఁచి పట్టుదలతోఁ గార్యమునకుఁ బూను నేని, బలవంతుఁడైన
శత్రువును సైతము గెలువఁగలఁడు. కృష్ణునినీతియును, నాబలమును, నర్జు
నునివిజయంబు నుండఁగా నీ కీవగ వేల! త్రేతాగ్ను లిష్టిరిం బోలె మేము
మువ్వుర మామాగధుని సాధింతు మనఁగా నప్పుడు శ్రీకృష్ణుం డిట్లనియె:
అవ్యుత్పన్నులు కార్యఫలములను లెస్సఁగ విచారింపకయే కార్యమును
బ్రారంభింతురు. కావున నేర్పరులగువారు స్వకార్యధురంధరులైన శత్రు
వులను బాలురైనను నుపేక్షింపరు. యావనాశ్వుండు ప్రజలయొద్ద
నుండిపన్నులఁ గొనక వారిని మన్నించుటచేతను, భగీరథుండు ప్రజాను

రంజనముగఁ బాలించుటచేతను, దపోబలమునఁ గార్తవీర్యార్జునుండు, బలమున భరతుఁడు, సంపత్సమృద్ధిచేత మరుత్తుఁడును సామ్రాజ్యమును వహించిరి. సామ్రాజ్యము గోరు నిన్నీసంపద లన్నియు నాశ్రయించి యున్నవి. కావున నీకు సామ్రాజ్యము సులభోపాయమునఁ జేకూఱును. కావున ధర్మార్థనీతుల నన్నింటి నాలోచింపఁగా నాబృహద్రథపుత్త్రుండు నిగ్రహింపఁ దగినలక్షణములను గలిగియున్నాఁడు. క్షత్త్రియులు నూటొక్క కులమువారు నానారత్నముల నతనికిఁ గానుకలుగా నొసంగి సేవించుచుండినను నాతండు తుష్టుండు గాఁడు. మూర్ధాభిషిక్తులును, నిరపరాధులును నగు నారాజుల బలవంతముగ నిగ్రహించి వశపఱచు కొనెను. వానికిఁ గప్పముల నొసంగని రాజులు లేరు ఇట్టి నూర్గురు రాజులను వశపఱచుకొని భూతనాథునకు నిత్య మొక్కనిఁగా బలియిచ్చుటకు సంసిద్ధుఁడై యున్నవాఁడు. క్షత్త్రియు లాయుధపాణులై సమరముఁ జేసి రణరంగమునఁ జచ్చి రేని సత్కారార్హులయ్యెదరు. కావున మన మేకీభవించి వానివధోపాయము నాలోచింపుదము. భూతనాథునకు బలికి వలసిన నూర్వురు రాజులలో నిప్పటికి నెనుబదిమూర్వురను సమకూర్చెను. ఇఁకను బదునలుగ్వురం జేర్పవలయును. అందఱను సాధించి తనయత్నమును నెఱవేర్చును. బలాఢ్యు లగువారు తప్ప లాతివారు వాని నెదిరింపఁగలరే? ఇట్లు నరహత్యను నిర్దయుండై చేయుటకు యత్నించుచున్న వాని నెదుర్కొని మనము వధింపవలయును. ఇట్లు మనుష్యవధమున క్షత్త్రియుండు సద్గతి వడయునే? కావున నట్టిసాహాత్మునియత్నమును విఫలపఱచి వానిం గెలిచినచో నీకు సామ్రాజ్యం బవశ్యంబు సేకూరు. అని చెప్పఁగా, నయ్యుధిష్ఠిరుం డాజనార్దనున కిట్లనియె. వాసుదేవా! నేను సామ్రాజ్యకాంక్షినై స్వార్థపరుండనై మిమ్ము నాజరాసంధున కెదురుగా నెట్లు పంపఁగలను? భీమార్జునులు నాకు నేత్రములవంటివారు. నీవు నాకు మనస్సవు. కావున మీరుపోఁగా, నేను మనోనేత్రవిహీనుఁడనై యెట్లు మనఁగలను ? ఆజరాసంధునిసమక్షమున నిల్చి మృత్యువైనను బోరాడ లేదు. ఇఁక మీరు జయింతు రని తలఁప నగునే? కావున దీన హాని వాటిల్లును. ఇది తప్పదు. దానంజేసి రాజసూయయాగోద్యమమును నుడిగెద నని చెప్పఁగా నయ్యుధిష్ఠిరున కర్జునుం డిట్లనియె,

మహారాజా! సామాన్యులకుఁ బొందరాని గాండీవ మను ధనుస్సును, నక్షయతూణీరములను, దివ్యబాణములను, నస్త్రములను, గపిధ్వజముతో నుండు రథమును, సభను గోరినవి ఫలించునట్లుగాఁబొందితి. వీనిని ఫలవంతము లొనర్చుటకు శత్రునిర్మూలనము చేయవలదా? పెద్దలు సత్కులజననమును బొగడుదురు. అయినను నిర్వీర్యుం డైనవాఁడు సత్కులమునఁ బుట్టఁగా నేమి ఫలము? నాకు బలవీర్యములే యెక్కుడని తోఁచుచున్నది. సామాన్యకులమునఁబుట్టియు వీర్యవంతుఁడు శత్రువులను గెలిచి ప్రశస్తిఁ గాంచు. సద్గుణము లెన్ని యున్నను వీర్యము లేకున్నచో వాఁ డేమి చేయఁగలఁడు? గుణము లన్నియుఁ బరాక్రమంబున గుణీభూతములై యుండు. పౌరుషము దైవంబుతోడ్పాటు గలదై ఫలవంత మగును. పరాక్రమముగలిగియు నప్రయత్నుఁ డైనపురుషుండు వ్యర్థుండు. అది గలిగి యత్నముచేసియు ఫలమును బొందనివాఁడు దైవోపహతుండు. పరాక్రమముం గలవాఁడు దైన్యమోహములఁ జెందరాదు. రాజున కవి తప్పక హానిం జేయు. కావున నవి రాజులచేఁ ద్యాజ్యములు. ప్రతాపమును జూపి రాజులు మే లొందుదురు. అది నిక్కంబు. అట్లుండ యత్నమే లేక యూరకుంటుట పాడి గాదు. శాంతమనస్కులగు మునులకుఁ గాషాయవస్త్రధారణ ముచితము. పౌరుషబలయుతు లగు రాజులకు శత్రువధము గావించి సామ్రాజ్యమును బొందుటుచితము. అయ్యది యశస్సాధనోపాయము. ఎవ్విధమునైన యశస్సంపాదన మవశ్యానుష్ఠేయంబు. రాజసూయయాగార్థముగ జరాసంధుని వధించి రాజులఁ జెఱనుండి వదలింతుమేని దానికంటె వేఱొండు యశస్సంపాదనము గలుగునే? కాన బలపౌరుషములం జూపి జరాసంధు వధించి, సామ్రాజ్యసాధన మవశ్యకర్తవ్యము' అని చెప్పఁగా జనార్దనుం డిట్లనియె.

ధర్మనందనా! భరతకులప్రదీపకుఁ డగు పార్థునిమాటలు సమంజసంబులు. మఱియుఁ గుంతీగర్భజాతుఁడు చెప్పఁదగినమాటలను నుడివెను. మనుష్యుఁ డెప్పుడు పుట్టెనో యప్పుడు గిట్టుట నిక్కంబు. చావిపుడో మఱియొకపుడో రాకమానదు. యుద్ధమునవే చత్తు రనవలదు. యుద్ధ మొనర్పక శాంతహృదయులైన వా రెల్లఁ జిరజీవులే? శాస్త్ర

ములు వర్ణోచితనీతులను విధించియున్నవి. ఆనీతిమార్గము లవశ్యాను ష్ఠేయములు. రాజులు శత్రుల నెదిరించి పోర గెలుచుటో, మరణించుటో రెండిటిలో నేదేని వారికి మేలొనర్చును. నీతి నెఱుంగనిరాజును,నుపాయములఁ బన్ననేరని రాజును బోరుసఁ జెడును. వారికి గెలుపు లేదు. కావున మనము నీతి నవలంబించి యుపాయమును బన్ని శత్రులోప మునుగుర్తించి, మనలోపమును గప్పిపుచ్చి సమయముం జూచి విజృంభింతుమేని,యేటిప్రవాహములు వేళ్లతో మహావృక్షమును బడఁద్రోయు చాడ్పున శత్రువు నున్మూలింపఁగలము. బలపరాక్రమాతిశయముగలశత్రువులతోఁ బోరునకుఁ దొడరకుండుట నీతి. ఇది తగినసమయము. ఇప్పుడ మేము పూని యాజరాసంధుపురము నొరులకుఁ దెలియకుండఁజొచ్చి, వానిం జంపి రాజులఁ జెఱవదలించెదము. దాన నీకపరిమితయశస్సంపాదన మగును. అదియు నిన్ను సామ్రాజ్యంబుఁ బడయఁజేయు.సామ్రాజ్యమును బొంది రాజసూయయాగమున కుపక్రమింపుము. నిర్విఘ్నముగ నీ సంకల్పము నెఱవేఱును. జరాసంధుండు ప్రాణులయం దంతరాత్మ వోలెఁ దానొక్కరుండ సర్వమహీసంపద ననుభవించుచుఁ దనకు సమానుండు భూలోకమున లేఁ డని గర్వించియున్నవాఁడు. ఆగర్వమే వానికి వినాశహేతువు. కావున వానిం దొడరి పొలియించుట కిదియ తగిన తరుణము. ఈసమయమున వాఁడు సులభోపాయముచేఁ జంపఁబడును.' అనఁగా నాతనికి ధర్మపుత్త్రుం డిట్లనియె.

## జరాసంధునివృత్తాంతము

కైటభారీ ! ఈజరాసంధుం డెవ్వండు? వానిబలపరాక్రమము లెట్టివి ? వాఁడు నీతో విరోధించి పోరియు నగ్నిందాఁకిన శలభము వలె నేల భస్మముగాఁ డయ్యె ? అని యడుగఁగా, నా వసుదేవ సుతుండు పాండుసుతున కిట్లనియె. జరాసంధునివృత్తాంతమును, వానిని నే నుపేక్షించుటకుఁ గారణమును జెప్పెదను వినుము. పూర్వము బృహద్రథుఁ డనువాఁడు మగధదేశమునకు రాజుగ నుండె. ఆతండు మూఁడక్షౌహిణులసేన గలవాఁడు, సురూప పరాక్రమ తేజ శ్శీలలచే నొప్పుచు సుగుణాకరుండై యుండె. ఆతండు నిత్యదీక్షాం

కితతనువు గలవాఁడు. శతక్రతుతుల్యుండు. తేజస్సున సూర్యునకు సమానుండు. ఓర్పున ధరాతుల్యుఁడు. యమునివలెఁ గ్రోధనుఁడు. వానియభిజనగుణములు సూర్యకిరణములు ప్రపంచ మంతయుం బోలె నలుదెసల వ్యాపించినవి. వాఁడు రూపయౌవనసంపద్విలసితులను గవలను కాశిరాజదుహితల నిరువురను బెండ్లాడెను. వారియెడఁ బరస్పరభేద మెంతయును జూపక కామకృత్యములయందుఁ దుల్యముగా వర్తించునట్లు వారితో నారాజు సమయముఁ జేసి, రెండుకరిణులమధ్య మున నుండు గజరాజువోలె, గంగాయమునలమధ్యనుండు సముద్రుని తెఱంగునను విహరించుచు, బహుకాల మైనను వారిద్దఱియందు సపత్యము బడయ లేక లెక్కలేని మంగళకార్యములను జేసియుఁ,బుత్రకా మేష్టిఁ గావించియు వంశకరుం డగు పుత్రునిఁ బొంద లేక నిర్వేదించి భార్యలతోడఁ దపం బాచరింప వనమునకుఁ జనియె. అట్లు పోవుచువాఁ డావనమున నొక్కమామిడిచెట్టుసీడ నున్నవాఁడును, గౌతమవంశోద్భవుండును, గాక్షీవంతునిపుత్రుండును నగు చండకౌశికుఁ డనుతాపస వర్యుం జూచి యాతనికి రత్నాదుల నర్పించి, యతనిని వినయముతోఁ గొలుచుచుండె. అట్లుపాసించుచున్న రాజేంద్రుం జూచి యాసత్యవంతుఁడు, సత్యవ్రతుండునగు చండకౌశికుం డొక్కనాఁడు సంతుష్టుండై యిట్లనియె. రాజేంద్రా! నీయెడఁ బ్రీతుండ నైతి. వరముల నడుగు మనఁగా, నాసత్యవ్రతుఁ డగుచండకౌశికునకు రాజిట్లనియె. 'మునీంద్రా! అభ్యుదయకార్యముల నెన్ని యేనిచేసితి. తుదకుఁ బుత్రకామేష్టి నలిపితిఁ గాని వంశవర్ధనుండైన పుత్రుం బడయ లేనైతి. కావున నిర్వేదమున రాజ్యము దక్కించి తపస్సుఁ జేయుటకు నిశ్చయించి యీవనమున కేతెంచితి. మందభాగ్యుండ నగు నా కితరవరము లేల? సుఖము లేల? రాజ్య మేల? యని చెప్పఁగా విని, యాచండకౌశికుండు కొంతకాలము ధ్యాన సమాధియం దుండెను. అప్పు డొకమామిడిపండు శుకముసైతమాస్వాదింపనిది, పక్వముగాఁ బండియుండునది తొడిమ వీఁడి చెట్టునుండి యాఋషివర్యునొడియందు గాలి వీవకున్నను రాలిపడెను. అంత నాఋషి యాఫలమును గేలఁబూని దాని నభిమంత్రించి రాజుం బిలిచి 'భూపాలా! యీపండును గ్రహింపుము. పుత్రునిఁ బొందెదవు. ధన్యుఁడవైతివి. మఱలఁ బురమునకుఁ బొమ్ము.' అనఁగా బృహద్రథుండు పండును గొని

మునిచంద్రునకు భార్యలతో సాష్టాంగముగ మ్రొక్కి యామహానీయుని సెలవుపొంది నిజపురమున కేగి నగరు సొచ్చి యిరువురుభార్యలయందు సమానప్రేమయు గలవాఁడగుటం జేసి, ఫలమును చెఱిసగ మొనర్చి యిరువుర నారగింపు మని చెఱియొకసగము నొసఁగఁగా, దాని మహిమచే నాయిరువురు భార్య లేక కాలమున గర్భములం దాల్చిరి. అంతఁ బ్రసవ సమయము రాఁగా వార లొక్కకన్నును జెవియుఁ గాలును జేయియు సగము మోమును గడుపును గటిభాగమునుం గల శరీరశకలములఁ గనిరి. అట్లు పుట్టిన శరీరఖండములు సప్రాణములై యుండుటం జూచి రాణులు వెఱచి వగచుచుండఁగా, మంత్రసాను లా శకలంబులం గొని కప్పి యంతఃపురము వెడలి పురమున నాల్గుత్రోవలు గలియు నొక్క ప్రదేశమునఁ బడవైచి వెడలిపోయిరి. అంత నచ్చోట నివసించు మనుష్యవ్యాఘ్రమాంసాదులఁ దిను జర యను రాక్షసి యా రెండు శకలంబులం గాంచి వానిని సులభముగ నెత్తికొని పోవుట కుద్యుక్తయై దైవప్రేరణమున నా రెండుశకలముల నొక్కటిగాఁ జేర్చెను. అంత నా రెండుశకలములు కదిసి యొక్క శిశురూపము నొందినదై, యారాక్షసికి మోచుట కలవిగానియంత బరువై వజ్రసారదృఢదేహముగలిగి కుమారరూపముం దాల్చి, యెఱ్ఱని పాణిప్రదేశములను ముడిచి కొన్న ముష్టి మొగమునం జేర్చి బిగ్గరగా నేడ్వఁ దొడంగెను. ఆశబ్దమును నంతఃపురస్త్రీలు విని పుత్త్రజన్మమున నిరాశులయ్యు నివ్వెఱపడి దాదులునుం దామును రాజుతోఁగూడి యాప్రదేశమునకుఁ బరుగెత్తికొని వచ్చిరి. అంత రెండుశకలము లొక్కటై శిశురూపమును ధరించి యేడ్చుచుండ దానిం గనుంగొని వారెల్లరు సంతోషించిరి. అప్పుడా రాక్షసియు నాశిశువును రాజపుత్త్రుంగాఁ దలంచి, యాదేశమును దననిత్యధర్మకార్యములచేఁ దనుపుచు, బీదసాదలను బోషించుచు భూతబలుల నొసంగుచుండుపరమతపోనియతుం డగు నీరాజుయొక్క కుమారుండగు నీశిశువు నాహారార్థినినై తాను జంపఁదగ దని నిశ్చయించి, తన కుండు కామరూపము నెత్తఁగలసామర్థ్యమున మనుష్యస్త్రీరూపధారిణియై, యాశిశువు నెత్తికొని బృహద్రథుని సమీపించి, రాజా! నీయిరువురి భార్యలయం దీబాలుండు రెండుశకలములుగా జనించెను. అట్టిశకల

ములను నీశిశువునుగాఁ దెలియక, నీయంతఃపురపుదాదు లీరూపము
నకు వెఱచి యర్ధరాత్రమున వీనిని జతుష్పథమునఁ బాఱవైచి చనిరి.
అంతట నే నీశకలములను రెంటి నొక్కటిగాఁ జేర్చితి. తత్క్షణము ముని
ప్రభావమున నవి రెండును నొక్కటై యీ శిశురూపమును ధరించెను.
వీఁడు కుమారుఁడు. వీని నింతసే పీకఠినదుర్గంధప్రదేశమున రక్షించితి.
వీని నిప్పుడు నీ కొసంగెద. గ్రహింపు మనఁగా, బృహద్రథుండు పరమా
నందముతోఁ బుత్త్రుం గొని తనభార్యల కొసఁగెను. వారు నా బాలు
నెత్తికొని చనుఁబాలనిచ్చి పెంచుచు సంతసిల్లిరి. అప్పుడు బృహద్రథుం
డా రాక్షసిం బిలిచి నీ వెవ్వతెవు? దేవతవు వోలె నున్నదానవు. అని
యడుగ నా రాక్షసి రాజున కిట్లనియె. రాజశ్రేష్ఠా! నేను రాక్షసిని.
నేను జర యను పేరితోఁ బిలువఁబడుచుండుదును. మనుష్యులయిండ్లలోఁ
జేయు నర్చనలం గొనుచుండు గృహదేవతవోలె నుండుదు. నేను
కామరూపిణిని. దానవులవినాశముకొఱకుఁ బూర్వకాలమున బ్రహ్మ
నన్నుఁ బుట్టించెను. కొడుకులతో నుండు నన్ను మనుష్యులు తమయిండ్ల
యొక్కగోడలలో బొమ్మలుగా వ్రాసి, నాకుఁ బూజలఁ గావించి ధూపదీప
నివేదనలతో నన్నుఁ గొలుచుచో, నేను సమృద్ధిని వారికిఁ గలిగింతు.
అట్లు చేయనివారికి హాని గావింతు. నీవు నన్ను పుత్త్రసమూహ
ముతో నుండుదాని ననిశంబు నర్చించుచుంటివి. అట్టి నీకు నే నేయుప
కారము చేయుదునా యని బహుకాలమునుండి నిరీక్షించుచుంటి.
ఇపు డీశిశుశకలముల నొక్కటిగ నేను జేర్పఁగ నయ్యది దైవ
బలముతోఁ గూడి, నీభాగ్యవిశేషము ముఖ్యకారణము కాఁగా
నొక్కపుత్త్రుఁ డయ్యె. దీనికి నేను నిమిత్తంబైతిని. మేరువు నైన మ్రింగఁ
గల శక్తి గల్గియుండు నా కీకుమారుని మ్రింగుట యనఁగా నేపాటి?
ఎవ్విధమున నైనను నీ కుపకారమును జేయ వలయు నని నిరీక్షించి
యుండుటచే నీదినమున నాభాగ్యవశమున నిది నిమిత్త మేర్పడఁగా,
నీ రెండుశకలముల నొక్కటిగాఁ జేర్చినంత నిది శిశువయ్యె. ఈ
శిశువు నీకుం బుత్త్రునిగాఁ దలంచి రక్షించి నీ కీయఁగంటి. సంతసిల్లితి
నని చెప్పి జర యదృశ్య యయ్యె. అంత బృహద్రథుండు జర కేఁటేట
మగధదేశ మెల్లెడల నుత్సవములఁ గావింప నాజ్ఞాపించి, మా యుత్తరు

వును బ్రజ లనుష్ఠించుచుండునట్లు చేసెను. అంతట బృహద్రథుండు నగరు సేరి యా కుమారునకు జాతకర్మ మొనరించి, జరచే సంధింపఁబడిన శరీరము గలవాఁ డగుట నతనికి జరాసంధుఁ డను పేరు పెట్టెను. అంత నాకుమారుం డాజ్యాహుతుల వృద్ధినొందు హుతవహుమాడ్కి, శుక్లపక్షచంద్రునివిధమున, దినదినప్రవర్ధమానుండగుచుఁ దల్లులకును దండ్రికి నేత్రానందంబుఁ గలిగించుచుండె.

అంతటఁ గొంత కాలమునకుఁ జండకౌశికుండు మగధదేశమునకు విచ్చేయఁగా, బృహద్రథుండు సకలమంత్రిపురోహితపరిజనులతో నెదుర్కొని యామహనీయునకుఁ దగిన స్వాగతం బొసంగి యతని నర్ఘ్యపాద్యాదులం బూజించి యుచితాసనాశీనుం జేసి, భార్యలతోను బుత్త్రునితోను సాష్టాంగవందనంబు లాచరించి యిట్లనియె. 'మహనీయా! నా రాజ్యము సకలసంపత్పరివారముతోను బుత్త్రమిత్రకళత్రంబులతోను భవదధీనము.' అని చెప్పఁగాఁ జండకౌశికుండు మిక్కిలి సంతోషించి రాజుం జూచి యిట్లనెను. బృహద్రథా! వినుము. నీ యీపుత్త్రునివృత్తాంతం బంతయు నాయోగబలమున నెఱింగితి. వీఁడు మహాబలపరాక్రమములతోఁ గూడికొని రూపలక్ష్మీసమన్వితుండై విరాజిల్లును. గరుడునిత్వరితగతి నితరము లగు పక్షులు పొందరానివిధమున, వీనిబలమును నితరరాజులు పొందనేరరు. బహు వేగవంతములగు నదీప్రవాహములు కొండలను భేదింప లేనట్లు, దేవతలదివ్యాస్త్రములు వీనిశరీరమును భేదింపఁజాలవు. సహస్రకిరణుఁడు నిజప్రకాశమున నితరకాంతుల నణఁచురీతిఁ, బెఱ రాజులతేజములను వీని తేజ మణంచును. శలభము లగ్ని యందుఁ బడి దహింపఁబడుమాడ్కి, వీని నెదుర్కొనురాజులు వినాశమును బొందుదురు. వానకాలమునందు సముద్రుం డన్ని యేళ్ల నీళ్లను గొనువిధంబున, నీతండు సకలరాజసంపదలఁ గొనును. శుభాశుభపదార్థములను భరించు భూమి వోలె నాల్గువర్ణములవారిని భరించు. లోకమున నుండు రాజు లెల్లరును వీనియాజ్ఞను శిరసావహించి వీనికి వశంవదులై మెలంగెదరు. సర్వభూతాంతరాత్ముండగు వాయువునకుఁ బ్రాణులు వోలె సకలరాజులును వీనికి లొంగి వర్తింతురు. ఈతండు త్రిపురసంహారి యగుమహేశ్వరునిసాక్షాద్రూపమును దర్శించు' నని చెప్పి చండకౌశికుం డరిగె. పిమ్మట

గొంతకాలమునకు జరాసంధునితండ్రి రాజ్యపాలనమునందు విరక్తుండై, కొడుకునకు రాజ్యాభిషేకంబుఁ గావించి, తన యిరువురు భార్యలం దోడ్కొని తపంబునకై వనంబున కేగెను. అట్లతఁడు బహుకాలము తపంబాచరించి భార్యలతో దివంగతుఁడయ్యెను. అంత జరాసంధుండు తల్లులకును దండ్రికిని వర్ణోచితౌర్ధ్వదైహికక్రియల నొనర్చి, చండకౌశికుని యనుగ్రహంబున ననేకరాజుల నోడిచి కప్పములను గానుకలను గొనుచుండె. పిదప నేను గొంతకాలమునకు నాబంధువు లగు యాదవవృష్ణికులవృద్ధులచే నియుక్తుఁడనై దురాత్ముండైన నామేనమామయగు కంసుని జంపఁగా, నాతండు వీని కల్లుం డగుటచేఁ దనకూఁతుల ప్రోద్బలంబున నాపైఁ బగఁబూని తొంబదితొమ్మిదిమాఱులు గిరివ్రజమునుండి మధురానగరిపై గదను ద్రిప్పివైచియుండె. గిరివ్రజమునకును మధురకును దొమ్మిదితోఁగూడిన తొంబదియోజనములదూరము. మఱియు నిట్టిపరాక్రమవంతున కాయుధములచే వధ్యులుగాని హంసడిభకులు మిత్రులైరి. వీరు మువ్వురును బ్రత్యేకప్రత్యేకముగనే మూఁడులోకములను గెలువఁజాలినవారు. అట్టివారు ముగ్గురు నొకపక్షమునఁ జేరినప్పుడు గెలుపుకొనుట సాధ్యమా? వీరిని బోర గెలువలేమని వృష్ణివంశమువారును, కుకురాంధకవంశములవారు నుపేక్షించిరి. ఇప్పు డామాయావులును, నొరులయస్త్రమహిమమునఁ జావనివారును,సోదరులునగు హంసడిభకులు చచ్చిరి. మనము దీనిని సమయముగాఁ గొని నీతిపరులమై వానితోఁ బోరుదము. అతఁడు శస్త్రాస్త్రములఁజావఁడు. కావున మల్లయుద్ధమునకు లాగి వాని నిర్మూలింతము. ఈకార్యమునకై నాకు నీసోదరులు భీమార్జునులను దోడిమ్ము. నానీతియును, భీమునిబలమును, విజయువిజయమును నొండొంటితో సాయపడి యిష్టినిఁ ద్రేతాగ్నులు సాధించువిధమున నాఖలుని సాధింతుము. నీకు విచారం బేల? మేము మువ్వురమును గూడి వానిని విజనప్రదేశమునకు లాగి, మల్లయుద్ధమునఁ బోరాడఁ బిలిచెదము. అప్పు డాజరాసంధుండు లోభమునను భుజబలగర్వమునను మాలో భీమునితో నవశ్యముగఁ బోరాడును. నాగాయుతబలుం డగు మనభీమసేనుండు జమునిచాడ్పున వానితో మల్లయుద్ధ మొనర్చి విజృంభించి వానిని వధించుట నిశ్చయము. నామనస్సుయొక్క యాథార్థ్యము

నెఱుంగుదువేని, నన్ను విశ్వసింతువేని భీమార్జునులను నావశమున
నిల్లడపెట్టుమనఁగా, నాజగన్నాథుపలుకులకు సంప్రహృష్టముఖులై యున్న
భీమార్జునులను వీక్షించి యుధిష్ఠిరుం డచ్యుతున కిట్లనియె. వాసుదేవా!
నీ కిట్లు వచింపం బోలునే? మేము లాతివారమే? పాండవు లెల్లప్పుడును
నీకు వశులు. వారికి నీవ దిక్కు. నిన్నాశ్రయించి మేలుపొంద నున్న
వారు. నీ వాడిన దంతయుఁ దథ్యము. ఎవరిని నీవు చిన్నచూపుతోఁ
జూచెదవో వారలు తత్క్షణము గతశ్రీ లగుదురు. జరాసంధుం డిపుడు
చచ్చినవాఁడే. రాజులందఱును ముక్తులే. నీయాజ్ఞకు బద్ధుఁడనైతిని.
నేను రాజసూయయాగము నొనర్చితి ననియే తలంచెద. శౌరిలేని
పార్థుఁ డుండఁడనియు, పార్థుఁడులేని శౌరి లేఁడనియు, వీరిరువురు
కూడిన సాధింపరాని కార్యమొం డెద్దియు లేదనియు నేనెఱుంగుదును.
వీరు తోడ్పడఁగా భీమసేనునకు నసాధ్యం బెద్దియును లేదు. నీతి గల
వానిచేఁ బన్నఁబడిన సేనావ్యూహము శత్రువుల కభేద్యమయి, వాని
కార్యమును సాధించు. నీతిపరునిచేఁ బ్రయుక్తమయిన బల మంధమై
నను జడమైనను సక్రమముగ నడుచును. నీరు పల్లమునకుఁ బాఱు
చాడ్పున, జాలరులు తఱుగఁబాఱిన నీటిని జిన్నకాలువలకుఁ బాఱించి
చేపల నెల్లఁ బట్టువిధమున నీతిపరుఁడును సమర్థుఁడును నగు సేనా
నాయకుఁడు సైన్యమును విజయప్రదము లగు దారులకు నడిపించును.
సమస్తనీత్యుపాయముల నెఱింగిన నీవు బోధించుమార్గముల నవలం
బించుమాకుఁ గార్యసిద్ధి యఱచేతిబదరమై యుండును. ని న్నాశ్రయించి
నీకు భక్తులైనవారికి సాధింపరానికార్యము లుండునే? కావున నిన్నర్జు
నుండును,వానిని భీముండును ననుగమింతురు. నయము జయము బలము
సమకూడుచున్నప్పుడు విక్రమించినచోఁ గార్యము ఫలవంతము కాకుం
డునా? ఇవ్విధమునఁ జేయుటవలన మాకుఁ బ్రజ్ఞ, బలము, విజయము
నేకూరుచున్నది. కార్యార్థంబుగఁజని విజయులరై రం డని కొట్టికొ
నకుఁ దమ్ముల నంపుటకు సమ్మతించెను.

## శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధపురమునకు వెడలుట

అవ్విధమున శ్రీకృష్ణభీమార్జునులు యుధిష్ఠిరుసెలవును బొంది
వ్రతస్నాతకులైన విప్రులవేషమును దాల్చి, సుహృదులు మనోజ్ఞమైన

వార్తలఁ గొనియాడుచుండ నింద్రప్రస్థముఁ దఱలి పద్మసరస్సును, గాల కూటమును, గండకిని, మహాశోణమును, సదానీరను, సరయువు నతిక్రమించి, క్రమముగాఁ బూర్వకోసలములను, మిథిలాపట్టణమును గడచని కృతమాలాచర్మణ్వతీనదులం దాఁటి, గంగను శోణను లంఘించి, తూర్పుదెస నిత్యప్రయాణములు సలిపి మగధదేశముఁ బ్రవేశించి గోరథగిరి నెక్కి మగధరాజ్యముయొక్క నాయకమణియో యను నట్లుండు రాజధానిం జూచుచు, జ్ఞాతిరాజులఁ జెఱ నుంచి యున్న యా జరాసంధుక్రూరంపుఁ జేఁతలు వారిమనస్సు నొకవంకఁ దపింపఁ జేయుచుండ జ్ఞాతికార్యతత్పరులై సూర్యచంద్రప్రభలతోఁ దేజరిల్లుచున్న వారిశరీరకాంతులు చూచువారికన్నుల మిఱుమిట్లు గొల్పుచుండ, జరాసంధుఁ డిఁకఁ జచ్చె ననియే తలఁచుచు భీముఁడు ముందు దారి నడుచుచుండ, హితులును బరాక్రమవంతులును భగవంతులు నగు నాకృష్ణు లిద్దఱును లోకులకు ధర్మకామార్థముల నొడఁగూర్పుతలంపు గొనినవారై తమలోఁ దాము మాటలాడుకొనుచుఁబోవుచుండ, నప్పు డర్జునునిఁ జూచి శ్రీకృష్ణుం డిట్లనియె. పార్థా! చూడు మీపట్టణ మెంత విభవసమంచితమై, నీటివసతిగలదై, యెటుచూచినను బశుబృందసమృద్ధంబై, దివ్యభవనాలంకృతంబై యొప్పారుచున్నదో? ఈపట్టణమును వైహార, వరాహ, వృషభ, ఋషిగిరి, చైత్యకంబు లను పర్వతంబులైదు చుట్టికొని కాపాడుచుండుటచే నీపురి గిరివ్రజంబను పేరితో శత్రువులు చొచ్చుట కెంతమాత్రము సందు లేక వెలయుచున్నది. పూర్వకాలమున నీపట్టణమున గౌతముఁ డౌశీనరి యనుశూద్రవనితతో నిష్టోపభోగముల సుఖించుచు దానియందుఁ గాక్షీవంతుఁడు మున్నగు శూరులైన కుమారులం బడసి తృప్తుండై యుండె. ఆగౌతమఋషియనుగ్రహమున నీపురము నొరులు ప్రవేశింపనేరరు. దీనిచుట్టు సుందరమణీయములగు వనములలో నానాదేశాధీశులు విలాసార్థము వచ్చి విహరించుచుందురు. ఆవనములు సొంపు పెంపారు నానావృక్షగుల్మలతాదులతోఁ గూడికొని విలాసవిహారములకు యోగ్యము లగుటం జేసి, యంగ వంగ దేశపురాజులు నిత్యోత్సవముల నానందముం బొందుచుందురు. ఇందు భీకరములైన యర్బుద, శక్రవాపి, స్వస్తిక, మణినాగు లను పాపఱేఁడు

లున్నవారు. ఈ ప్రదేశములయందు సకాలవర్షములు కురియుచుం
డునట్లు తొల్లి యిక్ష్వాకుపుత్త్రుండగు మను వనుగ్రహించియుండె.
కౌశిక,మణి,మణిమంతులు మగధదేశపువారినిఁ జల్లనిచూపులతోఁ జూచు
చుందురు. ఈ ప్రకారము నానావిధసౌకర్యములతో వెలయుచుండు
నీపురమును రాజధానిగాఁ జేసికొని జరాసంధుఁడు తనకంటె నధికుండు
భూలోకమున నన్యుండు లేఁడని మదించియున్నవాఁడు. మనమిప్పుడువీని
పోతరము నడపవలయునని భీమార్జునుల కిరువురికి నుత్సాహముగల్పిం
చెను. ఇట్లు వారు మువ్వురును మాటలాడుకొనుచుఁ బోవుచుండు వారు
గిరివ్రజము నావరించియుండుకొండలలోఁ జైత్యకమనుదానిని సమీపించి
యాకొండ నెక్కిరి. అచ్చోట శత్రువు లెవ్వరైనఁ బట్టణమును బ్రవేశించుచోఁ,
దనంతట ధణధణ యని మ్రోగు భేరులు మూఁటిని జూచిరి. ఆభేరులు
పూర్వము మాగధులచే మనుష్యమాంసమును భుజించుచు, లోక
మున కహితమాచరించుచుండిన ఋషభనాయకరాక్షసునిఁ జంపి వాని
చర్మమున నిర్మింపఁబడియెను. కృష్ణాదులు తాము పురము ప్రవేశింపఁగనే
యాభేరులు తమంతన మ్రోగునని వానిం బగులఁగొట్టిరి. కాని, దాని
సమీపమున నాయుధపాణు లగు వీరభటులుండుటను వా రాద్వార
మునఁ బురప్రవేశమును జేయుట కొల్లక చైత్యపర్వతశిఖరంబుఁ బగులఁ
గొట్టి పురప్రాకారమును దాఁటి, యాద్వారంబునఁ బురమును
జొచ్చిరి. తత్పూర్వము వేదపారగు లగు రాజపురోహితులు కొన్ని
యపశకునంబులఁ గని వానికి శాంతిఁ జేయ నిశ్చయించి రాజునకుఁ
దెలిపియుండ, రాజును కృతస్నానుండై యుపవసించి దీక్షఁ బూనియుండె.
అప్పు డస్నాతక బ్రాహ్మణవేషధారులును, విపులాంసులును, నరిందము
లును నగు శ్రీకృష్ణభీమార్జునులు నగరముయొక్క సొంపును వీక్షిం
చుచు, మాలాకారునింటికిఁ జని బలవంతముగఁ బుష్పమాలికలను
గొని ధరించి సువాసన గల గంధ మలంది ప్రకాశించుచు, గిరివ్రజపౌర
జను లాశ్చర్యపడి చూచుచుండ నావులమందను బ్రవేశించు హైమవత
సింహంబులం బోలె బ్రాహ్మణులకుమాత్రము సులభోపాయముగం బ్రవే
శింప నర్హమైన రాచనగరుం జేరి పరిచారకులయొక్కయు, నధికారుల
యొక్కయుఁ, బురోహితబ్రాహ్మణులయొక్కయు సమూహముతోఁ

గ్రిక్కిఱిసియున్న మూఁడుకక్ష్యలం దాఁటిపోయి యందుండు జరాసంధుం గాంచిరి.

అంత జరాసంధుం డేదేశమునుండియో సత్కారార్హులైన బ్రాహ్మణులు వచ్చిరని తలపోసి, వారి కెదురేగి యర్ఘ్యపాద్యాదుల నొసంగి విధ్యుక్తముగఁ బూజింప సమకట్టఁగా, వారు వానిపూజలం గొనరైరి కొంతసేపు వారు పలుకుటయును మాని యూరకుండిరి. అప్పుడు వారిలో శ్రీకృష్ణుండు మౌనమును మాని జరాసంధునితో నిట్లనెను. నరేంద్రా! వీ రిప్పుడొకనియమమున నున్నవారు. అర్ధరాత్రమువఱకు నియమాంశమైన మౌనమును ధరించియుందురు. పిదప నీతో మాటలాడుదు రనఁగా, రా జట్లయ్యెనేని వీరినియమాంతమున వీరి నారాధించెద నని వారిని యజ్ఞశాలకుఁ జేర్చెను. అప్పుడర్ధరాత్రము కాఁగా వెంటనే జరాసంధుండు స్నాతకులకుఁ బూజల నొనర్చుట కేతెంచెను. తనయింటి కర్ధరాత్రమున స్నాతకులు వచ్చినను నావేళకు వారి నతిశ్రద్ధతోఁ బూజించునియమముగల యాజరాసంధుండు మున్నె వచ్చియుండిన యాస్నాతకుల నెఱింగియుండియు,వారికప్పుడు పూజావిధానములను దా నొనర్పలే దని తెలిసియుండియు వారిని మఱచునే? కావున నాయర్ధరాత్రివేళ యజ్ఞశాల కేతెంచి యాస్నాతకుల నుచితాసనములఁ గూర్చుండ నియమించి వారితో నిట్లనియె. అయ్యలారా! స్నాతకు లగు విప్రులు పుష్పమాలికలను ధరింపరు. పరిమళసుగంధముల నలంద రని విందును. మీరీపుష్పచందనముల ధరించియున్నారు. మీభుజముల యందు ధనుస్సును మోయునప్పు డల్లెత్రాటియొరపిడి గలిగి కాచిన కాయ లేర్పడియున్నవి. చైత్యకగిరిశిఖరమును బడఁద్రోసి నాపట్టణమును బ్రవేశించునపుడు, పట్టణమును సాధారణద్వారమునఁ బ్రవేశింపక ద్వారము కానిద్వారంబునఁ బట్టణముం జొచ్చితిరి. మిమ్మును జూడ వేషముచే విప్రత్వమును, దేహదార్ఢ్యముచే క్షత్రియత్వమును నాకుఁ దోఁచుచున్నది. మీ రెవ్వరు? యథార్థమును బలుకుఁడు. సత్యమున రాజులు శోభిల్లుదురు. బ్రాహ్మణత్వము మాటలచే వెల్లడియగును. క్షత్రియత్వము కర్మలచే వెల్లడియగును. ఈమీరొనర్చిన కార్యములచే మీరు క్షత్రియులుగా నూహింపఁబడుచున్నారు. మీయాగమనమున మీరు

చేయఁదలచినకార్యమును నాకుఁ జెప్పుఁడు. ఆద్వారమునం బురప్రవేశ మొనర్చి నాసమక్షమున కేతెంచి నాయిచ్చుపూజలను గొన కున్నారు. మీ యాగమనకారణము, మీరు చేయ నెంచినపనిని నాకుఁ దెలుపుఁడు.

ఇవ్విధమున జరాసంధుం డడుగఁగా వాక్యవిశారదుఁడగు వాసుదేవుఁడు స్నిగ్ధగంభీరవాక్యములతో వాని కిట్లనియె. బ్రహ్మ క్షత్రియ వైశ్యవర్ణములవారు ముగ్గురును స్నాతకత్వమును బొందుట కర్హులు. ఇది యీమూఁడువర్ణములవారికి సామాన్యధర్మము. వానిని వా రాచరించుటలో నొక్కొకవర్ణమువారికిఁ గొన్నిభేదము లున్నవి. అందు విశేషధర్మముల నాచరించి క్షత్రియుఁ డఖిలసంపదల నొందును. మేము క్షత్రియస్నాతకులము. మేమాచరించు వ్రతమహిమమున బ్రాహ్మణులం బోలెఁ గానఁబడుచున్నవారము. గంధమాల్యములయందు లక్ష్మి నివసించుఁ గావున వానిని మేము ధరించితిమి. అద్వారమున శత్రుగృహమును, ద్వారమున మిత్రగృహమును బ్రవేశించుట విద్వాంసులధర్మము. కావున శత్రువగు నీయొక్కగృహప్రవేశము నద్వారమున నొనర్చితిమి. నీయొద్ద కిప్పుడు మేము కొండొకకార్యోద్దేశంబున నేతెంచినవారము. ఆకారణమున నీ విచ్చుపూజలం గొనమైతిమి. బ్రాహ్మణులు మాటలలో శూరత్వమును జూపుదురు. ఉత్తమక్షత్రియులు కార్యములలో శూరత్వమును దెలుపుదురు. మాకు బాహువులయందు శూరత్వము గలదు. ఇవ్విధమునఁ దొల్లి క్షత్రియులకు భుజములయందు వీర్యము గల్గించియున్నవాఁడు. మాశౌర్యబలములఁ జూడఁ దలంతువేని యవశ్యము చూడుమనఁగా మాగధుండు యాదవున కిట్లనియె. ఆర్యులారా! నే నిప్పు డెంత యాలోచించినను మీయందు నాకు ద్వేషము గన్పట్టకున్నది. కావున వైరము జనింప లేదు. మీకు నే నెట్టి యపరాధమును దొల్లి చేసియుండుఁగను. అట్టి నన్ను మీ రేల శత్రునిఁగాఁదలంచుచున్నారు, నిరపరాధుని శత్రునిఁగా భావించుట ధర్మవిరుద్ధము కాదా ? అట్లు భావించినచో నరకప్రాప్తి యగు. రాజులు తమధర్మమును గ్రమముగా నాచరించు టుత్తమము. అదివారికి సకలకార్యములను సాధింపఁ జేయు. అవ్విధమున నే నుత్తమక్షత్రధర్మమున నడచుచుండఁగా

నిష్కారణముగ నన్ను మీరు శత్రునిఁగా భావించుట ధర్మవిరుద్ధంబు. అనఁగా వానికి మధుసూదనుం డిట్లనియె. కులధర్మమును నెఱవేర్పఁ బూని యుండు నొక్కమహానీయునియాజ్ఞమెయి మేము మువ్వురము నీతోఁ బోరుసల్ప నేతెంచితిమి. వారివారి దేశములలో సుఖముగ నున్న నిరపరాధులగు రాజులను నిష్కారణముగఁ జెఱఁబెట్టి క్రూరకర్మమును దలపెట్టియున్న నిన్ను నిరపరాధుఁ డని లోక మనునే? రా జను నామమును దాల్చినవాఁడు శత్రురాజులపై దండెత్తి వారి నోడించి తెచ్చి చెఱఁబెట్టి నిత్య మొక్కనిఁగా భూతనాథున కర్పింప నెంచి యారాజులకుఁ బ్రాణాంత మి ట్లొనర్చునే ? ప్రపంచమునందు నీవు తప్ప నన్యనృపాలుఁ డెవ్వం డైనను దనుంబోలిన మనుష్యుం డే యగువాఁడును, భూపతియైన వాఁడును నగువానిని నిర్బంధమునఁ దెచ్చి చెఱసాలయం దుంచి తన యిచ్చమెయి నిట్లు రుద్రున కొక్కొక్కరాజునుగా బలియిచ్చువాఁ డెం దేనిఁ గలఁడే? నిన్ను నీవు ధర్మాత్ముం డంటివి. ఇంతకన్న ఘోరమగు నధర్మంబు వేఱొండు గలదే? కావున ధర్మమును రక్షించునిమిత్తము మహాపాపాత్ముండ వగు నిన్నుఁ బోరిలో వధింపవచ్చితిమి. మనుష్యుఁ డేయే కాలములలో నే యే కర్మములం జేయునో యాయా కాలములలో వాఁ డాయాకర్మఫలముల ననుభవింపవలయును. ఉత్తమక్షత్రియులు సమరయజ్ఞమును జేయుట కుద్యమించి వీరస్వర్గమును బొందుదురు. నీచే బాధితులయినవాని కుపకార మొనర్చుటకును, జ్ఞాతులను సంరక్షించుటకును, జ్ఞాతివధమును జేయుటకు నుపక్రమించియున్న నిన్ను వధింపవచ్చితిమి. నాకంటె నధికులైన రాజు లీభువిలో లేరని నీవు గర్వమునఁ దలంచుచున్నావు. అట్లు తలంచుట నీబుద్ధివిప్లవము తప్ప వేఱు గాదు. శూరుఁడై రణము సలిపి వీరస్వర్గమును నవశ్యమైనదానిని బొందవలయు నని యేక్షత్రియుండు గోరఁడు ? క్షత్రియులు ప్రపంచమును జయింపవలయు నని కోరుట, రణదీక్షను వహించుట యనెడి రెండును వీరస్వర్గమును బొందుట కనియే తలంపుము. పరబ్రహ్మవిచారమును, మహితయశస్సు నార్జించుటయును, విస్తారమగు తపోనుష్ఠానమును, యుద్ధమున మరణమును స్వర్గప్రాప్తిహేతువులు. కావున నుత్తము లగు క్షత్రియు

లును శూరులును ధర్మయుద్ధమును సలిపి వీరమరణమును బొంది, నాక మునకుం బోయి యింద్రునితో సుధర్మసభయందు సరసవినోదంబులం దేలి యాడుచుందురు. రాజులలో నీవే శూరుండ వని గర్వింపకుము. నీకంటె శూరులైన రాజు లనేకులున్నా రని తెలిసికొనుము. కులవృత్తములను బాగుగ నెఱింగినవాఁడు నీవలె గర్వింపఁడు.

ఇవ్విధమునం దొల్లి గర్వించిన దంబోద్భవుఁడు, కార్తవీర్యుఁడు, నుత్తరబృహద్రథుఁడు ననియెడి వీరు ముగ్గురును దమకుం దామె చేటుం దెచ్చుకొని వినాశమును జెందిరి. నీవును నిక్కాఁడు పుత్త్రమిత్త్రాదులతోఁ జెడకుము. నామాట లాలింపుము. చెఱఁబెట్టిన రాజుల విడిపింపుము. కాదేని మాతోడఁ బోరి యంతకాలయమున కరుగుము. మేము నీతోఁ బోరాడుటకు వచ్చినవారము. నేను హృషీకేశుండ నగు శౌరిని; వీరు కౌరవసింహు లగు భీమార్జునులు. నామాటలను విని రాజులను విడిచిపుచ్చి మేలుగాంచుము. కాదేని, పోరికి సన్నద్ధుండ వగుము. అని చెప్పఁగాఁ గ్రోధసంరక్తనయనుండై జరాసంధుం డిట్లనియె. నే నీరాజులనెల్ల విక్రమంబునం బోర జయించి తెచ్చినవాఁడ. వీరిని నాయిచ్చవచ్చినట్లు నోనర్చుటకు నాకు సర్వాధికార మున్నది. మఱియును దేవకార్యార్థ ముద్దేశించి శూరుండనై తెచ్చిన వీరిని మీ కిప్పుడు వెఱచి నేను విడుతునే? మీరు నాతో సేనాసమన్వితులయి పోరాడఁ బూనుదు రేని, యట్లొనర్పుఁడు. కాదేని యొక్కొక్కరుగఁ గాని, యిరువు రొక్కొక్కసమయమునఁ గాని, యదియుంగాక ముగ్గు రేకకాలమునఁ గాని నాతోఁ బోరాడఁ దలంతు రేని పోరాడుటకు నేను సంసిద్ధుండ నని చెప్పి, తన పుత్త్రుఁడు సహదేవునకుం బట్టాభిషేకమును జేసి తనకు ముఖ్యమంత్రులగు హంసడిభకులు లేకపోయిరి గదా యని కొంత వగచి, పదంపడి వీరోద్రేకము వెలి కుఱుకఁగా యుద్ధమునకు సమకట్టి నిలుచుటయు, వాసుదేవుం డితనిని జంపువాఁడు భీముం డని విధిప్రేరణము నెఱింగినవాఁడగుటం దాను వానితో మల్లయుద్ధమును జేయ నొల్లక మాలో నీయిచ్ఛవచ్చినవానిని గోరికొని యుద్ధముం జేయం బ్రారంభింపుము. అని చెప్పఁగా నాజరాసంధుండు బలగర్వమున భీముం గోరికొనియె. అప్పుడు జరాసంధుండు తనపురోహితుఁడు స్వస్త్యయనము గావింపఁగా, గోరో

జనాదిమంగళద్రవ్యములఁ గొని, శరీరరక్షకములగు నితరపదార్థములతోఁ గూడికొని కిరీటముం దీసి తలవెంట్రుకలను జక్కఁగా ముడివైచి వీరోద్రిక్తుండై యుద్ధమున కెదుర నిలువఁగా, భీమసేనుండు తనకు జగన్నాథుండు స్వస్త్యయనముఁ జేయఁగా నాతనియాశీర్వచనబలమును బొంది సమరాయత్తుఁడయి భుజము లప్పళించుకొని జరాసంధున కెదుట నిలిచెను.

## భీముఁడు జరాసంధుని మల్లయుద్ధమునఁ జంపుట

అంత నా జెట్టిద్దఱును మొట్టమొదటఁ బాదాభివందనసూచకంబుగా మొగ్గలు వాలిరి. పిదప నొండొరులచేతులం బట్టికొనిరి. కచ్చలను విడిల్చిరి. మొలనూళ్ళ ద్రెంచిరి. చేతులచే నొకరిభుజంబుల వేఁటొక్కరు త్రోచిరి. అంగములం బెనఁగునొనునట్లు పెనంగిరి. పరస్పరభుజంబులం దట్టికొనిరి. కిలారింపు లొనర్చిరి. హస్తలాఘవ మచ్చుపడఁ గానెల బిగియించిరి. మిణుఁగురులు రాలునట్లు కుత్తుకల నదిమిరి. చెక్కిళ్ళఁ జిదిమిరి. పరస్పరశరీరములం బట్టి నేలం ద్రోసిరి. పాదఘట్టనంబులఁ బరస్పరమర్మస్థానముల నుఱుము సేసిరి. వ్రేటులు దొలఁగ భుజములతోఁ బెనంగిరి. ఉరమ్ము నురమ్మున పెటిల్లు పెటిల్లు మనఁ దాఁకిరి. మదించినయేనుఁగులంబోలెఁ గరములఁబీడించికొనిరి. కన్నులనుండి యగ్నికణంబులు రాలునో యన్నట్లొకరి నొకరు చుఱచుఱం జూచిరి. ఇవ్విధంబునఁ బరస్పరమల్లయుద్ధపాండిత్యము నొకరికొకరు వెల్లడించుచు, సటల నాడించుచుఁ బోరాడుమృగేంద్రద్వంద్వంబుఁ బోలె నొకరి నొక రురవడించి యీడ్చుచుఁ, బడఁద్రోయుచు, లేచుచు, ఱాలవ్రేటులఁబోలె దృఢప్రహారములం గొట్టుచు, నొకరి నొక రొడిసి పట్టుకొని నేలయందుకఁడంగ నీడ్చుచుఁ బోరుచుండఁ బురములో నున్న బ్రాహ్మణులును వైశ్యులును ననేకక్షత్రియులును శూరులగు శూద్రులును వృద్ధస్త్రీలును ననేకులు వచ్చి, పరస్పరజయకాంక్షులై ఘోరంబుగాఁ బెనఁగుచున్న భీమసేనజరాసంధులఘోరయుద్ధముం జూచి, యాశ్చర్యపడుచుండిరి. కొందఱు నివ్వెఱపాటు నొందిరి. అప్పటివారియుద్ధము మహేంద్రవృత్రయుద్ధముం బోలి యుండెను. అవ్విధంబున వారు కార్తికశుక్లపాడ్యమినాఁడు పోరుట కారంభించి త్రయోదశినాఁటి

యుద్ధమున భీముప్రేటులచే జరాసంధుఁడు డయ్యుటం దెలిసి, చతుర్దశి నాఁటిసాయంసమయమున జరాసంధు నిర్వీర్యుంగా నెఱింగి, జగన్నాథుండు భీమసేనుం బిలిచి యిట్లనియె. బకాంతకా! నీశత్రుబలతేజంబులు తగ్గినవి. విజృంభించి పోరుము. పోరుకు ముగింపుము. శత్రువును వధింప నిదియె సమయము. అని యుత్సాహపూర్ణవచనములఁ బలుకఁగా, నామారుతి యతిబలపూరితుండై విజృంభించి శత్రుని నిర్జించుటకుఁ బూనుకొనియె. అంత జనార్దనుం డూరకుండక వెండియు భీమసేనుం జీరి యిట్లనియె. మారుతీ! నీతండ్రి యగు ప్రభంజనుని స్మరించి నీబలమును వృద్ధిచేసికొని శౌర్యముతో వేగంబ శత్రుభంజనము గావింపు మని ప్రోత్సాహవచనము లాడఁగా, నావృకోదరుండు వృకంబుమాడ్కి రౌద్రంబు మెఱయ నాబార్హద్రథు నతిరౌద్రముతో నొడిసిపట్టి మోకాళ్లనదిమి వివశుఁజేసి, పాదములం గేలంబట్టికొని గిరగిర నూఱుమార్లు త్రిప్పి ముక్కులం గన్నుల నెత్తుటిధారలు గాఱుచుండఁ గ్రిందఁ గొట్టి, వానివీఁపుఁ గాలఁ దన్ని, కాళ్ల రెంటిని ఫెళ్లుమనఁ గట్టియల విఱుచునట్లు విఱిచి వాని విగతాసుఁగా నెఱింగి వీరావేశంబున సింహనాదంబు భూనభోంతరంబు నిండునట్లు చేయఁగా, నాకిలారింపునకుఁ బౌరులు వెఱచఱచిరి. హిమవంతంబు బ్రద్దలయ్యెనో యని తలంచిరి. స్త్రీలగర్భములు స్రవించినవి. అంత నాజరాసంధు శవమును గాళ్లఁ బట్టి జరజర లాగికొనుచు వచ్చి రాజగృహద్వారంబునఁ బడవైచి భీముండు క్రోధారుణితలోచనుండై యుండె.

## శ్రీకృష్ణభీమార్జునులు చెఱలో నుండురాజుల విడిపించుట

అంత దేవకీనందనుండు భీము నాశ్వాసించి క్రోధమును జల్లార్చి, మువ్వురును బురమునం దున్న చెఱసాల కరిగి, యందుఁ జెఱపట్టిన రాజుల నందఱను విడిచిపుచ్చి, ధ్వజములతో విరాజిల్లుచుండు జరాసంధు రథమును దెప్పించి యందు భీమార్జునులం గూర్చుండ నియమించి తాను సారథ్యమును వహించి పురము వెలుపలిప్రదేశమున కరిగెను. ఆరథమును బూర్వ మింద్రోపేంద్రులు తారకాసురసంహారకాలమున నారోహించియుండిరి. ఆరథమును మహేంద్రుఁడు వసురాజున కొసంగెను. వసురాజు బృహద్రథున కొసఁగెను. తండ్రి యగు బృహద్రథుని

వలన జరాసంధు నారథంబు సేరె. ఆరథము తనసహజకాంతులచే యోజనప్రమాణమార్గము దివ్యప్రకాశమును గలిగించుచుండు. అట్టి రథమున నాముప్వురు సారథిరథికులై త్రేతాగ్నులవలె మెఱయు చుండిరి. అప్పుడు శ్రీకృష్ణుండు గరుడునిఁ దలంపఁగా నామహానీ యుండు నాకంబునం దుండి తనబలవర్గ మగుభూతగణంబులతోఁ గూడికొని యేతెంచి జగన్నాథునిఁ బని యడుగ, నామహానీయుండు గరుడుని నాతనిభూతగణములతోఁ దనయారథముపై ధ్వజమున నుండు మని యాజ్ఞాపించె. అంత గరుడుండు భగవన్నియమనమున కియ్యకొని యట్లు గావించె. గరుడధ్వజముతోఁ బ్రకాశమానమైన యా రథము మధ్యందినమార్తాండునివడువున వెలుఁగ నారంభించెను. అంత గిరివ్రజములోనివిప్రులు విజయులగుశ్రీకృష్ణభీమార్జునుల నాశీర్వదించిరి. ఇతరజనులు వారిని మిగుల సత్కరించిరి. చెఱయందుండి ముక్తు లయిన రాజులు తమబంధవిమోచనమునకుఁ గారకుం డగు వాసుదేవుని సద్గుణ గణంబుల నుతించి యిట్లనిరి. 'జగన్నాథా! జగంబుల రక్షింప నున్న నీ కీకార్యం బెపాటి? నీవు తలంచినంతమాత్రమున నీ శత్రువులు హతులు కారే? నీకసాధ్యం బొం డీజగంబునఁ గలదే? నీదయచే దుఃఖకర్దమమునఁ బడియుండినమే మీజరాసంధతటాకమునుండి వెలువడితిమి. నీకటాక్ష మున గతక్లేశుల మైతిమి. సంసారబంధమును వీఁడి మోక్షముం జెందు యోగికైవడి, మే మీనాఁ డీకారాబంధమును వీడి యపారకృపాతరంగిత హృదయుఁడవగునిన్నుఁ జేరఁగంటిమి. మాకెద్దివిధింపఁదలంచియుండువో దానిని శిరసా వహించి యొనర్చెదము. మాకుఁ బ్రాణదాతవు. భయ త్రాతవు. సద్గురుండవగు నీ వేడుగడవు. నీ కొసఁగరానిపదార్థం బన్యంబు మాయొద్ద నేదియును లేదు' అని విన్నవించిరి. అప్పుడు భగవంతుండు వారిమనవి నాలకించి వారు జరాసంధుచేఁ బడినబన్నములకు వారి నూఱ డించి పరమధార్మికుం డగు యుధిష్ఠిరుండు సామ్రాజ్యమును వడసి రాజ సూయంబు చేయ నున్న వాఁడు. ఆతనికి మీరుపకార మొనర్పవలయును. అతండు బొందఁగలసామ్రాజ్యమునకు మీ రెల్లరు తోడ్పడవలయును. అని చెప్పఁగా, నారాజు లంద ఱామాటలకు సంతోషించి యుధిష్ఠిరు నకుఁ గడుంగూర్పువారై భగవదాజ్ఞానుసారులై యనేకరత్నములను

సమర్పింప వాని నన్నిటిని గ్రహించి వారియెడ దయఁ దాల్చె. అటు పిమ్మట జరాసంధునికుమారుండు సహదేవుం డమూల్యము లగు రత్నములను బళ్లెరమునం దుంచుకొని పురోహితుండు మున్ను నడువ వచ్చి, మిక్కిలి వినయముతో మ్రొక్కి నిలుచుండఁగా, శ్రీవాసుదేవుం డా రాజకుమారున కభయదాన మొసఁగి యాతనిని మగధరాజ్యమున కభిషిక్తుం జేసె. యాతండు తెచ్చిన రత్నముల కానుకను బ్రీతితో గ్రహించి, కడగంటిచూపున నాతని నాదరించి నగరునకుఁ బోవుట కనుజ్ఞ నొసంగెను. పదంపడి సహదేవుండు భీమార్జునులమన్ననలఁ బొంది నగరుసొచ్చె. అంత జనార్దనుండు భీమార్జునులతోడ వేగవంతము లగు రథ్యములఁ బూన్చిన జరాసంధురథంబు నారోహించి తముచేఁ జెఱనుండి విడిపింపఁబడినరాజు లందఱు వెన్నంటి రాఁగ, వేగవంత మగు ప్రయాణమున నింద్రప్రస్థంబు సేరి యుధిష్ఠిరుల గాంచి నమస్కరించి భీమార్జునుల నాతని కప్పగించి, 'మహాత్మా! అదృష్టవశంబున నీతమ్ములు సుఖులుగ నీయొద్ద కరుదెంచిరి. భీముఁడు జరాసంధుని మల్లయుద్ధంబున హతు నింగాఁ జేసె. వానిచేఁ జెఱసాలయం దుంపఁబడి భూతనాథున కర్పితులగుటకు సంసిద్ధులైనరాజులు వీరె. చెఱసాలయందుండి వీరు విముక్తులయిరి.' అని యారాజుల నెల్ల శౌరి యుధిష్ఠిరునకుఁ జూపఁగా నాధర్మపుత్త్రుండు వాసుదేవునిఁ దనతమ్ములను కౌఁగిలించుకొని పరమానందమును బొంది, చెఱసాలనుండి ముక్తులయిన రాజులను యథోచితరీతి నాదరించి యుచిత సంభాషణముల నూఱడించి వారిని స్వస్వదేశములకుఁ బోవ ననుజ్ఞ నొసంగెను.

ఈప్రకారంబుగా వాసుదేవుండు భీమార్జునులచే మాగధుండైన జరాసంధునిఁ జంపించి వారిచేఁ బొగడ్తఁ గని, యుధిష్ఠిరధౌమ్యానుజ్ఞాతుండై జరాసంధుతేరెక్కి మిక్కిలి వేగమున ద్వారవతి కరిగె. అంతట నొక్కనాఁడు సవ్యసాచి యుధిష్ఠిరునితో నిట్లనియె. 'మహారాజా! మనభాగ్యవశమున నే నీదివ్యధనుస్సును, నగ్నిదత్తమయి స్వయం ప్రకాశమాన మైన రథమును, నప్రతిహత మైన యుద్ధసాధనములును, నక్షయంబు లగుతూణీరయుగళంబును గల్గియున్నందులకు ఫలంబుగా దిగ్విజయయాత్రకు సేనను సమకూర్చుకొని తరలి భాండాగారమును

ద్రవ్యసంపూర్ణ మొనరించెద. నీయాజ్ఞకు వేచి యున్నవాఁడ' నని చెప్పఁగా, యుధిష్ఠిరుం డా మాటలను బరమహర్షంబున విని తగుసేవను సన్మానపఱచి దైవజ్ఞులం బిలిచి సమరమునకుఁ దఱలునిమిత్తము శుభముహూర్తమొక్కదాని నిర్దేశించి, యామంగళదినమున శుభ కార్యములం జేయించి యుత్తరదిశకు ధనంజయునిం, దూర్పునకు భీమసేనుని, దక్షిణమునకు సహదేవునిం, బడమరకు నకులుం బంప వారు సర్వదేశములను జయించి బహురత్నరాసులను, విస్తారమగు ధనకనకములను నాధర్మరాజునకుఁ గానుకలుగాఁ దెచ్చి సమర్పించి రనఁగా, జనమేజయుండు వైశంపాయనునితో, 'మునీంద్రా! మా ముత్తాతలదిగ్విజయవృత్తాంతంబుల సవిస్తరంబుగా వినవలతుం జెప్పవే' యన నతని కామునిచంద్రుం డిట్లనియె.

## భీమార్జుననకులసహదేవులు దిగ్విజయము చేయుట

జనమేజయా! మీపెద్ద లంద ఱేకకాలమున సర్వదిక్కులను జయించిరి. యుధిష్ఠిరుం డింద్రప్రస్థపురంబున రాజ్యపాలనమును జేయుచుం దనపురమును సహభ్రాతుండై కాచియుండె. పెఱవారు సేనాసమేతులై దిక్కుల నుండు రాజుల నోర్పఁబోయిరి. వారిలో నర్జునుండు కావించిన విజయముల మొట్టమొదట నుడివెదను. గాండీవి యద్వితీయంబున సర్వాయుధసమన్వితంబైన తేరెక్కి యుధిష్ఠిరానుమతుండై నేల యీనిన తెఱంగున రథగజతురగపదాతివర్గముతోఁ గూడిన యపరిమితసేనంగూర్చుకొని యుత్తరదిశకు జైత్రయాత్ర వెడలెను. ఆయుద్యమమున మొట్టమొదటఁ బుళిందరాజుం దోడరి యుప్పయుద్ధమున నాతని నశ్రమంబున నోడించె. పదంపడి యానర్తకాలకూటకుళిందసుమండలదేశపురాజులను వేగమున వశవర్తులనుగాఁ జేసికొని విస్తారసేనాసమన్వితుఁడై, శాకలద్వీపరాజగు ప్రతివింధ్యు మార్కొనుటకు నిశ్చయించెను. శాకలద్వీపవాసు లసహాయశూరులు. మేటులైనధానుష్కులు సప్తద్వీపవాసులలో వారిశౌర్య మజయ్యము. అట్టిశూరులతో నిండిన సైన్యముగల ప్రతివింధ్యు నశ్రమంబున గెలిచి యచ్చటి శూరులు దన్నుఁగొలిచి రాఁగఁ, గిరాతులతోను చీనులతోను పరివేష్టింపఁబడిన ప్రాగ్జ్యోతిషమును జొచ్చి దాని కధిపతి యగు భగదత్తునితో నెనిమిదదినంబులు

మహాహావం బొనర్చెను. అంత భగదత్తుం డర్జునుని యపారధనుర్విద్యా విలాసంబున కాశ్చర్యపడి యాతనితో సఖ్యముం గోరి యిట్లనియె. 'విజయా ! ఈ నీధనుర్విద్యావిలాసంబునకు విస్మయం బందితి. ఇట్టి శౌర్య ప్రదర్శనంబుఁ జూపఁ బాండవుండ వగు నీకుఁ దక్క నన్యుల కెవ్వరి కేనిఁ దరంబె. మఱియు నీవు మహేంద్రనందనుండవు. నేను మహేంద్రసఖుం డను. మన మిరువురము సఖ్యముతో వర్తిల్లవలయును. నీ వెద్దానింగోరి యిట్లు యాహవోహోన్ముఖుండ వైతివి? అయ్యది నాకు సవిస్తరంబుగాఁ దెలుపుము. దానిం బ్రీతిపూర్వకముగ నొనర్చెదను' అని యడుగఁగా వాని కర్జునుం డిట్లనియె. 'భగదత్తా ! వినుము. కౌరవశ్రేష్ఠుండును, ధర్మజ్ఞుండును, సత్యసంధుండును, రాజర్షియు నగు యుధిష్ఠిరుండు విస్తార దక్షిణలచే విప్రులఁ దనియింప యాగదీక్షితుండై రాజసూయమును జేయ నిశ్చయించియున్నాఁడు. మఱియు నాయాగంబు బహుదక్షిణా సమన్వితంబు. అమ్మహాత్మునకు సామ్రాజ్యంబు నేకూరునట్లు విస్తారధన మొసఁగుము. నీవు నాతండ్రియైన మహేంద్రున కిష్టసఖుఁడవు గాన నా ముఖ్యోద్దేశమును వెల్లడించితి. ఇది దక్కనింకేదియు నా కభిమతంబు లేదు.' అనఁగా భగదత్తుం డర్జునునితో నిట్లనియె. 'బీభత్సా ! యుధిష్ఠిరుండు నాకు నీతోఁ దుల్యుండు. ఆమహనీయుం డొనర్చు యాగము నకై నీకోరిన ధనం బొసంగెద. ఇఁక నేమి చెప్పినం జేసెద.' అని చెప్పి విస్తారధనరాశి నొసంగఁగాఁ, గైకొని యచ్చోటు వదలి యంతర్గిరిబహిర్గిరుల్యపగిరులయం దుండు ప్రభువుల నవలీల నోడించి వారియొద్దనుండి కానుకలను గప్పములను నపరిమితధనములం గొని, వా రందఱును దనుఁ గొలిచి రాఁగ నులూకదేశముఁజొచ్చి, యచ్చోటి రాజు నులూకు నశ్రమంబున గెలిచి, యాతఁ డిచ్చిన ధనకనకమణిరుయువస్తువులను యుధిష్ఠిరునకుఁ గానుకలుగాఁ గప్పములుగాఁ గొని, మోదాపుర వామదేవ సునామోత్తరోలూకాధిపతుల నెల్ల నోడించి, వారివలన రాజసూయ యాగమునకై విలువగల యావస్తువులఁగొని, దేవప్రస్థమునకుఁ జనెను. దానియధిపతి యగుసేనాబిందుం గెలిచి విష్వగశ్వుఁడను ప్రభువును సమరమున నోడించి, మహారథికులగు పార్వతేయులతో నోహటించి, పరఁతవాసు లగు దస్యుల నోడించి, పౌరవుని జయించి, యుత్సవ సంకే

తాదులతో నుండు నేడుగణంబులవారిని గెలిచి, కాశ్మీరముం జొచ్చి యం దనేకప్రభువులను, దశమండలములతో లోహితునిఁ,ద్రిగర్త, ద్వార కోకనదరాజులను మదమడంచి, యభిసారిని నురగావాసి యగు రోచమానుని రణనిర్జితులం జేసి, నానావిధాయుధములతో రక్షింపఁబడిన సింహపురసవ్యాపురములను వశపఱచుకొని, సుహ్మాలుల గండడంచి, బాహ్లీక, దరద, కాంభోజాధిపతులవలనఁ బెక్కు కానుకలను గప్పములనుం గొని,యచ్చోటినుండి యీశాన్యదిక్కు దెస ముఱలి, లోహపరమకాంభోజరాజుల నణంచి, యుత్తరఋషికాధిపతితో విక్రమించి పోరి వాని నోడించి యాతనియొద్దనుండి శుకోదరతుల్యవర్ణములగు పెక్కుగుఱ్ఱములఁ గప్పంబుగాఁ గొని, హిమవత్పర్వతంబుఁజేరి యా ప్రదేశపుశూరుల నోడించి, శ్వేతపర్వతము నాక్రమించుకొని, కింపురుష ప్రదేశములఁ జొచ్చి వారికి రాజైన ద్రుముఁ డనువానిసుతునివలన మితిమీఱిన ధనరాసులంగొని, హాటకముంజొచ్చి దానిరాజగు గుహ్యకుల వలన విస్తారధనముం గొని. పదంపడి మానససరస్సును, ఋషికుల్యలను జూచి, హాటకదేశముయొక్క పార్శ్వద్వయనివాసు లగు గంధర్వుల యుద్ధమున నోడించి, వారియొద్దఁగాఁ దిత్తిరి కల్మాష మండూకంబు లను పేళ్లతో వెలయు నుత్తమాశ్వంబులను గానుకలుగాఁ గొని, యుత్తరకురుదేశములలో నున్నహరివర్షముం జొచ్చి దానిం జయింప యత్నింపఁగా, నాదేశమునకుఁ బ్రవేశించుస్థలమునం దున్న మహావీర్యులు, మహాకాయులు, మహాబలులు నగు ద్వారపాలకులు పార్థున కిట్లనిరి. 'పార్థా! ఈపురమును నీవు జయింప లేవు. ఇఁకను మఱలుము. ఇచ్చటికి నీవిజయము పరిసమాప్తమయ్యెను. ఈపురమును బ్రవేశించిన నరున కొక్కటియుఁ గంటికిఁ గానఁబడదు. నీశౌర్యమునకు మేము మెచ్చితిమి. నీవు మహాస్త్రవేదివి. మేటిధానుష్కుండవు. కాని మానుషదేహమున నీపురము సొచ్చుట యసాధ్యము. నీకువలసినదాని నిత్తుము' అని చెప్పుచుండు ద్వారపాలకులమాటల కర్జునుండు నవ్వి యట్లగునేని ధర్మపుత్త్రుండు సామ్రాజ్యముఁ బొంది రాజసూయయాగమును జేయుటకు యత్నించియున్నాఁడు. కావున నాపరమధార్మికునకు మీరు కప్పము నొసంగుఁ డనఁగా, వారు విస్తారధనమును వివిధరత్న

రాసులను దెచ్చి యిచ్చిరి. ఇంకను నానావిధము లగు కంబళములను, దివ్యవస్త్రములను, చిత్రవిచిత్రము లగు కృష్ణాజినములను గప్పములుగా నర్జునున కొసంగిరి. ఇవ్విధమున నసేకోత్తరాధిపతులను నోడించి యా దిగ్విజయముతో నింద్రప్రస్థము ప్రవేశించి ధనంజయుండు ధర్మజుభాండాగారమును దాఁ దెచ్చిన సకలపదార్థములతోను, చిత్రవిచిత్రవస్తువులతోను, గుఱ్ఱపుశాలలను గుఱ్ఱములతోను, భండారముల నుమహార్ఘమణిసంచయములతోను, నపరిమితధనరాశితోను సంపూర్ణముగ నొనర్చెను.

అట భీమసేనుఁడును నరాతులదర్పమడంపఁగల సైన్యముతోడఁ దూర్పుదెసకుఁ బోయి పాంచాలరాజుచే మన్నింపఁబడి, మిథిలాపతి యగు జనకునితో యుద్ధము సేసి యాతనిం గెలిచి, దశార్ణపతియైన సుధన్వుతో ఘోరయుద్ధ మొనర్చి వానిశౌర్యమునకు మెచ్చి వానిం దనసేనాపతిం గావించికొని, యశ్వమేథేశ్వరుండగు రోచమానుని వాని తమ్ములతోడ వశ్యులం జేసికొని, యాతని రాజ్యమునకు దక్షిణమున నున్న పుళిందాదుల వశపఱచుకొని, సుకుమారసుమిత్రుల నోడించి చేదిదేశమునకుఁ జనెను. అప్పుడు చేదిదేశాధిపతియు మహాశూరుండును నగు శిశుపాలుండు ధర్మరాజు నిజభుజబలంబున సామ్రాజ్యసంపాదనము గావించి రాజసూయంబు చేయ నుద్యమించియున్నాఁడను వార్తను విని భీముని మిక్కిలిగారవించి తనవీటఁ గొన్నిదినములుండఁగోరఁగా, భీముండు శిశుపాలు నభిమతప్రకారము కొన్నిదినములచ్చోటనుండి తఱలఁగా, శిశుపాలుండు మిక్కిలిభక్తితో రాజసూయమును జక్కఁగాఁ జరుపఁదలంచియుండు ధర్మజునియత్న మెఱిఁగి ప్రీతిగలవాఁడై సంతోషించి రత్నములతో వెలయుచుండు ధనరాసు లొసంగెను. అంత నచ్చోటు వాసి భీమసేనుండు పుళిందపురమున సుకుమారుని, కుమారవిషయమున శ్రేణిమంతుని, కోసలమున బృహద్బలుని, నయోధ్యాపురమున దీర్ఘప్రజ్ఞుని, కాశిరాజును, సుపార్శ్వుని, గజపతియైన సుధన్వుని, మత్స్యమాళవపతులను, గర్ణాట దక్షిణమల్లులను మర్దించి, హిమవత్పార్శ్వమున భల్లాటపతిని నోడించి, శుక్తిమద్గిరివాసుల నాక్రమించి, క్రథునిశౌర్యము నణంచి, మత్స్యములద దేశాధీశుల నోర్చి, మదధారగిరిని వశపఱచుకొని, సోమధే

యుల నోడించి, యుత్తరాభిముఖుండై వత్సదేశస్థుల నిర్జించి, భర్గాధిపతి
యగు నిషాదనాథుని మదమడంచి, మణిమత్ప్రముఖు లగు ననేకరాజుల
గర్వమడంచి, భోగవత్పర్వతమును స్వాధీనపఱచుకొని, శర్మక, వర్మక,
శక, బర్బరరాజులను నింద్రపర్వతవాసు లగు కిరాతాధిపతులను, సుహ్మ
ప్రసుహ్మాదులబలశౌర్యముల నుక్కడంచి, మగధదేశముఁ జొచ్చి
దండ దండధారుల నిర్జించి, గిరివ్రజమును బ్రవేశించి సహదేవుచే
సన్మానింపఁబడి యాతని నూఱడించి, యాతఁ డపరిమితధనరాసులను
గప్పముగ నీయఁగాఁ గొని వానిసాయము వడసి, కర్ణునితోఁ బోరి
జేతయై, మోదాగిరిపతిశౌర్యంబుఁ జూప వానిగర్వ మడిపి, పుండ్ర
పతియుఁ గౌశికీతీరవాసియు నగు పౌండ్రకవాసుదేవుండు శ్రీకృష్ణ
మూర్తితో నెల్లప్పుడు మత్సరించుచుండుఁ గావున నాతనిం బోరునకుఁ
జీఱి వానిం గట్టియేటుల నొప్పించి గెలిచి, వంగనాథుని, సముద్రసేను,
జంద్రసేను, ఖర్వటప్రభునిఁ, దామ్రలిప్తుని జయించి, యంతఁ దనివోక
సముద్రతీరవాసు లగు పెక్కురు మ్లేచ్ఛులను బోరునకు లాగి వారి
నందఱ నొకసమయముననే యోడించి వారివలన బంగారమ్ము, వెండి,
ముత్తెములు, పగడములు, చందనము, నానావిధపరిమళపదార్థములగు
నగురు మున్నగునవి, చిత్రవిచిత్రము లగు వస్త్రములు, కంబళాదులు,
రత్నములును గప్పముగాఁ గొని యింద్రప్రస్థమునకు మఱలి, తన తెచ్చిన
కానుకలను గప్పములను యుధిష్ఠిరునకు నేత్రానందము కలుగునట్లు
చూపి యన్నింటి నుచితస్థలములయందు యుధిష్ఠిరునాజ్ఞచేఁ బదిలపఱచి
యుంచెను.

అంతట సహదేవుండు యుధిష్ఠిరానుజ్ఞాతుండై తనవెంట గొప్ప
సేన వచ్చుచుండఁగా దక్షిణదేశమునకుఁ జైత్రయాత్రకుఁ బోయి శూర
సేన మత్స్యదేశములను జయించి, దంతవక్త్రసుకుమార సుమిత్రులఁ బలా
యితులం జేసి వారొసంగిన కప్పములను గానుకలుగఁ గొని, పిదపఁ బడ
మటిమత్స్యదేశముల నాక్రమించి, పటచ్చరదేశవాసుల నోడించిఁ
గోశృంగపర్వతనివాసులగు నిషాదులమద మడంచి, శ్రేణిమంతుని నవ
రాష్ట్రుని గెలిచి, కుంతిభోజుని సందర్శించి మిక్కిలి వినయముతోను
బ్రీతితోను నామామకుఁ దనరాక నెఱింగించిన, నాతండును బరమానంద

మున ధర్మరాజుసామ్రాజ్యము నంగీకరించి విస్తారధనము నొసంగఁగా దానిఁ గొని, పదపడి చర్మణ్వతీతీరమున నుండువాఁడును, వాసుదేవుతో విరోధించి యతనిచేఁ బోరున గెల్వఁబడినవాఁడును నగుజంభకుఁడను నతిబలవంతునితోఁ బోరి వానిం బలాయితుం జేసి, యంతట సేకాపరసేకులతో విక్రమించి పోరి వారిం గెలిచిన, వా రనేకరత్నములను ధనవస్త్రాదులఁ గానుక లొసంగఁగా గొని, భోజకటకపురముఁ బ్రవేశించి యచ్చోట భీష్మకు నెదిరించి దినద్వయంబు వానితోఁ బోరి యాతని యుద్ధవిముఖుం గావించి, నర్మదానదీతీరవాసులును నవంతిరాజులును నగు విందానువిందుల నోడించి, వా రిచ్చిన యనేకమణులను, గాంచనవస్త్రాదులను గొని, కోసలతటాధిపులను, గాంతారకులను, దూర్వకోసలులను, నాటకేయులను, హేరంబకులను బలాయితులం గావించి, ముంజగ్రామునొచ్చి దానియధిపతియగు మారుధుని గెలిచి, మహాశూరులగు నాచీనులను, నర్బుకులను, నచ్చటి సమీపారణ్యవాసు లగు నాటవికాధిపుల నందఱను నోడించి, వాతాధిపతిని, బుళిందులను, బౌండ్రకరాజులను నిర్జించి, యచ్చోటినుండి ప్రయాణమై కిష్కింధ నొచ్చి వానరరాజులగు మైందద్వివిదు లోహటించి సహదేవుసైన్యముపై కుఱుకఁగా, వారితో నే డహోరాత్రము లెడలేక పోరి తనశౌర్యముచేత నిర్జింపఁబడి వారు తన్ను మెచ్చుకొని విస్తారధనరాసులను గానుకగాఁ దెచ్చి యిచ్చిన వానిఁగొని, యచ్చోటినుండి మాహిష్మతీపురప్రవేశముఁ జేరి దానిరాజగు నీలునితోడఁ బోరాడుచుండఁగా నీలునకుఁ దోడ్పడి యగ్నిదేవుండు సహదేవుసైన్యమును దహింప నారంభించెను. అంత సహదేవుఁడు దిగ్భ్రమతోఁ జేయునది తెలియక చింతించుచుండె" ననిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

'మునీంద్రా! యజ్ఞార్థమై జైత్రయాత్ర సలుపుచున్న సహదేవుసైన్యము నగ్నిహోత్రుండు దహింప నేల? నీలున కగ్నిదేవుం డేకారణమున నిట్లు తోడ్పడెను?' అని యడుగఁగా, నమ్మునీంద్రుం డారాజేంద్రున కిట్లనియె. ఒకానొకప్పుడు మాహిష్మతీపురప్రభువగు నీలుండు తనకూఁతు నగ్నిదేవున కుపచారములు సేయ నియమించియుండెను. అంతట నాదేవుండు దానివయోరూపలావణ్యములకు మో

హించి మన్మథబాధ కోర్వలేక బ్రాహ్మణరూపమును దాల్చి దానితో సంగమించెను. దీని నీలుం డెఱింగి యాబ్రాహ్మణుండు వ్యభిచారదోష మొనర్చె నని దానిం దండింపఁగా, వీతిహోత్రుండు నీలునకుఁ దన నిజ రూపమును జూపెను. అంతట నీలుండు విస్మయమంది, తనచేఁతకుఁ బరితపించి వినమ్రుండై కోపమునఁ బ్రజ్వలించుచున్న హవ్యవాహునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి 'మహానీయా! నీ వని యెఱుంగక నాచేసినతప్పును మన్నించి నన్ను రక్షింపు' మని వేఁడుచున్న మాహిష్మతీ పురాధినాథుని కగ్నిదేవుండు ప్రసన్నుం డయ్యెను. అప్పుడు నీలుండు తనకూఁతు నద్దేవున కొసంగి విధ్యుక్తవివాహం బొనర్ప నాహవ్యవాహుండు ప్రీతుండై నీలుని వరములు గోరుమనెను. అంత నీలుండు తనకును దనవంశపువారికిని శత్రుభయము లేకుండునట్లు వరముల గోరఁగా, నాదేవుం డాకోరిన కోర్కి చొప్పునఁ గాఁగల దని యప్పటినుండి మాహిష్మతీపురముపై దండెత్తివచ్చు శత్రురాజులసైన్యమును నీలునకు సహాయపడువాఁడై యగ్నిదేవుండు కాల్చి భస్మము చేసి యోడించుచుండు. మఱియు నామహిష్మతీపురవనితలకుఁ బరపురుషసంగమంబు దోషంబు గా దని యగ్నిదేవుండు ప్రసన్నుండై నీలునకు వర మొసంగి యుండెను. దానం జేసి యాపురవనితలకు వ్యభిచారదోషము లేదు. అగ్నిహోత్రుఁడు నీలున కిచ్చినవరదానముచొప్పున నిప్పుడు సహదేవుసైన్యము నాదేవుండు గాల్పఁ దొడంగె. ఈకారణమునఁ బెఱరాజు లెవ్వరును మాహిష్మతీపురముపై దాడి వెడలరు. దీని నెఱుఁగక సహదేవుండు శౌర్యమున నీలుం దలపడెను. తనసైన్యము నగ్నిదేవుం డిట్లు కాల్ప నారంభింపఁగా, నాసహదేవుం డగ్నిసూక్తములతో హవ్యవాహు నిట్లు నుతింపనెంచెను. "ఓకృష్ణవర్త్మఁడా! నీకు నమస్కారము. మే మారంభముచేసి చేయనున్న యీరాజసూయయాగము నీకొఱకే సుమా! ఈ రాజసూయము నెఱవేఱునిమిత్త మీయుద్ధమును బ్రారంభించితిమి. ఓపావకుఁడా! నీవు దేవతలకు ముఖ మగుచున్నావు. నీవే యజ్ఞమవు, అతిపవిత్రుఁడవు. కావున పావకుఁ డనఁబరగితివి. హవిస్సులను మోచి కొనిపోవుదువు గావున హవ్యవాహుఁ డను నామము నీకుఁ బ్రకాశమానమైనది. నీకొఱకే వేదము లున్నవి గాన జాతవేదుఁడ వనియు

వెలయుచున్నవాఁడవు. ఓవిభావసుఁడా! నీవు చిత్రభాను, సురేశ, అనల, స్వర్గద్వార, స్ఫూర్తి, హుతాశన, జ్వలన, శిఖి, వైశ్వానర, పింగేశ, ప్లవంగ, భూరితేజ, కుమారసూ, రుద్రగర్భ, హిరణ్యకృదాదినామములతోఁ బ్రకాశమానుండవై యున్నావు. ఓయగ్నిదేవుఁడా! నాకుఁ బరాక్రమము నిమ్ము. వాయుదేవుఁడు మహాసత్త్వము నిచ్చుఁగాక! పృథివి బలము నిచ్చుఁగాక! అన్నిమేళ్ళను నుదకములొసంగుఁగాక! నీవు వేదముఖంబవు గావున నన్ను సత్యముచేఁ బావనునిగాఁ జేయుము. ఋషులచేతను, బ్రాహ్మణులచేతను, దేవతలచేతను, నసురులచేతను బ్రతిదినము యజ్ఞములయందు సువాతుఁడవై నన్నుఁ బావనునిగాఁ జేయుము. పాపవినాశకరములైన శిఖలతోఁ గూడికొనిన ధూమకేతువవు నీవు. అనిలసంభవుఁడ వీవు. సర్వప్రాణులయం దెల్లప్పు డుండు నీవు నన్నుఁ బవిత్రునిఁగాఁ జేయుము. ఇవ్విధమైన నీస్తోత్రముచే నేను బవిత్రుఁడనై సంతుష్టస్వాంతుండనై నిన్నారాధించుచున్నాను. *"తుష్టిం పుష్టిం శ్రుతిం చైవ ప్రీతిం చాగ్నే ప్రయచ్ఛ మే" యను మంత్రము నెవఁ డుచ్చరించి యగ్నియందు హోమ మొనర్చునో, వాఁడు వీతిహోత్రుని సంతుష్టిపఱచి సర్వపాపచ్యుతుఁడై బుద్ధిరుంతుఁడును నెడతెగనిదాంతుఁడు నగును. యజ్ఞవిఘ్నమును గావింప నీకుఁ దగదు." అని యీవిధముగా నగ్నిదేవుని మాద్రీపుత్త్రుండు స్తుతించి దర్భలను బఱచుకొని దానిపైఁ గూర్చుండి హోమమును జేసెను. ఇట్లు హోమము చేయుచున్న సహదేవుని విషయమై యగ్నియుఁ గరుణించి, చెలెలికట్టను దాఁటునిసముద్రునివడువున సహదేవునిసైన్యమును దహించుట నిలిపి సంతసముతో సహదేవున కిట్లనియె. 'ఓకురుసింహుఁడా! నీయాసనమునందుండి లెమ్ము. నేను ధర్మపుత్త్రునుద్దేశము నెఱుఁగుదు. నేను నీమనస్సును బరిశీలించునిమిత్త మిట్లొనర్చితి. ఈమాహిష్మతీపురమును నీలుఁడును వానివంశమువారును బాలించుచుండునంతవఱకును వారితోఁ బోరాడవచ్చిన శత్రుసైన్యములను నే నిట్లు దహించున ట్లొడఁబడియున్నాను. నీయభిమతమును సైత మిప్పుడు నెఱవేర్చెదను' అని చెప్పఁగా, సహదేవుండు లేచి నిలుచుండి యగ్నిదే

* ఓయగ్నిదేవుఁడా! నాకు తనివి నొసంగుము. బలము నిమ్ము. శ్రుతిని దయసేయుము. ప్రీతినిఁ గరుణింపుము.

వునకు మున్ను ప్రాంజలియై సాష్టాంగవందనములం జేసి, లేచి సమస్త పూజలం జేసెను. అంత వీతిహోత్రుండు నీలుని సహదేవునకు సమ్ముఖుం గావించి యాతనికి నీలుని విస్తారధనమును యజ్ఞార్థమి మ్మనఁగా, నగ్ని దేవునాజ్ఞమెయి నీలుండు సహదేవున కతిధనము నొసంగెను. అంత సహదేవుం డా దేశము నట్లు స్వాధీనపఱచుకొని, దాననుండి ప్రయాణమై త్రైపురమునఁ బౌరవపతిని నెదిరించి, యతిప్రయత్నమునఁ గౌశికాచార్యుఁడైన యాకృతి యనువాని నోడించి, సురాష్ట్రపతియగు సుబాహుం గెలిచి, యచ్చోట నుండి భోజకటకమున నుండు భీష్మరుక్ములకు వార్తనంపఁగా వారు విశేషవస్త్రవాహనములను ధనరత్నరాసులనుధర్మజు యాగార్థముగఁ బంపఁగా వాని నెల్లఁ బరిగ్రహించి, యచ్చోటినుండి వెడలి శూర్పాకరవాలాకటులను నిర్జించి దండకము నాక్రమించికొనెను. దండకమునఁ దిమింగిలుం డనువాని వశముగావించికొని, యచ్చోటి నుండి తఱలి వనవాసులగు కేరకు లనువారిని గెలిచెను వీ రేకపాదు లనఁబడుదురు. వా రిచ్చినధనరాసులం గొని సంజయంతి పాషండ కరహాటక ప్రదేశములను స్వాధీనపఱచుకొని సాగరద్వీపవాసులును మ్లేచ్ఛయోనిజులును నగు రాజుల వశపఱచుకొని, పౌండ్రులను, కళింగులను, సుష్ట్రకర్ణికులను, నోఢ్రులను, కేరళులను, దాలవనములయందలి యాంధ్రులను, దూతలమూలమున వశపఱచుకొనియె. పిదప నటవీ పురమును యవనపురమును నిర్జించెను. అచ్చోటినుండి సముద్రతీరమున నుండు రాక్షసరాజైన విభీషణునకు దూతలచేఁ జెప్పిపుచ్చఁగా, నయ్యది కాలకృతం బని యాలోచించి వివిధరత్నరాసులను, జందనాగరుకాష్ఠములను, దివ్యాభరణములను, వెలగలవస్త్రములను, సాగరజాతము లగు దివ్యమణులను బ్రతాపవంతుఁ డగు సహదేవునకు విధేయుండై యనేక రాక్షసులచేతఁ బంపెను. అంత సహదేవుఁడు వాని నెల్ల గ్రహించి, దక్షిణప్రదేశములనుండి మఱలి యింద్రప్రస్థముం జేరి తాను దెచ్చిన మణిరత్నములను, వస్త్రవాహనములను, సుగంధవస్తువులను, గజాశ్వములను, నానావిధ పరిచారికాజనంబులను యుధిష్ఠిరునకు సమర్పించెను.

అట నకులుండు యమపుత్త్రునిచే సెలవుఁ బొంది విస్తారమైన సేన తన్నుఁ బరివేష్ఠించిరాఁగా, నింద్రప్రస్థపురమునుండి వెడలి కార్తికే

యున కిష్టమైన రోహితకదేశముకు జొచ్చి మయూరుం డనురాజు నోడించెను. అచ్చోటినుండి వెడలి శైరీషక, మహేత్థదేశములను వశపఱచికొని, యాక్రోశుండను రాజర్షిం గెలిచి, దశార్ణ, శిబి, త్రిగర్త, అంబష్ఠ, మాళవాధిపతుల సమరమున నోడించి, మధ్యమకేకయులను, వాటధాను లను ద్విజులను గెలిచి, వారు దారి సూపంగాఁ బుష్కరారణ్యమునం దుండునుత్సవసంకేతగణముల నోర్చి, సముద్రతీరమునం దున్నశూద్రులను, నాభీరులను, బర్వతవాసులై మత్స్యోశను లగువారును, మత్స్యవ్యాపారులును నగు బోయవారిని నిర్జించి, పంచనదమును, నమరపర్వతమును, నుత్తరజ్యోతిషమును, దివ్యకటకమును వశపఱచికొని, ద్వారపాలుని స్వాధీనపఱచికొని, పశ్చిమదేశవాసులగు రామఠ, హార, హూణుల జయించి, వాసుదేవునకుఁ దనరాక నెఱింగించి మద్రదేశప్రవేశము గావించి, శాకలపురమునకుఁ బోయి మేనమామ యగు శల్యునితో రాజసూయప్రయత్నములను వివరింపఁగా, నాతండు బహుప్రీతుండై పరమానందముతో ధనరత్నాది వివిధవస్తుసంభారముల నొసఁగఁగాఁ గొని, యచ్చటి కనతిదూరమున సముద్రమధ్యమునందు నివసించు మ్లేచ్ఛ, పహ్లవ, బర్బర, కిరాత, యవన, శకాదుల నిర్జించి యపారమైన మణికనకధనరాసులను, హస్త్యశ్వములను గానుకలుగాఁ గొని, వరుణపాలితదేశమును, వాసుదేవుఁ డింతకుఁ బూర్వము జయించిన దేశములను జయించి, మఱలి యింద్రప్రస్థమును జేరి తాను గొనివచ్చిన సమస్తవస్తువులను, ధనమును, గనకమణిమయాభరణములను, సుప్తిగజతురగములను, నజావిగోసహస్రములను యుధిష్ఠిరునకు సమర్పించెను.

ఇవ్విధంబున భీమార్జుననకులసహదేవులు పరాక్రమించి దిక్కులను గెలిచి చతుస్సముద్రవేలావలయితాఖిలమహీమండలప్రదేశము నందున్న రాజు లందఱిచే మితిమీఱిన ధన, కనక, వస్తు, వాహనసమూహములఁ గొనివచ్చి వేర్వేఱ ధర్మరాజునకుఁ జూపి యిచ్చిన, నమ్మహానీయుండు గొప్పగుణములచే నతిశుద్ధము లైన రత్నరాసులయొక్కయు, నానావిధధనములయొక్కయు, సమృద్ధిచే మిక్కిలి యధికుండైన వరుణునియొక్కయుఁ, గుబేరునియొక్కయు మితిలేని సంపదను మీఱినవాఁ డయ్యెను. మఱియు రాజధర్మముచే సంపాదితధనమును జూచి పాత్ర

ప్రతిపాదనమున వినియోగింప సమకట్టి రాజసూయయాగప్రారంభము నందుఁ గృతనిశ్చయుఁడైన ధర్మరాజుయొక్క భావమును లెస్సఁగా నెఱింగిన మంత్రులా నరేంద్రునితో నిట్లనిరి. "మహారాజా! నిష్పాక్షికమైన నీ పరిపాలనముచేతను, నీసుగుణసంపదచేతను, నిర్దుష్టమగు నీప్రవర్తనము చేతను నీప్రజలందఱు సురక్షితులై యున్నవారలు. రాష్ట్రము లన్నియు నధికారులచే నప్రమాదముగ నేలఁబడుచు క్షేమమున నున్నవి. దేశమున రాజద్రోహులు లేరు. ద్రోహు లడఁగిరి. దొంగ లనువారు లేరు. ఈతిబాధలు నశించినవి. కాలవర్షములు కురియుచున్నవి. సస్యములు సమృద్ధముగాఁ బండుచున్నవి. ధాన్యములు విస్తారములై యున్నవి. భాండాగారములు ధనసంపూర్ణము లయ్యె. భూమియందు రోగములును, ద్వేషభావమును, భయమును, దుఃఖమును బ్రజలను బీడింపవు. ధాన్యాదులవెలలు సమము లయ్యెను. శత్రురాజులు నీతమ్ములపరాక్రమముచే గెలువఁబడి నీకు వైశ్యులువోలె వశులైరి. నీతమ్ములు గొని తెచ్చినకానుకలు కప్పములు నూటేఁడులు వ్యయపఱిచినను దఱుగవు. నీవు దలంచినరాజసూయాధ్వరము ననుష్ఠించుట కిదియె తగిన సమయము. మఱియు మితిమీఱిన మేలైనరత్నములు, బంగారము, వెండి మున్నగువానిచే భాండాగారములు నిండి మేరుపర్వతమే సమీపించినట్లు, కుబేరుని నవనిధులు ప్రత్యక్షమైనట్లు నున్నవి. సకలపదార్థములచే నిండిన కొట్టము సకలసంకల్పములను నెఱవేర్చు కల్పసాలముఁ బోలుచున్నది. వేదము లన్నియు మూర్తిమంతములయి వెలయుచుండునట్లు యాజ్ఞికులగు బ్రాహ్మణోత్తములు నీయభ్యుదయమును గోరుచున్నవారు." అని నిత్యము రాజసూయయాగకరణమునకై జనులుధర్మరాజును బ్రోత్సహించుచుండిరి. అయ్యవసరమున వేదస్వరూపుఁడును, జ్ఞానముచేఁ బొందఁదగినవాఁడును, శాశ్వతుండును, జగన్నాథుండును, జగత్కర్తయునగు వాసుదేవుండు ద్వారవతియందుఁ దండ్రి యగు వసుదేవుని రాజ్యకార్యములఁ జూచునట్లునియమించి ధర్మరాజునకు రాజసూయయాగకాలోపకారకంబులగు వివిధవస్తువులను, ననర్ఘమణులను, బహుధాన్యధనంబులను గొని మిత్రవర్గమును సంతోషపఱచునదియు, శత్రువులసంతాపకారణంబును నగు తనరథధ్వని నలుదెసల వ్యాపించుచుండ నింద్రప్రస్థమునకు విచ్చే

సెను. జనార్దనునిరాక ధర్మజుఁడు మున్నె యెఱింగియుండి యాభగవంతున
కెదు రేగి యొడ్డోలగంబున నతని నగరునకుఁ దోడ్తెచ్చి, యాతని సత్క
రించి యుచితాసనాసీనుం గావించి క్షేమముల నారసి వేదస్వరూపు
లగు కృష్ణద్వైపాయనధౌమ్యాదివిప్రులును సోదరులును వినుచుండ
నా భగవంతున కిట్లనియె. 'మాధవా! నీ ప్రసాదమునం జేసి భూలోక
మున నుండు రాజు లెల్లరును నాకు వశులైరి. నీయనుగ్రహముచేత
నార్జింపఁబడిన యీ సర్వవస్తువులను ధనకనకవస్త్రవాహనములను
సదుపయోగపఱచునిమిత్తము రాజసూయయాగమును నీసాహాయ్య
సంపదతోఁ జేయుట కభిలాషగలవాఁడనై యున్నాను. ఈయాగము
నాచరించి దేవబ్రాహ్మణప్రీణనంబు గావించి సంతుష్టుఁడ నయ్యెద. నా
కీయాగానుష్ఠానమునకు ననుజ్ఞ నిమ్ము. కాదేని, సర్వధనసమన్వితుండవై
యాగదీక్షను నీవ పూని యాగము ననుష్ఠింపుము. నీ వాచరించినచో
నేను సర్వకిల్బిషవినిర్ముక్తుఁడనై కృతార్థుండ నగుదు' ననఁగా వాక్యకో
విదుం డగు గోవిందుండు 'యుధిష్ఠిరా! సామ్రాజ్యమును వహింప నీవే
యర్హుండవు. కావున యాగమును నీవ యాచరింపుము. దాని
వలన మే మెల్లరము ధన్యుల మయ్యెదము. నీనియుక్తకార్యముల నెల్ల
నేఁ జేయుచుండుదు.' అని చెప్పఁగా, నాకుంతీనందనుండు దేవకీనందనున
కిట్లనియె. 'నాయభిమతముల నో మహాత్మా! నీవు కొఱంత లేక తీర్చెద
ననుచుండఁగనే నాసంకల్పము నెఱవేఱినది. నాజన్మము సఫల మయ్యె.'
అని భగవదాజ్ఞాపితుండై రాజసూయానుష్ఠానమునకు నిశ్చయించి సహ
దేవుం బిలిచి యజ్ఞాంగములగు సర్వసాధనములను ధౌమ్యోద్దిష్టములగు
వాని నాయితము గావింప నిర్దేశింపుము. ఇంద్రసేనవిశోకాదులను సూప
కారత్వమున నియమించునది. రసగంధాదుల సమకూర్చునది. భూలోక
మునం దంతటఁ గల బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను రావించునది;
యని యాజ్ఞాపించి నకులుని రావించి యాతని కిట్లాజ్ఞాపించెను. 'నకులా!
నీవు వేగంబ హస్తిపురంబునకుఁ జని భీష్మ ధృతరాష్ట్ర విదురాదు
లగు కౌరవవృద్ధులను, ద్రోణ కృపాశ్వత్థామాద్యాచార్యవర్గమును,
దుర్యోధనాదిసోదర రాజకుమారులను రాజసూయయాగమున కాహ్వాన
మొనర్చి వచ్చునది.' అని చెప్పఁగా నకులుఁ డన్నమాటను శిరసా

వహించి యట్లు కావించె. సహదేవుండును ధర్మపుత్త్రునుత్తరువును గొంచె మైనను జవదాటక నానాదేశాధీశుల నాహ్వానింపఁ బ్రత్యేకమైన వేగుల వారిని బంపి, ధౌమ్యద్వైపాయనాదిబ్రహ్మణ్యులు నిర్దేశించినమేరకు యజ్ఞశాలను నిర్మించి యందు యజ్ఞోపకరణములను జేర్చి యన్ని దెసలయందును నింద్రప్రస్థమునకుఁ జుట్టును విశాలములై గొప్పవై నానావిధములైనతోఁపులు బావులు నడబావులు వెలయ, నాహారపదార్థములచే సంపూర్ణములైన కొట్లను గట్టించి, ప్రజలు స్తోత్రము చేయునట్లు సహదేవుఁడా ప్రదేశమును రెండవభూతలమో యనునట్లు నిర్మించెను. మఱియు నతనిశాసనమున దూతలు వోయి పిలువఁగ నానాదేశములనుండి వేదవేదాంగములను జక్కఁగా నెఱింగిన బ్రాహ్మణ్యమును, ధృష్టద్యుమ్నాదిపాంచాలసుతులతో ద్రుపదుఁడును, ప్రాగ్జ్యోతిషాధిపతియగు భగదత్తుండును, సాళ్వరాజును, బృహద్బలుఁడును, పౌండ్రకవాసుదేవుఁడును, చేదిదేశాధిపతి యగు శిశుపాలుఁడును, పుత్త్రసమన్వితుండైనవిరాటుండును, మహాబలుండగు మావేల్లనృపతియు, బలరామానిరుద్ధప్రద్యుమ్నసాంబసారణాదియాదవులును, వంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, బాహ్లీక, కుంతల, మాళవాంధ్ర, కాంభోజ, సింహళ, కేరళ, ద్రవిడాదిరాజులును, మరుయవనపతులును, బార్వతేయులును, సాగరద్వీపవాసులును నాదిగాఁగల రాజన్యవరులును నింకను జతుస్సముద్రమధ్యప్రదేశములోనున్న తక్కుంగల రాజసమూహమును, వైశ్యశ్రేష్ఠులును, సచ్ఛూద్రులును మున్నుగాఁ గల సకలదేశజనులును వచ్చి తమతమజాతులకుఁ దగినవనులయందుఁ బూన్కి గలవారై తమతమయోగ్యతకుఁ దగినట్లు కల్పించిన విడిదలల యందుండిరి. వచ్చిన రాజులలోఁ బనేకులు ధర్మరాజునకు రాజసూయయాగమునకు వలసినధనమును మేము యిత్తుము మేము యిత్తుమని పౌరుషవాక్యములనాడుచు, విస్తారమైనధనమును రత్నరాసులను గానుకలుగా సమర్పించిరి. అట నకులుండు యుధిష్ఠిరానుజ్ఞాతుండై హాస్తినాపురమునకుఁ జని భీష్మధృతరాష్ట్రాదికురువృద్ధులను, కృపద్రోణాశ్వత్థామాద్యాచార్యపురుషులను, దుర్యోధనాదికురుకుమారులను ధర్మరాజువచనముగా రాజసూయయాగమున కాహ్వానముచేసెను. అంత వా రెల్లరును నత్యంతానురాగము వెల్లివిరియ ధర్మ

రాజు రాజసూయమును జూచు వేడ్కతో హస్తిపురమునుండి తరలి యింద్రప్రస్థమునకు వచ్చిచేరిరి. అట్లు వచ్చిన భీష్మధృతరాష్ట్రద్రోణకృపాదులను, సోమదత్త, శల్య, భూరిశ్రవః, కర్ణ, శకుని, సైంధవ, దుర్యోధన, దుశ్శాసన,వికర్ణాదులనెల్లఁ దత్తదుచితమర్యాదలచేఁ బూజించి, వారికెల్ల హిమవత్కైలాసంబులం బురుడించు నుత్తమప్రాసాదములను విడిదలుగాఁజూపిరి. అంత వేదవ్యాసుండు మూర్తిమంతంబులై వచ్చిన వేదములో యనఁదగు ఋత్విజులను యాగనిర్వాహమునకుం దోడ్తెచ్చెను. ఇవ్విధంబున వేదవేదాంగములను, సర్వశాస్త్రముల నెఱింగిన భూసురులును, నానాదేశాగతులై వచ్చిన శూరులగు రాజులును, భీష్మధృతరాష్ట్రాదికురువృద్ధులును నాచోటఁ జేరఁగా, యుధిష్ఠిరుండు వారిసెలవు పొంది యాగదీక్షితుండై భీష్మద్రోణకృపాశ్వత్థామవిదురదుర్యోధనాదులం జూచి, యార్జితధనముచే యథోక్తముగ రాజసూయమును గావింపఁ దలంచెద. అందఱును బ్రీతి గలవారలై యీ మహాకార్యమునకు లోపము గలుగనీయక శ్రద్ధ వహించి నిర్వహింపవలయును. అని చెప్పి బంగారు, వెండి, రత్నములు మున్నగువానిని దానము చేయుటయందుఁ గృపాచార్యుని, భక్ష్యభోజ్యములను వినియోగపఱచుటయందు దుశ్శాసనుని, బ్రాహ్మణులపరామర్శయం దశ్వత్థామను,రాజులను సత్కరించి లోపములను దెలిసి సరిపుచ్చుటకు సంజయుని, సర్వవస్తువ్యయమునందు విదురుని, నానాదేశములనుండి వచ్చినరాజులు దెచ్చిన కానుకలను గొని పదిలపఱచుటకు దుర్యోధనుని, సర్వకార్యములలోఁ జేసినవానిని జేయవలసినవానిని సూక్ష్మముగా నారసి యద్యోగ్యకార్యముల నుచితకాలములో నెఱవేఱునట్లు చేయుటకు భీష్మద్రోణులను నియమించి, రాజసూయయాగాగతానేక విప్రవర్యులకుఁ బాదప్రక్షాళనంబు గావింప శ్రీకృష్ణుండు జగన్నాథుండు తానే పూనుకొనఁగా, ధృతరాష్ట్రబాహ్లికసోమదత్తాదికురువృద్ధులుసకలనియమనముల కానందించుచుండిరి.

## ధర్మరాజు రాజసూయయాగము చేయుట

రాజసూయయాగదీక్షితుండైన ధర్మరాజును, మయదానవకృత దివ్యసభను జూచు వేడ్కనేతెంచిన రాజులలో నొక్కరైనను వేయి

గోవులకుఁ గొఱంతగాఁగానుకలు తెచ్చినవారు లేరు. వచ్చినవారనేకులు ధర్మరాజునకు మితిలేనిరత్నాభరణములను దెచ్చి యిచ్చిరి. కొందఱు రాజులు ధర్మరాజు రాజసూయయాగమునకు వలసినంతధనముగు మేము తెచ్చియిచ్చితిమి. మేము తెచ్చియిచ్చితి మని తమలోఁ దాము పరస్పర స్పర్థలుగలవారైరి. ధర్మజ రాజసూయయాగానుష్ఠానమును వీక్షించుటకు దేవతలు తమతమవిమానములం దంతరిక్షమున నుండిరి. వారివిమానములన్నియు మహాభవనములతో విరాజిల్లుచుండెను. ఈభవనములన్నియు దృఢముగను సుందరముగను గట్టఁబడియుండెను.వీనితోఁగూడిన యప్పటిధర్మరాజసభ మిక్కిలి గంభీరముగను గన్నులపండువుగను గాన్పించెను. యాగదర్శనాగతరు హేంద్రాదిదేవతలదివ్యవిమానములు విప్రుల నిమిత్తము కట్టిన పవిత్రగృహములు, సాహ్వానులై యేతెంచిన రాజాధిరాజులకు విడిదలలుగా నిర్మించినవియు, నానారత్నసముంచితములును, బహుపదార్థపూరితములును నగు మహాసౌధరాజములును నాయుధిష్ఠిరు యజ్ఞశాలకు సమీపమున దేదీప్యమానములై ప్రకాశించుచుండెను. ఇవ్విధంబున నపరిమితద్రవ్యసమేతుం డై రెండవవరుణునివ్వాకి సంపన్నుండై వెలయుచున్న యుధిష్ఠిరుండు, గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులతోఁగూడిన త్రిణాచికేతము లను నా అగ్నులచేఁ బవిత్రమగు నా రాజసూయయాగము మహావిభవముతోఁ బ్రవర్తింపఁజేయు నిమిత్తము వచ్చియుండిన మహాశాస్త్రవేత్తలు వేదవేదాంగపారంగతులు నగు విప్రులసమారాధనంబు బోరన జరుగుచుండ, నా సంతర్పణయందు వెచ్చింపఁబడిన యాహారపదార్థములకు మితియే లేదు. ఆయాగశాలయందలి యధికృతులు యాగదర్శనాగతవిప్రవర్యులకు భక్ష్యభోజ్యాది సమృద్ధములయిన మృష్టాన్నములను 'దనివి తీఱ భుజింపుఁడు ; వలసిన పదార్థముల వ్రేళ్లతోఁ జూపి యడుగుఁడు,' అని వారిఁ బ్రోత్సాహపఱచు నినాదము లాయధ్వరోత్సవంబున నన్నినాళ్లను నెడతెగక వినఁబడుచుండెను. బ్రాహ్మణులును దేవతలును సంతతాజ్యధారలచే బహువిధాహారములఁ గుడుచుచుఁ దృప్తులై త్రేపు లిడుచుండిరి. నానాదేశముల యందుండి వచ్చినరాజన్యులు పూజయాధ్యక్షతను బూజితులై యాగనిర్వహణకౌశలమున కచ్చెరు వొందుచుండిరి. ఇంతేకాక వైశ్యమహా

జనులును, యాగదర్శనాగతవివిధదేశవాసు లగు సచ్ఛూద్రులును నాయా గమునం దెల్లవారును నర్చితులై యాదరింపఁబడుచుండిరి. ఇవ్విధంబున నందఱు నాయాకార్యములం దప్రమాదులై వర్తించుచుండ, యుధిష్ఠిరుండు నిజసంకల్పము కార్యరూపముఁ దాల్చి నెఱవేఱుచుండుటకు మనస్సున నానందంబు వెల్లివిరియ వేదవ్యాసుండు బ్రహ్మగా, పైలధౌమ్యులు హోతలుగా, యాజ్ఞవల్క్యుఁ డధ్వర్యుఁడుగా, సుసోముఁ డుద్గాతగా, వీరలపుత్త్రపౌత్త్రగణములు క్రమమున మైత్త్రావరుణుఁడును, నచ్ఛావాకుఁడును, గ్రావస్తోతయుఁ బ్రతిప్రస్తోతయు, నేష్టయు, నున్నేతయు, బ్రాహ్మణాచ్ఛంసియు, నాగ్నీధ్రుఁడును, బోతయు, బ్రస్తోతయుఁ, బ్రతిహర్తయును, సుబ్రహ్మణ్యుఁడును నను ఋత్విజులుగా నారదాదిఋషులును, భీష్మాదిరాజర్షులును సదస్యులుగా, నా రాజసూయమహాయజ్ఞంబు సర్వక్రియాసమగ్రమై, షడంగసమృద్ధమై, సంపూర్ణదక్షిణాసనాథమై, సకలధనధాన్యసమన్వితమై, జగన్నాథరక్షితమై, సకలజనానందకరమై, యతిరమణీయమై యనేకరత్నోపహారంబులు నతిసమృద్ధంబులు గాఁగ విధియుతముగఁ బ్రవర్తిల్లుచున్నంత వ్రతహీనులును శూద్రులును సంతర్వేదిం జేరరైరి వివిధశాస్త్రములను సకలధర్మములను నిఖిలభాష్యములను నెఱింగిన మహనీయులగు భూసురులు శాస్త్రార్థములను వెల్లడించుచు, శాస్త్రమునంద సిద్ధాంతితములైన విషయమును దమబుద్ధిసామర్థ్యమున నిరూపించుచుండఁ, గొందఱుహైతువాదులు వితండమునకుఁ బూనుకొని తమ సిద్ధాంతమును రాద్ధాంతపఱచుచుండ, యజ్ఞశాల మిక్కిలి శోభాయమానమై యుండెను. మహనీయులగు పెద్దలు కొంద అందఱకు సమాధానములను జెప్పుచు శాస్త్రనిశ్చితసిద్ధాంతముల సాధించుచుండిరి. ఇవ్విధమున బహుబ్రాహ్మణులతోఁగూడిన యాయజ్ఞశాల యతిరమణీయంబై యొప్పుచుండె. వీరి కందఱకును భక్ష్యభోజ్యాదిస్వాద్వన్నంబులఁ గుడువంబెట్టి యనేకగోవుల, విస్తారశయనంబుల, నపారధనంబుల నొసంగె. ఇవ్విధమున సంతుష్టులైన బ్రాహ్మణులు మంత్రాహుతులచే నగ్నిముఖమున దేవతలకు హవిర్భాగంబుల నొసఁగి వారిని సంతోషపఱచిరి. సంపూర్ణదక్షిణలు దానములు గొని భూసురులు పరమానందమునఁ బొదలిరి. తగినమర్యాదలను లెక్కలేక పడయుటచే సకలరాజలోకంబు నానందాబ్ధి నోలలాడె. వలసి

నంత యన్నదానగౌరవముచే జగజ్జనులు మిక్కిలి తృప్తులయిరి. అప్పు
డచ్చోటికి విచ్చేసియున్న రాజలోకము నంతయు నొక్కసారి నారదుం
డాలోకించి, పూర్వము బ్రహ్మలోకమున భూదేవి బ్రహ్మను దనభార
ముడుపు మని వేఁడుటయు, దేవతలు బ్రహ్మానుజ్ఞ మెయి భూలోకమునఁ
దమతమయంశముల మనుష్యులై పుట్టుటయు, జగన్నాథుం డగుజనార్ద
నుండు భూభారమును దొలఁగింప దేవకీగర్భమున వసుదేవనందనుండుగఁ
బుట్టుటయుం దలపోసి, యీమూఁగినరాజుల నెల్ల నీలోకారాధ్యుఁడు
హరింప నున్నాఁడు గదా! యని మనంబునఁ జింతించుచుండె. అప్పుడు
పుణ్యచరితుండును, బాపరహితుండును, బాహుబలపరాక్రమశాలు రగు
తమ్ములతోఁ గూడినవాఁడును నగు ధర్మజుండు లోకపావనుం డైన వాసు
దేవునిదివ్యప్రసాదంబున విధ్యుక్తముగ యజ్ఞము నాచరించి యపార
మగు భక్తితో భగవంతుని దివ్యస్వరూపదర్శనంబుఁ జేయుచుండఁ,
బరమశాంతమూర్తి యగు భీష్ముండు ప్రవర్తిల్లుచున్న రాజసూయయాగ
మును వీక్షించి పరమానందసాంద్రుండై, ధైర్యశాలియు, ధర్మచింత గల
వాఁడును నగు ధర్మజున కిట్లనియె. 'స్నాతకుఁడును, ఋత్విజుఁడును, సద్గు
రుఁడును, నిష్టుఁడును, రాజును, సంయతేంద్రియుఁడు నను నార్వురు
పూజార్హులు. వీరిలోఁ బ్రీతిచేతను సుగుణములచేతను నెవఁడు పెద్ద
వాఁడో, యట్టిమహాత్ముఁడును, బ్రసిద్ధికెక్కినవాఁడును నగు నొకని నిప్పుడు
పూజింపవలయును. ఇట్టివా రల్పయత్నమున లభింపరు. వీరిలోఁ గ్రమ
ముగ నొక్కరునికి ముందుగ నర్ఘ్యమిమ్ము. కాకున్న నందఱికంటె నన్ని
విధంబుల నొక్కఁ డుత్తముఁ డున్నచో వానిం బూజింపుము.' అని
చెప్పఁగా, ధర్మములను జక్కఁగా నెఱింగిన ధర్మపుత్త్రుండు తన కట్టి
వానిని నిర్దేశించి చెప్పు మని భీష్ముని వేఁడెను. అట్టి మహనీయుఁ
డెవండో వానిని జెప్పినచో నాతని కర్ఘ్యమొసంగెద ననెను. భీష్ముం
డంతటఁ బెద్దయుంబ్రొద్దు చింతించి సూర్యుఁడు తనవేయికిరణములచే
భూమ్యంతరిక్షములను బ్రకాశింపఁజేయునట్లును, జంద్రుఁ డమృతసమూ
హముయొక్క ప్రవాహస్వరూపములగు వెన్నెలలచే వాని నానందింపఁ
జేయునట్లును, సకలజనులను దననిర్మలకాంతిచేఁ బ్రకాశింపఁజేయుచుఁ
దనతేజముచేతనే స్వయముగాఁ బ్రకాశించుచున్నవాఁడును, సత్సేవ్యుఁ

డును, బుండరీకాక్షుఁడును, జననమరణములు లేనివాఁడును, నబ్జనా
భుఁడును, వాసుదేవుఁడునను నామములతో వెలయుచుండు శ్రీకృష్ణుండు
దక్క నగ్రపూజను గొనుట కీసభయందు లాఁతివారు తగినవారు గలరా?
యజ్ఞరూపుఁ డగుపురుషుఁడును నఖిలలోకపూజ్యుండు నైన యచ్యుతుం
బూజింపుము. ఈ మహనీయుండే సర్వవిధముల నీ గౌరవమునకును,
బ్రథమార్ఘ్యంబు గ్రహింపను నర్హుండు. అట్లు నీ వొనర్చుటయే
రాజసూయయాగమునకు ఫలము. అని చెప్పఁగాఁ, గార్యవేదిత్వము
నందు నేర్పరియగు ధర్మరాజు భీష్మవచనచోదితుండై సహదేవుని జగ
న్నాథునకుఁ బ్రథమార్ఘ్యమును సమర్పింప నాజ్ఞాపింపఁగా నాతఁడు జగ
త్కారణుండగు నాశ్రీకృష్ణునకు నర్ఘ్యమును విధ్యుక్తముగా నొసం
గఁగా, నతఁడు దానినిఁ బరమప్రీతుండై పరిగ్రహించె.

### శిశుపాలుండు శ్రీకృష్ణ నధిక్షేపించుట

ఇవ్విధంబున సహదేవుఁడు భక్తితో నొసఁగఁగా శ్రీ కృష్ణుఁడు
ప్రీతితోఁ బరిగ్రహించిన ప్రథమార్ఘ్యమును సైరింపక, శిశుపాలుండు
శ్రీకృష్ణు నాక్షేపించుచు యుధిష్ఠిరునితో నిట్లనియె. ధర్మపుత్రా!
రాజులు, మహనీయు లైనవారు ప్రథమపూజార్హు లనేకు లుండఁగా
నీ యాదవుండైన శ్రీకృష్ణున కేల ప్రథమార్ఘ్యము నొసంగితి. ఈధర్మ
విరుద్ధమైన కార్య మేల చేసితివి? శ్రీకృష్ణుఁడు ప్రథమార్ఘ్యమును
గొనుటకుఁ దగునా తగఁడా యని విచారింప వైతివి. ధర్మసూక్ష్మమును
విమర్శింపక బేలవైతివి. నీ కీ యాలోచనము సెప్పిన భీష్ముండు ముసలి
వాఁడు; యుక్తాయుక్తములను జెప్పుట కర్హుండు గాఁడు. వృద్ధుల
బుద్ధులు సంచలించును. కాకున్న నతఁడు పూజానర్హు నేల ప్రథమమునఁ
బూజింపు మనును? ఈయాదవున కేయోగ్యత కల దని భీష్ముండు
వీని నిందఱు రాజులలో మొదటఁ బూజింపు మనెను. వృద్ధుఁ డని
తొలిపూజ కర్హుఁ డయ్యెనా? వీనితండ్రి వసుదేవుఁ డుండఁగా వీఁ
డెట్లు వద్ధుఁ డగును? ఇంకను ద్రుపదుఁడు మున్నగు వృద్ధరాజు
లుండరా? ఆచార్యుఁ డని మొదటఁ బూజించితి వని తలంచినచో
మీ కెల్లర కాచార్యులు ద్రోణకృపులు గారా? ఋత్విజుం డని

యర్పించితి రన్నచో వేదవ్యాసుం డుండఁగా నితరుఁ డెవ్విధమున దాని కర్హుఁ డగును? స్వచ్ఛందమరణము నొందఁజాలినంత మహిమ గల భీష్మునివంటిమహాత్ముఁడును, విప్రుఁడును మహాశూరుఁడును నగు నశ్వత్థామయు, రాజరాజగు దుర్యోధనుఁడును, కింపురుషాచార్యుండైన ద్రుముఁడును, నింకను పెద్దలగు భీష్మక రుక్మి శల్యాదులును, మహాబాహుపరాక్రమము గలవాఁడును, సహజకవచకుండలధరుండును, కాంచనవర్ణాభుఁడును నగు కర్ణుఁడు మొదలగు ననేకరాజు లుండఁగా వారి నందఱ సరకుగొనక యాదవుండైన యీ కృష్ణు నేల ప్రథమపూజార్హునిఁ గావించితివి? వీనినే యర్పింపవలయు నని నీ కిష్ట మున్నచో, నిందఱు రాజుల నెల్ల నాహ్వానింప నేల? వీరి నందఱను బిలిచి వారెల్ల నీయం దున్న గౌరవమున నీమహాయాగమును వీక్షింప రాఁగా, వారినమక్షమున నీయాదవుం డొక్కఁ గొప్పవాఁ డని పూజించి యీ రాజుల నెల్ల నవమానించితివి. నీ వొక ప్రతాపవంతుఁడ వని నీకు భీతిల్లి మేము కప్పముల నీయలేదు. నీవు పరమధార్మికుండ వనియు, సత్యవచనుండ వనియు, సామ్రాజ్యమును బొంద నర్హుండ వనియు నెఱింగి నీకుఁ గప్పముల నిచ్చితిమి. యుధిష్ఠిరుండు ధర్మజ్ఞుఁడు ధర్మమార్గప్రవర్తకుఁ డని చిరకాలార్జితకీర్తి నీ తెలివిమాలినకార్య మొనర్చి యాకస్మికముగ నశింపఁజేసికొంటివి. మహానుభావుం డైన జరాసంధు నన్యాయయుద్ధంబున వధింపఁ జేసిన యీ శఠాత్ముండు ప్రథమార్ఘ్యము నీమహాయాగకాలమునఁ గొనుట కర్హుఁ డగునే? యని దూషించి, యంత నిలువక మధుసూదను మొగంబై యిట్లనియె. కంసదాసపుత్త్రా! ఈ కుంతీపుత్త్రులు నీకుఁ బ్రియులకు వెఱచిరో, లేక, నీ కపరిమితానురక్తులగుటనో ప్రథమార్ఘ్యము నీ కీయఁ బూనుకొనఁగా, నీ సభలో నున్న రాజర్షులు, బ్రహ్మర్షు లందఱు నిర్లక్ష్యముతోఁ జూచుచు నూరకుండ నీపైనను నీయాంతరము నెఱుంగనలేరా? మనుష్యులు లేనప్పుడు పురోడాశమును కుక్క ముట్టుచ్చిలికొనిపోవురీతి, నీయర్ఘ్యమును నీవు కొంటివి. ఈకృత్యమున నీ రాజుల కెవరికి నవమానంపులు కలుగవు? ఆలోచింపఁగా నీతలవంపు నీయదియే. ఇది సిగ్గుచేటుపను. నపుంసకునియందు దారక్రియయు, గ్రుడ్డివానికద్దముచూపుటయు నెట్లునిష్ప్రయోజనములో, యట్లు

రాజు గానినీకుఁ జేసిన యీ పూజ నిష్ప్రయోజనమైనది. యుధిష్ఠిరు ధార్మికగుణము, భీష్ముని తెలివియు, నీవివేకమును దెలియనాయె. ఇఁక నిం దుండరా' దని చెప్పి, మంత్రిపుత్రాదులతో దిగ్గన లేచి సభను వీడి పోవుచుండ, ధర్మపుత్త్రుఁడు వానివెంటన తవిలి వాని ననున యించుచు నిట్లనియె. 'శిశుపాలా! ఆఁగుము. పోవలదు. ఈతీరున వచింప రాదు. దీనిచే నన్యాయం బగును. భీష్ముం డసామాన్యుండైన ధర్మజ్ఞుండు. ఆమహనీయుని ధర్మ మెఱుంగనివానిఁగాఁజెప్పుటయధర్మము.ఇవ్విధమునఁ బల్కి, యీ వృద్ధు నవమానింపరాదు. మఱియు జగన్నాథుండైన యీ కృష్ణునిమాహాత్మ్యము భీష్ముఁ డెఱింగినట్లు నీ వెఱుంగవు. తెలియక వృథా మాటలాడఁ జనదు. నీకంటెఁ బెద్దలగు రాజు లందఱు నూరకుండ నీవేల యిట్లాడెదవు? వా రంతఱును యథార్థ మెఱింగి యూరకున్నవారు.' అని యుధిష్ఠిరుండు శిశుపాలు సమాధానపఱచుచుండ, శాంతనవుండు ధర్మరాజుతో నిట్లనియె. 'యుధిష్ఠిరా! జగన్నాథుం డగు వాసుదేవున కొసంగిన యర్ఘ్యము నొల్లని దురాత్ముఁడగు శిశుపాలుని ననునయింప కుము. ఊరకుండుము.' అని ధర్మజు వారించి, భీష్ముండు శిశుపాలుం జూచి యిట్లనియె. 'ఓరీశిశుపాలా! క్షత్త్రియులలో శూరుండై యనేకయుద్ధముల నొనర్చి పెక్కుఱు రాజుల వశపఱచుకొని ప్రతాపవంతుండై వెలుంగు వాఁడు పెద్ద. ఈవచ్చియున్న రాజలోకమునందు బలపరాక్రమములలో శ్రీకృష్ణున కధికుఁడును, నామహనీయునకు లొంగనివాఁడును నగు రాజొకండైనను గలఁడే? ఈవాసుదేవుండు మనకే కాక సకలలోకము లకుఁ బూజనీయుండు. ఈతనివశమున నీలోకము లన్నియు నున్నవి. నే ననేక రాజర్షులను బ్రహ్మర్షులను బహుకాలము సేవించి వారివలన నీ దేవకీసుతువృత్తాంతను నాతండు భూలోకమున నవతరించిననాటం గోలె నెఱింగియుంటి. సకలలోకవంద్యుఁ డగుటచే నామహాత్ము నర్చింపుమంటిని గాని, బంధు వను ప్రీతిచేఁ గాదు. మఱియు నీ యాగ శాలయందుఁ గూడియుండు రాజలోకముయొక్క బలపౌరుషములఁ బరిశీలించి, వారికీర్తివిజయముల లెస్సగా నాలోచించి, వా రందఱ కంటె వాసుదేవుం డుత్కృష్టుం డని యామహాత్ముని యర్చించు టుచిత మని, శ్రేయస్కరం బని యట్లొనర్పు మంటిని. బ్రాహ్మణులలో జ్ఞానవృ

ద్ధుఁడును, క్షత్రియులలోఁ బరాక్రమశాలియును, వైశ్యులలో నధిక ధన వంతుఁడును బాలుండైనను బూజనీయుఁ డగును. శూద్రులలో వయో వృద్ధులే పూజనీయులు. ఈదేవకీనందనుండు సకలవేదశాస్త్రవిజ్ఞానంబునం దును, బలశౌర్యములందును నందఱకంటె నధికుఁడు. దానం జేసి యా తఁడు పూజార్హుఁ డయ్యె. ఈతండు సాక్షాద్భగవంతుఁ డని యెఱుం గుము. భగవంతుఁడు ప్రత్యక్షమున నుండ నాతనికంటె నన్యునిఁ బ్రథ మమునఁ బూజింపఁ దగునా? ఆతనికంటెఁ బూజఁ గైకొనుట కన్యుఁ డర్హుఁ డగునే? దానము, దాక్ష్యము, శ్రుతము, శౌర్యము, హ్రీ, కీర్తి, ఉత్తమబుద్ధి, సన్నతి, శ్రీ, ధృతి, తుష్టి, పుష్టి మొదలయిన శ్రేష్ఠ గు ణంబు లన్నియు హృషీకేశునం దిమిడియుండు. ఈమహనీయుఁడే ఋత్వి జుఁడు, గురుఁడు, వివాహ్యుఁడు, స్నాతకుఁడు, నృపాలుఁడు, ప్రియుఁ డును నై యున్నాఁడు. సర్వగుణములు నీతనియెడఁ దప్ప వేఱొకనియెడఁ గలవే? వే యేల! ఈకృష్ణుఁడే లోకములయుత్పత్తిస్థితిలయములకుఁ గా రణభూతుఁడు; విశ్వాత్ముఁడు; చరాచరభూతజాలముల సృజించినవాఁడు; ప్రకృతిస్వరూపుఁడు; అవ్యక్తుఁడు; సృష్టికర్త; సనాతనుఁడు; సర్వభూతము లకుఁ బరుఁడుగ నుండువాఁడు; బుద్ధి, మనస్సు, మహత్తు, వాయువు, తేజ స్సు, ఉదకము, పృథివి, ఆకాశము, జరాయుజాండజోద్భిజ్జస్వేదజంబు లను నాల్గువిధములైన చరాచరవర్గములు, సూర్యచంద్రులు, నక్షత్రములు, గ్రహములు, దిశలు, విదిశలు ననియెడి యివన్నియు నీవాసుదేవునియందు సుప్రతిష్ఠితములు. వేదముల కగ్నిహోత్రుఁడును, ఛందస్సులకు గాయ త్రియు, మనుష్యులకు రాజును, నదులకు సాగరమును, నక్షత్రములకుఁ జంద్రుండును, తేజస్సునకు సూర్యుండును, బర్వతములకు మహామేరువు, పక్షులకు గరుడుఁడును ముఖ మగునట్లు సకలలోకములకుఁ గేశ వుఁడు ముఖము. ఎల్లవారికిఁ గేశవుండు పూజ్యుండు.' అని సభలో నున్న వారివంకఁ జూచి, యీశిశుపాలుఁడు బాలుఁడు, మూఢుఁడును గావున వాసుదేవుమాహాత్మ్యము నెఱుంగఁడు. ఇతఁడు లోకరక్షకునకు మే మి చ్చిన యగ్ర్యపూజ మెప్పఁడేనిఁ దా నేమి చేయ శక్తుఁడో యది చేయుఁగాక. ఇప్పుడు శ్రీకృష్ణునికి మే మొనర్చినపూజ నంగీకరింపని దురభిమాను లిం దెవ్వరైన నుండు రేని వారి నెత్తిమీఁద నీనాకాలి నుంచెద. అని సహదే

డుఁడు సభలో నిల్చి తనకాలు పైకెత్తెను. వాసుదేవున కొసంగిన మా యర్ఘ్య మపాత్రమున కొసంగఁబడిన దను దురాత్ము లిప్పు డేమి ప్రత్యుత్తరము చెప్పుదురో' యనఁగా సభలోని రాజు లెల్ల రూరకుండిరి. అంత సహదేవునిపైఁ బూలవాన కురిసెను. సహదేవునివచనము లెస్స యని యశరీరిణి పలికె. వాసుదేవునిఁ బూజింపనిదురాత్ములు బ్రతికియుండియుఁ జచ్చినవారు. ఇంతేకాక యట్టిదుర్బుద్ధులతోఁ బలుకనైన రాదని నారదుండు హృషీకేశుని స్తుతించె. అంత సహదేవుండు సభలో నున్నవారి కందఱికి నుచితసత్కారములం జేసెను. అంత శిశుపాలుని సేనాపతి యగు సునీథుండనువాఁడు సభలో లేచి నిలుచుండి యిట్లనియె. 'ఓ రాజవర్యులారా! లెండు. ఈసభలో క్షత్రియుల కెల్ల నీయాదవులును బాండవులును మహాపరాధము గావించిరి. అవమానమును జేసిరి. ఇట్టిపీరిని దండింపుదము; సేన నాయితము చేయుదము. ఈ సభయం దుండఁ జన' దని చెప్పి కనుసన్నఁ జేసి తమపక్షపురాజుల నందఱి నొకచెంతఁ జేర్చుకొని శిశుపాలుని యనుమతిచేత యుద్ధసన్నద్ధుఁడై యుండఁగా, వేగముచేఁ జలించుచున్న తురంగము లనుతరంగములచేతను, మదించిననాగము లనునక్రసంచయములచేతను, జలించుచున్న పదాతు లనుచేఁపలచేతను భయంకరమై కొంచెమైనను దయలేనిరోష మనుగాలిచే మిక్కిలి కలఁతపడినదియై యదు, వృష్ణి, భోజ, అంధక, కుకుర లను సముద్రమునైతము వెంటనే కల్లోలముగఁ గలఁగెను. అట్టి సకలరాజుల కలఁతను జూచి ధర్మరాజు భయముతోడను, దొట్రుపాటుతోను గూడినహృదయముగలవాఁడై భీష్మున కిట్లనియు. 'పితామహా! రాజులెల్ల యుద్ధమునకు నడుములు కట్టుకొనిరి. యాగమునకు విఘ్నము రాకయుఁ, బ్రజలకు హాని రాకయు నుండున ట్లుపాయ మూహింపవలయు.' అనఁగా నాయుధిష్ఠిరునకు శాంతనవుం డిట్లనియె. రాక్షససంహారకుఁడును, నారాయణుఁడును, యజ్ఞపురుషుఁడును, ననన్యసాధారణబలపరాక్రమసంపన్నుండును నగు శ్రీకృష్ణుండు యాగమును నెఱవేర్చుభారమును బైవేసికొని సంరక్షింప, నీయాగమున కన్యులు విఘ్న మొనర్పఁ గలరా? శిశుపాలుని యాగ్రహవచనములకు నడుములు కట్టుకొని యుద్ధమునకు సన్నద్ధులయిన యీరాజు లందఱు శ్రీకృష్ణుఁ డలిగి రాక్షసవీక్షణ

ములతోఁ జూచు నేని యందఱును నొక్క పెట్ట భస్మ మగుదురు. మహాసంగరమున శిశుపాలునిగర్వము సైత మడఁగి పోవును. కుక్క లనేకము లొక్కుమ్మడి నేనుఁగుకుంభస్థలముఁ జీల్చుటకు సమర్థము లైనవాడిగోళ్లు గల సింహమును జూచి మొఱిఁగి యేమి చేయఁగలవు? సింహపరాక్రమము గల శ్రీకృష్ణుని వీరిలో నెవ్వ రెఱుంగరు? ఈవిపరీతపుఁబలుకులచే శిశుపాలుఁ డనేకులను యమపురి కతిథులను జేసి తానును వారివెంబడిఁ బో నున్నవాఁడు. వీనితేజస్సును రూపుమాయు నట్లు దామోదరుఁడేమి సేయ నున్నవాఁడో యెఱుంగనేరము. కాదేని వీని కీదుర్బుద్ధి యేల కలుగును? జగన్నాథుం డెవరిని దేజోహీనులఁగఁ జేయఁదలంచునో వారెల్ల రివ్విధంబున బుద్ధిమాంద్యంబును బొందుదురు. ఆదిమధ్యాంతంబులు లేనివాఁడును, సృష్టిస్థితిలయకారణభూతుం డును నగు నారాయణునిదివ్యలీలల నెఱుంగుట కెరికి శక్యంబగు?' నని పలుకుచుండ శిశుపాలుండు క్రోధఘూర్ణితరక్తనేత్రుండై భీష్మున కిట్లనియె.

"భీష్మా! నీ వేల యిట్లు ప్రలాపంబు లాడెదవు! ఈ ప్రలాపములకు శూరులు వెఱతురే? ఇట్లు పలుకుటకు నీకు సిగ్గయిన లేదే? కురుకుల వృద్ధుఁడవయ్యుఁ గులపాంసనుఁడవైతివి. వృద్ధుఁడవై యుండుటబుద్ధిచాంచల్యము నొంది యధర్మము నేల ప్రేలెదవు? ఇది నీకుఁ దగదు. పగిలిన యోడతోఁ గట్టిన యోడవోలె, గ్రుడ్డికి దారిచూపు గ్రుడ్డివానింబోలె నీపలుకులు విని పాండవులు శుభములను బొందలేరు. ముసలిబడుగ వగు నీ వీవెఱ్ఱిగొల్లను భగవంతునిఁగా భావించెదవు. నీమాటలను విని ధర్మరాజు తనగౌరవమును బోఁగొట్టుకొని మిక్కిలి యల్పుఁ డాయెను. అబల యగు పూతనను జంపుటయుఁ, బ్రాణము లేనిబండిని గాలఁ దన్ని నేలఁ ద్రోయుటయుఁ, బుచ్చినమద్దుల రెంటిని విఱుచుటయుఁ, బాములపుట్ట యంత యెత్తు గలగోవర్ధనపర్వతమును బైకెత్తి యేడుదినములు మహాబలవంతునివలె నుండుటయు, వృషభాసురునిఁ జంపుటయు ననఁగ నీకృష్ణునిశౌర్యమును బొగడుచున్న నీనాలుక యొక్కటయ్యును నూఱు చీలికలుగా నేల చీలదయ్యె? అట్లు చీలినఁగాని నీ వాతనిని బొగడకుండ నుండ నేరవు. వానికృత్యముల నన్నింటిని నే నెఱుంగుదును. ఇట్టి

దురాత్ముఁ డాయర్ఘ్యమును గొనుట కర్హుఁడా? చెప్పుము. స్త్రీలను, గోవు
లను, బ్రాహ్మణులను, గూఁడుపెట్టువారిని, నమ్మినవారిని జంపుట మహాపాతక
మని పెద్దలు సెప్పుదురు. అట్టివానిలో నీగోవిందుఁడు స్త్రీవధమును గోవధ
మును జేసె. నీ వొకధర్మజ్ఞుఁడవువోలె నీతనికిఁ బ్రథమార్ఘ్య మిప్పింటివి.
అదియును గాక, వేఱొకనిని భర్తఁగా వరించియున్న యంబ నపహరించి
కొనిపోయి నీతమ్మునకుఁ బెండ్లిచేయఁ జూడఁగా, నాతండు ధర్మజ్ఞుఁడగుట
దానిని విడిచి పుచ్చె. నీవొకధర్మబోధకుండ వని తలంచి నీమాట విని
యీపాపాత్మున కర్ఘ్యమొసంగి పాండవులు చెడిరి. ధర్మశాస్త్రముల నేర్చిన
వాఁడు భూలింగపక్షింబోలె లాతివారికి ధర్మముల బోధింతురు. కాని,
యారీతిని వా రనుష్ఠింపరు. నీస్వభావ మతినీచము. మోహముచే వీరె
ల్లరు నిన్ను ధర్మజ్ఞుఁడ వనియుందురు. మహాప్రాజ్ఞుండువోలె బ్రహ్మచర్యమిషం
బున నీతమ్ముని భార్యల యందు నీవు మాన, నన్యుండు పుత్రులఁ గనెను. ఇదొక
మహాబ్రహ్మచర్యనిష్ఠయే? మోహముననో నపుంసకత్వముననో బ్రహ్మ
చర్యనిష్ఠను బూనితివిగాని ధర్మముల నెఱింగి తదనుసారివై యీబ్రహ్మ
చర్యమును బూనితివే? పరిశీలింపఁగా నీవు సాధుసేవఁ జేసి పెద్దలవలన
బుద్ధుల నెఱింగినవాఁడవు కావని తోఁచెడిని. మఱియును దానము, అధ్య
యనము, యజ్ఞాచరణము, వ్రతానుష్ఠానము, ఉపవాసాదులన్నియును సంతా
నమును బడయుటలోఁ బదునాఱవపాలు కావు. సంతతిలేనివారి సకలధర్మబో
ధము నిరర్థకము. వే యేల? నీమోహపుఁబడవడికను గుర్తించి నీజ్ఞాతు
లందఱొక్కటై నిను వధింతురు. తొల్లి సముద్రతీరంబున నొక్క హంస
తా నధర్మప్రవర్తనమున నుండియుఁ బెఱవానికి ధర్మములను బోధించు
చుండెను. మోస మెఱుంగని యితరహంసలు నిత్యము తమగ్రుడ్ల నాము
సలిహంసతావున నుంచి తాము సముద్రముఁ జొచ్చి యాహారమును
దెచ్చుకొనుచుఁ దక్కులమారిహంసను బోషించుచుండె. తనసంరక్షణ
మున నుండు గ్రుడ్లకు నిత్యము కాపుగా నుండు ధర్మబోధము చేయు
హంస కొన్నియితరహంస లెఱఁ దెచ్చుటకుఁ బోయినసమయమునందుఁ
దానా గ్రుడ్లను నిత్యము భక్షించుచుండుటను గొన్ని గ్రుడ్లు కానరాకుండె.
పక్షులు ప్రతిదినము తమగ్రుడ్లపోకకుఁ గతం బరయనేరక కపటధర్మకవచ
మును దొడిగికొనియుండు ముసలిహంస నే మని యడుగ నేరక వగచు

చుండె. అంత నాహంసలలో నొకతెలివిగల మరాళము పొంచుండి చూచుచుఁ దనయండములు నాకాపరిహంస మెసవుచుండుటను వీక్షించి దానికపట్టము నంతయు నెఱింగి, పెఱహంసలతో యథార్థమును దెలి పెను. అంత నాపులుఁగు లెల్ల నొక్కటై, ముసలిహంసను సమీపించి యిట్లనియె. 'పాపీ! సాధువుంబోలె ధర్మంపుమాట లాడుచు మాకు విశ్వాసముఁ గలిగించి మమ్మును మోసగించి మాయండములను మెసవిన పాపాత్ముండవు నీవ. నీమనస్సు పాపాచరణమునకుఁ బూనుకొనెను. నీధర్మంపుఁ బలుకులు మాకిఁకఁ బనికిరా' వని యన్నియుం జేరి యాముసలిహంసను వధించెను. అవ్విధంబున నీ చెడువర్తనంబు నెఱుంగకయున్న కౌరవులు నీద్రోహచింతనం బెఱిగినంతనే నిన్ను వధింపకమానరు. జరాసంధున కొక్కనికే రాజనామ ముక్తమైనది. ఈకృష్ణుండు దాసుఁ డనియు, రాజుగాఁ డనియు నతఁ డీతనితోఁ బోర ననెను. అట్టి మహనీయునితో క్షత్రియోచితశౌర్యమును జూప లేక, విప్రవేషంబున వానిపురంబు సొచ్చి సతతము బ్రాహ్మణభక్తిపరాయణుండై యామహాత్ముఁ డొసంగ వచ్చిన పూజలఁ గొనక, వానిని మల్లయుద్ధమునకు లాగి మోసమునఁ జంపించెను. ఈపనులను మే లనువా రున్నారా? నీవు తెలివి లేక మూఢుఁ డవై యీ యాదవునకు జగన్నాయకత్వ మారోపించెదవు. జగన్నాథుండే యగునేని బ్రాహ్మణోచితమైన యర్చల నీతం డేల గ్రహింపఁడు? వానిసంగతి యెట్లుండినను పాండవులు సైతము ధర్మమార్గమును దొలఁగి వర్తింపఁ గంటి. ఇది నాకు వింతఁ గొల్పుచున్నది. చక్కఁగా నాలోచించినచో నిది యొక వింత కానేరదు. ఏల యనఁగా, స్త్రీసముఁ డవును, ముసలివాఁడవును నైన నీవు చెప్పిన యాలోచనముచొప్పున నీవు బోధించు ధర్మానుష్ఠానమున వీరు నిక్కువముగా నధర్మపరులైరి. అని కఠినవాక్కులతో నాక్షేపించుచుండు శిశుపాలుంజూచి కోపమడంప నేరక భీమసేనుండు మిక్కిలి క్రుద్ధుండై రౌద్రాకారమును దాల్చి తామర రేకులవలె వెడలుపులైన కన్నులు విస్తారమగు కోపావేశమున నెఱ్ఱని కాంతిచే విజృంభించి మిక్కిలి భీతిఁ గొల్పఁగా, నపరాంతకుండో యను నట్లు నొసటియందు బొమముడి మూఁడుపాయలు గలదియై త్రికూట పర్వతమున మూఁడుపాయలుగాఁ బాఱుచున్న గంగానదిని బోలెను.

యాగశాలలో నున్న రాజలోక మంతయు భీతిల్లునట్లు రౌద్రరసము వెలువడఁ గోపించి, పండ్లు పటపటఁ గొఱుకుటచే భయంకరమయిన ముఖము గలవాఁడై శిశుపాలుని నొక్కిపెట్టి చంపుట కుద్యమించిన భీమసేనుని భీష్ముం డనేకవిధముల శాంతచిత్తుం జేసి యాపుటయు, సముద్రుండు చెలియలికట్టను దాఁటునట్లు భీమసేనుండు భీష్మునిమాట నుల్లంఘింప నేరఁడయ్యె. అంత శిశుపాలుండు భీమసేనుండు తనపై కుఱుకుట కుద్యమించుటయు, వానిని భీష్ముఁ డాపుచుండుటయుఁ జూచి పరాక్రమ మినుమడింప, సింహము నీచపశువునుం బోలె, నాతని సరకుగొనక, భీతిల్లక నగుచు భీష్మునితో నిట్లనియె. 'భీష్మా! ఈ పొగరుపోతును వదలుము. నిప్పునఁ బడిన మిడుతవలె, నీ తఁడు నా శౌర్యాగ్ని దగ్ధుండగుచుండ నీరాజు లందఱు కన్నులారఁ జూతురు గాక!' యని చెప్పి భీముని పోరునకుఁ జీరుచుండఁగా భీష్ముండు భీమసేనున కిట్లనియె.

## భీష్ముండు భీమసేనునకు శిశుపాలువృత్తాంతం బెఱింగించుట

భీమసేనా! వినుము. ఈ శిశుపాలుని జననాదివృత్తాంతంబు చెప్పెద. వీఁడు పుట్టుకతో మూఁడుకన్నులును నాల్గుచేతులును గల్గినవాఁడై గాడిదెవలె నోండ్రపెట్టుచుండెను. అప్పుడు వీనిమాతాపితరులగు సాత్వతీదమఘోషులు వీనివికృతస్వరూపమునకు సందియపడి వీనిం ద్యజింప నిశ్చయించుకొనిరి. అప్పు డాకాశవాణి వారి కిట్లనియె. 'దమఘోషసాత్వతులారా! మీరీకుమారుని విడువవలదు. వీఁడు పరాక్రమవంతుఁ డగును. వీని కిది మరణకాలము కానేరదు. వీనిం జంపునిమిత్తమొక మహాపురుషుండు పాయుధుండై పుట్టియున్నవాఁడు.' అని చెప్పఁగా సాత్వతి విని పుత్త్రమోహంబున వికృతస్వరూపముతో నున్న వాఁడైనను వీనిం ద్యజింప నొల్లక యావచనములను జెప్పిన యశరీరభూతంబునకు మ్రొక్కి 'యోయశరీరభూతమా! ఈకుమారునకు మృత్యువై పుట్టిన మహానీయుం డెవ్వాఁడు? వివరింపు మనఁగా, 'నే పురుషుండు వీని నెత్తికొన్నప్పుడు వీని మిక్కిలికన్నును, మిక్కిలిచేతులును నదృశ్యంబులగునో, వాఁడ వీని కంతకుండై వీని నచిరంబ వధించు'నని చెప్పి యా యశరీరవాణిపలుకుట మానెను. అంత సాత్వతియుఁ దన వింతకుమారునిఁ జూచు

వేడ్క వచ్చువారి యందఱచేతి కెత్తుకొన నిచ్చుచుండె. అంత నొక్క
నాఁడు బలరామకృష్ణులు తమ మేనత్తసాత్వతిం జూచువేడ్కతోఁ జేది
పురంబు సొచ్చి దమఘోషునితోఁ గొంత కుశలప్రశ్నముల నడిపి
యంతిపురంబు ప్రవేశించి సాత్వతిం జూచిన, నాయమ పరమానందభరి
తయై వారితో సంభాషించి, మొదటఁ దనవింతబిడ్డను బలరామునిచేతి
కిచ్చెను. ఆతం డెత్తికొనినపిదప సాత్వతి వాసుదేవునియొడియందు
నాబిడ్డ నుంచెను అట్లు పద్మనాభుం డాబిడ్డ నెత్తికొనుచుండఁగనే వాని
యెక్కువకన్నును, నెక్కువచేతులు నదృశ్యంబు లయ్యె. అంత సాత్వతి
తొల్లింటి యశరీరభూతగపు మాటలను దలంచి వ్యథితచిత్తయై తనకుమా
రునకు మరణము దేవకీసుతునిచేత నగు నని నిశ్చయించి, వాసుదేవా!
వెఱచినవారివెఱ్ఱి నుడుపు మహనీయుఁడ వగు నో పరమపురుషా! నీవు
వీనిదోషములను మన్నింపుమని వరంబు వేఁడుకొనెను. అప్పుడీపరమపురు
షుండు వీనితప్పులను నూఱింటిని మన్నించెద నని చెప్పియుండె. అది
కారణంబుగా వీఁ డితరులచే నవధ్యుండు కావేని వీఁడు నన్ను రణము
నకుఁ బిలుచునంతటిపోటుమానిసియే. భగవంతుఁ డగు వాసుదేవుండు
వీనియం దుండుతనతేజమును మరల గ్రహింప నున్నట్లు తోఁచెడిని.
కాదేని మతిమాలి యీతం డిన్ని యవివేకపుఁబల్కులం బల్కునే?
వీనికిఁ జేటుకాలము సమకూడిన ట్లున్నది అని చెప్పఁగా, విని శిశుపా
లుండు భీష్మున కిట్లనియె.

భీష్మా! కేశవునకుఁ గల బలశౌర్యములు శత్రువుల కైన నలదు.
ఈతనిని బూఁతు వాగడిపట్లు పొగడెద వేల? ఇందులకు మాఱుగా
బాహ్లికుఁడగు నరపతిఁ బొగడుము. ఆమహనీయుండు పుట్టినపుడు భూమి
పగిలె నని వినుము. కాకున్నఁ బుట్టుకతోఁ గవచకర్ణకుండలములు
గల్గి విరాజిల్లుచుండువాఁడును, బంగారుకాంతివంటి మేనికాంతిగలవాఁ
డును, వంగదేశాధిపుఁడును నైన కర్ణుని నుతింపుము. కర్ణుఁడు రాజుల
కెల్ల నోర్వరానివిక్రమశాలి యగు జరాసంధునితో మల్లయుద్ధముచేఁ
బోరి వానిశరీరమును గాయపఱచెను. మఱియును భారతవీరులకెల్ల
నాచార్యుండును వృద్ధుండు నైన ద్రోణుని శ్లాఘింపుము. అంతటితోఁ
దనివి కలుగకేని కృపాశ్వత్థామలను, బాహుపరాక్రమవంతుఁడైన

రాజేంద్రుఁ డగు దుర్యోధనుని నుతింపుము. కాదేని సైంధవుని, కింపురుషాచార్యుం డగు ద్రుముని, భీష్మకుని, రుక్మిని, దంతవక్త్రుని, భగదత్తుని, యూపకేతుని, జయత్సేనుని, విరాటుని, ద్రుపదుని, శకునిని, బృహద్బలుని, విందానువిందులను, పాండ్యుని, శంఖుని, వృషసేనుని, గాళింగుని, నేకలవ్యుని నింకను బొగడ నర్హులగువారినిఁ బొగడుము. వే యేల? పరిశీలింపఁగా నాత్మస్తుతి, పరనింద, యాత్మనింద, పరస్తుతి యుత్తమవృత్తములుగావని ధర్మజ్ఞులు సెప్పుదురు. కావునఁ బరస్తుతి చేసి యయోగ్యవృత్తి నాచరించితివి. అదియును భోజపతికి లోఁబడిన యొకసామాన్యుని బొగడి వానిని జగన్నాథుఁ డని కేవలకామమున నంటివి. వాఁడు పలుగాకి యనఁబడఁదగినవాఁడు. ఉచిత మెఱుఁగినవారి కిది తగదు. ఎట్టి బోధములను జేసినను నీదుబుద్ధి సన్మార్గమునందుఁ జొరనేరదు. భూలింగపక్షి యితరులకు ధర్మబోధ సేయుచుఁదాను ధర్మమార్గమునఁ బ్రవర్తింపనట్లు, నీవు ధర్మబోధము సేయుచు సదాచారమున వర్తింపవు. ఆపక్షివృత్తాంతమును వినుము. హిమవత్ప్రాంతములయందు భూలింగశకుని యనునది యందఱకును సాహసము చేయకుఁ డని బోధించుచుండును. తాను మాత్రము సింహము నోరు తెఱచునప్పుడు దానిపండ్లసందున నుండు నామిషమునకై తటాలు మని దాని నోటఁ బడి యది యుపేక్షించునంతవఱకు సుఖముగ నుండును. అట్టివిధమున నో భీష్మా! నీవు నిన్ని రాజులెల్లవారును దయఁ దాల్చి చూచుచున్నంతవఱకును సుఖముండుదువు. కాదేని లోకగర్హితమైనకార్యము లొనర్చు నీవును నిన్నినాళ్లు జీవించి యుండ నేర్తువే? యని యుపాలంభనపూర్వకంబుగాఁ బ్రల్లదంపుఁ బలుకులను బలికెను.

ఆపరుషవచనములను విని శిశుపాలునితో భీష్ముఁ డిట్లనియె. 'శిశుపాలా! వినుము. ఈరాజులదయవలనఁ గాదే నేను జీవించి యున్నానంటివి. ఇదిగో చెప్పెదను. వీరిదయ నాకువలదు. ఇచ్చోట నున్నరాజులను నేను దృణసదృశులనుగనైనఁ జూడను.' అని తెగఁబల్కఁగా, నాపౌరుషవాక్యములకుఁ గొందఱు రాజు లిది మహాశూరుండైన భీష్మునకుఁ జెల్లిన మాట యనిరి. కొందఱు మూఢాత్ములు భీష్ముఁడు మన్నింపఁ దగఁ డనిరి. మఱికొందఱు వీఁడు పాపాత్ముఁడు మదించియున్నవాఁడు. ముసలితన

మువలన యుక్తాయుక్తముల నాలోచింపఁడు. వీఁడు పశువుంబోలె వధింపఁబడ నైనను, లేక కటాగ్నియందు దహింపఁబడనైనను నర్హుఁడు. భీష్ముఁ డా శిశుపాలునిదుష్టవచనములను విని 'యో రాజులారా! వీనితో మాటకు మఱుమాటలాడినఁ బ్రయోజనము లేదు. మీరాపట్టిన ప్రతినలను బౌరుషవంతు లగుదురేనిచేయఁబూనుకొనుఁడు. పూజార్హుండైన గోవిందున కగ్రపూజాన మొనర్చి మీయందఱశిరలపై నిదే నా కా లుంచితిని. చావుగోరినవాఁడు శార్ఙ్గపాణియును, సుదర్శనచక్రధారియును, గౌమోదకి యను గదను దాల్చినవాఁడును, పాంచజన్య మను శంఖమును బూరించువాఁడును నగు వాసుదేవునితోడఁ బోరాడి వానిమహాశరీరమును జొచ్చుఁగాక' యనెను. అంత శిశుపాలుండు శ్రీకృష్ణునిఁజూచి, 'వాసుదేవా! నాతోడఁ బోరఁ గలుగుదు వేని లేచిరమ్ము. నిన్ను వధింతు నేని యీపాగరుపోతైన భీష్ముఁడుదం బడఁగును. ముందు నిన్ను సమరమున వధించి యీవలఁ బాండవుల యుక్కడంగింతు. వారలు వధార్హులుగాకున్నను దెలివిమాలియుండుటఁగానఁ బరదాసుఁడ వగు నీమాట లాలించి నిన్నుఁ బూజించి నీకనురక్తు లగుటంజేసి వారును నీవలె వధ్యులయిరి' అని గోవిందు నుద్దేశించి తెగఁబాఱి పల్కెను.

## కృష్ణుఁడు చక్రాయుధముచే శిశుపాలునిఁ జంపుట

ఈమాటల నన్నింటిని వినుచుండిన జనార్దనుండు యజ్ఞశాలలోనున్న రాజులం జూచి యిట్లనెను. 'ఓరాజన్యులారా! వినుఁడు. ఈశిశుపాలుఁడు కారణము లేక యాదవు లగు మా కెన్నియేనపకారములఁ గావించియున్నాఁడు. మేము ప్రాగ్జ్యోతిషపురముపై దండెత్తి పోయి యుండఁగా, వీఁడు మాకు మేనత్తకుమారుం డయ్యును ద్వారకపైకి దండు వెడలివచ్చి మాపురమును గాల్చిపోయెను. విలాసార్థము మేమందఱము స్త్రీలతో రైవతకపర్వతప్రదేశములయం దుండఁగా వీఁడచ్చోటి కేతెంచి మాలోఁ గొందఱ నన్యాయముగాఁ జంపి కొందఱు స్త్రీలఁ జెఱపెట్టెను. దేవాభుఁ డగు మాతండ్రి వసుదేవుఁ డశ్వమేధముఁ జేయఁబూనఁగా నా యశ్వమును గట్టి యశ్వరక్షకు లగుసోవీరులను గొట్టి యశ్వము నపహరించెను. మఱియుఁ దపస్వినియు, నకామయు

నగుబభ్రునిభార్య నపహరించికొనిపోయెను. మొదట మాతండ్రిచే
వరింపఁబడిన విశాలనృపాలునికూఁతు రగుభద్ర యనుదానిని గంసునివేష
మునుదాల్చి యపహరించెను. మఱియు వీఁడు పొగరుపోతై రుక్మిణిని
వివాహము చేసికొన యత్నించెనుగాని, శూద్రుఁడు వేదములను బొందుట
కర్హుఁడు కా నట్లు దానిఁ బొందనేరఁడయ్యె. మఱియు నీదురాత్ముఁడు
మాకొనర్చిననేరము లెన్ని యేఁ గలవు. ఎన్ని చేసినను నేను నాఁడు
మామేనత్తతో నాడినపలుకుల నాదరించి యూరకుంటిని.' అని చెప్పు
చుండఁగనే శిశుపాలుఁడు పకపక నవ్వి, 'కృష్ణా! మున్ను నేను వరించిన
కన్యకను రుక్మిణిని బెండ్లియాడి యిట్లు సభలో సిగ్గులేక మాటలాడుట
నీక తగును. యోగ్యుఁ డెవ్వఁడేని సభలో స్త్రీలమాటలను వచించునే?
వే యేల? నీయోర్పుననే జీవించియుంటి నట్లు చెప్పుచున్నావు. నీ
కోపమునకు నే నెంతమాత్రము వెఱవను. నీప్రసాదమున నుబ్బను.
శక్తుఁడ వగు దేని, నీయిచ్ఛమైఁ బ్రవర్తింపుము.' అని చెప్పఁగా, శ్రీ
కృష్ణుండు తనసుదర్శనచక్రమును దలఁచెను. అది తత్క్షణము జగన్నాథు
చేతి నలంకరించెను. అప్పుడు చక్రపాణి రాజలోకము నెల్లఁ గలయఁ
జూచి, 'నేను మామేనత్తసాత్వతింజూచి వీనియపరాధశతంబుల సైచితి.
అవి మితి మీఱుచున్నవి. ఇఁక నేను వీనిని నోర్వ' నని యొఱుంగఁజెప్పి
నిఖిలదానవదర్పనిషూదనంబైన చక్రమును శిశుపాలునిపైఁ బ్రయో
గించె. అయ్యది వేవేగ వానిశిరస్సును దునిమెను. వాఁడును వజ్రముచేఁ
గూలిన పర్వతమువోలె నేల కొఱఁగెను. వెంటనే వానిదేహమునం
దుండి యొకదివ్యతేజము వెలువడి పురుషోత్తముం డగు శ్రీకృష్ణుని
మేను సొచ్చె. దాని నెల్లరు రాజులును జూచుచు విస్మయం బందిరి.
ఆకసమున మేఘములు లేకయే పిడుగులతోడ వర్షము కురిసెను.
మేదిని గడగడ వడఁకెను. వాసుదేవునిమహిమ యిట్లుండునే యని
కొందఱు రాజు లనిరి. మఱికొంద ఱేమియుఁ జెప్ప లేక చేతులు పిసికి
కొనిరి. వేఱొకకొందఱు కోపమునఁ బెదవులు కొఱికిరి. ఇంకనుం గొంద
ఱొంటరిపాటున జగన్నాథునియద్భుతకార్యముల నుతించిరి. కొందఱు
మధ్యస్థులై యూరకుండిరి. యాగశాలయం దున్న బ్రాహ్మణులును నుత్త
ములైన యితర రాజులును నానందమునఁ బురుషోత్తముం బ్రశంసిం

చిరి. ఇవ్విధమునఁ గమలపత్త్రాక్షుఁడును లోకపూజితుఁడును నగు శ్రీ
కృష్ణుఁడు సత్కరింపఁబడుచుండఁగా, యుధిష్ఠిరుండు శిశుపాలుకళేబర
మును సభయం దుండి వెలి కెత్తుకొనిపోవునట్లును సంస్కార మొనర్చు
నట్లు నాజ్ఞాపించి చేదిరాజ్యమున నాశిశుపాలపుత్త్రు నభిషిక్తుం జేసె.

ఇవ్విధంబున యుధిష్ఠిరుఁడు సంకల్పించిన రాజసూయయాగము
సకలపదార్థసంభృతంబును, సర్వజనమానసోల్లాసకరంబును, ధనధాన్య
సమృద్ధంబును, బహుభక్ష్యాన్నపానీయసమేతంబును, జగన్నాథరక్షితం
బును నైనమాప్తప్రయోగంబు కాఁగా, యాగదీక్షితుండవభృథస్నాతుండై
యున్నప్పుడు రాజన్యు లందఱు నాతని సమీపించి యిట్లనిరి. 'మహాభా
గ్యంబున సామ్రాజ్యమును సాధించితివి కౌరవకుల ప్రతిష్ఠాపకుఁడవైతివి.
నీమహితతేజంబున నీకులం బంతయుఁ బ్రకాశించెను. ధర్మము నీయందు
సుప్రతిష్ఠితమై యుండును. స్వదేశమునకుఁబోయెదము. సెలవొసంగుము.'
అని చెప్పఁగా, యుధిష్ఠిరుండు వారినెల్ల నుచితసత్కారంబులఁ బూజించి
తమ్ములం బిలిచి వారివారిమర్యాదలకుఁ దగినట్లు వారిని హస్తినాపురి
యెల్ల దాఁటించి రమ్మని యాజ్ఞాపించె. అంత భీష్మధృతరాష్ట్రులను భీమ
సేనుండును, ద్రుపదు నర్జునుండును, సుబలునిఁ బుత్త్రసమేతముగా నకు
లుఁడును, ద్రోణాశ్వత్థామల సహదేవుండును, విరాటుని ధృష్ట
ద్యుమ్నుండును, పర్వతప్రదేశపురాజులనందఱ నభిమన్యుండును, నితర
రాజులను ద్రౌపదేయులును సాఁగనంపిరి. ఈరీతిన సకలరాజులును ధర్మ
జుచే ననుజ్ఞాతులై తమదేశంబులకుఁ బోఁగా నొక్కనాఁడు జగన్నా
థుండు ధర్మపుత్త్రు నుద్దేశించి యిట్లనియె. 'మహానుభావా! నీవు భాగ్యవిశే
షంబున సామ్రాజ్యము నధిగమించితివి. నీవంటి ధర్మాత్ములు గలరా?
నేను ద్వారకకుఁ బోయివచ్చెద' ననఁగా, నాపుండరీకాక్షునకు దిగంత
విశ్రాంతయశుండైన ధర్మజుం డిట్లనియె. 'మహాత్మా! నీకరుణఁబట్టి రాజులెల్లను
నాకుఁ గప్పములు నీఁగంటిని. సామ్రాజ్యపదవి నందఁ గంటిని. రాజ
సూయయాగంబు నిర్విఘ్నంబుగ నెఱవేర్పఁ గంటిని. నీవు నా కండగ
లేకున్న నే నొక్కనిమేషమైన నుండ నేరను. కాని, నీకు ద్వారకకుఁ
బోవలసిన యత్యావశ్యక మగుకార్యము లుండుటచే నేను నందులకు
సమ్మతించితిని.'

ఇవ్విధంబున యుధిష్ఠిరునిచే సెలవుఁ బొంది యామహానీయుండు తనవెంటరాఁగఁ బుండరీకాక్షుండు కుంతియొద్దకేఁగి, 'యత్తా! నీకొడుకులు సామ్రాజ్యమును బొంది సర్వరాజన్యులను వశపఱచుకొని, ధనధాన్యసమృద్ధులై సామంతులు కొలుచుచుండఁ గృతార్థులైరి. నీకు మనస్సంతోషము కలిగినదిగదా! నేను ద్వారకకుఁ బోయి వచ్చెద' నని చెప్పి ద్రౌపదీసుభద్రలతోఁ దనప్రయాణమును జెప్పి, యంతఃపురము వెడలి స్నానజపాదులను దీర్చి విప్రులకు నమస్కరించి వారియాశీర్వచనములఁ బడసి సకలసమరసాధనసంభృతంబును, దారుకసారథికంబును, గరుడధ్వజంబును, సైన్యసుగ్రీవమేఘపుష్పబలాహకనామకదివ్యరథ్యయోజితంబును నగునిజరథం బారోహించి, తన రథమువెంటఁ బాదచారులై వచ్చుచుండు యుధిష్ఠిరాదులంజూచి, యంతఁగొంతవడి యరదంబు నిలువ దారుకునియమించి ధర్మజుం బిలిచి యిట్లనియె. 'ధర్మపుత్రా! నీ వెఱుంగనిధర్మంబులు లేవు. సర్వప్రాణులకుఁ బర్జన్యుండును, బక్షులకు వృక్షంబులును, సురలకు సురపతియునుం బోలెఁ బ్రజల కెల్ల నాధారంబవై పరాకు లేక రాజ్యపరిపాలన మొనర్పుము' అని హితమును బోధించి వా రనుపఁగాఁ బ్రయాణమయ్యెను. పాండవులును సర్వలోకారాధ్యు నంపి తామును మఱలి పురమును జేరిరి. ఇవ్విధంబున యాగము నిమిత్తమై వచ్చినవారెల్ల దమతమదేశములకుఁ బోఁగా, దుర్యోధనుండు శకునిసమేతుఁడై మయసభసొంపును జూచువేడ్క నందఁ గొంతకాల ముండెను.

## ధర్మరాజు వ్యాసునివలన నుత్పాతములు విని సమయము చేయుట

ధర్మజుండా తెఱంగున మధుసూదనుని ద్వారకకుఁ బంపి తమ్ములతో వెనుకకుఁ దిరిగి నగరు సొచ్చి సభామంటపమున సింహాసనముపై సుఖాసీనుండు కాఁగా, నచ్చోటికి వేదవ్యాసుం డరుదెంచెను. అంత నమ్మునీంద్రున కర్ఘ్యపాద్యాద్యుచితపూజల నొనర్చి యామహనీయుని నొక కాంచనాసనంబున నుపవిష్టుం జేయఁగా, బాదరాయణుండు యుధిష్ఠిరుని నుచితాసనమునఁ గూర్చుండ నియమించి యారాజన్యునితో నిట్లనియె. 'ధర్మపుత్రా! నీవు పుణ్యఫలంబున సన్యరాజులచేఁ బడయరాని సామ్రాజ్యపదవినిఁ బడసితివి. భూలోకములోనిరాజు లెల్లరు నీకు వినయ

విధేయతలం జూపి కప్పములను కానుకలను గొనితెచ్చియిచ్చిరి. కౌరవ
కులంబెల్ల నీవలనఁ బ్రదీప్తం బయ్యె. నీ వొనర్చినపూజలచే సంతుష్టుఁడ
నైతి. సెలవిమ్ము. పోయివచ్చెద' ననఁగా, నమ్మునిచంద్రునడుగుల కారాజ
చంద్రుండు మ్రొక్కి యిట్లనియె. 'మహాత్మా! నన్నొకసంశయము
వేధించుచున్నది. ఆసంశయవిచ్ఛేదమునకు నీవు దప్ప నన్యు లెవరును
శక్తులు గారు. ఉత్పాతములు దివ్యము లనియు, భౌమము లనియు,
నాంతరిక్షము లనియు ముత్తెఱఁగు లని మున్ను నాకు నారదుఁడు వివ
రించియుండె. శిశుపాలునివధము యజ్ఞకాలమున నైనది కదా! అది
యుత్పాతములలోఁ జేరినదా' యనఁగా సాత్యవతేయుం డిట్లనియె. 'ధర్మ
పుత్త్రా! సందియ మేమి? ఇది యుత్పాతము. దీనిఫల మిఁక పదుమూఁడే
డులకుఁ గాన నగు. అది దుర్యోధనాపరాధముచే నీవు నిమిత్తముగ
నేర్పడి, భీమార్జునులశౌర్యమున ననేకరాజన్యులు ఘోరయుద్ధమున
మడియుదురు. నీ వీరాత్రియైనపిదపఁ బ్రభాతమున వృషధ్వజుని, నీల
కంఠుని, భవుని, స్థాణువును, గపాలినిఁ,ద్రిపురాంతకుని, రుద్రుని,
నుగ్రునిఁ,బశుపతిని, మహాదేవుని, నుమాపతిని, హరుని, శర్వుని, వృషుని
శూలినిఁ, బినాకినిఁ, గృత్తివాసుని, వృషభవాహనము నెక్కి దక్షిణదిశం
జూచుచున్నవానిని గలలోఁ జూచెదవు. క్షత్త్రియవినాశమునకు వందు
రకుము. కాల మెల్లవారి కనుల్లంఘనీయము. అప్రమాదుండవై శాంతి
యుతుండవై ప్రజల నేలుము. శుభముల నందుము. నేను శిష్యగణ
ముతోఁ గైలాసమున కరుగ నున్నవాఁడ' నని చెప్పి ధర్మపుత్త్రుసెలవుఁ
బొంది యేగెను. యుధిష్ఠిరుం డమ్మునీంద్రువచనములఁ దలపోయుచు
మనస్సునఁ జింతాశోకములు పెనఁగొనుచుండ వేడినిట్టూర్పులు వద
లుచుఁ 'గాసున్నయది కాకమాన' దని నిశ్చయించి తమ్ములం
బిలిచి వారితో వ్యాసవచనంబులను జెప్పి వానిని విన్నంతనే తన
శరీరమును దాను వదలుటకు నిశ్చయించితి ననియుఁ, దననిమిత్తముగఁ
బలువురు క్షత్త్రియులు తెగుటకంటెఁ దాన చచ్చుట మే లనియుఁ
జెప్పుచు దైవకృతమునకు దిగులొందియున్న యన్న కర్జునుం డిట్లనియె.
'మహీపాలా! ని న్నిట్లు శోకమోహము లావరించునే? ధైర్యము నవ
లంబింపుము. మహీప్రజల కెల్ల శుభము లొడఁగూర్చుకార్యముల

నాచరింపుము.' అనఁగా యుధిష్ఠిరుం డిట్లొకసమయము చేసెను. ఈ దినము మొదలు పదుమూఁడేడులు పూర్తియగువఱకు సోదరులతోను, దక్కఁగలసామంతులతోను, జ్ఞాతివర్గముతోను కఠినముగ భాషింపను. ఎల్లవారి కప్రియంబు గాక వర్తించుచో భేద మేల కలుగు? భేదము పొడమ కున్న వైరము కలుగ నేరదు. కావున నివ్విధమున లోకమున నింద సంభవింపకుండఁగా కాలము ద్రోయుదు నని సకలజనసమ్ముఖంబునఁ బ్రతిజ్ఞఁజేసి, పితృదేవతలకుఁ బూజలఁజేయు నుద్దేశముతో సోదరులతోఁ గూడికొని కృతకళ్యాణుండై యుండె.

అట దుర్యోధనుండు శకునియు నింద్రప్రస్థపురమున నున్నపు డామయనిర్మిత మైన సభయందలివినోదములం జూచుచు, నచ్చోటన కొన్ని దినములుండి యరుదైనదానిరామణీయతకు వింతపడి దానిదివ్యాభిప్రాయముల నెఱుంగుచు, నాయా ప్రదేశములఁ దిరుగుచు నొక్కచో నింద్రనీలమణులచేఁ జెక్కఁబడిన నిర్మలమణిమయస్థలమును జల మని శంకించి కట్టిన పుట్టం బెగఁ ద్రోచికొని, మఱియొక్కచో స్ఫటికవిమల కమలములచే నొప్పారుగుంటలను స్థల మను భ్రాంతిచేఁ గట్టుబట్ట తడియ నందుఁ జొచ్చుటయు, భీమసేనాదిపాండవులును బాంచాలియును గింకరులును నగిరి. దాని నెఱింగి యుధిష్ఠిరుండు దుర్యోధనునకుఁ బ్రీతిప్రకటిల్ల దివ్యదుకూలములఁ గట్ట నిచ్చె. మఱియు నందు సుయోధనుండు గ్రమ్మఱుచుండువాఁడు తెఱచియుండు వాకిలిని మూసినదానినిగా నెఱింగి చొఱనొల్లక చేతుల దానిం ద్రోవం బోయి క్రిందఁబడి, మూసిన కవాటములుగల స్ఫటికద్వారమును దెఱచినదానిఁగా నెంచి చొరఁబోయి యావాఁకిటితలుపు నందలి స్ఫటికశిలచే నభిహతలలాటుండై, సమమయిన నేలను మిట్టనేల యని భావించి యెక్కఁబోయి క్రిందఁబడి లజ్జావనత వదనుండై ధర్మజుమహాధ్వరంబున కసూయపడుచు, నతనిసామ్రాజ్య లక్ష్మికిఁ గుందుచు, సకలజనులకుఁ గన్నులపండువైన యాసభాలక్ష్మి తనమనమునకును, నేత్రములకును నగ్నిజ్వాలయై మహాదాహము చేయఁగా, గ్రీష్మకాలమందలి యెండలవేఁడిమిచే నింకి క్షీణించుచున్న చిన్నగుంటవోలె దగదగ మని యెరియుచున్నమనస్సుతో ధర్మరాజాను మతుండై హాస్తిపురమునకుఁ బోయెను. అట్లు సుయోధనుశరీరము

కందుబంగారమును గాఁచినఁ గందిపోయి వివర్ణమగునట్లు మనోవేదనాగ్నిచే దహింపఁబడి వివర్ణుఁడై కృశించెను. మిత్రులతోఁగాని, యాప్తవర్గముతోఁగాని, తమ్ములతోఁగాని పలుకకుండ, ఇవ్విధంబున నుండువాని శకుని చూచియిట్లనియె. 'సుయోధనా! యేమికారణంబున నిట్లైతివి? నీకుఁ గుందనేల?' అని యడుగ మామ కల్గుం డిట్లనియె. 'మామా! నేనేమని వచింతును? అర్జునుని వాస్త్రమహిమంబునను నతనిపరాక్రమమునను యుధిష్ఠిరుండు భూమండలమునంతను సాధించికొనెను. రాజసూయమహాయాగంబొనర్చి, దేవతలలో నింద్రునింబోలె రాజులలో మేటియై ప్రకాశించి సామ్రాజ్యలక్ష్మిచే వరింపఁబడెను. సర్వమహీపతులును బాండవులకు వశులైరి. జనార్దనుండు శిశుపాలుని వధించుచుండ నా సభలోనుండు రాజులెవ్వరే మన్నరైరి. వాసుదేవప్రభంజనప్రేరితమైన పాండవప్రతాపాగ్నిచే దహింపఁబడి రాజు లంగములను మిన్న కుండిరి. అంతియకాక యారాజులెల్లరును బాండవులకు వైశ్యులవోలె వశ్యులై వివిధరత్నాదులఁ గానుకలుగా సర్పించిరి. వారివిభవంబు లోకోత్తరంబగుట నీవును గంటివి గాదే? వారత్యంతము నైపబలసహాయులు. వారికి మనమొనర్చినయపరాధము లన్నియును మేళ్ళగును. వారిసంపద నంతయు నపహరించుట కుపాయ మెద్దియును నేఁ గాన లేను. నేనొకరాజసుతుండనై సపత్నులగ్రైశ్వర్యమును జూచుచు దీనుండనైతి. ఇట్లుండుటచే నేను వనద యగు స్త్రీనిగాని, శూరుండగు పురుషుఁడను గాని, నపుంసకుండను గాని కాకపోతిని. వీరిలో నెవ్వండనైనను గామిక్కిఁ జింతిల్లెదను. పురుషుఁడు చూపఁదగిన బలపౌరుషములను జూపలేనిపురుషుండు పురుషుఁడనఁబడునే? నేను స్త్రీనగుచోఁ బురుషుఁడు చూపఁదగిన శౌర్యమును జూపలేకపోవుటకుఁ గుంద నేల? నపుంసకుఁడ నగుదునేని పురుషత్వమునఁ బడయఁదగినసామర్థ్యము లేమికి వగవఁ జనదు. ఇట్టి నేనొకమనుష్యుఁడనై సపత్నుల వృద్ధిఁ జూచుచుండవలసివచ్చినదే యని నే నప్పటినుండి బలుకకున్నాను. మఱియును మన మాసభావిభవమును వీక్షించుచుండ వారందఱును నవ్వుచు జూచి నవ్వుట నీ వెఱుంగనిది కాదు గదా? ఈబ్రదుకు బ్రదుకుటకంటెఁ జావు మే లని యెన్నెద.

కావున నగ్నిచే దహింపఁబడికాని, విషమును మ్రింగి కాని యాత్మచ్ఛ
శరీరమును వదలెదను. ఈ నామనోవేదన నంతయు నాతండ్రి ధృత
రాష్ట్రునకుఁ దెలుపు' మనఁగా, నల్లునకు మామ యిట్లనియె. 'సుయో
ధనా! నీవు పాండవులసంపద కసూయపడరాదు. వారు ధర్మమార్గం
బున విక్రమించి యార్జించినసంపదతోఁ దులఁదూగుచున్నవారు. మఱి
యు వారికి దైవబలమ మెండు. దానివలననే కదా నీ వెన్నియపాయ
ములను వారికొనర్చినను వారి కవి యెవ్వియు హాని సలుప వయ్యెను.
ఇంతేగాక వారియదృష్టవశమున ద్రౌపది వారికి భార్య యయ్యె. దానం
జేసి సపుత్రకుఁడైన ద్రుపదుఁడు వారికి సామ్రాజ్యప్రాప్తియందుఁ దోడ్ప
డెను. దేవకీనందనుండు వారిని బుట్టిననాఁటఁగోలెఁ గంటిని ఱెప్పవోలెఁ
గాచుచుండును. అది యంతయు నెఱుఁగుదువు. ధర్మమున వారితండ్రిపాలు
వారిం జెందె. అర్జునుండు ఖాండవమును దహించి యగ్నిదేవుం దనియించి
గాండీవమును,నక్షయతూణీరములను,దివ్యాస్త్రములనుబొంది సకలమహీ
పతులను గెలిచె. ఖాండవమును దహించునప్పుడు తక్షకునింట
డాఁగియున్న మయుని నగ్నిదాహంబునుండి కాఁచి, వానిచే సభ నొక్క
దానిని నిర్మింపించికొని, మయప్రేరితకింకరులను రాక్షసులు దాని మోచి
కొని రాఁగా నింద్రప్రస్థముఁ జేర్పించె. వారియదృష్ట మెట్టిదియుం గానము.
వారియైశ్వర్యమునకు మనము కుందనేల ? వారికనేకులు సహాయులై
యున్నా రనియు, నీకు సహాయపడువా రెవ్వరు లే రనియుఁ జెప్పితివి.
ఆలోచింప నీ కుండుసహాయసంపద వారి కున్నదే ? దుశ్శాసనాదులగు
తొంబదితొమ్మండ్రు భ్రాతలు, మహాధానుష్కుండగు ద్రోణాచార్యుఁడు,
సర్వాస్త్రవేది యగు నశ్వత్థామ, సపుత్రకుఁ డగు కర్ణుఁడు, కృపా
చార్యుఁడు, సోదరసహితుఁడ నగు నేను, సౌమదత్తి మున్నగు వీరు
లనేకులుండ నీ వసహాయుఁడవే? మాసాహాయ్యమున నీవీపృథ్వినంతయు
జయింప నేరవే' యని చెప్పఁగా దుర్యోధనుం 'డట్లగు నేని మన మెల్ల
రము కూడి సైన్యమును జేర్చి పాండవులమీఁదికి దండెత్తిపోయి వారి
నోర్చి యామయనానవసభను హస్తిపురమునకుఁ గొనివత్తము గాక'
యనఁగా, వానికి శకుని యిట్లనియె. 'సుయోధనా! పాండవుల మనకు
గెలువ నలవియే ? వా రందఱును మహారథులు. శస్త్రాస్త్రపాండిత్యమున

నాటితేటినవారు. యుద్ధక్రియాకుశలులు. పరాక్రమవంతులు. వారు ద్రుపదుఁడును, వాసుదేవుఁడును బాసటగఁగలవారు. మహేంద్రుని తోడఁగూడ దేవత లెత్తివచ్చినను వారినోర్వ లేరు. కావునఁ గష్టము లేక సైన్యపాశము గాక వేఱొకయుపాయమున వారి నోర్వవచ్చును. ఎట్లంటేని వినుము. యుధిష్ఠిరుండు జూదమున నాసక్తిగలవాఁడు. జూదము నకుఁ బిలువ నతఁడు ముదమున నేతెంచి జూదమాడ యత్నించు నేని, నేను నాద్యూతవిద్యానైపుణ్యమును బ్రయోగించి యతనితో జూద మాడి, యాతనిరాజ్యసంపదల నన్నింటి నోడిచి నీ కిచ్చెద. దీనిని ధృతరాష్ట్రునకుఁ దెలుపుము. ఆరా జనుమతించినఁగాని యేకార్య మును జేయలేము. ఆతనియనుమతిం బొంది యీకార్యమును జరిపితిమేని, నీకోరిక కొనసాగును.' అని చెప్పఁగా, సుయోధనుండు 'మామా! దీని నెట్లో మాతండ్రికి నచ్చఁజెప్పి యెవ్విధముననైన దీని కాతని నొడఁబఱుపుము' అని ప్రార్థించెను.

ఇట్లు శకుని దుర్యోధనునిచే వేఁడఁబడినవాఁడై ధర్మరాజొనర్చిన యాగకృత్యమునకై సంతోషించుచున్న ధృతరాష్ట్రుపాలికి దుర్యోధను నితోఁ జని, యతఁడు చిక్కిచుండుటయు, నాతనిముఖవికాసము తఱుఁగుటయును జెప్పఁగా ధృతరాష్ట్రుండ దరిపడి పుత్త్రుం జేరఁదీసి యొడ లంతయు నిమిరి మిక్కిలి దుఃఖించుచు వానితో నిట్లనియె. 'కుమారా! కురుకులేశ్వరా! కౌరవసంపద యంతయును నీయందు సుప్రతిష్ఠితమై యున్నది. తమ్ము లందఱును, మిత్త్రు లెల్లవారును, నాశ్రితు లందఱు నిన్ను గౌరవముతోఁ జూచుచు నీ కనుసన్నలయియున్నవారు. సకల భోగములను మహేంద్రునిబోలె ననుభవించుచున్నాఁడవు. సామంతు లెల్ల నెల్లప్పుడు నిన్నుఁ బరివేష్టించి ప్రీతితో నీయానతి సలుపుదురు. ఇట్లు కృశించుటకును, విషణ్ణత్వము నొందుటకును నీ కేమి కొఱంత యయ్యె? సకలధరణీరాజ్యభోగములకు విముఖుఁడవు గానేల? ఎంత చింతించిన నీ విట్లగుటకుఁ గారణం బెఱుంగ నయ్యెద? ఉత్తమవస్త్రము లను ధరించెదవు. రుచిరమాంసాద్యన్నపానములను భుజించెదవు. ఉత్తమ వాహనముల నారోహించెదవు. లలితశయ్యలఁ బవ్వళించెదవు. సుంద రాంగులతో నున్నతదివ్యసౌధంబుల విలాసముతోఁ గ్రీడించెదవు. దేవ

తలకుం బోలె నీమాట కెదురు లేదు. నీవు కృశించునంత వగ నిన్నెట్లా వరించె?' అనఁగాఁ దండ్రికి సుతుం డిట్లనియె.

## దుర్యోధనుండు తండ్రితోఁ దనమనోదుఃఖము చెప్పుట

'నరేంద్రా! నే నొకనీచుచందమునఁ గాలముఁ గడపునిమిత్తమే దేనిఁ గుడుతుఁ గట్టుదుఁ గాని యతిదుర్భరంబైన మనోదుఃఖంబును భరింపలేకున్నవాఁడను. కంటికిఁ గూర్కు రాదు. రతికేళి సుఖముఁ గొల్పదు. నోటికి వంటకము రుచింపదు. మనస్సు నే సుఖమును సంతసింపఁ జేయదు. శత్రువులపేర్మిఁ జూడఁజూడ నా కిట్టిమనోవ్యథ తటస్థించినది. శత్రుభయము నుడిగించుకొనినరోషవంతుఁడే పురుషుఁడు. రాజు తాను సంపన్నుఁడను గా నున్నాను గదా యని సంతుష్టిఁ జెందియుండ రాదు. శత్రువిషయమునఁ బశ్చాత్తాపమును జూపరాదు. అట్లు తృప్తుఁడై పశ్చాత్తాపమునుఁ జూపుచో వాని కున్నయభిమానమును నశించు. కావున నే నెన్ని భోగముల ననుభవించుచుండినను, నెట్టి దుకూలవస్త్రములఁ గట్టినను, నెట్టి మధురాహారముల భుజించినను, ధర్మరాజు పడసిన సామ్రాజ్యలక్ష్మింజూచి మన మెఱియుచుండఁ దపించుచున్నాను. శత్రువు లభివృద్ధిఁ బొందుచుండుటను, దా నధమస్థితిఁ బొందుచుండుటను మానము గల రాజు చూచుచు వగవకుండునే? భావిపురాతనాద్యతన రాజులలక్ష్ములు యుధిష్ఠిరులక్ష్మీవిభవముతో సాటి గావు. భూమిలో నున్న రాజసమూహములో నాశత్రువు లగు యుధిష్ఠిరాదు లభివృద్ధితో నుండుటను జూచియే సుమా నే నివ్విధమునఁ గృశించి వివర్ణత్వము నొందితిని. ధర్మరాజు సంపదను లెక్కించుట సాధ్యమా? ఆ యాగకాలమునందు లోకములోనిరాజులెల్ల నాతనికిఁ గానుకలుగా ననేకవస్తువాహన రత్నాభరణములను గొల్లలుగాఁ దెచ్చియిచ్చిరి. దానంజేసి యాతఁడు దిక్పాలురకంటె సంపదగలవాఁడయ్యెను. అవ్విధమున నధికతేజస్సుతో వెలయుచుండు శత్రుసంపదఁ జూచి శాంతచిత్తుఁడనై యుండఁ గలనే?' అని చెప్పఁగా, నప్పుడు శకుని యిట్లనియె. 'యుధిష్ఠిరుండు జూదమాడుటయందుఁ బేరాసగలవాఁడు కాని, నేర్పుతో నాడలేఁడు. నే నాజూదములోనిమోస మంతయుఁ నెఱుఁగుదు. ఎటులయి

నను గపటోపాయంబుఁ బన్ని వానిసంపద నంతయు నిన్నుఁ జేరు
నుపాయ మొనర్చెద. జూదమాడుటకుఁగాని, యుద్ధమునకుఁగాని సాటి
రా జాహ్వానించుచో క్షత్రియధర్మముల నెఱిఁగినయుధిష్ఠిరుం డవశ్యము
ద్యూతమాడవచ్చువాఁడు. నేను ద్యూతవిద్యలోనికపటము లెల్ల నెఱుం
గుదు. కావున నతని జూదమునకుఁ బిలిచి జూదమాడించి, యాతనియైశ్వ
ర్యము పందె మొడ్డునట్లు చేసి, దాని నంతయు నవ్విధమున గెలిచి నీకు
నే నిచ్చెద. ఇది తప్పక చేయవలసినకార్యము.' అనఁగా దుర్యోధనుం
డంతఁ దండ్రిపాదములపైఁ బడి కన్నీరు గార్చుచు నెట్టులైన శకుని
యభిమతంబున కనుజ్ఞ నిమ్మని దైన్యముతో వేఁడెను. అంత వైచిత్ర
వీర్యుండు కొడుకున కిట్లనియె. 'పుత్రా! వినుము. ఈయుద్యమమంతయును
విదురునకుఁ దెలిపెదను. అతఁడు మహామేధావి. మంత్రమును లెస్సఁగా
నెఱింగినవాఁడు. ధర్మమును బరిశీలించి బాగుగ నాలోచించి యుభయ
పక్షములకును హితమును బోధించుటకు సమర్థుండు. విదురుని యాలో
చనచొప్పున నే నాచరింతును.' అనఁగా దుర్యోధనుండు 'నరేంద్రా! విదు
రునితో నీయాలోచనలు సేసినచో నాతం డిది వల దనును. ఈ కార్య
మునకు నీవొప్పనిచో నేను జీవములతో నుండను. నేఁ జచ్చినపిదప
నీవును విదురుఁడును నీమహీరాజ్యము నంతయు నెత్తినిగట్టికొని
యేలుచు సుఖంబుండుఁడు' అని కొంత చనవునను, గొంత దైన్యము దోఁచు
నట్లుగను బ్రలాపింపఁగ విని, ధృతరాష్ట్రుండు పుత్రమోహమున నేమియు
నన నేరక, యది చేయుకార్యంబైనను సుయోధనుతలంపున కాటంకము
చెప్పనేరక మయుసృష్టసభవంటిసభను శిల్పాచార్యుల ననేకుల రావించి
వేయి స్తంభములతో వెలయునదియును, నూఱువాకిళ్లుగలదియు, నానా
చిత్రములతోఁ గూడినదియు నగు మంటప మొక్కదాని నిర్మింపఁ బుత్త్రు
మనశ్శాంత్యర్థ ముత్తరువు నొసంగె. పదంపడి విదురుని రావించి, యాత
నికిఁ దన దురుద్దేశము దెలుపక గుప్తానిం జేయ నొల్లక జూదమునందలి
దోషముల నెఱింగియుఁ బుత్త్రమోహమున వానికి మాఱాడనేరక, జూద
పుఁ బ్రవర్తనము నంతయు విదురునకుఁ దెల్పె. అవ్విధంబున నావృత్తాంతం
బంతయు విదురుండు శాంతుండై విని మనంబున నిట్లు తలపోసెను. ద్వాప
రము ముగియవచ్చెను. కలియుగ మాసన్నమగుచున్నది. ప్రజాక్షయకరం
బగు మహాసంగ్రామము తప్పదు. దీని నుడుపుట కుపాయము లేదు. విధి

ప్రేరణంబును దప్పింపనేరికిని శక్యము కాదు. అని తనమనస్సున నాలోచించి, యాంబికేయు నడుగులకు మ్రొక్కి 'నృపాలా ! ఈయుద్యమమునకు నే నొప్పను. జూదము నెపముగాఁ బుత్త్రులలో వైరము కలుగును. అట్లు గాకుండఁ జేయుము' మనఁగా ధృతరాష్ట్రుఁడు విదురున కిట్లనియెను. 'విదురా! దేవతలు మనయెడ ననుగ్రహింతు రేని కలహ మేల కలుగు? దానివలన మేలు కీళ్లు కలిగినను, హితాహితములు వాదమైనను సుహృద్ద్యూత మిపు డవశ్యము కర్తవ్యము. నేనును, నీవును, భీష్మద్రోణులు నుండఁగాఁ బుత్త్రులలో భేద మేల కలుగు? దీన హాని కలుగనేరదు. శీఘ్రగాములగు గుఱ్ఱములను బూన్చినరథము నెక్కి యిప్పు డింద్రప్రస్థపురమునకుఁ బోయి యుధిష్ఠిరు నిటకుఁ దోడ్కొమ్ము. నానిశ్చయమును దూషింపకుము. విధికృతము దాఁట రానిది. కానున్నది కాఁగలదు.' అని స్పష్టముగాఁ జెప్పఁగా విదురుండు భీష్మునితో నీవృత్తాంతం బంతయుఁ జెప్పి, యాతని యభిప్రాయంబుఁ దెలియుటకుఁ జనెను. అనిన విని వైశంపాయనుం జూచి జనమేజయుండు 'మునీంద్రా! పాండవులకును ధార్తరాష్ట్రులకును ద్యూతవ్యవసాయ మెట్లు వర్తిల్లెను? వారు జూదమాడునప్పు డాసభలో నుండినవా రెవ్వరు? జూదము నాడఁగూడదన్నవా రెవరు? జూదము నామోదించినవా రెవ్వరు? దానివలననే సకలజనులును నశించిరి. ఈ వృత్తాంతం బంతయుఁ దేటపడం జెప్పవే? యని యడుగ, నామహీపాలునకు వైశంపాయనుం డిట్లు చెప్పం దొడంగెను.

విదురుఁ డట్లు ధృతరాష్ట్రునొద్దనుండి భీష్మునొద్దకుఁ బోవుచుండఁగనే ధృతరాష్ట్రుండు సుయోధనుం బిలిచి యొంటరిపాటున నిట్లనెను. 'పుత్త్రా! ద్యూతవ్యాపారము నుడుగుము. దానం గీడు వాటిల్లును. విదురుం డావ్యవసాయమున కభిమతంబును జూపఁ డయ్యె. అతండును మిక్కిలి ధీవిశాలుండు. కార్యాలోచనాపరుఁడు. దీర్ఘముగ నాలోచించువాఁడు. మనహితముఁ గోరువాఁడు. వాని సదాలోచనచే మనము వర్తించుట మేలు. మహేంద్రునకు సురగురుం డుపదేశించిన నీతిశాస్త్ర మంతయు నాతండు ప్రయోగసహితంబుగా నెఱింగినవాఁడు. మనలో విదురుఁడును, యాదవులలో నుద్ధవుండును నీతిశాస్త్రకోవిదులు, మహాప్రాజ్ఞులు, అనియుం దఱును వారిం గొనియాడుదురు. ఇంతేకాక ద్యూతవ్యవసాయమున భేద

మును, భేదమున రాజ్యవినాశముంగల్గు. కావున ద్యూతము త్యాజ్యము. నీవు మాతాపితరులచేఁ బొందవలసినకార్యముల నెల్లఁ బుత్రుండవై వడసితివి. కులక్రమాగతంబైనరాజ్యంబు నధిష్ఠించితివి. సకలభోగములను రాజోచితము లగువాని ననుభవించుచున్నవాఁడవు. సర్వశాస్త్రముల నభ్యసించితివి. పరదేశావాసకష్టములను బొందక యింటనే లాలితుండవై పెరిఁగితివి. నీసోదరులలో నీవ పెద్దవై జ్యేష్ఠత్వమర్యాదల నందుచున్నవాఁడవు. అన్యులకుఁ బడయరాని యాహారాచ్ఛాదనాది సర్వభోగముల ననుభవించుచుఁ బురుహూతువిధంబున రాజ్యము నేలుచున్నావు. ఇవ్విధంబున నేకొఱంత లేకుండఁగా నీకు వగపేల?' యనఁగా సుయోధనుండు తండ్రి కిట్లనియె. 'స్వాదుమధురపదార్థములను భుజించి, రమ్యములగు దుకూలములను ధరించి యాయనుభవమునకు మాత్రమే తృప్తుండై పౌరుషము నెంతమాత్రము నూపలేనివాఁడు రాజాధముఁడని మునుపు చెప్పఁగ నుండలేదా? ధర్మరాజుసంపదలో మనసంపద యెన్నవపా లని తోఁచెడిని. సమస్తపృథివీమండలమును యుధిష్ఠిరునివశమై యుండుటం జూచి సహించి ప్రాణములతో నుండుటయే నామనస్థైర్యమునకు నిదర్శనము. నీపులు, చిత్రకులు, కౌకురులు, కారస్కరులు, లోహజంఘులు యుధిష్ఠిరునిసభలోఁ జచ్చినవారివలెఁ బడియున్నవారు. సర్వరత్నముల కుత్పత్తిస్థానమైన హిమవత్పర్వతము, పృథ్వి, రత్నాకరము మిగిలిన ద్వీపకల్పములు నన్నియు యుధిష్ఠిరునిసభలోఁ జెక్కఁబడియుండురత్నముల చే సభ యలంకరింపఁబడినది. నాజ్యేష్ఠత్వశ్రేష్ఠత్వములఁ బరికించి నన్ను సమస్తరాజులు కానుకలుగాఁ గొని తెచ్చు రత్నములపరిగ్రహణకార్యమునందు నియోగించెను. ఏమని చెప్పఁగలను! నానాదేశాధీశులగు రాజులు తెచ్చి సమర్పించిన కానుకలు గొనుటకు, నమూల్యరత్నములను దాఁచుటకు నాచేతులు శ్రాంతములు గాక పోయినవి. నే నలసి నిమిషకాల మూరకుంటినేని, యపారరత్నరాసులు కుప్పలుగాఁ బడియుండెడివి. వానినెల్ల గణించుట కెవరికిని నలవి కాదు. వానినామములను నైతము మనము మున్నెప్పుడును వినియుండము. మఱియు వారికి మయదానవుఁడు నిర్మించియొసఁగినసభయొక్క యపూర్వము లే మన వచ్చును!

మయుండు బిందుసరోవరమున నున్న దివ్యములైనవియు నుత్తమము లయినవియు నగు రత్నములను, మణులను, నీలములను, స్ఫటికములను, గెంపులను జేర్చి కూర్చి యీమహాసభను నిర్మించి తెచ్చియిచ్చె. అందుఁ బరిభ్రమించుచు నేను స్ఫటికమణిప్రభావిలసితంబైన యొక ప్రదేశ మును నిర్మలోదకప్రదేశ మని భావించి కట్టినపుట్టం బెగఁ ద్రోచి కొంటిని. మఱియు నొకచోట నిర్మలోదకకనకకమలప్రపూరితం బగుజలా శయమును స్ఫటికమణితలప్రదేశముగా భావించి యందుఁ బ్రవేశించు టయు నాకట్టినపరిధానంబుఁ దడిసెను. అప్పుడు నే నాప్రదేశముల నరయ లేకపోతి నని నన్నుఁ జూచి భీమాదిపాండవులును, శ్రీకృష్ణుం డును, ద్రౌపదియు, వారికింకరులును నగిరి. దాని నెఱింగి యుధిష్ఠిరుండు ధర్మాత్ముండై నాకుఁ గట్టఁ బొడివస్త్రముల నిచ్చి పుత్తెంచె. వారినగ తాళి నామనస్సు నగ్నివలె దహించుచున్నది. అప్పుడు వారి కెదు రాడియుండినచో నాకును శిశుపాలునకైన గతియే కలిగియుండును. కావున నప్పటిపరిస్థితి నోర్చి యేమియుం జేయ నేరక యూరకుంటిని. మఱియు నాసభయందుఁ గ్రుమ్మరుచున్న నేను ద్వారాకారంబుగ నిర్మితంబైన స్ఫటికశిలాకుడ్యమును తెఱచినద్వారముగా నెఱింగి పోఁబోయి యాస్ఫటికశిలలచే నభిహతలలాటుండ నైతి. అప్పుడు కవలిరువురు నన్నుఁ బట్టి యావలికిఁ దోడ్కొనిపోయిరి. ఆసమయమున సహదేవుండు నన్ను వింతచూపులఁ జూచి, ద్వారమిది, ఇటు పోవలయు ననెను. భీముం డోరి! ధృతరాష్ట్రపుత్త్రా! యని పలుమాఱు సంబోధించి, యిదె వివృత ద్వారము. ఇటుపోవలయు ననెను. దాని నటుండ నిమ్ము. రాజసూయ యాగకాలమునఁ బాండవులకు రాజులు కానుకగాఁ దెచ్చియిచ్చినధన కనకవస్తువాహనరత్ననిచయంబులఁ జెప్పెద వినుము. కాంభోజపతి యనేకవిధములైన కంబళములను, బంగారుతీఁగెలచే విరాజిల్లు నానా మృగాజినములను, దిత్తిరికల్మాషములగు ననేకాశ్వములను, చిలుకముక్కు వన్నెగల మున్నూరుగుఱ్ఱములను, నన్నియొంటెలను, నన్నియాఁడుగుఱ్ఱ ములను గానుకగా సమర్పించెను. గోవాసనులు, వాటధానులు నగు విప్రులు మూఁడుఖర్వములబలిని, బంగారుకమండలువులనుం దెచ్చి ద్వారమునఁ గాచియుండిరి. మరుకచ్ఛదేశవాసు లగు శూద్రులు

మేలైన వస్త్రాభరణములచే నలంకరింపఁబడిన లక్షదాసీజనంబులను, బ్రాహ్మణులకుఁ దగిన నానావిధకృష్ణాజినములను లెక్కలేనివానిని దెచ్చి యిచ్చిరి. సముద్రతీరమునందలి దేవమాతృకదేశ రాజులును, నదీమాతృకములగు భూములకు నేలికలును గాంధారేయంబు లగునశ్వములను బహుమానంబుగా నిచ్చిరి. మఱియుఁ బారదులును, నాభీరువులును, గిరాతులు ననువారలును నానారత్నములను, గొఱ్ఱెలను, మేఁకలను, గనకశృంగములతోఁ నుండు గోవులను, లొట్టియలను, ఖరములను, దేనెకుండలను, గంబళములను గప్పములుగ సమర్పించిరి. ప్రాగ్జ్యోతిషాధిపతియు, మ్లేచ్ఛనాయకుం డగు భగదత్తుం డనువాఁడును, శీఘ్రగాములగు నాజానేయాదిహయంబులను, మణిభాండములను, సమరోపయుక్తములగు వివిధఖడ్గములను నొసంగె. మ్లేచ్ఛరాజులు వివిధవర్ణరూపములను గలిగినవియు, రెండుకన్నులు, మూఁడుకన్నులుగలవియు, లలాటమునఁ గన్ను లుండునవియు, నొంటికాలితో విరాజిల్లునవియు, ననేకలక్షణములతో నుండునవియు, నపరిమితరాగసంపన్నంబులు, వంకూతీరజాతములు, శీఘ్రగాములు నగు ఖరంబులఁ బదివేలసంఖ్య గలవానిని బంగారువెండిరాసులను దెచ్చి యాపాండవున కొసంగిరి. మఱియు నేకపాద, చీన, శక, ఓఢ్ర, బర్బర, హార, హూణదేశప్రభువు లింద్రగోపవర్ణముగలవియుఁ, దెల్లనికాంతులతో వెలయునవియు, వజ్రకాంతి నీనుచుండునవియు, సాంధ్యరాగసమంబులును నైన మేలైనగుఱ్ఱములను బహువిధములైన కంబళములను, తామరసకాంతు లీనుచు మెత్తనై నిర్మలములైన పీతాంబరములను, వాడిగలైన ఖడ్గములను, గండ్రగొడ్డండ్లను, నింక ననేకవిధములగు యుద్ధసాధనంబులను, రసవస్తువులను, సుగంధద్రవ్యములను మణికనకాదులను గొన్ని కానుకలుగా నాకుంతీపుత్త్రున కొసంగునిమిత్తము వానివాకిటఁ గాచియుండిరి. ప్రాగ్దేశాధిపతు లగు శఖతుకార కంక రోమశాదు లనేకగజములను లెక్కలేనిగుఱ్ఱములను, నొకపద్మసంఖ్య గల కనకమును, మణులతోను బంగారముతోను జెక్కఁబడి యేనుఁగుదంతములతో నిర్మింపఁబడిన విచిత్రశయనాసనవాహనకవచశస్త్రములను, బులితోళ్లతోఁ గప్పఁబడి సువర్ణమయములైన యుత్తమరథములు పూన్చిన పలుతెఱంగులగు రథములను, నారాచము

లను నగచంద్రబాణములను మితిలేనిద్రవ్యమునుం గానుకలుగాఁ దెచ్చి యాకుంతీసుతునిద్వారమును బ్రవేశించిరి. మేరుపర్వతమునకు మందర పర్వతమునకును మధ్యప్రదేశమునఁ బాఱుచుండు శైలోదానదియొక్క రెండుతీరములనుండు వెదురుపొదలతోఁ గాపురముండు పార్వతీయులు, ఖషులు, ప్రదరులు, దీర్ఘవేణులు, పారదులు, కుళిందులు, తంకణులు, పరతంకణు లను జాతులవారు చీమలచే నుద్ధృతంబు లగుటచే చీమ బంగారమను పేరుఁబరఁగు కనక మొకద్రోణమును వెలిగల, చమరాదిమృగ ములను, హిమవత్ప్రాంతములయందుఁ బూచెడు పుష్పములయందుఁ గలతేనెలతో నిండిన యనేకభాండములను, నుత్తరకురుదేశములయం దుండి ప్రఖ్యాతిగాంచిన పుష్పమాలికలను, నుత్తరకైలాసపర్వత ప్రాంతంబులలో నుండు దివ్యౌషధములను విభవోన్నతుండైన యుధిష్ఠి రునకుఁ దెచ్చి సమర్పించిరి. హిమవంతంబునకుఁ దూర్పున నుదయపర్వత మున నుండువారును, గారూషదేశవాసులును, సముద్రాంతప్రదేశముల నుండి ఫలములను గడ్డలను నాహారముగాఁ దినుచు మృగచర్మములనే పరిధానములుగాఁ గలిగి, యెల్లప్పుడు ఘోరకార్యములను జేయుచుండు వారును ఘోరాస్త్రములం దాల్చి తిరుగుచుండువారును నగు కిరాతులు తమయాటవికప్రదేశములయం దుత్పన్నములగు చందనము, నగరువు మొ న్నగు సువాసనగల విస్తారవస్తువులను, బరిమళద్రవ్యములను, నానావిధ మృగచర్మములను, రత్నరాసులను, బహునేర్పరు కిరాతపరిచారికలను, జూచుట కింపై సొంపుగుల్కుచుండునవియును, దూరదేశానీతములయిన వియు నగుపక్షులను, గొండగనులయం దుత్పన్నములైనవియును, బహుకాంతి వంతములునగు కనకంపుగడ్డలను గప్పముగాఁ దెచ్చి యింద్రప్రస్థపురంబు నకు వెలుపలనే కాచియుండిరి. మఱియును వైరాత, దరద, దార్వ, శూర, యమక, ఔదుంబర, పారద, బాహ్లీక, కాశ్మీర, కుమార, ఘోరక, హంసక, త్రిగర్త, యౌధేయ, మద్ర, కేకయ, అంబష్ఠ, కౌకుర, తార్క్ష్య, వస్త్రప, పహ్లవ, వశాత, మౌలేయ, క్షుద్రక, మాలవ, శౌండిక, కుకుర, శక, అంగ, వంగ, పుండ్ర, శాణవత్య, గయ, మగధ, తామ్ర లిప్తాదులగు ననేక దేశరాజు లుత్తమాశ్వముల నెక్కి, యుత్తమాయు ధములఁ దాల్చి వచ్చి కానుకలను సమర్పించువారు ద్వారప్రవేశ

మును గాంచ నగు నని ద్వారపాలకులు తెల్ప, వెంటనే వారొక్కొక
రును దివ్యాభరణాలంకృతములును, గొండలతోఁ సాటియైనవియుఁ గామ్యక
సరస్తీరంబునఁ బుట్టినవియు, నతిశాంతములును, భద్రలక్షణయుతములును
నగు వేయేసి యేనుఁగులును గానుకలుగా నాయజ్ఞదీక్షితుండైనయుధిష్ఠిరు
నకు సమర్పించిరి. చిత్రరథుం డనుగంధర్వరాజు వేగవంతములగు గంధర్వ
హయముల నేనూఱింటి నొసంగె. తుంబురుం డను గంధర్వపతి మామి
డాకువన్నె గల నూఱు దివ్యాశ్వముల నర్పించె. సూకరదేశాధీశుఁ డనేక
గజముల నిచ్చె. విరాటుండు రెండువేల యేనుఁగులను, వసుదానుఁ డిరు
వదియాఱు భద్రగజములను, రెండువేలయుత్తమాశ్వంబులను గుంతీపుత్త్రు
నకుఁ గానుకగా నిచ్చిరి. ద్రుపదుఁడు పదునాలుగువేల దాసదాసీజనంబులను,
నుత్తమగజ రాజశతకంబులను, నిరువదియాఱురథములను నొసంగి యజ్ఞార్థ
ముగఁ దన రాజ్యమును నొసంగె. నారాయణుండు నరునకుఁ బ్రీతిగాఁ
బదునాలుగువేలేనుఁగులను ననేకవస్తువాహనములను నిచ్చెను. అర్జు
నుండు కోరినదానిఁ జేయుట శ్రీకృష్ణునకు స్వాభావికంబై యుండు. వానికిఁ
గావాసుదేవుఁడు నాకంబునైన నిచ్చును. అవ్విధమునం బార్థుం డుపేంద్రు
నకుఁ బ్రాణములనైనఁ ద్యజించు. ఆవార్త లట్లుండఁ గాక! చోళులును,
బాండ్యులును, మలయదర్దురపర్వతములలోఁ బుట్టినవియు, బంగారు
కుండలలో నిండింపఁబడినవియు నగు సురభిచందనరసంబులను రత్నము
లను బంగారమును సమూల్యవస్త్రములను నాయజ్ఞదీక్షితునకు సమర్పిం
చిరి. సింహళదేశరాజులు సాగరోత్పన్నములగు ముత్తెములను, బగడ
ములను, వైడూర్యములను, భద్రేభములపైఁ గప్పఁబడునవియు వివిధ
వర్ణోపేతంబులైనవియు నగు పెక్కుకంబళములను, సర్వాలంకారభూషిత
లైన పెక్కురు కాంతలను దెచ్చియిచ్చిరి. వేయేల? ప్రపంచములో
నుండు నాల్గువర్ణముల వారును, వివిధమ్లేచ్ఛజాతులవారును, సర్వజను
లును బ్రియముతోను భాగ్యగర్వముతోను గూడికొని నానావిధములగు కప్ప
ముల నాపాండునందనుల కరిగాపులై తెచ్చి యొసంగిరి. బంధుత్వమునఁ
బాంచాలురును, సఖ్యమునఁ జేసి యాదవులును దక్కఁ దక్కిన రాజు
లెల్లరును గప్పముల నొసంగిరి. రాజసూయయాగకాలమున మూఁడు
పద్మముల మాఱటివాండ్రును, నర్బుదసంఖ్యాపరిమితి గల రథికులును,

లెక్కలేనికాలములును ధర్మరాజునాజ్ఞ మేరకుఁ బక్వాపక్వముల నారయుచుండిరి. బ్రాహ్మణులపుణ్యాహవాచకశబ్దము లాకసంబు పర్వె. సకలవర్ణములలో స్త్రీపురుషు లెవ్వరును విచారింపఁబడనివారు లేరు. భోజనపానీయాదిసపర్యలచేత నందఱు నభ్యర్చితులైరి. ఎనిమిదివేలబ్రాహ్మణస్నాతకుల నన్నియిండ్ల నిలిపి వారల కొక్కొక్కరికి ముప్పదుండ్రు దాసుల నమర్చి యుధిష్ఠిరుండు కాపాడుచుండె. వారందఱును ధర్మరాజుయొక్క శత్రుక్షయమును కాశీర్వచనములఁ జేయుచుందురు. సదాబ్రహ్మచర్యానుష్ఠానమును సల్పుచుండు మునులు ధర్మరాజు పజ్క్తియందు బంగారుపళ్లెరములలోఁ గుడుచుచుందురు. వారిని లెక్కించుట శక్యము కానేరదు. లక్షసంఖ్య బ్రాహ్మణభోజనమున కొకపరి మ్రోగు శంఖ మాయజ్ఞమున నన్నినాళ్లును విడువక మ్రోగుచుండె. యజ్ఞమున కాగతులైనవా రెల్లరును భుజించినపిదప యాజ్ఞసేనియందఱును దృప్తులై రని యెఱింగి, యాయుధ్వరోత్సవమున నన్నినాళ్లును భుజించును. సత్యవ్రతపరాయణులును, నియమవంతులును, వివిధవిద్యావిశారదులును, వేదాంతనిష్ఠులును, శూరులును, ధైర్యపరులును, ధర్మపరాయణులును, యశస్వులును, మూర్ధాభిషిక్తులును, వక్తలును నైన రాజు లనేకులు దక్షిణార్థముగా గోసహస్రముల సమర్పించి, యభిషేకమునిమిత్తము ధనభాండములఁ దెచ్చి ధర్మపుత్త్రు నుపాసించియుండిరి. బాహ్లికుండు కనకమయంబైనరథమును దెచ్చి సమర్పించెను. సుదక్షిణుఁడారథమునకుఁ దెల్లనిగుఱ్ఱములను బూన్చెను. సునీథుఁ డనురాజా రథమునకు నొగలక్రింద నుండుకోడిసీలను సవరించెను. దాక్షిణాత్యుఁడు కవచమును, మాగధుఁడు పూలమాలికను, దలపాగను దెచ్చి యిచ్చిరి. వసుదానుఁ డనువాఁ డఱువదియేండ్ల యీడు గల మత్తగజంబును దెచ్చియిచ్చెను. మత్స్యరాజు హేమనద్ధములైన యక్షములఁ దెచ్చెను. ఏకలవ్యుండు పాదుకలఁ దొడిగెను. అవంతిదేశాధీశుఁ డభిషేకార్థము పుణ్యనదీతీర్థంబులఁ గొనితెచ్చెను. చేకితానుఁ డమ్ములపొది, కాశీరాజు విల్లు, శల్యుఁడు ఖడ్గశ్రేష్ఠమును దెచ్చిరి. ఇవ్విధమున సమస్తరాజులచే నుపాసింపఁబడిన యుధిష్ఠిరు నుత్తమాసనంబునఁ గూర్చుండఁబెట్టి ధౌమ్యుఁడు, మహాతపస్సంపన్నుండగు వేదవ్యాసుఁడును, దేవర్షియగు నారదుఁడును, నసితుం డగు దేవలుఁడును, జామ

దగ్న్యుఁడును మున్నగాఁగల మహామునులచేఁ బరివృతుండై మంత్ర
ములచేఁ బవిత్రంబు లగు దివ్యనదీతీర్థంబులచేత మహేంద్రుని సప్త
ర్షులుంబలె నభిషేకించె. పూర్వకల్పమునఁ బురుహూతునిమిత్తముగ
బ్రహ్మచే సృజింపఁబడిన శంఖమును క్షీరసముద్రుఁడు తెచ్చి యీయఁగా,
నాశంఖమునందు మంత్రపూతములైన పుణ్యనదీజలముల నిడి వానితో
ధర్మజు శ్రీకృష్ణుం డభిషేకము గావించె. అట్లు సామ్రాజ్యలక్ష్మీవిభవంబున
నొప్పుచుండు యుధిష్ఠిరునకు సాత్యకి సితచ్ఛత్రంబుఁ బట్టె. భీమార్జు
నులు వింజామరములు వీచిరి. కవలు చామరములతో సేవించిరి. ఆసమ
యమున నానాదేశాధిపతులును సామ్రాజ్యము నధిగమించిన యుధిష్ఠి
రునకు విధేయులై వినయముతో మ్రొక్కుచుండఁగాఁ బాండవులును,
ధృష్టద్యుమ్నాదులును, సాత్యకి శ్రీకృష్ణులును నెనమండ్రుగురు నొకరి
నొకరు ప్రీతితోఁ జూచుచు సంతసించిరి. అప్పుడు పరమానందమునుబొంది
యజ్ఞసుండు బంగారుకొమ్ములతో నలంకరింపఁబడిన యేనూఱుధేనువు
లను బ్రాహ్మణులకు దాన మొసంగెను. పూర్వదక్షిణపశ్చిమసముద్రముల
వఱకు నందఱును బోఁగలరు. కాని యీప్రదేశములకును నుత్తరదిశ యెంత
వఱకు వ్యాపించియున్నదో యంతవఱకును బోఁగలవు. పాండవు లుత్తర
దేశములను బహుదూరమువఱకు నుండువానిని సమీపించి యాదేశపు
రాజులను గెలిచి వచ్చుటచే, నాప్రభువులును రాజసూయయాగకాల
ములో వారివారి కానుకలను గప్పములను దెచ్చి సమర్పించి యుధిష్ఠిరు
నకుఁ బాదాక్రాంతులై యేగిరి. ఇవ్విధంబున రాజసూయయాగంబు
లోకోత్తరంబై జరంగె. రంతిదేవ, నాభాగ, మాంధాత్రు, మను,
పృథు, భగీరథ, యయాతి, నహుషు లనువారును బహు యజ్ఞములను
జేసి రని వినియుందుము. వారి యజ్ఞము లన్నియుఁ బాండవుని యజ్ఞముతో
సరిరావు. సత్యసంధుం డగు హరిశ్చంద్రునిపదమును నధికలక్ష్మీవిభవ
ముతో రాజసూయమహాయాగమును విధ్యుక్తముగ నాచరించి, భూలోక
మునం దింతటఁ గనివిన్నట్టి కీర్తిసంపదలను యుధిష్ఠిరుండు ప్రసరింపఁ
జేసెను. ఇవ్విధమున మనకు గర్భశత్రువు లగు పాండవులు నానాఁటి
బలిసిపోవుచున్నవారు. అట్టివారి ప్రాభవమును జూచుచు నే నెట్లు మనఁ
గలను? నాఁగలియుక్కు పలు ప్రాసితుసుకల నంధుండు సమకూర్చినట్లు

గ్రుడ్డిదేవుఁడు మనకుటుంబముయొక్క జ్యేష్ఠకనిష్ఠశాఖలవారిని నెత్తుటి పాశముతో బంధించియున్నాఁడు. కనిష్ఠశాఖ బలిసిపోవుచున్నది. జ్యేష్ఠశాఖ సన్నగిల్లుచున్నది. ఈవ్యత్యస్తదశను జూచుచు నయ్యయ్యో! నే నెట్లు ప్రాణముల నీశరీరమున ధరింపఁగలను? ఈశోకాగ్ని న న్నెరియించుచుండఁగా, నోతండ్రీ! నే నిట్లు కృశించి నిస్సత్త్వుఁడ నైతినిజుమా! యని దీనాలాపంబులతో విలపించుచున్న దుర్యోధనునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

"సుయోధనా! నీవు నాపుత్త్రులలోఁ బెద్దవాఁడవు. పాండుపుత్త్రులతో నీకు విరోధము వలదు. ఈవిరోధమునఁ గలహము కలుగును. అది వృద్ధి యగు నేని చావుపోలె నసౌఖ్యము గావించు. సద్గుణరాశియై ద్వేష మెవరియెడను లేనియజాతశత్రునితోఁ గలహము కూడదు. ధర్మరాజు పుట్టినవంశముననే నీవును బుట్టి యాతండు ధర్మమార్గమునఁ బొందినసంపదను నీ వపహరింపఁ దలంపరాదు. ధర్మరాజువలె యాగముఁ జేయఁ గోర్కెయేని, నీవును యాగదీక్షను వహింపుము. ఋత్విజులను రప్పించి వారిచే నీయజ్ఞమును జేయింతు. రాజు లందఱును బ్రీతితో నీకును గానుకలను గప్పములను బహుమానములను విశేషమణిధనకనకవస్తువాహనములను నీకుఁ దెచ్చి సమర్పింతురు. పరులద్రవ్యము నపహరించుట తగదు. దానిని బెద్దలు నిందింతురు. తనకు దైవికముగా లభించియుండుసంపదతోఁ దృప్తిఁ జెంది, స్వధర్మమును సంతోషముతో నడుపువాఁడు పరమానందముతో సుఖించు. పరద్రవ్యములయం దుదాసీనభావము, స్వకర్మములయం దెల్లప్పుడు జాగరూకుఁడై వర్తించుట, సంపాదించిన ధనమును రక్షించుటయం దప్రమాదము ననునీమూఁడు సుగుణములనుగలిగియుండుట గైశ్వర్యానుభవమునకుఁ బ్రధానలక్షణము. విపత్తులకు వ్యసనముఁ జెందక, ధైర్యముం బూని తనకార్యములయం దప్రమాదుండై వినయముతోఁ గాలమును గడుపుచుండు మహనీయుండు సుఖించు. పాండవులు నీకు భుజములవంటివారు. అట్టివారికి నీవు చెఱుపుగోరుట లోకులచేఁ దెగడఁదగినది యగును. వారిద్రవ్యమును నపహరింప నీవు పూనుట మిత్రద్రోహమగును. దానిచే నపారమగు హాని వాటిల్లు. నీతాతలు, వారికిం దాతలు.

అంద ఱొక్క కుటుంబమునకుఁ జెందినవారు. వారన్యులా? కావున నీ
వీసును మాని వారితో విరోధమును వదలుము. నీ కిష్ట మగునేని
నీవును యజ్ఞాచరణము గావింపుము. ప్రియముల ననుభవింపుము. తరు
ణులతో విలాసమున విహరింపుము. సుఖింపుము. పాండుసుతులతోఁ గల
హింపకుండుట గొప్ప తెలివిగల మేలనఁగా దండ్రికి సుతుం డిట్లనియె.

రాజేంద్రా! ఎన్ని శాస్త్రములఁ జదివినను నాత్మజ్ఞానము లేని
వాఁడు, గరిటె పదార్థములయొక్క యుప్పు కారముమున్నగు రసములం
బోలె శాస్త్రార్థములను దెలియలేఁడు. ఓడతోఁ గట్టిన యోడవోలె నతఁడు
సుఖపడలేఁడు. ఎఱింగినవాఁడ వయ్యును నీసొంత ప్రయోజనముల నేల
పరిశీలింపవు? కానున్న నాయెడ నీకు ద్వేషమా? నీయాజ్ఞ మేరకు వర్తిం
చుచో నీపుత్రులగు మేము భూలోకమున బ్రదుకలేము. శత్రుపక్ష
పాతి యగు విదురు నాలోచనచే నే పిఱికివాఁడు స్వమార్గమునఁ బోలేఁడు.
ఆమార్గము ననుసరించువానికి సద్గతి గలుగునే? నృపాలా! నీ వధీతసర్వ
శాస్త్రుండవయ్యును, బెద్దల సేవించియు, నింద్రియముల జయించినవాఁడ
వయ్యును, స్వకార్యశత్రువులగు మమిత్రుల మాటల సమ్మోహింపఁ
జేయఁదగునే? లోకవృత్తమునకు రాజవృత్తమునకు బహుదూరమని దేవ
గురువు తొల్లి ప్రకటించి యుండెంగాదె? రాజెల్లప్పు డప్రమాదుండై
స్వకార్యముల నారయుచుండవలయును. స్వార్థమును జింతించుచుండ
వలయును. ధనమునఁ బగఱ నిర్జింపఁజేయుట పరమధర్మము. స్వవృత్తి
మెట్టిదైన నాచరింపవలయును. రాజ్యశ్రీయందున నుండు రాజు ధర్మాధర్మ
ములను బరిశీలింపరాదు. శత్రువులను నపహరింపఁదలఁచు రాజు సారథి
మునికోలచే నశ్వముల నదలించుకొనువిధమునఁ, దనపరాక్రమముచేఁ
దనరాజ్యము నలుదెసలకు వ్యాపింపఁ జేసికొనవలయును. రహ
స్యముగఁ గాని, బహిరంగముగఁ గాని పగఱను బాధించు నుపాయ
మును బన్నుటయే శస్త్ర మనఁబడును. మనస్సంతాపము నేది
చేయునో యదియె శత్రువు. జాతిమాత్రమున నెవఁడును శత్రువు
గానేరఁడు. సమానమైనను సంతసము కీడు గొల్పునో యదియె మిత్రము.
ఇవియె శత్రుమిత్రలక్షణములు కాని యన్యములు గావు. సంతుష్టుండగు
రాజు వేగంబ నశించు. తన కుండుదానితో రా జెప్పుడును సంతృప్తిఁ

జెందియుండరాదు. అసంతోషమే రాజుయొక్క సంపదకు మూలము. రాజు తన కెంతసంపద గల్గియున్నను మఱియు నైశ్వర్యసంపాదనయత్నములఁ జేయుచు నెట్టులైన నైశ్వర్యమును విశేషముగ నార్జించి దానియం దభిమానమును వీడవలయును. పూర్వము పురుహూతుండు పగవారికేని ద్రోహమాచరింప నని ప్రతిజ్ఞ చేసి తపస్సున విక్రమించు నముచిశిరస్సును నన్యాయముగా నఱికెను. కావున భూమియుం బెవ్విధమునైనను శత్రుపక్షమును జెఱుపవలయును. వారియెడ నద్రోహవృత్తి తగదు. విరోధమును బూనని రాజును, దేశాంతరములఁ దిరుగని బ్రాహ్మణునిఁ, బుట్టలో నున్న జంతువులను బాముపోలె భూదేవతయే నశింపఁజేయును. వృద్ధిఁబొందుచున్న శత్రువు నుపేక్షింపగాదు. ఉపేక్షించినచో వాఁడు శరీరమున నాటుకొని యుదిరినరోగము పోలెఁ జేటుఁదెచ్చు. పగవాఁ డుపేక్షింపఁబడి, చెట్టువేళ్లసమీపమునఁ బుట్టిన పుట్ట యాచెట్టునకు హాని కలిగించునట్లు రాజును జెఱుచును. కావున నో రాజేంద్రా! శత్రువులసంపదకు సంతోషింపకుము. ఇదియే యుత్తమమగు రాజనీతి. ఐశ్వర్యవృద్ధిఁ గోరు రాజు జ్ఞాతులయెడఁ బరాక్రమముఁ జూపును. నేను సకలోపాయములఁ బన్ని వారిసంపదను లాగుకొనియెద. కానిచో సమరమున ఘోరవిక్రమముం జూపి రణాంగమున నీల్గెద. వారెల్లప్పు డభివృద్ధితోఁ గూడి యున్నవారు. మనవృద్ధి యస్థిరము. ఇట్టిచోఁ బ్రాణముల నీశరీరమున ధరించియుండుట నిష్ప్రయోజనము. అనుచుండఁగా, శకుని మేనల్లున కిట్లనియె. 'సుయోధనా! యుధిష్ఠిరుసంపదకు దుఃఖింపకుము. జూదమున వానిసంపద నంతయు నాదికొని నీ కొసంగెద. వానిని ద్యూతమునకుఁ దోడితెమ్ము. అక్షములను వైచి క్షతుఁడు గాకయే యవిద్వాంసుఁడు విద్వాంసుని గెలుచును. ద్యూతయుద్ధమునందుఁ బందెము చఱచుటలు విండ్లు, పాచికలు బాణములు, అక్షహృదయ మల్లెత్రాడు, స్ఫూర్తి రథము. వీనిసాహాయ్యమున నేనాయుధిష్ఠిరుని గెలుతును. వాని నిచ్చోటికి రప్పింపు' మనఁగా, ధృతరాష్ట్రుంజూచి దుర్యోధనుం డిట్లనెను. 'రాజేంద్రా! ఈశకుని మతంబునకు సమ్మతించి యుధిష్ఠిరు నిచ్చోటికి రప్పింపుము.' అనఁగా, నాచీకుఱేఁడు 'విదురుం డిందులకు సమ్మతించు నేని నే నియ్యకొనియెద. కాదేని నే ననుమతింప'

ననియె. అంత దుర్యోధనుండు తండ్రితో 'విదురుండు పాండవపక్షపాతి. వారికి హితమును నా కహితమును గోరుచుండు. ఆతండు దీని నిరాకరించు. ఆత్మకార్యము నన్యప్రబోధనమున నారంభింపఁజనదు. ఆత్మబుద్ధి యెల్లప్పుడు సుఖం బొడఁగూర్చును. తన్ను రక్షించుకొనునిమిత్తము భయమును వర్జింపవలయును. ఇతరులకు వెఱచి తన్ను రక్షించుకొనుటకుఁ దలఁచి యెద్దియుం జేయక యూరకుండువాఁడు, వర్షమునకుఁ దడిసిన కటమువోలె నంతటఁ దనకుఁ దానే నశించును. శరీరమును రోగ మాక్రమించుకొనుటకుఁ బూర్వమును, మృత్యు వాసన్నమగుటకు ముందుగాను మనుజుఁడు తనకుఁ గళ్యాణకార్యముల నాచరించుకొనవలయును.' అనఁగా ధృతరాష్ట్రుండు దుర్యోధనునిమాటకడ్డము వచ్చి 'పుత్త్రా! ఎన్ని నీతు లెన్ని మాటలు చెప్పినను వినవు. జూదమున బలవంతులతో విరోధము గలుగును. దానివలనఁ జెప్పనలవి కాని హాని కలుగును. అది మేలని వెఱ్ఱివాఁడవై తలంచెదవు.' అని చెప్పఁగా, దుర్యోధనుండు మఱియు నిట్లనియె. 'శకునిమాటల కిష్టపడి, వేగముగ సభానిర్మాణము గావింప సంగీకరింపుము. ద్యూతముచే స్వర్గము కలుగు నని తెలిసినపెద్ద లందురు. మాకును బాండవులకు నెటులైన సుహృద్ద్యూతమును విధింపుము.' అని చెప్పఁగా ధృతరాష్ట్రుఁడు కొడుకునకు మఱియు నిట్లనియె. 'పుత్త్రా! నీమాటలు నాచెవులకు ములుకులుగాఁ దోఁచెడిని. నే నెంతచెప్పినను నీధోరణిని విడనాడవు. ద్యూతప్రయత్నము సర్వకాలములయందును ధర్మవిరుద్ధము. నీయభిమతము మేరకుఁ బ్రవర్తింపుము. దానిఫలితమును నీవ కుడిచెదవు. ప్రజ్ఞావంతుఁడును, ధర్మాధర్మముల గుణదోషముల నెఱింగినవాఁడును నగు విదురున కిది సమ్మతము గాదు. దీనివలన రాజకులములకు వినాశంబును బ్రజాక్షయంబును నగు' నని తా నన్ని చెప్పినను దనమాటలు వినని పుత్త్రబుద్ధి కెంతయుం బ్రొద్దు దింతించి, విధిప్రేరణమునఁ గానున్న ది కాకమాన దనియు, దానిం దప్పింపనితోంల కెవ్వరికినలవిగా దనియు దైవసమ్మోహ చేతస్కుండై, శిల్పాచార్యులను రప్పించి ఘనమువానవ్యవచేసివర్ణింపఁబడి యుధిష్ఠిరాదుల కొనఁగఁబడినసభవంటి సభను నిర్మింప సెల విచ్చి పంపెను. వారు నట్టిదానిని నానారత్నసమంచితముగా నతివేగమున నొక్క క్రోశమాత్ర ప్రమాణంబు

గలదానిఁగా నిర్మించి ధృతరాష్ట్రునకు మనవి చేసిరి. అంత ధృతరాష్ట్రుఁడు విదురుం బిలిచి తనసభయొక్క రామణీయకము నాతనికి నివేదించి, వేగంబ యింద్రప్రస్థపురంబున కరిగి యుధిష్ఠిరు నాసభలో సుహృద్ద్యూతమాడుటకొఱకుఁ దోడ్తెమ్మనెను. అంత విదురుండు వైచిత్రవీర్యుని యభిమతం బెఱింగి, దానికిఁ దా నిష్టపడక యాతనితో నిట్లనియె. 'రాజేంద్రా! ఇది తగదు. ఈసుహృద్ద్యూతకారణమున నీకొడుకులకును బాండురాజుకొడుకులకును పెద్దభేద మగును. భేదము కలహమునకు మూలము. కలహముచేఁ గులనాశ మగును. ఇది నిశ్చయము. పదంపడి పశ్చాత్తాపముఁ బొందుటకంటె నిప్పుడు దీని నుడుగుట లగ్గు' అని చెప్పఁగా, ధృతరాష్ట్రుండు విదురునితో 'విదురా! ఈమాట నెత్తినప్పు డెల్ల నీవేల యీయాటంకములను జెప్పెదవు? విధి ప్రతికూలమైనచో నూరకున్నను దోసఁగు పొసఁగక మానదు. విధివశమున నగుదానికి వంత యేల? నామాటగా నూఱడక యింద్రప్రస్థమున కరిగి యీకార్యముం జెప్పి యుధిష్ఠిరుం దోడ్తెమ్ము' అనెను.

## విదురుఁడు ధర్మపుత్త్రుని జూదమాడుటకుఁ బిలుచుకొనివచ్చుట

విదురుండును ధృతరాష్ట్రునివచనముల కడ్డము చెప్పనేరక తుద కొప్పుకొని, శీఘ్రగాములగు రథ్యములం బూన్చిన తేరెక్కి వేగమున నింద్రప్రస్థముం జేరి, కుబేరుని గృహముంబోలిన యాయుధిష్ఠిరుగృహముఁ బ్రవేశించె. అంత విదురు రాక ధర్మనందనుం డెఱింగి యాతని నుచిత సత్కారముల నొనర్చి ప్రియవచనముల నిట్లనియె. 'విదురా! నీముఖమును జూడ విషాదగ్రస్తమైనట్లున్నది. నీకు నేమంటె? దుర్యోధనాదులు మచ్చరము వదలి యనుకూలురై యుందురుగదా? ప్రజలందఱును ధృతరాష్ట్రునకు విధేయులే కదా?' యని యడుగ, విదురుండు యుధిష్ఠిరునితో నిట్లనియె 'అందఱును క్షేమముతోనున్నవారు. ధృతరాష్ట్రుండు నన్ను నీయొద్దకుఁ బంపి నీతో నిట్లు చెప్పు మనెను. నీయీసభవంటి వేఱొకసభ హస్తినాపురమునందు నిర్మింపఁబడెను. నీవు హస్తినాపురమునకు నాతోడ వచ్చి యాసభయందు దుర్యోధనాదులతో విలాసముతోఁ గొన్నాళ్లుండి వారితో సుహృద్ద్యూతం బాడవలయునఁట. ఇది యాచి

కుబేరనియుద్దేశంబు. దానిచేఁ దానును దనపుత్త్రులందఱును బ్రీతులయ్యెద
రఁట. కావున నీ విప్పుడే నావెంట హస్తినాపురమునకు దయచేయుము.
ఆమ రాత్ములయభిమతంబు సేయుము.' అనఁగా ధర్మనందనుండు విదురు
నితో నిట్లనియె. 'అయ్యయ్యో! పెద్దలు జూద మాడుదురే? జూదమునఁ
గలహము తప్పదు. నీయభిమతం బెద్ది? నీయిచ్చమెయిఁ బ్రవర్తింతు.'
అనఁగా విదురుండు 'ధర్మపుత్త్రా! జూదంబున నవశ్యంబు కలహమగు
నని యెన్నిమాఱు లాటంకములను జెప్పినను వాని నెంతమాత్రము
లక్ష్యముసేయక యాగ్రుడ్డిప్రభువు నన్ను నీయొద్ద కనిచె. ఆలోచించి
యుక్తమైనదాని నొనర్పుము.' అనఁగా యుధిష్ఠిరుండు 'హస్తినాపురమున
జూదరు లెవ్వ రని యడుగవలయునే? ఇట్టికపటపుఁ జేఁతల కన్నింటికి
దుర్యోధనాదులు మోసగాండ్రు. వారిలో నిందులకుఁ బూనుకొన్న
వా రెవరు?' అనఁగా, విదురుండు శకుని, వివింశతి, చిత్రసేన, సత్యవ్రత,
పురుమిత్ర, జయులు దీనికిఁ గంకణము గట్టికొనియున్నవారు. అని
చెప్పెను. 'ఆహా! జూదరు లెల్ల నిప్పు డొక్క చోటం గూడిరి. జయాప
జయములు దైవవశంబులు. కాని యందుఁ జేటు మూడకుండదు. పెద్దల
పిలుపును నిరాకరింప రాదు. మిక్కిలి భయ మయ్యెడిని. ధృతరాష్ట్రుఁ
డెప్పుడును బుత్త్రప్రియుఁడు. నీయాలోచనచే వర్తింతు. జూదమాడు
టకుఁ బిలువఁబడి పోకుండరాదు. ఇది నా వ్రతము. ఎట్టులైన నగుఁగాక.
వత్తు'నని [illegible] మఱునాఁడు ప్రయాణసన్నాహంబు చేయుట
కుత్తరువొసంగి తమ్ములును ద్రౌపదియుఁ దనవెంట రాఁగా, బాహ్లీకోప
నీతంబయిన తేరెక్కి విధిప్రేరణంబునఁ దరలి బ్రాహ్మణాశీర్వచనంబులఁ
దలం దాల్చి హస్తినాపురమునకుఁ గతిపయదినప్రయాణంబులం జేరి,
యచ్చోట ధృతరాష్ట్ర భీష్మ ద్రోణకృపాశ్వత్థామాదివృద్ధులకు నమస్క
రించి, కర్ణ శకుని శల్యాదులతో హెచ్చరికపలుకు లాడి, దుర్యోధన
దుశ్శాసనాదికురుకుమారులతోను నలువేల సత్త్రములచేఁ జుట్టు
కొనఁబడియున్న రోహిణింబోలెఁ గోడండ్రతోఁ గూడియున్న గాంధార
రాజతనయను గాంచి ప్రేమపూర్వకము లగుమాటలాడి, యుక్తమనివే
శములయం దెప్పటియట్ల తమ్ములతో నుండె. అప్పు డసదృశలక్ష్మీవిభ
వంబుతోను, లోకోత్తరసౌందర్యముతోను బ్రకాశించుచుండు పాం

చాలివదనకమలవికాసమును దుర్యోధనాదులభార్యలు వీక్షించి దాని సౌందర్యమున కచ్చెరువోయి, యారూపరేఖావిలాసంబులు భూలోక రాజకాంతలలో నెవ్వరి కుండ నేర వని వగచిరి. ధర్మపుత్త్రుండు తమ్ములుం ద్రౌపదియు మున్నగువారు తన్నుఁ గొలిచియుండ, నానాఁడు నిత్యకృత్యంబులఁ దీర్చి రసవంతములగు పదార్థములతోడి యాహారముం గుడిచి, రాజోచితపరిమళగంధములను నలంది యారేయి సుఖనిద్ర గడపెను. అంతఁ బ్రభాతం బగుటయు శీతమందసురభిమారుతస్పర్శనంబునకు, శుకపికాదికుంజులస్వనంబునకు, వందివైతాళికుల స్తుతివచనములకు సంతుష్టస్వాంతుండై మేల్కాంచి ప్రాతరాహ్నికక్రియలం దీర్చి, శకునిదుర్యోధనదుశ్శాసనాదిద్యూతకారులతో నిండియుండిన యమ్మహాసభయం దున్న ద్యూతరంగమును బ్రవేశించి పెద్దలకు మ్రొక్కెను.

## ధర్మరాజు శకునితో జూదమాడుట

అట్లు సభలోనికి యుధిష్ఠిరుండు ప్రవేశించుటయు, శకుని యా నరేంద్రునితో నిట్లనియె. 'రాజా! నిన్నుఁ జూచునిమిత్తము కొంద ఱీసభ కేతెంచియున్న వారు. వారికి నీదర్శనమొసంగి వారి నానందింపఁ జేయుము. కొందఱు బుబుసుపోకకు నీతో జూదమాడవచ్చియున్నారు. అందఱును నీరాక కెదురుచూచుచున్నవారు. ఇప్పుడు ద్యూతనియమముల నేర్పఱచుకొని యీపాచికలతో నాడుటకు నారంభింతము.' అనఁగా శకునికి యుధిష్ఠిరుం డిట్లనియె. 'సుబలరాజాత్మజా! జూదమున మోస మతిపాపము. ఇట్టి జూదమున క్షత్త్రియునియాధిక్యము తెలియనేరదు. అంతేకాక జూదమున నెట్టి నియమములును లేవు. కావున నట్టిజూదమును నీ వేల స్తుతించెదవు? మోసగానిచే నాడఁబడు జూదమును బుద్ధిమంతులు మెచ్చరు. కావున నోశకునీ! మాతోఁ గపటద్యూతమాడి మమ్మును గెలువకుము. ఇది క్రూరకృత్యము. ద్యూతమందలి జయాపజయముల నెఱుంగఁగలరాజు ఆట నాడునపుడు తన్ను మాయోపాయములచే మోసగించుచున్నతనయెదిరియాటను దెలివితోఁ దెలిసికొనును. ఆయాటయందలి కౌశల్యమును, దానినుండి తాను దప్పించుకొనునేర్పును నాబుద్ధిమంతుఁ డగురాజెఱుంగును. పందెముపఱచియాడి

గెలిచిన దాన దోషము లేదు. సంశయింపకుము. వేగమునఁ బందెము నొడ్డుము. జూదమాడుదము రమ్ము.' అని చెప్పఁగా, నాశకుని యాత్రము నెఱింగి, యాతనికి యుధిష్ఠిరుండిట్లనియె.

'సౌబలా ! వినుము. మోసమున జూదమాడుట దోస మనియు, ధర్మమున నాడుజూదము ధర్మయుద్ధమువంటి దనియు నసితుం డైన దేవలుండు మున్ను చెప్పె. ధర్మము నెఱింగిన పెద్దలు సత్యమునే పలుకుదురు. కపటమున వర్తింపరు. కపటంపుమాటల నాడరు. ఇది యే సజ్జను లాచరించు నియమము. మేము న్యాయమున సంపాదించిన మాధన మును బ్రాహ్మణసంరక్షణార్థము, దుష్టశిక్షణార్థము వినియోగించుచు న్నాము. అట్టి మా సంపదను మోసంపుజూదమున గెలువరాదు. కపట ప్రవర్తనమున సుఖమునుగాని, ధనమునుగాని, పడయుట నా యభిమ తంబు కానేరదు. జూదరి యెల్లలోకములందును గర్హితుఁడు.' అని చెప్పఁ గా యుధిష్ఠిరునకు శకుని యిట్లనియె. 'లోకమున వేదముల నెఱింగిన శ్రోత్రియుండు వేదాధ్యయనమునవే వేఱొక శ్రోత్రియుని గెలువ నుద్దే శించు. జూదరియు మోసమున నట్లే గెలుచు. నేర్పరి కాని వానిని నేర్ప రియు, దుర్బలుని బలవంతుఁడును జయించుట సహజము. ఈజూదమా డుట నీ కభిమతంబు కాదేని యుడుగు' మనఁగా, ధర్మజుండు విధిప్రేరి తుండై యక్కుటిలపుమాటలం బౌరుషం బతిశయిల్ల జూదమునకుఁ బిలువఁ బడి మరలుట యుక్తముకాదు. దైవము విధించినట్లు కాఁగలదు. కావున నాడెదను. మీలో నా కెదురాడువా రెవ్వరని యడుగఁగా, దుర్యోధ నుండు 'పాండుపనందనా! నాకు మారుగా మా మేనమామ శకుని నీతో నాడును. అతం డాటలో నొడ్డుధనరాసుల నన్నిటిని మఱి వేనినొడ్డిన నవియెల్ల నేనిత్తు' ననఁగా యుధిష్ఠిరుం డొకనికిఁగా వేఱొకం డాడుట యెక్కడను జూచినది గాని, వినినది గాని లేదు. ఇది యపూర్వముగ నున్నది. ఐనను మీయభిమతంబె యగుఁ గాక యని సుయోధనుమాట కొడంబడెను. సుహృద్ద్యూతం బనునామముతో వెలసిన యామోసపు జూదమును జూచువేడ్క నాసభకు ధృతరాష్ట్రుఁడు మున్నగు వృద్ధులగు కౌరవరాజు లేతెంచి తమతమస్థానంబుల నలంకరించియుండిరి. భీష్మ ద్రోణకృపవిదురుల కాద్యూతంబు రుచింపకున్నను ధృతరాష్ట్రునాజ్ఞచే

వారందఱును సభ నలంకరించిరి. ఇవ్విధంబున హస్తినాపురస్థవిప్రరా
జన్యాద్యనేక ప్రజాసంకలితం బైన యాద్యూతరంగమున విధిప్రేరితుండై
ధర్మజుండు మోసంపుజూదరులతో జూదమాడ నారంభించి శకుని
కొక హారమధ్యమున నున్న రత్నముం జూపి, యిది సాగరసంభవము.
అమూల్యము. దీని నొడ్డెద. మీరు దేని నొడ్డెద రనఁగా, దుర్యోధ
నుండు నాకు బహుధనమును, నీ వోడినదానినంటి మణిరాసు లనే
కము లున్నవి. వాని నెల్లఁ బందెము చఱచెద. ఆటాడి జయమును
గొని యీధనమంతయుం గొనుము. నా కీవెలలేని మాణిక్యము
లొడ్డవలసి వచ్చెనే యని యెంతయు మాత్సర్యము లేదు. అని చెప్పి
వాని నెల్ల నొడ్డుటయు, శకుని యభిమతములయిన పాచికలఁగొని వాని
మోసంపునేరుపు చూపఁగ ధర్మరాజుం గెలిచి యాతఁ డొడ్డిన మణినిం
గొని, 'యీమాఱు దేనినొడ్డెదవు? ఒడ్డుము.' అనఁగా ధర్మజుండు శకుని
కిట్లనియె. సౌబలా! మోసము చేసికదా యాట గెలిచితివి? యని చెప్పి
మఱల జూద మాడఁ గడంగెను. వేయేసివరహాలతో నుండు బంగారు
కుండల నొడ్డెద నని యాడఁగా, శకుని తనకపటమున మఱియు గెలిచి,
నేన గెలిచితిఁ గదా? యని తెంపరియై నుడివెను. అంత ధర్మరాజు
హెచ్చు మచ్చరముతోఁ బెరిగి యొడ్డుచుఁ బెబ్బులితోళ్లచేఁ గప్పఁబడి
గజ్జెలు గట్టినదియు, నుఱుమువోలె సకిలించునట్టి మేలైన గుఱ్ఱము
లెనిమిదింటిచే బూన్చినదియు నగు దివ్యరథంబును, దివ్యకుసుమ
మాల్యాభరణచందనాదులచే నలంకృతలు, నఱువదినాల్గుకళల నేర్చిన
నిపుణలు స్నాతకవ్రతులయు దేవతలకును తనయొక్కరకును సముఖ
మున నాట్యములచేతను గానములచేతను వినోదములను జూపు లక్ష
దాసీజనంబులను, మహాబుద్ధిమంతులును యుక్తాయుక్తపరిజ్ఞానవంతులును,
సమయోచితములను బాగుగ నెఱింగినవారును సంతతదివ్యాలంకార
శోభితులును దరుణవయస్కులును రేయియుం బవలును నతిథిభోజన
సత్కారముల నొనర్చుటలో దక్షులును నగు లక్షదాసీజనంబులను, గన
కాంబరాభరణాలంకృతములును శ్వేతదంతములును బర్వతనిభంబులును
రాజయోగ్యములును నగు నెనిమిదివేలయేనుంగులను, నన్నిరథంబులను,
ప్రతిమానము వేయేసిగద్యాణంబులజీతంబులం గొనుచుండు నుత్తమ

త్తమున భూమి కంతకుఁ జెఱుపు గలుగునేడఁ దన్నును ద్యజించుట
శ్రేయస్కరమని తొల్లి శుక్రుండు చెప్పె. కులపాంసనుఁడైన దుర్యో
ధనుని హతుం గావించి కులము నుద్ధరించుకొనుము. ఒకనక్క నిచ్చి
యైదుసింహములఁ గైకొనుము. ఇందుల కొకదృష్టాంతముఁ జెప్పెద.
పూర్వ మొక్కరాజు తనయింటఁ దపోమహిమాతిశయంబున ననుదిన
మును బంగారము నుమియుచున్న పక్షులం గాంచి, ధనలోభమున వాని
యుదరంబులం దెంత బంగార మున్నదో, దాని నంతయు నొక్కసమ
యముననే కొనెద నని నిశ్చయించి వాని యుదరములఁ జీల్చెను. కాని,
వాని దేహములలో నీకలు నంజుడుం దప్పనింకేమియుఁ గానఁ బడలేదు.
అటులగుట వానివలనఁ బ్రతిదినమును దొరకుచుండినబంగారము వాఁడు
నష్టపోవలసి వచ్చెను. అవ్విధమున నీ వీకపటద్యూతమునకుఁ
గారణంబవై పాండవుల సర్వధనమును నపహరించుచున్నావు. దానిచే
వా రలిగి నీకుఁ జేటుం గలిగింతురు. కాన నీయుద్యమము నీచేటునకు
మూలంబు. కావున నామాటలను విని వారిని నలిగింపకుము. వెనుకఁ
జింతించుట వెఱ్ఱితనము. నీకు వారిసంపదఁ గొన నిచ్ఛయేని, పువ్వులఁ
దేనెను తేఁటి గొనుతెఱంగున, వారిని నొప్పింపక వారి కభిమతంబుల నొ
నర్చి ధర్మము సంపాదించుకొనుము. పుష్పమాలికలఁ గట్టువాఁడు పూచిన
చెట్లకు హాని కలిగింపక పుష్పములఁ గోయుచందము ననుకరింపుము. ఇట్లు
చేయుటయే నీతి. అట్లుగాక యెంతవెఱ్ఱివైనను బొగ్గులనిమిత్తము కల్ప
పాలంబుం గాల్చునే? కావునఁ బుష్పఫలములతో నిండియుండువృక్ష
ములవంటి పాండుసుతుల కత్యంతద్రోహము సలుపరాదు. కాన నీవు
పుత్రమిత్రబంధువులతోఁ జెడెదవు. పాండవులు నిక్కముగ నలిగి
యుద్ధమునకు నడుములు కట్టుకొని నిలుచుచో, వారిని గెలుచుట దేవ
తలతోడఁ గూడినమహేంద్రుండు తోడ్పడినను మీకు వలనుగాదు. జూద
మున భేదము, భేదమునఁ గలహము జనించును. దుర్యోధనుని నేరమున
జగద్విఖ్యాతయశంబు గాంచిన ప్రదీపశంతను బాహ్లీకాదులవంశంబులు
నశించును. మదించి మట్టిదిబ్బను కొమ్ములతోఁ బెల్లగించువృషభము
మాడ్కిఁ, గులము నీద్రోహి గుద్దలించుచున్నవాఁడు. దీన రాజ్యము
వినాశమును బొందు. ఈకుల నాశకుండు జూదమునఁ బాండవుల
నోడించి ధనమార్జించుచున్నాఁడని సంతసించెదవు. ధర్మరాజు కోపాగ్ని

భీమార్జుననకులసహదేవు లను మారుతంబున వీవఁబడకుండువంతవఱ
కందఱకు క్షేమంబు. అతం డలిగెనేని మీరు నిశ్చయంబుగఁ గూకటి
వ్రేళ్లతో నిర్మూలనమయ్యెదరు. నీకుమారుండు సింహములసటలను బట్టి
కొని యీగుల నడచుచున్నాఁడు. అధికబలవంతులతోఁ జెలరేఁగి వీఁడు
కలహింప సాగెను. ఇఁక నైనను నూఱకొనక యీచెవటిజూదమును
నివారింపుము. జూదమాడి యార్జించుటకంటె వేఱువిధమైన యార్జనో
పాయము లేదే? నీవు సంపద లేక వారిసంపద కాశించియున్నవాఁడవా?
పార్వతీయులవలన జూదమాడుటయందు మోసమును శకుని నేర్చి
యున్నవాఁడు. ఇట్టిమోసంపుజూదమున వీరిని ధర్మపరులను గెల్వఁ
బూనుట మహానర్థమునకు మూలము లోకగర్హితము. ధర్మవిరుద్ధము.
అందఱును నొక్కలేశ మహాగ్నియందుఁ బడఁద్రోయక క్షేమంబున
బ్రదుకుఁడు.' అని చెప్పుచున్న విదురనిహిత మంతటిని ధృతరాష్ట్రుండు
విని వినకుండిన ట్లుండెను.

ఆమాటల నన్నిటిని వినుచుండిన దుర్యోధనుండు విదురుం జూచి
యిట్లనియెను. 'క్షత్తా! నీ వెప్పుడును మమ్ము మూర్ఖుల మని నిందించు
చుందువు. పాండవులకుఁ బ్రియుండవై వారల నుతించుచుందువు దీనిచే
నీమనస్సున నుండుపక్షపాత మచ్చుపడుచున్నది. ఒడియం దుంపఁబడిన
సర్పమువలె మాయెడఁ గ్రౌర్యమును జూపుదువు. పిల్లి తమ్ముఁ
బోషించువారిచేతుఁ గొఱుకు. నీ వట్టివాఁడవు. పాపమునకు వెనుదీయవు.
మాగర్భశత్రువుల నోడిచి ద్రవ్యార్జనము మేము సేయుచుండ మా
సంపద గోర్వలేక పిచ్చిగూఁతలం గూసెదవు. పలుమాఱు శత్రుగుణకీర్త
నంబు సేయువాఁడును శత్రు వనంబడును. ఎల్లకాల మిట్టివర్తనమున
వర్తించునీకు సిగ్గుపోఁపదా? శత్రువులధనములను గొనుచుండు మమ్మవ
మానంపుమాటలాడి మాకుఁ గోఁపంతఁ గల్గించుట నీకుఁ దగదు.
ఇప్పుడైనను పెద్దల సేవించి బుద్ధిమంతుఁడవు కమ్ము. నీయశస్సును
రక్షించుకొనుము. శత్రువులకు హితముగాఁ బలుకకుండుము. నీవ
న్నింటి నెఱింగియున్నా నని కాఱుగూఁతలు ప్రేలకుము. సభలో
నీకుఁ దోఁచినట్లు ప్రలాపింపకుము. నీతిబోధము మాకు వలదు. మేము
నిన్ను హితమును బోధింపు మని యడిగినవారము కాము. నీహితబోధ

లేకున్నను మా కవశ్యము మేలు కలుగును. ఇది నిక్కము. సకలచరా చరభూతజాలంబులకు సృష్టిస్థితిలయములకు హేతుభూతుం డైన సర్వాంతర్యామి జీవులశుభాశుభములకుఁ గారణుం డై యుండు. వాఁడ సంపదల సమకూర్చువాఁడు; వాఁడ తొలఁగించువాఁడు. బుద్ధిబలముగల పురుషుండు తలచేఁ గొండ నైనను బగుల్చును. శరీరబలముచే దండన మువిధించు వానికి నరాతులును విధేయులై వర్తింతురు. ఒకానొకప్పుడు శత్రువుగా నుండి పిదప మిత్రుఁడైనవాని నుపేక్షింపఁ దగును. కాని సహజశత్రు నేనాఁడును నుపేక్షింపరాదు. మావలన నీ వెల్లప్పుడు హితమును బడయుచున్నను మమ్మే నిందించెదవు. మాకుఁ బ్రియముఁ గోరనివాఁడ విం దుండకుము. నీ వెం దేఁగియుం జనుము. మిక్కిలి లాలింపఁబడుచుండినను అంకులాడి మగనిని విడవాడును.' అని చెప్పఁగా వానికి విదురుం డిట్లనియె. సుయోధనా! ఇటువంటివారిచెలిమి చెలిమి కానేరదు. లెస్సఁగ నిరూపింపుము. రాజు లేనాఁడును నమ్మఁ దగనివారు. వారు మంచిమాటల లాలించుచునే నెత్తిన బండలను వైతురు. రోఁకళ్లం దంపుదురు. మఱియు నీవు నొకమహాపండితుంబోలె నన్ను మూర్ఖునిగాఁ దలంతువు. ముఖమునఁ గపటముతో స్తుతించుచు వెనుక దూరు వాఁడే మూర్ఖుఁడు. అట్టిమూర్ఖునిబుద్ధికి వేదవేదాంగపారంగతుం డైన శ్రోత్రియుఁడు స్వైరిణికింబోలె మేలొనఁ గూర్పలేఁడు. వయసుకత్తె కలువది యేడులముసకఁడు రుచింపనిపగిది నీమూర్ఖమతి వైచిత్రవీర్యు నకు యథార్థంబుగ రుచింపదు. ప్రియము గోరుదు వేని సర్వకార్యముల యుక్తాయుక్తతలను హితాహితములను స్త్రీలను గాని, జపులను గాని, వివేకశూన్యులను గాని యడిగి తెలిసికొనుము. అందఱును బ్రియము లనే బోధింతురు. అప్రియ మని హితమును జెప్పరు. అట్టిమాటలను జెప్పువారుగాని వినువారు గాని యరుదుగ నుందురు. ధర్మపరాయణుం డగు మంత్రివర్యుండు రాజున కప్పటికి రుచించు ప్రియవచనములను వదలి యప్రియమైనను హితమునే బోధించును. వాఁ డుత్తముఁడగు మంత్రి యని యెఱుంగుము. ఆహితబోధము రాజునకుపహాకారియై శుభ ముల నొడఁగూర్చును. శరీరవ్యాధిచేఁ గాకున్నను, మనోవికారముచే సంభవించి, రూక్షతీక్ష్ణవిదాహములం గలిగించి, కీర్తినిఁ బోనాడి, పరు

మంబై దుర్వాసనచే దూషితంబైన క్రోధరసమును జ్ఞానులు దిగఁద్రోచి శాంతులై ప్రకాశింతురు. నీవును చెడుమార్గముల వర్తింపక యుక్తా యుక్తతలను లెస్సఁగ నాలోచించి కర్తవ్యమును జేయుము. శుభము లను బొందెదవు. నే నెల్లకాలము సపుత్త్రమిత్రబంధుజనుండైన ధృత రాష్ట్రునకుఁ గీర్తిధనములు రాఁగోరుచుండు. నామనోనిశ్చయం బిది. నీ వెవ్విధమున నన్నుఁ దలంచినను దలంతువుగాక! నీకు నమస్కారము. బ్రాహ్మణులు ప్రసన్నులై నాకు శుభము లనుగ్రహింతురుగాక! క్రోధ ముత్రోడిచూపు చేతనే పరుల దహింపఁజాలిన మహనీయులయులుకకుఁ నీవు గుఱి కాకుండు వని యింత చెప్పితి. అని విదురుండు పలుకకుండె.

అంత ద్యూతరంగమున నన్నియు నొడ్డి యోడినధర్మరాజుంజూచి సభికు లోయుధిష్ఠిరా! అన్నింటి నొడ్డియోడితివి. ఇఁక దేని నొడ్డెద వనఁగా, నయుతప్రయుతపరార్థాదిమహాసంఖ్యకు సయితము మీఱిన ద్రవ్యమును, బశువులను, గుఱ్ఱములను నొంటెలసమూహమును, బ్రాహ్మణమాన్యములు దక్కఁ దక్కినమహీరాజ్యమునంతయును, బ్రాహ్మణు లను గాక యితరసకలజనులను, నానావిధభరణములతో వెలయుచుండు రాజపుత్త్రులను,నొక్కొక్కయాట కొక్కొకరియొడ్డుగా నొడ్డి యామోస గాఁడైన శకునితప్పుటాటలచే నోడెను. అంత ధర్మజునకుఁ బందెము చఱ చుటకు వస్తువు లేకుండుటచే శకుని సారెల ధర్మజుముందు వైచి, యధిష్ఠిరా! పందె మొడ్డుటకు నీకిఁ కేవస్తువును లేదు. అనఁగాధర్మ జుండు కవలనొక్కొక్కరినివరుసగానొక్కొక్కయొడ్డుగ నొడ్డియోడెను. అప్పుడు శకుని నీకు విధేయు లగు మాద్రీపుత్త్రులను సైతము గెలిచితి. నీకధికులగు భీమార్జును లున్నవారు. వారి నొడ్డుమనఁగాయుధిష్ఠిరుండు శకునితో, ఓరి కితవా? నీతిబాహ్యములగుమాటలాడకుము. మాలో భేదము నేల కల్పించెదవు? అనఁగా నాధర్మాత్మున కాకితవుం డిట్లనియె. ధర్మపుత్త్రా! మదించినవానికి మిట్టుపల్లములు గానరావు. జూదరులు మదంబున నాడుమాటలఁ బెఱవారు కలలోనం దలంపరు. నీవు పెద్దవాఁడవు. మఱియు నీతిపరుఁడవు. నీకు వందనములు. ఇఁక నాడు మనఁగా నయ్యుధిష్ఠిరుండు నావవోలె మ మ్మాపత్సద్రమును దాఁటించిన మహాశూరుని నర్జును నొడ్డెద నాడు మనియె. అంత శకుని

యూయాటనుం గెలిచి సారెలు ముందువైవ నాగాయుతబలపరాక్రముని భీమసేను నొడ్డెను. అంత శకుని వానినిం జయించి ధర్మపుత్త్రా! యీవద్దనమును దమ్ములను నోడితివి. ఇఁక దేని నొడ్డెదవనఁగా, నాత్మపణంబుగా నొడ్డి యోడినచో మీకు గూడిగంబు సేయుచుఁ గాలము గడపెద నని చెప్పి తన్నొడ్డికొని యాడందొడంగె. అప్పుడు శకుని యుధిష్ఠిరునితో ధర్మజా! నీ కింకను ధన ముండఁగా నిన్నొడ్డికొంటి వేల? జయించితిని. ఇఁక నీధనము ద్రుపదరాజపుత్త్రి యొకతెగలదు. దాని నొడ్డి యాడు మనఁగా, ధర్మజుం డామాటకుఁ గటకటంబడుచు సకలసద్గుణములరాశి, యతిసౌందర్యవిశేషంబుల నయ్యాదిపురుషు నారాయణునిలక్ష్మిం బోలినది యగు ద్రుపదుపుత్త్రి నొడ్డి యాడ నారంభించెను. అప్పు డాసభలో నున్నవారిదేమి యన్యాయము! ఈకౌరవులు లోకగర్హితమైన కార్యములను జేయుచున్నవారు. అనుచు దుర్యోధనాదులను దూఱిరి. మఱియుఁ గృపద్రోణభీష్ము లెద్దియుఁ దోఁపక మిన్నకుండిరి. విదురుండు కదలక మెదలక మేనఁ బ్రాణములు లేని వానిఁ బోలె దీర్ఘోచ్ఛ్వాసముల వదలుచుఁ, బాముఁబోలె బుసకొట్టుచుండె. కన్నుగానని వాఁడు గావున ధృతరాష్ట్రుఁడు గుర్తులచేఁ దమవారు దేనినో గెలిచి రని మాత్రము గుర్తించి, దేనిని గెలిచిరని యడుగుచుండె. కర్ణుఁడును దుశ్శాసనుఁడును బరమానందమునం దేలియాడిరి. మిగిలిన సభ్యు లీవిపరీతమునకుఁ గన్నీరు నించుచుండిరి. శకుని యీయాటను సైతము మోసమున గెలిచి, యిఁక ధర్మజా! నీవేది యొడ్డెద వని సారెలు ముందు వైచి యూరకుండె. అప్పుడు దుర్యోధనుండు పాండవధర్మపత్నియైన ద్రౌపదిని సభకుఁ దోడ్తెమ్ము. సభ నిప్పు డది చిమ్మవలయు ననిన విదురుం డిట్లనియె. మూర్ఖా! ఆడరానిమాటలను నోరికి వచ్చినట్లు ప్రేలెదవు. కాలముచేఁ గట్టఁబడి యొడ లెఱుఁగకున్నావు. కన్నుగానక పాతాళమునఁ బడెదవు. హీనజాతి మృగమైన నీ వుత్తమజాతిలోని పాండవసింహములను గనలింతువే? కోపముతోఁగూడికొని విషయుతములగు సర్పములఁ గనలించుటవంటిది కాదె నీవు వారిని గనలునట్లొనర్చుట? ఓదురాత్మా! ఎన్ని చెప్పిన నీమూర్ఖత్వమును మానవు. దీనం జేటవశ్య మగును. ద్రౌపది నీకు దాసి యగునే? యజమానత్వమును

గోల్పోయి పిదప ధర్మజుండు భార్య నొడ్డెను. ఫలించిన వేణువునకుం బోలె నీకీజూదము మూలముతో వినాశముం దెచ్చును. అనిచెప్పి సభలోని వారిమొగంబై తిరిగి యిట్లనియె. ఈ సుయోధనునకు వినాశకాల మాసన్నమైనది. ఎంద తెన్నివిధముల హితబోధమును జేసినను వినఁడు. ఇతరులను మర్మములఁ దాఁకు క్రూరవాక్యములచే నెన్నఁడును బాధింప రాదు. అట్లాడుటచే నరక మగును. పాండవు లాటవికునిఁగాని, నాగరకునిఁగాని, తపస్సంపన్నునిఁగాని పరిహాసంపుఁ బలుకులాడి నొప్పింతురే. దారినిఁ బోవుచుండు దిగ్గజమును జూచి కుక్కలు మొఱుఁగవా ? వీఁడు ఘోరమైన నరకమును బొందును. వీనితో నాడు దుశ్శాసనాదులకును వీనిగతి గల్గును. సుయోధనుండు మూఢుఁడు గాన నామాట వినఁడు. అధర్మాచరణం బతిశయించుటం జేసి కౌరవు లచిరకాలముననే వినాశమును జెందెదరు. ఒకానొకప్పు డొకయాఁడుమేక చేఁపలవాని గాలమును మ్రింగినది. వాఁడు గాలము నూడందీయుటకు యత్నించి దానికుత్తుకఁ గోసి చంపెను. కావునఁ బాండవులను వీఁడు నొప్పించి తీక్ష్ణంపుమాట లాడి గాలమును మ్రింగినమేక యయ్యెను. బెండులు మునింగినను, గుండులు దేలినను, నోడలు తబ్బిబ్బులాడినను, వీఁడు మూర్ఖుఁడై యెంత విపరీతములు గనుచుండినను బెద్దలమాట లాలకింపఁడు. వీనినిమిత్తమున నధర్మంబు కురుకులమునఁ దనంతవృద్ధియయ్యె. వీనికిఁ గ్రమముగా లోభబుద్ధి మెండయ్యె. అనుచుండఁగా సుయోధనుండు విదురు నుల్లంఘించి ప్రాతికామి యనువానిం బిలిచి సూతపుత్త్రా ! ఈవిదురుం డెప్పుడును నాతో వాదులాడుచుండు. మా పెంపుఁ గోరఁడు. నీ వతివేగంబున నంతఃపురమునకుఁ బోయి, ద్రౌపది నిటకుఁ దోడ్తెమ్ము. పాండవులకు భీతిల్లకుము. అని నియోగించె.

### ప్రాతికామి ద్రౌపదిని సభకుఁ దోడ్తేర నరుగుట

ప్రాతికామియు దుర్యోధనునిమాట మేరకు సింహగుహను బ్రవేశించు సృగాలమువోలెఁ, బాండవనివేశమును బ్రవేశించి ద్రౌపదితో నిట్లనియె. పాంచాలీ ! నీభర్త యుధిష్ఠిరుఁడు దుర్యోధనునకు జూదమున ని న్నొడ్డి యోటుపడెను. కావున నీవు దాసురాలవై దుర్యో

ధనుపంపు విని ధృతరాష్ట్రునియింటికి రమ్మనెను. ద్రౌపది యాకఠినంపు
మాటలను విని వానితో నిట్లనియె. ప్రాతికామీ! క్షత్రియుం డెవ్వం
డేని భార్యను బణముగా నొడ్డి జూదమాడుట కలదే? యుధిష్ఠిరుఁడు
జూదమున వివేకహీనుఁ డయ్యెనేమో? తెలియునట్లు చక్కఁగాఁ
జెప్పుము. అనఁగా వాఁడు పాంచాలికి యుధిష్ఠిరుఁడు తనసర్వస్వమును
నొడ్డి యోటువడి, పదంపడి యొడ్డి జూదమాడుటకు ధనము లేకపోఁగాఁ
దమ్ములను నోటువడి, పదంపడి తన్ను నిన్ను నోటువడియె ననఁగా
నప్పాంచాలి వానితో, "ఓరీ! నీవు మరల సభ కేఁగి యీకితవు నిట్లడు
గుము. మున్ను తన్నొడ్డుకొని యోటువడి యావల నన్నొడ్డి యోటు
వడెనో? కాకున్న మున్ను నన్నొడ్డి యోటువడి యావల తన్నొడ్డి
యోటువడెనో? ఈసందేహము నడిగి ర"మ్మనెను. అంత నీసందేహమును
యుధిష్ఠిరు నడిగి వత్తునని ప్రాతికామి ద్యూతరంగమున కేగి యుధిష్ఠిరుం
జూచి, రాజా! నీవు నిన్నొడ్డుకొని యోటువడినపిదపఁ బాంచాలి నొడ్డి
యోటువడితో? కాకున్నఁ బాంచాలిని మున్నొడ్డి, యోటుపడినపదం
పడి నిన్నొడ్డుకొని యోటువడితో? ఈసంశయమును బాపు మనిన
యుధిష్ఠిరుండు శోకాక్రాంతచిత్తుండయి యేమియును దోఁపక యూర
కుండె. అంత దుర్యోధనుఁడు ప్రాతికామితో ద్రౌపది సభ కేతెంచి తన
సంశయము నడిగి తెలిసికొనవచ్చును. మున్ను సభకు రమ్మనుమని
మఱల వానితోఁ జెప్పిపుత్తెంచె. వాఁడును పాండవధర్మపత్ని పాలికరిగి,
యాజ్ఞసేనీ! నీసందియమును దీర్చువారై సభ్యులు నిన్ను రాఁ బంచిరి.
రమ్ము. పాపాత్ముం డగు దుర్యోధనుని నిమిత్తముగఁ గురుకులము నాశ
మగు కాల మాసన్న మైనది. అనఁగా వానికి బాంచాలి యిట్లనియె.
ప్రాతికామీ! నే నాసభకు వచ్చుట యధర్మము. బహుకాలమునుండి
వన్నె కెక్కిన కౌరవుల ధర్మపరాయణత్వమునకుఁ జెఱుపుఁ జేయఁదగదు.
నాప్రశ్నమున కుత్తరము నాసభ్యుల నడిగిరమ్ము. వారు విధించునట్లు నేను
వర్తింతు. అనఁగా వాఁడు సత్వరముగ సభకుఁబోయి యాజ్ఞసేనివాక్యము
లను సభలోనివారి కెఱింగించె. అంత నాసభాసదు లెల్లరును సుయోధనుని
నిర్బంధమున నేమియు ననలేక తలలు వాంచి యూరకుండిరి.
ధర్మరాజు దుర్యోధనుదురుద్యోగ మెఱింగి యాజ్ఞసేనికడకు దూతను

బంపె. వాఁడును బ్రాతికామితోడన యరిగి యుధిష్ఠిరు నభిప్రాయ మును యాజ్ఞసేనికి వెల్లడించియుండెను. పిదప నేకవస్త్రయు రజస్వలయు మలినాంగియు నగు యాజ్ఞసేని ప్రాతికామితోడ సభకు నరిగి దూరముగ ధృతరాష్ట్రునెదుట నిలుచుండ సత్యధర్మపరాయణు లగు నాపాండుపుత్రులు దైన్యవిషాదములు ముప్పిరిగొన దేనిం జూడక తలలు వాంచి యుండిరి. వారిదైన్యవిషాదముల సుయోధనుం డెఱింగి విజృంభించి ప్రాతికామితోడ ద్రుపదసుత నిటకుఁ దోడ్తెమ్ము. కౌరవులు దాని ప్రశ్నముల కుత్తర మిత్తు రనెను. ప్రాతికామి ద్రౌపదికోపమునకు భీతిల్లి సభ్యులారా! పాంచాలితో నే నేమి పలుకువాఁడ నని యడుగఁగా, నపుడు సుయోధనుండు ప్రాతికామి భీమసేనునకు వెఱచియున్నవాఁడు. దుశ్శాసనా! నీవ దాని నిటకీడ్చుకొని రమ్ము. మనకు వశులయిన యీశత్రువులు మనల నేమియుఁ జేయలే రనెను. అంత నాదురాత్ముండైన దుశ్శాసనుండు తామ్రరక్తనేత్రుండయి బిడియ మిసుమంతయేనిలేక పాంచాలిం జూచి, యాజ్ఞసేనీ! యిటు రమ్ము. నీభర్తలు మాకు నిన్నొడ్డి యోడిరి. సిగ్గుపడ నేల?వలచి మాసుయోధనుం జూడుము కౌరవులఁ గోరికొనుము. అని పాంచాలిని సమీపింప నాదురాత్ముదుర్వృత్తంబున కాపుణ్యాంగన వెఱచి వెలవెలపోయి సొంపుదఱిగియుండు దనసిందుమోము నఱచేతఁ గప్పికొని యాసభలో నున్న గాంధారిపాలికిం జనుచుండె. కౌరవకులపాంసనుఁ డైనయాపాపాత్ముండు దానివెంబడిం దవిలి యింక నీ వెందులకుఁ బోయెద వని యదల్చి రాజసూయయాగావభృథస్నానంబునఁ బవిత్రంబులైన దానిశిరోజంబుల నొడిసి పట్టుకొని యీడ్వఁగా, తుపాను వీవఁగా నల్లలాడు నరఁటిచెట్టుం బోలె గడగడ లాడుచు జగద్రక్షకు లగు వీరులకుభార్య యయ్యు ననాథయుం బోలెఁ గష్టములపాలై వాని నుద్దేశించి, యోరీ! వివేకశూన్యుఁడా! నేను నిపు డేకవస్త్రను,రజస్వలను. సభ కిప్పుడు నన్నుఁ దోడ్కొని పోరాదు. అని యల్పస్వరంబునఁ జెప్పుకొనఁగా నాదురాత్ముండు దాని మనవి వినక యాజ్ఞసేనీ! నీవు రజస్వలవైననేమి? ఏకవస్త్ర వైననేమి! వివస్త్ర వైననేమి? నీవు జూదమున నీ మగనిచే నొడ్డఁబడితివి. నిన్ను వాఁ డోడుటను మాకు నీవు దాసివైతివి. నేఁడుమొదలు మాపరిచారికలతో సమానవుగ నీ వుండవలసినదాన

వైతివి. అని చెప్పి దయాశూన్యుండై దానితలవెండ్రుకలం బట్టుకొని సభామధ్యమునకు జరజర లాగికొని వచ్చెను. అప్పుడు తలవెండ్రుకలు ముడివీడఁ, గట్టినపుట్టంబు సగమువీఁడ, లజ్జ దోఁచఁ గ్రోధాగ్ని చేఁదపింపఁ బడినదై యీసభ్యులు సకలశాస్త్రముల నేర్చి కర్మముల నెల్ల విధ్యుక్తముగ ననుష్ఠించుచు మహేంద్రునిఁబోలె వెలుఁగుచున్నారు. గురుసమానులగు వీరియెదుట నిలువఁ దగదు. దురాత్మా! పలుగాకివై న న్నవమానింపకుము. ఇంద్రాది దేవతలు నీకు సాయపడినను నీపనికిమాలిన కార్యములను జేయు నీ వారాజపుత్రుల నోర్వలేవు. ధర్మజుఁడు గుణముల నెల్ల నెఱుంగుదును గాన నమ్మహనీయునిపై నించుకంత దోషారోపణమును జేయ వెఱతు. నీ విట్లు న న్నీసభలోని కీడ్చి తెచ్చుచుండ నీసభ్యులందఱును నీమతమున కెవరు నెదురాడరు. అందఱు దీనికి హర్షించియున్నవారు. ఇది తగని కార్య మని యొక్కఁడైన ననఁడు. జగత్ప్రఖ్యాతి గాంచిన భారతకుల మీనాఁటికి ధర్మశూన్యమై దూష్యమైనది. క్షత్రియులు ధర్మశూన్యులైరి. కాదేని యీయధర్మవర్తనంబును జూచుచు నీసభాసదులందఱును నూఱకుందురే? కురువృద్ధులగు ద్రోణభీష్మవిదురధృతరాష్ట్రాదులలో నొక్కరైన దీనిని వారింపలేరు కాఁబోలు. ఈయన్యాయ మెందేనిఁగలదే! యని కోపముతోఁ బాండునందనులవైపు రూక్షవీక్షణంబులను బ్రసరింపఁజేయుచుండెను. పాండవులు సర్వైశ్వర్యమును బోవుట నూఱకుండిరి గాని, లజ్జాకోపములతోఁ జుఱచుఱం జూచుచున్న ద్రౌపదిచూపులకు మిక్కిలి చలించి వంతతో నుండకపోలేదు. వారిదీనవదనముం జూచి దురాత్ముం డగు దుశ్శాసనుండు యాజ్ఞసేనిని 'దాసీ' అనుచుండఁగనే కర్ణశకునిసుయోధనులు వానిపరిహాసంపుఁబలుకులఁ బ్రశంసించిరి. మిగిలిన సభికులు వగచిరి. భీష్ముఁ డపుడు పాంచాలిం జూచి "అమ్మా! ధర్మసూక్ష్మము దురూహము. పాండవులేవురికి ధర్మపత్ని వగు నిన్ను యుధిష్ఠిరుం డొడ్డఁగాడు. స్త్రీలకు స్వాతంత్ర్యము లేదు. వారు భర్తృపరతంత్రలు. యుధిష్ఠిరుండు సకలసంపదలతోఁ దులదూఁగుచున్న సర్వమహీమండల రాజ్యమైనను వదలునుగాని, ధర్మమును వదలఁడు. అమహనీయుండు నిన్నుఁ బణముగా నొడ్డియోడెను. కావున నిందలి ధర్మసూక్ష్మమును దెలియనేర. గుణ మిది, దోష మిది యని చెప్పనేరను. జూదమున శకునికి నిన్నోడియు ధర్మజుఁడు నీకు

వంచన దలంచునే?” యనఁగా ద్రౌపది యిట్లనియె. దుర్మార్గులు, పలుగాకులును నగు జూదరులు పిలువ ధర్మజుఁడు తనకు జూద మభిమతంబు గాకున్నను గపటద్యూతమున వర్తించి యన్నింటి నొడ్డి, మఱి యొడ్డుటకు వేఱు పణంబు గానక నన్నొడ్డెఁ గాఁబోలు. కొడుకులకును గోడండ్రకును నియమవృత్తముల నేర్పఱచుమహాత్ము లగు కౌరవులు నా ప్రశ్నకు త్తరము నిచ్చునది; యని చెప్పి రోదనము సేయుచుండ దుశ్శాసనుండు తులువమాటలఁ గొన్నిటి నాడుటయు, వానిని విని వృకోదరుండు ధర్మజున కిట్లనియె. జూదరులు తమభార్యలు కులటలయ్యును వారిని బణముగా నొడ్డరు. అట్లుండఁ బరమపతివ్రతయుఁ, బాండవధర్మపత్నియు నగుపాంచాలిని నీ వొడ్డుట మిక్కిలి యన్యాయ్యంబు. సర్వైశ్వర్యములకును మాకును నీ వధీశ్వరుండవు. కావున నైశ్వర్యము నంతయును, మమ్మును నీవొడ్డుట ధర్మ్యము కాని, యిప్పాపాత్ములకు దాసురాలగునట్లు యాజ్ఞసేని నొడ్డుట మిక్కిలి నింద్యము. నీచేతులఁ గాల్చెద నని సహదేవు నెుగంబై యగ్నిఁ దెమ్మనెను. అంత నర్జునుండు భీమునిం బిలిచి యింత కాల మోర్పుతో నుండిన నీ వీ కఠినవాక్యములచే ధర్మజు నిక్కాలమునా డెదవు. ఈజూదరులనిమిత్తమున నీవును ధర్మమును గోల్పోయితివి. రాగప్రేరితుండవై యద్దాని నొనర్పకుము. ధర్మమార్గమున వర్తింపుము పరమధర్మపరాయణుం డగు పెద్దవాని నేల దూఱెదవు? జూదమునకుఁ బిలువఁబడి రాజధర్మప్రవర్తకుఁ డగు ధర్మరాజ నుజ్ఞల కోరికల నీడేర్చునిమిత్త మీయాటనాడుటకు దొరఁకొనియె. ఇది యశస్కరంబు. ఇందు ధర్మాత్ముండగు ధర్మజుదోష మెద్దియును లేదు. శాంతమనస్కుండ వగు మనెను.

అంత నాసభయందు ధృతరాష్ట్రసూనులలో నొకఁడగు వికర్ణుడను వాఁడు పాండవుల దైన్యవిషాదంబులకును, ద్రౌపదిపరిదేవనమునకును సభ్యు లంత యూరకుండుటం గని యధర్మమునకు వెఱచి యిట్లనియె. సభ్యులారా! ద్రౌపదికి సదుత్తరం బొసంగుఁడు. గుణదోషముల విచారించి యుక్తాయుక్తతలను జెప్పకుండుసభ్యులు నరకలోకవాసు లగుదురు. కురువృద్ధులగు భీష్మధృతరాష్ట్రులును, గురువులగు కృపద్రోణులును, సభలోనుండు మిగిలిన రాజులును యాజ్ఞసేనీప్రశ్నమున కేల యదత్తో

త్తరులై యున్నవారు? రాగద్వేషములు లేక పక్షపాతమును బోద్రోలి
ధర్మమును విశదీకరించునది; యని పేరెలుంగున ననేకపర్యాయము లడి
గియు నంద ఱూరకుండుటకుఁ జింతిల్లి దీర్ఘోచ్ఛ్వాసముల నిగుడ్చుచుఁ
జేతులం బిసికికొనుచు సభ్యుల నెల్లరం గలయం జూచి, మహనీయులారా!
మీలో నెవ్వరైనను నీద్రౌపదీప్రశ్నమునకు సదుత్తర మిండు. కాకున్న
మిన్నకుండుఁడు. నాకుఁదోఁచిన న్యాయము నేఁజెప్పెద వినుఁడు. వెలఁది,
వేఁట, జూదంబు, పానంబు ననునాల్గు వ్యసనములందును రాజులు దగు
లుకొందురు. వీనిలో నెద్దాని నాసక్తి గలిగినను నారాజు ధర్మమును
వదలును. ఆకాలమున మైమఱచినయాతనిచేఁ గావింపఁబడు పనులను
లోకులు మెచ్చరు గదా? అట్లే యుధిష్ఠిరుం డీసమయమున ద్యూతవ్య
సనప్రేరితుఁడై సకలధనముల నొడ్డి యోడి యొడ్డుటకుఁ బణము లేకుం
డఁగాఁ దమ్ములను దన్ను నొడ్డి పిదప నిప్పాంచాలి నొడ్డి యోటువడియె.
ఇంతేకాక యీపతివ్రత పాండవుల కెల్ల ధర్మపత్ని గాన సాధారణధనము.
దీని నీకండొడ్డరాదు. కావున నన్నియు వితర్కించి యిప్పాంచాల్యంగన ద్యూ
తవిజిత కానేరదని నిర్ణయించెద. మఱియుఁ గులస్త్రీయగు నీమహాపతివ్రత
ను సభకుఁ దోడ్తెచ్చుట యన్యాయంబు. అని చెప్పఁగా వికర్ణుపలుకులకు
సభ్యులెల్లరు వానిని శ్లాఘించిరి. శకునిని దిట్టిరి. అంతఁ గర్ణుండు రోషతా
మ్రాక్షుండై వికర్ణుం జూచి యిట్లనియె. ఇందు వైకృతంబులు పెక్కులు
గలవు. వానినన్నింటిని జెలుపునిమిత్త మరణియందుఁ బుట్టు నిప్పువోలెం
బుట్టిన ట్లున్నావు. సభ్యులెల్లరుఁ బాంచాలి ధర్మజిత యని యూరకున్న
వారు. ఎప్పుడు ధర్మపుత్త్రుండు తనసర్వధనముల నోడెనో యప్పుడు పాంచా
లియును వానిధనమునందుఁ జేరినది కదా! పాండవులును దీని కొప్పు
కొని యూరకున్నవారు. ధర్మనిర్ణయము చేయఁగల పెద్ద లింద ఱుండ
నీవు ధర్మనియామకుఁడవై ధర్మము నెఱుంగఁ దెలుపవచ్చితివో? విచా
రింపఁగా నీవు కొండికవు. ఆవేశమున నవసరపడి తప్పుఁ బల్కితివి.
ఏకవస్త్ర యగు దీనిని సభకుఁ దోడ్తెచ్చుట యన్యాయ్యం బంటివి.
వినుము సమాధానము. లోకమున భగవంతుఁ డొక స్త్రీకి నొకపురుషుని
భర్తగా విధించియున్నాఁడు. దీనికి భర్త లేవురు. అనేక భర్తృక కులట
యనఁబడు. ఇట్టి స్త్రీని సభకుఁ దోడ్తెచ్చుట యన్యాయ్యంబు కాదు. ఇది

యేకవస్త్ర యైన నేమి? వివస్త్ర యైన నేమి? వీ రందఱును జూదమున గెలువఁ బడినవారు. అని వికర్ణుని కర్ణుండు నివారించి దుశ్శాసనుం జూచి, దుశ్శాసనా! వికర్ణుండు తా నొకపండితునింబోలె వదరుచున్నవాఁడు. నీవు వోయి యాపాండవులయు నా పాంచాలియొక్కయు వస్త్రముల నొలిచి తెమ్ము. అనఁగా నప్పాండవు లేవురును దమతమపైనున్న వస్త్రములఁ దీసి యవలఁ బెట్టిరి.

## దుశ్శాసనుండు ద్రౌపదీవస్త్రాపహారముఁ జేయుట

కర్ణునిమాటను విని సుయోధనుం డనుమతింపఁగా దుశ్శాసనుండు ద్రౌపది కట్టిన వస్త్రము నొలువఁ దొడంగెను. అప్పుడు యాజ్ఞసేని తన్ను రక్షించువా రెవరును లేకపోఁగా నార్తత్రాణపరాయణుం డగు జగన్నాథుండైన శ్రీకృష్ణుని మనస్సునఁ దలంచి, గోవిందా! ద్వారకావాసా! శ్రీకృష్ణా! గోపీజనప్రియా! కేశవా! అనాథసంరక్షకా! రమానాథా! మహాయోగేశ్వరేశ్వరా! జనార్దనా! విశ్వాత్మా! విశ్వభావనా! మహాయోగీ! ఈకౌరవసభామధ్యమునం దీదురాత్ముఁడు నన్నిట్లవమానించుచుండ నా కేల సాయపడవు? లోకప్రభువా! ఈ విపత్సముద్రమునందుండి నన్నుఁ దరింపఁ జేయుము. నేను నీకు భక్తురాలను. నన్నుద్ధరించి రక్షింపుము. ఓకరుణానిధీ! నీవు దక్క నాకిఁక దిక్కెవ్వరును లేరు. అని భగవద్ధ్యానపరాయణయై, యాఘోరమును జూడలేక కన్నీరు గార్చుచున్న మోమును జేతులతోఁ గప్పికొని పలవించుచుండెను. భక్తసంరక్షకుం డగు భగవంతుఁడు ద్రౌపదియేడ్పు కూయి యాలించి తా ద్రొక్కినటువంటి శయ్యను వదలి చెంతనున్న రుక్మిణికిం జెప్పక ద్రౌపదిం గనుఁగొని కరుణించి, యెవ్వరికి నిజస్వరూపము గాన్పింపక ద్రౌపదీమానసంరక్షణార్థమై యనేకవస్త్రముల నొసఁగుచుండె. సద్గుణభ్రష్టుఁ డగు దుశ్శాసనుఁడు పవిత్రయై పతివ్రతాశిరోమణి యగు ద్రౌపది వలువ లొలువఁ నొలువ నాయుగుప్పటివంటి కోకలా మెఱపున భాగంబును గప్పుచునే యుండెను. ఇట్లా దుశ్శాసనుఁ డొలిచిన కోకల రాశి పర్వతోపమానంబై నమకట్టె. అంతఁ గొంతసేపటికి దుశ్శా

సనుం డామె కొంక లొలువ లేక లజ్జించి యేమియు ననక యూరకుండె. అప్పు డచ్చట నుండిన సభ్యు లెల్లరును పాంచాలిపాతివ్రత్యమును గొనియాడిరి. దుశ్శాసనునిదుశ్చేష్టను వానిం దూషించిరి. అప్పుడు భీమసేనుండు క్రోధపరవశుండై యవుడు గఱచుచుఁ బాణితలంబును నేలం గొట్టి పెద్దయెలుంగుతో సభ్యులం జూచి యిట్లనెను. సభ్యులారా! ఇదె వినుండు నా ప్రతిజ్ఞ. ఇట్టిప్రతిజ్ఞ నిదివఱ కెవ్వఁడును జేయఁడు; ఇఁక మీఁదను జేయఁడు. ద్రౌపదీమానభంగమునకు యత్నించిన యీ పాపాత్ముం డగు దుశ్శాసనుని ఘోరరణమునందుఁ జంపి వానిఱొమ్ముఁ జీల్చి వానిరుధిరమును దప్పక త్రావెద. కాదేని నేను, బూర్వ లోకంబులకుఁ దప్పువాఁడ. అనఁగా నాసభలోనివారు భీమసేనుం గొని యాడిరి. దుశ్శాసనుని తులువకార్యమునకు కెల్లవారును వానిని దిట్టిరి. కొందఱు ద్రౌపదీప్రశ్నమున కుత్తరము నీయరైరి కదా యని సభ్యులు వారి నాడిపోసికొనుచుండిరి. అట్టియెడ విదురుండు చేతులు పై కెత్తి కొని యెల్లవారు వినుచుండ నిట్లనియె. సభ్యులారా! ద్రౌపదిప్రశ్నము నకు సభ్యు లుత్తరము నానతిండు. ఈయరేని యధర్మపరు లగుదురు. దైన్యమును జెందినవాఁడు మండుచున్న యగ్నులంబోలె నుద్రేక ముతో వెలుఁగుచుండు సభను దరిసె నేని, వానిని సత్యధర్మములచే సమాధానపఱచుట సభ్యులకు ధర్మము. రాగద్వేషపరాయణులు దీనుల ప్రశ్నములను విపరీతములుగ భావింతురు. ఇంత యుండు సభలో వికర్ణుఁ డొక్కఁడే తనబుద్ధికిఁ దోఁచినట్లు సదుత్తరము నొసంగెను. దీనులప్రశ్న ములను విచారింపని సభ్యు లనృతదోషంబున నగుదురు, వలయు నని విరుద్ధముగ నధర్మమునే చెప్పినచో నసత్యదోషం బంతయును బొందు దురు. ఇందుల కొక యితిహాసము చెప్పెద.

పూర్వము ప్రహ్లాదునికుమారుండు విరోచనుఁ డనువానికిని నంగిరసుం డను విప్రునికుమారుండు సుధన్వుఁ డనువానికిని గన్యాపరిగ్ర హణంబున నేన గుణవంతుండ, నేన గుణవంతుండ నను వాదు రాఁగా నిరువురును బ్రహ్లాదుసభ కేగి తమవాదమును జెప్పుకొని, యాదైత్యపతిని దమ్ము లెస్సఁగాఁ బరిశీలించి తమలోన గుణశ్రేష్ఠునిఁ జెప్పు మని కోరుచుఁ బ్రహ్లాదునిచే గుణశ్రేష్ఠుం డని నిర్ణయింపఁబడినవాఁ డన్యుని సంహా

రించి యాకన్యను బరిగ్రహించు నని యొండొరులు నియమమును జేసి
కొనిరి. అప్పుడు సుధన్వుండు ప్రహ్లాదునితో నిట్లనియె. ప్రహ్లాదా! నీవు
నిర్ణయించుగుణశ్రేష్ఠుండవు పెఱవానిని వధించు. నీవు ధర్మమును జెప్పవల
యు. కాకున్న నీదుశిరము మున్నూఱు వ్రయ్యలుగ మహేంద్రుని వజ్రాయు
ధము వ్రచ్చునని తమపణబంధమును జెప్పి, జ్వలించుచున్న బ్రహ్మదండంబో
యనునట్లు మహాతేజోజాలోచనుండై యెదుట నిలువంబడియె. అంతఁ
బ్రహ్లాదుండు బ్రహ్మతేజమున కదరిపడి గాలి కల్లలాడు రావియాకువిధం
బునఁ జలితహృదయుండై కశ్యపునొద్ద కేగి యి ట్లడిగెను. మహాను
భావా! నీవు సకలధర్మముల నెఱింగినవాఁడవు. నే నిప్పు డరయఁగోరి
యొక్కటి యడిగెదను. సభకు వచ్చి యెవ్వరైనను ధర్మసందేహమును
దీర్పుమని వేఁడిరేని సభ్యులు లాభలోభపక్షపాతలోలబుద్ధులయి యాధర్మ
మును బరిశీలింపకున్నను, దెలిసి యసత్యమాడినను వారు పొందులోక
ములఁ జెప్పుము. అని యడుగఁగాఁ బ్రహ్లాదునకుఁ గశ్యపుఁ డిట్లనియె.
ఎఱింగియు రాగద్వేషభయాదులచే వివాదముల విచారింపని సభ్యుని,
దప్పుఁ జెప్పినసాక్షిని వరుణపాశసహస్రంబు గట్టి యేఁటేట నొక్కొక్క
టిగాఁ బాయుచుండును. సభ కరుదెంచి ధర్మమును నిరూపింపుమన్న
వారికి వివాదమును లెస్సగా వడసి తెలిపినంతవఱకు సత్యమును వెలికిఁ
దీసి సత్యనిరూపణము గావింపవలయు. అధర్మముచే నావరింపఁబడిన
ధర్మమును విచారింపకున్నచో నాపాపమున సగము సభాధ్యక్షుని,
నాలవపాలు సభ్యులను, బెఱినాలవపాలు కర్తను బొందును. అధర్మమును
లెస్సగ విమర్శించి నిందార్హుని నిందించిన సభాధ్యక్షుఁడును, సదస్యులును
పాపములను బొందరు. అప్పుడు కర్త నొక్కనినే యాపాపం బెల్లఁ
జెందు. న్యాయమునను విస్పష్టముగఁ బల్కుదురే, నాపల్కినవారివంశ
మున ముందటియేడుతరములవారికిని, వెనుకటియేడుతరములవారికిని వా
రొనర్చినయిష్టాపూర్తములవలనఁ గలుగు సత్కర్మఫలములును గలుగవు.
సర్వధనమును బోఁగొట్టుకొనినవాఁడు, పుత్త్రమరణపీడితుఁడు, నప్పుల
మునింగినవాఁడు, స్వార్థభ్రష్టుఁడు, పతిలేనివనిత, రాజపీడితుఁడు, పుత్త్రులు
లేనివాఁడు, పెద్దపులినోటఁ దగులుకొన్నవాఁడు, సవతిపోరునఁ గుందు
వనిత, సాక్షు లసత్యములాడుటచే బాధఁ జెందినవాఁడు ననెడి వీరెల్లరు

సమానదుఃఖము ననుభవించువారు. అసత్య మాడినసాక్షియు నీవిధము లైన క్రూరకర్మములనే యనుభవించుచుండును. ప్రత్యక్షముగఁ జూచి, బాగుగ విని, దానియర్థమును మఱవక మనస్సున నిలుపుకొని సాక్షి సత్యమే పలికి ధర్మార్థములఁ గొఱఁత నొందఁడు. అని వీని నెల్లఁ బ్రహ్లాదుండు విని తనకొడుకు విరోచనునియొక్కయు, నంగిరసుకొడుకగు సుధన్వునియొక్కయు గుణపరిశీలనంబు లెస్సగాఁ గావించి నాకొడుకునకంటె సుధన్వుం డెన్నిమడుంగులో గుణశ్రేష్ఠుం డని గుర్తించి వానిం బిలిచి యిట్లనియె. విరోచనా! నీకంటె సుధన్వుండును, నీతల్లికంటె వానితల్లియు, నాకంటె వానితండ్రియగు నంగిరసుండును మిక్కిలి గుణశ్రేష్ఠు లని నిర్ణయించి చెప్పెను. సుధన్వుండును ప్రహ్లాదుండు పుత్రమోహంబుఁ జెందక గుణపరిశీలనంబు లెస్సఁగ నొనర్చి ధర్మమును దాఁపక వచించుటచే బ్రహ్లాదునకు విరోచనుప్రాణదానంబు చేసి వానిం జంపక వదలి వానికి దీర్ఘాయుష్యంబు నిచ్చి చనియె. కావున, సభాసదులారా! ద్రౌపది సభవారి నడిగిన ప్రశ్నము లెస్సఁగ విచారింపుఁడు. ధర్మశీలనం బొనర్చి న్యాయమును జెప్పుఁడు. అని విదురుం డెన్నివిధంబుల ఘోషించినను సభవా రూరకుండిరి.

ఆటఁ గర్ణుఁడు దుశ్శాసనుం బిలిచి దాసి యగు యాజ్ఞసేని నిటకుఁ బిలిచికొని రమ్మనిన నాదురాత్ముండు వనితారత్నమగు ద్రౌపదిని సభామధ్యమునకు నీడ్చుచుండ వడఁకుచు లజ్జితయై యమ్మానారీరత్నంబు రోదనముసేయుచు, ఓరి దురాత్మా! దుశ్శాసనా! కొంతసేపాఁగుండుము. నన్నీసభ కీడ్చుకొని వచ్చుటచే విహ్వలనైతి. ఓకౌరవులారా! మీ కెల్లరకు మ్రొక్కెద. ఈపాపాత్ముం డబల నగు నన్నిట్లు లాఁగుటచేత సొమ్మసిల్లితి. ఆనాఁటి స్వయంవరకాలమున రాజులెల్ల నాపాంచాలసభలోఁ జూచియుంటిరి. అదిమొదలీనాఁటివఱకు నన్నుఁగన్నెత్తి యెవ్వరికిఁ జూచుటకు వీలు లేని యంతఃపురమున నుంటిని. ఇవ్విధమున రాజులతోఁగూడియుండు సభకు వచ్చియెఱుఁగను. ఆప్రకారంబు నన్ను రక్షించుచుండిన ధర్మపుత్త్రుండును, దక్కుంగల పాండునందనులును నేఁడీ దురాత్ముం డీడ్వఁగఁ జూచి సైరించియున్నవారు. సూర్యరశ్మి నాపై సోఁకియుండదు. వాయువు స్పృశించిన నోర్వని యీమహానీయ లీనాఁడు

కాలపాశకుంఠితులై తలలు వాంచి యున్నవారు. పుత్త్రీసమానయఁ
గోడలునగు నాకీపాటు గలుగుచుండఁ గౌరవులెల్ల నోర్చియున్నవారు.
కాలవ్యత్యాసము వాటిల్లె నని తలంతు. పతివ్రత నగు నాకంట నీ రిట్లు
కాఱునట్లు చేయుటకంటె వేఱొక యన్యాయంబు గలదా? ధర్మపరాయణ
యగు వనితను బెద్దలు సభకు రప్పింప రని వినియుందు. కౌరవుల రాజ
ధర్మమంతయు నీ నాఁ డడుగంటె. పాండవులకు ధర్మపత్నినై, ధృష్ట
ద్యుమ్నునకుఁ జెలియలనై, గోవిందునకుఁ జెలినై, ధర్మమూర్తియే యనఁ
దగు ధర్మజునకుఁ బట్టపుదేవినై నే నీనాఁడు సభ కీదురాత్మునిచే
నిట్లీడ్చుకొని తేఁబడితి. దాసీకార్యములను జేయవలసినదాననో కానో
నాకు వివరింపుఁడు. నీచుఁడైన యీదుశ్శాసనుం డబల నగు న న్నిట్లు
కాఱియపెట్టుచున్నవాఁడు. ఇఁక దీర్ఘకాలము వీని బాధ సైప నోపను.
మీ విధించినవిధంబునఁ బ్రవర్తింతు నని సభామధ్యమునఁ బేరెలుఁగున
వాపోవుచుండె. దాని యాక్రందనమును విని భీష్ముం డిట్లనియె. ఓశుభాంగీ!
ధర్మసూక్ష్మము నెఱుంగుట యెల్లవారికి మిగులఁ గష్టము. నీప్రశ్నమునకు
నే నుత్తరమీయనేరను. ని న్నిట్లవమానించిన యీదురాత్ములు వేగంబ
నష్టులగుదురు. ఇంతకష్టముల పాలయ్యును నీ విట్లు ధర్మమునే విచారించు
చుండుట నీకు తగు. ధర్మ మెఱింగి ద్రోణాదిగురుజనులును జీవచ్ఛవం
బులు వోలె మిక్కిలి సంతాపంబునఁ బొగులుచున్నవారు. సర్వధర్మ
ముల నెఱింగిన ధర్మజుండే నీప్రశ్నమునకు సదుత్తరము నీయ నర్హుండు.
అని వచించి యూరకుండె. భరింపరాని దుఃఖాగ్నిజ్వాలలచే దహింపఁ
బడుచున్న పాంచాలిప్రశ్నమునకు సభలోని రాజు లెల్లరు దుర్యోధనుని
వలనిభయమున సదుత్తరమును జెప్ప కూరకుండుటయు నప్పు డా
సుయోధనుండు ముసిముసినగవులు నగుచు, పాంచాలీ! నీప్రశ్నమును
భీమార్జుననకులసహదేవులు విమర్శించి నీకు ధర్మాత్ముఁ డగు ధర్మ
జుఁ డీశుఁ డనియో, యయథార్థపరుఁ డనియో చెప్పిరి యేని
నీదాస్యంబు తొలఁగు. ధర్మరాజు తా నైన నీయర్థమును జెప్పును గాక!
సభ్యు లందఱును దుఃఖసాగరమున మునిఁగి నీకతుల దౌర్భాగ్యమునకుఁ
జింతిల్లుచున్నవారు. ఈసమయమున నెల్లవారును ధర్మపుత్త్రుఁడు లేచునె
దరో యని వారి మొగముల వీక్షించుచుండిరి. అంత భీమసేనుండు చంద

నపుంబూంతతో నున్న ధర్మరాజు చేతులం బట్టికొని యీ మహానీయుండు మాకు గురుండును నేలికయుంగాండేని మే మీదురాత్ములదుష్టవర్తనంబు నింతతడ వోర్చియుందుమే. న్యాయసువులకే యీశ్వరుండైన యీ మహనీయుండు మస్తునొడ్డి యోండుటం జేసి యూరకుండవలసె. కాదేని పాంచాలిశిరోజములం దాంకిన దురాత్ముం డీనాం డీసభలో వధింపంబడక బ్రదికియుండ నేర్చునే? ఇనుపగుదియలవంటి నా బాహువులమధ్యమునం దగిలికొన్న మహేంద్రుండైనం దప్పించుకొని పోంజాలునే? ధర్మపాశము, నర్జుననిగ్రహము, గౌరవమును జవ దాంటి నర్తింప లేకున్నవాండ. ధర్మరాజు సెల విచ్చినచో, సింహము క్షుద్రమృగంబులను బోలె దుష్టాత్ములగు నీధార్తరాష్ట్రులను గాలందాచి కీటడంతు, నని పలుకుచుం క్రోధాగ్నిజ్వాలల నానావిధంబులం బఱపుచుండు భీష్మద్రోణకృపవిదురు లివి క్రోధంబునకుం దగిన సమయము కాదని భీమునకు బోధించి యతనిని శాంతచిత్తుం జేసిరి. పదంపడి కర్ణుండిట్లనియె. దొర నెప్పుడు దూషించుచు భీష్మద్రోణవిదురు లతనియభివృద్ధిం గోరువారివలె వచించుటం జేసి వారు ధర్మాత్ములే. దాసుండు, పుత్త్రుండు, స్వతంత్ర కాని స్త్రీయు ననెడివీరు మువ్వు రధనులు. [illegible] ధనవిహీనులయిన దాసులకుం బత్నియైన యాజ్ఞసేని దాసధనము వోలె సుయోధనుని సొమ్ము. కావున నో యాజ్ఞసేనీ! రాజపరిచారికలం జేరి నీవు నియమించిన కార్యములం జేయుచుండుము. ఈదినము మొదలుకొని నీ యజమానులు సుయోధనాదులే కాని పాండవులు కారు. ద్యూతపరాజితుండు కాని వేఱొకశూరుం బతిగా వరింపుము నీమగ లెల్ల నోడిరి. అర్జునుండు తనశౌర్యపౌరుషములను నుత్తమజన్మమును నింక నెట్లు భావించునో? యనిన విని భీమసేనుండు దీర్ఘోచ్ఛ్వాసంబుల వదలుచు ధర్మమను త్రాటిని ద్రెంపనేరక ధర్మరాజుం జూచి కర్ణునివచనంబులకుం గినియకుము. నీ వీదుర్ద్యూతం బాడుటంగాదే మనకీదాస్యంబు దాపురించె. శత్రుజనపరిహాసవచనంబులను వినవలసె. అనిన భీమసేనుపలుకులు విని, సుయోధనుం డూరకున్న ధర్మరాజుం జూచి నీతమ్ములు నీయాజ్ఞాబద్ధులై యున్నవారు. పాంచాలి ప్రశ్నమున కుత్తరము నిమ్మని చెప్పి యాయుధిష్ఠిరువలన మొగము నుత్తరీయమున మఱుంగుం జేసికొని యైశ్వర్యదర్మ

డాంధుండై ముసిముసినవ్వులు నగుచు నొకవంకఁ గర్ణుండు మెచ్చఁగ, వేఱొకవంక భీమసేనుండు గినియఁగ నరఁటిచెట్టును నేనుంగుతొండంబును బోలి సర్వలక్షణలక్షితంబైన తనయూరువును ద్రౌపదికి సైగసేసి చూపెను.

ఆసమయంబున భీమసేనుం డాదుష్టునితలం పెఱింగి వేగంబ కోపఘూర్ణితరక్తాక్షుండై గ్రుడ్లను లయకాలదండధరుంబోలెఁ ద్రిప్పుచు నా సభాసదు లెల్లవారు వినంగ నిట్లనియె. కులపాంసనుండైన యీసుయోధనుతొడలను ఘోరయుద్ధమున నీభీమసేనుండు గదచే విఱుగఁగొట్టును. అట్లు కానినాఁ డీ భీముండు పితృపితామహులలోకములకుఁ దప్పువాఁడని ఘోరప్రతిజ్ఞఁ బూనుచుండఁ గార్చిచ్చుచే దహింపఁబడుచుండు మహావృక్షముయొక్క తొఱ్ఱలనుండి వెలువడు నగ్నిజ్వాలలువోలె భీమసేను రోమకూపంబులయం దుండి యగ్నికణములఁబోలు మిడుఁగుఱులు వెడలె. ఏనాఁడును సంభవింపని యధర్మమునకు భరతకుల మీనాఁడాలవాల మయ్యె ననుచు విదురుండు కౌరవుల సంబోధించి యిట్లనియె. కురుకుల మింతయధర్మమున కేనాఁడును బాల్పడి యెఱుంగదు. భీమసేనువలన సుయోధనాదు లెల్లరకుఁ జావు విధిచోదితంబు. ఈకపటద్యూతము, పరమపతివ్రత యగు యాజ్ఞసేనిశిరోజములం బట్టి సభ కీడ్చి తెచ్చుట, వస్త్రాపహరణము, నవమానపఱచుట ననునివి యెల్లను ధార్తరాష్ట్రులవినాశమునకు ముఖ్యనిమిత్తములు. వీని నెల్ల నధర్మంబన లేక సభ్యు లందఱు నోర్చియున్నవారు. చేటుకాల మాసన్నమైనప్పు డీయధర్మంబును సభాసదులు మెత్తు రని పెద్దలు సెప్పుదురు. శకుని నిర్బంధముచేఁ గపటంపుజూదమాడి ధర్మరాజు తన్నును దనతమ్ములను భార్యను నోడుట స్వప్నప్రాయమని యెఱుంగఁడు. ఇతఁడు తన్ను ముందుగాఁ బణమొడ్డి యోడియుండె. అట్టిసమయమున నీతండు పాంచాలి నొడ్డుట కర్హుండు గాఁడు. అట్లుగాక ద్రౌపదిని మున్ను పణముగ నొడ్డి యోటువడినపిదప తన్నొడ్డికొని యోటువడెనేని యితఁడు ద్రౌపది కీశుండగు ననిన, దుర్యోధనుండు పాంచాలరాజపుత్త్రి కిట్లనియె. యాజ్ఞసేనీ! నావలనదోషము లేదు. నేను భీమార్జుననకులసహదేవులమాటల మెయి నడిగెద. యుధిష్ఠిరుఁ డీశుఁడు గాఁడని వారు చెప్పుచో నీదాస్యంబు వాయునని మున్నే చెప్పితి. అనఁగా నర్జునుండు మాకందఱకును ధర్మజుఁ డీశుఁ డగును. తన్నోటువడిన

పదంపడి యూతం డెవరి కీశుఁ డగును కౌరవులు దీనిఁ దీర్పవలయును, అని చెప్పుచుండఁగనే ధృతరాష్ట్రుని యగ్నిహోత్రగృహమున నక్కలఱచె. దానియెదుట రాసభంబు లోండ్రవెట్టె. పక్షులు భయంకరముగా నఱచెను. ఆయుపశకునంబులను బరికించి భీష్మద్రోణకృపవిదురులు గాంధారియు బిగ్గఱగా స్వస్తివాక్యముల వక్కాణించిరి. పదంపడి గాంధారియు, విదురుఁడును నప్పుడు పుడమిఁ బుట్టిన యతిఘోరములగు నుత్పాతంబులను జీఁకుఱేనికి నివేదించిరి. అంత నాదొడ్డరా జదరిపడి యోరీ సుయోధనా! దుర్మార్గుఁడా! అక్లల చేటుఁ దెచ్చుకొంటివి. కులము నున్మూలించుటకు గుద్దలి వైతివి. అధర్మంబున యాజ్ఞసేనిని సభ కేల యీడ్చి తెప్పించితివి? ఆపరమపతివ్రత నాడరాని పలుగాకిపలుకు లేల యాడితివి? ఈయన్యాయంబు కలదే? చిన్ననాఁటనుండి దుష్టవాసనం బెఱిఁగితివి. నీనిమిత్తమునఁ బాండవులు మిక్కిలి దుఃఖితులైరి. నీవు వారివలని క్రోధమును వదలుము. అని కొడుకును వారించి సకలబాంధవులకు మేలు చేయఁ దలంచి ద్రౌపదిని రావించి తిన్ననిమాటలతో నిట్లనియె,

### ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరము లొసంగుట

ఓకళ్యాణీ! నాకోడండ్రలో నెల్ల నీవ యుత్తమురాలవు. నీవే గౌరవింప నర్హురాలవు. మిక్కిలి సంతోషముతో నీకుఁ దగినట్లు ప్రియము సేసెదను. నీ కిష్టమైన వరముల వేఁడుము. అనఁగా నప్పరమసాధ్వి మర్యాదతో మామ కిట్లనియె. భరతకులప్రదీపకా! నాకోరినవరముల నియ్యఁ దలంతువేని సకలధర్మముల నెఱింగినవాఁడును ధర్మాచరణాసక్తమనస్కుండు నైన ధర్మరాజు దాస్యమువలనఁ దొలఁగవలయును. అట్లగునేని ప్రతివింధ్యునకు దాసపుత్త్రుఁ డను నపఖ్యాతి తొలఁగును అనేక రాజుల యుపలాలన కర్హుండైన మహా సమ్రాట్పుత్త్రునకు దాసపుత్త్రుం డను అవ్వ గలుగకుండును. అనఁగా ధృతరాష్ట్రుండు కోడలు కోరిన యావరము నొసంగి, యోశుభాంగీ! నీ కింకను వరము లొసంగెదను గోరు, మనఁగా బాంచాలి భీమార్జుననకులసహదేవులు రథములతోను ధనుస్సులతోను, నమ్ములపొదులతోను నింకను వారి వైన వివిధాయుధములతో దాస్యము వాయవలయు ననియె. అందులకు వైచిత్రవీర్యుండు వల్లె యని మఱియొకవరమును వేఁడు మనెను. దాని కాసాధ్వీతిలక

మిట్లనియె. భరతపుంగవా! వైశ్యున కొక్కటియు, క్షత్త్రియవనితకు
రెండును, రాజునకు మూఁడును, బ్రాహ్మణునకు నూఱును వరము లడుగఁ
దగును. కావున నేను మూఁడవవరమును గోరరాదు. ధర్మమునకుఁ జేటుఁ
దెచ్చు పేరాసఁ బొందరాదు. నాభర్తలు దాస్యమును బాసిరి. పుణ్య
కర్మము లొనర్చి శుభములను బొందెదరు. నాకుఁ గొఱంత దీఱెను,
అని చెప్పఁగా ధృతరాష్ట్రుండు కోడలి మేలిమిగుణములను మెచ్చుచుండె.

అటఁ గర్ణుం, డోహో నరాంగనలలో నిట్టి కార్యములను
జేయువారల మే మెందును వినము. పాండవధార్తరాష్ట్రులు కోపావేశ
మున నుండ, వారి కీవనిత శాంతిఁ గావించె. చింతాసాగరమున నున్న
భర్తల నుద్ధరించె నని మర్మభేదకములగు మాటల నుల్లసంబాడె. దానికి
భీమసేనుండు కినిసి యిట్లనియె. శూరులగు పాండుపుత్త్రులను, మగువ
యుద్ధరించె నని దురాత్ముండగు కర్ణుండు పలుకుచున్నవాఁడు. ఇంతకంటె
నీచపుమాట వేఱొండుగలదే? అపత్యము, కర్మము, విద్య యను
మూఁడు వెలుఁగులును పురుషుఁ డనఁబడును. ఆపురుషుఁడే ప్రజా
సృష్టికిఁ గారణంబు. ప్రాణహీనమై నిస్సారమై యపరిశుద్ధమైన దేహమును
జ్ఞాతులు పరిత్యజించినను, పై మువ్వెలుఁగులును బురుషున కుపయోగ
పడుచున్నవి. అందుఁ బరులు దారను నంటుటంజేసి మన తేజంబు చెడియె,
పరులంటినభార్యకుఁ బుట్టిన మన సంతతి హీనమే యగును గదా. వానికి
నర్జునుం డిట్లనియె. భీమసేనా! సత్పురుషులు నీచులాడు కుత్సితంపువచన
ములకు మాఱాడరు. వా రెన్నియెగ్గు లొనర్చినను వాని నన్నిటిని నుపే
క్షించి వారేదైన మేలొనర్తురేని దానినే పలుమాఱు కొనియాడు
చుందురు. అని పార్థుఁడోరు లెఱుంగక సన్నినియెలుఁగునఁ జెప్పినను, భీమ
సేనుండు వినక, విజయా! వినుము. ఈశత్త్రువుల నెల్ల నీనాఁడే యీచోటనే
నుఱుమాడకుండను. ఊరక వాదులేల? మృగమధ్యమున నుండు సింగముం
బోలె విజృంభించి వీర నందఱను వధించివచ్చెద. భూమండలము నంతటిని
ధర్మపుత్త్రునిచే నేలించెద. అని శత్త్రుభీకరంబుగాఁ బల్కుచుండిన భీమసే
నుని నర్జునుం డూపడిల్ల ననునయించుచుండె. అంతకును వాయుపుత్త్రుండు
క్రోధం బుపసంహరింపక యారాతులకుఁ గడు భీకరుండై శౌర్యము
విజృంభింప నేత్రంబులనుండి యరుణకిరణంబులు ప్రసరింప, బొమలు ముడి
వడ, భయంకరకరాళవదనుండై, ప్రళయకాలంపుసమవర్తియుం బోలె

దుర్నిరీక్ష్యుండై, రోమకూపంబుల నగ్నికణంబు లురలుచుండ, వానియుత్పత్తి
భయంకరాకారమును ధర్మజుండు చూచి చేయెత్తి యదల్చి, భీమ
సేనా! ఇది కోపంబునకు సమయము కాదు. ఓరకుండుము. శాంతిం
పుము. అని యనేకవిధముల శాంతివచనములఁ జెప్పుచుఁ గోపము నుప
సంహారింపఁ జేసి ధృతరాష్ట్రుని సమీపించి నరేంద్రా! మాకిఁకేమియాజ్ఞ?
నీయానతిమెయి వర్తించువారము. అనఁగా నాకురువృద్ధుఁడు పాండవ
శ్రేష్ఠున కిట్లనియె. "అరిషడ్వర్గములను జయించినవాఁడా! నీసర్వస్వముం
గొని, నీతమ్ములను దోడ్కొని, యింద్రప్రస్థమున కరిగి సుఖ
మున రాజ్యమును బాలించుచుండుము. వృద్ధసేవ సేసి సకలధర్మముల
నెఱింగిన నీకు నేను బుద్ధులు గఱప నేల? నీకుఁ దెలియని వేఱుసంగతు
లెవ్వియును లేవు. నీసద్బుద్ధి, నీసమానమునను నివియే నీకురక్షకములు. అవి
నీయందు సుస్థిరములై యున్నవి. కత్తులు వృక్షమును దెగనఱుకునట్లు,
కష్టములు దేహియొక్క శరీరమును నొంచు. ఓఱడిల్లుము. ఉత్తమపురు
షులు పగవారిదోషము లుగ్గడింపరు. వారిసుగుణములనే వర్ణింతురు.
మూర్ఖులు బుద్ధి లేక భీకరవచనములాడియుఁ బ్రతి చేయలేరు. మధ్య
ములు వాదులాడుసమయమున మాటకు మాటఁ జెప్పుచుందురు. అధ
ములు కలఁతనుబుట్టించి నీచంపుఁబలుకులాడుదురు. ఈఘోరసమయమున
నర్థమర్యాదలకు వైపరీత్యంబు గలుగకుండ మెలఁకువతో వర్తించితివి.
అందఱకుం బ్రియుండవై సన్మార్గమునఁ బ్రవర్తించితివి. పుత్త్రుల బలాబల
ములను నేర్పును దెలియఁగోరి నే నీసుహృద్ద్యూతమున కియ్యకొంటిని.
తెలివిలేక యుపేక్షతో నుంటిని. వారింపనైతిని. అంధుండనగు ముదుసలి
వాఁడను, నన్నును మీతల్లి గాంధారినిజూచి యీవైరమును మనంబునఁ
బాటింపక నాసుతులయొగ్గులెల్ల మఱచునది. ధర్మనిత్యుండవగు నీవు నింద్ర
ప్రస్థపురమునకు రాజుగా సర్వశాస్త్రవేత్తయగు విదురుండు మంత్రిగా,
ధీవిశాలుండగు నర్జునుండు, నవక్రపరాక్రముండైన భీమసేనుండును,సంతత
గురుసేవాపరాయణు లగు కవలును నీకు బాసటగా రాజ్య మేలుము.
ఈదినము మొదలు నీతమ్ముల కందఱకు నీతో సఖ్య మొనఁగూడునుగాక.
నీవు ధర్మనిత్యుండవై యుందువు గాక. నీకు మేలయ్యెడు" మని దీవించి
సెల వొసంగుటయు యుధిష్ఠిరుండనుజసమేతుండై పాంచాలరాజపుత్త్రి
వెంట రాఁగా బంగారుతేరెక్కి యింద్రప్రస్థమునకుఁ బ్రయాణ

మయ్యెను. అని చెప్పఁగా విని జనమేజయుండు వైశంపాయనా! అవ్విధంబునఁ బాండవులు ధృతరాష్ట్రుని వీడ్కొని పయనమైనపిదప సుయోధనాదు లేమి చేసిరి? వారి యవ్వలివర్తనంబును నుడువు మని యడుగఁగా నానరేంద్రున కామునీంద్రుం డిట్లనెను.

అట్లు పాండవులు ధృతరాష్ట్రుచే సెలవును బొంది యింద్రప్రస్థపురంబునకుఁబోయి శాంతముగాఁ దమ రాజ్యపరిపాలనంబు గావించుచుండిరి. ఇట హస్తినాపురమునం దొక్కనాఁడు దుశ్శాసనుండు సుయోధనుని సమీపించి వానితో నిట్లనియె. మన మెట్లో కష్టపడి సాధించినదంతయు నీముదుకండు చెఱుచుచున్నవాఁడు. జూదమాడి మనము పాండవుల సంపద నంతయుఁ గొంటిమి. అత్యంతశ్రమంబున వారిధన మెల్లను శకుని మనకుఁగా జూదమాడి గెలిచి యిచ్చెను. దాని నంతను మనతండ్రి మఱలఁ బాండవుల కిచ్చెను. అని చెప్పఁగా దుర్యోధనుండు కర్ణశకునులతో నాలోచించి తండ్రిపాలికిం జని యిట్లనియె. భూపాలా! యెన్ని యుపాయములనుబన్నియైనను శత్రునాశనంబు గావించుట ధర్మ మని మున్ను సురాచార్యుండు బృహస్పతి సురపతికి బోధించియుండె. దానిని నీకు నేను బోధింపవలయునే? సమయము చిక్కెనేని మనకు శత్రువులగు పాండవులు హాని చేయకమానరు. జూదమాడి సంపాదించిన ధనముచే మనము మనహితు లగు రాజుల నెల్లఁ దనిపి వారిసాహాయ్యంబున పాండుపుత్రులతో సమరము చేసితిమేని, తప్పక మనకు విజయము గలుగఁగలదు. శత్రువులతో సమరకేళి యొనర్చి వారిని రూపుమాపి లబ్ధవిజయులమైతి మేని మనకు భూలోకమునఁ గొఱంత యేల గల్గును? ఇప్పుడు మనము వారిని క్రోధపూర్ణమానసులం గావించితిమి. నేచ్ఛగా వారిధనమును భూమిభాగమును నొసంగి వారిని వదలితిమి. తుద కే మరియ్యె? ఆశీవిషములను రోషపూరితములం జేసి యట్టివానిని శరీరము నందుఁ బలుతావులఁ జుట్టించుకొంటిమి. మే మానాఁడు సభలో వారిని బఱచినపాట్లు, ద్రౌపది కొనర్చినమానభంగము వా రొకనాఁడు మఱచుదురే? వారు తప్పక సమరసన్నద్ధులై సేనలతో హస్తిపురంబుపై విడియుదురు. అక్షయతూణీరములను గాండివమును ధరించి యర్జునుండు, లయసమయదండధరుండువోలెఁ గేల శత్రుమర్దనంబైన గదను దాల్చి భీమసేనుండును, గవచఖడ్గములం దాల్చి కవలును రథారూఢులై

సమరోన్ముఖులై చెలరేఁగి యుద్ధముఁ జేయఁదొడంగిరేని వారితో దేవేంద్రుండు నైత మెదుర నిలిచి పోరాడి గెలువ లేఁడు. కావున ధర్మరాజును మఱల రావించి యాతనిచే నింకొకసారి జూదమాడింపవలయును. ఆజూదమున నెవ రోడుదురో! ముందటిజూదమునందువలెఁ గాక దీనియందు వారు నారచీరలం గట్టి జడలు దాల్చి రాజ్యమును వదలి యరణ్యములలోఁ గందమూలములం దినుచు బ్రహ్మచర్యవ్రతమును సలుపుచు విజనస్థలమునఁ బండ్రెండేండ్లు వాసము సలిపి, పదుమూఁడవయేఁడు జనపదంబునఁ నజ్ఞాతవాసమును జేయవలయును. అజ్ఞాతవాసమున వారెవరిచేతనైనను నెఱుంగఁబడిరేని మఱియుఁ బండ్రెండేం డ్లరణ్యవాసమును నొక్కయే డజ్ఞాతవాసంబును జేయవలయును.

ఈయాటయందు నిట్టినియమం బేర్పఱచుకొని జూదం బాడుదము. జూదముననున్న మోసమంతయు మామశకుని యెఱింగినవాఁడు. కావున నెవ్విధముననైన ధర్మరాజును నోడించి వారిని వనవాసమునకుఁ బంపును. ఇవ్విధముననఁ గాని వారి నోర్చు వేఱొకయుపాయంబు గానరాదు. వారు వనవాసమున కేఁగియున్నప్పుడు మనము రాష్ట్రమును బలపఱచుకొని రాణువ నంతయు యుద్ధసన్నద్ధము గావించికొని దేశములోని రాజులనందఱ బహుమానములచే మనయధీనులనుగాఁ జేసి వారిని యుద్ధమునకుఁ జీఱి పోరున నిహతులఁ జేయవచ్చును. ఇందులకు నీసమ్మతిని బడయవచ్చితి. అనుజ్ఞ యిమ్ము. అనఁగా ధృతరాష్ట్రుండు కొడుకుమాటలకు సమ్మతించె. కాని భీష్మద్రోణవిదురకృపాశ్వత్థామసోమదత్తబాహ్లికభూరిశ్రవోయుయుత్సువికర్ణులు దీనినిఁ గూడ దనిరి. పాండవులను మఱల నలిగించిన వంశనాశన మగు నని భీతిల్లి గాంధారి విన్నఁబోయి ధృతరాష్ట్రు నొద్ద కేతెంచి యిట్లనియె. నాథా! ఈపాపాత్ముండైన దుర్యోధనుని దురుద్యోగంబున కియ్యకొని తనంతటఁ గర్కటి గర్భమునం బోలె నాత్మవంశహానిఁ దెచ్చుకొనకుము. ఈపాపాత్ముండు పుట్టినప్పుడు రాసభము వోలె నఱచె. ఎన్నియో దుర్నిమిత్తంబులం గంటిమి. వీఁ డెల్లప్పుడును బాండవులపై నీసుతో వారి కెన్నియే నిక్కట్టులం గావించుచున్నవాఁడు. ఇక్కులపాంసను నొక్కనిని జక్కాడఁ బంచి కులము నెల్ల నిర్దోషము గావించికొని సుఖ ముండుము. దీనిని మున్నె నీకు విదురుండు బోధించియుండె. నిజాపరాధంబున నాపల్నె

ముద్రమున మునుఁగకుము. బుద్ధిశూన్యు లగు కుమారులమత మవలం బింపకుము. ఉపేక్షించి సుయోధనుమతంబున కియ్యకొంటి వేని పుత్త్రుల నెల్లం బోఁగొట్టుకొని కులనాశనమునకు నీవ హేతుభూతుండ వయ్యె దవు. ఎట్టిపిచ్చివాఁ డైనను గట్టిన కట్టను మఱలఁ ద్రెంపునే? కడుం గనలియు నీకతంబున శాంతాత్ము లయిన పాండవుల మఱలఁ గనలింతువే? నీ వానాఁటి సభావృత్తాంతం బంతయు మఱచి యుందు వేని, నేను నీకు దానినంతటిని స్మరణమునఁ దెచ్చెద. ప్రజ్ఞాహీనునకు శాస్త్రములు శ్రేయస్సు నొసఁగఁజాలవు. బాలురమత మనుష్ఠింపరాదు. నీవ కారణం బుగా నెల్లవారును సుఖులై యుందురు గాక. కావున లెస్సగా నాలో చింపుము. నామాటల నంగీకరింపుము. ఈవంశనాశకుని వదలుము. కులము నిర్ధుష్టము గావింపుము. కానున్నఁ గుల మంతయు నవశ్యంబు క్షయించు. ఇది నిక్కువము. శాంతి నవలంబింపుము. ధర్మము నాచ రింపుము. యోగ్యు లుపదేశించుహితమును గ్రహింపుము. ఏమఱకుము. అన్యాయమున నార్జించిన సంపద యెప్పటికి సంతసంబు నొసఁగఁజాల దను వంశనాశమునకు మూలం బగు. అని చెప్పఁగా నా గ్రుడ్డిరాజు ప్రజ్ఞాంధుండై కులక్షయంబునకైన సమ్మతింతు. పునర్ద్యూతంబు నుడి గింప నేర ననెను. కొడుకులు తమ యిష్టానుసారము వర్తిల్లెదరు. అని గాంధారి యుపదేశమునకుఁ బెడమొగం బిడి వెంటనే ప్రాతి కామినిఁ బిలిచి వానితో నీ విప్పుడ ప్రయాణమై యింద్రప్రస్థమున కేగి యా యుధిష్ఠిరునితో నామాటలుగా ని ట్లనుము. ఓ యుధి ష్ఠిరా! మీతండ్రి ధృతరాష్ట్రుండు మఱలఁ దనపుత్త్రులతో నిన్ను సుహృ ద్ద్యూతంబు బొడ రమ్మనెను. అని చెప్పుమని చెప్పిపంపెను. వాఁడును వేగ మునఁ బోయి ధర్మరాజుం జూచి ధృతరాష్ట్రునియభిమతంబుఁ దెలు పఁగా వాని మాటలను యుధిష్ఠిరుండు విని జూదమున హాని తప్పక సంభవించు ననియుఁ దండ్రిమాట దాటఁగూడదని దనియు నాలోచించి యొట్టకేలకు విధిచోదితుండై యొప్పుకొని యిట్లనియె. దేహి కాలాను సారముగ శుభాశుభకర్మఫలముల ననుభవింపక తప్పదు. ఏది సమకూ డినను సమకూడుఁగాక! బంగారులేడి యుండనేర దని యెఱింగిన శ్రీరా ముండు దాని కాసపడి దానివెంటఁబోక నిలిచెనే? విపత్తులు రానున్న తఱి బుద్ధిమాంద్యంబును బొడఁగట్టు. "బుద్ధిః కర్మానుసారిణీ" యన్న

నాసుడి వచ్చుగునే? కర్తవ్యమును గొంతవడి యాలోచించి తమ్ములు మొదలగు కొంత పరిజనము తనవెంటరాఁగా హాస్తిపురము సొచ్చి రాజగృహమును బ్రవేశించి తన యభిప్రాయమును మిత్రులకుఁ దెలుపుచు సభాసీనుం డయ్యెను.

అంత దుర్యోధనప్రేరితుఁడై శకుని ధర్మరాజుతో నిట్లనియె. ధర్మపుత్త్రా! ఈ గ్రుడ్డిరాజు ద్యూతవిజితధనము నెల్ల మరల మీకొసంగెను. ఇప్పటియాటకుఁ బణ మాధనమున నిసుమంత యేని వలదు. దాని నిప్పు డొడ్డరాదు. ఇప్పటిపణమును దెలియఁజెప్పెద. వినుము. "ఈమాఱు జూదమాడి యోడినవారు నారచీరలుగట్టి కందమూలఫలము లాహారముగాఁ దినుచు బ్రహ్మచర్యవ్రతాదినిష్ఠులై పండ్రెండేండ్లు నిర్జనారణ్యమున వాసమును జనపదంబునఁ బదుమూఁడవయేఁ డజ్ఞాతవాసమును, నాపదుమూఁడవయేట నజ్ఞాతవాసమున నుండువారి నెవరైన గుర్తింతురేని క్రమ్మఱ నిట్లే ద్వాదశవర్షవనవాసమును మఱల నొక్కవత్సర మజ్ఞాతవాసమును జేయవలయును. ఈనియమమును బణముగాఁ బెట్టి జూద మాడవలయును. ఓడినవా రానియమమునకు లోఁబడవలయును. ఈమాఱు జూదములో నిదియ పందెము. దీని నొడ్డి నీవోడితివేని ద్రౌపదితో వనవాసమును నజ్ఞాతవాసము నిట్లు చలుప వలయును. మే మోడుదు మేని మేము నీనియమమునకు బద్ధులము. ఆ నియతకాలము సమాప్తంబు కాఁగానే వారివారిరాజ్యములను వారు వారు పడయుదురు" అని తెలిపెను. ఈనియమములు సభాసదులును, బంధువులును విని భీతిల్లఁగా ధృతరాష్ట్రుఁడు ప్రజ్ఞాహీనుండయి కొడుకు లాడునట్లెల్ల వర్తించుచున్నవాఁడు దీనఁ దప్పక హాని కలుగు. దీని నేల కురువృద్ధులు నివారింపరు? అని పేరెలుంగునఁ గొందఱు పల్కుచుండఁగా వానినెల్ల వినుచు సకలధర్మముల నెఱింగినవాఁడయ్యును ధర్మపుత్త్రుండు కురుకులవినాశమునకుఁ గాల మాసన్నమయ్యెనని తలపోయుచు సుబలరాజాత్మజున కభిముఖుండై రాజధర్మమును బరిపాలింపఁ గంకణము కట్టికొని భూమి నేలుచుండు నాబోఁటిరాజు బలవంతముగ ద్యూతమునకుఁ గతవాహ్వానితుఁడై వచ్చి యాడకుండునే యని వచించెను.

## ధర్మరాజు శకునితో రెండవసారి జూదమాడుట

అంత శకుని యీయాట నోడినవారు తమ ధనకనకవస్తువాహన రాజ్యములను గెలిచినవారియధీనములుగఁ జేయవలయును. పందెపు పణము ననుభవింపవలయునని మున్నే తెలిపియుంటిని కదా, ఇఁక నాడుదమని సారెల వైచియాడి తన జూదంపునేర్పున ధర్మరాజు నాసారి సైత మోడించె. యుధిష్ఠిరుం డివ్విధమున నోడి తమ్ములతోను భార్య యగు ద్రౌపదితోను నారచీరలు గట్టి జడలు దాల్చి కృష్ణాజినములను ధరించి వనవాసంబునకుఁ దఱలఁగ వారింజూచి దుశ్శాసనుం డిట్లనియె. ఈనాఁడు కదా పాండుపుత్త్రులు కష్టములపాలై యాపదల ననుభవింపఁగంటిమి. ధన్యుల మైతిమి. దుర్యోధనునిమాట కీరాజ్యమున నడ్డులేదుగదా! మమ్ము నిన్నాళ్లు చిన్నచూపులఁ జూచుచుండిన దేవత లీకాలమునకు దయతోఁ జూడఁగంటిమి. మేము వయస్సునఁ జిన్నవారమైనను సద్గుణములఁ బెద్దల మైతిమి. పాండవులు రాజ్యమును వదలి సుఖముల విడనాడి బహుకాల చింత ననుభవింప దినములు వచ్చినవి. రాజ్యైశ్వర్యముచేతను ధనగర్వమునను మమ్ముంజూచి మున్ను పరిహాసవచనము లాడుచుండినవా రీకాలమునకుఁ బరిభవమును బొందిరి. ఇఁక నచిరకాలముననే వారు ధరించియుండు నమూల్యదుకూలములను దొలఁగి చిత్రవిచిత్రంపు విన్నాణము గలవస్త్రములను వీడి మృగచర్మధారులై నారచీరలం గట్టి జడలు దాల్చి యాటవికులంబోలెఁ బసులచందమున నిర్జనారణ్యమున వసింపవలసినవారైరి. శకునియభిమతం బొడఁగూడె. భూలోకమున ధనధాన్యరాజ్యసంపదలఁ దూఁగువారిలో మాకు సమానులెవ్వరును లేరు. మాగర్భశత్రువులను బరిభవించి వారిరాజ్యమును నాచికొని ధన్యుల మైతిమి. పాండవు లీకాలమునకు నిష్ప్రయోజనులై తమ స్వస్వరూపము నెఱింగిరి! విద్యావంతుఁడును శూరుండును నైన ద్రుపదరాజు తనకూఁతుఁ బాండవుల కిచ్చి తా నపారసుకృతుఁ డయ్యెనని తలఁచియుండె. యాజ్ఞసేనిపతులు పుంస్త్వమును వీడి నపుంసకులైరని యార్చి ద్రౌపదిం జూచి పాంచాలీ, దరిద్రులై మృగచర్మములందాల్చి హీనంపుబ్రదుకును బ్రదుకు కొఱకు వనములఁ జరింప నుద్యుక్తులై పోవుచున్న యీపౌరుషహీనులం బొంది యే మనుభవించుదానవు? ఈనీకంటియెదుట సకలైశ్వర్యములు గలిగి పౌరుషవంతులై, శూరులై, యుత్సాహపరులై,

సకల దేశాధీశులై, యసంఖ్యాకదాసీదాసజనపరివృతులై యున్న కౌరవరాజకుమారులలో నొక్కనిని నిప్పటికైన వరించి వానితో నిష్టోపభోగములం దేలియాడుము. కానల కీపౌరుషహీనులును దరిద్రులును, దుర్బలులును, నిరుత్సాహులును, బశువులును నగువారి వెంబడి పోయి నీ వేసుఖమును బొందెదవు ? అని పలుతెఱంగులఁ గఠినోక్తు లాడె. ఆకఠినంపుమాటల నన్నిటిని విని భీమసేనుం డలిగి హిమవత్పర్వత గుహాలలో నుండు సింహము నక్క నదలిచ్చినట్లు దుశ్శాసను నదల్చి యోరీ పాపీ! యీయడలుపాట్లు నీకెట్లు కలిగె? శకుని మోసంపుజూద మునఁగదా నీ కీపోతర మిప్పుడు గలిగె. దానం జేసికదా యీ యాత్మ స్తుతి ? నీ విపుడు వాఁడిమాటలచే మామర్మభేదనముం జేయుచున్నావు. ఘోరసమరమున వాఁడిబాణములచే నీసర్వావయవముల విఱిచివేసి నిన్ను విగతాసువుం జేసి యప్పుడు నలువురు విన ని న్నేమందునో ? నీ వెఱుఁగనేరవు గాని యీసభ నలంకరించియుండువారిలో నొక్కరైనను భీముఁడు సత్యప్రతిజ్ఞుఁ డనకుందురే? రాగద్వేషయుతులై ని న్ననుసరించి యుండువారి నందఱ నంతకుసదనంబున కతిథులఁ జేసెద. అనఁగా దుశ్శాసనుండు పాండవుల నప్పుడు పశువు లని యార్చుచు నారాజలోక మధ్యమున నావేశపరుండై నాట్యమాడెను. ఆవర్తనంబుంజూచి, భీమసేనుం డిట్లనియె. కురునందనాపశదా! నీ విట్లు ప్రల్లదంబు లాడుటకే తగుదువు. మోసమున మాయైశ్వర్యమునంతయు నపహరించికొని మహాప్రాజ్ఞునిం బోలెఁ బలుకుచున్నావు. బుద్ధిమంతుఁ డెవఁడైన ని ట్లాత్మస్తుతిఁ జేసి కొనునే? వేయేల? నీ వారెల్లం జూచుచుండ ఘోరమైన రణరంగంబున సింగము లేడిఁబోలె నిన్నుఁ బొడివి ట్రొమ్ము వ్రచ్చి నీనెత్తురు ద్రావి భీమసేనుండు నీయెముకలు తుత్తుమురు సేయఁ డేని వాఁడు పితృపితామహులసద్గతికిం దప్పుం గాక. ఇంతే కాక నీకుఁ దోడై సమరరంగమున కేతెంచు ధానుష్కు లందఱుఁ జూచుచుండ నీ ధార్తరాష్ట్రులలో నొక్కని నైన నూపిరితో నుంచక నే నొకరుండనే వధించి యానందించువాఁడ. ఇది నాసత్యప్రతిజ్ఞయని తెలియుము ఇట్లు భీముండు ప్రతిజ్ఞఁ జేయుచు సింహము వోలె నిటటు తిరుగులాడుచుండ సుయోధనుం డచ్చోటికేఁగి భీమసేనునెదుట వానిని వెక్కిరించుచు నిటటు దిరిగె. అంత భీమ సేనుం డాదుర్యోధనుని నిర్దేశించి మూర్ఖుఁడా! దీన నే మయ్యె ? రణరం

గమున నిన్నుఁ గూలఁద్రోసి యీనాఁ డిందులకు మాఱాడెద ననెను. వృకోదరుండును నాగాయుతబలుండయ్యు, మానవంతుఁడయ్యు నప్పటి పరిభవమును సైఁచి క్రోధమును దిగఁద్రావి ద్యూతరంగమును వెడలివచ్చుచుఁ గొంతవడి కందళం గలయంగనుంగొని, 'యీపాపాత్ముండైన సుయోధనుండు ఘోరరణమునందు నాచేఁ జచ్చువాఁడు. ఈపాపి కండయై మమ్మెల్లప్పుడు నిష్కారణంబుగ నవమానవచనములచే నొంచుచున్న వీని చెలికాఁ డగుకర్ణుని సవ్యసాచి వధించువాఁడు. టక్కరిజూదరి యగు శకునిని సహదేవుండు గూల్చు. ఇం కొకటి నుడివెద. మాకును ధార్తరాష్ట్రులకు జరుగఁబోవు ఘోరసంగ్రామము దేవవిహితము. ఈకులపాంసనుండైన దుర్యోధనునితొడలు గదచే విఱుగఁగొట్టి పాదమున వానిశిరస్సుఁ దన్నెద. దుర్యోధనదుశ్శాసనకర్ణశకును లను నీదుష్టచతుష్టయము భూతముల కాహుతులుగా సమర్పింపఁబడుట నిక్కువంబు.' అని చెప్పుచున్న వృకోదరుమాటల కర్జునుం డడ్డపడి యిప్పటి వృథామాటలఁ బ్రయోజనం బేమి? ఇఁకఁ బదునాల్గవయేట సిద్ధముగా నుండుదానిని నిప్పటినుండి బహిరంగపఱచుచుండు టేల? మదమాత్సర్యగుణస్వరూపుండును నెల్లప్పు డాత్మస్తుతిపరాయణుండు నగు నీసూతపుత్త్రుం గర్ణుని భీమసేనునకు మనఃప్రియంబుగా నర్జునుండు హతుం గావించు. మఱియు మదంబున స న్నెదురాడి నాతోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వువారి నెల్లర నంతకపురి కతిథులంగాఁ జేయుట నిక్కువంబు. మన రాజ్యమును రాఁగల పదునాల్గవయేట నిద్దురాత్ముండు మన కొసఁగఁడేని యే నిప్పు డాడినమాటల నన్నిటిని గార్యరూపంబునఁ జూపెంతు. ఇది యంతయు నప్పుడు యథార్థ మగును. హిమవంతంబు తనపొడ వణఁగించుకొన్నను, భానుండు తనతేజంబును దగ్గించుకొన్నను, జంద్రుఁడు సహజశీతలతఁ దొఱఁగినను, బంచభూతములు తమ సహజగుణములు వీడినను నాప్రతిజ్ఞ తప్పనేర దనఁగా సహదేవుండు తనభుజములను దట్టికొని క్రోధారుణితలోచనుఁడై తోఁకత్రొక్కినపామువోలె బుసకొట్టుచు మోసగాఁడైన శకుని కిట్లనియె. ఓరీ శకునీ! నీచుఁడా! గాంధారకులమును సుబలరాజుకడుపును జెఱుపఁబుట్టిన పాపీ, మాయజూదమున సారెలు వైచినట్లు కాదుసుమా రణరంగమున వాడితూపుల నోర్చుట. నీయిచ్చిన పేరిడుము దెచ్చిపెట్టికొంటి. క్షాత్త్రము గలవాఁడ వైతివేని ఘోర నరి నెదిరి

పోరుటకు సంసిద్ధుండ వగుము. భీమసేనువచనములను యథార్థపఱచుటకు నే నుద్యుక్తుండ నగుదును. రణమున నిన్ను నీవారలనుం గూల్తు. ఈ లోపలనే కార్యములనెల్ల సమకూర్చికొని యుండుమనెను. అప్పుడు నకులుండు రౌద్రముం దాల్చి యిట్లనియె. ఈసభలో పాంచాలిని బరిభవ మొనర్చి పలుగాకిమాటలతో నొంచిన దుష్టుల నందఱను జంపి భూమి నావరించియుండెడు నీధార్తరాష్ట్రకంటకముల నేఁటి రూపుమాయించెదము. ఇవి యన్నియు నిక్కువంబులు. ప్రల్లదంబులు గానేరవు. ఇవ్విధంబునఁ బ్రతిజ్ఞలఁ జేసి యాపాండవులు వనవాసోన్ముఖులై ధృతరాష్ట్రుని, భీష్ముని, సోమదత్తుని, బాహ్లికుని, కృపుని, ద్రోణుని, నశ్వత్థామను, విదురుని, సంజయుని, యుయుత్సుని నింకను సభలో నుండు వారిని వీడ్కొని పునర్దర్శన మగుంగాక యనిరి. అంత వారందఱు పాండవులకు మనస్సున శ్వశ్శ్రేయసములఁ దలంచిరి. కాని దుర్యోధనాది దుష్టచతుష్టయమునకు వెఱచి యేమియుం జెప్ప నోడిరి. వారిలో విదురుండు మాత్రము ధర్మపుత్రున కిట్లనియె. అనయమున గెలువఁ బడిన వాఁడు తనయోటమికిఁ గుందఁడు. నీ వెఱుంగని ధర్మము లున్నవా? అరిమర్దనుం డగు భీమసేనుండు, సమరవిజయి యగు విజయుండు, నర్థములను సమకూర్చునకులుండు, శాస్త్రవేత్తయు నిష్ఠాపరుండునైన సహదేవుండు, సర్వధర్మముల నెఱింగి పెద్దలమాట జవదాఁటని పాంచాలి, బ్రహ్మణ్యుండైన ధౌమ్యుండును సర్వకాలసర్వావస్థలయందు నీకుఁ దోడునీడలై వర్తించుచుండ నీకుఁ గొఱంత గలుగునే? పరస్పరమైత్రి గలిగి యొకరి నొకరు పరమప్రీతితో నాదరించుచుండు మిమ్మును భేదించుట కెవ్వ రోపుదురు? శునాశీరునివంటి శత్రువైనను మిమ్ము గెలువ లేఁడు. హిమవంతంబున మేరుసావర్ణిబోధములును, వారణావతంబునఁ గృష్ణద్వైపాయనునిహితవచనంబులును, భృగుతుంగమునందు రామునినీతి వచనంబులును, దృషద్వతీనదీతీరంబున శంభువాక్యంబులును నంజనపర్వతంబున నసితువాక్కులును, గల్మాషీతీరంబున భృగునిసద్బోధములు విన్న వాఁడవు కావే. నీ కెప్పుడు నారదమహర్షి హితోపదేశమును జేయుచుండు. మహనీయుండగు ధౌమ్యుండు నీకుఁ బురోహితుండు. సమర సమయమున సంయమివర్యులసద్బోధములను నాలకించుకొని సజ్జనుండవై మెలంగుము. పురూరవుని బుద్ధిపాటవము, సకలరాజులశక్తి, బుద్ధి

రుష్యులధర్మపరిజ్ఞానము, వృద్ధశ్రవుని విజయము, యముని కోపధారణము, కుబేరుని సంపద, వరుణుని సంయమము, సోముని యాత్మప్రదానము, నుదకముల పరోపకారము, పృథ్వియొక్క క్షమ, సూర్యమండలము యొక్క సమగ్రతేజము, వాయువుబలము, సకలభూతముల యాత్మసంపద యనునివన్నియు నిన్నెల్లప్పుడు పదుపక యాశ్రయించి యుండుఁగాక! ఆపద్ధర్మార్థకృచ్ఛ్రములయందును సర్వకార్యములయందును నుచితమును బరిశీలించి యనుష్ఠింపుము. సుకుమారియు, ముదుసలియునై సుఖోచితయైన మాతల్లి కుంతీదేవి యరణ్యావాసమున కర్హురాలు కాదు. నాయింట నామె నుంచుకొని సత్కరించెద. ఇందుల కిష్టపడుము. పోయి రమ్ము; పునర్దర్శనమయ్యెడును. శుభములు నిన్నుఁజెందును. అనఁగా విదురునకు ధర్మజుం డిట్లనియె. మహానీయా, నీవు నాకుఁ బితృసమానుండవు. నీవు చెప్పినదంతయు నాచరింతును. నీవు నాకు గురుండవు. నీవచనములు నా కనుల్లంఘనీయములు. అని చెప్పి యరణ్యంబునకుఁ దరలెను. ద్రౌపదియు నంతఃపురంబున నున్న కుంతి గాంధారి మున్నగు పుణ్యస్త్రీలకు మ్రొక్కి సవయస్కులం గౌఁగిలించుకొని, వనవాసమున కేఁగెద నని దుఃఖములో వచింపఁ గన్నీరుఁ గార్చుచుఁ గుంతి కోడలి కిట్లనియె. పాంచాలి! నీవు సర్వము నెఱింగినదానవు. పతులవెంబడి సతు లుండవలయు నను స్త్రీధర్మము నెఱుంగనిదానవు గావు. నీకు శీలాచారములు వెన్నతోఁ బెట్టినయవి. అట్టి నీ విందుల కిప్పుడు శోకింపఁ జనదు. నీవు పుట్టుటచే ద్రుపదువంశంబును, మెట్టుటచేతఁ బాండువంశంబును బావనములయ్యె. నీవురూక్షవీక్షణంబులఁ జూడ కునికి కౌరవులు భస్మీభూతులు గాకైరి. నీవు ధర్మముల నెల్ల నెఱింగినదానవు. పతులయెడఁ బ్రవర్తనమును నీకు బోధింపవలదు. ఐన నొక్కటి చెప్పక తప్పదు. అరణ్యమునందు నీపతు లేవురిలో నలువు రొకయెత్తు సహదేవుఁ డొకయెత్తు. వాఁడు చిన్ననాఁటంగోలె సుకుమారుఁడు. కష్టము లోర్వలేఁడు. వాని వాంఛితములను గనుసన్న నెఱింగి యతంద్రితవై చేయుచుండుము. మీరలు ధర్మసాహాయ్యమున శుభములను బొందెదరు. పోయిరమ్మనఁగా నప్పాంచాలి కన్నీరు చోటచోట నేలపైఁ బడఁగా, కురులు ముడివీడి విరియ నాక్రందనధ్వని సలుపుచుఁ బోవుచుండె. దానివెంటఁ గుంతీదేవి పోయి మృగచర్మధరులు, జటావల్కలధారులు, సంయమివేషులు

నగుచు లజ్జావనతవదనులై యరణ్యప్రయాణమునకు యత్నించుచున్న పుత్త్రులం జూచి కన్నీరు వఱదలై పాఱ బలవించుచు వారల కిట్లనియె. పుత్త్రులారా! మీరు పెద్ద లనుష్ఠించిన ధర్మముల ననుష్ఠించుచున్నారు, సాధువుల నర్చించుచున్నారు. దేవతలను బూజించుచున్నారు. అట్టి మీకును వనటలఁబొందవలసిన కాలమువచ్చెను. ఇందులకు దైవప్రాతికూల్యమె కారణము. లేక సర్వదౌర్భాగ్యములకు మూల మగునాకుఁ బుత్త్రులయి జనించుటే దీనికిఁ గారణమగునా? శౌర్యమును, బాటవమును, బలమును, నుత్సాహమును నభివృద్ధి గావించువాని నెల్ల విసర్జించి యిం ద్రియములఁ గాఱియపెట్టుచు నెట్లడవులఁ జరింతురో? మీ కిట్టిఘోరారణ్యావాసము కలుగు నని యెఱింగినదాన నగుదు నేని మీతండ్రి స్వర్గస్థుం డైనప్పటి నుండి యీ పట్టణమునకు మిమ్ముఁ దోడ్కొని రాక యచ్చట శతశృంగముననే యుండుదు. ఇట్టి మహాపదలపాలై కుందుచుండు మీయిప్పటిస్థితిఁ గన్నులారఁ జూడక మీతండ్రిముందే దివంబున కరిగి ధన్యుం డయ్యె. ఆమహానీయునివెంట శరీరమును వీడిన మాద్రి జన్మమును గృతార్థ మయ్యె. అయ్యయో! నే నెట్టి చెనఁటి నోముల నోచితినో మీకష్టముల నెల్లఁ జూచునిమిత్తము ప్రాణములం దాల్చియున్నదాన మీరిప్పటికిఁ బడినకష్టములలో నెల్లఁ బాల్గొంటి. ఇప్పుడును మిమ్ము వదలి యొక్కనిమిషమైన మన నోప. నేనును మీవెంట వచ్చెద. ద్రౌపదీ! నన్నొంటిగా వదలిపోకుము. ఈశరీరము నాశము గల దయ్యును, నా బ్రహ్మదేవుఁడు పొరపాటున నాకింత దనుకను జావుఁ దెచ్చిపెట్టఁడు. కావుననే నన్నీ పాడాయుస్సు విడిచిపోలేక యున్నది. వాసుదేవా! కృష్ణా! దేవకీనందనా! ద్వారకావాసా! యదుపుత్త్రా! ఇట్టికష్టముల ననుభవించుచుఁ జింతాసాగరమగ్నులై యుండు వీరిని, నన్ను నిపుడేల యుపేక్షించి రక్షింపకున్నావు? అనాథరక్షకుండ వగు నీవు నిన్ను ధ్యానించువారినిఁ గాపాడుదువు గదా? ఆమాట మాయెడ వృథయయ్యె. ధర్మపరాయణులును మహిమ గలవారును యశోవంతులును విక్రమయుతులును నగు భీష్మద్రోణకృపాశ్వత్థాములు ధర్మమును ప్రతిష్ఠించువా రయ్యును మా కీయాపద సంభవించె. ఓపాండుభూపాలా! మోసంపుజూదమున శత్త్రువులమాయల నెఱుంగలేక యోడి సర్వధనములను గోల్పోయి యరణ్యవాసమున కేగు

చున్న నీపుత్త్రులదుఃఖమును జూచి వారి నుద్ధరింప కేల యుపేక్షించి యున్నా వని దీనముగ నాక్రందించి సహదేవుముఖము జూచి, యో నాపుత్త్రా! సహదేవా! నీవు వనవాసమునకుం బోవలదు. నీవు నాచెంత నున్న నాపుత్త్రు లందఱును నాయొద్ద నుండినట్లు భావింతు. నీయన్నలు నలువురును బ్రతిజ్ఞ మేరకు నియమరక్షణము గావింతురు గాక! నాచెంతన యుండి నన్నుం గాపాడుచుండిన నీకును వారికిం గల్గుఫలంబు గల్గును. అని యిట్లు దురంత చింతాక్రాంతయై విలపించుచున్న తల్లికి మ్రొక్కి పాండవు లరణ్యమునకుం బ్రయాణమైరి. విదురుండు నాదేవిని నుచితంపుంబలుకుల నూరార్చి తనకుటీరమునం జేర్చికొనెను ధృతరాష్ట్రునికోడండ్రును నాఁడా సభలోఁ బాంచాలిని బఱచినపాట్లను, బరిభవమును, బాండుపుత్త్రులయరణ్య వాసమును విని కౌరవుల నిందించుచుఁ జెక్కిళ్లం జేతుల నుంచి చింతించిరి. ధృతరాష్ట్రుండు తనపుత్త్రుల యధర్మంబుఁ దలపోసి రిచ్చపోయి దురంత చింతలం జిక్కి విదురుం బిలిచి పాండవులును బాంచాలియు ధౌమ్యుండును నెట్లు కానలకుం జనిరి వివరింపు మనఁగా నతనికి విదురుం డిట్లనియె.

**విదురుండు ధృతరాష్ట్రునితోఁ బాండవులరణ్యమునకుఁబోయినరీతిం జెప్పుట.**

చూచువా రెల్లగు విస్మయము నొందునట్లు ధర్మరాజు ముఖకమలమును జెఱఁగుతోఁ గప్పికొని యేఁగెను. మిక్కిలి భయంకరుఁడైన భీమసేనుండు బలయుతము లగు తన రెండు భుజములను విశాలములుగాఁ జేసికొని పోయెను. అర్జునుఁ డిసుముఁ జల్లుచుఁ బోయెను. నకులుఁడు తనశరీర మంతయు నేల దుమ్ముం బూసికొని యేఁగెను. సహదేవుఁడు పాంసులిప్తశరీరుండై తఱలెను. రజస్వలయైన యాపాంచాలి తలవెండ్రుకలను విరియఁ బోసికొని భర్తల ననుగమించెను. ధౌమ్యుఁడు దర్భలు చేతఁ బట్టుకొని రౌద్రసామగానము, యామ్యసామగానము సేయుచు ముందుగా నడచెను. అనఁగా ధృతరాష్ట్రుండు వా రేల యిట్లరిగి రని యడుగఁగా నా రాజునకు విదురుం డిట్లనియె. నీపుత్త్రులు గావించిన మోసముచే రాజ్యమును గోలుపోయిన ధర్మరాజు క్రూరమైన తనచూపు సోకిన జనులు భస్మమై పోవుదు రను భయముచేతఁ దనకాపదలు వాటిల్లినను బ్రజలయెడఁ బరమకారుణికుఁడు గాన వారి కెట్టి సంకటములు గలుగకుండ ధర్మపరాయణుండై ముఖమును వస్త్రముతోఁ గప్పుకొనిపోయెను. భీముండు భుజబలపరాక్రమమునం దన

కెవ్వండును పోటిరాఁడు. కావున తనబాహుబలమును జూపఁగల వాఁడ నౌదుననుచు భుజములను మిక్కిలి విశాలములుగఁ జూపి శత్రు భీకరుండై యేఁగెను. అర్జునుండు శత్రువులమనంబున భయము నాఁటున ట్లింతకంటెను దఱచుగ బాణములను బ్రయోగించి తడవుసేయక శత్రుసంహారము గావింతు నని యిసుముఁ జల్లుచు జయశీలుండై చనెను. మఱియు దుఃఖము లనుభవించుటకుఁ దనసుందరరూపంబు తగ దని జనులు దుఃఖింపకుండ ధూళిధూసరితశరీరుండై నకులుఁ డరిగెను. సహదేవుఁడు దీనమైన తనముఖము నితరులు సూడరా దనియుఁ జూచిన వారికిఁ గీడు సంభవించు ననియు ముఖముఁ గప్పికొనియె. తడిసినచీరఁ గట్టుకొని శిరోజములను విరియఁబోసికొని యేపాపులనిమిత్తముగఁ దన కీపాట్ల ననుభవింపవలసివచ్చెనో యాదుర్యోధనాదులయు వారివారలయు భార్యలు పదునాల్గవయేఁట విధవలై యాక్రందనమొనర్తు రని తెల్పుచుఁ బాంచాలరాజపుత్త్రి పతుల ననుగమించె. కాఁగల భారతమహాసంగ్రామ మునఁ జచ్చినవారి కుత్తరక్రియలను జేయింతునని ధౌమ్యుండు దర్భలఁ గేలఁ దాల్చి యామ్యసామంబును రౌద్రసామంబును బఠించుచుఁజనెను. *ఇవ్విధంబునఁ బాండవు లరణ్యమున కేఁగుసమయమునఁ బురజను లయ్యయ్యో! ఈయధర్మం బెచ్చోటు నున్నది? ఈపాపాత్ముఁడైన దుర్యోధ

* పాండవులు పునర్ద్యూతంబున నోడి యరణ్యమునకుఁ బోయిన కాల నిర్ణయ మిప్పు డావశ్యకము వీరు ఇంద్రప్రస్థమున నిరువదిమూఁడేండ్లు రాజ్యము చేసిరి. పిదప వనవాసము పండ్రెండేండ్లును నజ్ఞాతవాస మొక్కయేఁడును జరిపిరి. అజ్ఞాతవాసకాల పూరణమునందు కాలవివాదము రాఁగలదు. కావున నిచ్చట గాల నిష్పత్తి లేనియెడ ఆకాలనిర్ణయమున కవకాశము గలుగదు. కావున నాకాల మిచ్చోట సంగ్రహముగా సూచింపఁబడుచున్నది. ఇప్పటికి ౨౧౯౪ త్రేతాయుగాది గతసంవత్సరములు ౨౧౫౯౯౫౦, నెలలు ౨, దినములు ౧౫, ద్వాపరాంతమునకు వలయు సం॥ ౪౯, నెలలు ౯, దినములు ౧౫, ఇందునకు సౌరమాసములు ౨౫౯౧౯౪౦౭. ఇచ్చట అధికమాసశేషము కనుపఱచుటవలనను, భావికాలగణిత మున కుపయోగము గలదు. కావున నధికమాసశేషము $\frac{౨౭౪౫౧౪౫}{౪౩౨౦౦౦౦}$ లభించిన అధికమాసములు ౭౯౬౬౪౯. మనుపటిమాసములు......౨౫౯౧౪౦౨. ఈరెం డును గూడినయెడ లబ్ధచాంద్రమాసములు...... ౨౬౭౧౬౦౫౧. తిథులు......

నాదు లెంత కొడిగట్టిరి! ధర్మపరాయణులగు పాండుపుత్త్రులను మాయో పాయమునఁ గానలకుఁ దఱిమిరి. వా రరణ్యమునకుఁ బోయినచో, దురాత్ములును నీతిలేనివారును నగు నీధార్తరాష్ట్రులయొద్ద నుండ నోప మనుచు నాక్రోశవార్తల నాడిరి. అప్పు డాకసంబున మబ్బు లేక మెఱ సెను. భూమి గడగడ వడంకెను. పర్వము లేకయే భానుని రాహువు గప్పెను. రాచనగరున కప్రదక్షిణముగఁ గొఱవులు పడెను. దేవాయ తనంబులను, అచ్చుచావళ్లయందును, బురప్రాకారములయందును నాల్గు వీథులుకలియు చదుకంబులయందును, రాచనగళ్లయందును గ్రద్ద లఱచెను. కాకులు కట్టు మనియెను. సృగాలములు మోఱ లెత్తికొని యఱచెను. ఓరాజా! నీచెడుతలంపునఁ గౌరవవినాశంబునకు హేతు వుగా నిన్ని యుత్పాతములు సంభవించె నని వివరించుచుండ నార దుండు దుర్యోధనసభామధ్యమున మునిగణంబుతోఁ బ్రవేశించి యా సుయోధనకృతాపరాధంబును, భీమార్జునబలపౌరుషంబులును, గారణం బుగా నిఁకఁ బదునాల్గవయేఁట మహాసంగరమునఁ గౌరవు లెల్లరు వినాశ మొందుదు రని చెప్పి యప్పుడ యదృశ్యుం డయ్యె. దుర్యోధనదుశ్శా సన కర్ణశకును లరాతులవలన భయమును దొఱంగి సర్వమహీరాజ్య పాలనమునకు ద్రోణుని నియమించునిమిత్తమై యామహానీయుని చెంత కరిగి, మహానీయా! ఈసర్వరాజ్యపరిపాలనమును త్వదధీనము. దీనిని సక్రమంబుగఁ బాలించుటకు నీకంటె నన్యుం డర్హుండు లేఁడు. అని చెప్పఁగా నామహానీయుండు వారి కిట్లనియె. దేవతలవరంబున జనించిన పాండవు లెవ్వరికి నవధ్యులు. వారి నెవ్వరికి గెలువ రాదు. నాయెడఁ బరమభక్తిలోనుండు నీధృతరాష్ట్రనందనుల నేవిడువలేను. ఈపాండు

---

౮౦౧౪౮౧౫౪౫. ఇందులో అవమతిథులు... ౧౨౫౪౦౮౩౭, పోఁగా సూర్యసావన దినములు ౭౮౮౮౪౦౭౦౯. ఇదిగాక ద్వాపరాంతమునకుఁ జెల్లవలసిన సావనదిన ములు ౧౮౨౨౫. కావున నీరెండువిధములచేతను ఆదివారము లభించినది. ఈగణిత ప్రకారము ధర్మరాజు జననాదిక డచిన సౌరసంవత్సరములు ౫౯ కి ౭౦ దినములు తక్కువగునప్పుడు లభించుటవలన చాంద్రమాసప్రకారము వైశాఖబహుళ సప్త మియు, బార్హస్పత్యమానము ప్రకారము జ్యేష్ఠబహుళసప్తమియు లభించినవి. ఇట్టుల ధర్మరాజు జననాదిసావనదినములు ౨౧౫౩౭ అని సూచింపఁబడినది.

విశేషము విరాటపర్వము, ఉత్తరగోగ్రహణప్రకరణమున వివరింపఁబడును.

మహభా:స-1—88

పుత్రులు మోసముచే ద్యూతజితు లయ్యును సమయమును నెఱవేర్చి సమర
సన్నద్ధులై నిరాతంకముగ నేఁగుదెంచెదరు. పూర్వము నాపరాక్రమంబున
కోడిన ద్రుపదుండు యాజోపయాజు లను నధ్వర్యులు సాయపడఁగా
యజ్ఞదీక్షితుండై యజ్ఞఫలముగ నగ్నికుండంబునందు నావధకు నిమిత్త
ముగ నొకకుమారుని, నర్జునునకు భార్యగాఁదగిన కుమార్తెను బడసెను.
ఇప్పు డాకుమారుఁడగు ధృష్టద్యుమ్నుండు పాంచాలివివాహమునఁ
బాండవులకు సంబంధియయ్యె. దాన వారి వారిపక్షమువాఁడయ్యెను. లోక
మున నుండు నతిరథమహారథులకందఱ కర్జునుం డగ్రగణ్యుండు. వాఁడు
జరుగఁగల ఘోరసమరమున నాతోఁ బోరాడును. నాకు ధృష్ట
ద్యుమ్నుం డంతకుఁ డనుట జగత్ప్రసిద్ధము. ఇంతకంటె నన్యాయంబు
వేఱొండు కలదా? అందులకుఁ గారణంబును మీరైతిరి. కాలంబును
సమీపించినది. మానవుఁ డను గావున దనువుఁ దొఱంగుటకు భీతిల్లెద.
ఇంతకంటె దుఃఖము వేఱొండు కలదా? అయిన నేమి ప్రయోజనము?
దైవ మన్నింటికంటె బలీయము. ఇది గతజలసేతుబంధ మాయెను. అయి
నను నీకనైనను నెల్లవారికి మేలుఁ జేయఁదలఁతురేని, ధర్మంబున వర్తిం
పుఁడు. ఈపదుమూఁడేడులును మీ రనుభవించెడుసుఖములు త్రాటి
ప్రాకులనీడలవంటివై, గగనకుసుమము లగును. కావున సుఖింపఁ దలఁ
తురేని యజ్ఞముల నీకనైన నాచరింపుఁడు. ఇష్టసుఖంబులఁ దేలియా
డుఁడు. పదునాల్గవయేట కౌరవవినాశంబు తప్పనేర దనిన ద్రోణవాక్కును
విని ధృతరాష్ట్రుఁడు, విదురా! ఆచార్యుండు లెస్సఁగానుడివెను. అరణ్య
ముల కరిగి పాండవులఁ దోడ్తెమ్ము. వారు రా రేని సత్కారంబు వడసి
పోఁదగు నని చెప్పు మనుచుఁ జింతావ్యాకులుండై యేమియుం దోఁపక
నిట్టూర్పు నిగిడించుచుండ, నతనికి సంజయుం డిట్లనియె.

మహీపాలా! సర్వధనసమృద్ధంబైన మహీరాజ్యంబు నంతయు
నశ్రమంబున సాధించిన నీతమ్ముఁ డగు పాండునృపాలునిపుత్త్రుల నడవులకుఁ
బంపినతర్వాత నీ కివంత యేల? యని సంజయుఁడు సెప్పఁగా నతి
రథవర్యులును, యుద్ధకోవిదులును బలవంతులును నగు పాండుపుత్త్ర
లతో విరోధముగలిగిన వంత లేకుండునే? యనఁగా ధృతరాష్ట్రునకు సంజ
యుండు మఱియు నిట్లనియె. కురువృద్ధుం డగు భీష్ముండును, నాచార్యుం
డగు ద్రోణుండును నీ కమాత్యుండైన విదురుండును వీరెంత నివారించు

చుండినను వినక లోకవినాశహేతు వైనపాండవవైరమును నీవ యభి
వృద్ధిపఱచితివి. మూర్ఖుఁడును మతిలేనివాఁడును నగు నీపుత్త్రుఁ డిసుమంత
యైన లజ్జ లేక ప్రాతికామిని బంపి పాండవులకు ధర్మపత్నియు నయోని
జయు, నగ్నిసంభూతయు, సర్వధర్మముల నెఱింగినదియు నగు పాంచాలి
యేకవస్త్రయు రజస్వలయు నై యుండ, నాఁ డాసభ కతిఘోరంబుగ
శిరోజములఁ బట్టి యీడ్చి తెప్పించి కర్ణుఁడును దానుగ నుల్లసంబు లాడి
వస్త్రము లొలిపించి యవమానపఱచె. ఆపుణ్యాంగన క్రోధవీక్షణముచే
నీకులమునకు గుద్దలి యయ్యె. చెడుకాలమునకుఁ జెట్టున గుక్కమూతి
పిందెలు పుట్టును. వినాశకాల మాసన్న మగుచో దేవతలే బుద్ధిమసిం
చున ట్లొనర్పుదురు. దైవోపహతులకు న్యాయ మన్యాయ మనియు
నర్థ మనర్థ మనియు ననర్థ మర్థ మనియుఁ దోఁచుచుండు. కాని కాల
మెవ్వనిం దండ మెత్తి తలఁ బగులఁగొట్ట నేరదు. అని చెప్పఁగా
ధృతరాష్ట్రుం డిట్లనియె.

సంజయా! యాజ్ఞసేని మండి చూచినంతమాత్రమున పృథ్వి
యంతయు భస్మరాశియగును. నాపుత్త్రులలో నొక్కండైన బ్రదుకఁగలఁడే?
ద్రౌపదికిఁ గలిగిన భంగపాటునకు గాంధారి మున్నగు కౌరవకాంత
లాక్రోశించిరి. ప్రజ లందఱు నుమ్మలించిరి. విప్రులును బొడమినకోపం
బున సాయంకాలాగ్నిహోత్రములను బ్రణయింపరైరి. మొగులు
లేక మెఱపులు మెఱసెను. ఆకసంబునుండి పిడుగులును గొఱవులును
బడినవి. అపర్వంబున భానుని రాహువు గ్రసించె. నిర్హేతుకంబుగ రథ
శాలలలోఁ బొగ లెగసె. ధ్వజములు విఱిగి నేలఁ బడినవి. దుర్యోధ
నుని యగ్నిగృహమున నక్క లఱచెను. వానియెదుట గాడిదె లోండ్ర
పెట్టినవి. భీష్మద్రోణకృపబాహ్లికసోమదత్తాదులు మొగములను జిటారించు
కొని యరిగిరి. అంత నేను విదురునితో నాలోచించి పాంచాలిం బిలిచి
వరము లడుగుమంటి. అప్పు డాసాధ్వి తనభర్తలు రథధనుస్తూణీరము
లతోఁ బాండవదాస్యమును దొలఁగింప వేఁడెను. నే నాపతివ్రత కోరిన
వరముల నొసంగితి. అంత విదురుండు నన్నుఁ జూచి యింతవఱకుఁ జాలిం
పుము. ఇఁకను మేలు వగును. స్వరూపముతో నుండు లక్ష్మీదేవి యో
యనునట్టి పాంచాలరాజపుత్త్రి దైవచోదితయై పాండవుల కధీనురా
లయ్యె. దానికి నీపుత్త్రులు గావించినభంగపాటు పాండవులను పాంచా

లురను యదువృష్ణిభోజాంధకులును సహింపలేరు. జగన్నాథరక్షితులై పాంచాలీయుతులైన పాండవులు నీపుత్త్రులగు ధార్తరాష్ట్రులకంటె బలవంతు లని యెఱుంగుము. భీమసేనుండు మదాతిరేకంబున గదాపాణియై యాహవరంగమున నిల్చు నేని రెండవసముద్రము వర్తించి నాఁ బోల్చు. ఆహవంబున వాని నోర్వఁగలవారు నీవారిలో నొక్కనినైనను నాకుఁ జూపుము. బహుబలపరాక్రమవంతుండును, విప్రవరతేజోవిలసితుండును నగు జరాసంధుని నామృకోదరుం డొక్కరుండ భుజవీర్యంబున వధించెను. వానికిఁ బార్థుండు గాడీవంబును బూని సాయపడునేని వారి నెవ్వరుం బోర మార్కొనలేరు. కావున నింతటితోనైన నుపశమిల్లి పాండవులతో సంధి గావించుకొనుము. ఉభయపక్షములవారికిని మేలొడఁగూర్పుము. ఇట్లొనర్చితివేని లగ్గయ్యెడి. అని విదురుండు నాకు బోధించి యుండె. ఆబుద్ధిమంతుం డట్లు బోధించినను తెలివి లేక వానిమాటలఁ జెడచెవి నిడి పుత్త్రమోహంబున వారియిష్టానుసారముగ వర్తించితి. అయ్యయో! నే నేమి సేయుదు? ఇఁకనైనను దైవము మమ్ములఁ గాపాడుఁగాక! అని పలికె నని తెలుపఁగా విని జనమేజయనృపాలునకు నిర్మలజ్ఞానసంపన్నుం డగు వైశంపాయనుండు మహాభారతమునం దున్న సభాపర్వకథల నతిమనోహరంబుగా వినిపింప నారాజు పరమానందంబునఁ దేలియాడుచుండె.

సభాపర్వము సమాప్తము.



చెన్నపురి: 'చంద్రికా' ప్రెస్సున ముద్రితము—1958.